# సత్యాన్వేషి కథ




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

www.thraithashakam.org









# సత్యాన్వేషి కథ


రచయిత

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి

అర్ధ శతాధిక గ్రంథకర్త, ఇందూజ్ఞాన ధర్మప్రదాత

సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**









ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞానవేదిక**

(Regd.No. : 168/2004)

త్రైత శకము–37 ద్వితీయ ముద్రణ : సం॥ 2015

ప్రతులు : 1000 **వెల : 300/-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక రచనలు

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

1) త్రైత సిద్ధాంత భగవద్గీత.
2) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
3) ధర్మము-అధర్మము.
4) ఇందుత్వమును కాపాడుదాం.
5) యజ్ఞములు (నిజమా-అబద్దమా?).
6) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
7) సత్యాన్వేషి కథ.
8) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా)
9) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా.
10) గీతా పరిచయము (తెలుగు,ఇంగ్లీషు)
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా)
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు.
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?)
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?)
27) తల్లి తండ్రి.
28) గురు ప్రార్థనామంజరి.
29) త్రైతారాధన.
30) సమాధి.
31) ప్రబోధ.
32) సుబోధ.
33) ప్రసిద్ధి బోధ.
34) సుప్రసిద్ధి బోధ.
35) సిలువ దేవుడా?
36) మతాతీత దేవుని మార్గము.
37) దేవుని గుర్తు - 963.
38) మతము-పథము.
39) ప్రబోధానందం నాటికలు.
40) ఇందువు క్రైస్తవుడా?
41) నిగూఢ తత్త్వార్థ బోధిని.
42) ఆత్మలింగార్థము.
43) నాస్తికులు-ఆస్తికులు.
44) హేతువాదము-ప్రతివాదము.
45) గుత్తా.
46) ప్రబోధ తరంగాలు.
47) త్రైత సిద్ధాంతము.
48) రూపము మారిన గీత.
49) ఉపనిషత్‌లలో లోపాలు.
**50) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.**
**51) ద్వితీయ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
**52) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.**
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) తీర్పు.
55) కర్మ పత్రము.
56) ప్రవక్తలు ఎవరు?
57) ధర్మశాస్త్రము ఏది?
58) మత మార్పిడి దైవద్రోహము.
59) త్రైతశక పంచాంగము.
60) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
61) స్వర్గము ఇంద్రలోకమా! - నరకము యమరాజ్యమా!!
62) జీహాద్ అంటే యుద్ధమా?
63) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
64) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక ప్రసంగాలు

DVD'S

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూమహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవునిజ్ఞానము-మాయమహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.

53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము
63. సహజ మరణం-
తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము
65. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
66. దేశం మోసం-దేహం మోహం
67. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
68. జీర్ణ+ఆశయము
69. మేఘం ఒకభూతం-
రోగం ఒకభూతం.
70. దేవునికి మతమున్నదా?
71. ఇచ్ఛాధీన కార్యములు-
అనిచ్ఛాధీన కార్యములు.
72. ఏది ధర్మము?
73. అధర్మ ఆరాధనలు.
74. మూడు పుట్టుకలు-రెండు జాగాలు
75. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
76. నిదర్శ - నిరూప
77. నటించే ఆత్మ
78. సంచిత కర్మ
79. గురువు ఎవరు?
80. శ్రీకృష్ణుడు ఎవరు?
81. సుఖము-ఆనందము
82. టక్కుటమారా, ఇంద్రజాల
మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ.
83. భయం
84. దశ-దిశలు.
85. ఆడించే ఆత్మ
86. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
87. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత
88. ఏది శాస్త్రము?
89. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
90. 6-3=6.
91. గుర్తింపబడనివాడు గురువు.
92. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
93. చంద్రాకారము (బట్టతల).
94. మతములలో పవిత్రయుద్ధము.
95. మూడు గ్రంథములు.
96. ఏడు ఆకాశములు.
97. దైవగ్రంథము
98. జ్ఞానము కబ్జా అయ్యింది.
99. భక్తి-భయము.
100. జ్ఞాన శక్తి
101. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు-2015

యూ ట్యూబ్ వీడియోలు
http://www.youtube.com/channel/UCkrD6R8nEU0-O7gNn46Ktfw

# ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 9866512667, 9951675081, Fax : 08558-225966.

**ఇందూ జ్ఞానవేదిక**

**(రాష్ట్రకార్యాలయము)** Fax : 040-24146006.
శ్రీదేవికాంప్లెక్స్, ప్రభాత్‌నగర్,
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్
9848057951, 9491877239, 9848590172.

*****

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**

చవటపాల్యం (గ్రా), గూడూరు (మం),
నెల్లూరు జిల్లా. Cell : 9494631664,
9490809181, 8106065300.

*****

**బాలం లక్ష్మీనరసింహులు (ప్రెసిడెంట్)**

కదిరి రోడ్డు, రాజానగర్, నీరుగట్టువారి
పల్లి, మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

*****

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ) (ప్రెసిడెంట్)**

ధన్వంతరి హెల్త్ కేర్ సెంటర్,
హుజూర్‌నగర్, నల్లగొండ (జిల్లా)
Cell : 9848574803, 9491040963.

*****

**పి. ఆదినారాయణ (ప్ర.సభ్యుడు)**

భాగ్యనగర్ ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥),
హిందూపురం (తా), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**కె.లక్ష్మీనారాయణాచారి (ప్రెసిడెంట్)**

బ్యాటరీషాప్, నియర్ ఎస్.ఐ.యు చర్చి,
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం, అనంతపురం (జి)
Cell :9440556968, 9290012413,
9440601136.

*****

**షఫీ షేక్** (K.I.S.S Member)

నొలంబూర్ , చెన్నై - 600 095
Cell : 9445554354, 9789963963.

*****

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)** MD (acu)

డోర్ నెం. 24-4-178, గోవింద నిలయం,
శాంతినగర్, నెల్లూరు జిల్లా - 524003.,
Cell : 9440615064, 9246770277.

*****

**టి. వీరనారాయణ రెడ్డి (ప్ర.సభ్యుడు)**

బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,
నెల్లూరు (జిల్లా)., Pin : 523322.
Cell : 9494618322, 8374923363

*****

**బి. ఆదిశేషయ్య (టీచర్) (ప్రెసిడెంట్)**

రామానుజం స్కూల్ దగ్గర, ఉప్పరవీధి,
గుత్తి, అనంతపురం (జిల్లా)
Cell : 9491362448, 7382986963.

*****

**కె.అశోక్‌బాబు (టీచర్) (ప్రెసిడెంట్)**

రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా Cell :9440305700,

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా

**చెన్న ఆంజనేయులు** (కరస్పాండెంట్)
జ్ఞానోదయ హైస్కూల్, ఇటిక్యాల,
రాయికల్ మం॥, కరీంనగర్ (జిల్లా)
Cell : 95507 97782

*****

**డా॥బి. ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737

*****

**వి. శంకర రావు** (ప్ర.సభ్యుడు)
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

*****

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్) : 9493622669
క్రొత్త చెరువు (గ్రా, మం) అనంతపురం జిల్లా.
9959316410, 9949995090.

*****

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)
ఏటుకూడు రోడ్, దర్గామాన్యం,గుంటూరు (జి)
Cell : 9948014366, 9052870853

*****

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

*****

**వై. రేణుక దేవి** (ఇ.సభ్యులు)
పద్మావతినగర్, తిరుపతి.
Cell : 9491773455, 9032903955.

*****

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు (జిల్లా).
Cell : 9440244598, 9849303902,

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు), భీమిలి (మం),
విశాఖపట్నం (జిల్లా) - 531162.
Cell : 9441567394, 9502172711.

*****

**ఎన్.బి. నాయక్** (ప్ర.సభ్యుడు)
పెదమడక, అగనంపూడి,విశాఖపట్నం (జిల్లా)
Cell : 7396492239, 9248315309

*****

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మద్దిగట్ల (గ్రా), పెద్దమందడి (మం),
మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 8790558815, 9440655409,
9701261165.

*****

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం), శ్రీకాకుళం
Cell : 9494248963, 9959779187.

*****

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)
బుధవారము మార్కెట్, భీమవరం-1,W.G
Cell : 9948275984, 7386433834.

*****

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)
ముదిగుబ్బ (గ్రా, మం), కదిరి (తా),
అనంతపురం జిల్లా-515511.
Cell : 9440980036, 8185020272.

*****

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)
నేతాజిరోడ్డు కుప్పం,చిత్తూరు జిల్లా.
Cell : 9652755110,

మనుషులకు తెలియని ఎన్నో క్రొత్త విషయములు తెలియవలయు నను ఉద్దేశముతో ఈ కథను వ్రాయడము జరిగినది. ఈ కథ పేరు సత్యాన్వేషి, కావున ఈ కథలో తెలియునవన్నియు సత్యములేనని తెలియజేయుచున్నాము. ఈ కథలో జరుగు సన్నివేశములను కల్పించి వ్రాసినా, అందులోని సారాంశము మాత్రము సత్యము. ఒక సందర్భములో మంత్రము లను గురించి చెప్పడము జరిగింది. అయితే ఆ విషయములు మాంత్రికులకు కూడా తెలియనివై ఉండును. అట్లే మహత్యములను గురించి కూడా చెప్పడము జరిగినది. కానీ మహత్యములు చేయువారికి కూడా ఆ మహత్యములు ఎలా జరుగుచున్నవో తెలియవు. మహత్యముల విషయములో ఇటు ఆస్తికులకుగానీ, అటు నాస్తికులకుగానీ తెలియని సత్యమును పూర్తిగా చెప్పడము జరిగినది. ఒక మనిషి (బాబా) కొన్ని మహత్యములను స్వయముగా చేయాలని చేయగలడు. కానీ కొన్ని మహత్యములు అతని ద్వారా, అతనికి తెలియకుండానే జరుగును. ఈ విషయము ఇంతవరకు ఎవరికీ తెలియని రహస్యమేనని చెప్పవచ్చును. ఇటువంటి మహత్యముల విషయములో ఆస్తికులు, నాస్తికులు, హేతువాదులు పూర్తి పొరపడిపోయి వాటిని ఒక మనిషి చేయుచున్నాడని అనుకొనుచున్నారు. మిగతా ప్రజలు కూడా అలాగే అనుకోవడము జరుగుచున్నది. అలా అనుకోవడము వలన కొందరు ఆ వ్యక్తిని గొప్పగా భావించుకోవడము జరుగుచున్నది. కొందరు హేతువాదులు ఆ వ్యక్తిని విమర్శించడము కూడా జరుగుచున్నది. వాస్తవముగా ఆ వ్యక్తికి ఎటువంటి సంబంధము లేని కొన్ని మహత్యములు, మనిషి మేధస్సుకు అందని రహస్యమేనని చెప్పవచ్చును. అటువంటి గొప్ప రహస్యమును ఈ కథలో ప్రత్యక్ష ప్రమాణములతో చూపుచూ, వివరముగా చెప్పడము జరిగినది. ఇటువంటి తెలియని రహస్యములను తెలుపుట వలనా, ఈ రహస్యములలోని అసలైన యధార్థములను తెలుపడము వలనా, ఈ కథ పేరు సత్యాన్వేషి అయినది.

ఈ కథలో ఎన్నో సంఘటనలున్నా, అవి ఎన్నో ప్రపంచ పనులకు సంబంధించినవైనా, వాటిలో చివరకు సందర్భానుసారము దైవ జ్ఞానమునే చెప్పడము జరిగినది. కథ ఎన్ని మలుపులు తిరిగినా ప్రతి మలుపులోనూ దైవజ్ఞానమును జోడించడము జరిగినది. అందువలన ఈ కథను చదవడము వలన అన్నిటికంటే జ్ఞానమే గొప్పదను భావము తప్పనిసరిగా కలుగుతుంది. సత్యము దైవజ్ఞానముతోనే ముడిపడి ఉంటుంది. జ్ఞానములేని చోట అసత్యమును సత్యము అనుకొను అవకాశము కలదు. కానీ ఈ కథలో ప్రతి చోటా జ్ఞానమే ఉన్నది, కనుక ఎక్కడా అసత్యమునకు తావులేదు. వైద్య విధానములో అత్యంత ప్రాముఖ్యమైనదీ, మనిషికి అత్యంత ప్రమాదకరమైనదీ, అయిన పాముకాటు నుండి బయటపడు విధానమును ఈ కథలో అమర్చి చెప్పడము జరిగినది. ఈ కథను చదివిన వారు ఎవరైనా పాము కాటునుండి స్వయముగా బయటపడడమే కాకుండా, ఎవరినైనా పాము విషమునుండి రక్షించవచ్చును. ప్రతి ఆకూ ఔషధమేననీ, ప్రతి చెట్టులో ఒక విధమైన శక్తి ఉన్నదనీ, ప్రతి చెట్టులో ప్రత్యేక కొమ్మగా పుట్టిన బదనికకు ఒక ప్రత్యేకశక్తి ఉండుననీ, అటువంటి బదనికల చేత కొన్ని అసాధారణమైన పనులు జరుగునని కూడా చెప్పడము జరిగినది. అటువంటి బదనికలలో **మోదుగచెట్టు** బదనిక ఎలా ఉపయోగపడుచున్నదో ఈ కథలో చెప్పడము జరిగినది.

ముఖ్యముగా సంపూర్ణ జ్ఞానముగల యోగికీ, మంత్రాల మరియు మాయ మహత్యములుగల ఒక బాబాకూ మధ్యలో జరిగిన పోరాటమునూ, దోపిడీ దొంగలు దేవాలయములోని వజ్రముల కొరకు ప్రయత్నించిన ప్రయాసనూ కంటికి కట్టినట్లు చూపించి చెప్పడము జరిగినది. మంత్ర విధానములో ఇద్దరు మాంత్రికుల మధ్య జరిగిన ఘర్షణను **"మోడి"** అను పేరుతో చూపించిన విధానము, ఇంతవరకు ఎవరికీ తెలియని ఒక ప్రత్యేక ఆటగా చూపడము జరిగినది. నేటి సమాజములో మనుషులకు పూర్వము

మోడి ఎలా జరుగుచున్నదో, మోడి అంటే ఏమిటో దానివలన తెలిసిపోవు చున్నది. అంతేకాక ఇందులో జ్యోతిష్యశాస్త్ర సంబంధమైన కొన్ని విధానము లను తెల్పుచూ, అష్టగ్రహకూటమి అంటే ఏమిటి? దానిలో ఎంత ప్రభావ మున్నదీ, సాధారణ మనిషికి కూడా అర్థమగునట్లు వ్రాయడము జరిగినది. దీనివలన నేటి నవయువ సమాజములో గ్రహములూ, వాటి ప్రాధాన్యతా కొంతకు కొంత తెలిసిపోగలదు. అంతేకాక గ్రహముల కలయికలో ఎంతో ప్రభావమున్నదనీ, ఆ ప్రభావము మనుషుల జీవితముల మీద పడుచున్నదనీ తెలియుచున్నది.

ఈ విధముగా చెప్పుకుంటూ పోతే మనిషికి తెలియని ఎన్నో సత్యములు ఈ గ్రంథములో తెలియడమేకాక, మనిషి ముఖ్యముగా తెలుసు కోవలసిన విషయము కూడా తెలియబడినది. మనిషికి అంత ముఖ్యమైన విషయమేమనగా! మనిషి జీవితమునకు అత్యంత ప్రాధాన్యమైనది ఒకే ఒక దైవ జ్ఞానము. మనిషి పుట్టిన తర్వాత దేవుని సమాచారమును గురించి తెలియకపోతే ఆ జీవితము పశుపక్షులవలె, క్రిమికీటకములవలె వృథా అయిపోవును. అందువలన వేమనయోగి కూడా ఒక సందర్భములో పుట్టలోని చెదలు పుట్టదా గిట్టదా అన్నాడు. అలా మనిషి పశుపక్షులవలె జీవించకుండా తన జీవితమునకు సార్థకత ఏర్పరచుకోవాలంటే, ముందు ముఖ్యమైన రెండు ప్రశ్నలకు జవాబులను తెలిసివుండాలి. ఒకటి తాను ఎవరు? రెండవది దైవము ఎవరు? ఈ రెండు ప్రశ్నలతోగానీ, వీటి జవాబుతోగానీ ఏమాత్రము సంబంధములేకుండా మనిషి బ్రతకవచ్చును. ఈ రెండు ప్రశ్నలకు జవాబు తెలియకున్నా, మనిషి జీవితములో ఏ లోపమూ కనిపించదు. అంతేకాక ఈ ప్రశ్న జవాబులతో సంబంధము లేకుండా మనిషి హాయిగా బ్రతకవచ్చును. అందువలన నేడు ప్రపంచములో ఎందరో మేధావులు సహితము, తన జీవితములో ఎన్నో ప్రశ్నలకు సమాధానములు తెలిసినా, ఏ సమస్యకైనా

ఇది పరిష్కారమని చెప్పగలిగినా, ప్రజల దృష్టిలో ఎంతో గొప్ప పేరు ప్రఖ్యాతులు పొందినా చివరకు వారి జీవితమూ, వారి పుట్టుకా వృథాయని చెప్పవచ్చును. అలా ఎంతటివారికైనా వారి జీవితము వృథా కాకుండా ఉండాలంటే పైన చెప్పుకొన్న రెండు ప్రశ్నలకు జవాబులను తెలుసుకొని తీరాలి.

ఈ రెండు ప్రశ్నలు కొందరి లెక్కలో పెద్దగా కనిపించక పోయినా, వీటి రెండు జవాబులలో ఒకటి మాత్రము మనిషి తన జీవితములో తెలుసు కోగల్గినా, రెండవ జవాబు మాత్రము జీవితాంతము వరకు ఎవరికీ తెలియదు. అంతేకాక రెండవ జవాబు కొరకు మనిషి యొక్క ఒక జన్మ సరిపోతుందని చెప్పలేము. రెండవ జవాబు కొరకు కొన్ని జన్మల సమయము పట్టవచ్చును. కొన్ని జన్మల వరకు జవాబులు తెలియని ప్రశ్నలంటే అవి ఎంత గొప్పవో అర్థమైపోగలవు. అంత గొప్ప ప్రశ్నలు మనిషి మెదడులో మెదలాలంటే అతను వ్యక్తిత్వములో గొప్పవాడైయుండాలి. ప్రతి విషయమును క్షుణ్ణముగా యోచించు స్వభావముగలవాడై ఉండాలి. సత్యాన్వేషణ దృష్టి గలవాడై ఉండాలి. గ్రుడ్డిగా ఏ దానినీ నమ్మనివాడై ఉండాలి. హేతు దృక్పథముకలవాడై ఉండాలి. కానీ నేడు అటువంటి వారు అరుదుగా ఉన్నారు. తనను గురించిన ప్రశ్న ఎవరికీ రావడము లేదు. కొన్ని లక్షల మందిలో ఎవరికైనా వచ్చినా, వాడు సరియైన జవాబు కొరకు వెతకడము లేదు.

జగతిలో 90 శాతము మంది దేవుని మీద భక్తికల ఆస్తికులై ఉన్నారు. అయితే వారు విశ్వసించునది సరియైన మార్గమో కాదో, తాము ఆరాధించుచున్న దేవుడు నిజమైన దేవుడో కాదో తెలియలేకున్నారు. వీరిలో కొందరు ఒక గురువును ఎంచుకొని, ఆ గురువు ద్వారా దైవమార్గమును తెలియాలనుకొనుచున్నారు. కానీ గురువు అంటే ఎవరో తెలియక, ఎవరినంటే వారిని గురువుగా ఎంచుకొనుచున్నారు. మనిషి జీవితమునకు ఎంతో

ముఖ్యమైన దైవజ్ఞానమును మరియు జీవజ్ఞానమును తెలుసుకొను ప్రశ్నవచ్చినా, వాటికి జవాబులను తెలియబరచు సక్రమమైన గురువు ఎవరో, సక్రమమైన విధానమేదో, ఈ గ్రంథములో ముఖ్యముగా తెలియజేయడమైనది. ఎంతో పెద్ద విషయమైన రెండు ప్రశ్నలనూ, వాటి జవాబులనూ తెలుసుకొను విధానములో కొంత స్వచ్ఛత కొరకు ఈ సత్యాన్వేషి కథలో ఒక బాబాపాత్రను, ఒక యోగి పాత్రను వ్రాయవలసి వచ్చినది. ఈ గ్రంథములోని రెండు పాత్రలను చూచిన తర్వాత మనిషి సరియైన దైవజ్ఞానమార్గములో ప్రయాణించ గలడని మేము అనుకొనుచున్నాము. రెండు పాత్రలలో ఒకటి మాయ మహత్యములతో కూడుకొన్న బాబాగారూ, రెండు దైవజ్ఞానముతో కూడుకొన్న యోగీశ్వరులుగారూ ఉన్నారు. ఈ రెండు పాత్రలను అర్థము చేసుకొనుటకు ఉదాహరణగా ప్రస్తుతకాలములో జరుగుచున్న, జరిగిపోయిన ఒక విషయమును చెప్పి, అందులో మనుషులు ఏ విధముగా పొరపడి పోవు చున్నారో కొంత వివరిస్తాము. ఈ వివరణతో ఈ గ్రంథములోని రెండు పాత్రలను సులభముగా అర్థముచేసుకోవచ్చును. అందువలన ఇప్పుడు చెప్పబోయే ఉదాహరణ విషయమును విచక్షణా దృష్ఠితో చూచి చదవండి.

ప్రస్తుత కాలములో ఒక వ్యక్తి కొన్ని టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల విద్యలను నేర్చి, వాటి ద్వారా మహత్యములను చూపెడి స్థోమత కల్గియుంటే, అతను బాబా స్థాయికి ఎదిగి ఏదో ఒక బాబాగా మారిపోవును. **"బాబా"** అను పదమునకు కన్నడ భాషలో అయితే **"రారా"** అను అర్థముగలదు. ఒక విధముగా 'రారా' అను అర్థముతో ప్రజలను రమ్మని పిలిచినట్లు, మహత్యములను చూపువారివద్దకు ప్రజలు పోవుచుందురు. మనుషులలో మాయ అనునది గుణముల రూపములో ఉన్నది. ఆ గుణములలో అత్యంత బలమైనదీ, అన్నిటికంటే పెద్దదీ **"ఆశ"** అను గుణము. పశువులకు పచ్చిగడ్డిని చూపితే రమ్మని పిలిచినట్లు ఎలాగైతే పశువు గడ్డిని

చూపిన వానివద్దకు పోవునో, అలాగే మనుషులకు మహత్యములను చూపితే రమ్మని పిలిచినట్లు మనుషులు మహత్యములను చూపిన వానివద్దకు పోవుదురు. అలా పశువులు పోవుటకుగానీ, ఎంతో తెలివియున్న మనుషులు పోవుటకుగానీ కారణము **ఆశ** అను గుణమేనని తెలియుచున్నది. దీనివలన **మనిషిలోని మాయను ప్రేరేపించుటకు బాబాలు ఉన్నారని తెలియుచున్నది.** ఇకపోతే దైవజ్ఞానమును తెలిసినా దానిప్రకారము ఆచరించువానిని **"యోగి"** అని చెప్పవచ్చును. యోగి అయినవాడు తనయందు మాయ రూపములోనున్న గుణములను అణచివేచి, అదే పద్ధతిని ఇతరులకు కూడా చెప్పుచుండును. మాయను వదలి మనిషి బ్రతుకుటకు ఏమాత్రము ఇష్టపడడు. కావున యోగి మాటను వినేవారు చాలా అరుదుగా ఉందురు. అలాంటి గుణ రహిత యోగమును బోధించు యోగివద్దకు ఎవరూ పోవుటకు ఇష్టపడరు. అందువలన మాయకు విరుద్ధమైన యోగివద్ద మనుషులు చేరరు. మాయకు అనుకూలమైన బాబావద్దకు మనుషులు అనేకముగా చేరుదురు. ఈ సూత్రము ప్రకారము నాకు తెలిసిన ఒక బాబా దగ్గరికి విపరీతముగా ప్రజలు పోయెడివారు. అట్లే నాకు తెలిసిన యోగివద్దకు ఎవరూ పోయెడి వారు కాదు. ఒకవేళ ఎవరైనా పోయినా వారి శాతము చాలా తక్కువగా ఉండెను. బాబాగారివద్దకు లక్షమంది పోతే, యోగివద్దకు ఒక్కరు పోయెడి వారు. ఆ లెక్క ప్రకారము బాబావద్దకు పోయెడివారు కోటిమంది ఉంటే, యోగివద్దకు పోయెడివారు కేవలము వందమంది మాత్రమే అని చెప్పవచ్చును.

యోగి అయిన వాడు తనలోని గుణములను (మాయను) జయించిన వాడై, అదే మార్గమును ఇతరులకు కూడా చూపుచుండును, బాబా అయిన వాడు తనలోని గుణములను జయించక అందులోనే (మాయలోనే) చిక్కుకొనినవాడై, ఇతరులను కూడా మాయలోనే ఉండునట్లు చేయుచుండును. మాయ అనునది దేవునికి వ్యతిరిక్తముగా పని చేయునది. దానిని ఇస్లామ్

మతములో **సైతాన్** అనగా, క్రైస్తవ మతములో **సాతాన్** అని అనుచుందురు. మాయ అన్ని మతములలోను దేవునివైపు ఎవరినీ పోకుండా చేయుచుండును. బాబా అనబడు వ్యక్తి కూడా మాయవశములో ఉండుట వలన అతనికి కూడా 'ఆశ' అను గుణము బలముగా ఉండును. ఆశ అను గుణముచేత తాను ధనికుడు కావలెనను ఉద్దేశము అతనిలో ఉండెను. దానికి తగినట్లు మాయ అతని మహత్యములను బయటికి చూపుట వలన ప్రజలందరూ బాబావద్దకు చేరడము తమకు ఏదో మంచి జరిగినదనీ ఆయనకు కానుకలు ఇవ్వడము జరిగెడిది. అంతేకాక ఎందరో ధనికులు తమదగ్గరున్న నల్లధనమును బాబాకు ఇస్తే తమకు బాబాద్వారా మంచి జరుగునని తలచి కొన్ని కోట్ల ధనమును ఆయనకు ఇచ్చెడివారు. ఇట్లు బాబాలైన వారు అనతికాలములోనే వేలకోట్లకు, లక్షల కోట్లకు అధిపతులైపోవుచున్నారు. ఈ విధముగా చేరు ధనము బాబా అయిన వ్యక్తి యొక్క జేబులు, సంచులు, మూటలు నిండిపోయి చివరకు వజ్రాలరూపములోనూ, బంగారు రూపము లోనూ ధనము ఉండి పోవుచున్నది. అలా ఉంటూ మితిమీరి ఎక్కువైన ధనముతో బాబా తన ఉదారత్వమును చాటుకొనుటకు, ప్రజలలో పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొనుటకు ప్రజల కొరకు వినియోగించును. అలా తన ఉదారత్వమును బయటికి చూపుటకు ఉచిత విద్య, ఉచిత భోజనము, ఉచిత నీరు బీద ప్రజలకు అందించి తాను ప్రజలకు సేవ చేయును.

ఆ విధముగా ప్రపంచములో మనిషికి అవసరమైన వాటిని కొందరికి బాబా అందించుట వలన బాబా తన భక్తులలోనే కాకుండా, ఇతర ప్రజా నీకములో కూడా మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొనును. బాబాగారు ప్రభుత్వము చేయలేని పనిని కూడా చేస్తున్నాడనీ, ఎందరికో ఎన్నో విధముల ఉపయోగపడుచున్నాడనీ, విద్య, వైద్యములను అందిస్తున్నాడనీ, మంచి నీరు లేనిచోట నీరునూ, కరువున్నచోట ప్రజలకు ఉచిత భోజనమునూ అందిస్తున్నా

డనీ ఎందరో ఆయనను ప్రశంసించుచుందురు. బాబా నిస్వార్థముగా ప్రజలకు సేవ చేస్తున్నాడను వార్త విదేశముల వరకు ప్రాకి పోవును. అప్పుడు అక్కడున్న ధనికులు బాబాగారు చేయుచున్న సేవలో తాముకూడా భాగస్వాములు కావలెనని, వారు కూడా కోట్లాది రూపాయలను బాబాగారికి ఇవ్వడము జరుగుచున్నది. ఈ విధముగా బాబా ధనికుడై, అందులో కొంత ప్రజలకు వినియోగించడము వలన ప్రజల దృష్ఠిలో బాబాగారు ప్రత్యక్షదైవముగా, మనిషి రూపములోనున్న దేవునిగా చలామణి అయిపోవుచుండును. ఆ విధముగా బాబా అను వ్యక్తి ఉండగా, యోగి అను వ్యక్తి తాను ప్రజలకు ఏ విధమైన ప్రపంచ సహాయమును చేయకుండా పేదవారికి ఎటువంటి సేవ చేయకుండా తన జ్ఞానమును మాత్రము ప్రచారము చేయుచూ, మనిషికి అన్నిటికంటే ముఖ్యము దైవజ్ఞానమని చెప్పుచుండెను. ఒక దినము ఒక పత్రికా విలేఖరి యోగివద్దకు వచ్చి కొన్ని ప్రశ్నలు అడిగాడు, అవి ఇలా ఉన్నాయి.

**విలేఖరి :-** బాబాగారు ప్రజలకు ఎన్నో కోట్ల డబ్బులు ఖర్చుపెట్టి సేవ చేస్తున్నారు. ఎందరికో విద్యా, వైద్య సదుపాయములు కల్పించాడు. ఒక జిల్లాకు నాలుగువందల కోట్లరూపాయలు ఖర్చుపెట్టి బీద ప్రజల అవసరాలను తీర్చాడు. అటువంటి వాటిలో మీరు ఒక్కటైనా ప్రజలకు చేశారా? మీరు ప్రజలకు ఏమి చేయుచున్నారు?

**యోగి :-** బాబాగారు చేయుచున్న ప్రజాసేవలలో నేను ఏ ఒక్క సేవ కూడా చేయలేదు. నేను అలా చేయదలచుకోలేదు. నేను అలా చేయవలెనన్నా నావద్ద అంత డబ్బు లేదు. నాకు ఎవరూ ప్రజాసేవకనిగానీ, నాకని గానీ ఎలాంటి ధనము ఇవ్వలేదు. అందువలన నేను బాబాగారు చేయుచున్న ఏ సేవా చేయలేదు. ఇంకా వివరముగా చెప్పితే నేను యోగిని, ఆయన బాబా. బాబా అను వ్యక్తికి, యోగి అను వ్యక్తికి ఏ విషయములోనూ పోలికలుండవు,

ఉండకూడదు. ఒక డాక్టర్‌కు, యాక్టర్‌కు ఎట్లు తేడా ఉండునో అట్లే ఒక యోగికి, బాబాకు అన్నిటిలోనూ తేడా ఉండును. డాక్టర్ చేసిన వైద్యమును యాక్టర్ చేయలేడు. అట్లే యాక్టర్ చేసిన నటనను డాక్టర్ చేయలేడు. అదే విధముగా యోగియొక్క మనస్తత్వమునకూ, బాబాయొక్క మనస్తత్వమునకూ ఎంతో తేడా ఉండును. బాబా ఎప్పుడూ ప్రపంచ సంబంధముగా యోచిస్తాడు, ప్రపంచ సంబంధముగా చేయాలనుకుంటాడు. అయితే యోగి అయినవాడు ఎప్పుడూ ప్రపంచ సంబంధముగా యోచించడు, ప్రపంచ సంబంధమైన పనులను చేయడు. యోగి ఎప్పుడూ దైవసంబంధముగా యోచిస్తాడు. అలాగే దైవసంబంధమైన పనులనే చేస్తాడు. అశాశ్వతమైన ప్రపంచ పనులను తాను చేయడు, ఇతరులను కూడా చేయనివ్వడు. అందువలన నాకూ, బాబాకూ ఎటువంటి పోలికలు ఉండవు. బాబా మనుషులకు అశాశ్వితమైన వాటిని ఇస్తున్నాడు. శాశ్వతమైన దానిని ఇవ్వడము లేదు. ప్రజలకు దైవజ్ఞానమును అందివ్వడము అన్నిటికంటే మించిన సేవయగును. నేను ప్రజలకు దైవ జ్ఞానమును ఇచ్చి శాశ్వతమైన మంచిని చేయుచున్నాను. ఆయన (బాబా) విద్య, వైద్యములనిచ్చి అశాశ్వతమైన సేవ చేయుచున్నాడు, ప్రపంచ సంబంధమైనవి ఏవీ కూడా శాశ్వతమైనవి కావు. అందువలన ఆయన శాశ్వితమైన మంచి పనిని ప్రజలకు చేయడము లేదని చెప్పుచున్నాను.

**విలేఖరి :-** ఒక మనిషి అవసరానికి పనికి వచ్చేదానిని బాబాగారు చేయు చున్నారు. మీరు అవసరానికి పనికిరాని దానిని చేస్తామంటున్నారు. అవసరానికి పనికిరానిది ముఖ్యముకాదు కదా! దానివలన ప్రజల అవసర నిమిత్తము అందించు సేవయే గొప్పదిగానీ, మీరు చేయునది గొప్పది కాదు కదా!

**యోగి :-** నీవు ఒక విలేఖరివి. అయినా నీ పేరులో ఉండే అంతరార్థము నీకు తెలియదు. నీవు కేవలము వార్తలను వ్రాసేవాడినే అనుకొంటున్నావు.

అలాగే ప్రజలు అను పేరులో ఉండే అంతరార్థము ప్రజలకు తెలియదు. అవసరాల కొరకు బ్రతికేవారమని అనుకొంటున్నారు. అయితే విలేఖరిలో ఏ అర్థము దాగి ఉందని చూస్తే **లేఖ** అనగా **జాబు** అనీ, ఉత్తరము అనీ ఉన్న సమాచారమును లిఖితముగా చూచునదనీ తెలియుచున్నది. లేఖరి అనగా సమాచారమును వ్రాయువాడు లేక తెలియజేయువాడు అని చెప్పవచ్చును. విలేఖరి అనగా విశేషమైన సమాచారమును అందించువాడని అర్థము. ఇది చాలామంది విలేఖరులకే తెలియదు. అదే విధముగా "జ" అంటే పుట్టుటయనీ "ప్ర" అంటే ముఖ్యమైన లేక ప్రధానమైన అనీ అర్థము గలదు. 'ప్రజ' అనగా విశేషమైన పుట్టుకగలవాడనీ లేక ప్రాధాన్యతమైన జన్మ పొందినవాడనీ, లేక ముఖ్యమైన జన్మ అని అర్థము నివ్వగలదు. అయితే ఏ మనిషికీ ప్రజ అను శబ్దమునకు అర్థము తెలియదు. తనది అన్ని జన్మలకంటే బుద్ధిలో ప్రాధాన్యతగల జన్మయనీ, దానికి తగినట్లు ప్రవర్తించవలెననీ ఎవరూ అనుకోవడములేదు. మనిషి జన్మించిన తర్వాత తన జీవితములో ఏది ముఖ్యమైనదో, తాను ఏ దానిలో ప్రాధాన్యతగలవానిగా బ్రతకవలెనో తెలియకుండా అప్రజగా, అప్రాధాన్యముగా బ్రతుకుచున్నాడు. అటువంటి వారే ప్రాధాన్యత లేని ప్రపంచ సుఖముల కొరకు ప్రాకులాడుచున్నారు. అశాశ్వతమైన ప్రపంచ కోర్కెల కొరకే తమ బుద్ధిని ఉపయోగించుచున్నారు. తన విషయము తనకే తెలియని మనిషి తనకు ఏది అవసరమో, ఏది అనవసరమో తెలియక అనవసరమైన వాటిని అవసరమనుకొనీ, అవసరమైన వాటిని అనవసరమనీ అనుకొనుచున్నాడు. అందువలన మనిషికి అవసరమైన కూడు, గుడ్డ, విద్య, వైద్యములను అందివ్వాలని అనుకొంటున్నాడు. కానీ అవి అనవసర విషయములనీ ఏనాడో కర్మచేత నిర్ణయింపబడినవనీ, ఏ సమయానికి ఏది లభించవలెనో అదియే లభించి తీరుననీ తెలియక తానే సంపాదించుకొంటున్నానని ఒకడనుకుంటే, నేను ఇస్తున్నానని మరొకడు

అనుకొంటున్నాడు. వాస్తవానికి ప్రపంచ విషయములు కర్మాధీనమనీ అదియే మనలను ప్రేరేపించి ఒక్కొక్కరి చేత ఒక్కొక్క పని చేయిస్తుందని తెలియకున్నారు. మాకు కర్మ విషయము తెలుసు, కనుక మేము ప్రపంచ విషయములలో ఎవరికీ ఏమీ చేయడములేదు. మేము ఏమి చేసినా దైవజ్ఞాన విషయములోనే సేవ చేస్తున్నాము. మనిషికి అవసరమైనది దైవజ్ఞానము. అనవసరమైనది ప్రపంచ విషయము. మనిషికి అవసరమైన జ్ఞానమును మేము ప్రజలకు అందిస్తున్నాము. అట్లు చేయుటను మేము మనుషులకు సేవ చేసినట్లుగా భావించడములేదు. మనుషులకు జ్ఞానమును తెలిపినా, దానిని మేము దేవుని సేవగా భావించుచున్నాము.

బాబా అను వారు ఎవరైనా దేవునికి సేవ చేయకుండా మనుషులకు సేవ చేస్తూ, దానిని మానవసేవయే మాధవసేవగా చెప్పుకొనుచున్నారు. మానవసేవ కూడా వారు ఎంతమటుకు చేయుచున్నారో కొంత ఆలోచిస్తే అర్థమైపోతుంది. వారి జేబులు నిండిపోయి చివరకు ఒలికిపోవుదానిని ప్రజలకు ఖర్చు చేయుచున్నారు. కొన్ని లక్షల కోట్లలో నాలుగు లేక ఐదు వందల కోట్లు ఖర్చు చేస్తే, అది బయటికి పెద్దమొత్తముగా కనిపించినా, దైవము లెక్కలో అది పెద్ద దానముగా లెక్కించబడదు. **ఉన్న దానిలో ఎంత ఇస్తున్నావని దేవుడు చూస్తున్నాడుగానీ, ఇంత ఇచ్చావని మాత్రము చూడలేదు.** పదిమంది వేల రూపాయలను దానము చేసినపుడు, పదకొండవవాడు పది రూపాయలు మాత్రమే దానము చేశాడట. చివరకు ఎవరు ఎక్కువ దానము చేశారని ప్రశ్నించగా, పది రూపాయలు దానము చేసినవాడే ఎక్కువ దానము చేసినట్లు తేలిపోయింది. ఎందుకనగా మిగతావారు తమకున్న దానిలో కొంత మాత్రమే ఇచ్చారు, కానీ పది రూపాయలు ఇచ్చినవాడు తన దగ్గరున్నదంతా ఇచ్చి వేశాడట. ఉన్నదంతా ఇచ్చినవాడు గొప్పగా ఇచ్చినవాడనీ, ఉన్నదానిలో

రవ్వంత మాత్రము ఇచ్చినవాడు గొప్పగా ఇచ్చినవాడు కాదనీ తెలిసిపోయినది. అందువలన బాబా వందలకోట్లు డబ్బును దానముగా ఇచ్చినా, అది గొప్పదానము కాదు. తనకు ఉన్న దానిలో కొంతే ఇచ్చినవాడుగా లెక్కించ బడుచున్నాడు.

దానములో సూత్రమును తెలియని ప్రజలు కొద్దిగా ఇచ్చిన బాబాను గొప్పగా ఇచ్చిన వానిక్రిందికి జమకట్టుకొనుచున్నారు. ఇటువంటి బాబాలను పెద్దగా చెప్పుకొనుచు, దానములలో అన్నిటికంటే మించిన దానము జ్ఞాన దానమని తెలియనివారు జ్ఞానదానము చేయు యోగులను తక్కువగా లెక్కించు కొనుచున్నారు. అటువంటి పేరు ప్రఖ్యాతులుగాంచిన తపస్విబాబా అను వ్యక్తియూ మరియు యోగులలో పేరుగాంచిన రాజయోగానంద అను వ్యక్తియూ ఈ సత్యాన్వేషణ కథలో గలరు. ఈ కథ ఎక్కువ బాబా చుట్టూ మరియు యోగి చుట్టూ తిరుగుచూ, వారి నిజ స్వభావమును బయట పెట్టగలిగింది. చివరకు బాబాలు కూడా మరణిస్తారనీ, మరణించినప్పుడు సంపాదించుకున్న ఆస్తులూ, పేరు ప్రఖ్యాతులూ అన్నీ ఇక్కడే నిలిచిపోవుననీ, ఏ ఒక్కటీ కూడా బాబా వెంటపోవనీ తెలిపింది. యోగి చనిపోతే అతని వెంటపోవునది అతని యోగశక్తియనీ, అది శరీరము వెంట జగతిలో మిగలక యోగి వెంటపోవుననీ సత్యాన్వేషి కథలో తెలుపడమైనది. అందువలన ఈ గ్రంథమును అందరూ చదివి జ్ఞానము యొక్క విలువను తెలుసుకోగలరని విశ్వసిస్తున్నాము.

ఇట్లు

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**



# సత్యాన్వేషి కథ

1) జ్ఞాన, అజ్ఞానముల మధ్య జరుగు పోరాటము సత్యాన్వేషి.

2) బాబాల మహత్యాల మర్మములను తెలుపు సంచలన కథ సత్యాన్వేషి.

3) మాంత్రికులకు, యోగులకు మధ్య జరుగు ఘర్షణ సత్యాన్వేషి.

4) యంత్రశక్తికీ, మూలికాశక్తికీ మధ్య తేడా తెలుపునది సత్యాన్వేషి.

5) గురు శిష్యుల మధ్య సంబంధమును తెలియజేయునది సత్యాన్వేషి.

6) మానవునికి తెలియని ఎన్నో రహస్యములను తెలుపునది సత్యాన్వేషి.

7) బ్రహ్మవిద్యలో సంచలన సూత్రములను తెలియజేసినది సత్యాన్వేషి.

8) ప్రపంచ ధనమునకూ, జ్ఞాన ధనమునకూ మధ్య అగాధమును తెల్పినది సత్యాన్వేషి.

9) విషమునకు విరుగుడు ఔషధము, మాయకు విరుగుడు యోగము అని తెల్పినది సత్యాన్వేషి.

10) మంత్రాల గారడీ, యంత్రాల సత్తా, అంజనాల పనిని గురించి తెలిపినది సత్యాన్వేషి.

11) షట్ శాస్త్రములలో బ్రహ్మవిద్యా శాస్త్రమే గొప్పదని తెల్పినది సత్యాన్వేషి.

12) యోగుల ఔన్నత్యము, భోగుల కుటిలత్వమును గురించి తెల్పినది సత్యాన్వేషి.

13) ఆధ్యాత్మిక విద్యలో మూఢనమ్మకములను ఖండించునది సత్యాన్వేషి.

14) సాటి మనిషిని చిన్న చూపు చూచు అధికార మదమును ఖండించునది సత్యాన్వేషి.

**(ఇందులోని పాత్రలూ, సంఘటనలూ కేవలము కల్పితము. ఎవరినీ ఉద్దేశించి వ్రాసినవి కావు. కానీ ఇందులోని జ్ఞానమూ, వైద్యమూ, మంత్రములూ, మహత్యములూ అన్నీ వాస్తవమే.)**

మనిషి భౌతిక జీవితము ముఖ్యముగ మూడు బలముల మీద ఆధారపడి ఉన్నది. ఒకటి శరీరబలము, రెండు బుద్ధిబలము, మూడు ధన బలము. పుట్టుకతో వచ్చునది శరీరబలము, అందువలన దీనిని ఒకటవదిగా చెప్పుకొన్నాము. పుట్టిన తర్వాత ఐదారు సంవత్సరములనుండి వచ్చునది బుద్ధిబలము. అందువలన రెండవదిగా చెప్పుకొన్నాము. యుక్తవయస్సు తర్వాత వచ్చునది ధనబలము. కావున చివరి మూడవదిగా చెప్పుకొన్నాము. ఈ మూడు బలములు ఒక మనిషికి తప్పనిసరి, అయినా అవి అందరికీ ఒకేలాగున ఉండవు. బయటికి ఈ మూడు బలములు అందరికి తెలిసినవే, అయినా అవి అందరికీ ఒకేలాగున ఉండవు. ఒక్కొక్కరికి ఒక్కొక్క విధముగా ఉండును. మూడు బలములలో రెండు ఉండి, ఒకటి లేకపోవచ్చును, ఒకటి ఉండి రెండు లేకపోవచ్చును, మూడు ఉండినా ఒక బలము 10 శాతము, ఒక బలము 40 శాతము, మరియొక బలము 50 శాతము ఉండవచ్చును. ఈ బలములు వారివారి కర్మ మీద ఆధారపడివుండును, కావున ఒక్కొక్కరికి ఒక్కొక్క శాతములో ఉండును. జగతిలో ఒకరికున్నట్లు మరొకరికి ఉండడము లేదు, కొద్ది తేడాతోనైనా వేరువేరు బలములు ఉండడము తెలియుచున్నది.

పుట్టుకలో మూడవది అయిన ధనబలము జగతిలో మొదటి స్థానము ఆక్రమించినది. రెండవస్థానమును బుద్ధిబలము ఆక్రమించగా, శరీర బలము మూడవ స్థానమును ఆక్రమించినది. ధన బలము ఒక్కటి ఉంటే జీవితములో అన్నీ ఉన్నట్లే అగుచున్నది. ఎక్కువ అవసరములన్నియూ ధనము వలననే తీరుచున్నవి. ఒక్క ధనబలముచేత జగతిలో ఎక్కువ పనులు జరిగిపోవుట వలన కొందరు **"ధనమూల మిదమ్ జగత్"** అని అన్నారు. వాస్తవానికి **"కర్మమూల మిదమ్ జగత్"** కాగా, ధన బలమునకు

కూడా కర్మే కారణము కాగా, జ్ఞానము తెలియని ప్రజలు కనిపించక వెనుకవుండి ఆడించు కర్మను తెలియక, కనిపించు ధనమునే అన్నిటికి మూలమనుకొంటున్నారు. ధనబలము ఉన్నంతమాత్రమున దానిచేత విద్యావంతున్ని కొనగలుగుచున్నాడు. శరీరబలముగల వానిని కొనగలుగు చున్నాడు. అందువలన శరీరబలము లేనివాడుగానీ, చదువురాని విద్యాబలము లేనివాడుగానీ, ఒక్క ధనబలముచేత సులభముగా బ్రతుకగలుగుచున్నాడు. జగతిలో ఎక్కడైనా ధనమున్న వానికి గల మర్యాద, విద్య ఉన్నవానికిగానీ, శరీర ధృఢత్వమున్న వానికిగానీ లేదు. అందువలన శరీర బలమున్న పహిల్వాన్ గానీ, విద్యాబలమున్న పండితుడుగానీ ధనమున్న వాని క్రింద పని చేయుచున్నాడు. చివరకు దేవాలయములలోనున్న దేవుళ్ళవద్ద కూడా ధనమున్న వానికే విలువున్నది. అన్ని రంగములలో కూడా ధనమున్న వానికే విలువవుండుట వలన, అందరి ఉద్దేశ్యములో ధనమును (ధన బలమును) పొందాలని తప్ప వేరు ఆలోచనే లేదు. నేడు కష్టపడి ఉన్నత విద్యలు చదువువారంతా, ఆ చదువుల వలన ఉద్యోగమును పొంది, ధనమును సంపాదించు ఉద్దేశము తప్ప మరొక ఉద్దేశము లేదు. ఒక్క ధనము చేతనే ప్రపంచ అవసరములు తీరుట వలన, చివరకు జీవిత భాగస్వామిగా వచ్చు స్త్రీ కూడా ధనమున్న వానినే చేసుకోవాలనుకొనుచున్నది. ఇంత తీవ్ర స్థాయిలో ధనబలముండుట చేత దానిముందర ఏ బలము నిలువలేదు. ధనబలముకంటే మించిన మర్యాద ఏ బలమునకూ లేదు. ఇప్పుడు మనము చదువబోవు కథ కూడా శరీరబలమూ, విద్యాబలమూ ఉండి ఒక్క ధన బలములేని వ్యక్తిది, అతనే సత్యాన్వేషి, అతని పేరు రాఘవ.

ఈ లోకములో డబ్బు లేకుండా ఏ కార్యమూ జరుగదు. అందువలన అందరి చూపు దానిమీదనే కేంద్రీకృతమై ఉంటుంది. అందరి

ధ్యాస డబ్బు మీదనే ఉండినా ఎందరికి డబ్బు చేకూరుచున్నది? అని యోచిస్తే జవాబులు అనేక విధములుగా ఉంటాయి. కర్మనుబట్టి డబ్బు ఉండుట వలన ఎవడు ఎన్ని ప్రయత్నములు చేసినా వాని కర్మ ప్రకారమే డబ్బు చేకూరడము జరుగుచున్నది. కర్మ విధానము తెలియని మనుషులు తమ ప్రయత్నము వలననే డబ్బు లభించునని ప్రయత్నము చేయుచున్నారు. ఆ పనిలో నిత్యమూ గెలుపు ఓటములు పొందుచూనే ఉన్నారు. శరీర బలమూ, బుద్ధి బలమూ రెండూ శరీరములో తయారుకాగా ఒక్క ధనబలము బయట ఏర్పడుచున్నది. డబ్బును మానవుడే సృష్ఠించుకొనుచున్నాడు. బయటికి కనిపించు శరీరమునూ, అందులోని కనిపించని బుద్ధినీ ప్రకృతి తయారు చేయగా డబ్బును మాత్రము యంత్రములచేత మనిషే తయారు చేయుచున్నాడు. మనిషి తయారుచేసిన డబ్బుకు మనిషే దాసోహమై పోయాడు. జగతిలో మాయ అనునది శరీరములో గుణరూపములో ఉండినా, శరీరము బయట డబ్బును చూపిస్తూ గుణములలో ముంచి వేయుచున్నది. బయట పెద్ద మాయగా కనిపించు డబ్బుకు మానవుడు లొంగిపోయి తన జీవితమునుగానీ, జీవితమును ఇచ్చిన దేవున్నిగానీ, దైవజ్ఞానమునుగానీ విస్మరించి బ్రతుకుచున్నాడు. డబ్బు కోసమే మనిషి అన్ని చింతలూ చేస్తూ, చివరకు తన ఆత్మను గురించిగానీ, తనను గురించిగానీ మరిచిపోయి ప్రపంచములో బ్రతుకుచున్నాడు.

ఇలా జరుగుచున్న కాలములో యుక్తవయస్సుకు వచ్చిన రాఘవ తన జీవితములో అడుగుపెట్టాడు. రాఘవకు తన తల్లి తండ్రులు చిన్న వయస్సులోనే చనిపోయిన దానివలన అతను జీవితములో ఒంటరివాడై పోయాడు. రాఘవకు శరీర బలము ఉన్నది, అలాగే బుద్ధిబలమూ ఉన్నది. ఒక్క ధనబలము మాత్రము లేదు. భూమిమీద అందరి చూపూ

ధనబలము మీదనే ఉండుట వలన, రాఘవ అందమైన శరీరము గలవాడైనా, అందరికంటే ఎంతో ఎక్కువ తెలివిగలవాడైనా, అతనిని మిగతా వారు ఏమాత్రము లెక్కించక, ఏమాత్రము విలువనివ్వకపోవడమేకాక అతనిని గౌరవముగా కూడా పలుకరించెడివారు కాదు. రాఘవకు ఆస్తిలేదని అతనిని తక్కువ భావముతో చూడడమేకాక, అతనికి అమ్మాయినిచ్చి పెళ్ళి చేయడానికి కూడా వెనుకడుగు వేసెడివారు. తనకు బయటి సమాజములో ఏమాత్రము విలువలేదని గ్రహించగలిగిన రాఘవ, అటువంటి మనుషులతో తనకు ఏమాత్రము పని లేదనుకొన్నాడు. ఇక అటువంటి సమాజములో ఇమడ లేననుకొన్నాడు. ఈ సమాజమును వదలి దూరముగా పోవాలను కొన్నాడు. అప్పుడే అతని తలలో ఎన్నో యోచనలు ప్రశ్నల రూపములో వచ్చాయి. “ఈ మానవజాతి ఎందుకు సృష్ఠించబడినది? ఈ మానవ జాతిలోనే ఇన్ని విధముల కుత్సితములు, కుతంత్రములు ఎందుకున్నాయి? సాటి వ్యక్తిని వ్యక్తిగా గుర్తించక డబ్బును బట్టి మర్యాద ఇవ్వడమెందుకు? దేవుడెందుకు ఇటువంటి మనుషులను సృష్ఠించాడు? దేవుడు అందరికీ సమానమైనవాడైతే అందరినీ సమానముగా సృష్ఠించక కొందరిని ధనికులుగా, కొందరిని ధనము లేనివారిగా ఎందుకు సృష్ఠించాలి? వాస్తవానికి మనుషులకు దేవుడు సమానుడా? లేక దేవునికి మనుషులు సమానులా? ప్రపంచములో జరుగుచున్న దానినిబట్టి చూస్తే డబ్బున్న దేవునికే మనిషివద్ద మర్యాదవున్నది. డబ్బులేని దేవునికి కూడా మర్యాద లేదు. అలాగే డబ్బున్న ధనికునికే దేవుని వద్ద మర్యాదకలదు, డబ్బులేని వానికి దేవుని దర్శనము కూడా దొరకదు. ఈ విషయము ఎన్నో దేవాలయములలో కనిపిస్తూనే ఉన్నది. దీనినిబట్టి ఇటు ప్రపంచ విషయములే కాకుండా, అటు దేవుని భక్తి కూడా డబ్బుతోనే ముడిపడి వున్నదని

తెలియుచున్నది. డబ్బులేనివాని తెలివి పనికిరాదు. అలాగే డబ్బులేని వాని బలము పనికిరాదు. కేవలము ఒక డబ్బుతోనే తెలివీ, బలమూ రెండూ లేకున్నా అన్ని పనులూ నెరవేరగలవు. ఇటువంటి డబ్బు మహత్యమున్న ఈ సమాజములో డబ్బులేని నేను ఇమిడి బ్రతకలేను. కావున నేను ఈ సమాజమును వదలి డబ్బు విలువ తెలియని, డబ్బు విలువలేని జంతు ప్రపంచమున్న అడవిలోనికి పోయి జంతువుల మధ్యలో బ్రతకడము మంచిది" అని అనుకొన్నాడు.

ఈ సమాజమును వదిలి పోవాలనుకొన్న వెంటనే, రాఘవ అరణ్య మార్గమునుబట్టి పోయాడు. ఎంతో తెలివీ, బలమూ ఉన్న రాఘవ అరణ్యమును చేరి అక్కడ లభించు ఫలముల చేత కడుపు నింపుకొనుచూ, ప్రకృతి సౌందర్యములను చూచి ఆనందపడుచూ, మానవ సమాజములో లేని సుఖమును అక్కడ అనుభవిస్తూ ప్రశాంతముగా జీవితమును గడప సాగెను. రాఘవ నివసించునది భయంకరమైన అడవి. ఆ అడవిలో ఎన్నో మృగములు మనిషి యొక్క భయము లేకుండా విచ్చల విడిగా సంచరించేవి. ఆ అడవిలో కొందరు చెంచు జాతి ప్రజలు అక్కడక్కడ కొన్ని గూడెములలో నివసిస్తున్నారు. వారు కూడా ఎక్కువగా అడవిలో దొరుకు దుంపలు, తేనె, కొన్ని రకముల పండ్లు, కొన్ని రకముల ఆకులను తింటూ, కొన్ని అడవి జంతువుల చర్మములను దుస్తులుగా వాడుచూ, అక్కడక్కడ పారు సెలయేర్లలోని నీరు త్రాగుచూ హాయిగా జీవించెడివారు. వారికి డబ్బుతో పనేలేదు. అందువలన ప్రపంచములోని మనుషుల మాదిరి డబ్బు మాయలో పడక, అవినీతి, అన్యాయము లేని బ్రతుకు బ్రతుకుచూ మనశ్శాంతిగా కాలమును గడిపేవారు. అడవిలో క్రూరమృగములున్నప్పటికీ అవి నివసించు ప్రాంతములోనికి చెంచు జాతికి చెందిన ఆటవికులు పోయే

వారు కాదు. అలాగే ఆటవికులున్న ప్రాంతములోనికి క్రూరమృగములు వచ్చేవి కావు.

అటువంటి అడవిలో రాఘవ ఒంటరిగా ఇటు క్రూరమృగములు గానీ, అటు చెంచు జాతివారుగానీ లేని ఒక ప్రాంతములో దాదాపు ఒక నెల రోజులుగా ఉంటూ వచ్చాడు. ఒకనాడు రాఘవ నివాసమున్న స్థలమునకు దూరముగా పులిగర్జన వినపడసాగెను. ఆ గర్జన శబ్దము క్రమక్రమముగా దగ్గర కాజొచ్చెను. అపుడు రాఘవకు సమీప ప్రాంతములో నున్న కుందేళ్ళూ, జింకలూ బెదురు చూపులు చూస్తూ అటూ ఇటూ పరుగిడసాగాయి. అంతలో ఆరుమంది గల ఆటవికుల గుంపు రాఘవవున్న ప్రాంతమువైపు పరుగిడుచూ వచ్చారు. రాఘవకు సమీపముగా పారిపోతూ వారు రాఘవను చూచారు. పరుగిడుచున్న ఆరుమంది ఒక్కసారిగా ఆగి రాఘవను చూచి ఆశ్చర్యపోయి “నీవు ఎవరు? ఇక్కడెందుకున్నావు? వెంటనే పారిపో! మేము ఒక పులిని బాణముతో కొట్టాము, మా గురి తప్పి పోయింది. పులి కోపముతో ఇటువైపే వస్తున్నది. దానికంటపడితే చంపేస్తుంది. కనిపించకుండా పారిపో!” అని చెప్పి అక్కడినుండి వేగముగా పరుగిడి పోయారు. వారి మాటలు విన్న రాఘవ చేయునది లేక వారి వెంటనే పరుగిడసాగెను. అలా కొంత దూరము పోయిన తర్వాత రాఘవ దారి తప్పిపోయాడు. ఆటవికులు ఒకవైపు పోగా, రాఘవ వారి జాడ తెలియక మరొకవైపు పోయాడు. అలా దారి త్రప్పిపోయిన రాఘవ అలసిపోయి నిదానముగా కాలినడక సాగిస్తూ పోవుచుండెను. అలా అలసిపోయి నెమ్మదిగా నడుస్తూ, ఇక నాకు ఓపికలేదు ఒకచోట కూర్చోవాలనుకొను సమయములో, అంతవరకూ తరుముచూ వచ్చిన పులి రాఘవకే ఎదురైనది.

ఆ సమయములో పులిని చూచిన రాఘవ చేయునది లేక ఉన్నచోటనే కదలకుండా నిలబడిపోయాడు. రాఘవను చూచిన పులి కోపముతో భయంకరముగా గర్జించి రాఘవ మీదికి రాబోయింది. రెండడుగులు ముందుకు వేసిన పులికి కరెంట్‌షాక్ కొట్టినట్లయి నాలుగు గజములు వెనక్కు ఎగిరిపడింది. అలా ఎగిరిపడిన పులి రెండవ మారు రెట్టింపుగా గాండ్రించుచూ రాఘవ మీదికి రాబోయింది. రెండవమారు కూడా పులికి అదే అనుభవము ఎదురైనది. ఈ మారు పులి భయపడి వెనుతిరిగి పారిపోయింది. జరిగిన సంఘటన రాఘవకు క్రొత్త అనుభవమును ఇచ్చినది. అపుడు జరిగిన విచిత్ర సంఘటనను ఆలోచిస్తూ రాఘవ తాను నిలుచున్న స్థలము, చెట్టు నీడన చల్లగా ఉండుట చేత కొద్దిసేపు విశ్రాంతి తీసుకొను నిమిత్తము ఆ చెట్టు మొదటిలోనే కూర్చున్నాడు. పులి తనమీదికి రాబోయి, ఏదో దెబ్బతిన్నట్లు ఎందుకు వెనుతిరిగి పోయిందో అర్థముకాక, ఆలోచిస్తూ మెల్లగా నిద్రలోనికి జారుకొన్నాడు. అతను మధ్యాహ్నము రెండు గంటలకు పడుకొని తిరిగి సాయంకాలము ఆరు గంటలకు నిద్రనుండి లేచాడు. పూర్తి సాయంత్రమై చీకటిపడు సమయమైన దానివలన ఆ రాత్రికి అక్కడే ఉండడము మంచిదనుకొన్నాడు.

× × × × × × × × × × × × × × × × × × × × × ×

పరుగిడుచున్న ఆటవికులు తప్పిపోయిన రాఘవను గురించి చింతించి పులికి చిక్కిపోయాడేమో అని తలచుచూ తమ గూడెమును చేరారు. అడవిలో క్రొత్త మనిషి కనిపించినట్లు తమ గూడెము నాయకునికి తెలిపారు. పులి తరుముచున్న సమయములో అతనిని తమవెంట తీసుకురావాలను కొన్నా కుదరలేదనీ, అతను అడవిలో తప్పిపోయాడనీ చెప్పగా, వారి

నాయకుడు ఆ మాటలకు స్పందించి "అతను ఎవరో, ఎందుకు అడవిలోనికి వచ్చాడో తెలియదంటున్నారు. ఈ అడవిలో ఒంటరిగా బ్రతకడము కష్టము. ఏ మృగము ఎప్పుడైనా దాడిచేసి చంపగలదు. మనకు తెలిసి ఊరకుండడము బాగుండదు. మీరు పోయి అతను కనిపిస్తే ఇక్కడికి తీసుకొనిరండి" అన్నాడు. ఆ మాట విన్న చెంచువారు తమ నాయకుని మాట ప్రకారము రెండవరోజు ఉదయమే బయలుదేరి రాఘవను వెదకుచూ అడవిలోనికి పోయారు. అలా వెదకుచూ పోగా చివరకు రాఘవ ఉన్న స్థలమునకు చేరి రాఘవతో తమ నాయకుని మాటను తెలిపారు. వారి మాటలు విన్న రాఘవకు ప్రస్తుతానికి వారి వెంటపోవడమే మంచిదనిపించింది.

అపుడు పులి విషయమును గురించి రాఘవను అడుగగా! పులి తనమీదికి దాడిచేసిన విషయమూ, అది పారిపోయిన విషయమూ, అన్నిటినీ పూసగ్రుచ్చినట్లు రాఘవ వారికి తెలిపాడు. ఆ విషయమును వినిన ఆటవికులు రాఘవకు నీడనిచ్చిన వృక్షమే పులినుండి కాపాడిందని చెప్పారు. అందుకు రాఘవ ఆశ్చర్యపోయి "ఈ వృక్షములో అంత మహత్యమున్నదా? నన్ను ఎట్లు కాపాడగలిగింది" అని అడిగాడు. రాఘవ మాటలను విన్న అడవి మనుషులలో ఒకడు " ఈ చెట్టు నీడ పులికి శత్రువులాంటిది. ఈ వృక్షము పేరు వ్యాఘ్రశత్రువు. దీని నీడలోనికి పులి ఏమాత్రము రాదు. ఒకవేళ పొరపాటుగా వచ్చినట్లయితే దానికి పెద్దదెబ్బ తగిలినట్లగును. ఎవరో కొట్టినంత బాధతో వెనుతిరిగి పారిపోవును తప్ప ముందుకు రాదు. ఈ వృక్షము యొక్క విషయము మా గూడెములోని వారందరికీ తెలుసు. మేము అడవిలో తిరుగునపుడు పులి పంజా మా మీద విసరకుండా, అది మమ్ములను సమీపించకుండా ఉండుటకు, ఈ చెట్టు వేరును తావెత్తులలో

పెట్టుకొని మా చేతికి కట్టుకొనివుందుము. ఎప్పుడైనా అతి ప్రమాద సమయములో తావెత్తును తీసి చేతిలో పట్టుకొంటే పులి మా దగ్గరకు రాజాలదు. ఈ వృక్షము యొక్క ఆకుల రసము మా అంబులకు తడిపి, పులులను మా గూడెమువైపు రాకుండా తరిమి కొట్టుతాము. మా అంబుల వలన తగిలిన చిన్న గాయమైనా ఈ చెట్టు పసరు ప్రభావము చేత పులిని ఎక్కువ బాధించును. ఈ వృక్షమును మేము పులులనుండి కాపాడు అడవి దేవతగా భావించి పూజిస్తాము. మా ఆరాధ్య దేవతైన 'భైరికాతల్లి' ఈ చెట్టుమీద నివసిస్తుంటుందని మా పెద్దలు చెప్పుచుంటారు. నిన్ను ఆ భైరికా దేవతే కాపాడింది" అన్నాడు. అతని మాటవిన్న రాఘవ ఆశ్చర్యపోయి ఇలా అన్నాడు.

**రాఘవ :-** ఈ చెట్టులో అంత ప్రభావమున్న మాట నిజమే. నిన్న పులి పారిపోయిన సంఘటనను చూస్తే, ఈ చెట్టులో ప్రభావమున్నదని ఎవరైనా చెప్పగలరు.

**ఆటవికులు :-** నీవు ఎవరు? ఎందుకు ఈ అడవిలో ఉన్నావు?

**రాఘవ :-** నేను జనారణ్యములో నుండి వనారణ్యములోనికి కావాలనే వచ్చాను. నాకు మనుషుల మనో భావములు సరిపోక ఇక్కడికి వచ్చాను. నేను వచ్చి కేవలము నెల రోజులే అయింది. ఇంతలోనే ఈ సంఘటన జరిగింది.

**ఆటవికులు :-** నీవు అరణ్యములో ఉండాలంటే ఒంటరిగా ఉండుటకు కుదరదు. ఏ జంతువు వలనైనా ప్రమాదము జరుగవచ్చును. అందువలన నీవు మా గూడెములోనికి వచ్చి ఉండుట మంచిదగును.

**రాఘవ :-** అలాగే! మీవెంట మీరున్న గూడెమునకు వస్తాను.

(అందరూ కలిసి గూడెమునకు వెళ్ళారు. గూడెమునకు కుల పెద్ద అయిన మల్లుదొరకు రాఘవను గూడెము వారు పరిచయము చేశారు.

రాఘవ తెలివైనవాడు కనుక, ఆ గూడెము వారినుండి అడవికి సంబంధించిన కొన్ని వృక్షములను, వృక్షముల శక్తులను గురించి తెలుసుకోవాలనుకొన్నాడు. ఒక నాలుగు రోజుల తర్వాత గూడెమునకు పెద్దయిన మల్లుదొరతో బాగా పరిచయమేర్పరుచుకొన్నాడు. రాఘవ మీద మల్లుదొరకు మంచి అభిమానము పెరిగింది. అలా ఉన్న సమయములో మల్లుదొరను రాఘవ అడగను మొదలు పెట్టాడు.)

**రాఘవ :-** అయ్యా! ఈ అడవిలో వ్యాఘ్రుశత్రువు వృక్షములాగ మరి ఏవైనా మహత్తుగల చెట్లున్నాయా?

**మల్లుదొర :-** ఎన్నో ఉన్నాయి. కొన్ని చెట్లు గలవు, మరికొన్ని తీగలు గలవు. అటువంటి చెట్లను మేము గౌరవించి పూజిస్తాము. అటువంటి చెట్ల ఆకులను కోయాలన్నా, లేక తీగలను తెచ్చుకోవాలన్నా ముందు వాటికి పూజచేసి తర్వాత ఆ చెట్లను ముట్టుకుంటాము. అవి మాకు దేవతలతో సమానము. వాటి వలననే మేము రోగాల బారినపడకుండా ఆరోగ్యముగా ఉన్నాము.

**రాఘవ :-** నోరులేని చెట్లు, నడువలేని తీగలు, నోరుగల మనుషులకు ఇంత మేలు చేస్తున్నాయా?

**మల్లుదొర :-** అన్నీవున్న మనిషి సాటి మనిషిని కాపాడలేకపోయినా, సహాయము చేయకపోయినా, నోరులేని చెట్లే మనిషిని ఎన్నో విధముల కాపాడుచున్నవి.

**రాఘవ :-** అయ్యా! నాకు మీరు చెప్పు విషయములు ఎంతో ఆశ్చర్యముగా ఉన్నవి. ఎంతో గొప్పవైన ఈ చెట్లను గురించి తెలుసుకోవాలని ఉన్నది. దయచేసి నాకు ముఖ్యమైన చెట్ల గురించి, వాటి పనితనమును గురించి తెలుపుదురని కోరుచున్నాను.

**మల్లుదొర :–** ఒక్కొక్క చెట్టు ఒక్కొక్క మూలికాశక్తి కల్గివుండుట సహజము. ఔషధముకాని ఆకు ఏదీ భూమిమీద లేదు.

ప్రతి చెట్టు ఆకు ఒక రోగమునకు ఔషధముగా పని చేయును. వాటిని గురించి నిదానముగా నీవు ఇక్కడేవుండి తెలుసుకోగలవు. అయితే మాకు కూడా అంతుదొరకని ఒక చెట్టు ఉన్నది. ఆ జాతి చెట్లు ఎన్నో అడవిలో ఉన్నాయి. అయితే వాటిలో ఏ దానికీ లేని ఒక ప్రత్యేకశక్తి ఆ ఒక్క చెట్టుకు మాత్రము గలదు.

**రాఘువ :–** ఏమిటా చెట్టు? ఎక్కడుంది? దానికి గల ప్రత్యేకత ఏమిటి? వివరముగా చెప్పండి.

**మల్లుదొర :** అది చూచేదానికి మామూలు మర్రిచెట్టు. ఈ అడవిలో ఎన్నో మర్రిచెట్లు ఉండినా వాటికంటే అది ఒక్కటే విభిన్నముగా ఉన్నది. ఆ చెట్టులో ఏ ప్రభావమున్నదో గానీ, ఆ చెట్టు యొద్దకు పోయిన వారికి రోగములు పోవుచున్నవి. దయ్యములు పట్టిన వారు అక్కడికి పోతే దయ్యములు పోయి ఆరోగ్యవంతులగుచున్నారు. ఆ చెట్టు ఆకులను తెచ్చి తలమీద పెట్టుకొని నిదురిస్తే తలకు సంబంధించిన రోగములన్నీ పోయాయి. ఇలా ఆ చెట్టుకు ఎన్నో మహత్యములు గలవు.

**రాఘువ :–** మీరు చెప్పేకొలదీ నా మనస్సులో ఆ చెట్టును చూడాలని పిస్తున్నది. దయచేసి ఆ చెట్టును చూపిస్తారా?

**మల్లుదొర :–** నీవు చూస్తానంటే మేమెందుకు చూపము? ఇప్పుడే బయలు దేరి పోదాము పద.

(ఆ విధముగా ఇద్దరూ బయలుదేరి గూడెమునకు కొంత దూరము లోనే ఉన్న మర్రివృక్షము వద్దకు చేరుకొన్నారు. అక్కడికి చేరిన రాఘువ

ఆశ్చర్యముగ ఆ చెట్టును చూస్తున్నాడు. చూచుటకు సర్వ సాధారణముగానున్న మఱ్రివృక్షము అనేక శాఖోపశాఖలై కొన్ని ఊడలు కూడా క్రిందికి దిగి ఉన్నాయి. అంతేకాక ఆ చెట్టుకు తూర్పు దిక్కున చెట్టు మొదలు వద్దనే పాతిపెట్టబడిన శూలము, పాదుకలు రాఘవకు కనిపించాయి. పాదుకలను, శూలమును చూచిన రాఘవ వాటి విషయమును తెలుసుకొనుటకు ఈ విధముగా ప్రశ్నించాడు.)

**రాఘవ :-** అయ్యా! ఇక్కడున్న పాదుకలు ఎవరివి? ఈ శూలము ఎవరిది?

**మల్లుదొర :-** ఈ పాదుకలూ, శూలమూ రెండూ ఒక మునీశ్వరునివి. ఇవి చాలా కాలమునుండి ఇక్కడే ఉన్నాయి. వీటిని మేము పూజిస్తుంటాము. వీటిని ఉపయోగించిన ముని ఇక్కడే యోగము చేస్తున్నాడని మా పెద్దలు చెప్పారు. మేము ఎప్పుడూ ఆయనను చూడలేదు. ఆయన విషయమును మా పెద్దలు చెప్పగా విన్నాము.

**రాఘవ :-** ఈ మునీశ్వరుని విషయము మీ పెద్దలకు ఎలా తెలుసు?

**మల్లుదొర :-** మొదట మా పెద్దలే ఇక్కడ భూమిని త్రవ్వి లోపల యోగ మందిరమును నిర్మించి ఇచ్చారు. అప్పటినుండి ఆ మునీశ్వరుడు లోపల కూర్చొని యోగములో లగ్నమై పోయాడట. అప్పుడు లోపలికి పోయిన ఆ యోగి ఇంతవరకు బయటికి రాలేదు. అప్పుడు మూసిన గుంతను ఇప్పటి వరకు ఎవరూ తీయలేదు.

**రాఘవ :-** ఆయన ఎప్పటికీ బయటికి రానని చెప్పాడా? లేక ఎప్పటికైనా వస్తానని చెప్పాడా? పోయేటప్పుడు ఏమీ చెప్పకుండా పోయాడా?

**మల్లుదొర :-** ఆయన లోపలికి పోయేటప్పుడు చెప్పి పోయాడని మా పెద్దలు చెప్పేవారు. రాబోయే కాలములో అష్టగ్రహకూటమి జరుగుతుందట. ఆ సమయానికి ఆయన బయటికి వస్తానని చెప్పాడట. ఆ సమయములో

దుష్టశక్తులు కొన్ని చెలరేగుతాయట. అప్పుడు ఆయన ఒక మనిషి చేత వాటిని నివారింపజేస్తాడట. అప్పటివరకు బయటికి రానని చెప్పి పోయాడు. ఇది రహస్యమైన విషయము ఎవరికీ చెప్పునది కాదు. అయినా నీకు చెప్పాలనిపించింది చెప్పాను. కానీ మేము ఈ విషయమును గోప్యముగానే ఉంచాము. ఇంతవరకు ఎవరికీ చెప్పలేదు. ఈ విషయమును నీవు కూడా ఎవరికీ చెప్పవద్దు.

**రాఘవ :-** ఆ మునీశ్వరుడు ఎవరైనదీ మీకు తెలుసా? గతములో ఆయన ఎక్కడుండేవాడు?

**మల్లుదొర :-** ఆయన ఎవరో, ఏ ప్రాంతము వాడో మాకు ఏమాత్రము తెలియదు. మా గూడెములో ఒక మనిషి చనిపోయాడు. ఆ మనిషికి అంత్యక్రియలు చేసి పూడ్చిపెట్టాలనుకొన్న సమయములో ఆ మునీశ్వరుడు ఉన్నట్టుండి అక్కడికి వచ్చాడు. చనిపోయిన వ్యక్తిని గుంతలో పెట్టిన సమయములో అక్కడికి వచ్చిన ఆయన, గుంతలో పెట్టిన వానిని చూచి ఇతను చనిపోలేదు, నిద్రించుచున్నాడు, ఎందుకు పూడ్చుచున్నారని అడిగాడు. అప్పుడు అక్కడున్న వారందరు ఈయన ఉదయము ఐదు గంటలకే చనిపోయాడని చెప్పారు. ఆ మాటకు ఆ మునీశ్వరుడు నవ్వి మీరు పొర పడినారు ఆయన చనిపోలేదు నిద్రించుచున్నాడని తట్టి లేపాడట. అప్పుడు చనిపోయిన మనిషి లేచి కూర్చున్నాడట. అప్పుడు ఆ మునీశ్వరున్ని అందరూ గొప్పవ్యక్తిగ తలచి గౌరవించారు. అలా పరిచయమైన గూడెము మనుషులతో చెప్పి, ఈ మర్రి చెట్టు క్రింద భూమిలో గదిని త్రవ్వించుకొని లోపలికి పోయాడట. అప్పటినుండి ఈ ప్రాంతమును, ఈ చెట్టును మేము పవిత్రముగా చూస్తుంటాము. అంతేకాక ఇక్కడున్న ఈ చెట్టునుండి మాకు ఎంతో మేలు జరుగుచున్నది. ఈ చెట్టుచుట్టూ తిరిగితే రోగాలు పోవుచున్నవి.

**రాఘవ :-** అయితే మీరు చెప్పినట్లు ఇది శక్తితో కూడుకొన్న వృక్షము. ఇక్కడుంటే మంచే జరుగుతుంది. అందువలన 24 గంటలు నేను ఇక్కడే ఉంటాను. ఈ రాత్రికి ఇక్కడే నిద్రిస్తాను.

**మల్లుదొర :-** రాత్రిపూట నీవు ఒక్కనివే ఇక్కడుండడము మంచిది కాదు. నీవు ఉండాలనుకుంటే ఇంకా కొంతమందిని గూడెము నుండి వెంట తెచ్చుకొనివుండు.

**రాఘవ :-** అలాగే మీరు చెప్పినట్లే చేస్తాను.

(ఆ రాత్రికి మల్లుదొర ఆదేశానుసారము ఎనిమిది మంది చెంచువారు రాఘవ వెంట వచ్చి మర్రివృక్షము క్రింద పడుకొన్నారు. రాఘవ ప్రొద్దు పోయేంతవరకు వారితో మాట్లాడుచు అక్కడి వివరములు తెలుసుకొనుచుండెను. దాదాపు నడిరాత్రి కావచ్చింది. అంతలో ఆకాశము మేఘావృతమైనది. ఉరుములు ఉరుముచూ, మెరుపులు మెరియుచూ చిన్నగా వర్షపు చినుకులు పడసాగెను. అది చూచిన చెంచువారు ఇక్కడుంటే పూర్తిగా తడిసిపోతాము, వెంటనే గూడెమునకు పోదామని రాఘవకు చెప్పగా రాఘవ "మీరు వెళ్ళండి నేను రానని" చెప్పెను. తాను తడిసిపోయినా ఫరవాలేదు 24 గంటలు తప్పకుండా ఇక్కడే ఉంటానని వారితో చెప్పాడు. దానికి వారు చేయునది లేక రాఘవను అక్కడే వదలి తాము మాత్రము గూడెమునకు పోయారు. రాఘవ ధైర్యముగా మర్రివృక్షము క్రింద ఆలోచిస్తూ ఉండెను. అలా ఒక గంట గడిచిపోయింది. అంతవరకు ఒక రకముగా వచ్చిన వర్షము కూడా నిలిచిపోయింది. ఆకాశములో మేఘములుండుట వలన ఎటు చూచినా చీకటే కనిపిస్తూవున్నది. అప్పుడప్పుడు ఏవో జంతువుల అరుపులు తప్ప మిగతా కాలమంతా నిశ్శబ్దముగా ఉన్నది. అలా నిశ్శబ్దముగా ఉన్న సమయములో "నీవు నావద్దకు రా!" అను కంఠస్వరము

రాఘవకు వినిపించింది. ఆ మాటను విన్న రాఘవ ఉలిక్కిపడి లేచి నిలబడి, తనను ఎవరు పిలిచారని చుట్టు ప్రక్కల చూచాడు. కానీ ఎవరూ కనిపించలేదు. రాఘవకు ఒక ప్రక్క భయము కలుగగా, ఒక్క ప్రక్క ఆశ్చర్యము కల్గినది. తనను ఈ నిర్జన ప్రదేశములో ఎవరు పిలిచారని యోచించుచుండ గానే మరియొకమారు అదే కంఠముతో అదే మాట వినిపించింది. అప్పుడు రాఘవ "ఎవరు నీవు? నేను ఎక్కడికి రావలెను" అని అడిగెను. రాఘవ పల్కిన మాటకు జవాబుగా మరియొకమారు ఈ విధముగా వినిపించింది. "నేను నీ శ్రేయోభిలాషిని. నీవు భయపడవలసిన పనిలేదు. నీవున్న స్థలమునుండి ముందుకు ఆరు అడుగులు వచ్చి, అక్కడ కొంత మట్టిని తొలగించు. నీకు దారి కనిపిస్తుంది. ఆ దారిలో వస్తే నీవు నావద్దకు రాగలవు."

అప్పుడు రాఘవకు ఆ మాటలు వింటూనే, నిన్నటి దినమున గూడెముపెద్ద చెప్పిన యోగి విషయము జ్ఞాపకము వచ్చినది. వెంటనే మనస్సులో ఎంతో ధైర్యము, ఉత్సాహము వచ్చినది. తనను భూగర్భములో నున్న యోగియే పిలుస్తున్నాడని తలచిన రాఘవ, సంతోషముతో ఆరు అడుగులు ముందుకు వేశాడు. అక్కడనే ఉన్న కర్రతో తన కాళ్ళ క్రిందనున్న భూమిని త్రవ్వను మొదలు పెట్టాడు. చీకటిగానున్నా, నూతన ఉత్సాహముతో త్రవ్వసాగాడు. అలా రెండు అడుగుల లోతు మట్టిని త్రవ్వగానే మట్టిలేకుండా పోయి ఇటుకలు కనిపించాయి. అంతలోనే ఆకాశములో మబ్బులు పోయి కొంత వెన్నెల వచ్చింది. దానితో రాఘవకు కొంచెము కనిపించసాగింది. ఆ కొద్దిపాటి వెన్నెల వెలుతురులో ఇటుకలను తొలగించాడు. అలా మూడు వరుసల ఇటుకలను తొలగించగా క్రిందికి మెటికలున్న సొరంగము కనిపించింది. ఆ సొరంగములోనికి రాఘవ ధైర్యముగా దిగి ముందుకు పోగా, సొరంగము కుడిప్రక్కకు దారి కనిపించింది. అటు కుడిప్రక్కకు

తిరుగుతూనే ఒక దివ్యమైన వెన్నెలలాంటి ప్రకాశము కనిపించింది. రాత్రివేళ, అందులోను ఒక గుహలో ఇలాంటి ప్రకాశమేమిటని చూడగా! అక్కడ చంద్రబింబము ఛాయగల ఒక మణి ప్రకాశిస్తూ కనిపించింది. ఆ మణి ప్రక్కనే ఒక నాగుపాము పడగవిప్పి చూస్తూవున్నది. చిత్రముగానున్న ఆ దృశ్యమునుండి రాఘవ చూపును ప్రక్కకు త్రిప్పి చూచాడు. అప్పుడు అతనికి చిరునవ్వు చిందిస్తూ కూర్చున్న వ్యక్తి కనిపించాడు. అతను ముఖ వర్చస్సులో, కన్నులలో ప్రత్యేకమైన కళ తొణికిసలాడినట్లు కనిపించింది. అతనిని చూస్తూనే రాఘవకు గొప్ప వ్యక్తిని చూచినట్లు అనుభూతికల్గి తెలియకుండానే చేతులు నమస్కారము చేశాయి. అప్పుడు వినయముగా రాఘవ ఇట్లన్నాడు.)

**రాఘవ :-** నన్ను పిలిచింది మీరేనా? మీరు ఎవరో నాకు తెలియదు. దయచేసి మీ నామధేయమును తెలుపండి.

**మహర్షి :-** నిన్ను పిలిచింది నేనే. నేను ఫలానా అని చెప్పుటకు వీలులేదు. ఎందుకనగా నాపేరును నేనే మరచిపోయాను. నేను 90 సంవత్సరములుగా యోగదీక్షలో లగ్నమై ఉన్నాను. కన్ను తెరచు కాలము ఆసన్నమైనది. కనుక యోగమునుండి మేల్కొన్నాను. నీవు నావద్దకు రావలసి ఉన్నది, కనుక వచ్చావు. నీ రాకను గమనించిన నేను నిన్ను పిలిచాను.

**రాఘవ :-** నన్ను ఎందుకు పిలిచారు.

**మహర్షి :-** నీవు సత్యాన్వేషివి కనుక పిలిచాను.

**రాఘవ :-** నేను సత్యాన్వేషినా! నేను ఏ సత్యము కొరకు, ఏ అన్వేషణ చేయలేదే!

**మహర్షి :-** నీవు జన్మ రహస్యమేమిటో తెలుసుకోవాలనుకోలేదా? నేనెందుకు పుట్టానని అనుకోలేదా? సాటి సమాజములో విసుగెత్తి అడవిని చేరలేదా?

వింత చెట్టును చూచిన నీవు  ఇంకా వింతైన చెట్లను గురించి తెలుసు కోవాలనుకోలేదా? ఆటవికులు తెల్పిన విషయములో సత్యమెంతవుందోనని చూచుటకు, నీవు ఇక్కడికి వచ్చి పడుకోలేదా? వర్షమునకు ఉండలేక గూడెమునకు వెళ్ళెదమని గూడెమువారు పిలువగా వారిమాట వినక నీవు పట్టుదలగా ఇక్కడే ఉండలేదా? చెప్పు రాఘవా? నేను చెప్పుమాటలు సత్యము కాదా!

**రాఘవ :–** మహాత్మా! మీరు ఎవరోగానీ, మొత్తము నా చరిత్ర అంతయూ తెలిసినవారుగా ఉన్నారు.  నా పేరు మీకు ఎలా తెలుసో? నా భావము లన్నియూ ఎలా చెప్పగలుగుచున్నారో ఆశ్చర్యముగా ఉన్నది.

**మహర్షి :–** నీ చరిత్రేకాదు, నీ పుట్టుక రహస్యమును కూడా తెలిసినవాడిని. నీ పుట్టుకేకాదు, నీ వెనుక జన్మను కూడా తెలిసినవాడిని. అసలుకు నీవెవరో కూడా  తెలిసినవాడిని.

**రాఘవ :–** స్వామీ! మీరు చెప్పునది నాకు అగమ్యగోచరముగా ఉన్నది. అర్థము కావడములేదు.   అసలుకు మీరెవరు?

**మహర్షి :–** నేను నేనే, ముందే చెప్పానుగా నా పేరును మరచిపోయానని, అందువలన నాకు పేరే లేదనుకో.

**రాఘవ :–** నా రహస్యమంతయూ చెప్పుచున్న మీరు, మీ పేరును మరచి పోవుటయా!  నేను  నమ్మలేకున్నాను.

**మహర్షి :–** నీవు నమ్మలేని నిజము,  నాకు పేరులేదు.  ఏ పేరు పెట్టుకొనినా మానవుడు మానవుడే.   ఎవనికి ఏ పేరుండినా పేరువలన వాడు సాధించునది ఏమీలేదు.  ఒకనికి రాముడని పేరు పెట్టినంతమాత్రమున వాడు దశరథ పుత్రుడైన రాముడు కాలేదు.  మానవత్వమును బట్టి మనిషిగానీ పేరునుబట్టి  కాదు.

**రాఘవ :–** మహాత్మా! రూపముంటే పేరు ఉంటుందంటారు, అట్లే పేరుంటే రూపముంటుందంటారు. రూప, నామములు ఒకదానికొకటి అవినాభావ సంబంధమంటారు. మీకు రూపమున్నది కావున పేరుండి తీరవలయును కదా!

**మహర్షి :–** ఏ మాట మాట్లాడినా యోచించి మాట్లాడవలెను. నీవు చెప్పు రూప, నామ అవినాభావము శాస్త్రబద్ధమైన మాటకాదు. అందువలన అది ఖండింపబడుతుంది.

**రాఘవ :–** శాస్త్రబద్ధమైనదంటే ఏ విధముగా ఉంటుంది?

**మహర్షి :–** ఖండింపబడనిదీ, నిరూపణకు వచ్చునదీ శాస్త్రమంటాము. ఈ సూత్రమునకు లోబడివున్న దానిని శాస్త్రబద్ధమైనదంటాము.

**రాఘవ :–** తెలియక అడుగుచున్నాను. రూపమున్న ప్రతి దానికీ పేరున్నది, పేరున్న ప్రతి దానికీ రూపమున్నది. ఇది అంతటా అందరికీ తెలిసిన విషయమే కదా! దీనిని శాస్త్రబద్ధత లేని విషయమంటామా? మీరు మహాత్ములు. నాకు తెలియని విషయమును తెలుపుదురని కోరుచున్నాను.

**మహర్షి :–** శభాష్ రాఘవా! నీ ప్రశ్నలో హేతుబద్ధత ఉన్నది. అంతేకాక నీవు సవినయముగా అడుగుచున్నావు. కావున ఈ విషయములోని అశాస్త్రీయతను తెలుపుచున్నాను విను. కాలమనునది కూడా పేరే కదా! పేరున్న కాలమునకు రూపము లేదు కదా! అందువలన రూప నామములు అశాస్త్రీయమని చెప్పుచున్నాను.

**రాఘవ :–** మహాత్మా! మీరు చాలా మేధావులు. పేరున్నంత మాత్రమున రూపముండదని ఒక్కమాటలో తేల్చి చెప్పారు. అంతేకాక అనాథగా, అగౌరవముగా బ్రతుకుచున్న నన్ను ఆదరించి మాట్లాడుచూ నాకు ఎంతో సంతోషమును కలిగించారు. సమాజములో అందరూ నన్ను హేళనగా

చూచినప్పటికీ, గొప్పవారైన మీరు నాకు విలువనిచ్చి మాట్లాడించడము, నా అదృష్టముగా భావించుచున్నాను. మీకు నన్ను గురించి, నా జన్మ రహస్యమును గురించి తెలుసునన్నారు. దయచేసి నా జన్మరహస్యమేమిటో తెలుపమని మిమ్ములను కోరుచున్నాను.

**మహర్షి :-** రాఘవా! నీవు చాలా అదృష్టవంతునివి. బయట సమాజము నిన్ను హేళనగా, అసమర్థునిగా చూడబట్టియే కదా! నీవు ఇక్కడికి చేరగల్గినది? వారు అలా చూడకపోతే నీవు కూడా ఆ సమాజములోనే ఉండి అందరి మాదిరి జీవించేవాడివి. నీ జాపథకము ప్రకారము నీవు తులా లగ్నములో జన్మించిన వాడివి. గొప్ప పథకము కలవాడివి. నీకు ఆ విషయము తెలియదు.

**రాఘవ :-** మహాత్మా! మీరు చెప్పు మాటలలో పథకమేమిటి? జాపథక మేమిటి? నాకు అర్థముకాలేదు.

**మహర్షి :-** ముందే నిర్ణయించబడిన పద్ధతిని "పథకము" అంటాము. జా పథకము అనగా పుట్టినపుడే జీవితములో జరుగబోవు విషయములను క్రమ పద్ధతిగా నిర్ణయించబడినదని అర్థము. నీవు ఎప్పుడు ఏ కార్యములను చేయాలో, ఎప్పుడు ఏమి అనుభవించాలో, ఎప్పుడు ఏమి జరగాలో ముందే నిర్ణయించివున్న పద్ధతిని "జాపథకము" అంటాము. పూర్వము జాపథకము అను మాట కాలక్రమేపి మార్పుచెంది జాపథకములో "ప" అను అక్షరము లేకుండా పోయి, చివరకు జాథకము అను శబ్దముగా మిగిలిపోయినది. ప్రస్తుత కాలములోని పేరు ప్రకారము చెప్పితే నీ జాతకము బాగుంది అని చెప్పవచ్చును.

**రాఘవ :-** నేటికాలములో 'జాతకము'గా పిలువబడు మాట, పూర్వము 'జా పథకము' అను స్వచ్ఛమైన అర్థముతో కూడుకొని ఉండేదన్నమాట.

నా జాతకము ప్రకారము నేను తులా లగ్నములో జన్మించానన్నారు. తులా లగ్నములో జన్మించిన వారు అదృష్టవంతులనుట నాకు తెలియదు.

**మహర్షి :-** అవును రాఘవా! నీ పూర్వ జన్మ సుకృతకర్మ ఆ లగ్నములో పుట్టునట్లు చేసినది. ఎందరో గొప్ప జాథకము కలవారందరూ తులా లగ్నములోనే జన్మించారు. ఇదిగో నా ప్రక్కనవున్న ఈ పాము కూడా తులా లగ్నములో జన్మించినదే.

**రాఘవ :-** జన్మ ఫలము, జాథక ప్రాబల్యము ఇతర జీవరాసులకు కూడా ఉండుననుట నాకు ఆశ్చర్యముగా ఉన్నది. అయితే ఈ పాముకు కూడా జాపథకము ఉన్నట్లేనా?

**మహర్షి :-** అవును షట్ శాస్త్రములు ప్రతి జీవరాసికీ వర్తిస్తాయి. ఆరు శాస్త్రములలోని జ్యోతిష్యశాస్త్రము అన్ని జీవరాసులకూ వర్తిస్తుంది. కర్మ అనబడు పాపపుణ్యములు ప్రతి జీవరాసికీ ఉన్నాయి. కర్మ చేతనే ప్రతి జీవీ పుట్టుచున్నది. ఈ పాము కూడా నీవలె మానవజన్మలో ఉండి, ఆ జన్మనుండి ఈ జన్మకు వచ్చినది. దాని కర్మప్రకారము చివరకు నా వద్దకు చేరినది.

**రాఘవ :-** ఈ విషయము ఆసక్తిగావుంది. అభ్యంతరము లేకపోతే ఈ పాము యొక్క పూర్వజన్మ విషయము తెలియజేయుదురని కోరుచున్నాను.

**మహర్షి :-** తప్పక తెలియజేస్తాను విను. ఈ జీవి గతజన్మలో గొప్ప ధనికుడుగా ఉండేవాడు. ఇతనికి ఎన్నో భూములూ, గృహములూ ఉండడమేకాక విపరీతమైన డబ్బు కూడా ఉండెడిది. ఈ జీవికి ఎంత ఉండినా ఇంకా సంపాదించవలెనను ఆశ ఎక్కువగా ఉండెడిది. కష్ట పడకుండా అందరికంటే సులభముగా సంపాదించుటకు వడ్డీ వ్యాపారమును ఎన్నుకొన్నాడు. డబ్బును వడ్డీలకిచ్చి చక్రవడ్డీల రూపములో ఇతరుల శ్రమను

దోచెడివాడు. ఇతని వద్ద డబ్బులు తీసుకొన్న ఎందరో విపరీతముగా పెరిగిన వడ్డీలతో తిరిగి డబ్బు చెల్లించలేని స్థితిలో వారి ఆస్తులను సహితము ఇతనికే వదలిపెట్టేవారు. అట్లు తమ జీవనాధారమైన ఆస్తులను బాధపడుచు వారు అప్పగిస్తుంటే తనకు ధనమే ముఖ్యమనుకొన్న ఈయన తనకు వచ్చు ధనమునే చూచాడు. కానీ తనకు వచ్చు పాపమును ఏమాత్రము గుర్తించలేదు. పాపపుణ్యములను గురించి ఎవరైనా చెప్పినా, నాకు అంతమాత్రము తెలియదా అని సమాధానము చెప్పెడివాడు. ఒకవేళ ఏదైనా పాపము వస్తే తాను చేయు పూజలకు రాముడు తనను రక్షించుతాడని అనుకొనెడివాడు. తాను నమస్కరించు శ్రీరాముని దయవుండుట చేత తాను ఎంతో ధనము సంపాదించాననీ, తాను చేయు వడ్డీ వ్యాపారము దేవునికి సమ్మతమైనదేననీ, అందువలన తనకు పాపమే రాదనీ అనుకొనెడి వాడు.

ఈ విధముగ జరుగుచున్న కాలములో ధనికుని దగ్గర అప్పు తీసుకొన్న ఒక నిర్భాగ్యుడు తన వద్ద డబ్బులేనివాడై, తనకు ఏ ఆదాయము లేనివాడై, పెరుగుచున్న వడ్డీకి భయపడి ధనికుని వద్దకు వచ్చి "నేను ఆదాయమూ లేనివాడనైనాను, నాయందు ఏ దురలవాట్లు లేవు, అయినా నా కర్మవశాత్తు నా పొలములో పంట పండని కారణమున నీకు ఏమాత్రము డబ్బు జమకట్టలేని స్థితి ఏర్పడినది. నా భూమి అంతయూ అమ్మినా నీ బాకీ అసలుకు సరిపోదు. నేను ఇంకా ఎక్కడైనా అడుక్కొని నీ బాకీ అసలును కట్టగలను. వడ్డీని కట్టలేను, నీవు వడ్డీని వదలిపెట్టు" అని అడిగెను. అందులకు ధనికుడు ఏమాత్రము ఒప్పుకోలేదు. అటువంటి సమయములో నిరుత్సాహముగా కాలము గడుపుచున్న పేద రైతును ఒక మహర్షి చూచి, అతని బాధను గ్రహించి పేద రైతును ఓదార్చి ధనికుని పిలిచి ఈ విధముగ చెప్పెను.

**యోగి :-** డబ్బున్న వానివద్ద నీ పద్ధతి ప్రకారము డబ్బును లాగినావాడు బాధపడడు. కానీ లేనివానిని పీడించితే వాడు అహర్నిశలు బాధపడు చుండును. అలా నీవు ఇతరులను బాధపెట్టడము వలన కంటికి కనిపించని పాపము నీకు చేరును. నీవు కంటికి కనిపించు ధనము మీదనే ఆశ కల్గి వున్నావు. దానివలన కనిపించని పాపమొస్తుందని నీకు తెలియదు. ఇటువంటి పనులు మానుకో.

(అని యోగి చెప్పగా ఆయన మాటలను ఈ ధనికుడు తేలిగ్గా తీసుకొని, యోగి మాటను లెక్కచేయక తనకు ధనమే ముఖ్యమనీ, తాను చేయుచున్నది న్యాయబద్ధమైన వ్యాపారమనీ బదులు చెప్పెను. ధనికుని మాటలువిన్న యోగి ఈ విధముగా చెప్పెను.)

**యోగి :-** నేను చెప్పు మాటలు నీకు విలువగా కనిపించలేదు. నీవు శాశ్వతమనుకొన్న నీ జీవితము అశాశ్వతమైనది. ఎవరూ శాశ్వితముగా ఒకే జన్మలో ఉండలేరు. నీవు డబ్బే ముఖ్యమనుకొనినా అది కొంచెము కూడా నీవెంట రాదు. నీవు చేసుకొన్న కర్మ మాత్రము నీవెంట వస్తుంది. నాది, నావారు, నా ఆస్తి అను మోహగుణముతో నీవు చేయు ఇటువంటి కార్యములు పాపమునే తెచ్చిపెట్టును. మానవజన్మలోనికి వచ్చినది జ్ఞానధనము సంపాదించుకోవడానికిగానీ, ప్రపంచ ధనము అక్రమ మార్గములో ఆర్జించడానికి కాదు. నీవు ప్రపంచ ధనములో ధనికునివైనా ప్రయోజనము లేదు. జ్ఞానధనములో ధనికునివి కాకపోతే నీ జీవితమే వ్యర్థమగును. జ్ఞానధనము వలన జీవితమునకు సాఫల్యమేర్పడును. అట్లు లేనినాడు నీవు భూమికి రాజైనా ప్రయోజనము లేదు. నీవు చేసుకొన్న పాపము తర్వాత జన్మలో బాధించును.

(ఈ విధముగా చెప్పిన యోగి మాటలను ధనికుడు వినకుండా వీరు నన్ను మాటలతో మభ్యపెట్టుచున్నారు. వీరికంటే నాకు ఎక్కువ తెలివియున్నది. వీరి మాటలు విని మోసపోయేంత మూర్ఖున్నికాదను కొనెను. ఆ ధనికుని ఉద్దేశ్యమును గ్రహించిన యోగి నేను చెప్పినా విననపుడు నీ ఇష్టప్రకారమే నడుచుకొమ్మనెను. ఆ యోగి చెప్పిన మాటలను కూడా వినని ఈ సర్ప రూప జీవి, పాపభీతి లేకుండా తన ఇష్టమొచ్చినట్లు ఇతరుల శ్రమను వడ్డీల రూపములో దోచుకొనుచూ ఇంతకంటే ఆనందము లేదనుకొని జీవింపసాగెను. తన మాటలను కూడా లెక్కించని ధనికుని ఎడల చికాకుపడి, ఇటువంటి మూర్ఖులకు ఎంత జ్ఞానము చెప్పినా ప్రయోజనములేదని తలచి, తన జ్ఞానమునకు కూడా విలువివ్వని అతనిని ప్రపంచరీత్యా ఏమీ చేయలేని యోగి, తన మనోసంకల్ప బలము చేతనే ఇతని చేత జ్ఞానము నాశ్రయింపజేస్తానని తలచి, యోగాసీనుడై కళ్ళు మూసుకొని కూర్చొని " నా మాట వినని ఈ మూర్ఖునికి చాలా కాలము బ్రతుకగల్గు పాము జన్మ లభించవలెను" అని తన మనస్సు చేత బలమైన సంకల్పమును మెదడు నుండి శూన్యములోనికి వదలెను. ఆ సంకల్పము కంటికి కనిపించనిదై తీక్షణమైన బాణమువలె ప్రయాణించి, ధనికుని వెదకి అతనిలోనికి దూరిపోయి అతని తలలో సూక్ష్మముగనున్న కర్మచక్రములో ప్రతిష్ఠింపబడెను.

ఆ రోజు యోగి సంకల్ప బలమే నేడు ధనికున్ని పాము జన్మకు తెచ్చినది. ఈ జన్మ రాకముందు ధనికునిగావున్న రోజులలో విపరీతముగా ధనమును సంపాదించినా చివరికి మనశ్శాంతి లేకుండా పోయినది. మధ్య వయస్సు నుండే మానసిక బాధను అనుభవించాడు. చక్కెరవ్యాధి రావడముతో తిండి తినడములో వైద్యులు నిబంధనలు పెట్టారు. పేదవాడు

కూటికి గతిలేక కొంచమే తిన్నట్లు తినవలసి వచ్చినది. డబ్బుతో సర్వము లభించుననుకొన్న ధనికునికి ధనమున్నప్పటికీ సరియైన తిండికూడా తినలేని కాలమొస్తుందను సత్యము మొదటిగా తెలిసింది. కొద్దిరోజులకు మూత్ర పిండములు (కిడ్నీలు) పని చేయడము తక్కువైనదనీ, ఆహారములో ఉప్పును వాడవద్దని చెప్పిన వైద్యుల సలహామేరకు రుచిలేని తిండి తినవలసి వచ్చెను. డబ్బువుండి కూడా పశువులవలె రుచిలేని తిండి తినడము వలన, చనిపోయిన తర్వాత ధనము వెంటరాదను మాట అటుంచి, ధనముండి కూడా తినుటకు అర్హతలేదనీ, కర్మ ప్రత్యక్షముగా చూపుచున్నదనీ ధనికుడు గ్రహించాడు. అట్లే కొంతకాలము గడువగా తనవారనుకొన్న సొంత కొడుకులే, తన సొమ్మును వాడుకొనుచూ, తన ఆస్తిని అనుభవిస్తూ తన మాటను లెక్కచేయకుండా పోవడమేకాక, నోరు మూసుకొని ఊరక కూర్చోమని గద్దించసాగారు. ఆ పరిణామములకు బాధపడిన ధనికునికి ఆనాటి యోగి మాటలు జ్ఞాపకము వచ్చాయి. ఆనాడు మహర్షి చెప్పిన జీవిత సత్యములను వినకుండా, పైగా వారినే తెలివితక్కువ వారిగా లెక్కించు కొన్నందుకు మనస్సులోనే బాధపడినాడు. ఆనాడు ఆయన మాటలు పెడ చెవిన పెట్టినందుకు యోగిని క్షమాపణ కోరవలెనని, ఆయన పాదముల మీదపడి ఏడ్వాలనుకొన్నాడు.

ఆ విధముగా తలచిన ధనికుడు తన వారిమీదా, తన ఆస్తిమీదా, తన ధనముమీద విరక్తికల్గినవాడై యోగిని వెదకుచూపోయాడు. కొంత కాలము తర్వాత యోగివద్దకు చేరగల్గి, ఆయన పాదముల మీదపడి తన తప్పును క్షమించమనీ, తాను నమ్ముకొన్న ధనము ఎలాంటి సుఖమును ఇవ్వలేదనీ, మీ మాటవినని నాకు ఎంత పాపమొచ్చినదోనని ఏడ్వసాగెను. దానిని చూచిన యోగి ధనికునితో ఇలా అన్నాడు.)

**యోగి :-** అగ్ని కాలుతుందని చెప్పినా నీవు వినలేదు. మా మాటలనే అవివేకముగా, నీ యోచనలనే వివేకముగా అనుకొన్నావు. ఇప్పుడు అనుభవానికి వచ్చిన దానికి మా మాటలు జ్ఞాపకమొచ్చాయి. అయినా నీవు అనుభవించినది ఈ జన్మలో చేసుకొన్న పాపము కాదు. ఇది అంతయు పోయిన జన్మలో చేసుకొన్నదే. ఈ జన్మలో చేసుకొన్న పాపమును రాబోయే జన్మలలో అనుభవించవలసి వస్తుంది. అది ఎంత భయంకరముగా ఉంటుందో చెప్పలేము. మానవుడు తనకున్న నీచమైన తెలివియే గొప్పదను కుంటాడు. జ్ఞానులు చెప్పిన మాటలను లెక్కించడు. అంతేకాక నాకు ఆధ్యాత్మికము అంటే సరిపోదు అనుచూ, జ్ఞానులను కూడా కించపరచి మాట్లాడుచుంటాడు. **జ్ఞానులు చెప్పు మాటలు జీవిత సత్యాలనీ, జీవితము తన ఇష్టమొచ్చినట్లు జరుగదనీ, తన జీవితమును కర్మప్రకారము నడిపించు శక్తి ఒకటున్నదనీ, ఆ శక్తిని తెలుసుకోవడమే ఆధ్యాత్మికమనీ తెలియక,** తాను చేయు ఎంత పెద్ద ప్రపంచ పనులైనా పొట్టకూటి కొరకేనని అనుకోక, అత్యున్నతమైన ఆధ్యాత్మికమునే తక్కువ చేసి మాట్లాడుచుందురు. నేను ముందే చెప్పిన జ్ఞానము నీకు జ్ఞప్తికి వచ్చింది. ఇప్పటికైనా ప్రపంచ రీత్యా ఆలోచించడము తప్పని తెలిసింది. ఇప్పుడు నీవు ఏమి బాధపడినా చేసుకొన్న పాపము పోదు. దానిని అనుభవించక తప్పదు. నీవు నావద్దకు వచ్చి ఏడ్చినా నేను నిన్ను ఏమీ చేయలేను.

**ధనికుడు :-** స్వామీ! మీరు అలా అంటే నేను భరించలేను. నన్ను మీరే రక్షించాలి, జ్ఞానులైన మీరు నేను ఈ పాపమునుండి బయటపడి మరు జన్మలో డబ్బులేకున్నా శాంతిగా బ్రతుకుటకు మార్గమును చూపించండి. ఇప్పటి నుండి మీరు చెప్పినట్లు నడుచుకుంటాను.

**యోగి :- (**నవ్వుచూ) కష్టమొచ్చినపుడు మమ్ములను మీరు మాన్యులంటారు.

ఏ కష్టమూ లేనపుడు మీరే మమ్ములను సామాన్యుల క్రిందికి జమకట్టి హేళనగా మాట్లాడుతారు. ఇపుడు నీవు నన్ను గొప్పవాడనినా, ఎంత పొగడినా నేనేమీ చేయలేను. నీ కష్టమునుగానీ, నీ బాధనుగానీ లేకుండా చేసుకొనుటకు నీవే ప్రయత్నించవలెను. అది నీ చేతిలోని పనియే. ఇప్పటి నుంచయినా నీ శేష జీవితమును దైవచింతనతో పవిత్రముగా గడుపుము. అలా చేయుట వలన నీవు క్రొత్తగా పాపమును సంపాదించుకోలేవు. పాత దానిని నీవు తప్పక అనుభవించవలసివున్నది. దాని బాధ కూడా పోవాలంటే ఒక విధముగా చెప్పితే అది పూర్తిగా పోదుగానీ, సాధ్యమున్నంతవరకు దానిలో అనుభవించు శాతమును తగ్గించుకోవచ్చును. అలా తప్పించుకొను విధానము ముున్ముందు నీకే తెలియగలదు. ఇప్పుడు నేనిచ్చు సలహా, "నీవు జ్ఞానమార్గములో జీవించు." ఇంతకంటే నేనేమీ చెప్పలేను. (ఈ విధముగా చెప్పి ధనికున్ని యోగి తనవద్దనుండి పంపివేసెను.)

**మహర్షి :-** చింతాక్రాంతుడైన ధనికుడు తాను చేసుకొన్న పాపమును తలచు కొనుచూ, తాను ధనార్జన ఆశతో ఎంత నీచమైన బ్రతుకు బ్రతికానని అనుకొనుచూ, ఇప్పటినుండి మహర్షి చెప్పినట్లు బ్రతుకవలెనని నిర్ణయించు కొనెను. అలా అనుకొన్న అతను ఆనాటినుండి ఇతరులను నొప్పించక తన చేతనైన సహాయము చేయసాగెను. అంతేకాక అక్రమముగా లాగుకొన్న ఇతరుల ఆస్తులను వారికే ఇచ్చివేసెను. యోగి మాట ప్రకారము తన శేష జీవితమును జ్ఞానమార్గములో గడుపసాగెను. అలా కొంతకాలము వరకు జీవించి మరణమును పొందెను. యోగి సంకల్ప శాపము వలన పాము జన్మలోనికి వచ్చి, అడవిలో అరువది సంవత్సరములు అనేక కష్టములను అనుభవించి చివరకు నావద్దకు చేరి నాకు సేవ చేయుచూ కాలము గడుపుచున్నాడు.

**రాఘవ :–** మహాత్మా! ఒక ప్రశ్న అడుగుచున్నాను తప్పయితే క్షమించండి. మీరు చెప్పిన మాటలో  ఈ పాము పూర్వజన్మలో పాపము చేసుకొన్న ధనికుడనీ, అతని కర్మ విమోచనమునకే మీ వద్దకు వచ్చాడని నాకు అర్థమైనది.  ఇతను పామురూపములో ఉండి మీకు సేవ ఎట్లు చేయు చున్నాడనునది నాకు అర్థము కాలేదు.

**మహర్షి :–** సేవ ఎవరైనా, ఏ విధముగానైనా చేయవచ్చును.  ఈ పాము రూపములోనున్న ఇతను ఇక్కడేవుంటూ  కీటకములను నావద్దకు రాకుండా చూచుకొంటున్నాడు.  అంతేకాక తన నోటిలోని మణిని బయటపెట్టి నేనున్న ఈ స్థలములో వెలుగుండునట్లు చేశాడు.  ఈ విధముగా తనకు చేతనైన సేవను చేయుచున్నాడు.

**రాఘవ :–** ఎక్కడో అడవిలో పుట్టి పెరిగిన ఈ పాము,  ఈ గుహలోనున్న మీవద్దకు ఎలా చేరగలిగింది?

**మహర్షి :–** గతజన్మలో ధనికుడైన జీవి, ఈ పాము రూపములో అడవిలో పుట్టడమూ, అడవిలోనే తిరగడము జరిగింది.  ఈ పాము మగదికాగా, మరొక ఆడపామును దాదాపు యాభై సంవత్సరములు తోడు చేసుకొని జీవించినది.  యుక్తవయస్సునుండీ తోడుగా గడిపిన ఆడపామును ఒక దినము వేటగాడు పట్టుకొని పోయాడు.  ఆ విషయము ఈ పాముకు తెలియదు.  తన తోడు పాము కనిపించక పోవడము వలన ఈ పాము ఆ పామును వెదకుచూ వచ్చి చివరకు నావద్దకు చేరినది.

**రాఘవ :–** మహాత్మా! ఒక సంశయము. ఇది నాగుపాము కదా!  నాగుపాము అంటే ఆడపామనీ, జెరిపోతు అంటే మగ పామనీ ఇతరులు చెప్పగా విన్నాను.  ఇపుడు మీరు ఈ నాగుపాము మగదనీ, దీనికి ఆడపాము తోడుగా ఉండేదనీ అంటున్నారు.  నాగుపాములలో మగపాము ఉంటుందా?

**మహర్షి :-** రాఘువా! నీకు తెలియని విషయములు ఎన్నో ఉన్నవి. నీకు తెలియని రహస్యములన్నియూ తెలియబడుతాయి. నీకు తెలిసిన రహస్యములు లోకమునకు తెలియబడుతాయి. నీవు అన్ని విషయములందు ఆసక్తి కల్గి తెలుసుకొందువు. ప్రతి విషయములోని సత్యము నీకు తెలియ బడును. అందువలన నేను నిన్ను "సత్యాన్వేషి" అంటున్నాను. ఇపుడు ఈ పాము గురించిన విషయము తెలిపెదను విను. భూమండలములోని పాములలో మొత్తము 80 జాతులున్నవి. ఇప్పటికి ఏడు లేక ఎనిమిది జాతులు అంతరించిపోయాయి. మిగిలిన జాతులలో నాగుపాము అనునది ఒక జాతికాగా, ఈ నాగుపాము జాతిలో పదకొండు (11) రకములున్నవి. ఈ పదకొండు జాతులలో పదునెనిమిది (18) అడుగుల పొడవున్న నాగరాజు (కింగ్‌కోబ్రా) అనునది పెద్ద జాతికాగా, మిగిలిన పది జాతులలో మణిగల పాము ఉత్తమమైనది. ఒకటి మణిజాతికాగ మిగతా తొమ్మిది (9) జాతుల నాగు పాములున్నవి. పదకొండు జాతులలోనూ ఆడ, మగ రెండు రకములూ ఉంటాయి. నాగుపాము పడగలనుబట్టి అది ఆడపామా లేక మగపామా అని గుర్తించవచ్చును. మగపాము పడగ గుండ్రముగా ఉండును. ఆడపాము పడగ గుండ్రముగా ఉండక, ఎడమవైపు కొలత కొద్దిగ తక్కువయుండును. ఈ జాతియందు ఆడ, మగ ఉన్నవనుటకు తార్కాణముగా నాగులకట్ట దగ్గరున్న నాగప్రతిమలను చూడవచ్చును. నాగప్రతిమ ప్రతిష్టవున్న ప్రతి చోటా రెండు పడగవిప్పిన పాములు పెనవేసుకొన్నట్లు ప్రతిమ ఉండును. నాగప్రతిష్టను చూచిన వారికి ఎవరికైనా సులభముగా అర్థమగుటకు పెద్దలు అలా నాగప్రతిమను ఉంచారు. ఇకపోతే జెరిపోతు అనునది కూడా ఒక ప్రత్యేకమైన తెగ పాములున్నవి. జెరిపోతు తెగలో కూడా ఆడ, మగ పాములుండును. జెరిపోతు అంటే మగపాము

అని అర్థముకాదు. **పోతు** అను పదము వలన దీనిని మగపాము అనుకోకూడదు. ఈ జాతి పాములు ఎక్కువ వేగముగా పోవునవి అగుట వలన వాటికి ఆ పేరు వచ్చినది. ఏ పనిలో అయినా బాగా చేయుదురని పేరు తెచ్చుకొన్న ఆడవారిని కూడా మగవానితో సమానముగా మనము పొగడునట్లు, వేగములో ముందంజ వేసిన దానివలన ఈ పాము జాతిలోని ఆడ, మగ అన్ని పాములనూ జెరిపోతులనడము జరగుచున్నది. జెరిపోతుల వలె నాగజాతినంతటిని నాగుపాములు అనినా, వాటిలో ఆడ మగ వేరువేరని తెలుసుకొన్నాము కదా! పాము పడగను బట్టి ఆడ, మగను గుర్తించవచ్చును అని కూడా చెప్పుకొన్నాము. అలా గుర్తించిన ఆడపామును త్రాచుపాము అంటున్నాము. అలాగే మగ పామును కోడెనాగు అంటున్నాము. దీనినిబట్టి ఇక్కడున్న ఈ పామును కోడెనాగు అనవచ్చును.

**రాఘవ :–** మహాత్మా! మీ వలన ఇంతవరకు నాకు తెలియని రహస్యమొకటి తెలిసినది. ఇలాంటి ఎన్నో విషయములను తెలుసుకోవాలని ఉంది.

**మహర్షి :–** జరుగబోవు ముందు కాలములో అన్నీ తెలియును. ఇపుడు నీ కర్తవ్యము నీవు చేయుము.

**రాఘవ :–** మీకు తెలియనిది ఏముంది? నేను సమాజములో విసుగెత్తి వచ్చినవాడిని. ఈ అడవిలోనికి వచ్చి కాలమును గడుపుచున్నాను. నా జీవితమే నాకు సమస్యయై, ఎలా బ్రతకాలో కూడా తెలియనివాడిని. జీవితములో ఏ ధ్యేయమూ లేనివాడిని, నా కర్తవ్యమేమిటో తెలియనివాడిని. మీరు చెప్పినట్లు నడువాలనునదే ప్రస్తుత నా కర్తవ్యము తప్ప, నాకు ఈ జగతిలో ఏ కర్తవ్యమూ లేదు.

**మహర్షి :-** నేను చెప్పినట్లు నడువాలన్నది నీ కర్తవ్యమైతే అలాగే చేయి. నీవు ఇక్కడినుండి దక్షిణదిశగా ప్రయాణిస్తూ పోతూవుండు. ఏదో ఒకచోట నీకు ఒక గురువులాంటి వ్యక్తి దొరుకుతాడు. అతను గొప్పయోగి. అతనిని గురువుగా చెప్పుకొనినా ఒప్పుకోడు. అందరికి దేవుడే గురువు తప్ప మనుషులు గురువుకాదు అనునది ఆయన సూత్రము. అందువలన నేను కూడా ఆయనను గురువులాంటి వాడు అన్నాను తప్ప గురువు అని చెప్పలేదు. ఆయన ఎంతో దైవజ్ఞానమును విపులముగా చెప్పు సమర్థుడు. ఆయన తప్ప ఆధ్యాత్మికవేత్త ప్రస్తుత కాలములో ఎవరూ లేరనియే చెప్పవచ్చును. ఇప్పటి కాలములో ఆధ్యాత్మికము మీద ఎవరికీ ఆసక్తి లేదు. కనుక ఆయన ఎవరికీ తనకు తెలిసిన ఆత్మజ్ఞానమును చెప్పడము లేదు. జిజ్ఞాస ఉన్న వారికే ఆధ్యాత్మికము అవసరము. జిజ్ఞాస లేనివారికి ఆదాయము అవసరము. నేడు అందువలన ఎవరూ ఆధ్యాత్మిక కేంద్రమైన అసలైన యోగులవద్దకు పోకుండా ప్రపంచ ధనమును కల్గించి, మహత్యములు చూపు బాబాల వద్దకు పోవుచున్నారు. **కొందరైతే ఏది ఆధ్యాత్మిక నిలయమో, ఏది ఆదాయ నిలయమో తెలియక పొరపడుచున్నారు.** అటువంటి చిక్కులు ఏవీ లేకుండా నేను చెప్పు గురువు నీకు దొరుకుతాడు. ఆయన ద్వారా ధర్మములను తెలుసుకో. తెలిపెడి శక్తి ఆయనకున్నది, తెలుసుకొనే ఆసక్తి నీకున్నది. నీవు తెలుసుకొన్న ధర్మములను ఇతరులకు బోధించు, అధర్మములను ఖండించు. అలా అధర్మములను ఖండించుట వలన నీకు కొందరు శత్రువులు కూడా తయారగుదురు, అయినా ఫరవాలేదు. నీకేదైనా ఆపద సమయమువస్తే అక్కడికి ఈ పాము వచ్చి నిన్ను కాపాడుతుంది. నీవు ఇక్కడినుండి పోయిన కొంతకాలమునకు నీవున్న చోటికే ఈ పాము కూడా వస్తుంది. అయితే ఈ పాము ఎవరికీ కనిపించక రహస్యముగా ఉంటూ నీకు అండగా ఉంటుంది. ధైర్యముగా పో...

**రాఘవ :-** మహాత్మా! మీ దర్శనము నాకు తిరిగి ఎప్పుడు లభిస్తుంది?

**మహర్షి :-** అష్టగ్రహ కూటమి వచ్చినపుడు నేనే నీకు కనిపిస్తాను. నీవు ఇక్కడికి రానవసరములేదు. నీవు పోవునపుడు పై రంధ్రమును మూసిపో.

(ఈ విధముగ రాఘవ ఆ యోగివద్ద సెలవు తీసుకొని బయటికి వచ్చి, తాను తీసిన రంధ్రమును ముందున్నట్లు ఇటుకలతో మూసి, మన్ను కప్పి ఎవరికీ కనిపించనట్లు చేసెను. అంతలో తెల్లవారిపోయింది. సూర్యుడు తూర్పు దిక్కున కనిపించసాగాడు. అప్పుడు రాఘవ దక్షిణదిశగా ప్రయాణమును సాగించెను. ఉదయవేళలో అడవి దృశ్యముల ప్రకృతి సౌందర్యము ఎంతో ఆహ్లాదముగా కనిపించుచుండెను. రాఘవ ముందుకు సాగుకొలది ఎన్నో క్రూరమృగములు కనిపించిననూ, అవి రాఘవను వింతగా చూస్తూ, రాఘవను ఏమీ అనకుండా వింతగా చూస్తూ నిలబడినవి. క్రూర మృగములు సహితము తనమీద దాడిచేయక నిలబడి చూడడము మహర్షి యొక్క ఆశీర్వాదమేనని రాఘవ మనస్సులో అనుకొని ముందుకు సాగి పోవుచుండెను. అట్లు చాలా దూరము పోయిన తర్వాత ఎవరో పెద్దగా అరుస్తున్నట్లు వినిపించెను. ఆ అరుపు తనకు దగ్గరగానున్న పొదలచాటునే ఉన్నది. ఆ అరుపు వలన ఎవరో ఏదో ఆపదలోనున్నట్లు గ్రహించిన రాఘవ పరుగున అక్కడికి చేరాడు. అక్కడ ఒక ఎలుగుబంటి (భల్లూకము) ఒక యువకుని గాయపరుస్తూ కనిపించినది. ఆ యువకుడు ప్రతిఘటిస్తున్నా ఆ భల్లూకము లెక్కచేయలేదు. ఆ దృశ్యమును చూచిన రాఘవ వెంటనే చెట్టుకొమ్మను త్రుంచి, యుక్తిగా భల్లూకము యొక్క మూతిమీద కొట్టాడు. మూతిమీద దెబ్బ తగలగానే భయపడిన ఆ ఎలుగుబంటి రాఘవను చూచి పారిపోయింది.

ఆ సమయమునకు రాఘవ అక్కడికి రాకపోయివుంటే, ఆ యువకు నికి ప్రమాదము జరిగివుండేది. ఆ యువకుని చేతి గాయమునుండి రక్తము కారుట చూచిన రాఘవ వెంటనే తన పంచెనుండి కొంత గుడ్డను చించి అతని చేతికి కట్టాడు. అప్పుడు ఆ యువకుడు రాఘవతో ఇలా అన్నాడు.)

**యువకుడు :-** నీవు దేవునివలె సమయానికి వచ్చి రక్షించావు. సమయానికి నీవు రాకపోతే ఈపాటికి నేను మరణించి ఉండేవాడిని. నా గురువు సమయానికి నిన్ను పంపాడు. లేకపోతే ఈ అరణ్యములో నన్ను ఆదుకొను వారెవరున్నారు.

**రాఘవ :-** నీ గురువు ఎవరు? నీవు ఎందుకు అడవిలోనికి వచ్చావు?

**యువకుడు :-** రాజయోగానంద స్వామి మా గురువుగారు. నేను మా గురువుగారి ఆశ్రమమునకు వంట కట్టెలకొరకై నిన్నటి దినము ఈ అడవిలోనికి వచ్చాను. వంటకట్టెలను మోపుకట్టుకొని బయలుదేరు సమయములో దాహము అయింది. అపుడు కట్టెల మోపును ఒకచోట పెట్టి నీటికై వెదకుచూ వచ్చి, నీరు కనపడగా నీరు త్రాగి తిరిగి కట్టెల మోపు పెట్టిన స్థలమునకు పోవాలనుకొని దారితప్పి పోయాను. దారితప్పి ఇంకా కొంత దూరము అడవిలోనికి వచ్చాను. రాత్రంతయూ ఈ అడవిలోనే గడచినది. వర్షము వచ్చి తడిసిపోయి ఆకలిగా ఉన్నా నేను బాధపడలేదు. తెల్లవారింది కదా! అని దారికోసము వెదకుచూ ఉంటే, ఈ ఎలుగుబంటి నామీద దాడి చేసింది. సమయానికి నీవు వచ్చావు.

(అప్పుడు రాఘవ ఆ యువకునికి ఓదార్పుగ ధైర్యమును చెప్పి తన వెంట రమ్మని చెప్పి, అతనిని పిలుచుకొని దక్షిణదిశగా రాసాగాడు. అలా కొంతదూరము ఒక గంటసేపు నడచిన తర్వాత ఒకదారి దొరికింది.

ఆ దారి పడమర దిశనుండి వచ్చి దక్షిణమువైపు మలుపు తిరిగివున్నది. రాఘవ పోవలసింది కూడా దక్షిణదిశయే, కావున ఆ దారివెంట దక్షిణ దిశగా నడువసాగెను. అలా ఒక గంటకాలము నడువగా ఆ పరిసర ప్రాంతమును గాయపడిన యువకుడు గుర్తించాడు. ఇంకాకొంత దూరము పోతే తమ ఆశ్రమము ఉన్నదని చెప్పాడు. అలా ఒక అరకిలోమీటరు దూరము నడువగా రాజయోగానంద స్వామి వారి ఆశ్రమము కనిపించినది. అప్పుడు రాఘవకు గుహలోని యోగి చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చినవి. శివ అను పేరుగల ఆ యువకుడు రాఘవను రాజయోగానంద స్వామి వారికి పరిచయము చేశాడు. తర్వాత జరిగిన విషయమంతా చెప్పి రాఘవయే ఆ ఎలుగుబంటి నుండి కాపాడాడు అని చెప్పాడు. ఆశ్రమము నకు తిరిగి రాని శివకొరకు ఎదురుచూచిన రాజయోగానంద స్వామి రాఘవ చేసిన సహాయమునకు రాఘవకు ధన్యవాదములు తెలిపెను. అందులకు రాఘవ స్పందించి "మీరు నాకు గురువులు. నాకు ధన్యవాదములు చెప్పించు కొను స్థోమతలేనివాడను" అని అన్నాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

ఆ రాత్రివేళ మర్రిచెట్టు క్రింద రాఘవను వదలి తమ గూడెమునకు వెళ్ళిన ఆటవికులు, రాఘవను గురించి యోచిస్తూ వర్షములో తడిసిపోయి ఉండుననుకొనిరి. ఉదయమే లేచి, రాత్రి రాఘవను మర్రి చెట్టువద్ద వదలి వచ్చిన విషయమును తమ కులపెద్ద, గూడెము నాయకుడు అయిన మల్లుదొరకు చెప్పిరి. రాఘవ రానందుకు కారణము తెలియక పోవుట వలన మల్లుదొర తన మనుషులను రాఘవను వెదకుటకు పంపెను. అడవిలోని మర్రిచెట్టు వద్దకు పోయిన ఆటవికులు అక్కడ రాఘవ లేనందు వలన ఆశ్చర్యపోయి, రాఘవను అడవి మృగములు ఏవైనా చంపాయేమోనని

అనుమానించారు. అలా జరిగివుంటే అచట మృగముల పాదముల గుర్తులుంటాయని వాటికోసము వెదికారు. వర్షము వచ్చి తడిగానున్న ఆ ప్రాంతములో ఏ మృగము యొక్క పాదగుర్తులూ కనిపించలేదు. అలా వెదుకుచున్న సమయములో రాఘవ పాదగుర్తులు వారికి కనిపించాయి. రాఘవ పాదగుర్తులు దక్షిణ దిశకు పోయినట్లు తెలుసుకొన్న ఆ చెంచువారు, ఆ విషయమును తమ కులపెద్దయిన మల్లుదొరకు తెలియజేశారు. ఆ విషయమును తెలుసుకొన్న మల్లుదొర రాఘవ అదే పనిగా దక్షిణమువైపు ఎందుకు పోయాడు? అని యోచించి, ఆ విషయము అర్థముకాక చివరకు తన వారిని రాఘవను వెదికే దానికి పొమ్మని చెప్పాడు. అప్పుడు ఎనిమిది మంది ఆటవికులు తమ ఆయుధములైన బాణములను తీసుకొని రాఘవను వెదకుటకు బయలుదేరారు. మొదట మర్రివృక్షము వద్దకు వచ్చి అక్కడనుండి ప్రారంభమైన రాఘవ పాద గుర్తులను అనుసరిస్తూ ముందుకు పోసాగిరి.

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(రాఘవ చెప్పిన మాటలను విన్న రాజయోగానంద స్వామి ఆశ్చర్య పడుచూ ఇలా అన్నాడు)

**రాజయోగా :-** నేను నీకు గురువునా! ఇంతకు ముందు నీ ముఖమును నేను చూడలేదు. నేను నీకు ఎలా గురువునగుదును.

**రాఘవ :-** అవును. ఇప్పటినుండి నాకు మీరు కాబోయే గురువులు. అందువలన మిమ్ములను వెదకుచూ వచ్చాను. మార్గములో మీ భక్తుడు శివ కనిపించాడు. శివ వలన మీ వద్దకు చేరుటకు నాకు మరీ సులభమైనది.

**రాజయోగా :-** నేను నిన్ను ఎప్పుడూ చూడలేదు. నీవు నన్ను ఎప్పుడూ చూడలేదు. నా పరిచయమే లేనివానివి. నీవు నన్ను వెదకుచూ రావడ

మేమిటి? అలా వచ్చావంటే ఇంతకు ముందు నా విషయము నీకు తెలిసివుండాలి. నా విషయము నీకు ముందే తెలుసా?

**రాఘవ :-** అవును స్వామీ! మీ గురించి నాకు ముందే తెలుసు. ఇక్కడికి ఉత్తరముగానున్న అడవిలో ఒక మహాత్ముడు మీ గురించి తెలియజేశాడు. మీవద్దకు పొమ్మన్నాడు. మిమ్ములను మించిన ఆధ్యాత్మికవేత్త ఈ భూమిమీద ఎవరూలేరని చెప్పాడు. అందుకే నేను మీవద్దకు వచ్చాను.

**రాజయోగా :-** మహాత్ముడా! నన్ను గురించి తెలిపాడా!! అదియూ ఉత్తరముగా నున్న అడవిలోనా!!! అటు ప్రక్క అడవిలో అమాయక ఆటవికులు తప్ప ఎవరూ లేరే, ఎవరు చెప్పారు నీకు?

**రాఘవ :-** నేను చెప్పుమాట నిజమే స్వామీ! అడవిలో ఎవరికీ తెలియని ఒక మహాత్ముడున్నాడు. ఆయన బయట ఎవరికీ కనిపించకుండా భూగర్భ గుహలో ఉన్నాడు. ఆయనే మీ గురించి చెప్పాడు. అక్కడినుండి దక్షిణము వైపు పొమ్మనీ, నీకు గురువు దొరుకుతాడని చెప్పాడు. ఆయన మాట ప్రకారము మీరు నాకు దొరికారు.

**రాజయోగా :-** భూగర్భగుహలో ఉన్నాడా! భూగర్భములోనున్న ఆయనకు నా విషయమెలా తెలిసివుండును?

**రాఘవ :-** మీ ఒక్కరి విషయమేకాదు, సర్వ విషయములు ఆయనకు తెలుసు.

**రాజయోగా :-** ఆయన భూగర్భములో ఏమి చేయుచున్నాడు?

**రాఘవ :-** యోగమాచరిస్తున్నాడు. కొంత కాలమునకు బయటికి వస్తాడట.

**రాజయోగా :-** (కనుబొమ్మలు పైకి చాచి ఆశ్చర్యమును వ్యక్తము చేస్తూ)

అయితే ఆయన సాధారణ మనిషికాదు. ఏదో మహత్తర శక్తియై ఉంటాడు. ఆయన పేరు ఏమని చెప్పాడు?

**రాఘవ :-** ఆయన నాకు పేరే లేదన్నాడు. పేరుతో సంబంధమే లేదన్నాడు. పేరున్నంతమాత్రమున రూపమూ, రూపమున్నంతమాత్రమున పేరూ ఉంటుందనుకోవడము పొరపాటని చెప్పాడు.

**రాజయోగా :-** అనంతశక్తి అయిన దైవమునకు కూడ పేరేలేదు. ఆయన ఎవరో గొప్పవాడే అయివుంటాడు. సామాన్యుడైతే తన పేరును చెప్పేవాడు. ఇంతకూ నీవు ఏ ఉద్దేశముతో ఇక్కడికి వచ్చావు. నీవు స్వయముగా వచ్చావా? లేక ఆయన పంపగా వచ్చావా?

**రాఘవ :-** ఆయన పంపగానే వచ్చాను. దక్షిణదిశగా పోతే నీకు ఒక గురువు లభిస్తాడని ఆయనే చెప్పి పంపాడు. మీ వలన అన్ని సత్యములను తెలుసుకోమన్నాడు. అందువలన సత్యాన్వేషణే నా ఉద్దేశ్యము.

**రాజయోగా :-** అన్వేషిస్తానంటే వద్దంటానా! నా వలన నీ అన్వేషణ సాగుతుందంటే మరీ సంతోషము. ఇపుడు నీవు విశ్రాంతిని తీసుకో. సాయంకాలము నీ అనుమానములను తెలిపితే దానికి నేను అన్వేషణ మార్గమును తెలిపెదను.

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(ఎనిమిది మంది ఆటవికులు రాఘవను వెదకుచూ కొంత దూరము పోయిన తర్వాత వారి వెంటనున్న కుక్కలు మొరగసాగెను. అప్పుడు ఆ చెంచువారు తమకు దగ్గరగా ఏవో మృగములున్నవని తలచి వారి బాణములను సిద్ధముగా చేతిలో పట్టుకొని నిలబడిరి. అంతలో ఏనుగుల గుంపుయొక్క ఘీంకారము వినిపించెను. ఏనుగుల గుంపును తాము ఏమీ

చేయలేమని తలచిన ఆటవికులు ప్రక్కనున్న నదిలో దిగి ఈదుచూ అవతలి గట్టుకు పోయిరి. ఏనుగుల గుంపు అక్కడినుండి పోయిన తర్వాత తిరిగి ఇవతలి గట్టుకు వచ్చి రాఘవ పాదజాడల కొరకు చూచిరి. ఏనుగుల గుంపు ఆ ప్రాంతమంతా త్రొక్కిన దానివలన రాఘవ అడుగుల జాడ ఏమాత్రము కనిపించలేదు. అందువలన రాఘవ పోయిన దారి అర్థము కాకపోయెను. అపుడు ఆటవికులు తిరిగి తమ గూడెముకు పోయి ఉన్న విషయమును తమ పెద్ద అయిన మల్లుదొరకు తెలియజేశారు. అప్పుడు మల్లుదొర కొంత ఆలోచించి తమవారితో అంజనము వేసి చూడమని చెప్పెను.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(సాయంకాలము రాఘవ రాజయోగానంద స్వామి వద్దకు చేరి నమస్కరించి, కూర్చుండి, సవినయముగా తన అనుమానమును ప్రశ్న రూపములో స్వామి వారిని ఇలా అడిగెను.)

**రాఘవ :-** స్వామీ! దేశములో ఎన్నో ఆశ్రమములు గలవు. ఆ ఆశ్రమము లలో గురువులందరూ కాషాయగుడ్డలను ధరించియున్నారు. మీరు మాత్రము కాషాయ వస్త్రములను ధరించక అందరివలె సాధారణ దుస్తులనే ధరించి యున్నారు. వారికి మీకు ఏమి తేడావున్నది?

**రాజయోగా :-** జ్ఞానులలో ముఖ్యముగా ఉండవలసినది జ్ఞానము. అలాగే యోగులలో ముఖ్యముగ ఉండవలసినది జ్ఞానాగ్ని (యోగశక్తి). పైన ధరించు గుడ్డలు ముఖ్యముకాదు. పై దుస్తులు గుర్తింపుకొరకు ధరించునవే. పూర్వ కాలములో కాషాయగుడ్డలకు ఒక అర్థముండేది. కానీ నేడు వాటి అర్థము తెలియకుండా పోయినది. అర్థము తెలియనివారు కూడా కాషాయరంగు గుడ్డలను ధరించుచున్నారు.

**రాఘవ :-** పూర్వకాలములో కాషాయరంగు గుడ్డలకు ఏ అర్థముండేదో దయచేసి తెలుప ప్రార్థన.

**రాజయోగా :-** తప్పక తెలియజేస్తాను. కొన్ని చెట్ల మూలికలను నీటవేసి బాగా వేడిచేసినపుడు ఆ మూలికల సారమంతయూ నీటిలోనికి దిగును. అలా దిగిన మూలికలు లేక చెట్ల సమూలముల సారమును **"కషాయము"** అనుట మన ఆయుర్వేదవైద్యములో గలదు. అట్లే **కాలమను నీటిని జ్ఞానమను అగ్నిచే వేడిచేసినపుడు జీవితము అను మూలికసారము మనస్సుకు దిగినవాడు జీవిత కషాయమును పొందినవాడగును.** కషాయము అను మాట కాలక్రమమున కొంత మార్పుచెంది కాషాయము అను శబ్దముగా మారినది. జీవిత సారాంశము తెలిసినవాడినను గుర్తింపుకు మూలికల సారము యొక్క రంగు గుడ్డను ధరించెడివాడు. మూలికల సారము లేత ఎరుపురంగు అయిన కషాయము యొక్క వర్ణముగానే ఉండును. అందువలన అదే రంగుగుడ్డలను పూర్వము అర్థము తెలిసి ధరించెడివారు. కానీ నేడు కషాయమంటే ఏమో తెలియదు. అట్లే కాషాయరంగు యొక్క అర్థము తెలియకుండా పోయినది. అర్థము తెలియనివారు కూడా కాషాయరంగు గుడ్డలు ధరిస్తున్నారు. నేను జీవిత సారాంశమైన ఆధ్యాత్మిక మును తెలిసివాడినను గుర్తింపు నాకు అవసరములేదు. నేను ఆధ్యాత్మిక వేత్తను అని బయటికి తెలియకుండుటకు ఆ రంగు దుస్తులు ధరించలేదు.

ప్రస్తుత కాలములో కొందరు సూర్యుడుదయించు వేళ ఉన్న రంగును అనుసరించి ఆ రంగుగల కాషాయముగుడ్డలను ధరిస్తున్నామంటున్నారు. ఆ రంగు సన్యాసులకు గుర్తని అంటున్నారు. కానీ ఈ రంగుకు సన్యాసు లకు ఏమాత్రము సంబంధముగానీ, అర్థముగానీ కనిపించడములేదు. భగవంతుడు చెప్పిన భగవద్గీతలో ఆత్మసంయమ యోగము అను

అధ్యాయముయందు మొదటి శ్లోకములో *"అనాశ్రితః కర్మఫలమ్ కార్యమ్ కర్మ కరోతియః, ససన్యాసీచ యోగీచ ననిరగ్ని ర్నచాక్రియః"* అని కలదు. ఆ శ్లోకము యొక్క భావమును చూస్తే "ఫలాపేక్షలేని వాడూ, అహంకార రహితుడూ, జ్ఞానాగ్ని కలవాడూ నిజమైన సన్యాసి" అని అర్థమగుచున్నది. జ్ఞానాగ్ని కలవాడు, అహంకారరహితుడు బయట దుస్తులు ఏవి ధరించినా వాడు నిజమైన సన్యాసియే. **రంగు గుడ్డలను బట్టి సన్యాసి అనక జ్ఞానాగ్నిని బట్టి సన్యాసి అని గీతలో** చెప్పడమైనది. అందువలన గుడ్డలు ముఖ్యము కాదు. కాషాయగుడ్డలు బయటి ప్రజల గుర్తింపునకేగానీ, అంతరంగములోని ఆత్మ గుర్తింపుకుకాదని తెలియుచున్నది. అందువలన నాకు బయట ప్రజల గుర్తింపు అవసరములేదు. అందువలన నేను కాషాయగుడ్డలను ధరించలేదు. కొందరు భార్యపిల్లలను వదలుకోవడమే సన్యాసమని కూడా అనుకొను చుందురు. ఆ విధముగా అనుకోవడము కూడా తప్పే అగును. కుటుంబమును వదలుకొని, పనులు మానుకొన్నవాడు సన్యాసికాడని గీతలోనే **"నచాక్రియః"** అని కూడా చెప్పడము జరిగినది. భగవద్గీతలో భగవంతుడు చెప్పినట్లుండడము నిజమైన సన్యాసముగానీ, కాషాయగుడ్డలు ధరించడము ముఖ్యముకాదు. అందువలన ఆధ్యాత్మికమునకు రంగు గుడ్డలకు ఏమీ సంబంధములేదని తెలియుచున్నది.

**రాఘవ :-** స్వామీ! మీరు చెప్పిన విషయము, మేము చిన్నతనమునుండి రంగు గుడ్డలు వేసుకొన్నవారే సన్యాసులను ఉద్దేశమును తలక్రిందులు చేసినది. అర్థము తెలియకున్నా కాషాయంబరములు ధరించినవారు ఏదో ఒక విధముగ దేవుని మార్గమునే అనుసరించుచున్నారని అనుకుంటాను. మిగతా మనుషులకంటే కాషాయము ధరించిన వారే ఉత్తములనుకొంటాను. మీ ఉద్దేశ్యమును చెప్పండి.

**రాజయోగా :-** నీవు సత్యాన్వేషివి. కావున సత్యమునే తెలుసుకోవలయును. సత్యమును తెలుసుకొనుటకు కాషాయంబరములు ధరించిన స్వాములున్న కొన్ని ఆశ్రమములవద్దకు పోయి వారిని గురించిన సత్యమును తెలుసుకో. అప్పుడు నీకు ఏదైనా సందేహము వస్తే నన్నడుగు తర్వాత చెప్పగలను.

**రాఘవ :-** అలాగే స్వామీ! మొదట నన్ను ఏ ఆశ్రమానికి పొమ్మంటారు?

**రాజయోగా :-** ఇక్కడికి తూర్పున ఇరవై ఆరుమైళ్ళ దూరములోనున్న ఆశ్రమమునుండి ప్రారంభించు, కొన్ని ఆశ్రమములు తిరిగిన తర్వాత ఇక్కడికి వచ్చి నీ అనుభవములను చెప్పు. రేపే నీ ప్రయాణము.

× × × × × × × × × × × × × × × × × × × × × × ×

(తమ నాయకుడు మల్లుదొర చెప్పినట్లు అంజనమును చేసి దాని ద్వారా రాఘవ జాడను ఆటవికులు తెలుసుకోవాలనుకొన్నారు. అంజనమును తయారు చేయుటకు 1) తెల్ల ఈశ్వరి 2) తెల్ల బ్రహ్మదండి (తెల్ల చెండు పూవు పూయు ఎర్రి కుసుమ చెట్టు) 3) తెల్ల ఉత్తరేణి 4) తెల్ల గంజరి 5) తెల్లగన్నేరు 6) తెల్లజిల్లేడు యొక్క వేర్లను తెచ్చి, నీడన ఎండించి, ఆదివారమున ఎండిన వేర్లను నువ్వుల నూనె దీపముతో కాల్చి అవి అగ్గిగ మారినపుడు అదే నూనెలో ముంచి బొగ్గు చేసి పెట్టుకొని, తర్వాత వచ్చు బుధవారమున పచ్చకర్పూరమును కాల్చగా వచ్చిన మసిని తీసి, తర్వాత ఆరు మూలికల బొగ్గులను, పచ్చ కర్పూరము యొక్క మసిని నువ్వుల నూనెలోనే అన్నీ సమానముగా కలిపి మెత్తగా కాటుకవలె చేసుకొనిరి. అప్పటికి పూర్తిగా అంజనము తయారైనది. అలా తయారు చేసిన అంజనమును చూడాలంటే చూపుయందు దోషము లేనివాడై ఉండాలి. పిల్లికళ్ళవాడైతే బాగా చూడగలడని వారి గూడెములోనున్న ఒక పిల్లి కళ్ళవాని

చేత అంజనమును చూపించిరి. కనురెప్పకొట్టకుండా అంజనమును చూడవలెను. చూచువానికి ఆ విధముగా చూచుట అలవాటై వుండుట వలన వాడు చూడసాగెను. అంజనములో చూచువానికి మొదట, రాత్రిపూట ఆకాశము కనిపించునట్లు నల్లగా ఆకాశము కనిపించసాగెను. తర్వాత ఆకాశములో అక్కడక్కడ కొన్ని చుక్కలు (నక్షత్రములు) కనపడెను. వాటిలో ఒక చుక్కను మాత్రము తదేక దీక్షతో అతను చూడసాగెను. అలా చూస్తుండగా ఆ చుక్క ఆకాశములో ప్రయాణించినట్లు ముందుకు జరిగిపోవు చుండెను. రాఘవ ఎక్కడున్నది కనిపించవలెననీ, అతనిని చూడవలెననీ మనస్సులో అంజనము ముందర కూర్చున్న వాడు అనుకోవడము వలన అంజనములోని నక్షత్రము రాఘవను చూపుటకు రాఘవవున్న ప్రాంతము మీద వరకు ఒక నిమిషములో చేరిపోయినది. అప్పుడు ఆ చుక్క చిన్నగ తన కాంతిని విడిపోవునట్లు, ఆ నక్షత్రము యొక్క వెలుగు గుండ్రముగా పది అడుగుల వెడల్పు వృత్తముగా విడిపోయింది. అలా విడిపోయిన వెడల్పు వృత్తములో చిన్నగా దృశ్యము కనిపించసాగింది. ఆ దృశ్యము మూడువందల అడుగుల ఎత్తునుండి చూస్తే ఎలా ఉంటుందో అలా పై నుండి కనిపిస్తువున్నది. పై నుండి కనిపించు దృశ్యములో అడవి ప్రాంతములోని చెట్లు, చేమలు, రాళ్ళు, రప్పలు కనిపిస్తుండగా అది అడవి ప్రాంతమని చూచేవానికి అర్థమైపోయినది. ఆ అడవిలో రాఘవ ప్రయాణించి పోవుచుండడము కూడా కనిపించింది. అలా వారు చూచిన విషయము వారి కులపెద్దలకు తెలిపిరి. అప్పుడు వారి కులపెద్దయిన మల్లుదొర రాఘవను తనవద్దకు పిలుచుకొని రమ్మని చెప్పెను. అందులకు ఆటవికులలో ఒకడు ఇలా అనెను.)

**ఆటవికుడు :-** రాఘవతో మనకేమి పని వున్నది? అతను మనకేమన్నా బంధువా? లేక కావలసిన వాడా? అతనితో మనకేమి ప్రయోజనము?

**మల్లుదొర :-** (చిరునవ్వు నవ్వుచూ) రాఘవ తెలివైనవాడు. అతనిని ఇక్కడే మన గూడెములోనే ఉంచుకుంటే బాగుంటుంది. అతనికి నా కూతురునిచ్చి వివాహము చేయదలచాను. అందువలననే అతనిని తెమ్మంటున్నాను.

**ఆటవికులు :-** ఈ మాటను మాకు ముందే చెప్పివుంటే రాఘవను ఒంటరిగా వదలేవారమే కాదు కదా! (అందరూ నవ్వుచూ అన్నారు).

**మల్లుదొర :-** ఇపుడైనా మించిపోయినది లేదు. మన భైరికా దేవతకు పూజచేసి బయలుదేరి పోండి, అతనికి నా ఉద్దేశమును చెప్పి పిలుచుకొని రాండి.

**ఆటవికులు :-** అతను మా మాటను ఒప్పుకొనునో లేదో! వస్తాడో రాడో! రాకపోతే ఏమి చేయాలి?

**మల్లుదొర :-** నేను చెప్పిన విషయమును చెప్పండి. మీరు ఏ దానికీ బలవంతము చేయవద్దండి. (దీర్ఘముగా యోచిస్తూ అన్నాడు)

**ఆటవికులు :-** నాయకా? మేము ఈ దినమే బయలుదేరి పోతాము. మాకు ఏ ప్రమాదములు జరుగకుండా బదనికలను తీసుకెళ్ళుతాము.

**మల్లుదొర :-** సరే అలాగే తీసుకెళ్ళండి.

**ఆటవికులు :-** రాఘవ వచ్చేదానికి ఒప్పుకొని కొంత ఆలస్యముగా వస్తానంటే, మేము అతనితోపాటే ఉండి తీసుకురమ్మంటారా?

**మల్లుదొర :-** రెండు మూడు నెలలైనా ఉండి తీసుకురాండి. ఒకవేళ ఇంకా ఏదైనా ఆలస్యమయ్యేటట్లుంటే నాకు తెలియజేయండి. ఇప్పుడు మన ఆచారము ప్రకారము భైరికాదేవతకు పూజచేసి ఆమె సన్నిధిలోనున్న బదనికలను తీసుకెళ్ళండి.

(ఆటవికులు ఎనిమిది మంది తమ నాయకుని మాట ప్రకారము వారి దేవతకు పూజచేసి బదనికలను తీసుకొని బయలు దేరిపోయిరి.)

× × × × × × × × × × × × × × × × × × × × ×

(కాషాయాంబరములు మరియు ఆశ్రమములను గురించిన సత్యాన్వేషణ గురించి, రాజయోగానంద స్వామి పోయిరమ్మని చెప్పినట్లు రాఘవ బయలుదేరి ప్రయాణము సాగించి, ఒక ఆశ్రమము చేరి అక్కడున్న వారితో ఇలా సంభాషించాడు.)

**రాఘవ :–** నేను మీవద్ద కొంతకాలముండి, ఈ ఆశ్రమములో తెల్పు దైవజ్ఞానమును తెలుసుకోవాలనుకొన్నాను. నేను నా ఖర్చును నేనే భరించు కొని ఉంటాను. మీకు నా వలన ఏ ఇబ్బందీ ఉండదు.

**ఆశ్రమము వారు :–** దైవజ్ఞానమా! నీవు పొరపడినావు. ఇది దైవజ్ఞానము చెప్పే ఆశ్రమము కాదు. పిల్లలకు చదువు చెప్పేది.

**రాఘవ :–** ఇది ఆశ్రమమన్నారు కదా! ఇచట గురువులేరా? ఆత్మజ్ఞానము చెప్పరా? (ఆశ్చర్యముగా అడిగాడు.)

**ఆశ్రమమువారు :–** (నవ్వుచూ) మా గురువుగారు కాశీలో ఉన్నారు. నెలకొక మారు వచ్చి పోతూవుంటారు. కానీ మా గురువుగారు ఆత్మజ్ఞానము కంటే అన్నము పెట్టే విద్యా జ్ఞానము గొప్పదని చెప్పుచుంటారు. అందువలన ఆత్మజ్ఞానమును చెప్పరు.

**రాఘవ :–** పరమాత్మ జ్ఞానముకంటే ప్రపంచ విద్య గొప్పదా, ఆత్మ జ్ఞానము కంటే బడి చదువు గొప్పదా?

**ఆశ్రమమువారు :–** చూడు నాయనా! బ్రహ్మవిద్య అన్నము పెట్టదు, ఆకలి తీర్చదు. అందువలన మొదట బ్రతికేదానికి విద్య నేర్పడము మా పని.

**రాఘవ :-** అటువంటపుడు విద్యాబోధన చేయు 'బడి' అని పేరు పెట్టు కోవడము మంచిది, కానీ 'ఆశ్రమము' అని పేరు పెట్టడము దేనికి?

**ఆశ్రమమువారు :-** బడి అనునది పాత పదము. బడి అను పేరుకంటే ఆశ్రమము అను పేరు మీద ఎక్కువ గౌరవమున్నది. అందువలన ఆశ్రమమని పేరు పెట్టాము. సాధారణ బడులకంటే గురుకుల ఆశ్రమములో చదువు బాగా చెప్పుదురని ప్రజల నమ్మకము. అందువలన మా గురువుగారు ఎన్నో గురుకుల ఆశ్రమములు నెలకొల్పి, అన్నింటిలోనూ పిల్లలకు చదువు చెప్పుచున్నారు. పెద్దలకు జ్ఞానము చెప్పే పనిని మా గురువుగారు పెట్టుకోలేదు.

(మొదటి అనుభవమే రాఘవ తలలో ఎన్నో ప్రశ్నలనుద్భవింప చేసింది. తన ప్రశ్నలకు అక్కడున్నవారు సరియైన సమాధానము చెప్పరని తెలిసినప్పటికీ మరియొక ప్రశ్నను వారినడిగాడు)

**రాఘవ :-** ఇక్కడ చదువుకొను పిల్లలకు కొద్దిమాత్రమైనా దైవజ్ఞానమును తెలుపరా?

**ఆశ్రమమువారు :-** ప్రతి దినము భగవద్గీతలోని శ్లోకములను పదింటినైనా పారాయణము చేయిస్తాము. మావద్దనున్న పిల్లలందరికీ గీతా శ్లోకములు బాగా వచ్చును.

**రాఘవ :-** శ్లోకములు మాత్రము తెలుసునా, లేక అందులోని అర్థము కూడా తెలుసునా?

**ఆశ్రమము వారు :-** శ్లోకముల అర్థము సరిగా పెద్దలకే తెలియదు. మా పిల్లలకు అర్థము తెలియదు గానీ, శ్లోకములు మాత్రము కంఠాపాటముగా వచ్చును.

**రాఘువ :-** అర్థము తెలియని శ్లోకములతో ఏమి ప్రయోజనము?

**ఆశ్రమమువారు :-** శ్లోకముల వలన మాకు తెలిసిన ప్రయోజనము ఒకటి గలదు. అదేమనగా! శ్లోకములలో ఎక్కువగా కఠిన పదములూ, వత్తులూ ఉండును. వాటిని చదువుట వలన మిగతా తెలుగు పదములను సులభముగా పలుకవచ్చునూ, వ్రాయవచ్చును. అందువలన శ్లోకములను ఎక్కువగా చదివింతుము.

(ఆ మాటలతో రాఘువకు పిచ్చి ఎక్కినంత పనైంది. ఆశ్రమము లోనే బ్రహ్మవిద్యకు విలువలేకుండా పోవడము విచిత్రముగా తోచినది. అక్కడినుండి ఏదైనా బ్రహ్మవిద్యగల ఆశ్రమానికి పోవాలనుకొని వారిని ఇలా అడిగాడు)

**రాఘువ :-** మీరు చెప్పు దానిని బట్టి ఇక్కడున్నది కేవలము ప్రపంచ చదువుకు సంబంధించిన ఆశ్రమమని తెలిసినది. నాకు కావలసినది పరమాత్మ చదువుకు సంబంధించిన ఆశ్రమము. అటువంటి ఆశ్రమము ఇక్కడెక్కడైనా ఉంటే తెలుపండి. నేనక్కడికి పోతాను.

(అందులకు రాఘువవైపు దీనముగా చూస్తూ అక్కడివారు ఇలా చెప్పారు)

**ఆశ్రమమువారు :-** అటువంటి ఆశ్రమము కావలయునంటే చిన్నది కావలయునా? పెద్దది కావలయునా?

**రాఘువ :-** చిన్నదంటే ఏమిటి?, పెద్దదంటే ఏమిటి? ఎక్కడైనా ఉండునది జ్ఞానమొక్కటే కదా!

**ఆశ్రమమువారు :-** చూడు బాబూ! చిన్నదంటే జ్ఞానమును మాత్రము తెలుపునది. పెద్దదంటే జ్ఞానము అని పేరు పెట్టి నీతిని గురించి చెప్పు చుందురు. మరియు మహిమలు కూడా చూపుచుందురు.

**రాఘవ :-** అలాగైతే రెండు ఆశ్రమముల చిరునామా చెప్పండి. నేను చిన్న పెద్ద రెండు ఆశ్రమములను సందర్శిస్తాను.

**ఆశ్రమమువారు :-** చిన్న ఆశ్రమము మనోడ అను జిల్లాలో, చైతన్యనగర్ అను మండలములో, ప్రకాశ్‌పురి అను గ్రామములో ఎత్తయిన గుట్టమీద గలదు. అది ఇక్కడికి ఉత్తరమున పదిమైళ్ళ దూరములో గలదు. ఇక పెద్ద ఆశ్రమమును గురించి చెప్పితే అది ఇక్కడికి దక్షిణమున వందమైళ్ళ దూరములోనున్న అమ్మానగర్ జిల్లాలో, లక్ష్మీపురము మండలములో, శాంతి పురము గ్రామములో విశాలమైన మైదానములో కలియుగ వైకుంఠములాగ అందమైన కట్టడములతో కనిపిస్తూవుండును.

**రాఘవ :-** మిమ్ములను ఎన్నో ప్రశ్నలను అడిగి శ్రమింపజేసినందుకు క్షమించండి, పోయివస్తాను.

(అని చెప్పి రాఘవ అక్కడినుండి బయలుదేరి మొదట ప్రకాశ్‌పురిలో నున్న చిన్న ఆశ్రమప్రాంతానికి చేరాడు. ఆ సమయానికి సాయంకాలమై చీకటి పడసాగెను. మసక చీకటిలో రాఘవ పోవుచుండెను. అతను ఇంకనూ ఆశ్రమమును చేరలేదు. ఆశ్రమమును సమీపిస్తుండగానే ఎవరో పెద్దగా అరిచినట్లు రాఘవకు వినిపించింది. ఏదైనా ప్రమాదమేమోనని తలచిన రాఘవ తొందరగా ముందుకు పోయేదానికి ప్రయత్నించాడు. అంతలోనే తనకు ఎదురుగా ఒక వ్యక్తి అరుస్తూ పరుగెత్తుకొని వస్తుండెను. ఆ వ్యక్తి దయ్యము..దయ్యమని అరుస్తూ పరుగిడుచున్నాడు. అతని వెనుక పొట్టిగ మూడు అడుగుల ఎత్తున్న నల్లని ఆకారము అతనిని వెంబడించుచు వస్తున్నది. మసక చీకటిలో అర్థముకాని ఆ ఆకారమును చూచి మొదట రాఘవ కూడా కొంత అధైర్యపడినాడు. అంతలోనే రాఘవ ధైర్యమును

తెచ్చుకొని, భయపడి పరుగిడు మనిషికి ఎదురుపడి భయపడకు నేనున్నానని ధైర్యము చెప్పి నిలిపెను. అంతలో వెనుకనే వచ్చు ఆకారము సమీపించినది. ఒక్క దూకులో రాఘువ ఆ ఆకారము మీదపడి దానిని అదిమి పట్టబోయాడు. రాఘువ చేతికి నల్లని కంబళి దొరికినది. కంబళిక్రిందనుండి కుక్క బయటికి వచ్చినది. విచిత్రమైన ఆ సంఘటనను చూచి రాఘువకు ఏమీ అర్థము కాలేదు. వెంటనే రాఘువ మనస్సులో దయ్యములు కుక్కలుగా మారి కనిపిస్తాయని ఎవరో చెప్పిన మాట జ్ఞప్తికి వచ్చినది. అప్పుడు దానిని కొట్టుటకు ప్రక్కనున్న రాతిని చేతిలోనికి తీసుకొనేలోగా ఆ కుక్క మొదటి వ్యక్తి వద్దకు చేరినది. మొదటి వ్యక్తి మరింత భయముతో ఆశ్రమము వైపు పరుగిడసాగెను. అలా పరుగిడు అతని వెంట కుక్క, కుక్క వెంట రాఘువ పరుగిడసాగారు. మొదటి వ్యక్తి ఆశ్రమములోనికి దూరి దయ్యము... దయ్యమని అరవగా అక్కడున్న వారంతా అతనివద్దకు చేరారు. అంతలో కుక్కా, కుక్క వెంట రాఘువ ఆశ్రమము దగ్గరికి చేరిరి. అక్కడ గుమికూడిన వారు కుక్కను ఏమీ అనకుండా రాఘువను గట్టిగా పట్టుకొన్నారు. అలా పట్టుకొన్న వారిలో కొందరు, ఇది దయ్యమేనని కొందరు అనగా, కాదు ఇతను మనిషేనని కొందరనసాగిరి. ఆ సంఘటనకు రాఘువ అయోమయ స్థితిలో పడిపోయి, నేను మనిషినేనని దయ్యమును కానని గట్టిగా అరిచి చెప్పెను. అంతలో మొదట భయపడి పరుగిడిన మనిషి వచ్చి ఈయన మనిషే, నేను కుక్కను చూచి భయపడ్డానని చెప్పాడు. అందులకు అక్కడి భక్తులు అతనిని ఇలా అడిగారు.)

**భక్తులు :-** ఇది మన కుక్కే కదా! దీనిని చూచి ఎందుకు భయపడ్డావు?

**భయపడిన వ్యక్తి :-** నేను కంబళి భుజము మీద వేసుకొని పొలమువద్ద కాపలాకు పోవాలనుకొని పోయాను. పొలమువద్దకు పోయిన తర్వాత

అరుగు మీద చాప పరుచుకోవాలనుకొని, నా భుజము మీదున్న కంబళిని క్రిందవేశాను. ఆ కంబళి ఈ కుక్క మీద పడిన విషయము నాకు తెలియదు. నేను చాపను పరచి ప్రక్కన చూచాను. కంబళి కుక్క మీద ఉండుట వలన కుక్క కదలిక నల్లని ఆకారము కదలినట్లు కనిపించినది. నా ప్రక్కనే అలా కదలడము వలన నేను నల్లని ఆకారమును నిజముగా దయ్యమనుకొని అరుస్తూ పరుగిడినాను. అంతలో ఈయన వచ్చి నన్ను భయపడవద్దు అని ఈ కుక్క మీద పడినాడు. ఇతని చేతికి కంబళి వచ్చింది. కుక్క నావద్దకు వచ్చింది. అయినప్పటికీ చీకటిలో ఏమి జరిగిందో అర్థము కాక, మన కుక్క జ్ఞప్తికిరాక, దయ్యమే కుక్కవలె నా దగ్గరకు వస్తున్నదని భయపడి ఇక్కడికి పరిగెత్తి వచ్చాను. ఈయన కూడా నా వెంట వచ్చాడు.

(జరిగిన పొరపాటుకు అందరూ నవ్వుకొన్నారు. అపుడు రాఘవను గురించి అక్కడి ఆశ్రమ భక్తులు ఇలా అడిగారు)

**భక్తులు :-** నీవు ఎవరు? ఈ ప్రాంతమునకు ఎందుకు వచ్చావు?

**రాఘవ :-** నేను దైవజ్ఞాన విషయములలో సత్యమును తెలుసుకొను నిమిత్తము సత్యాన్వేషణ చేస్తూ, కొన్ని ఆశ్రమాలను సందర్శించి అక్కడున్న గురువుల వలన జ్ఞానమును తెలుసుకోవాలనుకొని ఇక్కడికి వచ్చాను. ఇక్కడ మంచి దైవజ్ఞానముకలదని ఇతరులు చెప్పగా విని వచ్చాను.

**భక్తులు :-** మా గురువుగారు నీవు అడిగిన దానికంతటికీ జవాబు చెప్పగలడు, కానీ నీవు ఆయనను అడుగలేవు. ఆయనకు చాలా చెవుడు నీవు అడిగేది ఆయనకు వినిపించదు. ఈ మధ్య ఏమీ వినిపించకుండాపోయింది.

**రాఘవ :-** అలాగా! అయితే గట్టిగా అరచి అయినా అడుగుతాను.

(అక్కడి ఆశ్రమ భక్తులు రాఘవకు అన్నము పెట్టి, తిన్న తర్వాత తమ గురువువద్దకు తీసుకపోయి గురువును చూపించి, గురువుగారికి చీటీలో రాఘవ విషయమును వ్రాసి చూపించి, రాఘవను గురువుగారితో మాట్లాడ మని చెప్పిరి. అప్పుడు రాఘవ గురువుగారికి నమస్కరించి వినయముగ ఇలా ప్రశ్నించెను.)

**రాఘవ :-** స్వామీ! మనిషి పుట్టుకలోని అంతరార్థము ఏమిటి?

(రాఘవ మాట గురువుగారికి వినిపించలేదు. అపుడు చెవులు చూపి చేయి అల్లాడించుచూ ఏమిటి? అన్నాడు గురువుగారు)

**రాఘవ :-** మనిషి ఎందుకు పుట్టాడు? (అని పిడికిలి బిగించి అల్లాడించుచు అడిగాడు. అందులకు గురువు ఇలా అన్నాడు.)

**గురువు :-** తాంబూలము ఎందుకు వేసుకున్నావంటున్నావా? తిన్న ఆహారము బాగా జీర్ణమవుతుందని వేసుకొన్నాను.

(ఆ మాటవిని రాఘవకు నవ్వు వచ్చింది. అయినా ఆపుకొని ఆ ప్రశ్నను వదలివేసి వేరొక ప్రశ్నను అడిగాడు.)

**రాఘవ :-** దేవుడంటే ఎవరు? (అని గట్టిగా అడిగాడు)

**గురువు :-** నేనేనయ్యా ఇక్కడి గురువును.

(గురువుగారు చెప్పిన సమాధానమునకు రాఘవకు దిక్కుతెలియక తలబరుక్కొని ఈయనకున్నది మామూలు చెవుడు కాదు, బ్రహ్మచెవుడు అని అనుకొన్నాడు. చెవుటి వాళ్ళకు చేతులు చూపి అడగవలసిందే గానీ ఎంత గట్టిగా అరచి అడిగినా ప్రయోజనము లేదనుకొన్నాడు. ఈ మారు తన చేతివేళ్ళను రెండిటిని చూపుచూ ఇలా అడిగాడు.)

**రాఘువ :-** జీవాత్మ, పరమాత్మ రెండు ఎక్కడున్నాయి?

**గురువు :-** దొడ్డికి వస్తావుందా పోయిరా పో, తర్వాత మాట్లాడవచ్చు.

(ఈమారు రెండు చేతివేళ్ళను చూపుట వలన గురువుగారు మరొక విధముగ అర్థము చేసుకోవడముతో రాఘువ అలసిపోయినంత పని అయినది. ఇక లాభము లేదు ఇక్కడినుండి పోయేది మంచిదనుకొని, అక్కడినుండి ప్రక్కకు వచ్చి ఆ ఆశ్రమ భక్తునితో మాట్లాడసాగెను.)

**రాఘువ :-** ఏమయ్యా! మీ గురువుగారికి ఎంత అరిచి అడిగినా వినిపించదే, సైగల ద్వారా అడిగినా వేరు విధముగా అర్థము చేసుకొంటాడు. ఈయన వద్ద మీరెలా జ్ఞానమును తెలుసుకొంటారు.

**భక్తుడు :-** మేము ఏమీ అడగము. ఆయన చెప్పేది మాత్రము వింటాము.

**రాఘువ :-** మీకేదైనా అర్థము కాకపోయినా, లేక అనుమానము వచ్చినా ఎలా అడుగుతారు?

**భక్తుడు :-** ఇక్కడి వారికి ఏ అనుమానము రాదు. ఎందుకంటే ఇక్కడికి వచ్చేవారు జ్ఞానము మీద ఆసక్తి కల్గిరావడము లేదు. గురువుగారు చెప్పే టప్పుడు అర్థమైనట్లు కనిపించే దానికి ఊరకనే తలూపుచుందురు. ఇక్కడికి వచ్చేవారు పైకి జ్ఞానము కొరకు వస్తున్నట్లు కనిపించినా, వారు నిజముగా జ్ఞానము కొరకు రావడము లేదు.

**రాఘువ :-** అయితే ఎందుకు వస్తునట్లు? (రాఘువ కనుబొమ్మలు ముడివేసి అడిగాడు)

**భక్తుడు :-** ఎందరో విచిత్ర మనస్థత్వములు గల మనుషులు గురువుగారి దగ్గరకు వస్తుంటారు. వచ్చినవారు జ్ఞానమును తెలుసుకొను నిమిత్తమే వచ్చినట్లు కనిపించినా, వారు జ్ఞానమును తెలుసుకొని ఏమాత్రము మార్పు

చెందరు. గురువుగారు చెవిటివాడైనా ఆయన తెల్పు జ్ఞానము ఉత్తమమైనది. అయితే దానిని తెలుసుకొన్నట్లు నటిస్తూ కొన్ని సంవత్సరములు ఇక్కడికి వచ్చినా, చివరికి కొన్ని సంవత్సరముల తర్వాత కూడా జ్ఞానము ప్రకారము కాక, మొదటినుండి వున్న వారి వారి సహజత్వము ప్రకారము నడుచుకొను చుందురు. ఈ విధముగ చాలామంది ఎంత జ్ఞానమును తెలుసుకొన్నా చివరికి, గురువుగారినే ఎదిరించి నీదే తప్పు, మేమే సరి అన్నట్లు కూడా ప్రవర్తించుచుందురు.

**రాఘవ :-** గురువుగారు చెప్పిన జ్ఞానము ప్రకారము ఆచరించకపోతే, ఇక్కడికి ఎందుకు రావలయును?

**భక్తుడు :-** "ముంతలు (మట్టితో చేసిన చెంబులులాంటివి) పెట్టి చెంబులు ఎత్తుక పోయినట్లు" అను ఒక సామెత గలదు. అదే ప్రకారమే గురువుగారి వద్ద కొందరు ప్రవర్తించుచుందురు. కొందరైతే ముంతలు కూడా పెట్టకుండా చెంబులు ఎత్తుకపోయే వారున్నారు. గురువువద్దకు వచ్చి విలువలేని దానిని ఇచ్చి దానికి బదులుగా విలువున్న దానిని తీసుకొని పోయేవారున్నారు. కొందరైతే విలువలేనిది కూడా ఇవ్వకుండ విలువైన వాటిని ఎత్తుకొని పోయే వారున్నారు. గురువుగారు వచ్చిన వారికి అన్నము పెట్టి, జ్ఞానము చెప్పుట ఆయనకు ఖర్చుతో కూడుకొన్న పని అని అందరికీ తెలుసు. ఆ ఖర్చు కూడా ఇవ్వని వారు కొందరుండగా, వందరూపాయలు ఇచ్చినవాడు తనవెంట పదిమందిని తెచ్చుకోవడము జరుగుచున్నది. కొందరు అన్నము పెట్టు గురువుగారిని తెలివితక్కువ వానిగా భావించి, అదేపనిగా జ్ఞానము తెలుసుకొనే దానికే వస్తున్నామన్నట్లు నటిస్తూ, కొన్ని దినములు ఇక్కడేవుండి కాలమును గడిపిపోవుచుందురు. ఇటువంటి వారికి జ్ఞానము అవసరము లేదు. వారు గురువునే మోసము చేయుచుందురు.

**రాఘవ :-** ఇటువంటి వారందరూ మోసగాళ్ళని గురువుగారికి తెలియదా?

**భక్తుడు :-** తెలియకేమి! అన్నీ తెలుసు. నేను చెప్పినది కొందరినే. కానీ ఆయన మిగతా అన్ని రకముల మోసగాళ్ళను కూడా గ్రహించాడు. చూచే దానికి ఆయన చెవిటివాడే, కానీ ఆయన గొప్ప మేధావి. మిగతా మోసగాళ్ళను గురించి కూడా ముందే మాకు చెప్పాడు. నేను నీకు చెప్పినది ఒక రకమైతే గురువుగారు చెప్పినది దాదాపు ఇరవై రకముల మోసగాళు ళ్ళన్నట్లు గ్రహించాడు. అందులో తనవద్ద కొంత జ్ఞానమును తెలుసుకొని, అంతా తెలుసుకొన్నాననుకొని ప్రక్కకు పోయి, తాము కూడా గురువులుగా చలామణి అగుచూ, దానివలన డబ్బులు సంపాదించుకోవాలనుకొనువారు మొదటి మోసగాళ్ళని చెప్పాడు.

**రాఘవ :-** అటువంటపుడు తెలిసీ అటువంటి వారిని జ్ఞానము చెంతకు ఎందుకు రానీయవలయును?

**భక్తుడు :-** మేము కూడా ఈ మాటే చెప్పాము. దానికాయన "మన దగ్గరకు వచ్చేవారంతా అజ్ఞానులే. అందులోని వారు మనలను మోసగించా లనుకోవడము విచిత్రమేమి కాదు. రోగమున్న వారికే వైద్యమన్నట్లు అటువంటి వారికే మన జ్ఞానము అవసరము. ఒకవేళ మన వైద్యముతో వారి రోగము పోనప్పుడు, మన వైద్యము వారికి పనికి రాదని పంపిస్తాము" అన్నాడు.

**రాఘవ :-** ప్రస్తుతము ఇపుడు ఇటువంటి మోసగాళ్ళు మీవద్దకు వస్తున్నారని తెలిసింది కదా! అటువంటివారికి మీరు జ్ఞానము ప్రకారము ఆచరించినపుడే ఇక్కడికి రావచ్చును, లేకపోతే ఇక్కడ స్థానములేదని చెప్పవచ్చును కదా!

**భక్తుడు :-** మనమైతే అలాగే చెప్పుతాము. కానీ గురువుగారు అలా చెప్పరు. ఆయన చెవిటివాడైనా అమోఘమైన యుక్తికలవాడు. ఎవరిని ఏ విధముగా దూరము చేయాలో, ఆ విధముగానే చెప్పకుండా చేస్తాడు.

**రాఘువ :–** మీలాంటి నిజమైన భక్తులు ఎవరూ లేరా?

**భక్తుడు :–** కొందరున్నారు. అయినా వారు పైకి కనిపించక సేవా భావముతో పనిని చేస్తూ, జ్ఞానప్రచారము కొరకు పాటుపడుచుందురు. అటువంటి వారిని చూచి ఓర్చలేని అజ్ఞానులు, తమకంటే ఎక్కువగా ఎవరూ ఉండ కూడదను భావముతో, గురువుగారి వద్దచేరి మంచివారిని గూర్చి చెడ్డగా చెప్పడము కూడా జరుగుచుండును. అయినా గురువు గారికి అన్నీ తెలుసు. ఎవరు ఎటువంటివారో, ఎవరు జ్ఞానము కొరకు పని చేస్తున్నారో, ఎవరు తమ స్వార్థము కొరకు పని చేస్తున్నారో ఆయనకు తెలుసు. కనుక అప్పటికి వారు చెప్పినది వినినా, తర్వాత వారికే గురువువద్ద స్థానము లేకుండా పోవును. అట్లు మేమే గురువువద్ద మొదటివారమనుకొన్న వారంతా చివరకు గురువువద్దకు కూడా రాలేకపోయారు. గురువు చెప్పిన జ్ఞానము మా ద్వారానే మీకు తెలుస్తుంది. మేము గురువుకు దగ్గరవారము అన్నవారందరికీ గురువు దర్శనము కూడా కరువైపోయింది. జ్ఞానములో మేమే మొదటి వారమనుకొన్న వారందరూ చివరివారై పోయారు. గురువు యొక్క సంకల్పముతో మాయ అటువంటి వారందరినీ ఆశ్రమానికి దూరము చేసింది.

(ఇదంతా విన్న రాఘవకు ఏదో పెద్ద సంసార చిక్కు కథ విన్నట్లయినది. తల విదిలించుకొని ఆ రాత్రి అక్కడే పడుకొని, ఉదయము లేచి అక్కడి భక్తులతోనూ, గురువుగారితోనూ చెప్పి బయలుదేరి పెద్ద ఆశ్రమమును చూడవలెనని ప్రయాణమును సాగించెను.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(తమ అటవీప్రాంతము నుండి బయలుదేరిన ఆటవికులు మార్గ మధ్యములో ఒక పెద్ద పట్టణమును చేరిరి. అంతలో ప్రొద్దుగుంకెను.

అందువలన వారు ఆ రాత్రి అక్కడే ఉండాలనుకొన్నారు. వారివెంట తెచ్చుకొన్న తేనె, రొట్టెలు తిని పండుకొనుటకు స్థలమును వెదకసాగిరి. వారు ఎప్పుడూ పట్టణ ప్రాంతమునకు వచ్చినవారు కాదు. అలా రావడము అదే మొదటి అనుభవము. రోడ్డు మీద రద్దీగా తిరుగు మనుషులు, వేగముగా పోవు వాహనములు వారికి వింతగా కనిపించుచుండెను. రాత్రి పదకొండు గంటలైనా వారికి తగిన చోటు కనిపించలేదు. చివరికి ఒకచోట రోడ్డు ప్రక్కగానే ఖాళీ వరండా కనిపించింది. దానిని చూచినవారు ఆ రాత్రి అక్కడనే పడుకోవాలనుకొనిరి. అక్కడ పడుకొన్న వారికి క్రొత్తచోటు కావున కొందరికి నిద్రరాలేదు, కొందరు నిద్రపోయారు. రాత్రి రెండు గంటల సమయములో ఎవరో తమను లేపినట్లయినది. కళ్ళు తెరిచి చూచారు, ఎదురుగా నలుగురు పోలీసువారున్నారు. ఆటవికులు ఎప్పుడు తమ గూడెమును వదలి బయటికి రాలేదు. కావున తమను లేపిన వారు పోలీసు లని కూడా తెలియదు. మమ్ములను ఎందుకు లేపారని పోలీసులను ఆటవికులు అడిగారు. ఆ మాటకు పోలీసువారు జవాబు చెప్పకుండా దురుసుగా ప్రవర్తిస్తూ, దొంగల ముఠాను పట్టుకొన్నంత సంతోషపడుచు వ్యానును ఎక్కండి అని గద్దించారు. ఆటవికులకు వారి ప్రవర్తన ఏమీ అర్థము కాలేదు. అంతలో మరో నలుగురు పోలీసులు, ఒక ఇన్‌స్పెక్టర్ వ్యాను దిగి వచ్చారు. నగరములో దోపిడీలు చేస్తూ ఇంతవరకు దొరకకుండా పోలీసులను ముప్పు తిప్పలు పెట్టిన దొంగలముఠా ఆటవికుల గుంపేనని తలచిన ఇన్‌స్పెక్టర్, వెంటనే వైర్‌లెస్ సెట్‌లో ఎవరితోనో మాట్లాడాడు. మాట్లాడిన కొద్దిసేపటికే రెండు పోలీస్ జీపులు వచ్చాయి. అందులోని పోలీసులు తుపాకులతో వచ్చారు. పోలీసులు అందరూ కలిసి ఆటవికులను బలవంతముగా వ్యానులోనికి ఎక్కించారు. పోలీస్‌వారు ఏమి చేయు చున్నారో, తమను వ్యానులో ఎక్కించి ఎందుకు తీసుకపోతున్నారో,

ఆటవికులకు ఏమాత్రము అర్థము కాలేదు. తమను బెదిరిస్తున్న ఒక పోలీస్‌ను ఆటవికులు ఇలా అడిగారు)

**ఆటవికులు :-** మమ్ములను ఎక్కడికి తీసుకపోతున్నారు?

**పోలీస్ :-** మీ అత్తగారింటికి.

**ఆటవికుడు :-** ఏమండోయ్ టోపీ మామ! మీ ఇష్టమొచ్చినట్లు మాట్లాడు చున్నారు. మా అత్తగారిల్లు అడవిలోవుంది. కానీ ఇక్కడెందుకు ఉంటుంది.

**పోలీస్ :-** నోరు మూసుకొని కూర్చో! కొడకా!

**ఆటవికుడు :-** మేము మామ అని మర్యాదగ పిలిస్తే, మమ్ములను కొడకా అంటావా, మా అడవి మనుషుల బలము మీ పట్టణము వాళ్ళకు తెలియదు. మేము ఇంతవరకు ఊరకున్నాము. ఇక మాకు కోపము వచ్చిందంటే ఏమాత్రము ఊరుకోము.

**పోలీస్‌లు :-** మీ కథ స్టేషన్‌కు పోయిన తర్వాత రా, మమ్ములనే బెదిరిస్తారా, మిమ్ములను ఏమిచేస్తామో చూడండి!

(అంతలో పోలీస్‌స్టేషన్ రానే వచ్చింది. స్టేషన్ ముందర వ్యాన్ ఆగింది. ఆటవికులనందరినీ దించి లాకప్‌రూములో పెట్టి తాళము వేశారు. అంతలో స్టేషన్‌లోని ఫోన్ మ్రోగింది. ఫోన్‌ను అందుకున్న ఇన్‌స్పెక్టర్ అవతలి మాటలు విని, ఫోన్‌ను టక్కున పెట్టి, "రాణినగర్‌లో మర్డర్ జరిగింది. వెంటనే పోవాలని" పోలీసులను పిలుచుకొని ఆత్రుతగా పోయాడు. పోలీస్ స్టేషన్‌లో డ్యూటీలోనున్న సెంట్రీ (కాపలా) పోలీస్‌లు ఇద్దరు మాత్రమున్నారు. లాకప్‌లో బందీలైన ఆటవికులకు సమస్య ఏమిటో, తమను ఎందుకు అక్కడకు తెచ్చిపెట్టారో ఏమీ అర్థము కాలేదు. పోలీస్ వారి ప్రవర్తనకు విసుగుకొన్న ఆటవికులు అక్కడినుండి తప్పించుక పోవాలని నిర్ణయించుకొన్నారు.

వెంటనే వారిలో ఒకరి చేతికి కడియములాగ తగిలించుకొన్న మోదుగ చెట్టు బదనికను బయటికి తీసి అందరి తలమీద తాకించాడు. అలా తగిలించిన బదనిక (మూలిక) ప్రభావము చేత వారి రూపములు మసక మసకగా మారను మొదలిడెను. అలా కనిపిస్తున్న వారు కొద్దికొద్దిగ మారుచూ, వారి ఆకారములు పూర్తి కనిపించకుండా పోవుటకు రెండు నిమిషములు పట్టినది. ఆ విధముగా ఒక బదనిక ప్రభావము చేత లాకప్‌లో నున్న ఎనిమిది మంది ఆటవికులు అదృశ్యమైపోయారు. అలా జరిగిన కొంతసేపటికి కాపలాగానున్న పోలీస్ లాకప్‌వైపు చూడడము జరిగినది. లాకప్‌లోని ఆటవికులు పోలీస్‌కు కనిపించలేదు. ఖాళీగానున్న లాకప్‌ను చూచిన పోలీస్ ఆశ్చర్యపోయి, వెంటనే లాకప్ తలుపులు తెరిచి రెండడుగులు లోపలికి పోయాడు. దభీమని ఎవరో పోలీస్ మెడమీద కొట్టినట్లయినది. ఆ వేటుకు పోలీస్ స్పృహతప్పి పడిపోయాడు. అదృశ్యముగానున్న ఆటవికులు పోలీస్ లోపలికి వచ్చిన వెంటనే, మెడమీద కొట్టి అతను క్రింద పడిపోయిన వెంటనే, అందరూ బయటికి వచ్చారు. లాకప్‌లో క్రిందపడిన శబ్దమువిన్న రెండవ పోలీస్ ఆత్రుతగా లాకప్‌రూమ్ దగ్గరకు వచ్చాడు. లాకప్ తెరిచి ఉండడము, తన తోటి పోలీస్ క్రిందపడి ఉండడమును చూచి ఆశ్చర్యపోయి, క్రింద పడిన పోలీస్‌ను లేపడానికి లాకప్ లోనికి పోయాడు. వెంటనే లాకప్ తలుపులు మూసుకొన్నాయి. తలుపుకు తాళము వేయబడింది. అదృశ్యముగానున్న ఆటవికులు చేస్తున్న ఆ పని రెండవ పోలీస్‌కు అర్థము కాలేదు. తాను చూస్తున్నట్లే తలుపులు అవే మూసుకోవడము, తాళము వేసుకోవడమును గమనించిన రెండవ పోలీస్ భయపడి గట్టిగా అరిచాడు. అయినా వినుపించుకొను వారు ఎవరూ అక్కడ లేరు.

పోలీస్ లాకప్ నుండి బయటపడిన ఎనిమిది మంది ఆటవికులు ఇక ఇటువంటి పట్టణములలోనికి ప్రవేశించకూడదనుకొన్నారు. బదనిక ప్రభావము తమను మూడు గంటలు మాత్రమే అదృశ్యముగా ఉంచునని తెలిసిన ఆటవికులు, ఆ లోపే ఆ పట్టణమును వదలి రావాలని ప్రయాణము సాగించారు. వారు పట్టణమును వదిలి కొంత దూరము వచ్చిన తర్వాత తెల్లవారింది. తెల్లవారిన తర్వాత పోలీస్‌స్టేషన్‌లో జరిగిన విచిత్ర సంఘటన యొక్క విషయము పట్టణమంతా ప్రాకింది. ఆ జిల్లా యస్.పి (S.P.) గారు ఆ సంఘటనను దర్యాప్తు చేయుటకు ప్రత్యేక బృందమును ఏర్పాటు చేశాడు. మాయాజాలముగా జరిగిన లాకప్ సంఘటనపై పోలీస్ డిపార్టుమెంటు స్పందించింది. వార్త డి.ఐ.జి వరకు ప్రాకింది. "దొంగల ముఠా మాయా జాలమ్" అను పేరుతో వార్తా పత్రికలు ఆ విషయమును ప్రచురించాయి. అసలు దొంగల ముఠా నాయకుడైన తాటిమాను మునెప్ప, మునెప్ప ముఠాలోని సభ్యులు ఆ వార్తను చూచి ఆశ్చర్యపోయారు. తాము ఆ దినము పట్టణములోనికి పోకున్ననూ, తమ ముఠా మీద వార్త రావడము విచిత్రముగా తోచింది. అసలు సంగతి ఏమిటో, ఎలా జరిగిందో తెలుసుకొని రావడానికి మునెప్ప తమ మనిషిని పట్టణానికి పంపాడు.

× × × × × × × × × × × × × × × × × × × × × ×

రాఘవ చెవిటి స్వామి వద్ద జరిగిన అనుభవాలను నెమరేసుకొంటూ ప్రయాణించి చివరకు పెద్ద ఆశ్రమమును చేరెను. గొప్ప అందమైన మేడలూ, పూలచెట్లతో కూడిన విశాలమైన పార్కులూ, వేలమందితో కూడిన ఆ ప్రాంతమంతయూ ఎంతో అందముగా, చూచుటకు ఆనందముగా కలియుగ వైకుంఠమువలె ఉన్నది. ఆ ప్రాంతమును అక్కడి భక్తి వాతావరణమును చూస్తూనే రాఘవలో కూడా భక్తి భావము వచ్చినది. ఇక్కడున్న స్వామీజీ

ఎవరో గొప్పవాడను భావము అతనిలో కల్గినది. అక్కడి వాతావరణమే అతనిని అలా మార్చి వేసినది. వెంటనే రాఘవలోనున్న హేతుబద్దత, సత్యాన్వేషణ మెదిలినవి. బుద్ధితో సత్యము తెలియనిదే, దేనికైనా హేతుబద్దత లేనిదే, ఒక నిర్ణయానికి ఏకపక్షముగా రాకూడదని, అలా ఒక నిర్ణయానికి రావడము మూఢనమ్మకమగునను యోచన రాఘవకు వచ్చినది. రాఘవ సత్యాన్వేషి కావున, పూర్తి పరిశోధన జరిగిన తర్వాతనే దేనినైనా, ఎవరినైనా సరియైన పద్ధతిలో లెక్కించవచ్చునని అనుకొన్నాడు. అప్పుడు ఆ ఆశ్రమానికి అధిపతియైన స్వామీజీని గురించి తెలుసుకోవాలని అక్కడేనున్న ఒక వృద్ధున్ని ఇలా అడిగాడు.

**రాఘవ :-** తాతగారూ; ఇక్కడ స్వామి దర్శనము నాకు ఎప్పుడు దొరుకుతుంది?

**వృద్ధుడు :-** ఆరు నెలలుగానున్న మాకే దొరకలేదు. అంత తొందరగా నీకెలా దొరుకుతుంది? ఆయన దర్శనము అంతసులభముగా దొరకదు. ఎంత కాలమైనా కాచుకొనివుండు ఓపిక కావాలి. అప్పుడు నీ పుణ్యము కొద్దీ దొరుకుతుంది.

**రాఘవ :-** స్వామిగారి పేరేమిటి?

**వృద్ధుడు :-** (ఆశ్చర్యముగా రాఘవ వైపు చూచి) స్వామి పేరు తెలియదా? ఆయన పేరు తెలియని వారే లేరే!

**రాఘవ :-** నిజముగ నాకు తెలియదు, నేను ఈ ప్రాంతమునకు క్రొత్తవాడిని.

**వృద్ధుడు :-** స్వామిగారి పేరు దాదాబాబా. ఆయన గొప్ప మహత్యముగల వారు. మనదేశములోనే కాకుండా, విదేశములో కూడా దాదాబాబా గారికి చాలా పేరున్నది. ఇక్కడున్న భక్తులలో చాలామంది విదేశీయులే ఉన్నారు. ఇప్పటి కలియుగములో ఈయనే ప్రత్యక్ష దైవము.

**రాఘవ :-** ఇంత గొప్ప స్వామీజీని గురించి నిజముగా నాకు తెలియదు. తెలిసివుంటే అప్పుడే వచ్చేవాడిని. ఇప్పుడిప్పుడే దైవజ్ఞానమును తెలుసు కోవాలను ఆసక్తి కల్గినది. అందువలన ఆశ్రమములను చూడాలని, అక్కడి జ్ఞానమును తెలుసుకోవాలని ఆసక్తితో తిరుగుచు ఇక్కడికి వచ్చాను. దాదా బాబాగారిని చూడాలని చాలా ఆసక్తిగా ఉన్నది.

**వృద్ధుడు :-** నిజమే బాబు, నేను కూడా ఆయన దర్శనమునకే వేచి ఉన్నాను. బాబావారు విదేశీ పర్యటనలో ఉన్నారు. ఆయన వచ్చిన తర్వాతనే దర్శనము లభించగలదు.

**రాఘవ :-** స్వామి వారి చిత్రపటమునైనా చూస్తాను. మీవద్దవుంటే చూపించండి.

(అప్పుడు ఆ వృద్దుడు బాబాగారి చిత్రపటమును చూపించుటకు చాలా కాలమునుండి అక్కడేనున్న మరియొక వృద్ధుని వద్దకు తీసుకొని పోయి, రాఘవను ఆ వృద్ధునికి పరిచయము చేసి బాబాగారి పటమును చూపించమని చెప్పెను. అందులకు రెండవ వృద్ధుడు సంతోషపడి ప్రక్కనే పూజలోనున్న దాదాబాబాగారి పటమును చూపెను. బుట్టతల బాబాగారి చిత్రమును రాఘవ శ్రద్ధగా చూచాడు. తర్వాత రాఘవ బాబాగారి విషయమును గురించి రెండవ వృద్ధుని అడగను మొదలుపెట్టెను.)

**రాఘవ :-** మీరు మొట్టమొదట ఎలా బాబాగారిని గుర్తించి ఇక్కడికి రాగలిగారు?

**వృద్ధుడు :-** పది సంవత్సరముల క్రితము ఒక ఆక్సిడెంట్‌లో నా కాలు విరిగినది. అపుడు అసుపత్రిలో చికిత్స నిమిత్తము ఉంటిని. అక్కడే నా ప్రక్క మంచము మీద ఒక తలనొప్పి రోగి ఉండెను. అతనికి ఎన్ని వైద్యములు

చేసినా తలనొప్పి తగ్గలేదట. అందువలన అతను ఆసుపత్రిలో చేరి నెల రోజులుగా చికిత్స చేయించుకొనుచున్నాడు. అయినా అతను తలనొప్పితో అలాగే బాధపడుచుండెను. ఒకరోజు అతని బంధువు ఒకరు వచ్చి దాదాబాబా గారి విభూదిని తెచ్చి ఇచ్చాడు. ఆ విభూదిని ఆ రోగి తలకు వ్రాసుకొని పడుకొన్నాడు. ఉదయము లేచే సమయానికి అతని నొప్పి లేకుండా పోయింది. ఆ విషయము నాకు తెలిసి ఆశ్చర్యపోయాను. ఆ సంఘటనతో బాబాగారు శక్తివంతుడని నాకర్థమైనది. అప్పుడు ప్రక్కనున్న బాబా భక్తునితో విభూదిని కొద్దిగ ఇప్పించుకొని నా కాలికి కూడా కొద్దిగ పూసి మనస్సులోనే బాబాగారిని వేడుకొన్నాను. నేనలా చేసిన సమయము నుండే నా కాలి నొప్పిలో తేడా కనిపించసాగింది. అప్పటి వరకు నడువలేని నేను మూడురోజులకే లేచి కట్టె సహాయముతో నడువసాగాను. కాలి ఎముకకు స్టీల్‌రాడ్ వేయాలన్న డాక్టర్లు నేను నడవడము చూచి ఆశ్చర్య పోయారు. నా కాలును పరీక్షించిన డాక్టర్లు స్టీల్‌రాడ్ అవసరము లేదన్నారు. ఆ విధముగా నా కాలు ఎముక బాబాగారి విభూది వలననే సులభముగా అతుక్కొని పోవడము నిజముగా బాబాగారి మహత్తేనని నాకర్థమైనది. అప్పటి నుండి ఇక్కడికి వచ్చి బాబాగారి సన్నిధిలో ఉంటున్నాను. సంవత్సరానికి మూడు నెలలు ఇక్కడే గడుపుచుంటాను.

**రాఘవ :–** మీరు ఇక్కడికి వచ్చినప్పుడంతా మూడు నెలల కాలముంటున్నారు కదా! మీకు ఆహారము ఇక్కడ ఉచితముగా దొరుకుతుందా, లేక మీరు స్వయాన వండుకుంటారా?

**వృద్ధుడు :–** లేదు నాయనా! ఎవరి ఖర్చు వారు పెట్టుకొని ఉండవలసిందే. ఇక్కడికి వచ్చువారు ఎవరైనా సేవా భావముతోనే వస్తుంటారు. ఎవరి ఖర్చుతో వారుండి పోతుంటారు.

**రాఘవ :-** దాదా బాబాగారు ఎంతో గొప్పవారై ఎందరినో భక్తులను కల్గియున్నాడు కదా! ఇంత గొప్ప వ్యక్తి మన దేశములో ఇప్పుడుగానీ, గతములోగానీ ఎవరూ లేరనుకుంటాను.

**వృద్ధుడు :-** ఎప్పటికీ బాబాగారి సమానులు లేరు. ఒక విషయమును చెప్పదలుచుకొన్నాను. గత జన్మ కాలములోనూ బాబాగారే గొప్ప వ్యక్తిగా ఉండేవారు. ఆ విషయము అందరికీ తెలియక ఈయనకంటే ఆయనే గొప్ప అని కొందరంటున్నారు.

**రాఘవ :-** ఏమిటి తాతగారూ! ఈ బాబాగారి ముందు జన్మ కూడా మీకు తెలుసా! ఎలాగ తెలుసు? బాబాగారు గత జన్మలో ఎలాగుండేవారు?

(వెంటనే ఆ వృద్ధుడు తన సూట్‌కేస్‌లోని ఒక ఫోటోను తీసి చూపించి ఇదే గత జన్మలోని బాబాగారి ఫోటోనని చెప్పాడు. రాఘవ ఆ ఫోటోను ఆశ్చర్యముగా చూచాడు. బాబాగారి ఈ జన్మకు గతజన్మకు ఏమాత్రము పోలికలు లేనట్లు గ్రహించాడు. కానీ రెండు ఫోటోలలోనూ ఒకే ఒక గుర్తు కనిపించింది. అంతవరకు ఎవరూ గుర్తించని ఒక గుర్తును రాఘవ గ్రహించగలిగి ఆ విషయమును బయటికి చెప్పకుండా తన మనస్సు నందే ఉంచుకొన్నాడు. రాఘవ గుర్తించిన ఒక గుర్తు గత జన్మలోనూ, ఈ జన్మలోనూ ఉన్న బాబాగారు ఒక్కరేనను బలమును చేకూర్చుచున్నది. రాఘవ కనుగొన్న రెండు ఫోటోలలోని గుర్తేమిటో ఆ వృద్ధులకు కూడా తెలియదు.)

**రాఘవ :-** తాతగారూ! గత జన్మలో బాబాగారి పేరేమిటి?

**వృద్ధుడు :-** దేశాయి బాబా అను నామధేయముతో గతజన్మలో ఉండేవారు. ఆ జన్మలో ఎన్నో మహత్యములను చూపిన దేశాయి బాబాగారు, ఈ జన్మలో దాదాబాబాగా అవతరించారు. గతజన్మ విషయమూ, అప్పుడు ఎక్కడున్నదీ,

ఏ పేరుతో ఉన్నదీ దాదాబాబాగారే స్వయాన చెప్పారు. బాబాగారు స్వయముగా చెప్పినందున పోయిన జన్మ విషయము తెలిసింది. లేకపోతే తెలిసేది కాదు. గత జన్మలోనే దేశాయి బాబాగారికి ఎంతోమంది భక్తులుండే వారు. అందువలన ఈ జన్మలో దాదాబాబాగారి రూపములోనున్నది దేశాయి బాబా అని తెలియుట వలన, ఆయన భక్తులందరూ ఒక్కమారుగా ఈయన భక్తులైపోయారు. దాదాబాబాగారు కూడా పోయిన జన్మలో మహిమలు చూపినట్లే, ఈ జన్మలో కూడా చూపడము వలన, దాదా బాబాగారికి కోట్లాది మంది భక్తులై పోయారు.

(రాఘవ వృద్ధునితో మాట్లాడుచుండగనే ఆశ్రమప్రాంతములో భక్తులు ఆతృతగ అటూ, ఇటూ తిరగడము పూల తోరణములు కట్టడమును రాఘవ గమనించాడు. తాను చూచిన విషయమును ఆ వృద్ధునికి తెలిపి ఎందుకు తోరణములు కట్టుచున్నారని అడిగాడు. వెంటనే ఆ వృద్ధుడు కూడా అక్కడ జరుగుచున్న హడావిడిని చూచి బాబాగారు వస్తున్నట్లున్నది. అందుకే అలంకరణములు చేయుచున్నారని సంతోషమును వ్యక్తపరుస్తూ చెప్పాడు. తాను వచ్చిన దినమే బాబాగారు రావడము రాఘవకు కూడా ఆనందమైనది. అందరూ బాబాగారి రాకకోసము ఎదురు చూస్తూవుండిరి. కొన్ని గంటల తర్వాత కారు వెనుక కారు వస్తూ కనిపించినవి. ఆశ్రమ ప్రాంతములోనికి ఎన్నో కార్లు వచ్చినవి. వాటి మధ్యలో ఖరీదైన కారులో బాబాగారు వచ్చారు. దాదాబాబాగారు కారునుండి కాలు క్రిందపెట్టగనే భక్తులనుండి పూలవర్షము కురిసింది. తాను వచ్చిన దినమే బాబాగారి దర్శనము దొరికినందుకు రాఘవ సంతోషించాడు. రాఘవ ఐదు దినములు అక్కడే గడిపాడు. ప్రతిదినము ఉదయమూ, సాయంకాలమూ బాబాగారు అక్కడున్న ప్రజలకు దర్శనమిచ్చుచుండెను. దర్శన సమయములో తన

ఖాళీ చేతినుండి విభూదిని సృష్ఠించి కొందరికి ఇచ్చుచుండెను. ఒక భక్తునికి బంగారు ఉంగరమును కూడా తన ఖాళీ చేతిలోనుండి తీసి ఇచ్చాడు. అలా ఉన్నట్లుండి బంగారు వస్తువులనూ, విభూదినీ ఇవ్వడము రాఘవ స్వయాన దగ్గరనుండి చూచాడు. అలా ఇవ్వడము చాలా గొప్ప మహత్యమని రాఘవ అనుకొన్నాడు. దాదాబాబాగారి గొప్పతనమును చూచిన రాఘవ సంతృప్తిగా అక్కడినుండి బయలుదేరి ప్రయాణమును సాగించాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × × ×

(ఎనిమిది మంది ఆటవికుల గుంపులో యోగా, మేఘా, చక్రి అను ముగ్గురు తెలివైన యువకులుండిరి. వారు పట్టణములో జరిగిన సంఘటన తిరిగి జరుగకుండా జాగ్రత్తపడి, వారి ప్రయాణము దారుల వెంబడి కాకుండా దారికి కొంత దూరముగా నడుస్తూ, దారిని ఆధారము చేసుకొని ప్రయాణము సాగించుచుండిరి. అట్లు వారు ఒక రైలుమార్గమును అనుసరిస్తూ, దానికి దాదాపు 200 గజముల దూరములో నడుస్తూ, పోవుచుండిరి. వారు చూస్తున్నంత దూరములో ప్రయాణికుల రైలుబండి వేగముగా వస్తుండెను. ఆటవికులు గతములో ఎప్పుడూ రైలుబండిని చూడలేదు. కావున వస్తున్న రైలును నిలబడి వింతగా చూస్తున్నారు. వారు నిలుచున్న చోటున వరుసగా చెట్లుండుట వలన వారు ఎవరికీ కనిపించకుండిరి. కానీ వారికి రైలు చెట్ల సందులలోనుంచి బాగా కనిపిస్తూవుండెను. ఆటవికులు చూస్తున్న రైలు వేగముగా వారున్న జాగాను దాటిపోయింది. అలా రైలుబండి పోవునపుడు ఒక కంపార్టుమెంటు నుండి రైలుకట్ట ప్రక్కనున్న చెట్ల పొదలలోనికి ఏదో పెట్టెలాంటిది పడినట్లు ఆటవికులు చూచారు. యోగా, మేఘా దానిని గమనించినవారై మిగతా వారికి కూడా ఆ విషయమును తెలిపారు. రైలు రెండు నిమిషములలోనే

కనుచూపుమేరలో కనిపించకుండా పోయెను. రైలు పోయిన తర్వాత ఆటవికులు అందరూ పెట్టెపడిన చెట్లవద్దకు పోయి వెదకసాగిరి. వారిలో చక్రీకి రైలునుండి క్రిందపడిన సూట్‌కేస్ కనిపించినది. వెంటనే దానిని తీసుకొని అందరూ కాలిత్రోవలోనికి చేరిరి. అప్పుడు మధ్యాహ్నము రెండు గంటలగుట చేత ఆకలికొన్నవారై, వారి వద్దనున్న తిండి తినుటకు అక్కడికి సమీపములోనున్న నిమ్మతోటలోని బావివద్దకు చేరిరి. తమ వద్దనున్న తిండి తిన్న తర్వాత నిమ్మచెట్ల క్రింద కూర్చొని సేద తీర్చుకోవలెననుకొనిరి. నిమ్మచెట్ల క్రింద కొద్దిమాత్రము నీడవుండుట వలన, ఒక్కొక్క చెట్టుక్రింద ఒక్కొక్కరు కూర్చొని, విశ్రాంతి తీసుకొనుచూ తమకు దొరికిన పెట్టెలో ఏముందోనని యోచిస్తూ వుండిరి. అంతలో దూరముగా రెండు సైకిల్ మోటర్ల శబ్దము వినిపించెను. పట్టణములో జరిగిన సంఘటనతో జాగ్రత్తగానున్న యోగా చెట్ల చాటునుండి చూడసాగెను. కాలిత్రోవన వస్తూ మోటర్ సైకిళ్ళు రెండూ, సూట్‌కేస్ పడిన చోటికి దగ్గర ఆగినవి. అందులో నుండి దిగిన ఇద్దరు వ్యక్తులు రైలుకట్ట ప్రక్కకు పోయి సూటకేస్ పడిన జాగాలో వెదకసాగిరి. వారు అలా వెదకడమును ఆటవికులందరూ ప్రక్కనేనున్న నిమ్మతోటలో నుండి గమనించుచుండిరి. వెదకి వేసారిన ఇద్దరు వ్యక్తులు వారికి కావలసిన సూట్‌కేస్ దొరకలేదని, దానిని ఎవరో కాజేశారను నిర్ణయానికి వచ్చారు. అక్కడినుండి ఇద్దరూ దారిలోనికి వచ్చి ఇలా మాట్లాడసాగారు.)

**ఒకడు :-** ఒరే వెంకూ! సూట్‌కేస్‌ను ఇక్కడే వేశానురా, అది ఎలా మాయ మైందో అర్థము కాలేదు. మన నాయకునికి ఏమని చెప్పాలి?

**వెంకు :-** నూకా! నీవు భయపడవద్దురా, మన నాయకునికి ఉన్న విషయమును చెప్పవచ్చును. కానీ సూట్‌కేస్‌లో లక్షల విలువైన వజ్రాలున్నాయి కదరా! అవి మనము నష్టపోయినట్లే కదా!

**నూకా :-** మన నాయకుడు మనలను అనుమానిస్తే, మన ప్రాణాలకే ముప్పు కదా!

**వెంకు :-** నీకు అటువంటి భయము ఏమీ వద్దు. నీతో పాటు నేనున్నాను కదా! నాయకుడు నాకు స్వంత అన్నయ్యే కావున ఉన్న విషయమంతా నేను మా అన్నతో చెప్పుతాను. కానీ నేను అర్ధగంట క్రితమే సూట్‌కేస్‌ను రైలునుండి క్రిందికి వేశాను. అప్పుడు ఇక్కడ ఎవరూ లేరు. తర్వాత ఎవరైనా వచ్చి దానిని తీసుకొనివుంటే, వారు చాలా దూరము పోయివుండరు. అందువలన వెంటనే మనము వెదకడము మంచిది.

(వెంకూ, నూకా ఇద్దరు మాట్లాడు మాటలన్నిటిని ఆటవికులు విన్నారు. తమవద్దనున్న సూట్‌కేస్‌లో వజ్రములున్నవని తెలుసుకొన్న ఆటవికులకు ఆశ్చర్యమైంది. అంతలో సైకిల్‌మోటర్ల మీద బయలుదేరబోవు వెంకు దృష్టి నిమ్మతోట మీద పడింది. ఈ తోటలో ఎవరైనా తోటవారుండ వచ్చును. ఒకవేళ వారు రైలునుండి పడిన సూట్‌కేస్‌ను గమనించి వారు తీసియుండవచ్చును. ఎందుకైనా మంచిది తోటలోనికి పోయి చూచి వస్తామని వెంకు, నూకా నిర్ణయించుకొని ఇద్దరూ తోటవైపు వచ్చారు.)

× × × × × × × × × × × × × × × × × × × × × × ×

(తాటిమాను మునెప్ప దొంగల ముఠానాయకుడు. మునెప్ప తమకు సమయానికి చేరవలసిన వజ్రములు చేరనందుకూ, తమ మనుషులు కూడా రానందుకు యోచిస్తూవుండెను. ఒకవేళ పోలీసుల బెడద తమవారికి ఎదురైనదేమోనని తలచి, తన ముఠాలోని జాన్ అనే వాడిని పిలిచి ఇలా చెప్పాడు.)

**మునెప్ప :-** మనవారు ఇప్పటికి వజ్రాలతో రావలసివుంది, కానీ ఇంతవరకు

రాలేదు. వారికేమైనా ఇబ్బంది కానీ, ప్రమాదముగానీ జరిగివుండవచ్చును. ముఖ్యమైన విషయము కావున నా తమ్ముడు కూడా పోయాడు. నీవు పోయి ఈ విషయమునంతటిని పూర్తిగా తెలుసుకొనిరా.

**జాన్ :-** అలాగే బాస్, ఒకవేళ మనవారు పోలీసులకు దొరికివుంటే నేనేమి చేయాలి?

**మునెప్ప :-** మనవారు సులభముగా దొరకరు. ఒకవేళ వారు దొరికినప్పటికీ మనవారి వద్దనున్న వజ్రాలను పోలీసులు గమనించలేరు. మనవారు పోలీస్ కస్టడిలో వుంటే నీవు తెలివిగా వారిని కలుసుకో, మనవారు దొరికిపోయి వజ్రములు దొరకనట్లయితే కుడి భుజమును బరుక్కొంటారు. ఒకవేళ వజ్రాలతో సహా దొరికివుంటే ఎడమ భుజమును బరుక్కుంటారు. నీవు వెంటనే వచ్చి ఆ విషయమును తెలియజేయి.

**జాన్ :-** బాస్! మనవారు పోలీసులకు దొరకలేదెమో!

**మునెప్ప :-** అలా దొరకకపోతే ఈ వేళకు వారు వచ్చి చేరివుండవలసింది. ఇది వజ్రాల వ్యవహారము. ఇందులో మనకు కమీషన్ మాత్రము వస్తుంది. వజ్రాలు పోతే మనము వాటి మొత్తము ఇవ్వాల్సి వస్తుంది. మనము పెద్ద ఇబ్బందిలో పడతాము. అందువలన నీవు వెంటనే ఈ విషయమును తెలుసుకొనిరా.

**జాన్ :-** అలాగే బాస్ (తన పెంపుడు కుక్క జానీతో సహా జాన్ బయలు దేరిపోయాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(శాంతిపురములోని ఆశ్రమములో వృద్ధుని వలన దాదాబాబా గారిని గూర్చి అనేక విషయములు తెలుసుకొన్న రాఘవ తన అన్వేషణలో

ఇంకా కొంత ప్రయాణము సాగించాడు. అలా పోవుచున్న రాఘవకు ఒకచోట సత్యాన్వేషణ సమితి అను పేరుగల ఒక బోర్డు కనిపించింది. రాఘవకు కావలసింది సత్యాన్వేషణే కనుక వెంటనే అచటికి పోయి అక్కడేమి తెలియబడునో అది తెలుసుకుందామనుకొన్నాడు. అలాగే పోయాడు. తన ఉద్దేశమును తెలిపాడు. దానికి ఆ సమితివారు సంతోషించి, మంచి భోజనమును పెట్టి, నీవు ఏదైనా అడిగి తెలుసుకోవచ్చును. ఇక్కడ చెప్పేదంతా సత్యమేవుంటుంది. అసత్యమును ఖండించి సత్యమును తెలుపడమే తమ పని అని రాఘవతో చెప్పారు.

సత్యాన్వేషణ సమితి అంటే ఏదో దైవజ్ఞానమును బోధించునదని రాఘవ అనుకొన్నాడు. నిజానికి ఆ సమితి అలాంటిది కాదు. పేరు మంచిదే అయినా అది ఒక హేతువాద సంఘములాంటిది. అలాగని అనుకొనుటకు కూడా వీలులేదు. పైకి సత్యాన్వేషణ అని హేతువాదములాగ కనిపించినా వాస్తవానికి అది నాస్తికవాదమునకు సంబంధించినదేనని చెప్పవచ్చును. 'సత్యాన్వేషణ' అను పేరును అడ్డము పెట్టుకొని అన్నిటినీ అడ్డముగా ఖండించడము తప్ప వేరే ఉద్దేశము అందులో లేనేలేదు. అందరిని ఖండించుచూ, అందరికంటే నేనే తెలిసినవాడిననిపించుకోవాలను తపన తప్ప సత్యమును అనుసరించి మాట్లాడడము ఏమీ ఉండదు. రాఘవ సత్యాన్వేషణ ఏమాత్రములేని అటువంటి నాస్తికులను ఈ విధముగా ప్రశ్నించను మొదలు పెట్టాడు.)

**రాఘవ :-** దేవుడున్నాడనీ, అతను కనిపించకుండా ఉన్నాడని కొందరు అంటుంటారు. ఈ మాటలో సత్యమెంతవుంది?

**సత్యవాది :-** కనిపించని దేవుడున్నాడనడము సత్యము కాదు.

**రాఘవ :–** దయ్యముకలదనీ అది కొందరికి కనిపించిందని అంటుంటారు. ఈ మాటలో సత్యమెంతవుంది?

**సత్యవాది :–** దేవుడు కనిపించడను మాట, దయ్యము కనిపిస్తుందను మాట రెండూ సత్యము కాదు. వాస్తవానికి సత్యశోధనలో అభౌతికమైన దేవుడు లేడూ, అట్లే అభౌతికమైన దయ్యము లేదు.

**రాఘవ :–** కొందరు స్వామీజీలు కొన్ని మహత్యములు కల్గివుంటారనగా విన్నాను. ఈ మాటలో సత్యమెంతవుంది?

**సత్యవాది :–** ఈ మాటలో కూడా సత్యము ఏమాత్రము లేదు. అసలు మహత్యమనునదే లేదు. ఒకవేళ ఎవరైనా మహత్యములు చూపుచున్నారంటే అది తన మ్యాజిక్‌ను ఎవరికీ తెలియకుండా మహత్యముగా చెప్పుచున్నారనీ, వారు ప్రజలను మభ్యపెట్టి మ్యాజిక్ చేసి చూపిస్తున్నారు తప్ప అవి మహిమలు కావని చెప్పవచ్చును.

**రాఘవ :–** క్రైస్తవులకు ప్రవక్త ఏసు, హిందువులకు ప్రవక్త కృష్ణుడు అని అంటుంటారు. ఈ మాటలో సత్యమెంతవుంది?

**సత్యవాది :–** ఏసు, కృష్ణుడు కొన్ని మాటలు చెప్పారు. అందువలన కొందరు వారిని ప్రవక్తలంటున్నారు. నిజముగా వారు వక్తలు మాత్రమే, ప్రవక్తలు కాదు.

**రాఘవ :–** వారు గొప్పవారని అందరూ అంటున్నారు కదా! వారు గొప్పవారు కాదా?

**సత్యవాది :–** వారికంటే నేనే గొప్పవాడిని, నాకు తెలిసినంత కూడా వారికి తెలియదు. వారిలో సత్యాన్వేషణే లేదు.

**రాఘవ :-** ఇప్పటి కాలములోనైనా గొప్ప జ్ఞానులు ఎవరైనా ఉన్నారా?

**సత్యవాది :-** అలా లేరనేగా నేను సత్యాన్వేషణ సమితిని స్థాపించినది. ఇతను జ్ఞాని అని ఎవరైనా అంటే అతను అభౌతికమైన దానిని గురించి బోధిస్తుంటాడు. భౌతికము తప్ప అభౌతికము నిరూపణకు రాదు. అందువలన అభౌతికమును ఖండించి సత్యమును తెలుపు నేను తప్ప ఎవరూ నిజమైన జ్ఞానులు భూమిమీద లేరు. నేను ఎంతోమందితో వాదించాను. నా వాదనకు అందరూ ఓడిపోయారు.

(ఆ మాటలతో రాఘవకు కొంత అనుమానము వచ్చినది. ఇంతకూ ఈయన సత్యవాదియా లేక నాస్తికవాదియా అని మనస్సులో ప్రశ్న వచ్చి దానిని దృఢపరచుకొనుటకు కొన్ని ప్రశ్నలు అడిగాడు).

**రాఘవ :-** మనిషి శరీరము కనిపించినా, శరీరములోని జీవుడు కనిపించడు. కొందరు తత్త్వవేత్తలు కనిపించే శరీరమును పుట్టగా, కనిపించని జీవున్ని పుట్టలోని పాముగా చెప్పుచుండుట విన్నాను. దీనినిబట్టి కనిపించు శరీరము భౌతికము అయితే, కనిపించని జీవుడు అభౌతికము అగునుకదా! దీనిని గురించి మీరేమంటారు?

**సత్యవాది :-** అభౌతికము అనునది లేనేలేదు. జీవుడు అనేవాడూ లేడూ, దేవుడు అనేవాడూ లేడు. ఇదంతా సైన్సు (విజ్ఞానము) తెలియనివారు మాట్లాడే విధానము. శరీరములో జీవకణములున్నాయి. జీవకణములు పని చేసినంతవరకు మనిషి బ్రతుకుచున్నాడు. జీవకణములు పని చేయని స్థితిలో మనిషి చనిపోతున్నాడు. అంతేతప్ప ప్రత్యేకముగా జీవుడు ఉన్నాడనడము అసత్యవాదమగును.

(ఈ మాటతో రాఘవకు వీరు మాట్లాడునది నాస్తికవాదము తప్ప సత్యవాదము కాదని కొంతవరకు అర్థమైనది.)

**రాఘవ :-** సృష్ఠి, సృష్ఠికర్త అని కొందరంటుంటారు. ఒక వస్తువుంది అంటే అది సృష్ఠింపబడినదనీ, దానిని సృష్ఠించినవాడున్నాడనీ చెప్పు చుందురు. ఆ పద్ధతి ప్రకారము ఈ విశ్వమును సృష్ఠించినవాడు ఒకడున్నాడా?

**సత్యవాది :-** మనిషి సృష్ఠిలోని ఒక భాగమే, అట్లే భూమి, ఆకాశము, సముద్రములు కూడా సృష్ఠిలోని భాగములే. అయితే వీటికి సృష్ఠికర్త ఒకడున్నాడనుకోవడము పొరపాటు. కనిపించే ఇవి మాత్రమే కాకుండా సూర్యుడు, చంద్రుడు మొదలగు గ్రహములు, ఇంకా విశ్వములోని నక్షత్రములు, నక్షత్ర సముదాయమైన పాలపుంతలు ఇంకా ఎన్నో పరస్పరము వాతావరణ మార్పువలన ఏర్పడుచున్నవి, అట్లే నశించుచున్నవి. ఇదంతా ఖగోళశాస్త్రమును చూస్తే తెలుస్తుంది. అంతేగానీ ఈ విశ్వమును పుట్టించిన వాడుగానీ, నాశనము చేయువాడుగానీ లేనేలేడు అనుట సత్యము.

(ఈ మాటతో ఇతను పూర్తి నాస్తికవాదనీ, ఇతను సత్యవాదినను ముసుగు తగిలించుకొన్నాడని అర్థమైనది.)

**రాఘవ :-** మీరు చాలా బాగా చెప్పుచున్నారు. అయినా నావద్ద అడిగే దానికి ప్రశ్నలు లేకుండాపోయినవి. చివరిగా ఒక ప్రశ్న అడుగుచున్నాను. అదేమనగా! సత్యమంటే ఏమిటి? అసత్యమంటే ఏమిటి?

**సత్యవాది :-** సత్యమంటే సైన్సు, సైన్సు కానిది అంతా అసత్యమే. ఇంకా చెప్పితే సైన్సు అంటే విజ్ఞానము, సైన్సు కానిది అజ్ఞానము.

(ఈ మాటతో సత్యాన్వేషి అయిన రాఘవకు సత్యవాదిలో అసత్య వాది, నాస్తికవాది కనిపించినట్లయినది. ఇంక ఇతనితో ఒక్కమాట మాట్లాడినా అది వృథా ప్రయాసయే అనుకున్నాడు. అంతవరకు తనతో మాట్లాడినందుకు అతనికి ధన్యవాదములు తెలిపి అక్కడినుండి బయటపడి, తనకు మూడు చోట్ల ఎదురైన అనుభవములను తలచుకొంటూ ఇక ఎక్కడికి పోయినా ప్రయోజనములేదని, రాజయోగానంద స్వామి వద్దకు పోవుటకు నిర్ణయించుకొని తిరుగు ప్రయాణము సాగించెను. చివరకు రాజయోగానంద స్వామి వద్దకు చేరిన రాఘవ తాను మూడు ఆశ్రమములకు పోయి అక్కడ పొందిన అనుభవములను స్వామిగారికి చెప్పసాగెను. మొదట సత్యాన్వేషణ సమితి వారితో జరిగిన సంభాషణ గురించి చెప్పెను.)

**రాఘవ :-** స్వామీ! మీరు కొన్ని ప్రాంతములకు పోయి, అచ్చట వారి విధానములు తెలుసుకొనిరమ్మన్నారు. అలాగే పోయివచ్చాను. నేను అక్కడికి పోయి రాకపోతే ఆధ్యాత్మిక లోకములో మనుషులు ఇన్ని విధములున్నారని తెలిసేదేకాదు. పోయివచ్చిన దానివలన ఎంతో అనుభవము కల్గినది. విచిత్రమేమి అంటే దేవుడున్నాడు అనువారు, తెలియక సరియైన జ్ఞాన మార్గములో నడువలేదు అంటే, దానికి సమాధానముగా వారికి తెలిసిన మార్గములో వారు నడుస్తున్నారులే అనుకోవచ్చును. కానీ సత్యాన్వేషణ అని బోర్డు పెట్టుకొని దేవుని విషయములో ఏమాత్రము సత్యమార్గమును కాకుండా, అసత్య మార్గమును అనుసరిస్తూ, తమదే సత్యమని చెప్పుకొను వారుండుట, నాకు చాలా విచిత్రముగా తోచింది. భౌతికము తప్ప అభౌతికము లేదని చెప్పడమే వారి సత్యవాదనట. దేవుడేలేడని పూర్తి నాస్తికత్వమును బోధిస్తూ అంతకంటే సత్యము లేదనీ, అలా చెప్పడమే సరియైన సత్యవాదన అని చెప్పడము జరిగినది. ఇది నాకు చాలా క్రొత్త అనుభవము.

**రాజయోగానంద :-** సత్యాన్వేషణ సమితిని స్థాపించినది నీతో మాట్లాడిన వ్యక్తియే. అతను తాను బయటికి తెలియాలను కోర్కెతో సైన్సు అనీ, సత్యాన్వేషణ అని చెప్పుచూ, అందరికీ అడ్డముగా మాట్లాడి, తాను మిన్న అనిపించుకోవాలని ఆయన ఉద్దేశము. ఆయన ఇప్పటివారికంటే నేను గొప్ప అనడమే కాకుండా, పూర్వపు ప్రవక్తలకంటే నేనే గొప్పవాడిని అని చెప్పుకోవడము ఆయనకు అలవాటు. సత్యాన్వేషణ అను ముసుగు తగిలించుకొని అయినదానికీ కానిదానికీ సైన్సు అని చెప్పుచూ, ఇతరులను తక్కువచేసి మాట్లాడడము ఆయనకున్న రోగము. అతను దైవజ్ఞానము చెప్పే వారందరినీ మోసగాళ్ళంటుంటాడు.

**రాఘవ :-** అటువంటి వ్యక్తివద్దకు ఎవరు పోతారు? ఆయన బోధలు ఎవరు వింటారు?

**రాజయోగానంద :-** ఏ జాతి పక్షి ఆ జాతి గూటికే చేరునన్నట్లు, అటువంటి నాస్తికత్వ భావములుగలవారే ఆయనవద్దకు పోవుచుందురు. పైకి తమకే చదువంతా వచ్చిన వారివలే, తమకే శాస్త్రములన్నీ తెలిసినట్లు కొన్ని శాస్త్రముల పేర్లు చెప్పుచూ, ఆయా శాస్త్రములలో లేనిది కూడా ఉన్నదని బుకాయిస్తుందురు. అందువలన వారి సంఘములు వారివరకే పరిమితమై వుంటాయి. ప్రజలు ఎవరూ వారినీ, వారి మాటలనూ విశ్వసించరు.

**రాఘవ :-** వారు చెప్పే సైన్సు ప్రకారమైనా అభౌతికముగా కనిపించనిది సైన్సుకాదని చెప్పుటకు వీలులేదు కదా! హాస్పిటల్స్‌లో తీయు ఎక్స్‌రే కిరణములు కంటికి కనిపించవు కదా! కనిపించనంతమాత్రమున ఎక్స్‌రే కిరణములను సైన్సుకాదంటామా? టీవీ రిమోట్ ద్వారా దూరమునుండి టీవీని ఆన్ చేయవచ్చును, ఛానల్స్‌ను మార్చవచ్చును. అక్కడ రిమోట్

పని అంతయూ అభౌతికమే కదా! దానిని సైన్సుకాదన వచ్చునా, అట్లు అభౌతికమును ఒప్పుకోకపోతే వారు సైన్సునే ఒప్పుకోనట్లగును.

**రాజయోగానంద :-** ఎవరు ఏమి మాట్లాడినా వారికి వ్యతిరేఖముగా మాట్లాడి ఎదుటివారి వాదనను కాదనడమే వారి ముఖ్య ఉద్దేశ్యము. అందువలన ఎక్స్‌రే కిరణములను గురించిగానీ, టీవీ రిమోట్స్ గురించిగానీ అడిగితే అది మీకు తెలియని సైన్సు, అది అభౌతికము కాదు. అందులో ఎలక్ట్రికల్ కిరణములుండుట వలన అవి కనిపించవు. అవి కనిపించనంతమాత్రమున మీరనుకొన్నట్లు అభౌతికము కాదు. అందులో కిరణములున్నవి, వాటి వలన పనులు జరుగుచున్నవి. అందులో అవి భౌతికమే! మీరు అనుకొన్నట్లు అభౌతికము కాదు అని చెప్పుచుందురు. ఈ విధముగా మనము టీవీ రిమోట్‌ను గురించి, యక్స్‌రే కిరణములను గురించి అభౌతికము అంటే అవి అభౌతికమైనప్పటికీ కాదు అవి భౌతికమే అని ఆ శాస్త్రము, ఈ శాస్త్రము అని అడ్డము మాట్లాడి, ఎదుటివాని నోరు మూయించాలని చూడడమే, సత్యాన్వేషణ సమితి ముఖ్య కార్యక్రమము. ఈ మొండి వారితో ఎందుకు వాదించాలి, వాదించినా ఏమీ ప్రయోజనము ఉండదని, ఎవరైనా వారితో వాదించడమును విరమించుకొంటే, మా వాదనకు వారు ఓడిపోయారని ప్రచారము కూడా చేసుకొందురు. తెలివున్న వాడు ఎవడూ మూర్ఖునితో మాట్లాడడు. ఇటువంటి వారికి శాస్త్రములు ఎన్నో తెలియవు, మేము శాస్త్రవేత్తలమంటారు. పూర్వమునుండి పెద్దలు ఏర్పరచిన షట్ శాస్త్రములు ఏవో కూడా వారికి తెలియదు. ఎంతో తెలివిని ఉపయోగించి వాక్ చాతుర్యముగా మాట్లాడినప్పటికీ, వారు కేవలము నాల్గు శాస్త్రములు గురించే మాట్లాడుచుందురు. రెండు శాస్త్రముల కొడి, గోత్రము కూడా వారికి తెలియదు. అయినా అందరికంటే మేమే గొప్ప సత్యవాదులమనీ,

సత్యాన్వేషులమనీ చెప్పుకొనుచుందురు. వారిదొక ముదిరిన పిచ్చివాదననీ, వారికి ఏ శాస్త్రము మీద పూర్తి అవగాహన ఉండదనీ, మాట్లాడే దానికి మాత్రము శాస్త్రముల పేర్లు వాడుకొనుచుందురనీ, ఎదుటి వారి వాదనను ఖండించి, ఏదో ఒక విధముగా అడ్డదారిలో మాట్లాడడమే, వారి పని అని తెలియుచున్నది.

**రాఘవ :–** నేను కొద్దిసేపు వారితో మాట్లాడిన తర్వాత మీరు చెప్పినట్లే వీరితో మాట్లాడడము వలన ప్రయోజనము లేదనిపించింది. అంతేకాక వారు ఒక విధమైన నాస్తికవాదులుగా కనిపించారు. మీరు చెప్పినట్లు వారిది సత్యవాదన కాదని నాకు అర్థమైనది.

**రాజయోగానంద :–** కాలుకు వేస్తే మెడకూ, మెడకు వేస్తే కాలికీ వేయడమే వీరిపని. ఇటువంటి మొండివారు కూడా సమాజములో ఎందరో కలరు. అటువంటి వారిలో సత్యాన్వేషణ సంఘము వారు ఒక రకమనుకో. ఇటువంటి వారితో వాదన కొరివితో తల కొరుగుకున్నట్లుండును. అందువలన మంచివారు ఎవరూ వారితో సంబంధము పెట్టుకోరు. ఇటువంటి వారి విషయము వదలిపెట్టి ఇతర విషయమేమైనా ఉంటే, అందులో ఏదైనా అనుమానముంటే అడుగు.

**రాఘవ :–** స్వామీ! శాంతినగరము అను ఊరులో దాదాబాబాగారు అను ఒక స్వామీజీని దర్శించుకొని వచ్చాను. అక్కడ వారి ఆశ్రమము ఇది వైకుంఠపురమా! అన్నట్లున్నది. ఎన్నో వేలమంది స్వదేశీ భక్తులూ, వందల మంది విదేశీ భక్తులు అక్కడున్నారు. దాదాబాబాగారు స్వయముగా తన హస్తమునుండి విభూది ఇస్తున్నాడు. అంతేకాక కొన్ని వస్తువులను కూడా సృష్ఠించి ఇస్తున్నాడు. అలా ఇవ్వడమేకాక ఎందరో భక్తుల ఇళ్ళలో దాదా బాబాగారి ఫోటోనుండి విభూది రాలడము, కుంకుమ రాలడము జరుగు

చున్నది. ఇన్ని మహత్యములను బాబా ద్వారా చాలామంది చూస్తున్నారు. ఇన్ని విధముల మహత్యములుగల బాబాగారు చాలా గొప్పవ్యక్తి అని నేను అనుకొనుచున్నాను. ఎన్నో లక్షలమంది భక్తులు ఆయనను ప్రత్యక్ష దైవముగా భావిస్తున్నారు, అలాగే పూజిస్తున్నారు. అంత గొప్పవ్యక్తిని నేను ఇంతవరకు ఎక్కడా చూడలేదు. ఆయన దర్శనము కూడా నాకు లభించినది. దానిని నేను గొప్ప భాగ్యముగా తలచాను. ఆయనను అక్కడి వారందరూ సాక్షాత్తూ దేవుడని చెప్పడమును ప్రత్యక్షముగా చూచివచ్చాను. అందరూ అనుకొన్నట్లు ఆయన ప్రత్యక్ష దేవుడా? లేక అసామాన్యమైన గొప్పవ్యక్తియా? అను సంశయము నాలో కొద్దిగవున్నది. దానిని గురించి వివరించమని కోరుచున్నాను.

**(**రాఘవ మాటలను విన్న రాజయోగానంద స్వామి చిన్నగ నవ్వి, దీర్ఘముగా తలూపి ఇలా చెప్పాడు.**)**

**రాజయోగానంద :-** నీవు కూడా అందరివలె అజ్ఞానమను బుట్టలో పడి పోయావు. నిన్ను సత్యాన్వేషణ చేయమన్నాను. సత్యాన్వేషణ చేయువారు ఒక విషయములోని పూర్తి సత్యమును తెలుసుకొనువరకు, ఒక నిర్ధారణకు రాకూడదు. ఒక నిర్ధారణకు వచ్చేముందు ఆ విషయము పూర్తి శాస్త్రబద్ద మైనదో కాదో శోధించి చూడాలి. శాస్త్రబద్దమైనపుడే ఆ విషయము మీద నిర్ధారణకు వచ్చి అది సత్యమైనదిగా చెప్పవచ్చును. అట్లుకాకుండా ఎవరో చెప్పిన అశాస్త్రీయ మాటలను నమ్మి, మనము కూడా అట్లే చెప్పితే అది అసత్యవాదనగును. అప్పుడు మనది సత్యాన్వేషణ అని చెప్పుటకు వీలులేదు.

**(**రాఘవ తాను పొరపడ్డానని గ్రహించి, తన తప్పును అర్థము చేసుకొని స్వామివారితో వినయముగా ఇట్లన్నాడు.**)**

**రాఘవ :-** స్వామీ! మీరన్నట్లు నేను సులభముగా పొరపడిపోయాను. విన్న విషయము సత్యమా కాదాయని యోచించలేదు. నిర్ధారణ చేయక ముందే అందరిలాగా సత్యమనుకొన్నాను. నా మెదడుకు అందని విషయములు, నా యోచనకు కనిపించని విషయములు కొన్ని ఉన్నందున నేను పొరపడ్డాను. నాకు తెలియని విషయములను మిమ్ములను అడిగి తెలుసుకోవాలి. కానీ నేను అట్లు అడిగి తెలుసుకోకముందే ఒక నిర్ధారణకు వచ్చాను. ఈ నా తప్పును క్షమించి నాకు అర్థము కానటువంటి మహత్యముల వివరమును శాస్త్రీయముగా తెలుపమనికోరుచున్నాను.

**రాజయోగానంద :-** సరే, నీవు మహత్యములోని శాస్త్రీయతను కోరినందుకు సంతోషము. **ప్రపంచములో ఒక విషయము శాశ్వితముగా నిలువాలంటే దానికి శాస్త్రీయత ఊపిరిలాంటిది. శాస్త్రీయత లేనిది ఏదీ సత్యముకాదు, శాశ్వితముకాదు.** నీవు పొరపడిన విషయము మహత్యము. మహత్యమువద్ద నీవు ఒక్కనివే కాదు. నీకంటే పెద్ద మేధావులు కూడా పొరపడి పోయారు. అందువలన ఈ విషయమును జాగ్రత్తగా వినుము. మహత్యము అను పదములో గొప్పతనము అను అర్థము గలదు. **మహ + ఆత్మ=మహాత్మ అయినట్లు, మహ+ ఆత్య = మహాత్య అగుచున్నది.** హత్య అనగా చంపడము అని అర్థము, అలాగే ఆత్య అనగా జీవింపచేయడము అని అర్థము. దీనినిబట్టి గొప్పగా జీవింపచేయడము అని అర్థమగుచున్నది. ఒక మహత్యము ఒక మనిషిని గొప్పగా బయటి మనుషులకు కనిపించునట్లు చేయడము వలన ఆ వ్యక్తి గొప్పగ జీవించుటకు అవకాశము కలదు. 'మహాత్య' అను శబ్దము కాలక్రమమున 'మహత్య' అని పలుకబడుచున్నది. **మహత్యములు మూడు రకములు గలవు.** అందులో రెండు రకములను మనిషి చేయగలడు. మనిషి చేయు రెండు రకములలో ఒక దానిని మనిషి

తన హస్త లాఘవము చేత చేయును. అట్లే రెండవ దానిని తాను నేర్చిన ఒక రకమైన విద్యచేత చేయగలడు. మూడవ దానిని ఏ మనిషీ చేయలేడు. మూడవ రక మహత్యము మనిషికి తెలియకుండా జరుగును.

మనిషి చేయగలుగు రెండు రకముల మహత్యములకు పేర్లు కూడా కలవు. వాటినే టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ విద్యలంటాము. ఈ మూడు రకముల పేర్లలో మనిషి చేయగల మొదటి రక మహత్యమును టక్కుటమారా విద్య అంటారు. అలాగే మనిషి చేయు రెండవ రక మహత్యమును ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ విద్యలంటారు. ఈ రెండు రకముల మహత్యములను మనిషి నేర్చుకో వచ్చును. అందువలన వీటిని విద్యలు అంటున్నాము. ఇకపోతే మూడవ రక మహత్యమును ఏ మనిషీ చేయలేడు, ఏ మనిషీ నేర్వలేడు. అందువలన అది ఏ విద్యాకాదు. మొదటి రెండు రకముల మహత్య విద్యలలో మొదటిది టక్కుటమారా. దీనిని మనిషి హస్తలాఘవముచేత చేయుచున్నాడు. ఉదాహరణకు ఒక రూపాయి నాణెమును చేతిలో పెట్టుకొని హస్త లాఘవము చేత, లేనట్లు ఒకమారు, ఉన్నట్లు ఒకమారు చూపడము. దానిని చూచువారు ఉన్న రూపాయిని మాయము చేశాడనీ, అట్లే లేని రూపాయిని సృష్టించి చూపాడని అనుకొందురు. దానివలన అది మొదటి రక మహత్యమగు చున్నది. ఇకపోతే రెండవరక మహత్యము మంత్ర విద్యవలన వస్తున్నది. మనిషికి కనిపించని ఎంత పెద్ద వస్తువునైనా కనిపించునట్లు చేయడమూ, అట్లే కనిపించు దేనినైనా కనిపించకుండా చేయడమును ఇంద్రజాల మహేంద్రజాల విద్య అంటున్నాము. అదే విధముగా మనకు వినిపించని శబ్దమును తాను విని చెప్పడమును గజకర్ణ గోకర్ణ విద్య అంటాము. రెండవ రకమైన ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ విద్యలను మనిషి

మంత్రశక్తి చేత పొందుచున్నాడు. మూడవ రక మహత్యము మనిషికి సంబంధములేనిది. దానిని స్వయముగా ప్రకృతి (మాయ)యే చేయును. నీవు దాదాబాబాగారివద్ద జరుగుచున్న మహత్యమేమిటో చెప్పు అది ఏ రకమైన మహత్యమో, అది ఎలా జరగుచున్నదో వివరించి చెప్పగలను.

**రాఘవ :-** స్వామీ! దాదాబాబాగారు తనచేతినుండి విభూది ఇస్తున్నారు. అలాగే బంగారు ఉంగరములనూ, బంగారు దండలను ఇస్తున్నాడు. బాబాగారు అలా ఇవ్వడమును ఏ మహత్యము అనవచ్చును? ఇది ఆత్మ జ్ఞానమునకు సంబంధములేదా? ఇది బ్రహ్మవిద్యకాదా?

**రాజయోగా :-** ప్రపంచములో ఎక్కడ ఎవరు ఏ మహత్యమును చూపినా, అది ప్రపంచ విద్యయే, కానీ పరమాత్మ విద్యకాదు. ఏ మహత్యమైనా ప్రకృతి (మాయ) వలన జరుగునదే, కానీ పరమాత్మ వలన జరుగునది కాదు. ఏ మహత్యమైనా ఆత్మజ్ఞానమునకు సంబంధములేదు. దాదాబాబా గారు విభూది ఇచ్చారంటున్నావు కదా! అలా విభూది ఇచ్చువారు ఇంకా కొందరున్నారు. అది టక్కుటమారా విద్యలలోనికి వచ్చును. విభూదిని కొందరు బాబాలు ఇస్తుండగా అది మహత్యము కాదు, అది ఇతరులను మభ్యపెట్టుటకు చేయు మోసపూరిత పనియనీ, అలాంటి ట్రిక్కును మేము చేసి చూపించగలమనీ కొందరు నాస్తికవాదులు, విజ్ఞాన వేదికవారు కూడా విభూదిని చేతినుండి ఇస్తున్నారు. అలాంటి పనిని ఎలా చేయవచ్చునో కూడా వివరముగా చెప్పుచున్నారు. బాబాలు ఇచ్చునట్లు తాము కూడా చేతినుండి విభూదిని ఇస్తూ, ఈ పనిని కొంత చాకచక్యము కలవారు ఎవరైనా చేయవచ్చునని చూపిస్తున్నారు. అందువలన బాబాలు విభూది ఇచ్చినా, బయటికి కొందరికి అది మహత్తుగా కనిపించినా, చివరకు అది ప్రపంచ విద్యయేననీ తెలిసి పోయినది. హస్తలాఘవము చేత

తమవద్దవుంచుకొన్న విభూదిని అప్పుడే సృష్టించినట్లు నటించి ఇచ్చినా, అది టక్కుటమారా విద్య అనీ, గారడీ చేయువాడు చేయు మ్యాజిక్‌లాంటిదనీ తెలిసిపోయినది. అందువలన అది ఆత్మజ్ఞానము కాదని చెప్పవచ్చును.

నాస్తికవాదులు కేవలము బాబాలను విమర్శించుటయే తమపనిగా పెట్టుకొన్నారు. కాబట్టి కొందరు బాబాలు చేయు విభూది మహత్యమును తాము కూడా చేసి చూపి, ఇది హస్తలాఘవము చేత చేయుపనియేననీ మహత్యముకాదని ఋజువు చేయుచున్నారు. ఇటువంటి టక్కుటమారా మహత్యములను కొన్నింటిని నాస్తికవాదులు, విజ్ఞానవాదులూ చేసి చూపించ డమేకాక, మహత్యములు అన్నియు ఇతరులను మోసము చేయు మ్యాజిక్ విద్యలేనని ప్రచారము చేయుచున్నారు. కానీ మహత్యములు మూడు రకములనీ, వాటిలో తమకు తెలిసినది ఒకరకమేనని నాస్తికవాదులకూ, విజ్ఞానవాదులకూ తెలియదు. కొన్ని టక్కుటమారా విద్యలను చేసి చూపించినా మిగత రెండవ రక మంత్ర విద్యలైన ఇంద్రజాల, మహేంద్ర జాల, గజకర్ణ గోకర్ణ విద్యలను చేసి చూపలేరు. ఒకవేళ ఈ రెండవ రక మహత్యములను కూడా టక్కుటమారా విద్యలలాగా హస్తలాఘవముతో చేయు విద్యలేనని ఇతరులకు చెప్పి నమ్మించినా, వాస్తవముగా నాస్తికవాదులు వాటిని చేసి చూపించలేరు. ఇకపోతే మూడవరక మహత్యము కేవలము కొందరు ముఖ్యమైన స్వాములు, బాబాలవద్ద మాత్రమే జరుగుచుండును. అటువంటి మహత్యములను నాస్తికవాదులు కూడా వివరముగా ఖండించ లేరు. వాటి విషయములో మౌనముగా ఉందురు. మూడవ రక మహత్యములను మ్యాజిక్ విద్యలుగా చెప్పుటకు కూడా వీలుండదు. అందువలన వీటి విషయములో విజ్ఞానులమను వారుగానీ, నాస్తికులమను వారు గానీ ఏమీ మాట్లాడరు. ఇపుడు రెండవ రక మహత్యములైన

ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ విద్యలను గురించి చెప్పెదను విను.

ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ విద్యలు హస్త లాఘవములు కావు. ఇవి మంత్రశక్తితో కూడుకొన్నవి. పూర్వము ఈ విద్యలకు విలువా, ఆదరణా ఉండెడిది. కావున పూర్వకాలములో చాలామంది ఈ విద్యలను నేర్చుకొనెడివారు. అందువలన మంత్రవిద్యల వివరము ఆనాడు అందరికీ తెలిసివుండేది. కాలక్రమేపి ఆ మంత్ర విద్యలు అడుగంటిపోయినవి. వాటి అవగాహన ఎవరికీ లేకుండాపోయినది. అయినప్పటికీ ఇప్పటి కాలములో కూడా అరుదుగా కొద్దిమంది మాత్రమే ఈ విద్యలను తెలిసినవారు ఉన్నారు. అటువంటివారు కేరళరాష్ట్రములో ఉన్నారని చెప్పవచ్చును. మంత్రవిద్యలకు మళయాల దేశమైన కేరళరాష్ట్రము పుట్టినిల్లులాంటిది. ఆంధ్రరాష్ట్రములో బహు అరుదుగా మంత్రవిద్య తెలిసిన వారున్నారు. అలా తెలసినవారు బాబాలుగా, స్వాములుగా చలామణి అగుచున్నారు. తమ మంత్రవిద్యచేత కొన్ని మహత్యములు చేయగల్గిన వారు, ఆ మహత్యములు తమకున్న దైవశక్తి చేత జరిగినవని ప్రచారము చేయుట చేత, ప్రజల దృష్ఠిలో అటువంటివారు గొప్పగొప్ప స్వాములుగా బాబాలుగా చలామణి అగుచున్నారు. అయితే విజ్ఞానవేత్తలు మంత్రశక్తిని విశ్వసించరు. విజ్ఞానవేత్తలకు స్థూలము తప్ప సూక్ష్మము తెలియదు. అటువంటివారు కేవలము కనిపించు భౌతికమును మాత్రమే నిజమనీ, అభౌతికము అబద్ధమని చెప్పుచుందురు. మంత్రశక్తి అభౌతికమైనది. కావున విజ్ఞానులు మంత్రములనుగానీ, వాటి శక్తినిగానీ నమ్మరు. ఎవరు నమ్మినా నమ్మక పోయినా మంత్రశక్తి ఉన్నది. కాబట్టి ఆ శక్తి వలన కొన్ని పనులు జరుగుచున్నవి. ఆ పనులను కొందరు నాస్తికవాదులూ,

విజ్ఞానవేత్తలు మంత్రశక్తి వలన జరిగినవని తెలియక, వాటిని కూడా మనిషి చేసిన పనులుగా వర్ణించుచున్నారు. ఉదాహరణకు మంత్రశక్తి వలన జరిగిన ఒక పనిని వివరించుకొని, దానిని నాస్తికులు, విజ్ఞానులు ఎలా ఖండించు చున్నారో వివరించుకొందాము.

ఒక స్వామీజీ సముద్ర ప్రాంతములోని ఒక బీచ్‌కు పోయాడు. అప్పుడు ఆ స్వామి వెంట వందలాదిమంది జనము అక్కడికి పోవడము జరిగినది. స్వామిగారి వెంట వచ్చిన భక్తులే కాకుండా, అక్కడ బీచ్‌లోనున్న అనేకమంది కూడా స్వామిని చూచేదానికి అక్కడికి వచ్చారు. అలా ఎందరో ఉన్న సమయములో బాబాగారు ఒక భక్తుని పిలిచి, నీకు ఒక కానుకను ఇస్తాను తీసుకొమ్మన్నాడు. దానికి ఆ భక్తుడు మరియు ప్రక్కనున్నవారు స్వామివారు ఏమి ఇస్తారోనని ఆత్రుతతో చూస్తున్నారు. అప్పుడు స్వామి వారు తనకు ఆరడుగుల దూరములోనున్న ఇసుకవైపు చేయిని చూపి, అక్కడ తీసి చూడమన్నాడు. అప్పుడు ఆ భక్తుడు అలాగే చేయగా ఇసుకలో అతనికి భగవద్గీత గ్రంథము కనిపించింది. దానిని చూచిన ఆ భక్తుడు మిగతావారందరూ అది స్వామి వారి మహత్యమని సంతోషించిరి. స్వామి వారు చూడమన్న చోట కొద్దిగా ఇసుకను తొలగిస్తూనే గీతాగ్రంథము లభించడము అక్కడున్నవారందరికీ అది గొప్ప మహత్యముగా, స్వామివారు గొప్ప దైవశక్తి సంపన్నుడుగా తెలిసింది. అంతేకాక స్వామివారు ఇంకా కొంత దూరము నడిచిపోయిన తర్వాత ఆయననే అనుసరిస్తున్న మరియొక భక్తుని చూచి అతనిని పిలిచాడు. అతను ఒక విదేశీ సైంటిస్ట్, అతను స్వామి గారు చేయునవి మహత్యములు కావు మోసపూరిత కార్యములనీ, వాటిని ఆధారపూరితముగా కనిపెట్టి బయటికి తెలపాలని వచ్చిన వ్యక్తి. స్వామివారు సాధారణముగా పిలిచినట్లే అతనిని పిలిచాడు. కానీ అతను

తన మీదనే పరిశోధన చేయుటకు వచ్చిన వ్యక్తియని వాస్తవముగా స్వామి వారికి కూడా తెలియదు. సాధారణముగా స్వామి అతనిని పిలిచి ఇక్కడ నీకు ఇష్టమొచ్చిన చోట ఇసుకను తీసి చూడు. అక్కడ నీకు బంగారు గొలుసు దొరుకుతుంది. దానిని నీవు ధరించుకో. అది నీ మెడలో ఉన్నంతవరకు నీకు అంతా మంచే జరుగునన్నాడు.

అప్పుడు ఆ విదేశీ భక్తుడు స్వామివారి మాట ప్రకారము ఇసుకను తీసి చూడాలనుకొన్నాడు. అప్పుడు అతను తన పరిశోధన దృష్టిలో పెట్టుకొని అక్కడున్న ప్రజలందరు చూస్తున్నట్లే స్వామిగారికి ఎడమ ప్రక్కన 20 అడుగుల దూరములో ఇసుకను తీసి చూడాలనుకొన్నాడు. అలా అనుకొన్న వెంటనే దాదాపు 20 అడుగులు స్వామినుండి ఎడమవైపుకు పోయి అక్కడ కూర్చొని కొద్దికొద్దిగా ఇసుకను తొలగించసాగెను. అలా ఒక అడుగు లోతు తియ్యగానే అక్కడ స్వామి వారు చెప్పినట్లు బంగారు గొలుసు కనిపించింది. అప్పుడు ఆ విదేశీ భక్తుడూ మరియు అక్కడున్న వారందరూ ఆశ్చర్యపోయారు. మొదట ఒక భక్తునికి స్వామిగారు చూపించిన జాగాలో భగవద్గీత గ్రంథము దొరికినది. రెండవమారు స్వామివారు జాగాను చూపించకుండా నీ ఇష్టమొచ్చిన చోట త్రవ్వి చూడు బంగారు గొలుసు దొరుకుతుందని చెప్పాడు. అలాగే దొరికింది, అక్కడి ప్రజలు స్వామిగారిని నిజమైన దేవునిగా వర్ణించి చెప్పుకోవడము జరిగినది. ఈ విషయమంతా రెండవరోజు వార్తాపత్రికలలో ప్రచురించబడినది. ఆ విషయము ఆ సమయములో అక్కడున్న భక్తులకేగాక అక్కడలేని ప్రజలందరికీ పత్రికల ద్వారా తెలిసిపోయినది. మరుసటి దినము "మహత్యమా–మోసమా" అను వార్తను విజ్ఞానవాదులు చెప్పినట్లు వార్తాపత్రికలలో వచ్చినది. అందులో స్వామివారు చేసినది మహత్యముకాదనీ, తాను ముందే భగవద్గీతను ఒక

జాగాలో పూడ్చిపెట్టి, ఆ జాగాలోనే త్రవ్వమని చెప్పాడనీ, అది మోసమనీ, అలాగే తనకు అనుకూలమైన భక్తునితో నీ ఇష్టమొచ్చిన జాగాలో త్రవ్వి చూడు, బంగారు గొలుసు దొరుకుతుందని చెప్పాడనీ, ఆ భక్తుడు ముందే తాను పూడ్చిన జాగాలోనే త్రవ్వి బంగారు గొలుసును తీశాడనీ, ఇది ఆ భక్తుడూ స్వామి ఇద్దరూ కలిసి ఆడిన నాటకమనీ, అందులో ఆ విదేశీ భక్తుడు కూడా భాగస్వామిగా ఉన్నాడనీ, ఆ భక్తుడు అలా చేసినందుకు కోటి రూపాయలు ఆ భక్తునికి ఇచ్చారనీ. ఇలా స్వామివారు తన మహత్యమును, తన గొప్పతనమును మోసపూరిత పనులచేత బయటికి కనిపించునట్లు చేసి, ప్రజలను తన భక్తులుగా మార్చుకొంటున్నారనీ వార్తలలో వ్రాయడము జరిగినది.

ఇప్పుడు విజ్ఞానవాదులు, నాస్తికవాదులు వార్తా పత్రికలలో స్వామి వారి మీద చేసిన ఆరోపణ పూర్తి అవాస్తవమైనది. స్వామివారు ఇలా చేశాడని వార్తలు రాయడము పూర్తి తప్పు. విజ్ఞానవాదులు వివరించినట్లు అక్కడ జరుగలేదు. కావున వారి ఆరోపణ పూర్తి ఆధారములేనిదని చెప్పవచ్చును. వాస్తవానికి స్వామివారు చేసినది రెండవరకమైన మహత్యము. అది స్వామివారి మంత్రశక్తి చేత జరిగింది. కానీ ముందే ఆ వస్తువులను అక్కడ పూడ్చిపెట్టాడనడమూ, విదేశీభక్తుడు కూడా స్వామివారు చెప్పినట్లు నటించారని చెప్పడమూ పూర్తి అవాస్తవము. ఒక విధముగా చెప్పితే స్వామి చేసినది మహత్యము కాదు మంత్రము. అయినా స్వామికి మంత్రమని తెలిసీ, ప్రజలను మహత్యమని నమ్మించాడు. స్వామి అలా చేసినప్పటికీ విజ్ఞానులూ, నాస్తికవాదులు అనుకొన్నట్లు మాత్రము కాదు. స్వామిగారు మొదటి భక్తునికి చెప్పినప్పుడు ఆయన సంకల్పముతోనే భగవద్గీత గ్రంథము దొరికినది. అలాగే రెండవ విదేశీ భక్తునికి చెప్పినప్పుడు కూడా స్వామి

సంకల్పముతోనే అతనికి బంగారు గొలుసు దొరికినది. రెండు పనులలో వారికి ఫలానా వస్తువులు దొరకాలని మాత్రమే స్వామివారి సంకల్పము కలదు. కానీ ఎక్కడ దొరకాలి, ఎంత లోతులో దొరకాలి అనునది మాత్రము స్వామివారికి కూడా తెలియదు. స్వామివారి మహత్యములను పరిశోధించాలని వచ్చిన విదేశీ విజ్ఞాని తనకు బంగారు గొలుసు దొరికినపుడు, అది నిజముగా స్వామిగారి మహత్యమే అనుకొన్నాడు. ఎందుకనగా స్వామి ఏమాత్రము ఊహించని చోట తాను త్రవ్వినప్పటికీ, అక్కడ బంగారు గొలుసు దొరకడము స్వామివారి మహత్యమే అనుకొన్నాడు. రెండవరోజు "మహత్యమా - మోసమా" అను వార్త చూచినప్పుడు, ఆ వార్తను ఆ విదేశీయుడే ఖండించాడు. తాను ఒక పరిశోధకుడననీ, ఈ మహత్యము తన సైన్సుకు అందనిదనీ, ఇందులో ఏ మోసమూ లేదనీ, న్యూస్ పేపర్‌కు వార్తనిచ్చాడు. ఇక్కడ విదేశీ పరిశోధకుడు అనుకొన్నది కూడా ఒక విధముగా తప్పే. ఎందుకనగా స్వామివారు చేసినది మహత్యము కాదు మంత్రమని తెలుసుకోలేకపోయాడు. స్వామివారు సముద్రపు ఒడ్డున రెండు వస్తువులను తన మంత్రశక్తి చేత ఇద్దరికి దొరుకునట్లు చేస్తే దానిని చూచిన నాస్తికులూ, విజ్ఞానులూ అది మంత్రశక్తి అని గ్రహించక మోసమన్నారు. అలాగే విదేశీయుడు ఆ పని మంత్రశక్తి చేత జరిగినది అని గ్రహించక మహత్యము అన్నాడు. ఈ విధముగ ఇటు స్వదేశీయులూ, అటు విదేశీయులూ అక్కడ జరిగిన వాస్తవికతను గ్రహించలేక ఇద్దరూ పొరపడిపోయారు.

వాస్తవానికి వారికి ఎవరికీ తెలియని మంత్రశక్తి అక్కడ పని చేసిననదని స్వామికి తెలిసినా, అది మంత్రబలమేగానీ, మహత్యముకాదని స్వామికి తెలిసినా, ఆ కార్యములోని పూర్తి వివరములు ఆయనకు కూడా తెలియవు. ఆయన అనుకుంటేనే ఆ పని జరిగినప్పటికీ, ఆ పనిలోని

అన్ని వివరములు ఆయనకు తెలియవు. ఎందుకు తెలియవనగా! పనిని ఆదేశించినది స్వామియే అయినప్పటికీ, ఆ పనిని స్వామి చేయలేదు కదా! ఆ పనిని చేసినవారు ఇతరులు, కావున ఎంత లోతులో వస్తువులున్నదీ ఆయనకు తెలియదు. ఆయనకంటే ముందు మనము అక్కడ ఏ విధముగా ఆ పని జరిగిందో తెలుసుకొంటే, స్వామికి ఎలా అన్ని వివరములు తెలియవో మనకు అర్థమవుతుంది.

**గ, ఖ, ర, భౌ, జ్యో, బ్ర** అను ఆరు బీజాక్షరములు ఆరు శాస్త్రములను తెల్పుచున్నవి. ఆరు శాస్త్రములలో మూడవ శాస్త్రమైన రసాయన శాస్త్రమునకు సంబంధించినది వైద్యము. మానవ జీవితములో ఆరోగ్యము, అనారోగ్యము అను రెండు స్థితులు గలవు. అనారోగ్యముగా మనిషి ఉన్నపుడు, అతనికి వైద్యమును ఉపయోగించి తిరిగి ఆరోగ్యస్థితికి తేవచ్చును. మానవ సృష్ఠి జరిగిన కొంత కాలమునకు వైద్యము అమలులోనికి వచ్చినది. పూర్వము వైద్యమును **"రసపట్టు"** అనేవారు, వైద్యములోని మందులను రసములు అనేవారు. వైద్యమునకు ఆ పేరు రావడానికి ముఖ్యకారణము ఏమనగా! పూర్వము వైద్యము ఆకుల రసముతో మొదలైనది. ప్రతి రోగమునకు దానికి సరిపడు చెట్టు ఆకు రసమును వాడేవారు. అందువలన వైద్యము యొక్క మొట్టమొదటి పేరు రసపట్టు. వైద్యములోని మందులను రసములు అనుట అప్పటినుండి వచ్చినది. కొంత కాలము గడచిన తర్వాత రసాయన శాస్త్రము అభివృద్ధి పొందినదై, కొంత పరిశోధన తర్వాత వైద్యములో కొంత మార్పువచ్చినది. మొదట అనారోగ్యమునకు చెట్టు రసములే వాడేవారు కదా! అలా చెట్టు రసములే కాకుండా రసాయన శాస్త్రములో కనిపెట్టబడిన మంత్రములను కూడా వాడేవారు. మంత్రము మాటనుండి పుట్టినది, రసము ఆకునుండి పుట్టినది. ఆ దినములలో

వైద్యము ఆకు రసమునుండీ, మాట మంత్రమునుండీ జరిగెడిది. ఇప్పటి కాలములో వైద్యము ఎంతో మార్పు చెంది, చివరకు వైద్యములో ఆకు రసముగానీ, మాట మంత్రముగానీ కనిపించకుండా పోయాయి. వైద్య విధానములో ఆకుల రసములు, మాటల మంత్రములు కనుమరుగై పోయినప్పటికీ, అక్కడక్కడ పూర్వకాల వైద్యమునకు జీవము పోయు మాట ఒకటి మిగిలివున్నది. **భూమిమీద ఔషధముకాని ఆకూ లేదు, మంత్రముకాని మాటా లేదు.** అను వాక్యము పూర్వ వైద్యమునకు గుర్తుగా మిగిలినది. దానినిబట్టి ప్రతి ఆకు ఔషధమే, ప్రతి మాట మంత్రమే అని మేము చెప్పుచున్నాము. ఇదంతా విన్న తర్వాత ఎవరికైనా ఔషధమూ, మంత్రమూ ఒకే రసాయన శాస్త్రమునకు సంబంధించినవని తెలియుచున్నది.

ఈ మా మాటను నేటి విజ్ఞానులు ఒప్పుకోకపోవచ్చును. **సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యముకాదు** అను సూత్రము ప్రకారము, మంత్రములు రసాయనిక శాస్త్రమునకు సంబంధించినవే. మా మాట సత్యమనుటకు కొన్ని ప్రమాణములను గమనించి చూస్తాము. ఒక వ్యక్తి ఒక మాటను చెప్పితే, దానిని వినిన రెండవ వ్యక్తిలో ఒక మార్పు జరుగుచున్నది. దానిని వివరముగా చెప్పితే ఒక వ్యక్తి చింతకాయ అను మాటను అంటే దానిని వినిన రెండవ వ్యక్తి నోటిలో వెంటనే నీరు ఊరుచున్నది. దీనినిబట్టి ఒకమాట మంత్రముగా పని చేసి రెండవ వ్యక్తిలో ఒక యాక్షన్ (కదలిక) మొదలైనది. అప్పుడు చింతకాయ అను మాట మంత్రముగా పని చేసినదని చెప్పవచ్చును. అలాగే లం...కొడకా అని ఒక మనిషి ఇంకొక మనిషి ముందర అంటే, రెండవ మనిషిలో ఒక రియాక్షన్ (ప్రతిస్పందన) వస్తుంది. చింతకాయ అను నాలుగు అక్షరముల మాటకు ఒక మనిషిలో ఎలా స్పందన వస్తున్నదో, అలాగే ఐదు అక్షరముల మరియొక

మాటకు ప్రతిస్పందన కూడా వస్తున్నది. దీనినిబట్టి ఒక్కొక్క శబ్దముతో ఒక్కొక్క స్పందన మనిషిలో ఏర్పడుచున్నదని తెలియుచున్నది. ఈ ఆధారములతో పూర్వము పెద్దలు చెప్పినట్లు ప్రతిమాట మంత్రమేననీ, మంత్రము కూడా శాస్త్రబద్ధమేనని అర్థమగుచున్నది.

ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. పూర్వము పెద్దలు కొన్ని శబ్దములకు కొన్ని పనులు జరుగునని కనిపెట్టి, ఆ శబ్దములను గ్రంథ రూపములలో లిఖించిపోయారు. పెద్దలు లిఖించిన మాటలను మంత్రములు అని అనుచున్నాము. ఏ మంత్రమునకు ఏ పని జరుగునో లిఖితముగా ఉండుట వలన, అటువంటి మంత్రములను తెలుసుకొని సాధించిన కొందరు స్వాములుగా చలామణి అగుచున్నారు. వారు సాధించిన మంత్ర ఫలములను మహత్యములుగా చాటుకొనుచున్నారు. అలాంటి స్వామియే సముద్రము వద్ద బీచ్‌లో తన మంత్రబలముచేత భగవద్గీతనూ, బంగారుదండను ఇచ్చాడు. అది ఎలా సాధ్యమైనదని వివరములోనికి పోతే, ఆ వివరమును ఈ విధముగా చెప్పవచ్చును. కొన్ని అక్షరముల సమ్మేళనమైన ఒక్కొక్క మంత్రములో ఒక్కొక్క శక్తి ఉండును. మంత్రము స్థూలమైనా మంత్రశక్తి సూక్ష్మముగా కనిపించనిదై ఉండును. ఖగోళములో కోట్లాది గ్రహములున్నవి. వాటిలో ఎన్నో కోట్ల గ్రహములు భూమిమీదికి సూక్ష్మముగా వస్తూ పోతూ వున్నవి. ఆ విధముగా భూమితో సంబంధము పెట్టుకొన్న గ్రహములు, ఒక్కొక్క మంత్రమునకు ఒక్కొక్కటి అధిపతిగా ఉన్నవి. ఒక మంత్రము ద్వారా ఒక పని జరుగుచున్నదంటే, అక్కడ ఏదో మనకు తెలియని శక్తి పని చేయుచున్నదని అర్థమగుచున్నది. ఒక్కో మంత్రమునకు ఒక్కో గ్రహము అధిపతిగా ఉండి, ఆ మంత్రము యొక్క కార్యమును చేయుచున్నది. ఒక మంత్రము వలన ఒక పని

నెరవేరుచున్నదంటే, అక్కడ ఒక గ్రహశక్తి ఉపయోగపడుచున్నది. మంత్రము ద్వారా ఉపయోగపడు గ్రహశక్తినే మంత్రశక్తి అని అంటున్నాము. ఒక గ్రహము స్థూలముగా ఉంటే దానిలోని జీవుడు సూక్ష్మముగా ఉండును. సముద్రము వద్దకు పోయిన స్వామి చెప్పిన మంత్రమునకు ఒక గ్రహము అధిపతిగా ఉండుట వలన, ఆ స్వామి ఆ మంత్రమును తలచి ఒక పనిని సంకల్పించిన వెంటనే, ఆ మంత్రమునకు అధిపతిగానున్న గ్రహము సూక్ష్మముగా ఆ పనిని నెరవేర్చుచున్నది. సముద్రము వద్ద స్వామి "మొదట నేను చెప్పినతనికి, నేను చెప్పిన స్థలములోనే భగవద్గీత గ్రంథమును ఇమ్మని" సంకల్పించి మంత్రమును తలచుకొన్నాడు. మంత్రమును తలచిన వెంటనే, ఆ మంత్రమునకు అధిపతియైన గ్రహము యొక్క సూక్ష్మశరీరము స్వామి గదిలోనున్న భగవద్గీతను తెచ్చి స్వామి చెప్పిన చోట ఇసుకలో ఉంచినది. గ్రహము యొక్క సూక్ష్మము కనిపించదు. కావున ఈ పని అంతయు కనిపించకుండానే జరిగింది. స్వామి చెప్పినట్లు స్వామి చూపిన చోట త్రవ్వి చూడగా భగవద్గీత దొరికినది. ఆ భగవద్గీత ఎలా వచ్చిందో స్వామికి కూడా తెలియదు. మంత్రము జపిస్తే ఫలానా పని జరుగునని మాత్రము స్వామికి తెలియును. అంతతప్ప మంత్రమునకు ఒక గ్రహము అధిపతియనీ, ఆ గ్రహమే తాను చెప్పిన (అనుకొన్న) పనిని నెరవేర్చినదనీ తెలియదు. స్వామికి తెలియకున్నా స్వామి అనుకొన్న పని జరిగినది. అలాగే విదేశీ వ్యక్తిని స్వామి పిలిచి నీ ఇష్టమొచ్చిన చోట నీవు ఇసుకను తీస్తే బంగారు గొలుసు దొరుకునని చెప్పాడు. స్వామి చెప్పినట్లే ఆ విదేశీ పరిశోధకుడు చేయగా, అతనికి బంగారు గొలుసు దొరికింది. ఈ మారు స్వామి జాగాను చూపకుండా నీ ఇష్టమొచ్చిన చోట త్రవ్వుకో అన్నపుడు, మంత్రశక్తి అయిన గ్రహశక్తి స్వామిగారు ముందే తయారు చేసి తన రూములో ఉంచుకొన్న బంగారు గొలుసును తీసుకొని వచ్చి అతను ఎచ్చట త్రవ్వను ప్రారంభించాడో, అప్పుడు అక్కడ ఆ గొలును నుంచింది. అలా కనిపించని

గ్రహము ఇటు స్వామికిగానీ, అటు విదేశీ భక్తునికిగానీ కనిపించకుండా చేయడము వలన, బంగారు గొలుసు దొరకడము పెద్ద మహత్యముగా కనిపించినది.

మొదట గ్రహము ఇసుకలో పెట్టిన భగవద్గీత, స్వామి రూములో ముందే ఉంచబడినదే! రూములో ఉన్న భగవద్గీత గ్రంథమునే గ్రహము (మంత్రశక్తి) తెచ్చింది, కానీ వేరుగా తాను సృష్టించలేదు. అలా ఇసుకలో దొరికిన భగవద్గీత ఏ ప్రెస్‌లో తయారైనది, దాని వెల ఎంత అనునదీ, దాని రచయిత ఎవరైనదీ అన్నియు దానిమీద ఉన్నవి. అలాగే బంగారు గొలుసు కూడా ముందే తయారు చేసి ఒకచోట పెట్టబడిన దానినే మంత్రశక్తిగానున్న గ్రహము తెచ్చింది. కానీ ఆ గొలుసును స్వామి స్వయముగా సృష్టించలేదు. అట్లే ఆ గ్రహము కూడా సృష్టించుకొని తేలేదు. తాను మంత్రించు మంత్రము వలన తన రూములోని బంగారు గొలుసు వచ్చునని స్వామికి తెలుసు, కానీ ఆ పని ఎలా జరిగినదో స్వామికి కూడా తెలియదు. ఈ విధముగ ఒక మాంత్రికునికి మంత్రము యొక్క ఫలితము (పని) తెలుసు, కానీ అది ఎలా అమలగుచున్నది, దానిని ఎవరు ఎట్లు చేయుచున్నారని మాత్రము తెలియదు. ఏ మాంత్రికునికైనా మంత్రమూ తెలుసు, దాని పనీ తెలుసు, కానీ అది ఎలా జరుగుచున్నదని మాత్రము తెలియదు. ఒక మాంత్రికుడు ఒక మంత్రమును తన ఇష్టమొచ్చినపుడు వాడుకొనుటకు, ఆ మంత్రమును ముందే సిద్ధింపజేసుకొనివుండవలెను. ఒక మంత్రము ఒక మనిషికి సిద్ధించాలంటే, ఆ మంత్రమును కనిపెట్టిన పరిశోధకులు దానికి గల నియమములను మంత్రముతో పాటు తెలిపి వుందురు. మంత్రమును నిర్మించిన వారు ఎలా చెప్పివుంటే అలా చేసినపుడే ఆ మంత్రము సిద్ధించును. మంత్రము యొక్క పనిని బట్టి, దానిలో

ఉపయోగపడు శక్తినిబట్టి, ఆ మంత్రమును మొదట వేల సంఖ్యలోనో, లేక లక్షల సంఖ్యలోనో ఏకధాటిగా జపించవలసి ఉంటుంది. అలా మొట్టమొదట ఏ ఆటంకము లేకుండా కొన్ని నియమములు పాటిస్తూ, మధ్యలో మంత్రమును ఆపకుండా జపించినపుడు ఆ మంత్రము సిద్ధించును. అలా సిద్ధించిన మంత్రమునకు గ్రహశక్తి మంత్రశక్తిగా మారి, ఆ మంత్రము యొక్క పనిని చేయును. సముద్రము వద్దకు పోయిన స్వామి తాను ఏది తలచుకొంటే ఆ వస్తువు (తాను ముందే ఒక చోట ఉంచినది) వచ్చేటట్లు గల మంత్రమును సిద్ధింప చేసుకొన్నాడు. ఆ మంత్రమునకు గల నియమము ప్రకారము నడుచుకొంటూ, తాను సముద్రము ఒడ్డున తన భక్తులు చూచునట్లు తన మంత్రశక్తిని వాడుకొన్నాడు. దానివలన తాను ముందే తన గదిలో ఉంచుకొన్న వస్తువులు అక్కడికి రావడము వలన, ప్రజలకు అది మహత్యముగ కనిపించినది. ప్రజల లెక్కలో ఆయన స్వామీజీ అయినా, మా లెక్కలో ఆయన ఒక మాంత్రికుడే. అట్లే ఆయన చేసినది మహత్యముగ అందరికి కనిపించినా, మా లెక్కలో మాత్రము అది మంత్ర విద్యయే. ఆ స్వామి తాను మంత్రికుడైనప్పటికీ, ఆ విషయమును బయటికి తెలియనివ్వ లేదు. కనుక ఆయన ఎల్లప్పుడూ స్వామిగానే లెక్కించబడుచున్నాడు.

ఈ విధముగ కొందరు కొన్ని వస్తువులను సృష్ఠిస్తుండడమును **ఇంద్రజాల విద్య** అంటారు. అలాగే వస్తువులను కాకుండా ప్రాణమున్న జంతువులను, మనుషులను చూపించడమును **మహేంద్రజాల** విద్య అంటారు. కొన్ని వస్తువుల శబ్దములను విని చెప్పడమూ, కొన్ని అస్త్రములను ప్రయోగించడమునూ **గజకర్ణ** అనియూ, కొన్ని జీవరాసుల శబ్దములనూ, మనుషుల మాటలనూ విని చెప్పడము, కొన్ని మరణ చేతబడి ప్రయోగము లను చేయడమూ **గోకర్ణ** విద్యలని అంటారు. ఇంద్రజాల మహేంద్రజాల,

గజకర్ణ గోకర్ణ విద్యలు మంత్రశక్తితో కూడుకొన్నవి. కావున జ్ఞానులు జ్ఞానశక్తిని వదలి మంత్రశక్తివైపు పోరు. మాయ అనునది జ్ఞానులకు వ్యతిరిక్త దిశలో ఉండును. కనుక మాయ జ్ఞానముకంటే గొప్పవారిగా మాంత్రికులను చూపును. మాంత్రికులను మాంత్రికులుగా కాకుండా దేవునితో సమానముగా, ప్రత్యక్ష దైవమని ప్రజలు నమ్మునట్లు చేయుటకు మాయ ప్రత్యేకమైన పనిని చేయుచున్నది. మహత్యములు మూడు రకములని ముందే చెప్పాను కదా! అందులో టక్కు టమారాలన్నీ ఒక రకమనీ, ఇంద్రజాల మహేంద్ర జాల, గజకర్ణ, గోకర్ణ విద్యలన్నీ రెండవరకమనీ కూడా తెలుసుకొన్నాము. ఈ రెండు రకముల మహత్యముల వలన ఏ మనిషి అయినా ఒక గొప్ప వ్యక్తిగా, పెద్ద స్వామిజీగా పేరు తెచ్చుకొనును. అటువంటి వ్యక్తి అన్ని రకముల గొప్పగ ప్రచారము పొందినప్పటికీ, ఈయనే సాక్షాత్తు దేవుడు అను పేరును తెచ్చుకోలేడు. ఎంతటి గొప్పవాడినైనా దేవునితో సమానుడని ప్రజలందురు, కానీ దేవుడని అనరు.

మాయ అనుకుంటే ఎవడినైనా ఇతనే దేవుడని గుర్తించునట్లు చేయగలదు. ఇంతకు ముందు మనము చెప్పుకొన్న రెండు రకముల మహత్యములకు సంబంధించిన విద్యలను ఏ మనిషి అయినా చేయవచ్చును. ఒకవేళ చేయలేక పోయినా ఫలానా విద్యలవలననే ఈ మహత్యములు జరుగుచున్నవని చెప్పవచ్చును. అందువలన విద్యల వలన జరుగు మహత్యములను కాకుండ, మాయ (ప్రకృతి) ప్రత్యేకముగా తనశక్తి చేత ఒక మనిషిని గొప్పగ ప్రజలకు చూపించగలదు. మాయ స్వయముగా చూపించిన ఏ మనిషినైనా ప్రజలు దేవుడు అని తీరవలసిందే! మాయ మనిషిని దేవునిగా చూపిస్తే, అటువంటి మనిషిని మనుషులు సాక్షాత్తు దేవుడని కొనియాడడము జరుగును. ప్రపంచములో ఎంత పెద్ద మేధావు

లైనా, ఎంత పెద్ద హోదాకల్గిన వ్యక్తులైనా, విద్యావంతులైనా, ధనవంతులైనా ఎవరైనా మాయ గొప్పగ చూపించిన వ్యక్తిని ఏమాత్రము సంశయము లేకుండా అతనినే ప్రత్యక్ష దైవమనీ, నడయాడే దేవుడనీ, కనిపించే పరమాత్మ అని పొగుడుదురు. సాక్షాత్తు దేవునిగా ఒక మనిషిని ఇతరులు చెప్పాలంటే మాయ అతని పేరు మీద, అతని ఆకారము మీద మూడవ రక మహత్యమును ప్రదర్శించుచున్నది. ఇంతకు ముందు చెప్పిన రెండు రకముల మహత్యములను మనిషి తాను నేర్చిన విద్యల ద్వారా తానే ప్రదర్శించుకొని దేవుడంతటి వానిగా పేరు తెచ్చుకోవచ్చని చెప్పాము. కానీ ఒక మనిషిని ఇతనే దేవుడని చెప్పుటకు మనిషి చేయు మహత్యములు పనికి రావు. అందువలన ఒక మనిషిని మాయయే తన మహత్యముల ద్వారా ఇతరుల చేత దేవుడని చెప్పించుచున్నది. మనిషి చేయు మహత్యములు కాకుండా, ప్రత్యేకముగా మాయ చేయు మహత్యములు ఎలాగుంటాయో కొన్ని సంఘటనల ద్వారా వివరించుకొందాము.

ఏ మనిషినైనా దేవునివైపు పోకుండా, దేవుని జ్ఞానము తెలియకుండా చేయుటకు, మానవులకు దేవుని ధర్మములను తెలియకుండా చేయుటకు, ఏ యోగి అయినా దేవుని జ్ఞానమును చెప్పితే, మనుషులు దానిని పట్టించు కోకుండా ఉండుటకు, మహత్యములు అను తన వలను మాయ మనుషుల మీద వేయుచున్నది. బహుశా ఆ వలలో చిక్కుకోని వారెవరూ ఉండరనియే చెప్పవచ్చును. ఇది మాయ వల అని తెలిసిన జ్ఞానులు మాత్రమే దానినుండి తప్పించుకొందురు. అటువంటి జ్ఞానులు భూమిమీద అరుదుగా ఉందురు. అందువలన మాయవలలో దాదాపు అందరూ చిక్కుకొందు రనియే చెప్పవచ్చును. మాయ మనుషుల మీద విసరు వల రెండు రకములుగా ఉండును. **ఒక రకమైన వల తాను ఎవరినైతే గొప్పగ**

**చూపించవలెనో అతని పేరు మీద ఉండును. ఈ వలలో నుండి ఎవరైనా తప్పించుకొనే అవకాశముంటే, అటువంటి అవకాశము లేకుండా మనిషి ఆకారము మీద రెండవ వల ఉండును. రెండవ వలలో నుండి ఎవరూ తప్పించుకొనుటకు వీలుండదు.** మనిషి పేరుమీద మాయ ప్రయోగించు వల ఎట్లుండునో వివరించుకొందాము.

ప్రపంచములో ఒక మనిషి తన స్వంత విద్యలచేత మహత్యము చేయుచు, ప్రజలలో కొంత పేరు పొందిన తరువాత వానిని మాయ మొదట తన ప్రతినిధిగా ఎన్నుకొని, అతనిని గొప్పగ ప్రపంచ ప్రజలకు చూపించ తలచును. అలా మాయ ఒక వ్యక్తిని తన ప్రతినిధిగా తీసుకొని అతనిని దేవునిగా చూపించుటకు ప్రయత్నించును. టక్కు టమారా, ఇంద్రజాల మహేంద్రజాల మంత్ర విద్యలలో కొంత పేరు తెచ్చుకొన్న తన ప్రతినిధి వద్దకు కోర్కెల కొరకు కొందరు వచ్చుచుండుటను గమనించిన మాయ వారి కోర్కెలను నెరవేరునట్లు చేయును. అట్లు నెరవేరిన కోర్కెలు తన ప్రతినిధి వలననే నెరవేరినట్లు ప్రజలను నమ్మించును. ఆ విధముగ తన ప్రతినిధియైన వ్యక్తికి కొంత పేరు ప్రఖ్యాతులు వచ్చునట్లు చేయును. ఉదాహరణకు నీవు చూచిన దాదాబాబాగారినే తీసుకొందాము. దాదాబాబా గారు మొదట చిన్నచిన్న మహత్యములను చేసి ప్రజలకు చూపించెడివాడు. అలాంటపుడు ప్రజలు ఎక్కువగా దాదాబాబాగారి వద్దకు వచ్చేదానికి అలవాటుపడ్డారు. అటువంటి వ్యక్తితో తన పని సులభముగా ఉండును. కనుక మాయ, దాదాబాబా గారిని తన ప్రతినిధిగా ఎన్నుకొని అతని వలన తమ కోర్కెలు నెరవేరుచున్నవను భ్రమను ప్రజలకు కల్గించినది. దానితో దాదాబాబాగారి వద్దకు పదుల సంఖ్యలో వచ్చు భక్తులు వందల సంఖ్యలో రాను మొదలుపెట్టారు. అప్పుడు దేశము యొక్క నలుమూలలనుండి

దాదా బాబాగారివద్దకు ఎక్కువ సంఖ్యలో ప్రజలను వచ్చునట్లు మాయ చేయాలనుకొన్నది. అప్పుడు బొంబాయి నగరములో సినీపరిశ్రమలో పెద్ద హీరోగా పేరుగాంచిన ఒకవ్యక్తికి ఏదో జబ్బు వచ్చునట్లు చేసి, అతనిని ఆసుపత్రిలో చేరునట్లు చేసినది. ఆ జబ్బు ఏదో డాక్టర్లకు అర్థము కాలేదు. దానివలన వారిచ్చు మందులు ఆ రోగము మీద పని చేయడము లేదు. అప్పుడు ఆ పేరుగాంచిన హీరో మరింత అనారోగ్యము పాలైనాడు. అలా అంత పెద్ద హీరో అనారోగ్యము పాలవడము దేశములోని ప్రజలందరికీ తెలిసిపోయి, తమ అభిమాన హీరో ఏమౌతాడో ఏమో అని అందరూ చింతించుచుండిరి. కొందరైతే ఆ హీరోపేరు మీద గుడిలో అర్చనలు చేయించుచుండిరి. మరికొందరు ఆయన ఆరోగ్యము బాగుపడవలెనని యజ్ఞములను కూడా చేయిస్తుండిరి. అలాంటి పరిస్థితిలో ఆ హీరోగారి చెవిలో ఒక శబ్దము వినిపించసాగింది. ఆ శబ్దము దూరమునుండి ఎవరో చెప్పినట్లు, తనతో మాట్లాడుచున్నట్లు వినిపిస్తున్నది. అప్పుడు ఆ హీరో, ఆ మాటలను శ్రద్ధగా విన్నాడు. అతనికి ఆ మాటలు ఇలా వినిపించాయి. "నేను దాదాబాబాను, శాంతినగరమునుండి చెప్పుచున్నాను. నీ రోగమును నేనే తీసుకొన్నాను. ఈ దినమునుండి నీవు ఆరోగ్యవంతుడవు అవుతావు. నా దయ నీ మీద ఎల్లప్పుడు ఉంటుంది." ఆ మాటలను విన్న హీరోగారు వెంటనే లేచి కూర్చొన్నాడు. తాను విన్న మాటలను ప్రక్కనేవున్న తన బంధువులకు చెప్పాడు. మరుసటి దినమునకు తన ఆరోగ్యము బాగై పోయింది. బాబాగారు తమ అభిమాన హీరోకు చెప్పిన మాటలు చివరకు దేశవ్యాప్తముగా తెలిసి పోయాయి. ఆ ఒక్క సంఘటనతో దాదాబాబాగారి పేరు దేశమంతా తెలిసిపోయింది. తర్వాత నాలుగు రోజులకే హీరోగారు దాదాబాబా దర్శనమునకు వచ్చి పోయాడు. అప్పటినుండి వేల సంఖ్యలో దాదాబాబా గారి దర్శనమునకు ప్రజలు రాను మొదలుపెట్టారు.

దాదాబాబాగారు ఈ దేశములోనేకాక ప్రపంచ వ్యాప్తముగా విదేశాలలో కూడా ఈయనే దేవుడన్నట్లు మాయ చేయాలనుకొన్నది. ఒక దినము విదేశీ భక్తుడు వచ్చి దాదాబాబాగారి దర్శనము చేసుకొని పోయాడు. అతను భారతదేశమంతా పర్యటించి, ఈ దేశములోని సంస్కృతిని పూర్తి అధ్యయనము చేసి పోయాడు. ఒక దినము భారతదేశములోని సాంప్రదాయము ప్రకారము తమ దేశమైన అమెరికాలోనే యజ్ఞము చేయాలనుకొన్నాడు. యజ్ఞము చేయుటకు భారత దేశమునుండి వేద పండితులైన బ్రాహ్మణులను రప్పించుకొన్నాడు. శుభలగ్నము చూచి యజ్ఞము మొదలు పెట్టారు. మొదట యజ్ఞగుండములోనికి అగ్ని కోసము కట్టెలను రాపిడి చేయను మొదలు పెట్టారు. ఒక కట్టె రంధ్రములో మరొక కట్టెనుంచి రాపిడిగా త్రిప్పుట వలన ఏర్పడిన అగ్నిచేత యజ్ఞము చేయవలసివుంటుంది. వారు అగ్ని కొరకు శ్రమించు సమయములో వారికి ఒక శబ్దము వినిపించింది. ఆ శబ్దములో తాను దాదాబాబాననీ, మీరు అగ్ని కొరకు శ్రమపడవలదనీ, భారతదేశమునుండి నేనే అగ్నిని అక్కడికి పంపుచున్నాననీ, నేను పంపిన అగ్ని చేతనే యజ్ఞము చేయమని వినిపించింది. దాదాబాబా గారు అక్కడ లేకున్ననూ, ఆయన మాటలు అమెరికాలో వినిపించడము అక్కడున్న అందరికీ ఆశ్చర్యము కలిగించింది. ఆ మాటలు వినిపించిన నిమిషనమునకే వారున్న చోట పొగ వ్యాపించుకొన్నట్లయినది. అందరూ చూస్తున్నట్లే ఆ పొగ ఒకచోట కుప్పగా చేరను మొదలుపెట్టింది. అలా ఒకే కేంద్రములోనికి చేరిన పొగ ఒక్కమారు మండి యజ్ఞగుండములో పడినది. అది చూచిన అందరూ దాదాబాబాగారు తాను చెప్పినట్లే అగ్నిని పంపించాడనుకొన్నారు. రెండవదినము ఆ వార్త అమెరికా అంతా ప్రాకి పోయినది. అలా జరగడము వలన దాదాబాబాగారు అమెరికాలో కూడా అందరికీ తెలిసిపోయి, ఆయనకు అమెరికా భక్తులు కూడా ఎక్కువై పోయారు.

బొంబాయిలోని హాస్పిటల్‌లో సినిమా హీరోకు వినిపించిన మాటలు గానీ, అమెరికాలో వినిపించిన మాటలుగానీ వాస్తవముగా దాదాబాబా గారికి తెలియదు. దాదాబాబాగారికీ, ఆ మాటలకూ ఏమాత్రము సంబంధము లేదు. దాదాబాబాకు ఏమాత్రము తెలియకుండానే అవి జరిగిపోయినవి. అలా జరిగినట్లు తర్వాత దాదాబాబాకు తెలిసినా, ఆయనకు అవి మంచిని చేకూర్చే సంఘటనలే కావున, ఆ కార్యములను తానే చేసినట్లు మౌనముగా ఉండిపోయాడు. ఆ కార్యములకు, తనకు ఏమాత్రము సంబంధము లేకున్నా ఆ విషయమును బయటికి చెప్పలేదు. ఆ విషయములను ఇతరులు తన ముందర ప్రస్తావించినపుడు దానికి తగినట్లు నటిస్తూ, తలూపుచూ, చేతితో దీవిస్తూ కనిపించుట వలన దాదాబాబా గారిని అందరూ గొప్ప వాడనీ, నిజముగా దేవుడనీ అనుకోవడము జరిగినది. బాబాగారికి ఆ విషయము ఏమాత్రము అంతుబట్టకున్నా, అలా జరగడము తన గొప్పతనమేనని అనుకొన్నాడు. దాదాబాబాగారిని ప్రత్యక్షదైవముగా ప్రజలకు చూపించడము మాయయొక్క ముఖ్య ఉద్దేశము. కావున బాబాగారి పేరును చెప్పి మాయమాతే అలా చేయడము జరిగింది. ఆ పనితో దేవుడూ, దేవుని జ్ఞానమూ అని ఎవరూ ప్రాకులాడకుండ నిజమైన దేవుడితడేనని బాబాగారినే చెప్పుకొందురు. ప్రజల దృష్థి అంతయూ అసలైన దేవుని మీదకు పోకుండా బాబామీదనే ఉండును.

ఇటువంటి మహత్యములను స్వయముగా మాయయే చేస్తూ బాబా గారిని దేవునిగా చూపించసాగింది. ఇంతవరకు బాబాగారి పేరును మాత్రము చెప్పి, ఆయన మాటలుగా వినిపించిన మాయ, ఈ మారు దాదాబాబాగారి రూపమును చూపి మహత్యమును చేయాలనుకొన్నది.

ఢిల్లీలో దాదాబాబాగారి భక్తుడు బాబాగారి ఫోటోను పెట్టుకొని ప్రతి దినమూ ఉదయము నమస్కారము చేయుచుండెను. ఒక దినము బాబాగారి ఫోటోకు నమస్కారము చేయుటకు ఫోటోవున్న గదిలోనికి పోయాడు. అక్కడ బాబా గారి ఫోటోలో నిండా కుంకుమ కనిపిస్తూ కొద్దికొద్దిగా క్రిందికి రాలుచున్నది. ఆ దృశ్యమును చూచిన ఆ భక్తుడు తన ఇంటిలో బాబాగారి ఫోటోనుండి కుంకుమ రాలుచున్నదని ఇరుగు పొరుగు వారికి చెప్పెను. అలా ఆ విషయము ఆ ప్రాంతమంతా ప్రాకిపోయి, జనము తండోప తండాలుగా వచ్చి ఆ వింతను చూచి, బాబాగారు సాక్షాత్తు దేవుడేనని చెప్పుకొనసాగిరి. ఈ విధముగా దేశములోని వివిధ పట్టణములలో బాబాగారి ఆకారము నుండి సుగంధపు నూనె ఒకచోట, తేనె ఒకచోట, నీరు ఒకచోట, విభూది ఒకచోట రాలడము వలన బాబాగారి మహత్యమూ, గొప్పతనమూ దేశమంతా ప్రాకిపోయి, ఆయనను ప్రత్యక్ష దైవముగా భావించసాగిరి. ఈ పనులకూ దాదాబాబాగారికీ ఏమాత్రము సంబంధములేదని జ్ఞాపక ముంచుకోవలెను. ఈ పనులన్నిటినీ మాయయే బాబాగారి ఆకారమును అడ్డము పెట్టుకొని చేయడము వలన ఆ పనులలోని కీర్తిప్రతిష్ఠలన్నియూ బాబాగారికి దక్కినవి. మాయయే ఈ పనులు చేయుచున్నదను విషయము ప్రపంచములో ఎవరికీ తెలియదు. చివరికి దాదాబాబాకు కూడా తెలియదు. తనకున్న శక్తి వలన అలా జరిగినవని దాదాబాబా అనుకోవడము జరిగినది.

చిన్నచిన్న మహత్యములను తనకు తెలిసిన విద్యల చేత చేయు బాబాగారికి చివరకు స్వదేశములోనూ, విదేశములలోనూ మంచి పేరు ప్రఖ్యాతులు వచ్చినవి. బాబాగారు తనకు మంచియే జరుగుచున్నదను కొన్నాడు. కానీ మాయవలన అట్లు జరుగుచున్నవని తనకు ఏమాత్రము తెలియదు. ఇవి ప్రస్తుత కాలములో జరుగుచున్న మాయ యొక్క

మహత్యములు. ప్రస్తుత కాలములోనే కాకుండ, గత యుగములలో కూడా మాయ ఇలాంటి పనినే చేసింది. గతములోగానీ, ప్రస్తుత కాలములోగానీ, రాబోయే కాలములోగానీ మాయ కర్తవ్యమే అది అని చెప్పవచ్చును. **దేవుడు తన ప్రతినిధియైన భగవంతుని చేత తన ధర్మములను భూమిమీద స్థాపిస్తే వాటిని మనుషులు తెలుసుకోకుండా చేయడమే మాయ యొక్క పని. జగతిలో ఒక్కమారు ధర్మములను బోధించుటకు, దేవుడు భగవంతునిగా మూడుమార్లు అవతరించాల్సిన అవసరమున్నది.** ప్రస్తుత కాలములోనుండి లెక్కించితే ఐదువేల సంవత్సరముల పూర్వము నుండి భగవంతుని జన్మలు ప్రారంభ మైనవి. ఐదువేల సంవత్సరముల క్రితము కృష్ణుని జన్మగా మొదలైన భగవంతునిరాక, రెండవ మారు కూడా అయిపోయినది. ఇక మూడవమారు రావలసివుంది. మూడవ మారు వచ్చి ధర్మములకు సంపూర్ణతను చేకూర్చి పోవును. అలా మూడుమార్లు రావడానికి కూడ కారణమున్నది. దేవుడు జీవాత్మ, ఆత్మ, పరమాత్మలుగా విభజింపబడి వున్నాడు. అలాగే ప్రకృతి ఐదు భాగములుగా విభజింపబడివున్నది. దేవుడు మూడు భాగములు కనుక మూడు భాగములుగానే తన ధర్మములను బోధించాలి. అందువలన మూడుమార్లు అవతరించాలి. ప్రకృతి దేవునికి వ్యతిరేఖమైన మాయగా భూమిమీద ఉన్నది. దేవుడు అవతరించినపుడు ప్రకృతి తన మాయద్వారా మనుషులను దేవునివైపు పోకుండా, ఆయన ధర్మములను తెలుసుకోకుండా చేయును. అలా చేయుటకు మాయ ఐదు అవతారములను తీసుకొనును. భగవంతుడు భూమిమీదకు వచ్చిన మూడుమార్లు మాయ ఏదో ఒక స్వామీజీని ఆవహించి తన మహత్యములను చూపుచూ, ధర్మములవైపు పోకుండా చేయడమేకాక, భగవంతుని జన్మ ప్రారంభముకాక ముందు ఒకమారు, భగవంతుని మూడు జన్మలు

అయిపోయిన తర్వాత ఒకమారు, మనుషులను ఆవహించి తన కార్యమును తాను చేయును. మాయ భగవంతునివలె ప్రత్యేకమైన జన్మతీసుకోదు. పుట్టిన మనిషిని ఎన్నుకొని అతనిని ఆవహించును. అలా ఐదు జీవితములలో చేరి అధర్మములను ప్రచారము చేయుచు, ధర్మములను అణచివేయాలని చూచును.

గత యుగములో దేవుడు భగవంతునిగా వచ్చి తన ధర్మములను బోధించి పోయాడు. ఇప్పుడు కూడా భగవంతుడు తన ధర్మములను బోధించుటకు అవతారములను ప్రారంభించాడు. ఒకమారు ధర్మములను బోధించుటకు మూడుమార్లు భగవంతుడు పుట్టవలసివుంది అని చెప్పు కొన్నాము కదా! ఇప్పటికి రెండుమార్లు వచ్చిపోయాడు. గతములో భగవంతుడు వచ్చినపుడు రెండుమార్లు, రాకముందే ఒకమారు మాయ కూడా మనుషులలో అవతరించి తన మూడు జన్మలను పూర్తి చేసుకొన్నది. ఇక దేవునికి ఒక అవతారమూ, మాయకు రెండు అవతారములు మిగిలి వున్నవి. మాయ గతములో తన ఒక అవతారమున ఒక స్వామీజీని ఆవహించి, ఇప్పుడు దాదాబాబాగారినుండి మహత్యములు చూపినట్లు, అప్పుడు ఆ స్వామిద్వారా మహత్యములు చూపుచూ, భగవంతుని వైపు ఎవరినీ పోనీయకుండా, తను ఆవహించిన స్వామియే దేవుడన్నట్లు చేసింది. అంతేకాక తాను ఆవహించిన మనిషికి భగవాన్ అని బిరుదును కూడా ఇచ్చి ప్రజలచేత భగవాన్ స్వామిగా పిలిపించేది. భగవాన్ స్వామి ద్వారా తన మహత్యములను ప్రజలకు చూపి, ఆయనను నిజముగా దేవుడన్నట్లు చేసింది. ప్రజలచేత ప్రత్యక్ష దైవముగా, దేవుని అవతారముగా భావింప చేసింది. ఆ కాలములో దేవుడు భగవంతునిగా భూమిమీద ఉన్నప్పటికీ, ఆయనవైపు ఎవరినీ పోకుండా చేసి, అందరినీ భగవాన్‌స్వామి వైపు

ఆకర్షించింది. ఈనాడు దాదాబాబా ద్వారా మహత్యములు చూపినట్లు భగవాన్ స్వామి పేరుమీద, ఆకారము ద్వారా ఎన్నో మహత్యములను చూపింది. అటువంటి స్థితిలో ప్రజలు భగవాన్ స్వామినే గొప్పగా చెప్పుకొనెడి వారు. భగవంతుని జ్ఞానమువైపు ఎవరూ పోయేవారు కాదు.

మాయ ఎప్పటికీ భగవంతుని రాకకంటే ముందే వచ్చి ముందే పోవుచుండును. అప్పటికాలములో భగవంతుని అవతారముకంటే ముప్పయి (30) సంవత్సరములు ముందే అవతరించిన మాయ ముందే తన అవతారమును చాలించింది. మాయ ఒకవ్యక్తిని ఆవహించి తన మహత్యములను చేయుననీ, ఆ మహత్యములకు, ఆ వ్యక్తికీ ఏమీ సంబంధ ముండదని చెప్పుకొన్నాము కదా! అదేవిధముగా ప్రస్తుత కాలములో దాదా బాబా శరీరమునుండి మహత్యములను చూపుచున్నది. దాదాబాబాగారిని కూడా భగవాన్ బాబాగా చేసింది. ఆ కాలములో కూడా మాయ ఇప్పుడు చేసినట్లే భగవాన్ స్వామినుండి చేసేది. భగవాన్ స్వామికీ, ఆయన పేరుమీద, ఆకారము మీద జరిగెడి మహత్యములకూ ఏమాత్రము సంబంధము లేదు. భగవాన్ స్వామిగా అవతారమును చాలించు సమయములోనూ, భగవాన్ స్వామి చనిపోయిన తర్వాతనూ జరిగిన సంఘటనలను బట్టి చూస్తే ఆ స్వామి వేరు, ఆయనలోనున్న మాయవేరని తెలియగలదు. ఇప్పుడు ఆ కాలములో జరిగిన సంఘటనలను గమనించి చూస్తాము.

భగవాన్ స్వామిని అమెరికా భక్తుడు ఒకడు తన ఇంటికి ఒక శుభకార్యమునకు పిలుచుకొని పోవాలనుకొని, ఒక సంవత్సరము ముందు నుండి స్వామిగారిని అడుగుచుండెను. స్వామి సరే వస్తానని ఒప్పుకొన్నాడు. శుభకార్యము చేయు కాలమువచ్చింది, కావున అమెరికా భక్తుడు వచ్చి స్వామి గారిని ప్రత్యేక విమానములో పిలుచుకొని పోవాలనుకొన్నాడు.

అలాగే ఏర్పాట్లు చేసుకొని ప్రత్యేక విమానములో బయలుదేరిపోయారు. అప్పటికి ఒక దినముముందే మాయమాత ఆయన శరీరమునుండి తొలగిపోయింది. భగవాన్ స్వామికి తన శరీరములో అంతకాలమూ మాయ ఆవహించి ఉండేదనీ, ఇప్పుడది పోయిందని ఏమాత్రము తెలియదు. తన అమెరికా ప్రయాణమునకు ఒకరోజు ముందే మాయ పోవడము వలన ఆయనలో మహత్తులు ఏమీ లేకుండా పోయినవి. విమానములో బయలుదేరిన వారు భారతదేశమును దాటకనే విమానములో సాంకేతిక లోపము ఏర్పడినది. విమానము పేలిపోతుందని తెలిసింది. వెంటనే విమానములోనున్న నలుగురూ భగవాన్ స్వామితో సహా పేరాచ్యూట్ల సహాయముతో విమానము నుండి క్రిందికి దూకారు. అలా దూకిన వారు తలా ఒకదిక్కుకు పోయి దిగడము జరిగినది. స్వామిజీ ఒక అడవిలోనికి పోయి దిగాడు. పేరాచ్యూట్లు గాలికి తమ ఇష్టమొచ్చినట్లు పోవడము వలన స్వామిగారు అడవిలో ఒంటరిగా దిగాడు. అది కౄరమృగములుండే అడవి, కావున స్వామికి ఎటువంటి రక్షణాలేదు. స్వామికి ఎటుపోవాలో తెలియలేదు. ఎంతో పెద్ద స్వామి ఒంటరిగా అలా అడవిలో చిక్కుకు పోయాడు. సాయంకాలమైంది. అపుడు రక్షణ కోసము ఒక చెట్టునెక్కి కూర్చున్నాడు. స్వామి గారికి చెట్టు ఎక్కడమే కష్టమైనది, ఎక్కిన తర్వాత దానిమీద ఉండడము మరీ కష్టమైనది. అలా చెట్టు మీద రెండు రాత్రులు, రెండు పగళ్ళు గడిపాడు. తినేదానికి ఆహారము లేదు, త్రాగేదానికి నీరూ లేదు. క్రిందికి దిగే దానికి వీలులేనట్లు కౄరమృగములు అక్కడికి వచ్చి తిరిగి పోవుచున్నవి. రెండు రోజులు ఆ చెట్టు ఆకులు తిని కాలము గడిపిన ఆయనకు ఇక శరీరములో శక్తి లేకుండా పోయింది. అలా ఉండడముకంటే చనిపోవడమే మేలనుకొన్నాడు. అంతలోనే అక్కడికి ఒక చిరుతపులి వచ్చి ఆయనను చూచి చెట్టు ఎక్కి ఆయనను చంపివేసింది.

అడవిలో అంత ఘోరము జరిగిపోయింది. కానీ బయటి ప్రజలకు ఆ విషయము తెలియదు. విమానము నుండి పేరా చ్యూట్‌లో దిగిన స్వామి ఎక్కడో ఒకచోట క్షేమంగా ఉంటాడనీ, తిరిగి వస్తాడనీ గంటగంటకు వార్తలు రానే వస్తున్నవి. స్వామి తప్పిపోయినప్పటినుండి ఇరవై (20) రోజుల వరకు ఆయన కోసము హెలీక్యాప్టర్లలో గాలిస్తూనే ఉన్నారు. అంతవరకు ఆయన ఆచూకీ తెలియలేదు.

భక్తులందరూ తమతమ ఇళ్ళలో స్వామిగారిని గురించి ఆయన క్షేమముగా రావాలని భజనలూ, యజ్ఞములు చేయను మొదలు పెట్టారు. ఆ విధముగా స్వామి గారు తప్పి పోయినప్పటి నుండి ఆయన భక్తులందరూ ఆయనకొరకు తపిస్తున్నారు. స్వామిగారు తప్పి పోయిన మొదటి రోజే ఒక భక్తుని ఇంటిలో స్వామివారి ఫోటోనుండి తేనె చుక్కలు రాలను మొదలు పెట్టాయి. అలా తేనె కారు సమయములో బాబాగారు అడవిలో బ్రతికే ఉన్నారు. అక్కడ ఆయనకు అడవిలో భయముతో చెమటలు కారుచున్నాయి. ఆయన పూర్తి నీరసించి పోయాడు. ఆ సమయములో మాయ ఆయనలో లేకున్నా ఆయన రూపమునుండి తేనెను కారునట్లు చేసినది. అలా తేనె కారడము వలన స్వామి వారిమీద భక్తి ఏమాత్రము సడలిపోకుండ నిలచింది. ఆ విధముగా స్వామిగారినే అందరూ నమ్మియుండునట్లు ఆయన ఫోటోల నుండి అనేక చోట్ల సుగంధముతో కూడుకొన్న పన్నీరు కారడమూ, కుంకుమ రాలడమూ, విభూది రాలడమూ జరుగుచుండెడిది. చివరకు 20 రోజుల తర్వాత ఆయన చనిపోయినట్లు తెలిసినది. ఆయన చనిపోయిన చోట స్వామిగారి చినిగిపోయిన గుడ్డలూ, శరీర అవశేషములు దొరకడముతో స్వామి చనిపోయినట్లు నిర్ధారణ చేసి, గుడ్డలను ఎముకలను తెచ్చి సమాధి చేశారు. ఆయనను సమాధి చేసిన తర్వాత కూడా ఆయన ఫోటోల నుండి

మహత్యము జరగడమూ, ఆయన కనిపించి మాట్లాడినట్లు జరగడమూ వలన స్వామిగారు పోయిన తర్వాత కూడా, ఆయనను దేవుడనియే ప్రజలు నమ్మి అసలైన దేవున్ని, నిజమైన జ్ఞానమును మరచిపోయారు. స్వామి అడవిలో చిక్కుకొన్నపుడూ, ఆయన చనిపోయినపుడూ ఆయనకు సంబంధము లేకుండానే మహత్యములు ఎలా జరిగినవని ఎవరూ ఆలోచించలేదు. అలా ఆలోచన ఎవరికీ రాకపోవడముతో స్వామివేరూ, మాయవేరని ఎవరికీ తెలియకుండా పోయినది. **ప్రపంచములో ఎంత పెద్ద మేధావినైనా, తన విషయములో ఏమాత్రము యోచించకుండా నమ్మునట్లు, జ్ఞానమువైపు పోకుండునట్లు మాయ చేయుచున్నది.**

**రాఘవ :-** స్వామీ! మీరు చెప్పిన మాయ యొక్క మహత్య విధానము ప్రపంచములో ఎవరికీ తెలియదనియే చెప్పవచ్చును. ప్రపంచములో ఎంత తెలివున్నవారైనా మహత్యములను గురించి ఆలోచించక, దానికొక విధానమున్నదని తెలియలేకున్నారు. మేధావులు కూడా గ్రుడ్డిగా నమ్ము చున్నారు. ఇక విజ్ఞానవేదిక వారూ, నాస్తికులూ ఉన్నదానిని లేదనడమూ, చెప్పిన దానిని కాదనడమూ తప్ప మహత్యములోని రహస్యములను వారు కూడా యోచించడము లేదు. ప్రతి దానికీ శాస్త్రీయతా, శాస్త్రబద్ధత అని చెప్పు విజ్ఞానవేత్తలు, మహత్యములు లేవు ఇవన్ని మ్యాజిక్‌లు అని చెప్పు చున్నారు కానీ శాస్త్రపద్ధతిలో ఖండించడములేదు. గ్రుడ్డిగా ఖండించు చున్నారు. మీరు వైద్యమునకు, మంత్రములకు రసాయన శాస్త్రము ఆధారమని విపులముగా చెప్పారు. నేటి విజ్ఞానులు మంత్రములకు శాస్త్రబద్ధత లేదు అని చెప్పుచున్నారు. మీరు చెప్పినది విపులముగా అర్థమైనది. నాకు ఇంకొక్క సంశయమున్నది. అదేమనగా! మంత్రశక్తి చేత కొన్ని పనులను చేయవచ్చునని చెప్పారు. బాబాగారు ఇస్తున్న కొన్ని

వస్తువులు సూక్ష్మగ్రహములు అందించునవని చెప్పారు. కొందరు నాకు చెప్పిన దానినిబట్టి ఆయన చిన్నతనమునుండి అలా ఇస్తున్నాడని చెప్పారు. అటువంటపుడు ఆయన మంత్రసాధన చేయలేదని తెలియుచున్నది. మంత్ర సాధన లేనిది వస్తువులివ్వడము ఎలా సాధ్యమగునో అర్థముకాని విషయ మైనది. నాకున్న ఈ సంశయమునకు వివరముగా జవాబు చెప్పమని కోరుచున్నాను.

**రాజయోగా :–** నీ సంశయము సరియైనదే, ఎవరికైనా ఈ ప్రశ్న రాగలదు. దానికి నేను చెప్పు జవాబు ఏమనగా! దాదాబాబాగారు చిన్నవయస్సు నుండి తాను నేర్చుకొన్న విద్యల వలన కొన్ని మహత్యములు చేయుట వాస్తవమే. అయితే ఈ జన్మలో ఆయన ఏ విద్యలూ నేర్చుకోలేదు. ఆయన ముందు జన్మలో ఎంతో తపోసాధన చేసి నేర్చుకొన్న విద్యల వలన అలా చేయగల్గుచున్నాడు.

**రాఘవ :–** స్వామీ! ఇక్కడొక చిన్న సంశయము. పోయిన జన్మలో జ్ఞాపకాలు ఈ జన్మలో ఉండవు కదా!

**రాజయోగా :–** నీమాట వాస్తవమే రాఘవా! అయితే దాదాబాబాగా చలామణి అగుచున్న జీవుడు పోయిన జన్మలో చనిపోలేదు. ఈ జన్మలో పుట్టనూలేదు.

**రాఘవ :–** అదెలా సాధ్యము స్వామీ! అక్కడ చనిపోతే కదా ఇక్కడ పుట్టేది.

**రాజయోగా :–** అదే చెప్పుచున్నాను, ఆయన అక్కడ చనిపోలేదు. చనిపోయి నట్లు శరీరమును వదలి అందరి దృష్టిలో చనిపోయినట్లు కనిపించాడు. స్థూలశరీరమును మాత్రము వదలిన ఆయన, తన సూక్ష్మశరీరముతో వచ్చి చిన్న వయస్సున్న బాలుని శరీరములోనికి చేరుకొన్నాడు. ఆ బాలున్ని

నిద్రలోనికి పంపి, ఆ శరీరమును తాను ఆక్రమించుకొన్నాడు. ఒక దయ్యము మరొక శరీరములోనికి ప్రవేశించినట్లు, బాలుని శరీరములోనికి ప్రవేశించాడు. అట్లు ప్రవేశించుటను జననము అనము. అట్లే సూక్ష్మ శరీరముతో సహా బయటికి రావడము మరణము కూడా కాదు. అందువలన దాదాబాబాగారు ముందుజన్మలో మరణించినట్లు గానీ, ఈ జన్మలో పుట్టినట్లు గానీ చెప్పుటకు వీలులేదు. ఆయన పాత శరీరమును వదలి క్రొత్త శరీరము లోనికి వచ్చినప్పటికీ, ఆయన వెనుక జన్మలో ఉన్నట్లే లెక్కించబడును.

**రాఘువ :-** అయితే అలా శరీరమును మారినప్పటికీ క్రొత్త జన్మ కాదుకదా! అలాంటపుడు క్రొత్తశరీరములో కూడా పాత అలవాట్లే ఉండుననుకొంటాను.

**రాజయోగా :-** అవును, పాత అలవాట్లే కాదు, పాతవిద్యలు కూడా అలాగే ఉండును. అందువలననే దాదాబాబాగారు వెనుక శరీరములో తాను నేర్చిన విద్యలను క్రొత్త శరీరములో ఉపయోగించుకోవడము వలన చిన్న వయస్సునుండే మహత్యములను చేయగలిగినాడు.

**రాఘువ :-** స్వామీ నేను ఇతరులవద్దనున్న ఒక ఫోటోను చూచాను. ఆ ఫోటో దాదాబాబాగారి గతజన్మలోనిదని చూపించారు. నేను పోయిన జన్మలోని ఫోటోలోనూ, ఈ జన్మ ఫోటోలోను ఆకారము అంతా వేరువేరుగా ఉన్నా తలమీద మాత్రము రెండు ఫోటోలలోనూ ఒకేఒక గుర్తు మారనట్లు కనిపించింది. మీరు ఇంతవరకు చెప్పిన పాత అలవాట్లు, పాతవిద్యలు అలాగే ఉండుననుటకు నాకు కనిపించిన గుర్తు నిదర్శనమనుకుంటాను.

**రాజయోగా :-** నీవు పోయివచ్చిన ఈ చిన్న యాత్రవలన నీకు ఏమి అర్థమైనది?

**రాఘువ :-** నేను చూచినప్పుడు నాకు ఏమీ అర్థము కాలేదు. ఇప్పుడు

మీరు చెప్పిన తర్వాత నేను ఒకచోట చూచినది పరమాత్మ జ్ఞానమనీ, మరొక చోట చూచినది మాయ (ప్రకృతి) మహత్యమని తెలిసినది. అంతేకాక జ్ఞానమున్న చోట, భక్తిలేని తప్పుడు భక్తులూ, తెలివితక్కువ భక్తులూ ఉన్నారనీ, జ్ఞానము లేకుండ మాయ మహత్యములున్న చోట, మంచి తెలివైన భక్తులూ, మంచి భక్తిశ్రద్ధలున్న వారూ ఉన్నారని కూడా అర్థమైనది. ఇంకా ముఖ్యముగా చెప్పితే మాయ మహత్యముల మర్మములన్నీ తెలిసి పోయినవి. ఎవరికీ తెలియని మాయ అవతారముల గురించి తెలిసింది.

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(నూకా, వెంకూ ఇద్దరూ తామున్న నిమ్మతోట వైపు రావడమును గ్రహించిన ఆటవికులు జాగ్రత్తగా ఉన్నారు. నూకా, వెంకూ తోటలోనికి వచ్చి అక్కడున్న ఆటవికులనూ, వారివద్దనున్న తమ సూట్‌కేస్‌ను చూచారు. అపుడు వెంకు, నూకావైపు చూచి కనుబొమలతో సైగచేసి నేరుగా యోగా వద్దకు వచ్చి ఇలా అన్నాడు.)

**వెంకూ :-** ఈ సూట్‌కేస్ మాది, పొరపాటుగ రైలునుండి క్రిందపడి పోయింది. మేము ప్రక్క స్టేషన్‌లో దిగి ఈ సూట్‌కేస్ కొరకు వెదుకుచూ వచ్చాము. ఇది క్రిందపడిన స్థలములో కనిపించలేదు. ఎవరికైనా దొరికుంటుందని దీనికొరకే వెదుకుచున్నాము. ఇక్కడే దగ్గరే మీవద్ద కనిపించినందుకు సంతోషిస్తున్నాము. మాది మాకిచ్చేయండి, మేము తొందరగా పోవాలి.

**యోగా :-** ఇది మాకు దొరికిన మాట నిజమే. కానీ ఇది మీదేనని గుర్తేమిటి? ఇది మీదైతే దీనిలోపల ఏముందో చెప్పండి. మీరు చెప్పినట్లు ఉంటే మీదేనని నమ్మి ఇవ్వగలము. మీరు చెప్పినట్లు లేకపోతే ఇది మీది కాదు, మరెవరిదోనని అనుకొంటాము.

(ఆ సూట్‌కేస్‌లో ఏమున్నదో వెంకుకు నూకాకు తెలిసినప్పటికీ వారు చెప్పలేదు. తర్వాత కొంత తీవ్రముగా ఇలా అన్నారు)

**నూకా :-** నా మాటను వినండి. మా సూట్‌కేస్‌ను మేము వెదుకుచూ వచ్చాము. మీదగ్గరున్నట్లు చూచి మిమ్ములను అడుగుచున్నాము. ఇంతకంటే సాక్ష్యము కావాలా! మా సూట్‌కేస్ మాకివ్వండి.

**మేఘు :-** మీ దానిని మీకిచ్చుటకు మాకు ఏమీ అభ్యంతరము లేదు. ఇది ఎవరిదో వారికే ఇవ్వాలనునదే మా ఉద్దేశ్యము. మేము చెప్పేది మీరు కూడా వినండి. ఈ పెట్టె రైలునుండి క్రిందపడినపుడు ఎవరైనా చూచి ఉండవచ్చును. అలా చూచిన వారు ఎవరైనా ఇది మాదేనని అడుగు అవకాశము గలదు. ఒకవేళ మీకిచ్చిన తర్వాత నిజముగా పోగొట్టుకున్న వారు వస్తే మేము పొరపాటు చేసినట్లగును. అందువలన ఇది మీదే అయితే ఇందులో ఏముందో చెప్పి చూపించి తీసుకపోండి. మాకు ఎటువంటి అభ్యంతరములేదు.

**వెంకు :-** మీరు మర్యాదగా మాది మాకు ఇవ్వండి. లేకపోతే పెద్దగొడవ జరుగుతుంది, జాగ్రత్త.

**మేఘు :-** మేము మీ బెదిరింపులకు బెదిరి పోవువారముకాదు. ఇందులో ఏముందో చెప్పంది ఇవ్వము.

(వెంటనే వెంకు సూట్‌కేస్ యోగచేతినుండి లాక్కున్నాడు. ఆ మరుక్షణమే వెంకు మెడమీద మేఘూ పిడికిలి వేటుపడింది. క్రిందపడిన వెంకు మీద నలుగురు ఆటవికులు పడి సూట్‌కేస్‌ను గుంజుకొన్నారు. క్రిందపడిన వెంకును పైకి లేవకుండా అట్లే అదిమిపట్టారు. పరిస్థితిని గమనించిన నూకా లోపలనున్న రివాల్వర్‌ను బయటికి తీసి ఆటవికులను కాల్చివేస్తానని బెదిరించాడు. అది రివాల్వర్ అనీ, దానినుండి తూటాలు బయటికి వస్తాయనీ తెలియని ఆటవికులు ఆ మాటలకు భయపడలేదు.

యోగా మెరుపులాగా నూకా వైపు పోయాడు.  అంతలో నూకా తన రివాల్వర్‌ను యోగా గుండెవైపు గురిపెట్టి ట్రిగ్గర్‌నొక్కాడు.  ఢామ్ అను శబ్దము పెద్దగా చుట్టుప్రక్కల ప్రాంతము వరకు వినిపించింది.  అర్థము కాని అయోమయములో ఏమి జరిగిందోనని ఆటవిలకులందరూ అటువైపు చూచారు.  రివాల్వర్ ప్రేలినపుడు అందులోని తూటా సిటింగ్ సరిగా లేనందున, తూటా ముందుకు పోకుండా అక్కడే పగిలిపోయింది.  తూటా బయటికి పోకుండా రివాల్వర్‌లో ప్రేలిన దానివలన రివాల్వర్ బారెల్ పగిలి పోయి దాని ముక్కలు ఎగిరి నూకా నుదుటికి, చేతికి తగిలి గాయపరిచాయి. కొద్దిగా గాయపడిన నూకాకు ఏమీ అర్థము కాలేదు.  వెంటనే యోగా మరియు మిగతావారు అతనిని పట్టుకొన్నారు.  రివాల్వర్ పేలుడు విన్న సమీప గ్రామమువారు అక్కడికి పరుగిడుచూ వచ్చారు.  అలా వచ్చిన గ్రామస్థులను చూచిన వెంకు, నూకా ఇద్దరూ "దొంగలు దొంగలు రక్షించండి రక్షించండి, మా సూట్‌కేస్ లాక్కొని మమ్ములను కొట్టుచున్నారని" గట్టిగా అరిచారు.  ఆ మాటలు వినిన గ్రామస్థులు ఆటవికులను దొంగలనుకొని వారిని పట్టుకొనుటకు ప్రయత్నించారు.

ప్రమాదమును గ్రహించిన ఆటవికులు కాలికి బుద్ధి చెప్పారు. వెంకూ, గాయపడిన నూకా మరియు గ్రామస్థులు ఆటవికులను వెంబడించారు.  సమయము కాదని పరుగిడుచున్న ఆటవికుల చేతినుండి సూట్‌కేస్ జారిక్రిందపడింది.  క్రిందపడిన తాకిడికి సూట్‌కేస్ పగిలిపోయి తెరుచుకుంది.  అలా పగిలిపోయి తెరుచుకొన్న సూట్‌కేస్‌నుండి పెద్ద నాగుపాము బుసకొడుచూ బయటికి వచ్చింది.  ఆ సంఘటనను చూచిన ఆటవికులు ఆశ్చరపోయి నిలబడ్డారు.  గ్రామస్థులు కూడా పామును చూస్తూ నిలిచిపోయారు.  అందరూ చూస్తున్నట్లే పాము అక్కడినుండి దూరముగా

పోవుచున్నది. వెంకు, నూకా మాత్రము పాము వెంటపడి పట్టుకోబోయారు. పాము బుసకొడుచూ కోపముగా వారిరువురి మీదికి లేచింది. నిలబడి చూస్తున్న ఆటవికులకు, గ్రామస్థులకు వారు దానివెంట ఎందుకుపడ్డారో అర్థము కాలేదు. ప్రాణములకు తెగించి వెంకు పామును పట్టుకోబోయాడు. పాము వెంకును కాటువేసి పారిపోయింది. పాముకాటు తిన్న వెంకూను రక్షించేదానికి గ్రామస్థులు, ఆటవికులు పూనుకొన్నారు. అప్పుడు యోగ తమ విషయమంతా గ్రామస్థులకు తెలిపి, తాము దొంగలము కాదని వివరముగా చెప్పాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(రాజయోగనందస్వామి వద్ద మహత్యములను గురించి తెలుసుకొన్న రాఘవకు వాటి విషయములో ఇంకాకొన్ని ప్రశ్నలను అడిగి తెలుసుకోవాలనుకొన్నాడు. రెండవరోజు భోజనము చేసి విశ్రాంతిగ కూర్చున్న రాజయోగనందస్వామి సన్నిధికి పోయిన రాఘవ, అదను చూచి సవినయముగా ప్రశ్నించెను.)

**రాఘవ :-** స్వామీ! పూర్వము ఒకవ్యక్తి తాను అనుభవించవలసిన పాపమును అనుభవించక తప్పించుకొన్నాడనీ, అది ఒక గురువు దగ్గరికి పోయి ఉండుట వలన సాధ్యమైనదని చెప్పుచుందురు. అప్పుడు ఆ గురువుగారి మహత్యముతో ఆ పాపమును అనుభవించకుండా పోయాడా? లేక మాయ మహత్యముతో అనుభవించకుండా పోయాడా?

**రాజయోగా :-** మహత్యములను గురించి తెలుసుకొనుటకు ముందు ఒక ముఖ్య సూత్రమును తెలుసుకోవాలి. అలా తెలుసుకోవడము వలన ఏది మహత్యమూ, ఏది మహత్యము కాదూ అని తెలియగలదు. ఎక్కడైతే

అనుభవించే కర్మ పోతూవున్నదో, అప్పుడది జ్ఞానశక్తి వలననే పోయినదని లెక్కించవలయును. **అనుభవించబడే కర్మ కాకుండా ఏది జరిగినా, అది మాయ మహత్యము క్రిందికే లెక్కించనగును.** ఉదాహరణకు ఒక ఫోటో నుండి విభూది రాలింది అనుకుందాము, అప్పుడది మాయ యొక్క మహత్యమని చెప్పవచ్చును. అట్లే ఒక విగ్రహమునుండి చక్కర రాలింది అనుకుందాము, అప్పుడది కూడా మాయ మహత్తు క్రిందికే జమకట్టవలెను. ఇవన్నీ జీవుని కర్మకు సంబంధించిన కార్యములు కావు. ఒక గురువు లేక ఒక యోగి ఒక జీవుని కర్మను తొలగించితే అది మాయ మహత్యము కాదు. అది జ్ఞానశక్తి వలన జరిగినదని చెప్పవచ్చును. భగవద్గీతలో జ్ఞానయోగము అను అధ్యాయమున 37వ శ్లోకము ఈ విధముగా గలదు.

శ్లో॥ యథైధాంసి సమిద్ధోగ్ని ర్భస్మసాత్కురుతేర్జున ।
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥

**దీని భావము ఏమనగా!** ఏ విధముగా అగ్నిలో కట్టెలు కాలిపోవుచున్నవో, ఆ విధముగనే జ్ఞానమను అగ్నిలో కర్మలను కట్టెలు కాలిపోవును. భగవంతుడు చెప్పిన ఈ మాట ప్రకారము కర్మలు ఒక జ్ఞానమను అగ్ని చేతనే లేకుండాపోవును. ఈ సూత్రమును అనుసరించి **ఎక్కడ కర్మలు లేకుండా నాశనమగుచున్నవో, అక్కడ జ్ఞానమే పని చేయుచున్నదనీ, అది మాయ మహత్యముకాదనీ తెలియవచ్చును.** జ్ఞానమును మభ్యపెట్టి అజ్ఞానమును బహిర్గతము చేయడమే మాయయొక్క ముఖ్యమైన పనిగా ఉండుట వలన, ఇక్కడ భగవంతుని మాటను కూడా అర్థముకాకుండా చేయుటకు, మాయ ఒక విధముగా పని చేయుచున్నది. నేను పై శ్లోకమును దాని వివరమును చెప్పినపుడు, ఆ మాటలో కూడా అనుమానమును రేకిత్తించునట్లు మనుషుల తలలో మాయ ప్రశ్నను ఉద్భవింపచేయుచున్నది.

ఆ ప్రశ్నతో పై శ్లోకములోని భగవంతుని మాటనే తప్పుపట్టునట్లు చేయుచున్నది. అందువలన ఆ ప్రశ్నకు కూడా ముందే మనము జవాబును తెలుసుకొందాము. మాయ మనుషుల తలలోనే గుణముల రూపములో నివాసము ఏర్పరచుకొన్నది. ఆ గుణముల మధ్యలోనే జీవుడుంటున్నాడు. కావున ప్రతి జీవుడు పుట్టుకతోనే మాయలో ఉన్నాడని చెప్పవచ్చును. అలా జీవుడు మాయలో ఉండుట వలన, మాయ మాటలనే ఎక్కువగా వినుటకు అలవాటుపడ్డాడు. జ్ఞానము మాటలు ప్రతి మనిషికి క్రొత్తవిగా ఉంటాయి. అందువలన **బాగా యోచన చేయువారికి మాత్రమే జ్ఞానము అర్థమగును. మాయ, యోచన చేయకుండినా సులభముగా అర్థమగును.** సులభముగా పై శ్లోకమునకు వ్యతిరేఖముగా వచ్చు ప్రశ్న ఏమి అనగా! ఒక దేశమునకు ప్రధానమంత్రి అయిన వ్యక్తి రోగముతో అనేక దినములుగా హాస్పిటల్ లో ఉన్నాడనుకొనుము. అతనికున్న రోగము క్యాన్సర్ అనుకొనుము. ఆ క్యాన్సర్ చివరి దశకొచ్చి శరీరమంతా క్యాన్సర్ కణములు నిండుకొనుట వలన అతను కొన్ని గంటలే బ్రతుకునని డాక్టర్లు కూడా నిర్ధారణకు వచ్చారు. అటువంటి సమయములో ఒక దేవత అతని కలలో కనిపించి నీ రోగమును నేను లేకుండా చేయుచున్నాను, నీవు బ్రతుకగలవు. తర్వాత నీవు నా గుడికి వచ్చి అక్కడ నా గుడిని అభివృద్ధి చేయమని చెప్పింది. తెల్లవారిన తర్వాత ఆ విషయమును ఆ వ్యక్తి మిగతావారికి కూడా చెప్పాడు. అప్పటి నుండి అతను మూడు రోజులలో పూర్తి ఆరోగ్యమును పొందాడు. అతనిలో ఆ రోగము పూర్తిగా పోయింది. అతను ఆ దేవతా గుడికిపోయి అక్కడ అభివృద్ధికని కొన్ని కోట్లు ప్రభుత్వమునుండి విడుదల చేశాడు. ఆ దేవతా గుడి కూడ అభివృద్ధి అయినది. ఈ సంఘటన అంతయూ చూచిన తర్వాత క్యాన్సర్‌ను ప్రధానిమంత్రి అనుభవిస్తున్నాడు కదా! అది అతను అనుభవించే కర్మేకదా! అలాంటపుడు అతనికి ఏ జ్ఞానము లేకున్నా, ఒక

దేవత ఆయన కలలోనికి వచ్చి నీ రోగమును లేకుండా చేస్తానని చెప్పి అలాగే చేసింది కదా! అలాంటపుడు అతను అనుభవించే కర్మ జ్ఞానము వలన పోలేదు కదా! ఆ దేవత ఆయన కర్మను లేకుండా చేసింది, కావున ఆ దేవతా రూపములో మాయయే అతని కర్మను లేకుండా చేసినదని అర్థమగుచున్నది. అలాంటపుడు జ్ఞానము మాత్రమే కర్మను లేకుండా చేయుచున్నది. మాయ అట్లు చేయలేదు అనుటకు వీలులేదు కదా! అని ఎవరైనా అడుగ వచ్చును. మొత్తానికి భగవద్గీతలోని భగవంతుని మాట మీదనే అనుమానము వచ్చునట్లు గుణరూపములోనున్న మాయ చేసిందని చెప్పవచ్చును. దానికి జవాబును చెప్పవలసిన వంతు ఇపుడు మనదే, కావున మా జవాబు ఏమనగా!

దేవుడు భగవంతుని రూపములో చెప్పిన జ్ఞానము శాస్త్రబద్ధమైనది. అది శాసనములతో కూడుకొన్నది. కావున భగవంతుడు చెప్పిన మాట ప్రకారము మాయ కర్మను లేకుండా చేయలేదు. ఒక్క జ్ఞానము మాత్రమే కర్మను నాశనము చేయగలదు. అయితే దేవతా రూపములో మాయ కర్మను లేకుండా చేసినది కదా! అను ప్రశ్నకు సరియైన జవాబును చూస్తే ఈ విధముగా వివరము గలదు. **మాయకు కర్మను స్థాన చలనము చేయుశక్తి కలదు, కానీ నాశనము చేయు శక్తి లేదు. ఇంకా వివరముగా చెప్పుకొంటే కర్మను కాలములో మార్చగల బలము మాత్రము మాయకున్నది, కానీ కర్మను లేకుండా చేయు బలము మాయకులేదు.** దేవతా రూపములో కనిపించిన మాయ, అనుభవించే వ్యక్తి యొక్క రోగమును అంతటితో ఆపి, దానిని యాభై సంవత్సరముల తర్వాత అనుభవమునకు వచ్చునట్లు చేసింది. అంతేకానీ ఆ కర్మను శాశ్వితముగా లేకుండా చేయలేదు. ఒక జీవుడు ఒక కర్మను ఒకమారు సంపాదించుకొంటే అది ఆ జీవుడు

అనుభవించిన తర్వాతే పోతుంది. లేకపోతే జ్ఞానము ద్వారా అయినా కాలిపోవాలి. అట్లు కాకుండా ఆ కర్మ పోవుటకు వేరు విధానమేలేదు. మాయ ఎప్పటికీ కర్మను పోగొట్టలేదు. మాయ ఎప్పటికైనా కర్మను మార్చగలదు. ఇక్కడ దేవతా రూపములో ప్రధానమంత్రి క్యాన్సర్ యాభైసంవత్సరముల తర్వాతకాలానికి మార్చినది. తర్వాత జన్మలో అతను దానిని తిరిగి అనుభవించాల్సిన పని ఏర్పడినది. అందువలన భగవంతుని మాట ప్రకారము కర్మను కాల్చు శక్తి ఒక్క జ్ఞానమునకేగలదని జ్ఞాపకముంచుకోవాలి.

**రాఘవ :-** ఎటువంటి అనుమానమూ రాకుండా వివరముగా మాయ విషయమును తెలియజేశారు. గతములో నేను ఒకచోట చూచిన చిన్న మహత్యమును గురించి మీరు వివరముగా చెప్పితేగానీ మాకు అర్థము కాదు. అందువలన అడుగుచున్నాను. ఒకవ్యక్తి ఒక ఇంటిలోని వారికి తమ ఇంటిలోని నీరును తెమ్మని చెప్పి, వారు తెచ్చిన నీటిని మీకు తీర్థముగా ఇస్తున్నాను అని చెప్పి ఏదో మంత్రము చెప్పినట్లు నటించి, ఆ నీటిని తన వ్రేలితో నాలుగు వైపులా విదిలించి, మీ ఇంటిలోని దోషములన్నీ ఈ తీర్థము వలన పోయాయి. ఈ నీటిని అందరు తీర్థముగా తీసుకోండి, ఏవైనా మీలో దోషములుండినా వెంటనే పోతాయి అన్నాడు. అప్పుడు ఆ నీటిని ఆ ఇంటివారందరూ తీర్థముగా తీసుకొన్నారు. ఆ నీరు అందరికి తియ్యగా కనిపించినది. తమ ఇంటిలోని నీరు అలా ఆయన ఇచ్చిన తర్వాత అంత తియ్యగా కనిపించడము వలన, ఆయన మంత్రములో ఏదో శక్తి ఉందని అందరూ అనుకొన్నారు. అంతేకాక తియ్యగా మారిపోయిన ఆ నీటి వలన తమ ఇంటిలోని దోషములూ, తమ ఒంటిలోని దోషములూ పోయాయని అనుకొన్నారు. అలా తమ దోషములను నివారించినందుకు

పదివేలు డబ్బులు అతనికిచ్చి పంపారు. వాస్తుదోషములను లేకుండా చేస్తానని చెప్పి ఆయనలా చేశాడు. అట్లు చేయడము వలన వాస్తుదోషము పోతుందో లేదో తెలియదు. కానీ నీరు ప్రత్యక్షముగా తియ్యగా మారి పోయినది. ఆ నీరు ఎలా తియ్యగా మారినది అర్థము కాలేదు. అది మంత్రమహిమే అయ్యి ఉండవచ్చునా, ఈ విషయము మీరు తెలుప వలసిందేనని అడుగుచున్నాను.

**రాజయోగా :-** అది మాయాకాదూ, మంత్రమూ కాదు. టక్కు టమారా విద్యలలో ఒక రకమైనది. అది కేవలము హస్తలాఘవము చేత చేయునది. ఇంకొక విచిత్రమేమంటే వాస్తుదోషము అనునది కల్పించి చెప్పునదే. వాస్తు అనునది అవాస్తవమైనది. నీరును తీర్థముగా ఇవ్వడము వలన ఒంటిలో దోషము పోవుననడము కూడా అసత్యమే. ఆ మాటను నమ్ముటకు నీరును ఆ వ్యక్తియే తన హస్తలాఘవము చేత తియ్యగా మార్చాడు. కానీ ఆ నీరు మంత్రము చేతగానీ, మాయ చేతగానీ తియ్యగా మారలేదు. ఎవరికీ తెలియకుండా నీరును తియ్యగా మార్చడమే అతను ముఖ్యముగ చేసిన పని. అదెలా చేశాడనగా! వారు ఇంటిలోని నిండుబిందె నీళ్ళను గ్లాస్‌లో తెచ్చినపుడు అవి సాధారణ నీళ్ళే. వాస్తు దోషమును నివారిస్తానని చెప్పిన వ్యక్తి ఏదో మంత్రము చెప్పినట్లు నటించి, తన చేతివ్రేలిని నీటిలో ముంచి గదిలో నాలుగువైపులా నీటిని ఆ వ్రేలితో విదిలించాడు. అప్పుడు ఆ పని చేయుటకు ముందే తన వ్రేలికి సాక్రిన్ పౌడర్‌ను పూసుకొనివుండును. తన వ్రేలిని నీటిలో ముంచినపుడు వ్రేలికివున్న సాక్రిన్ పౌడర్ వలన నీరు తియ్యగా మారిపోవుచున్నది. వ్రేలితో నీటిని నాలుగు వైపులా అందరూ చూచునట్లు విదిలించి ఆ నీటిని తీర్థముగా ఇచ్చును. ముందే నీరు తియ్యగా మారివుండుట వలన ఆ తీర్థము తియ్యగా కనిపించును. వ్రేలు నీటిలో

అద్దుట వలన నీరు తియ్యగా మారినదని ఎవరికీ తెలియదు. అందువలన అది మహత్యముగా కనిపిస్తున్నది. అది "టక్కు" పని తప్ప వేరుకాదు. ఇటువంటి హస్తలాఘవము చేత చేయు పనులను చూచి ప్రజలు మోస పోకుండుటకు జనవిజ్ఞాన సంస్థ వారు కూడా కొన్ని ఇలాంటి పనులను చేసి చూపించుచుందురు. ఇవి ఇతరులను మోసము చేయుటకు మభ్యపెట్టు పనులేగానీ, మంత్రముగాదు, మాయాగాదు.

**రాఘవ :-** ఇది అందరికీ తెలియవలసిన విషయము. ఈ విషయములో ఇంత మోసమున్నదని వాస్తవముగా ఎవరికీ తెలియదు. ఈ విషయము మీరు తెల్పుట మాకు చాలా సంతోషము. ఈ విషయములను మీరు తప్ప ఎవరూ చెప్పలేరు. ఇటువంటి విషయమే మరొకటున్నది. అది మహత్యమో, మోసమో మీరే చెప్పాలి. అదేమనగా! ఒక మాంత్రికుడు ఒక ఇంటిలోని ఆర్థిక బాధలను పోగొట్టుటకు ఆ ఇంటికి వచ్చి, ఒక చిన్నపాటి పూజను నిర్వహించి, ఆ పూజవద్ద తనవద్దనున్న తావెత్తులను కుప్పగ పోసి, ఆ ఇంటి యజమాని పేరు చెప్పి, ఈయనకున్న ఆర్థిక బాధలు పోవుటకు ఈ కుప్పలోని తావెత్తులలో ఏ తావెత్తు పనికివచ్చునో అది బయటకు రమ్మని చెప్పెను. అలా చెప్పిన ఒక నిమిషము తర్వాత ఆ తావెత్తు కుప్పలోనుండి ఒక తావెత్తు కదలుచూ బయటికి వచ్చినది. ఆ ఇంటిలోని వారందరూ చూస్తుండగనే ఆ తావెత్తు కొద్దికొద్దిగా జరుగుచు వస్తున్నది. అలా జరుగుచూ వస్తున్న తావెత్తును ఆ మాంత్రికుడు తీసుకొని, ఇంటి యజమాని చేతికి కట్టి "ఇది నా మంత్రబలము చేత నీకు సరిపడు తావెత్తు దానంతకదే వచ్చినది. ఇప్పటినుండి నీకు ఏ ఆర్థిక బాధలుండవు." అని చెప్పాడు. తావెత్తు దానంతకదే కదలుచూ రావడమును మంత్రశక్తి కాదంటారా?

**రాజయోగా :-** అలా తావెత్తు కదలి రావడమును ముమ్మాటికీ మంత్రశక్తి కాదంటాను. ఇక్కడ తావెత్తు కదలిరావడమును, అదియూ కొన్ని

తావెత్తులలో ఒకటి మాత్రము కదలిరావడమును ఎవరైనా మంత్రశక్తిగానే అనుకొందురు. కానీ అది ఏమాత్రము మంత్రశక్తి కాదు. మంత్రములకు సంబంధము లేకుండా ఆ పని ఎలా జరుగుచున్నదో వివరిస్తాను శ్రద్ధగా విను. స్త్రీరత్న, పురుషరత్న అను రెండు మొక్కలు గలవు. ఆ రెండు మొక్కల మూలికలను ఒకే దినము, ఒకే నక్షత్రములో మాంత్రికులు తీసి పెట్టుకొందురు. పురుష రత్న మూలికను ఒక తావెత్తులో ఉంచి, స్త్రీరత్న మూలికను తన ప్రక్క జేబులో మాంత్రికుడు ఉంచుకొనును. పురుషరత్న మూలికనుంచిన తావెత్తును, మరికొన్ని ఖాళీ తావెత్తులతో కలిపి ఒక సంచిలో ఉంచుకొని ఉండును. ఆ మూలికలు రెండు ఒకదానికొకటి మూరెడు దూరములో నున్నపుడు వాటిలో ఏ చలనమూ ఉండదు. ఎప్పుడైనా స్త్రీరత్న మూలికకు పురుషరత్న మూలికను గజము లేక నాలుగు అడుగుల దూరములో ఉంచితే, ఒక నిమిషము తర్వాత స్త్రీరత్న మూలికయొక్క ఆకర్షణకు పురుష రత్న మూలిక కదలి స్త్రీరత్న వైపు వచ్చును. ఈ విధానమును తెలిసివారు కొందరు మాంత్రికులవలె నటిస్తూ తనవద్ద స్త్రీరత్న మూలికను ఉంచుకొని, ముందే ఖాళీ తావెత్తులలో కలిపివుంచుకొనిన పురుషరత్న మూలిక గల తావెత్తును ఒక సంచిలో ఉంచుకొని, ఏ ఇంటిలో ఆర్థిక బాధలను నివారిస్తానని మాట్లాడుకొన్నాడో, ఆ ఇంటికి మాంత్రికుడు పోయి అక్కడ మంత్రించినట్లు నటించి, తనవద్ద సంచిలోవున్న తావెత్తులను క్రింద కుప్పగా పోసి " ఈ ఇంటి యజమాని ఆర్థికబాధలు పోవుటకు సరిపోవునది ఇందులో ఏ తావెత్తు ఉన్నదో అది బయటి రావలెను" అని మాంత్రికుడు చెప్పును. మాంత్రికుని ప్రక్కజేబులోనున్న స్త్రీరత్నకు గజము దూరములో తావెత్తుల కుప్ప ఉండుట వలన, స్త్రీరత్న ఆకర్షణ శక్తికి తావెత్తుల కుప్పలో పురుషరత్న ఉన్న తావెత్తు నిమిషము తర్వాత కదలి స్త్రీరత్నవైపుకు రావడము జరుగును. అలా కుప్పనుండి ఒక అడుగు దూరము

కదలివచ్చిన పురుషరత్న తావెత్తును మాంత్రికుడు తీసుకొని, ఆ ఇంటియజమాని చేతికి కట్టుచున్నాడు. ఇక్కడ జరిగినది మూలికల ప్రభావమేగానీ, మంత్రముల ప్రభావము కాదు. స్త్రీరత్న మూలిక, పురుషరత్న మూలికను ఆకర్షించుననీ, స్త్రీరత్నకు పురుషరత్న మూడు లేక నాలుగు అడుగుల దూరములోనున్నపుడే పురుషరత్న మీద స్త్రీరత్న యొక్క ఆకర్షణ అయస్కాంత శక్తివలె పనిచేసి తనవైపు కదలునట్లు చేయుచున్నదనీ, మూరెడు లోపలగానీ నాలుగు అడుగుల వెలుపలగానీ ఉన్న పురుషరత్నను స్త్రీరత్న ఆకర్షించదనీ, స్త్రీరత్న కదలని మూలికయనీ, పురుషరత్న కదలెడు మూలికయనీ చాలామందికి తెలియదు. తెలియనపుడు తావెత్తు కదలి రావడమును ఎవరైనా మంత్రశక్తిగానే తలచుదురు.

**రాఘవ :-** స్వామీ! మీరు ఇంతకు ముందు చెప్పిన టక్కు టమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ విద్యలలో ఈ మూలికల పని ఏ విద్యకు సంబంధించినది?

**రాజయోగా :-** ఒక రకముగా చెప్పితే మూలికలు అన్ని విద్యలలోను పని చేయుచున్నవి. పాము, తేలు విషములను నివారింపజేయుటలోనూ, అనేక వస్తువులను, జంతువులను సహితము చూపుటలోనూ, మనిషికి వినోదమును రక్షణను ఇచ్చుటలోనూ పేరుగాంచిన ఇంద్రజాల మహేంద్రజాల విద్యల యందు మూలికలు ఎక్కువగా ఉపయోగపడుచున్నవి. అట్లే అనేక శబ్దములను, మాటలను వినిపించుటలోనూ, మారణ హోమము చేయు అస్త్రములు ఉపయోగించుటలోనూ, పేరుగాంచిన గజకర్ణ, గోకర్ణ విద్యల యందు తక్కువగానూ మూలికలు ఉపయోగపడుచున్నవని చెప్పవచ్చును.

**రాఘవ :-** స్వామీ! మీరు చెప్పిన టక్కుటమార, ఇంద్రజాలా మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ విద్యలను నేర్చుకున్న మనిషి ప్రపంచములో అన్నిటిని చేయు

సామర్థ్యములుగల మనిషిగ తయారై తానే గొప్పవ్యక్తిగా కనిపించును. మనిషిని గొప్పగా చూపు ఈ విద్యలకంటే ఇంకా ఏదైన గొప్ప విద్య కలదా?

**రాజయోగా :-** ఈ విద్యలన్నీ ప్రపంచములో గొప్పవే, ఈ విద్యలు ఏ మనిషినైనా గొప్పశక్తివంతునిగా, పూజ్యునిగా చూపించగలవు. వీటిని కేవలము ప్రపంచ విద్యలనీ లేక ప్రకృతి విద్యలనీ చెప్పవచ్చును. ప్రకృతిని సృష్ఠించినవాడు పరమాత్మ ఒకడున్నాడు. పరమాత్మ ప్రకృతికి పెద్ద అయినందున పరమాత్మ జ్ఞానమును తెలుపు విద్య ప్రకృతి విద్యలకంటే పెద్దదని చెప్పవచ్చును. దైవజ్ఞానమును తెల్పు విద్య అన్నిటికంటే పెద్దదీ మరియు దానిని మించినది లేదు కాబట్టి దైవజ్ఞాన విద్యను పెద్ద విద్య అంటున్నాము. దానినే బ్రహ్మవిద్య అనికూడా అంటున్నాము. బ్రహ్మ అనగా పెద్ద అని అర్థము. అన్నిటికంటే గొప్పదని తెలుయుటకు బ్రహ్మవిద్యను ఇతర విద్యలతో పోల్చినపుడు వాటిని ఇదేమి బ్రహ్మవిద్యనా అని అనుట జరుగుచుచున్నది. ఆ మాటతో ప్రపంచ విద్యలలో ఏదీ బ్రహ్మవిద్య (పెద్ద విద్య) కాదని తెలియుచున్నది.

**రాఘవ :-** స్వామీ! మీరు ఎంతో పెద్ద మేధావులు. ప్రపంచములో పేరు ప్రఖ్యాతులు తెచ్చు అన్ని విద్యలను వివరముగా తెల్పి, బ్రహ్మవిద్యయే అన్నిటి కంటే గొప్ప విద్య అని సులభముగా అర్థమగునట్లు చేశారు. మీ వలన ఈ విషయములను తెలుసుకోలేకపోయివుంటే, దైవత్వమును చేర్చలేని ప్రపంచ విద్యలనే నేను కూడా గొప్పగా తలచి, వాటి మార్గములోనే ప్రయాణించు వాడిని. ఇప్పుడు బ్రహ్మవిద్యయే గొప్పదని మీచే తెలిసింది. కాబట్టి నేను బ్రహ్మవిద్యకే ప్రాధాన్యతను ఇస్తాను. బ్రహ్మవిద్యా ముసుగులోనున్న ఇతర విద్యలు అన్నియు ప్రపంచ విద్యలేనని, వాటి

రహస్యములను ప్రజలకు తెల్పి వారిని కూడ దైవమార్గములో నడుచునట్లు చేస్తాను. నాకు ఆ బలమునిస్తూ దీవించండి

× × × × × × × × × × × × × × × × × × × × × ×

తమ నాయకుడు తాటిమాను మునెప్ప చెప్పినట్లు జాన్ తన కుక్క జానీతో సహా బయలుదేరి, తమ మనుషులైన వెంకు, నూకా కొరకు వారు పోయిన రైలులో ప్రయాణము చేయుచున్నాడు. రైలు సూట్‌కేస్ పడిన స్థలమునకు సరిగాపోవు సమయములో జాన్ ప్రక్కనున్న కుక్క మొరగను మొదలుపెట్టింది. జాన్ దాని మొరుగుడుకు అర్థమును గ్రహించి ప్రక్క స్టేషన్‌లో దిగాడు. అక్కడినుండి కుక్క ముందు పోతూవుంటే జాన్ దాని వెనుక పోసాగాడు. కుక్క ఒక గ్రామము వైపు పరుగిడసాగింది. దానివెంటే జాన్ ఆ గ్రామమును చేరాడు. ఆ గ్రామము మధ్యలో పెద్ద జన సముహమును జాన్ చూచాడు. ఆ జన సమూహమేమిటో చూడాలని తానుకూడా అక్కడికి పోయాడు. ముఖమునకు కొద్ది గాయాలైన నూకా కనిపించాడు. జాన్ మాత్రము నూకాకు కనిపించకుండా వుంటూ, తన కుక్క కూడా కనిపించనట్లు దానికి సైగ చేసి, అక్కడ ఏమి జరుగుచున్నదో చూచుచుండెను.

ఆ దినము నాగుల చవితి అయిన దానివలన, ఊరి మధ్యలో నాగుల కట్టవద్ద చాలామంది స్త్రీలు నాగులపూజలో పాల్గొన్నారు. కొందరు పురుషులు వారికి సహాయముగా అక్కడే ఉన్నారు. పూజార్లు పూజా విధానములో లగ్నమైవున్నారు. ఆటవికులు అక్కడి భక్తులనూ, పూజార్లను ప్రక్కకు పొమ్మని బ్రతిమలాడుచున్నారు. పూజార్లు ఆటవికుల మీద కోపగించుకొనుచు మీరు ఎవరు మమ్ములను ప్రక్కకు పొమ్మనే దానికి,

ముందు మీరు ఇక్కడి నుండి పొమ్మని గద్దించారు. పాముకాటు వలన ఒక మనిషి ప్రమాదములో ఉన్నాడనీ, అతనికి ఇక్కడే చికిత్స చేయాలనీ, ఇక వేరు విధానములేదనీ, కొద్దిగా ఆలస్యము జరిగినా ఆ మనిషి చనిపోవుననీ, ఆటవికులు పూజార్లకు ఎంతగా చెప్పినా వారు వినకపోయారు. అప్పుడు ఆటవికులతో పాటు వెంకును మోసుకొని వచ్చిన గ్రామస్థులు జోక్యము చేసుకొని, అక్కడి భక్తులను పూజార్లను ప్రక్కకు తొలగించారు. వెంటనే ఆటవికులలో ఒకడు వేపచెట్టు ఎక్కి వేపకొమ్మను త్రుంచుకొని దిగివచ్చి, వేపాకును పాముకాటుకు గురియైన వెంకు చేత తినిపించాడు. తర్వాత వేపాకు చేదుగా ఉందా లేదా అని అడిగాడు. వేపాకును నమిలిన వెంకు వేపాకు చేదుగా లేదు, చప్పగా ఉందని చెప్పాడు. ఆ మాటతో ఆటవికులు పాము విషము వెంకు శరీరమంతా వ్యాపించి తలకు కూడా ఎక్కినదని గ్రహించారు. వెంటనే రావి చెట్టును ఎక్కి రావికొమ్మను త్రుంచి క్రిందికి తెచ్చారు. కొమ్మను త్రుంచిన భాగమును పైకి పట్టుకొన్నారు. అప్పుడు యోగ రావి కొమ్మలనుండి రెండు ఆకులను కాడలతో సహా పెరికి అక్కడే పడుకోబెట్టిన వెంకు యొక్క రెండు చెవులలోనికి రావి ఆకుల కాడలను పెట్టాడు. ఆకుల కాడలు పూర్తిగా కర్ణభేరికి తగల కుండా, మరీ బయటికి లేకుండా లోపల గుబిలికి తగులునట్లుంచాడు. ఆ విధముగా పెట్టిన కాడలను రెండు లేక మూడు నిమిషములసేపు అట్లే ఉంచాడు. వెంకు చెవులలో ఏదో బాధ కనిపించసాగింది. వెంకు విడిపించుకొనే దానికి మొదలు పెట్టగా మిగత ఆటవికులు వెంకును కదలకుండా బలముగా పట్టుకున్నారు. అట్లు పెట్టిన ఆకు కాడలను మూడు నిమిషముల తర్వాత తీసి, మరియొక జత ఆకు కాడలను ముందు పెట్టినట్లే చెవులలో పెట్టి మూడు నిమిషముల తర్వాత తీసివేశాడు. అట్లు మూడు జతల ఆకులను పెట్టిన తర్వాత వెంకూ చేత వేపాకును తినిపించి రుచి ఎట్లున్నదని అడిగాడు.

కొద్దిగ చేదు కనిపిస్తున్నట్లు వెంకు చెప్పాడు. కొద్దిగ విషము ఇంకా వెంకు శరీరములో ఉన్నదని గ్రహించిన యోగ మరియొక జత ఆకులను వెంకు చెవులలో పెట్టి మూడు నిమిషముల తర్వాత తీసివేసి, తర్వాత వేపాకును తినిపించి రుచిని అడుగగా వేపాకు పూర్తి చేదుగా ఉన్నట్లు వెంకు చెప్పాడు. అప్పుడు అతని శరీరములో పాము విషము పూర్తి పోయినదని గ్రహించిన యోగ ఇక అతనికి ప్రాణభయము లేదని చెప్పాడు. పాము విషము పూర్తిగా ఆకులలోనికి వచ్చినదనీ, ఆ ఆకులను పశువులు తింటే వాటికి విషము ఎక్కుతుందని ఆ ఆకులను పూడ్చిపెట్టమనీ, యోగా చెప్పాడు.

ఇదంతయూ వింతగా చూచిన అక్కడున్న గ్రామస్థులూ, భక్తులూ, పూజార్లు ఆటవికులు చేసిన వైద్యమును గురించి అడిగారు. అప్పుడు యోగా ఈ విధముగా చెప్పను మొదలుపెట్టాడు. "భూమిమీద ప్రతి ఆకు ఒక ఔషధమే అను మాటను ఈనాటి ప్రజలు పూర్తిగా మరచిపోయారు. పూర్వకాలమున పెద్దలు ఏ ఉద్దేశముతో ఒక పనిని సూచించారో ఆ ఉద్దేశము ఈనాడు మనకు తెలియకుండా పోయినది. పూర్వ కాలములో రోగ నివారణకు వైద్యులు పూర్తిగా ప్రకృతినుండి లభించు మూలికల మీద ఆధారపడెడివారు. అమృతమయుడగు చంద్రుని కిరణముల ద్వారా భూమిమీద చెట్లన్నియూ ఔషధ గుణము కల్గియున్నవనీ, తెలిసిన పెద్దలు అనేక విధములుగా చెట్లను ఔషదములుగా ఉపయోగించి రోగ నిర్మూలన చేసెడివారు. ఒక చెట్టు ఆకు ఒక రోగమునకు ఔషధమని గ్రహించిన వైద్యులు పూర్వముండెడివారు. వారి వైద్య విధానమును వారి వద్దనున్న శిష్యులకు నేర్పెడివారు. కొంతకాలమునకు వైద్యులలో ఒక దుష్ట సాంప్రదాయము ఏర్పడినది. తమవద్ద వైద్యమును అభ్యసించు శిష్యులకు తమకు తెలిసినన్ని వైద్య క్రియలను బోధించక ఏదో ఒక క్రియను మాత్రము శిష్యులకు చెప్పకుండా తమవద్దనే దాచుకొనెడివారు.

ఉదాహరణకు ఒక వైద్య గురువుకు నూరు (100) రోగములకు నూరు ఔషధములు తెలిసివుంటే, తన శిష్యులకు 99 రోగములకు మాత్రమే వైద్యమును నేర్పించెడివారు. ఒక వైద్యమును మాత్రము తమవద్దనే దాచు కొనెడివారు. తమవద్దయున్న విద్యనంతయూ చెప్పితే శిష్యులు తమతో సమానులగుదురనీ, అలా కాకుండా తమకంటే తక్కువ వారుగా ఉండవలెనని ఆనాటి వైద్య గురువులు అలా చేసెడివారు. అలా చెప్పక పోవడము వలన ఆ ఒక్క విద్యకొరకు శిష్యులు గురువుకు వినమ్రులుగా ఉందురనీ, అన్ని విద్యలు తెలిస్తే గురువును మించిన శిష్యులై గురువును గౌరవించకుండా, గురువుమాట వినకుండా పోవుదురని ఆనాటి గురువుల అభిప్రాయము. గురువు యొక్క అవసానదశ వరకు ఎవరైతే గురువును గౌరవిస్తువుంటారో, ఆ శిష్యులకే తమవద్దనున్న ఒక్క వైద్య రహస్యమును చెప్పి పోయెడివారు. ఒకవేళ ఆ గురువు మధ్యలోనే అకాలమరణమును పొందితే, అతనివద్దనున్న రహస్యము శిష్యులకు తెలియకుండా అతనితోనే అంతమై పోయేది. అట్లు చనిపోయిన గురువులవలన కొన్ని వైద్య రహస్యములు కాలగర్భములో కలిసి పోయాయి. ఆనాటి వైద్య గురువులు అతి ముఖ్యమైన వైద్య విధానమును ఒకదానిని తమవద్ద రహస్యముగా ఉ ంచుకోవడము వలన వారి అకస్మాత్ మరణముతో ముఖ్యమైన వైద్య రహస్యములే తెలియకుండా పోయెడివి. ఈ విధముగా కాలగర్భములో ముఖ్యమైన వైద్య విధానములు నశించి పోవడమును గమనించిన కొందరు పెద్దలు యోచించి అన్నిటికంటే ముఖ్యమైనది, వైద్యమునకు కాలవ్యవధి లేనిది, గంటలోపే ప్రాణాపాయ స్థితికి తీసుకొని పోవునది, అయిన పాముకాటు వైద్యము రహస్యముగా మారిపోకుండా ఉండుటకు తగిన విధానమును అనుసరించాలనుకొన్నారు. వైద్యుల స్వార్థపూరిత విధానము నుండి పామువైద్యమును మినహాయించి, పాముకాటుకు వైద్యము మరుగున

పడిపోకుండా, ప్రతి మనిషికీ తెలియునట్లు చేయాలనుకొన్నారు. అట్లు తెలియుటకు ఆ రోజు ఆ వైద్యమును అందరికీ చెప్పినప్పటికీ కొంత కాలమునకు తిరిగి మరుగునపడు అవకాశము కలదు. కావున శాశ్వితముగా ఆ వైద్యము మరుగున పడిపోకుండా ఉండుటకు అందరికీ ప్రత్యక్షముగా ఎల్లకాలము తెలియునట్లు దేశమంతా ప్రతి ఊరులోనూ పాముకాటు వైద్యమునకు సంబంధించిన గుర్తునూ మరియూ ఆ గుర్తుదగ్గరే పాముకాటుకు ఔషధములనూ ఉండునట్లు చేయాలనుకొన్నారు. ఆ ప్రక్రియలో భాగముగా మొదట ప్రతి ఊరులోనూ నాగుపాముబొమ్మలను ఒక కట్టమీద ఉంచారు. ఈ పాములు కరిస్తే దానికి వైద్యముగా ఈ మూలికలను వాడమని, రెండవ ప్రక్రియగా ఆ ప్రతిమల వెనుక వేపచెట్టు, రావిచెట్టు మొక్కలను పెంచారు. ఈ పాములు కరిస్తే ఈ మొక్కలే పాముల విషమును హరించునని తెలిపారు. అలా ఆ రోజు పెద్దలు యోచించి ప్రతిష్ఠించినవే ఈనాటి నాగులకట్టలు. ప్రతి ఊరులోనూ నాగులకట్టా, ఆ కట్టమీద వేప రావి చెట్లను ఆనవాయితీగా పెట్టవలెనని ఆనాడు పెద్దలు సూచించారు. అంతేకాక పాము కరిచినపుడు ఆ చెట్లను ఎట్లు ఉపయోగించాలో కూడా తెలిపారు.

పూర్వము పెద్దలు నిర్మించిన నాగులకట్ట వలన అందరికీ పాము కాటు వైద్యము తెలిసిపోయింది. పాముకాటు తిన్న ప్రతి ఒక్కరూ వేప రావి చెట్ల ద్వారా వైద్యమును సకాలములో పొందుచుండిరి. పాముకాటు వైద్యములో రావి ఆకులు ముఖ్యమైన పాత్ర పోషిస్తున్నవని ఆనాడు అందరికీ తెలిసిపోయింది. అంతేకాక ప్రతి రావిఆకూ పాము పడగ ఆకారమును పోలియున్నట్లు గ్రహించారు. ఏ పాము కరిచినా పాముపడగ ఆకారములో నున్న రావిఆకు ఆ విషమును పీల్చుకొనునని చెప్పుకొనెడి వారు. ఈ

విధముగా పాములవైద్యము ప్రతి మనిషికీ తెలిసిపోయినప్పటికీ కాల క్రమమున అజ్ఞానము పెరిగిపోయి, తన శరీరములోని దైవత్వమును గుర్తించలేని మానవుడు చివరకు చెట్టుకూ, గుట్టకూ మొక్కడము మొదలు పెట్టాడు. మానవుని అజ్ఞాన ప్రవాహములో ఆనాడు తెలిసిన పాము వైద్యవిధానము చివరకు పూజావిధానముగా మారిపోయినది. ఆనాటి పెద్దల ఉద్దేశ్యము అడుగంటి పోయి ఏదైతే రహస్యము కాకూడదనుకొన్నారో, అది ఈనాడు మనందరికి తెలియని రహస్యమైనది. ఈ వైద్య విధానమేమిటో ఇప్పుడు మీకు తెలియని దానివలన, మేము చావుబ్రతుకుల మధ్యలోనున్న మనిషిని తెచ్చి కొద్దిగ ప్రక్కకు పొమ్మనినా, ఈ మనిషికి వైద్యము చేయాలని బ్రతిమలాడినా ఎవరూ వినిపించుకోక పోయారు. మీరు భక్తిగా పూజ చేయుచుండగా, మేము దానిని భంగపరుచుటకు వచ్చినట్లు తలచారు. తర్వాత ఎలాగో చివరకు వైద్యము చేసి ఇతనిని బ్రతికించాము. ఇప్పుడు మీ అందరి ముందర రహస్యమైన పోయిన వైద్యమును చేసి బయట పెట్టాము. ఇప్పుడు ప్రత్యక్షముగ చూచిన మీరు నేటినుండైనా, ఈ ఔషధ వృక్షములు పాముకు వ్యతిరేఖమైనవని తలచి, వీటిని ఔషధములుగా మీరు ఉపయోగించుకోవాలని కోరుచున్నాము." అని యోగ ఏకధాటిగా చెప్పిన మాటలను విని అక్కడున్న వారు ఒకరి ముఖము ఒకరు చూచుకొన్నారు. అప్పుడు వారిలో ఒక పూజారి ఇలా అన్నాడు.

**పూజారి :-** అన్ని విషయములను తెలిసిన పెద్దలూ, ఎందరో మేధావులూ మరియు ఎందరో నిష్టాగరిష్టులూ ఎంతో కాలమునుండి నాగప్రతిమలను పూజిస్తున్నారు. వారికి తెలియని రహస్యముంటుందా? మీరు చెప్పినట్లు వారు ఎక్కడా చెప్పలేదు. వారికంటే మీరు తెలిసినవారా? (అని ఆటవికులను ఆయన విమర్శించగా? అక్కడి వారందరూ ఆయన మాటనే బలపరిచారు అలా వారి మాటలను విన్న యోగా వెంటనే ఇలా అన్నాడు.)

**యోగా :-** ఇక్కడ ప్రస్థుతము పూజిస్తున్నవారూ మరియు పూజలు చేయకున్న వారూ ఉండవచ్చును. పూర్వమునుండి ఈ పూజలను ప్రోత్సహించిన వారూ ఉండవచ్చును. వారు ఏమి చెప్పినా ఆ మాటలనే పెద్దగ తలచి గ్రుడ్డిగా నమ్మువారూ ఉండవచ్చును. అంతమాత్రమున వారు సర్వము తెలిసినవారనుకోవడము పొరపాటు. మీరు నాగులను పూజిస్తున్నారు కదా! అయితే ధైర్యముగా నాగుపాము చెంతకు పోగలరా? మమ్ములను పూజిస్తు న్నారని అది మిమ్ములను కాటువేయక వదలునా? వారు చెప్పింది అమలుకు రాని ఫలితము. మేము ఇంతవరకు ఏమి చెప్పామో అది అమలుకు వచ్చు ఫలితము. వారు చెప్పినది భక్తిగా వీటిని పూజించమని, మేము చెప్పునది తెలివిగా వీటిని వైద్యముగా వాడుకొమ్మని. మా మాట నిజమనుటకు నిదర్శనము మీరు ఇప్పుడు చూచారు కదా!

**పూజరి :-** మీరు చెప్పినదీ, చేసి చూపించినదీ నిజమే. కానీ దీనివలన భక్తిభావములు సన్నగిల్లిపోయి, దేవుడే లేడను నాస్తికత్వమునకు దారి ఏర్పడగలదేమో?

**యోగా :-** మేము దేవుడు లేడని చెప్పలేదు. అసలైన దేవున్ని మరచి, కల్పిత భక్తిలోపడి దేవునికి దూరమవుతున్నారని చెప్పుచున్నాము. మనలో భక్తి ఉంది, అయితే అది దేవుని వైపు కాకుండ మరియొక వైపు వృథాగా ఆచరింపబడుచున్నదనీ చెప్పుచున్నాము.

**పూజారి :-** మేము చేయునది వృథా భక్తియా! మా భక్తి సరియైనది కాదా!

**యోగా :-** అవును, నా మాటలో సత్యమును గ్రహించండి. నిజము నిష్ఠూరముగా, కఠినముగా ఉండును. అందువలన కొద్దిగా యోచించి అర్థము చేసుకోండి. కదలికలేని రాతిప్రతిమల పాములను భక్తిగా పూజిస్తున్న

మనము, ప్రాణమున్న పాము కనిపించిన వెంటనే చితకబాది దాని ప్రాణము తీస్తున్నాము. అటువంటపుడు పాముల మీదున్న మన భక్తి నిజమైనదా? రాతి బసవన్నకు మ్రొక్కువారు శక్తికి మించిన బరువును బ్రతికిన బసవన్నకు పెట్టి, లాగలేక నిదానముగా అడుగులువేస్తే కట్టెలతో కొట్టి మరీ లాగిస్తున్నారు. బ్రతికిన బసవన్ననుకొట్టి రాతి బసవన్నకు మ్రొక్కడమా భక్తి. కుక్కను కాటమయ్యగా, పందిని వరాహ అవతారముగా పూజించు మనము వాటిని ఎంతమటుకు గౌరవిస్తున్నాము? మనము పూజించే చెట్లను పొయ్యిలో పెట్టుచున్నాము. ఆరాధించే దేవతలను తిట్టుచున్నాము. పైగా మాది భక్తికాదా? అని అడుగుచున్నారు. మీరే యోచించండి మన భక్తి ఎలాంటిదో. మేము దైవములేడను నాస్తికత్వమును చెప్పలేదు. దేవుడున్నా డనీ, ఆయన మన శరీరములోనే ఉన్నాడనీ, ఆయనను తెలుసుకొనుటకు జ్ఞానము అవసరమనీ చెప్పుచున్నాము. **జ్ఞానమును తెలిసినవారే దైవమును తెలియగలరు.** జ్ఞానము తెలియనపుడు మనభక్తి దైవమువైపు కాకుండా చెట్టువైపు గుట్టలవైపు మరలిపోవును. నిజమైన దైవమును తెల్పుటకు మన పెద్దలు ఎన్నో జ్ఞాన సూచనలుగల్గిన దేవాలయములను నిర్మించి చూపించారు. కానీ నేడు వాటి అర్థమును వదలివేసి, గ్రుడ్డిగా పూజలు చేయుచూ, కోర్కెలను కోరుటకు అనువుగా మార్చుకొన్నారు. ఈ చెట్లనుండి వైద్యమును గ్రహించలేనట్లు దేవాలయములనుండి దైవత్వమును గ్రహించ లేని స్థితిలోవున్నాము. ప్రపంచమునకంతటికీ ఒకే దేవుడని తెల్పు దేవాలయ రహస్యములను తెలుసుకోలేక వాటిలో కూడా ఇవి వైష్ణవ దేవాలయములు, ఇవి శైవ దేవాలయములని పేర్లు పెట్టి తెగలుగా ఏర్పరుచుకొన్నాము. ఇది మన భాషలో భక్తి అనుకొనినా దేవుని భావములో భక్తికాదు.

అడుగడుగునా, అణువణువునా నిండి కనిపించని శక్తిగాయున్న దేవుడు ఇప్పుడున్న మన భక్తికి తెలియబడడు. మన శరీరములోనే ఉండి మనకు చైతన్యమునిచ్చు దైవమును కనుగొనుటకు ఈనాడున్న భక్తి మానవునికి ఉపయోగపడదు. (అలా ఉద్వేగభరితముగా యోగా చెప్పిన మాటలను విన్న జనసముహములో కొద్దిగా మార్పువచ్చినది. దేవుడే లేడని నాస్తికునిగా తిరుగుచున్న ఒక గ్రామస్థుడు గట్టిగా చప్పట్లుకొట్టి ఈ విధముగా అన్నాడు.)

**నాస్తికుడు :-** శభాష్, ఈ విధముగా దేవుడున్నాడంటే నేను కూడా ఒప్పు కొంటాను. ఈ విధముగా కాకుండా మూఢనమ్మకముతో గ్రుడ్డిగా చెప్పే మాటలనూ, చేసే భక్తిని నేను ఒప్పుకోను. తిరునాళ్ళలో రథచక్రాలకు కొబ్బరికాయలు కొట్టవలెనని చివరికి దానిక్రిందనే పడి చనిపోవడమూ, యాత్రకు పోయినవారు దోపిడీలకు గురికావడమునూ చూచి దేవుడుంటే తన భక్తులనే రక్షించలేదే, అలాంటివాడు దేవుడెలా అవుతాడని అనుకొను చుంటిని. ఈనాడు ఈయన చెప్పు మాటలతో ఆ దేవుళ్ళు నిజ దేవుళ్ళు కాదను సత్యమును విన్నాను. నిజదేవుడొకడున్నాడను విషయము ఈనాడు నాకర్థమైనది. నేను కూడా ఈయన చెప్పు పద్ధతి ప్రకారము దేవుడున్నాడని ఒప్పుకొంటున్నాను. (అలా ఒక నాస్తికుడు మాట్లాడడముతో ఆ ఊరి పెద్ద కూడా ఇలా అన్నాడు.)

**ఊరి పెద్ద :-** ఇదంతా చూచిన తర్వాత, విన్న తర్వాత మేము ఏదో పొర పడినామనీ, మాకు తెలియని రహస్యములు ఎన్నోవున్నవనీ అర్థమగుచున్నది. మీరు మాకు తెలియని అమూల్యమైన పాముపైద్యమును తెలిపారు. ఇంత వరకు మాకు తెలియని దైవజ్ఞానమును కూడా కొన్ని రోజులు మీరు ఇక్కడే వుండి తెలుపమని అడుగుచున్నాము. మీరు మాతో కొంతకాలముండి

నిజమైన భక్తినీ, జ్ఞానమునూ తెల్పి దేవుని మార్గమువైపు మరల్చగలరని ఆశిస్తున్నాము.

(ఈ విధముగా ఆ గ్రామస్థులు మార్పుచెందినవారై అక్కడున్న నాస్తికునితో సహా అందరూ ఆటవికులను కొన్ని రోజులు అక్కడే ఉండమనగా! దానికి ఆటవికులు ఇప్పుడు కాదు. మేము ఇప్పుడు ఒక పని నిమిత్తము వచ్చామనీ, తర్వాత ఎప్పుడైనా వీలుంటే వస్తామని చెప్పుచుండిరి. ఇట్లు గ్రామస్థులు, ఆటవికులు మాట్లాడుకొనుచుండగా జాన్ నూకాను కలుసుకొని జరిగిన విషయమంతా తెలుసుకొన్నాడు. తమ నాయకుడు అదే పనిగా పంపితే వచ్చానని చెప్పిన జాన్ తాము తమ నాయకునివద్దకు వెంటనే పోవాలని చెప్పాడు. అప్పుడు గ్రామస్థులు మాటల్లో ఉండగా, వారు గమనించకుండా తమతోపాటు వెంకూను పిలుచుకొని అక్కడినుండి తప్పించుకొని పోయారు. తర్వాత తమ నాయకుని వద్దకు చేరి జరిగిన విషయమంతా చెప్పారు. పామునూ, అందులోని వజ్రములనూ పోగొట్టు కొన్నందుకు నాయకుడు మునెప్ప వెంకూ, నూకా మీద కోపగించుకొని చేయునది లేక ఇలా అన్నాడు.)

**మునెప్ప :-** పోయిన వజ్రములనుఎలా తెచ్చి ఇవ్వగలము? వజ్రములను ఇవ్వకపోతే వాటి ఖరీదు మొత్తము డబ్బు ఇవ్వవలసి ఉండును. అంత డబ్బు బ్యాంకులు దోపిడీ చేసినా సమకూర్చలేము. మిమ్ములను నమ్ము కొన్నందుకు నన్ను నట్టేట ముంచారు. ఏమి చేయాలో అర్థము కాలేదు. ఈ విషయమును ఉన్నదున్నట్లు వారికి చెప్పుకోవడము మంచిది. చివరకు వారు ఏమంటారో చూడాలి.

**వెంకు :-** ఈ విషయము ఎవరికి చెప్పాలో చెప్పండి. మేము పోయి వారికి జరిగినది జరిగినట్లు తెలియబరుస్తాము.

**మునెప్ప :-** ఇది చాలా రహస్యమైన వ్యవహారము. గొప్ప స్వామీజీగా పేరుగాంచిన తపస్విబాబా అను స్వామికి ఈ విషయము తెలియాలి. ఆయనకే మనము వజ్రాలను అందివ్వవలసివున్నది. వజ్రాలు పోయాయని ఆయనకు తెలియజేసి తర్వాత ఆయన ఏమంటారో ఆ విషయమును తెలుసుకొని రావాలి.

**వెంకు :-** జరిగిన దానికి బాధపడితే ఎలా అన్నా! మేము ఇప్పుడే బయలు దేరిపోయి ఉన్నదున్నట్లు చెప్పి, జరిగిన దానికి మేము బాధ్యులముకాదని చెప్పుతాము. మేము ఎక్కడికి పోయి చెప్పిరావాలో నీవు ఆ అడ్రస్ చెప్పు.

(అందులకు మునెప్ప విసుగ్గా ఇలా అన్నాడు)

**మునెప్ప :-** మీరు తొందరపడి ముందువెనుక ఆలోచించకుండా పనిచేసి కష్టాలు తెచ్చుకొంటారు. అడ్రస్ తెలుసుకొని పోయినంతమాత్రమున అంత సులభముగా నేను చెప్పిన పని నెరవేరదు. తపస్వి బాబా ఆశ్రమములో నిత్యము వేయిమంది భక్తులుంటారు. తపస్వి బాబాగారితో కలిసి మాట్లాడ డానికి ఎవరికీ వీలుండదు. ఆయన ఎవరి ప్రవేశమూ లేని రహస్య మందిరములో ఉంటాడు. ఎవరూ ఆ మందిరములోనికి పోరు. ఆయన కొన్ని సమయములలో మాత్రమే బయటికి వస్తాడు. అప్పుడు కూడా అక్కడ చేరిన భక్తులకు దర్శనమివ్వడానికే వస్తాడు. తిరిగి ఆయన తన మందిరములోనికి వెళ్ళిపోతాడు. కావున వజ్రాల విషయమును అంత సులభముగా మీరు ఆయనకు చెప్పలేరు.

**వెంకు :-** మరి ఆయనకు మేము ఎలా ఈ విషయమును అందివ్వగలము. దానికి నీవే ఉపాయమును చెప్పు.

**మునెప్ప :-** ఇలాంటి రహస్య విషయములను తెలియబరిచే దానికి ఇతరుల కెవ్వరికీ అంతుచిక్కని సులభమైన విధానమొకటి ఉన్నది. అది ఏమంటే! తపస్వి బాబాగారు భక్తులకు దర్శనమివ్వడానికి బయటికి వచ్చినపుడు భక్తులందరూ నిశ్శబ్దముగా వరుసలు తీరి కూర్చొనివుందురు. కొందరు భక్తులు వారివారి కష్టములనూ, కోర్కెలను ఉత్తరములో వ్రాసుకొని బాబాగారు వారికి దగ్గరగా పోయినపుడు తమ ఉత్తరములను బాబాగారికి అందిస్తూ వుంటారు. అటువంటి సమయములోనే మీరు ఈ విషయమును ఆయనకు అందివ్వాలి. గోధుమరంగు పేపరు మీద విషయమంతా వ్రాసి నాలుగు మడతలు పెట్టి అందివ్వండి. గోధుమరంగు పేపరు తనకు సంబంధించి దని ఆయనకు తెలుసు కనుక తప్పక తీసుకొంటాడు. అలా ఒకరోజు కుదరకపోతే రెండవ రోజైనా ఇవ్వండి. తపస్విబాబాగారు అందరి కాగితము లతో పాటు మీ కాగితమును కూడా తీసుకొని పోయి, ఆ కాగితమును ఎవరూ చూడకుండా తన మందిరములో తాను ఒక్కడు మాత్రమే చదువు కొనును. తర్వాత ఆయన మనకు తెలుపు విషయమును కూడా ఎవరికీ తెలియకుండా తెలియబరచును. ఆయనకు చీటీలు ఇచ్చిన భక్తులలో ఒకరినో లేక ఇద్దరినో పిలిచి మాట్లాడును. అది కూడా ఎవ్వరూ లేని ప్రత్యేక గదిలో, సమస్యలు వ్రాసుకొన్నవారికి తన ఆశీస్సులు ఇవ్వడమో, లేక కోర్కెలు నెరవేరునట్లు హామీ ఇచ్చి పంపడమో, లేక వారి కష్టములు విని సమాధాన పరచి పంపడమో జరుగుచుండును. ఆ విధముగనే నీకు ఆయన పిలుపు వచ్చును. అప్పుడు నీకు తపస్వి బాబాగారితో ఏకాంతముగా కలిసి మాట్లాడే దానికి అవకాశము దొరుకును. అప్పుడు నీవు ఒక్కనివే ఉంటావు. కావున ఆయన తన వివరమును తెలియబరచి పంపును.

ఆయన తన సమాచారమును ఏ కాగితము మీదా వ్రాసి ఇవ్వడు. కలిసినపుడు మాటల రూపముతోనే చెప్పును. కనుక నీవు జాగ్రత్తగా విని రావలయును. ఇపుడు మనమంతా ఆయన కరుణ మీద ఆధారపడివున్నాము. మనలను శిక్షించినా, రక్షించినా ఆయన ఇష్టము.

(దీర్ఘముగా విషయమంతా వినిన వెంకు తన అన్న అయిన తాటిమాను మునెప్ప దగ్గర తపస్విబాబాగారి అడ్రస్ అంతా తీసుకొని తపస్వి బాబాగారి ఆశ్రమమునకు బయలుదేరి పోయాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(గ్రామస్థుల కోర్కెను తిరస్కరించిన యోగ మొదలగు ఆటవికులు బయలుదేరి రాఘవను వెదకుచూ పోయారు. కానీ ప్రతిచోట వారికి ఏదో ఒక ఆటంకము ఏర్పడుచుండుట వలన రాఘవను తొందరగా కనుక్కోలేక పోయారు. వారు ఒక గ్రామమును దాటిపోవుచుండగా ఆ సమయానికే ఒక చిరుతపులి అడవినుండి దారితప్పి ఆ గ్రామములోనికి ప్రవేశించి వీర విహారము చేయసాగింది. ఒక ఇంటిలోనికి దూరి పశు వులను గాయపరచను మొదలుపెట్టింది. గ్రామస్థులు దానిని బెదిరించి గ్రామమునుండి తరిమి వేయాలని ప్రయత్నించగా, వారిపైకి దాడిచేసి గాయపరచను పూనుకొన్నది. కొందరు గ్రామస్థులు ఊరి బయటకు భయముతో పరుగిడసాగిరి. కోపముతో చెలరేగిన పులి గ్రామములో అల్లకల్లోలము పుట్టించింది. ఆ గందరగోళమంతయూ ఆటవికులు చూస్తున్నట్లే జరుగుచుండెను. అడవిలో నివసించుటకు అలవాటుపడిన ఆటవికులు పులిని ఎదిరించి గ్రామస్థులను కాపాడవలెననుకొన్నారు. అంతలో పులి ఆటవికుల మీదికే వచ్చినది. పులి రాకను గమనించిన

ఆటవికులు ప్రక్కనే ఉన్న ఒక నులకతాళ్ళ మంచమును పట్టుకొని, పులి వారిమీదికి దుమికిన వెంటనే మంచము అడ్డముపెట్టి మంచముతోనే భూమికి పులిని అదిమిపట్టారు. నులక మంచము క్రింద ఇరుక్కొన్న పులి తప్పించు కోవలెనని ప్రయత్నించుకొలది దానికాళ్ళు నులక తాళ్ళలో చిక్కుకొన్నాయి. పులిని ఎటూ కదలనివ్వక నలుగురు ఆటవికులు పట్టుకోగా, మిగత నలుగురు పులికాళ్ళను కట్టివేసిరి. సులభముగా పులిని బంధించిన ఆటవికులను చూచి గ్రామస్థులు ధైర్యముగా అక్కడ గుమికూడారు. ఆటవికులను అందరూ పొగడుచూ తమను గాయపరిచిన పులిని వదలకూడదనుకొన్నారు. మంచము క్రింద చిక్కుకొని కట్టివేయబడిన పులిని తలావొక వేటు కొట్టారు. ఆ దెబ్బలకు పులి చనిపోయింది.

అంతలోనే అటవీశాఖ ఉద్యోగులు అక్కడికి చేరి పులి చనిపోయి వుండడమును చూచి దీనిని ఎవరు చంపారని అడిగారు. పులిని చంపుట చట్టరీత్యా నేరమని తెలిసిన గ్రామస్థులు మేముకాదని తప్పించుకొనిరి. పులిని మేమే పట్టుకొన్నామని ఆటవికులు చెప్పగా, పులిని కూడా వారే చంపివుంటారని అనుకొన్న అటవీశాఖవారు ఆటవికులను పట్టుకొని పోయిరి. తాము మంచి చేసినా చెడ్డగా తలచు నాగరికత సమాజమును చూచి ఆటవికులకు పెద్ద విసుగువచ్చినది. మరలా వేరొక చోట అలా ఇరుక్కొని రాఘవను వెదకలేక పోయినందుకు చింతిస్తూ అటవీ అధికారుల చేతినుండి తప్పించు కొను ఉపాయమును ఆలోచించసాగిరి.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(రాజయోగానంద స్వామివద్ద అనేక మహత్యములనూ, వాటి పద్ధతులనూ తెలుసుకొన్న రాఘవ దైవజ్ఞానాసక్తుడై, దైవమును గూర్చి తెలుసు కొనుటకు మొదలుపెట్టి తనలోనున్న ప్రశ్నలను ఇలా అడగను మొదలు పెట్టెను.)

**రాఘవ :-** స్వామీ! ఈ జగత్తంతటికి ఎవరు అధిపతి?

**రాజయోగా :-** సర్వాధికారి, సర్వ సృష్టికర్త అయిన పరమాత్మ ఒక్కడే ఈ జగత్తుకు అధిపతి. ఆయనను క్రైస్తవులు పరలోక తండ్రియనీ, ముస్లీమ్‌లు అల్లాయనీ, ఇందువులు పరమాత్మ అని అంటున్నారు.

**రాఘవ :-** అయితే పరమాత్మ అనబడే దేవుడు అందరికీ సమానుడే కదా!

**రాజయోగా :-** అవును ఆయన మనందరికీ, సర్వ జీవరాసులకు సమానుడే.

**రాఘవ :-** మనకు అందరికీ ఆయన సమానుడైనపుడు, ఆయనకు కూడా అందరూ సమానమే కదా!

**రాజయోగా :-** సర్వజీవరాసులు ఆయనకు సమానమే. ఏ జీవరాసి ఎడల ఆయనకు భేదము లేదు.

**రాఘవ :-** స్వామీ! ఇక్కడే నాకు పెద్ద సంశయమున్నది.

**రాజయోగా :-** ఏమిటి నీ అనుమానము.

**రాఘవ :-** భూమిమీద మనుషులలో కొందరు ధనికులుగా, కొందరు పేద వారిగా, కొందరు మధ్యరకముగా జీవిస్తున్నారు. సర్వులను సృష్టించిన దేవుడు అందరికి సమానమైతే, అందరినీ సమానముగా పుట్టించవలెను. కానీ కొందరు బీదవారిగా కష్టములు అనుభవించడమూ, కొందరు ధనవంతులై సుఖములను అనుభవించడము వలన దేవునికి వీరు సమానము కాదని అర్థమగుచున్నది. దేవునికి అందరూ సమానమే అయితే అందరినీ ఒకే రకముగా పుట్టించవలెను కదా!

**రాజయోగా :-** మనుషుల పుట్టుకలూ, అట్లే వారు అనుభవించు కష్ట సుఖములూ దేవుడు చేయునవి, దేవుడు ఇచ్చునవి కావు. దేవుడు మనుషులను సృష్ట్యాదిలో సృష్టించిన మాట వాస్తవమే. సృష్టి జరిగిన తర్వాత దేవుడు పని చేయడు. అంతేకాదు దేవునికి రూపమూలేదు, పేరూ లేదు. అందువలన దేవున్ని రూప,నామ, క్రియారహితుడు అని అంటారు. దేవుడు అందరికి సమానుడే ఆయన ఎవరికి మిత్రుడూకాదు, శత్రువూకాదు. మనమే ఆయనకు సమానముగ లేము. ఒక మనిషి దేవున్ని పొగడుచూ ఉంటే, మరొక మనిషి దేవున్ని దూషిస్తూవుంటాడు. ఇంకొకడేమో దేవున్నే లేడని అంటుంటారు. ఇకపోతే మనము అనుభవించు కష్టసుఖములూ దేవుడు విధించునవి కావు. వాటన్నిటిని ప్రకృతియే మనము స్వయముగా చేసుకొన్న కర్మలనుబట్టి విధించుచున్నది. జీవరాసులను పుట్టించుట, చంపుట అనేక రకములుగా బ్రతికించుటను ప్రకృతియే చేయుచున్నది. దేవుడు ఏమీ చేయలేదు.

**రాఘవ :-** అట్లయితే మనము ప్రకృతి ఆధీనములో ఉన్నామా? అయితే సర్వజీవరాసులను తన ఆధీనములో ఉంచుకొనిన ప్రకృతి ఎవరి ఆధీనములో ఉన్నది?

**రాజయోగా :-** పరమాత్మ ఆధీనములో ప్రకృతి ఉన్నది. ప్రకృతి ఆధీనములో సర్వజీవరాసుల మనుగడ ఉన్నది. అందువలన ప్రతి జీవరాసి, ప్రతి మనిషి ప్రకృతి చేతిలో అస్వతంత్రులవై కీలుబొమ్మలవలె ప్రకృతి ఆడించుచున్నట్లు ఆడుచున్నాము.

**రాఘవ :-** ప్రకృతి మనలను ఎలా ఆడించుచున్నది?

**రాజయోగా :-** ప్రకృతి గుణముల రూపములో ప్రతి మనిషి తలలోను

ఉన్నది. ప్రకృతి జనితములైన గుణముల చేత మనిషి ఆడింపబడుచున్నాడు. గుణములనే మాయ అని కూడా అంటున్నాము. ప్రకృతి యొక్క మాయ చేత ప్రతి మనిషి పనులు చేయవలసివచ్చినది. కష్టసుఖములను అనుభవించ వలసివచ్చినది. మనిషి సంపాదించుకొన్న పాపపుణ్యములనుబట్టి మాయ కదిలించి కష్టసుఖములను అనుభవింపచేయుచున్నది. పాపపుణ్యములను కర్మ అంటాము. కర్మ మాయ ఆధీనములో, మాయ పరమాత్మ ఆధీనములో ఉన్నదని తెలియుచున్నది. అందువలన అన్నిటికీ మూలకర్త చివరికి పరమాత్మయేనని చెప్పవచ్చును.

**రాఘవ :-** ప్రకృతి ఆధీనములోనుండి తప్పించుకొని నేరుగా దేవున్ని చేరుకోవాలంటే ఏమి చేయాలి?

**రాజయోగా :-** గుణములు అను మాయనుండి తప్పించుకోవాలి. మాయ తననుండి ఎవరినీ తప్పించుకోనివ్వదు. అందువలన మాయను జయించాలి. మాయను జయించుట దుస్సాధ్యము. దేవున్ని ఆశ్రయించిన వాడు మాత్రమే మాయను జయించగలడు. దేవున్ని ఆశ్రయించుటకు దేవుని జ్ఞానమును పూర్తిగా తెలిసివుండాలి. జ్ఞానమును సంపూర్ణముగా తెలిసినప్పుడే మాయను జయించి దేవున్ని చేరవచ్చును.

**రాఘవ :-** దేవుని జ్ఞానమును తెలుసుకొంటే మాయను ఎలా జయించ వచ్చును. జ్ఞానమును తెలిసిన వారందరూ మాయను జయించగలిగారా?

**రాజయోగా :-** దేవుని జ్ఞానమును తెలిసిన వారు మాయను దాటవచ్చును. కానీ జ్ఞానులనువారు అందరూ మాయను జయించలేక పోవుచున్నారు. మాయను జయించలేక పోవుచున్నారంటే, వారు తెలుసుకొన్నది దేవుని జ్ఞానముకాదని తెలియవచ్చును. తనను జయించకుండావుండుటకు, తాను ఎవరి చేతిలో ఓడిపోకుండా ఉండుటకు మాయ స్వయముగా తన జ్ఞానమును

మనిషికి నేర్పి, అది దేవుని జ్ఞానమేనని నమ్మించుచున్నది. మనిషి మాయ చేతిలో పొరపడి, మాయ జ్ఞానమునే తెలుసుకొని తనది దేవుని జ్ఞానమను కోవడము వలన, చివరకది దేవుని జ్ఞానము కానందున, మాయను జ్ఞానులందరూ జయించలేక పోవుచున్నారు. నిజమైన దేవుని జ్ఞానమేదో, దేవుని జ్ఞానమువలెనున్న మాయ జ్ఞానము ఏదో తెలియని మనుషులు చాలామంది మాయ జ్ఞానమునే ఆశ్రయించి పొరబడిన దానివలన మాయ వారినందరినీ తన పక్షములోనే పెట్టుకొని దేవున్ని తెలియకుండా చేసింది. అంతేకాక అటువంటి వారిని చాలామందిని గురువులుగా మార్చివేయడము వలన వారిని ఆశ్రయించి వారు చెప్పెడి జ్ఞానమును అనుసరించు వారు కూడా దేవున్ని తెలియలేకపోయారు.

నిజమైన దేవుని జ్ఞానమును తెలిసినవారు చాలా అరుదుగా ఉందురు. అటువంటి వారు దేవున్ని తెలియుటకు ధర్మబద్ధమైన మార్గములు రెండు ఉన్నవని తెలిసి, వాటిలో ఏదో ఒక దానిని అనుసరించి, చివరకు మాయను జయించి దైవమును చేరగల్గుచున్నారు. దేవుడు భగవంతుని రూపములో వచ్చి తనను చేరుటకు చెప్పిన మార్గములు ధర్మమైనవి రెండే గలవు. అవియే ఒకటి బ్రహ్మయోగమూ, రెండవది కర్మయోగము. బ్రహ్మయోగ మార్గములో పోవువాడు తన శరీరములోని మనస్సును అదుపులో పెట్టు కోవలసివుండును. కర్మయోగమార్గములో పయణించువాడు తన శరీరము లోని అహమును అదుపులో పెట్టుకోవలసివుండును. దీనినిబట్టి మనిషి దేవున్ని చేరుటకు దేవుడే చెప్పిన రెండు మార్గములు శరీరములోనే కలవని తెలియుచున్నది. **శరీరములోనే గల మాయను జయించుటకు, శరీరములోనే రెండు యోగమార్గములను దేవుడు చెప్పినప్పటికీ, మాయ చెప్పెడు జ్ఞానము వలన అందరూ శరీరములో**

**కాకుండా బయటి మార్గములలోనే సాగుచున్నారు.** అందువలన వారికి దేవుని సాన్నిధ్యమైన మోక్షము లభించలేదు.

**రాఘవ :–** మనుషులను పుట్టించి కష్టసుఖములందు ముంచుచూ అందరినీ తన ఆధీనములో పెట్టుకొన్న ప్రకృతినుండి తప్పించుకొని పరమాత్మను చేరాలంటే ముఖ్యముగా మన శరీరములోని కనిపించని మనస్సు మీదా మరియు కనిపించని అహము మీదా ఆధారపడవలసిందేనని నాకు బాగా అర్థమైనది.

**రాజయోగా :–** అవును. శరీరములోని రెండిటి మీద రెండు యోగములు ఆధారపడినవి. ఈ విషయము తెలియక బాహ్యములో భజనలు చేసినా, వ్రతక్రతువులు చేసినా, బ్రహ్మోత్సవములు చేసినా, తీర్థయాత్రలు చేసినా పరమాత్మను ఎవరూ చేరలేరు. అందువలన భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగమున 48వ శ్లోకమున మరియు 53వ శ్లోకమున యజ్ఞముల వలనగానీ, దానముల వలనగానీ, వేదాధ్యయనము వలనగానీ, తపస్సులు చేయడము వలనగానీ దేవున్ని తెలియుటకు శక్యముకాదు అని స్వయముగా భగవంతుడే చెప్పాడు.

**రాఘవ :–** స్వామీ ఇప్పుడు చాలా రాత్రి గడచిపోయినది. మీరు విశ్రాంతి తీసుకోండి. రేపు నేను మరికొన్ని జ్ఞాన విషయములను మీనుండి తెలుసు కొంటాను.

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(మునెప్ప మఠాలోని వెంకు తపస్విబాబాగారి ఆశ్రమమును చేరి, అక్కడ పరిస్థితులను గమనించాడు. ఒక దినమునకే అక్కడ పరిస్థితి అంతా వెంకూకు అర్థమైనది. ఉదయము, సాయంత్రము భక్తులందరూ తపస్వి బాబాగారి దర్శనమునకు కూర్చుండుట చూచి తాను కూడా వారిలో

కలిసి పోయి అందరితో పాటు కూర్చున్నాడు. తమ నాయకుడు చెప్పినట్లు ముందే విషయమునంతటిని గోధుమరంగు పేపరు మీద వ్రాసుకొని జాగ్రత్తగా ఉంచుకొనివుండెను. ఆ దినము ఏదో పండుగైన దానివలన భక్తులు ఎక్కువగా ఉండిరి. ఆ దినము తపస్విబాబాగారు తన సమీపమునకు రాలేదు. కావున వెంకు తన కాగితమును బాబాగారికి ఇవ్వలేక పోయాడు. రెండవ దినమూ అలాగే అయినది. మూడవరోజు బాబాగారు తన సమీపమునకు వచ్చినపుడు వెంకు తన కాగితమును చేతిలో పట్టుకొన్నాడు. ఆ కాగితమును గమనించిన బాబాగారు అందరి కాగితములను తీసుకొన్నట్లు వెంకు చేతిలోని కాగితమును కూడా తీసుకొన్నాడు. తర్వాత అదే దినము సాయంకాలము బాబాగారి వద్దనుండి వెంకూకు పిలుపువచ్చింది. ఆ పిలుపు ప్రకారము అక్కడి భక్తులు వెంకూను బాబాగారి మందిరములోనికి ఒంటరిగా పంపారు. బాబాగారు ఒక ఉన్నతాసనము మీద కూర్చొనివున్నారు. వెంకు బాబాగారికి నమస్కరించి నేను తాటిమాను మునెప్ప వద్దనుండి వచ్చానన్నాడు. అందుకు బాబా చిరునవ్వునవ్వి ఇలా అన్నాడు.)

**బాబా :-** వివరమంతా తెలిసింది. ఇప్పుడు మీరు ఏమి చేయదలచారు?

**వెంకు :-** మీరు ఎలా చెప్పితే అలా చేస్తామని మా నాయకుడు చెప్పాడు.

**బాబా :-** అయితే తప్పిపోయిన పామును వెదకండి. దానిని పట్టుకొని రండి. అలా చేయడము తప్ప వేరే మార్గము లేదు.

**వెంకు :-** అది ఎలా సాధ్యము స్వామీ! ఎక్కడుందని వెదకాలి, పోయిన పాము దొరకగలదా?

**బాబా :-** పాములు ఎప్పుడూ దూర ప్రయాణము చేయవు. నీటి వసతివున్న సమీపములోనే స్థావరమును ఏర్పరుచుకొంటాయి. కావున పాము పారి పోయిన చేరువలో నీటివసతులున్న చోట్ల వెదకండి. తప్పక దొరుకుతుంది.

ఎవరికీ ఏ అనుమానము రాకుండా అన్వేషణ చేయాలి. కొన్ని నెలలకైనా ఆ పామును పట్టుకొండి. మీరు అడుక్కొని తిను యాచకులవలె ఆ ప్రాంతములో గుడిసెలు వేసుకొని కొంతకాలము అక్కడేవుండి ప్రతి దినమూ కుందేళ్ళ వేటకని, ఎలుకల వేటకని, పక్షుల వేటకని సాకుతో బయలుదేరి ప్రతి దినమూ పాముకొరకు అన్వేషణ చేయండి. రంధ్రాలు కనిపిస్తే ఎలుకల కొరకన్నట్లు త్రవ్వి చూడండి. పొదలు కనిపిస్తే కుందేళ్ళకన్నట్లు వెదకండి. ముఖ్యముగా ఎవరికీ ఈ విషయము తెలియకుండా జాగ్రత్తగా వెదకండి. పాము కడుపు దగ్గర చర్మము క్రింద వజ్రాలున్న విషయము ఎవరికీ తెలియదు. కావున పామును మీరు బహిరంగముగా పట్టుకొనినా ఎవరు దానిని గురించి పట్టించుకోరు. మీరు తెలివిగా ఈ పనిని చేయాలి.

**వెంకు :-** స్వామీ! మావెంట పాములను పట్టువారిని పెట్టుకుంటాము.

**బాబా :-** అలా ఎవరినీ ఉంచుకోవద్దండి. ఈ పనిలో ఎటువంటి వారికి అవకాశమివ్వకూడదు. మీ గుంపులోనివారే ఈ పనిని చెయ్యండి.

**వెంకు :-** పాములు ప్రమాదకరమైనవి కదా! ఒకవేళ ఇంతకు ముందు నేను పాముకాటుకు గురియైనట్లు జరిగితే కష్టము కదా! దీనికి మీరే ఉపాయమును చెప్పాలి.

**బాబా :-** అలాంటిది జరిగితే దాని నివారణ కొరకు మీవద్ద తెల్లఈశ్వరి తీగయొక్క మూలికను ఉంచుకోండి. తెల్లఈశ్వరి పుల్ల గంధమునుగానీ, పొడినిగానీ కడుపులోనికి ఇస్తే పాముvిషము నివారింపబడును. ఒకవేళ విషము తలకెక్కి అపస్మారక స్థితిలోనున్న వానికి, తెల్లఈశ్వరి మూలిక యొక్క గంధమును కొద్దిగా కళ్ళలో పెడితే తలనుండి పాము విషము క్రిందికి దిగును. తర్వాత మూలికను కడుపులోనికి ఇవ్వవచ్చును. ఈ మూలిక ఉండుట వలన పాముకాటుకు భయము ఉండదు. ఇంతకంటే

ఎక్కువ ఏమీ చెప్పనవసరములేదు. నీవు ఎక్కువసేపు ఇక్కడ ఉండకూడదు. నీవు వెంటనే ఇక్కడినుండి వెళ్ళిపో...

(వెంకు వెంటనే అక్కడినుండి బయటికి వచ్చాడు. బయటనున్న భక్తులు కొందరు వెంకు దగ్గరకు వచ్చి నీకు బాబాగారి దర్శనము దొరికినది. అదృష్టవంతునివి. నీకు బాబాగారు ఏమని ఆశీర్వాదమిచ్చారు అని అడిగారు. వారి మాటలకు వెంకు తెలివిగ సమాధానమిస్తూ "నాకు చాలా కాలము నుండి కడుపునొప్పి ఉండేది. దానిని గురించి బాబాగారికి చెప్పుకోగా ఆయన నా కడుపు మీద చేయిపెట్టి తీశాడు. వెంటనే నొప్పి నయమై పోయింది" అని చెప్పి వెంకు వారినుండి బయటపడి తమ నాయకునివద్దకు బయలుదేరి పోయాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(విధివశాత్తు ఎప్పుడు ఏమి జరుగుతుందో ఎవరికీ తెలియదు. పనిమీద బయలుదేరిన ఆటవికులకు అన్నీ ఆటంకాలే ఎదురైనవి. అయినప్పటికీ వారు పట్టువీడని ధైర్యము కల్గియున్నారు. అటవీ అధికారులు చిన్న జీపులో వచ్చిన దానివలన ఎనిమిది మంది ఆటవికులను అందులో తీసుకపోవుట కష్టమని, వ్యాన్ కొరకు కేంద్రానికి జీప్‌ను పంపారు. అంతలో సాయంకాలమై చీకటి పడింది. రాత్రివేళ అయిన దానివలన ఆటవికులకు అక్కడే అన్నము పెట్టించి, అధికారులు వ్యాన్ కొరకు ఎదురుచూస్తున్నారు. చాలా రాత్రి గడిచింది. ఆటవికులను ఆధీనమందుంచుకొనిన ముగ్గురు అధికారులకు నిద్ర రాజొచ్చినది. వారు ఇద్దరు చూస్తున్నారులే అని ఆ ముగ్గురిలో ఒకడు కూర్చొని నిద్రపోయాడు. అట్లే అనుకొని ఇంకొకడూ నిద్రపోయాడు. బాగా మెలుకువగానున్న మూడవ అధికారి కూడా తూగుటకు మొదలు పెట్టాడు. అదే అదనుగా భావించిన ఆటవికులు

ఎనిమిది మంది, ఒకరికొకరు సైగ చేసుకొని చిన్నగా చీకటిలోనికి జారుకొన్నారు. కళ్ళు మూస్తూ తెరుస్తూ తూగుచున్న మూడవ అధికారి తేరుకొని చూచేలోగా ఆటవికులు కనిపించకుండా పోయారు. వెంటనే లేచిన ఆ అధికారి మిగత ఇద్దరిని లేపి ఆటవికుల కొరకు వెదకను ప్రారంభించారు. అది పల్లెటూరు అయిన దానివలన కరెంటులైట్లు కూడా లేవు. బాగా చీకటిగా ఉన్నదానివలన ఆటవికులను గుర్తించలేక పోయారు. అదే అదునుగా ఎనిమిదిమంది, ఆటవికులు ఊరి బయటకు పరుగిడివచ్చి అక్కడినుండి దారిని వదలి పొలాలమధ్యలో అడ్డముగా నడిచి పోయారు. అధికారులు ఏ దారివెంట పరుగిడి చూచినా ఫలితము లేకపోయింది. తెల్లవారే లోపల చాలా దూరము పోవాలనుకొన్న ఆటవికులు వేగముగా నడకను సాగించుచుండిరి. వారి నడకకు రైలుమార్గము అడ్డము రాగా దానిని దాటి అవతలి వైపుకు పోవుచుండిరి. అపుడు దూరముగా రైలు మార్గము వెంట ఎవరో వస్తున్నట్లు మసకగా కనిపించింది. వెంటనే రైలుమార్గము ప్రక్కనేవున్న చెట్ల పొదలమాటున నక్కి కూర్చొని వచ్చేవారు ఎవరని చూస్తుండిరి. అంతలో ఒకవైపునుండి రైలు వస్తుండుట వలన లైట్ ఫోకస్ వలన రైలుమార్గము పొడవునా కనిపించసాగింది. ఎవరో వస్తున్నట్లు అగుపించిన ఆకారము పూర్తిగా కనిపించింది. ఒక యువతి ఆందోళనగా అటువస్తున్నట్లు ఆటవికులు గమనించారు. ఆమె వెంటనే రైలుమార్గము మీదికి పోయి రైలు పట్టాలమీద పడుకొన్నది. ఆమె ఆత్మహత్య చేసుకొనే దానికి ఆ విధముగా రైలుపట్టాలమీద పడుకొన్నదని గ్రహించిన ఆటవికులు, పరుగున పోయి ఆమెను ప్రక్కకు లాగి తెచ్చారు. రైలు వెళ్ళిపోయింది. వెంటనే చీకటి ఆవహించింది. ఆమె చుట్టు చేరిన ఆటవికులు రోదిస్తున్న ఆమెను ఓదార్చుచూ ఇలా అన్నారు.)

**యోగా :-** ఎవరమ్మా నీవు? చూస్తే చిన్న వయస్సులాగుంది. నీవు ఎందుకు రైలుక్రింద పడబోయావు?

**యువతి :-** నన్ను ఎందుకు చావనివ్వలేదు. నేను చనిపోవాలి, నేను బ్రతుక కూడదు. (అన్నది ఏడుస్తూ)

**మేఘు :-** ఏదైనా కష్టమొస్తే ధైర్యముగా నిలువాలి. కానీ భయపడి చని పోకూడదు. అది పద్ధతి కాదు.

**యువతి :-** ధైర్యముగా నిలువడానికి, బ్రతకడానికి నాకు ఎవ్వరూ లేరు. నేను బ్రతకాలనుకొన్నా నన్ను ఎలాగైనా చంపుతారు.

**యోగా :-** నీకు ఏ కష్టమున్నదో మాకు తెలియదు. నీవు చనిపోకూడదని మేము కోరుచున్నాము. మేము అడవిలో నివసించు మనుషులము. నీకు ఈ సమాజములో ఉండుటకు కష్టమైతే, కల్లాకపటములేని మా గూడెము మనుషుల మధ్యలో ఏ చింతా లేకుండా ఉండవచ్చును. మేమిప్పుడు ఒక మనిషి కొరకు వెదకుచూ వచ్చాము. అతనిని తీసుకొని మా గూడెము నాయకుని వద్దకు పోవాలి. నీవుకూడా మా వెంటవుండు, నీకు ఏమీ భయములేనట్లే. నీకు మేము ఎనిమిది మంది అన్నగార్లు ఉన్నారనుకో.

**(**ఏ దిక్కూలేని ప్రాణాపాయస్థితిలోనున్న ఆమెకు ఆదరముగా మాట్లాడిన వారిమాటలు కొంత ఓదార్పునిచ్చాయి. అలాగేనని సమ్మతించి చీకటిలో వారివెంట నడిచింది.**)**

× × × × × × × × × × × × × × × × × × × × × ×

**(**తెల్లవారక ముందే లేచిన రాఘవ స్నానముచేసి, వంటకట్టెల కొరకు పోవు ఆశ్రమభక్తుల వెంట తానుకూడా పోయి తనవంతు సేవ చేయాలనుకొన్నాడు. అక్కడి వారు నీవువద్దులేనని చెప్పినా తాను కూడా

సేవ చేయవలెనని బయలుదేరి వారివెంట పోయెను. అది వానల కాలమైన దానివలన ఎండుకట్టెల కొరకు దూరముగా పోవలసివుంటుందని అనుకొంటూ రాఘవ మరియు అతని ఆశ్రమ స్నేహితులు పోవుచుండిరి. కొంతదూరము పోయిన తర్వాత ఆకాశములో మేఘములు కమ్ముకొన్నాయి. వర్షము వస్తే ఉండేదానికి ఏమీలేదే అని చూస్తుండగా కొద్ది దూరములో ఒక సత్రములాంటి పాతగుడి కనిపించింది. అంతలో వర్షము పడను మొదలుపెట్టింది. రాఘవతో సహా అందరూ ఆ సత్రమువద్దకు పోయి తడవకుండా నిలుచున్నారు. అక్కడికి సమీపములో నడకసాగించు ఆటవికులు కూడా కొద్దిగ తడిసినవారై, అక్కడ సత్రమును చూచి పరుగిడుచూ సత్రములోని వచ్చారు. అంతకు ముందే అక్కడికి వచ్చియున్న రాఘవను ఆటవికులు చూచారు. ఆటవికులను రాఘవ కూడా చూచాడు. అక్కడున్న రాఘవను చూచిన ఆటవికులు ఆశ్చర్యపోయారు. అప్పుడు వారికి వెతకబోయిన తీగ కాలికి తగిలినట్లయింది. రాఘవ కనిపించడము ఆటవికు లకు సంతోషమైనది. వారిని చూచిన రాఘవ కూడా సంతోషించాడు. విధి చేసిన ఆ వింత చాలా విచిత్రమనుకొన్నారు. వర్షము రాకపోతే తాము కలిసే వారమేకాదను కొన్నారు.)

**రాఘవ :-** మీరెలా ఇక్కడికి వచ్చారు.

**మేఘ :-** నీ కోసమే వెదుకుచూ వచ్చాము.

**రాఘవ :-** నా కొరకా!

**యోగ :-** అవును నీ కొరకే నాయకుడు పంపగా వచ్చాము.

**రాఘవ :-** నాయకుడు మల్లుదొర బాగున్నాడా?

**యోగ :-** అందరూ బాగున్నారు. (వారితో పాటు అక్కడికి వచ్చిన యువతిని చూచి రాఘవ ఇలా అన్నాడు.)

**రాఘవ :-** ఈమె ఎవరు?

**మేఘ :-** ఈమె విషయము పూర్తిగా మాకు కూడా తెలియదు. రాత్రి ఈమె ఆత్మహత్య చేసుకోబోయి మాకంటబడినది. మేము అడ్డుపడి అలా చేయడము మంచిదికాదని నచ్చచెప్పి మా వెంట తీసుకవచ్చాము. ఆమె విసిగిపోయిన మనస్సుతో ఉన్నది. అందువలన ఆమెను ఏమీ అడుగలేదు.

**రాఘవ :-** నేను మీతో ఏమీ చెప్పకుండా బయలుదేరి వచ్చాను. నేను అలా రావలసివచ్చినది. కొంతకాలము తర్వాత అక్కడికి వచ్చి విషయమంతా తెలియజేయాలనుకొన్నాను. అంతలోనే మీరే నా కొరకు వచ్చారు. నేనిప్పుడు ఇక్కడికి దగ్గరగా నివాసముంటున్న రాజయోగానంద స్వామి వద్దయున్నాను. అక్కడికిపోయి గురువుగారికి విషయము చెప్పి ఆయన అనుమతిని తీసుకొని గూడెమునకు పోదాము.

(అందరూ కలిసి ఆశ్రమమునకు బయలుదేరారు. మార్గములో యోగా, మేఘ తమకు కలిగిన ఆటంకములనన్నిటిని రాఘవకు వివరముగా చెప్పారు. తమాషాగా జరిగిన ఆ సంఘటనలకు అందరూ నవ్వుకొంటూ ఆశ్రమము చేరారు. రాఘవ ఆటవికులనందరిని రాజయోగానంద స్వామికి పరిచయము చేశాడు. వారు తనకొరకు వచ్చినట్లు తెలిపాడు. ఆటవికులందరి విషయము తెలుసుకొన్న స్వామి, వారివెంటవచ్చిన యువతి విషయమును అడిగాడు. ఆటవికులు ఆమెను గూర్చి తమకు తెలిసిన విషయమునంత తెలిపారు. అపుడు రాజయోగానందస్వామి ఆమెతో ఇలా మాట్లాడాడు.)

**రాజయోగా :-** నీ పేరు ఏమిటమ్మా?

**యువతి :-** నాపేరు రాధేశ్వరి. నా ఊరు స్థంబాపురము. నాకు ఇంకా వివాహము కూడా కాలేదు.

**రాజయోగా :-** నీవు చనిపోవాలనుకొన్నంత అవసరమేమివచ్చింది. నీకు నేను తండ్రిలాంటివాడిని. నాతో చెప్పుట వలన నీకు మంచియే జరుగుతుంది.

**రాధేశ్వరి :-** మాదొక పెద్ద జమిందారు కుటుంబము. ఆస్తిపాస్తులు చాలా ఉన్నాయి. ఒకరోజు మా కుటుంబము తీర్థయాత్రలకు పోయి రోడ్డు ప్రమాదములో అందరూ చనిపోయారు. ఆ రోజు నాకు ఆరోగ్యము బాగా లేనందున నేను పోలేదు. మా కుటుంబానికంతా మా తాతయ్య నేను మిగిలాము. మా తాతయ్యకు ఆరోగ్యము బాగాలేక ఈ మధ్యనే చనిపోయాడు. తాతయ్య చనిపోకముందు తనపేరుమీదనున్న ఆస్తినంతటినీ నాకు చెందేటట్లు వీలునామా వ్రాసి పోయారు. తాతయ్య చనిపోయినప్పటి నుండి నేను ఒంటరిదానినైపోయాను. ఆస్తి అంతా నా పేరు మీద ఉండుట వలన, మధ్య వయస్సుగల నా మేనమామకు దుర్బుద్ధి పుట్టింది. అతను అన్ని రకముల చెడిపోయిన వ్యక్తి. అన్ని వ్యసనములు ఆయనకు ఉన్నాయి. అతనికి భార్యకూడా లేదు. ఎవరూ అతనిని దగ్గరకు రానివ్వరు. అటువంటి వ్యక్తి నన్ను బలవంతముగా పెళ్ళి చేసుకోవాలని చూస్తున్నాడు. అలా చేసుకోవడము వలన ఆస్తిని పొందవచ్చునని అతని అభిప్రాయము. నేను ఏమాత్రము ఒప్పుకోలేదు. దానితో అతను నన్ను చంపుటకు పథకము వేశాడు. ఇప్పటికి మూడు నెలలనుండి నాలుగుసార్లు నన్ను చంపాలని చూచాడు. నాలుగుమార్లు అతని ప్రయత్నము విఫలమైనది. అతను నన్ను చంపుటకు కిరాయి హంతకులను ఏర్పాటు చేశాడు. నా మేనమామకు మద్దతుగా ఎప్పుడో మానాన్న వదలివేసిన సవతితల్లి కూడా తోడైనది. వారినుండి తప్పించుకొనుటకు నేను ఇల్లువదలి నెలరోజులనుండి బయటనే తప్పించుకొని తిరుగుచున్నాను. నావద్ద డబ్బు కూడాలేదు. ఎంతో ఆస్తి ఉండికూడా ఆకలితో బాధపడవలసివచ్చింది. చివరకు ఎటూ వారు నన్ను

చంపుతారు. వారు చంపేదానికంటే ముందే నేను చనిపోవాలనుకొన్నాను. ఆ ప్రయత్నములో కూడా విఫలమైపోయాను. చివరకు ఈ అన్నగారు ధైర్యము చెప్పి ఆదరణగా మాట్లాడి మీవద్దకు తెచ్చారు. ఇది నా జీవిత చరిత్ర. నేను బాగా చదువుకొన్న దానిని. నేను జమీందారు ఇంటిలో పుట్టినా నాలో మంచి భావములున్నాయి.

**రాజయోగా :-** భూమిమీద చావు బ్రతుకులు ఎవరి చేతిలో లేవు. అన్నీ కర్మచేతిలో ఉన్నాయి. కర్మ ప్రకారము ఏమి జరగవలెనో అదే జరుగుతుంది. భవిష్యత్తు అంధకారమయము. అది ఎవరికీ కనిపించదు, జరిగేకొద్దీ తెలుస్తూ పోతుంటుంది. నీవు చావాలనుకొన్నా చావలేక పోయావు కదా! ఇంకొకరు చంపాలనుకొన్నా చంపలేకపోయారు కదా! మన వెనుక మనకు తెలియకుండా కర్మ అనునది ఒకటున్నదని, అదియే అందరి జీవితములను నడుపుచున్నదని తెలియకపోవడము అజ్ఞానము. కర్మ విధానము తెలియని అజ్ఞానము వలన మనిషి తాను అనుకొన్నట్లు జరుగునని అనుకొనును. ప్రస్తుతము నీవు కూడా అలాగే అనుకున్నావు. మనిషి ఎలా అనుకొనినా అన్నీ కర్మప్రకారమే జరుగును. **కర్మప్రకారము జరగనివీ, మనము అనుకొన్నట్లు జరుగునవీ కూడా కలవు. అవి కర్మకు అతీతమైన జ్ఞాన విషయములు. ప్రపంచ విషయములన్నియూ కర్మ ఆధీనములో ఉండును. కనుక కర్మ ప్రకారము జరుగును. దైవమునకు సంబంధించిన జ్ఞాన విషయములు కర్మ ఆధీనములో ఉండవు. జ్ఞానవిషయములలో మాత్రము మనిషికి స్వతంత్రత కలదు. ఎందుకనగా అవి కర్మాధీనములో ఉండవు. వాటికి కర్మ అనునది ఉండదు.** అందువలన మనిషి శ్రద్ధను బట్టి జ్ఞానము

యొక్క పనులు జరుగును. కర్మ పనుల మీద మనిషి ఎంత శ్రద్ధ పెట్టినా జరగవచ్చు, జరగకపోవచ్చును. ఈ విషయమును తెలిసినవారు తమ ఆధీనములోలేని వాటిమీద శ్రద్ధ పెట్టక, తమ ఆధీనములోనున్న జ్ఞానము మీద శ్రద్ధ పెట్టి తెలుసుకొనెడివారు. వారు దైవజ్ఞానమును ఎంత సంపాదించుకోవాలనుకుంటే అంత సంపాదించుకొనెడి వారు. అందువలన భగవద్గీతలో కూడా భగవంతుడు "**శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్**" అన్నాడు.

ఇదంతా ఎందుకు చెప్పుచున్నానంటే చిన్న వయస్సులో దైవ జ్ఞానమును తెలుసుకొనుటకు మంచి అవకాశము గలదు. ఈ వయస్సులో నీవు ఎంత శ్రద్ధవహిస్తే అంతజ్ఞానమును తెలుసుకోగలవు. నీ చేతిలో లేని ప్రపంచ విషయములను వదలివేసి, జ్ఞానమును సంపాదించుకోవడము మంచిది. జ్ఞానము తెలియుట వలన ప్రపంచ సంబంధ విషయములు మనిషిని అంతగా బాధించలేవు. ఇప్పుడు నీకున్న మనోవ్యథకు జ్ఞానమే మందు అనుకో. జ్ఞానము వలన మనో ఉల్లాసము కల్గి ప్రపంచ చింతలు సమసిపోతాయి. వాటిని అనుభవించు శాతము తగ్గిపోతుంది. అలా జ్ఞానము తెలుసుకొనుటకు మేము అన్ని విధముల సహకారమును అందిస్తాము.

**రాధేశ్వరి :–** మీరు చెప్పినది నాకు బాగా అర్థమైనది. ప్రపంచ విషయములు మన చేతిలో లేవు అనుటకు, నా జీవితములో నా ఇష్టములేకుండా జరిగిన సంఘటనలే నిదర్శనము. అన్నీవున్నా అందరిని పోగొట్టుకోవడము నేను అనుకొన్నట్లు జరుగలేదు. ఇప్పుడు అన్నీ ఉన్నా కొన్ని పూటలు తిండికూడా లేకుండా పోవడమును నేను కోరుకోకనే జరిగినవి. ఇట్లు లెక్కించి చూచితే మీరు చెప్పినట్లు నా జీవితము నా చేతిలో లేదని బాగా అర్థమగుచున్నది.

నా ఇష్టము ప్రకారము జరుగని ప్రపంచ విషయముల శ్రద్ధను వదలివేసి మీరు చెప్పిన ప్రకారము జ్ఞానము మీద శ్రద్ధను పెంచుకొంటాను. మీలాంటి ఉన్నతమైన వ్యక్తులవద్దకు నేను చేరినందుకు నాకు చాలా సంతోషము కల్గుచున్నది. నాకు నా ఆస్తిపాస్తులు ఏమీ వద్దు మీవద్ద నాకు జ్ఞానము లభిస్తే అదే నాకు పెద్ద ఆస్తి అగును.

× × × × × × × × × × × × × × × × × × × × ×

(తపస్వి బాబావద్దనుండి బయలుదేరిన వెంకు తమ నాయకుడైన మునెప్ప దగ్గరకు పోయి బాబాగారు పాము కోసము వెదకమన్న విషయమును చెప్పాడు. బాబాగారు చెప్పినట్లు చేయుట మంచిదని తలచిన తాటిమాను మునెప్ప తన మనుషులను పిలిచి బాబాగారు చెప్పిన విషయమంతయూ వారికి చెప్పాడు. ఎవరికీ అనుమానము రాకుండా మారువేషములు ధరించి వజ్రములున్న పాము కొరకు వెదకమని చెప్పాడు. విషయమంతా తెలుసు కొన్న మునెప్ప ముఠా మనుషులు రెండు గుంపులుగా తయారై పామువేటకు బయలుదేరిపోయారు. మొదట గుంపు పాము తప్పించుకొన్న ప్రాంతము నుండి ఒకవైపుకూ, రెండవగుంపు మరియొక వైపుకూ వెతకవలెనని నిర్ణయించుకొన్నారు. ఒక గుంపుకు వెంకు నాయకుడుకాగా, మరియొక గుంపుకు నూకా నాయకుడుగా ఉ న్నారు. వారివద్ద కుక్కలను కూడా పాము అన్వేషణ కొరకు పెట్టుకొన్నారు. ఎవరికీ అనుమానమురానట్లు ప్రతి దినము కుందేళ్ళ వేటకని బయలుదేరిపోయి పామును వెదకుచుండిరి. సాయంత్రము వరకు పాముల వేట సాగించుచుండిరి. వారికి చిన్నపాములు కనిపిస్తే వాటి జోలికి పోకుండా కేవలము పారిపోయిన పాము పొడవున్న వాటినే పట్టుకొనుచుండిరి. వారి అన్వేషణ కేవలము నాగుపాములు, కావున వేరే

జాతిపాములను చూచినా వాటిజోలికి పోకుండా, తమకు కావలసిన పాము కొరకే వెదకుచుండిరి. పాములను సులభముగా పట్టుటకు ఒక అంగుళము పొడవు, ఒక అంగుళము వెడల్పు పంగ (చీలిక) గల ఒక కట్టెను తయారు చేసుకొన్నారు. బారెడు పొడవున్న కఱ్ఱకు ఒక కొన పంగచీలివుండుట వలన ఎక్కడైనా నాగుపాము కనిపిస్తే దాని తలవద్ద చీలికగల కఱ్ఱతో అదిమి పట్టెడివారు. అలా భూమికేసి అదిమిపట్టి కదలకుండా చేసి ఒక జానెడు (9 అంగుళములు) పొడవున్న దబ్బలమును (ఇనుప కడ్డీని) పాము తలమీద పెట్టి దాదాపు మూడు అంగుళములు భూమిలోనికి దిగునట్లు కొట్టుచుండిరి. అలా కొట్టుట వలన పాము పై పెదవి క్రింది పెదవులతో దబ్బలము దిగి పాము నోరు తెరచుటకు వీలులేకుండా పోవును. అలా దబ్బలమును కొట్టిన తర్వాత అదిమిపట్టిన పంగకఱ్ఱను తీసివేసి దబ్బలమును పైకి లాగితే భూమినుండి దబ్బలము వచ్చును. కానీ పాము తలలో దబ్బలము దిగివుండుట వలన దబ్బలమునకు తల అంటుకొని పాము నోరు తెరువకుండా ఉండును. అప్పుడు నిర్భయముగా ఎవరైనా పామును పట్టుకొనుటకు వీలుండును. అలా పట్టుకొన్న పాములను సాయంకాలము తమ గుడిసెలకు తెచ్చి వాటి కడుపును చించి చూచుచుండిరి. కడుపుకింద చర్మమును చీల్చి చూచిన తర్వాత వాటి కడుపులో వజ్రములు లేకపోతే ఆ పాములను చంపివేసెడి వారు. ఇట్లు వారి అన్వేషణలో ఎన్నో పాములు బలియైపోయాయి.

అలా వారి పాముల వేట సాగుచుండెను. పదిరోజులైనా తప్పించు కొన్న పాము కనిపించలేదు. ఒక దినము వెంకు నాయకత్వములోని గుంపు అన్వేషిస్తూ ఒక పొదను కట్టెతో కదిలించి చూచారు. ఆ పొదనుండి ఒక నాగుపాము బయటికి వచ్చినది. ఆ పొదకు 20 అడుగుల దూరములో మరియొక పొదవుండెను. మొదట పొదనుండి వచ్చిన పామును పట్టాలని

అందరూ దానిచుట్టూ చేరారు. అంతలోనే రెండవ పొదనుండి మరియొక నాగుపాము బయటికి వచ్చినది. ఒకేమారు అలా రెండు పాములు రావడము అదే మొదటిసారి జరిగినది. ఆ రెండు పొదలనుండి వచ్చిన రెండు పాములు ఒకే చోటికి చేరి, రెండు పాములు పడగలు విప్పి నిలబడ్డాయి. ఆపదను గ్రహించి ఆ పాములు రెండు ధైర్యముగా ఎదురుదాడి చేయడానికి నిలబడడమును చూచిన వెంకు మనుషులు ముందుకు పోలేక పోయారు. ఆ రెండు పాములు త్రప్పిపోయిన పాము సైజువుండుట వలనా, వాటి కడుపులు కొద్దిగ లావుగా ఉండుట వలనా, అందులో తమవద్దనుండి పోయిన పాము తప్పక ఉంటుందని వెంకు అనుకొన్నాడు. అలా వాటిమీద అనుమానము రావడము వలన వాటిని ఎలాగైనా పట్టుకోవలెనని ముందుకు పోయారు. వారిలో ఒకడు పంగలకట్టెతో వాటి తలను అదిమి పట్టాలని చూచాడు. అంతలో మగపాము (కోడెనాగు) బుసకొట్టి విషమును ముందుకు పోయిన వ్యక్తి మీదపడునట్లు చేసింది. పాము బుసకొట్టినపుడు చిమ్మిన విషము ముందుకు పోయిన వాని కళ్ళలో పడినది. కళ్ళలో పడిన విష ప్రభావము వలన కళ్ళు మంటవేసాయి. అలా కోడెనాగు విషమును జిమ్మడముతో ముందుకు పోయినవారు కొద్దిగ వెనక్కి తగ్గారు. అప్పుడు త్రాచుపాము (ఆడపాము) తప్పించుకొని ప్రక్క పొదలోనికి పోయినది. అప్పుడు మగపాము ఒంటరిదై పోవడము వలన దానిమీద అందరూ కలిసి దాడిచేసి దానిని చంపారు. దానిలో కూడా వజ్రములు లేవని తెలిసిపోయింది. ఈ మారు వారి చూపంతా పొదలోనికి పారిపోయిన పాము మీదనేవుంది. ఆ పొదచుట్టు గుమికూడి పామును వెదకను ఆరంభించారు. అంతలో ఆ పాము కూడా బయటికివచ్చింది. దానిని కూడా అందరూ కలిసి చంపడము జరిగింది. తర్వాత ఎంతో ఆశగా దాని కడుపును కూడా చూచారు. కానీ దానిలో కూడా వజ్రములు దొరకలేదు.

సాయంకాలానికి కళ్ళలో విషము పడిన వ్యక్తికి పూర్తిగా చూపు పోయింది. అలా కంటి చూపుపోవడము వలన అందరూ భయపడి పోయారు. ఇక పాముల జోలికి పోకూడదని నిర్ణయించుకొని, తిరుగు ముఖముపట్టి తమ నాయకుని వద్దకు పోయి జరిగిన విషయమును తెలిపి తమ భయమును వ్యక్తము చేశారు. వారి మాటలను విన్న మునెప్ప ఇప్పటికి ఇలా వెదికే పనిని ఆపి వేరే ఉపాయమును ఆలోచిస్తానని చెప్పాడు. ఆ పామును ఎలా పట్టాలో అది ఎక్కడుందో అర్థము కాని విషయమును మునెప్ప తానే స్వయముగా తపస్వి బాబా దగ్గరకు పోయి అడిగి రావాలనుకొన్నాడు. మునెప్ప అనుకొన్నట్లు, తపస్విబాబా దగ్గరకు పోయి పాము ఎక్కడుందో తెలియనిది దానిని పట్టుకొనుట సాధ్యముకాదనీ, అనుమానముతో ఇప్పటికే చాలా పాములను చంపి చూశామని అలా మిగతా పాములను చూడడములో అపాయము కల్గుచున్నదనీ, తమ మనిషికి ఒకనికి విషము కళ్ళలో పడి కళ్ళు పోయి గ్రుడ్డివాడైనాడనీ, త్రప్పిపోయిన పాము ఎక్కడుందో తెలిస్తే పట్టవచ్చునని దానిని కనుగొనుటకు మీరే ఉపాయమును చెప్పమని కోరాడు. అతని మాటలను విన్న బాబాగారు యోచించి ఇలా అన్నాడు.)

**బాబా :-** సరే, నీవు మూడురోజులు ఇక్కడే ఉండు. మూడురోజుల తర్వాత నేనొక పరికరమును తెప్పించి నీకిస్తాను. అది చిన్న బ్యాటరీ సెల్సుతో పనిచేయు ఒక చిన్న సెన్సార్ యంత్రము. ఆ యంత్రము పది గజముల దూరములోనున్న వజ్రాలను గుర్తించును. అందువలన అ చిన్న యంత్రముతో వజ్రములున్న పామును గుర్తించవచ్చును. అది వజ్రముల సెన్సార్ యంత్రమగుట వలన, వజ్రముల పాము మీకు ముప్పయి (30) అడుగుల దూరములో ఉన్నపుడు, ఈ యంత్రములో ముల్లు కదిలి "గీ" అను శబ్దము వచ్చును. పాముకు దగ్గరగా పోవుకొలది యంత్రము యొక్క

శబ్దము ఎక్కువగును. అందువలన పామును సులభముగా గుర్తుపట్ట వచ్చును. ఈ యంత్ర సహాయముతో మీరు పామునుపట్టుకొని వజ్రాలను తెచ్చి ఇవ్వండి. (అని చెప్పి మారువేషములోనున్న మునెప్పను బయటికి పంపివేసెను.)

× × × × × × × × × × × × × × × × × × × × × × ×

**రాజయోగా :-** నీది చిన్నవయస్సయినా ప్రపంచ ధనముకంటే జ్ఞానధనమునే గొప్పగా గుర్తించావు. దానికి మాకు సంతోషము. ప్రపంచరీత్యా చేయు పనులను కూడా మేము జ్ఞానమును అనుసరించే చేస్తాము. ప్రపంచ కార్యములన్నీ కర్మవలననే జరిగినా తిరిగి కర్మ అంటని విధముగా కర్మయోగ పద్ధతి ప్రకారము చేస్తుంటాము. నీ తండ్రీ తాతల ఆస్థులు కూడా నీకు తప్పక లభిస్తాయి. అవి లభించుటకు నీకు మేము పూర్తిగా సహకరిస్తాము.

**రాధేశ్వరి :-** నా మేనమామ తాగుబోతు, తిరుగుబోతు. అతనికి కిరాయి హంతకులతో సంబంధాలున్నాయి. నేను మీవద్ద ఉన్నానని అతనికి తెలిస్తే నా వలన మీకు ఏదైనా ఇబ్బంది కలుగుతుందేమోనని నాకు భయముగా ఉన్నది. మీరు ఆశ్రమవాసులు, సౌమ్యముగా ఉండువారు అతను ఒక రౌడి. అతను దేనికైనా తెగిస్తాడు. అందువలననే నేను చనిపోవాలనుకొని వుంటిని. నా వలన ఈ ఆశ్రమమువారికి గానీ, జ్ఞానమునకుగానీ ఇబ్బందులు వస్తే నేను మీకు కూడా కష్టాలు తెచ్చి పెట్టినదానినవుతాను.

**రాజయోగా :-** లేదు, నీవు చావకూడదు. నీకు రక్షణ ఇవ్వడములో మాకు ఏ కష్టమొచ్చినా ఎదుర్కోగలము. అసహాయస్థితిలో మరణమే శరణ్యమను స్థితి కల్గిన సాటి వ్యక్తికి సహాయము చేయలేనంత దౌర్భాగ్యస్థితిలో మేము లేము. నీకు తప్పక మా సహాయముంటుంది.

(స్వామి మాట్లాడిన మాటలు విన్న రాఘవకు తన శరీరములో క్రొత్త ఉత్తేజము వచ్చి ఈ విధముగా అనుకొన్నాడు. "పురుషుడైన తనకే సమాజములో విసుగొచ్చి అడవికి పోయినట్లు, స్త్రీ అయిన రాధేశ్వరి కూడా సమాజములోని రాక్షసత్వమునకు, కౄరత్వమునకు విసిగి శరీరమునే వదలి పోవాలనుకొన్నది. ఈ రోజు ఆమె మరణాన్ని కోరడమూ, ఆ రోజు నేను అరణ్యవాసమును కోరడమూ మాలో ధైర్యము లేకనేనని అర్థమగుచున్నది. మాలాంటి అధైర్యము కలవారిని ఈ లోకము తరుముతూనే ఉంటుంది. సమాజమునకు బెదిరిపోవడము మంచిదికాదు. ఈ దుష్టసమాజమునకు భయపడకుండా ఎదిరించి నిలబడడములోనే గొప్పతనమున్నదని రాజయోగానందస్వామి గారి మాటలలో అర్థమగు చున్నది. అంతటి స్వామియే ఆపదలోనున్న వారిని ఆదరించుటకు ఎంతటి కష్టమొచ్చినా ఎదుర్కోగలమని అంటుంటే, నాలో నిద్రాణమైవున్న ధైర్యము పొంగి బయటికి వచ్చింది. ఇప్పటినుండి నేను పాత రాఘవను కాను, క్రొత్త రాఘవగా ఉంటాను. ఎవరికి ఎలాంటి బుద్ధి చెప్పాలో అలాగే చెప్పుతాను. అయినా నేను అనుకొను పద్ధతి జ్ఞానమార్గమునకు ఆటంకమేమో! ఎందుకైనా మంచిది స్వామి గారిని అడిగి తెలుసుకొందాము" అని అనుకొన్నాడు.)

**రాఘువ :-** స్వామీ! మీరు మాట్లాడిన మాటలు నాకు క్రొత్త ఉత్తేజమును ఇచ్చాయి. అయితే ఈ సమాజములో నరరూప రాక్షసులను అణచి వేయడానికి కొంత హింసా మార్గములో పోవలసివస్తుందేమో! అందువలన జ్ఞానమార్గమునుండి త్రప్పి పోతానేమోనను అనుమానము వస్తున్నది. అట్లని పూర్తిగా హింసా మార్గమును వదలి అహింసామార్గములో పోతే, గాలిలోని పక్షులూ, భూమిమీదున్న చీమలు కూడా బెదిరించేటట్లున్నాయి. హింస లేకపోతే మనుగడయే సాగదేమోననిపిస్తున్నది. హింస పాపమంటారు కొందరు, హింసలేనిదే మనలను మనము కూడా రక్షించుకోలేము. పూర్తిగా

హింసను విడనాడి భూమిమీద బ్రతుకగలమా? కొందరు ప్రేమ వలన దేనినైనా సాధించవచ్చునన్నారే అది నిజమా? మనము ప్రేమించినా దానిని అర్థము చేసుకోలేని వారున్నపుడు వారి లెక్కలో అది ప్రేమే కాదు కదా! మీరే చెప్పండి స్వామీ! నాకు కల్గిన జీవిత అనుభవాల వలన నేను హింసా మార్గమును అనుసరించాలో లేక హింస పాపమని అహింసామార్గమున పోవాలా? చెప్పండి.

(రాఘవ మెదడులో బుద్ధియొక్క యోచన మధ్య జరుగుచున్న ఘర్షణను గ్రహించిన రాజయోగానందస్వామి ఇలా అన్నాడు.)

**రాజయోగా :-** ఒకనాడు ఇదే విధముగా అర్జునుడు కృష్ణున్ని ప్రశ్నించాడు. ఆనాడు కృష్ణుడు హింసతో కూడుకొన్న యుద్ధమే చేయమన్నాడు. అయితే జ్ఞానమును తలయందుంచుకొని కర్మయోగపద్ధతిలో చేయమన్నాడు. జ్ఞానము లేకుండా అజ్ఞానములో యోగపద్ధతి కాకుండా చేయమని చెప్పలేదు. **నీవు ఏమి చేస్తున్నావనునది ముఖ్యము కాదు, ఎట్లు చేస్తున్నావనునది ముఖ్యము.** ఈ ప్రపంచములో సమయానికి సరిపోవు గుణములు వాడుకొని పని చేసినా ఫరవాలేదు. అయితే అది జ్ఞానయుక్తముగా ఉండవలెను. ప్రపంచములో పూర్తి ప్రేమభావమును చూపిన మహాత్ములను కూడా ఈ మనుషులు హింసించి ప్రాణములను కూడా తీశారు. ఎందరినో స్వస్థపరిచి, కుష్ఠ రోగులను కౌగిలించుకొన్న కరుణామయుడు అని పేరుగాంచిన ఏసును ఆనాటి అజ్ఞాన మనుషులు కుట్రపన్ని కాళ్ళు చేతులకు ములుకులు కొట్టి హింసించి చంపారు. అహింసే పరమధర్మమని చాటి చెప్పిన గాంధీని నిర్ధాక్షిణ్యముగా తుపాకీ గుళ్ళకు బలిచేశారు. అందువలన ఈ లోకములో బ్రతకాలంటే పూర్తి అహింసను అనుసరించి బ్రతకలేము. తన్ను తాను రక్షించుకొనుటకైనా హింసను చేయవలసివస్తుంది.

**రాఘువ :-** బ్రతకాలంటే సమయానుకూలముగా హింసకూడా అవసరమే అనుమాట అర్థమైనది. కానీ జ్ఞానముతో చేయాలి అన్నారు. కర్మయోగ పద్ధతి ప్రకారము చేయాలి అన్నారు. యోగపద్ధతిని అనుసరించి చేయడమను నది నాకు అర్థముకాలేదు.

**రాజయోగా :-** ఎవడో తింటే నేను తిన్నానని అనుకోవు కదా! అట్లే ఎవడో నిద్రిస్తే నేను నిద్రించానని అనుకోవు కదా! ఒకవేళ వేరేవాడు చేసిన పనిని నేను చేశాను అనుకోవడము తెలివితక్కువ పనియే అగును కదా! ఇపుడు మనుషులందరూ తెలివి తక్కువగానే ప్రవర్తించుచున్నారు. ఎలా అనగా శరీరములో జీవుడు నివసిస్తున్నాడు. శరీరము మొత్తము 24 భాగములుగా ఉన్నది. జీవుడు 25వ వానిగా ఉన్నాడు. శరీరములో ఒక్కొక్క భాగము ఒక్కొక్క పనిని చేయుచున్నవి. జీవుడు శరీరములో కష్టసుఖములను అనుభవించు పనిని మాత్రము చేయుచున్నాడు. బుద్ధి వేరు, జీవుడు వేరు భాగములుగా ఉన్నారు. బుద్ధి యోచించు పనిని చేస్తుంది. అయితే జీవుడు నేనే యోచించాను అనడము తప్పు. జీవుడు తాను యోచించకున్నా బుద్ధి చేసిన పనిని తానే చేసినట్లు చెప్పుకోవడము అజ్ఞానమే అవుతుంది. అజ్ఞాన ములోనున్న జీవులందరూ శరీరములో తాము చేయని పనులన్నిటిని మేమే చేశాము అంటున్నారు. హింసాకార్యములను శరీరములోని భాగములు చేస్తే, యోగముతో కూడుకొన్న జీవుడు నేను చేయలేదు అనుకొంటున్నాడు. జ్ఞానములేని జీవుడు నేనే చేశాను అంటున్నాడు. ఇప్పుడు అర్థమైందా?

**రాఘువ :-** బాగా అర్థమయ్యేటట్లు చెప్పారు. ఒకరు చేస్తే దానిని మరొకరు చేశాననడము తప్పే. జీవుడు ఆ తప్పును తెలియక చేస్తున్నాడు కదా! తెలిసి చేస్తే తప్పు అనవచ్చును. తెలియక చేస్తే పొరపాటు అనవచ్చును. ఇక్కడ తప్పుకు పొరపాటుకు తేడావున్నది కదా!

**రాజయోగా :-** తప్పునూ, పొరపాటునూ వేరువేరుగా చూడాలని నీవు అంటున్నావు. తెలిసి చేసినా, తెలియక చేసినా తప్పు తప్పే అగును. పొరపాటుగా లెక్కించబడదు అని నేను అంటున్నాను. ఉదాహరణకు అగ్నిని తెలిసి ముట్టుకొన్నా కాలుతుంది, తెలియక పొరపాటుగా ముట్టుకొన్నా కాలుతుంది.

**రాఘవ :-** అగ్గి కాలేదానికి, తప్పు పొరపాటు అను బేధము లేదని తెలుస్తూ వుంది. అయినా దేవుడు కూడా తప్పునూ పొరపాటునూ ఒకటిగా లెక్కించు కోవడము న్యాయము కాదు కదా! అన్యాయమే అగును కదా!

**రాజయోగా :-** నీవు బాగా గుర్తుంచుకోవలసిన విషయము ఏమనగా! దేవుని చట్టములో న్యాయఅన్యాయములు లేవు. వాటి స్థానములో ధర్మమూ, అధర్మము మాత్రమే ఉన్నాయి. నీతీ, న్యాయములు లోకసంబంధమూ, జ్ఞానమూ, ధర్మములు దైవసంబంధము. దేవుడు నిర్మించిన శరీరములో ఉండి దేవుని చట్టమును (ధర్మములను) తెలుసుకోకుండా నాది పొరపాటు అంటే ఎలా? ముఖ్యముగా ఈ పొరపాటు పనుల వలననే మనిషికి పాప పుణ్యములు తగులుకొనుచున్నవి. ఈ విషయము నాకు తెలియదు అని ఎవరూ అనకుండా దేవుని చట్టము గ్రంథరూపములో, మన మధ్యలో భగవద్గీత రూపములో ఉన్నప్పటికీ, దానిని చూచేదానికి నాకు ఓపిక లేదు, నాకు తీరికలేదు, నాకు ఇష్టములేదు అని అంటూ అన్నీ తప్పులు చేస్తూ తెలియని పొరపాట్లు అంటే ఎలా? ఒకదానినైతే పొరపాటు అనవచ్చును. నూటికి నూరు తప్పులు చేసి పొరపాట్లు అంటే ఎలా? అట్లు ఎవరూ అనకుండా ఉండేదానికే మనిషి పుట్టుకముందే, దేవుడు తన జ్ఞానాన్ని భూమిమీద ఉంచాడు. మనిషి చేయు తప్పులనూ, ఒప్పులనూ తెలియ జేయు నిమిత్తము దేవుడు సృష్టి ఆదిలోనే తన ధర్మములను సూర్యుని

ద్వారా భూమిమీదికి పంపాడు. దేవుడు అంత జాగ్రత్తగా మనము పుట్టకముందే పని కల్పించుకొని మన కొరకు జ్ఞానాన్ని చెప్పితే, మనము పుట్టిన తర్వాత దేవుని జ్ఞానానికి విలువనివ్వకపోతే, మనము దేవునికే విలువనివ్వని వారమగుచున్నాము.

**రాఘవ :-** భూమిమీద కొందరికి దేవుని ధర్మములు ఇలా ఉన్నవని కూడా తెలియదు కదా! వారికి ఈ విషయమెలా తెలుస్తుంది?

**రాజయోగా :-** భూమిమీద ప్రభుత్వ చట్టమున్నట్లే, దేవుని చట్టము కూడా కలదు. ప్రభుత్వ చట్టము ప్రకారము కూడా ఒక మనిషి తాను చేయని హత్యను చేశాను అంటే 302 సెక్షన్ ప్రకారము వానికి హత్యానేరపు శిక్షను ఖరారు చేస్తారు. జడ్జికి ఆ వ్యక్తి హత్య చేయలేదని ముందే తెలిసినా, కోర్టులో అతను నేనే చేశానని చెప్పడము వలన, వానినే శిక్షించాల్సిన పని ఏర్పడినది. అలాగే ఒక మనిషి తాను చేయని పనిని చేశాననడము వలన, దేవుని చట్టములోని సెక్షన్ 369 ప్రకారము శిక్షపడును. **ప్రపంచ ప్రభుత్వము యొక్క చట్టములో సెక్షన్‌లు ఎన్నో ఉండగా, దేవుని చట్టములోని సెక్షన్‌లు మూడే మూడు కలవు. ఒకటి 369, రెండవది 666, మూడవది 963. వీటిని తెలియాలి అంటే త్రైత సిద్ధాంత భగవద్గీతను చదువవలసిందే.** ఇప్పుడు దేవుని చట్టములోని సెక్షన్‌లను గురించి చెప్పలేను. ముందు చట్టము తెలుసుకొంటే తర్వాత సెక్షన్లు తెలుస్తాయి.

**(**అక్కడే వింటున్న రాధేశ్వరికి స్వామివారు చెప్పిన జ్ఞానము బాగా అర్థమైనది. కానీ అక్కడేనున్న ఆటవికులకు ఏమాత్రము అర్థము కాలేదు. తర్వాత ఆటవికులు వచ్చిన విషయమును తెలుసుకొన్న రాజయోగానంద స్వామివారు రాఘవను వారి వెంటపోయి రమ్మన్నాడు. స్వామి ఆజ్ఞ ప్రకారము రాఘవ ఆటవికుల వెంట బయలుదేరి అడవికి పోయాడు.**)**

× × × × × × × × × × × × × × × × × × × × × × ×

(తపస్వి బాబావద్ద మూడు రోజులు కాచుకొనివున్న మునెప్పకు నాల్గవరోజు బాబాగారి కలయిక దొరికింది. బాబాగారు ఇచ్చిన సెల్‌ఫోన్ లాంటి చిన్న మిషన్ తీసుకొని బనియన్ జేబులో పెట్టుకొని బయటికి వచ్చాడు. అలా బయటికి వచ్చిన మునెప్పకు తాను ఊహించని రీతిలో పోలీసులు కనిపించారు. పోలీసులు వలపన్ని మునెప్ప కోసమే కాచుకొని ఉన్నారు. అది గ్రహించిన మునెప్ప తప్పించుకోవాలనుకొన్నాడు, కానీ సాధ్యపడలేదు. దిక్కుతోచని స్థితిలో మునెప్ప తన రివాల్వర్‌ను బయటికి తీసి పోలీస్ ఇన్‌స్పెక్టర్ కాలికి గురిపెట్టి కాల్చి, వెనుతిరిగి బాబాగారి మందిరములోనికే పారిపోయాడు. రివాల్వర్ ప్రేలిన శబ్దమును విన్న తపస్వి బాబాగారు ఏమి జరిగిందోనను గాబరాతో బయటికి వచ్చాడు. బాబాగారి మందిరాన్ని పోలీసులు చుట్టుముట్టి మునెప్ప పారిపోకుండా జాగ్రత్తపడ్డారు. అంతలో అక్కడ భక్తులంతా గుమికూడారు. పోలీసులు బాబాగారి మందిరములో ఒక్కొక్క గదిని జాగ్రత్తగా వెదకను ఆరంభించారు. తపస్వి బాబాగారి మందిర రహస్యమంతయూ మునెప్పకు బాగా తెలుసు. మునెప్ప తప్పించుకొనుటకు బాబాగారి మందిరములో అన్ని అనుకూలములు ఉన్నాయి. అందువలన మునెప్ప దొరకడని బాబాగారికి తెలుసు. పోలీసులు మాత్రము మందిరమును చుట్టుముట్టి కాపలావుంటూ, కొందరు మందిర మంతయూ జాగ్రత్తగా పరిశీలించుచున్నారు. విశాలమైన రాజభవనము లాగవున్న బాబాగారి మందిరమంతయూ వెదికారు. కానీ మునెప్ప కనిపించ లేదు. బాబాగారి మందిరము మధ్యలో కొంత మైదానమందు అందమైన చెట్లతో నిండిన వనమున్నది. దానిమధ్యలో చిన్నబావి కూడా ఉన్నది. చుట్టూ మందిరముండగా, మందిరములోలేని మునెప్ప మందిరము మధ్యలో నున్న ఉద్యానవనములో దాగివుంటాడని పోలీసులు నిశ్చయించుకొన్నారు.

మునెప్పను లొంగిపొమ్మని మైక్ ద్వారా చెప్పారు. పది నిమిషములలో లొంగిపోకపోతే వెదికి కాల్చివేస్తామని కూడా చెప్పారు. అయినప్పటికీ మునెప్ప బయటికి రాలేదు. లాభము లేదనుకొన్న యస్.పి గారు అదనపు బలగాలను నియమించి వెదకనారంభించారు. ఒక గజము జాగా కూడా వదలకుండా వెదకినప్పటికీ పోలీసులకు మునెప్ప కనిపించకుండా పోవడము వారికి ఆశ్చర్యమైనది. చివరకు మిగిలింది, వనము మధ్యలో గల బావి మాత్రమే. ఆ బావిలోనికి తొంగిచూచారు. కొంత లోతులో నిశ్చలముగా కదిలిక లేకుండా నిలచిన నీరూ, అందులో పై నుండి తొంగి చూచువారి ప్రతిబింబము కనిపిస్తున్నది. చెట్లకు నీటి సరఫరా కొరకు అమర్చిన మోటరూ, దాని పైపులూ నీటిలోనికి ఉన్నవి. అంతేతప్ప అక్కడ ఏమీ కనిపించలేదు. పోలీసులు ఎంత యోచించిన మునెప్ప ఎక్కడ తప్పించు కొన్నాడను విషయము ఏమాత్రమూ అర్థము కాలేదు. అప్పుడు యస్.పి గారు బాబాగారివద్దకు వచ్చి ఇలా అన్నాడు.)

**యస్.పి :-** స్వామిగారూ! మునెప్ప మీ మందిరములోనికి పోయి కనిపించ లేదు. మీరేమైనా చెప్పగలరా?

**బాబా :-** నాకు కూడా ఆశ్చర్యముగానే ఉన్నది. అతను ఇక్కడే ఎక్కడైనా దాగి ఉంటాడు. మరియొకమారు బాగా వెతకండి.

**యస్.పి :-** మీరు ఏమీ అనుకోకపోతే మిమ్ములను ఒకమాట అడుగుతాను.

**బాబా :-** అందులో తప్పేమున్నది. మీకు అన్ని విధముల సహకరించుటే మా పని. మీకు ఏమికావాలో అడగండి.

**యస్.పి :-** ఇపుడు పారిపోయిన మనిషి ఒక దొంగల ముఠాకు నాయకుడు. ఎన్నో నేరాలు అతని మీద ఉన్నాయి. అతను ఎందుకు మీ మందిరానికి వచ్చాడు.

(బాబాగారు చిరునవ్వు నవ్వి యస్.పి.గారివైపు చూచి ఇలా అన్నాడు.)

**బాబా :-** సమాజములో అన్నిరకముల మనుషులు నావద్దకు వస్తుంటారు. వారందరూ నా మీద భక్తి (విశ్వాసము) మీదనే వస్తారు. వారియందు నా ఎడల భక్తినే నేను చూస్తున్నాను. కానీ వారు ఎటువంటివారని నేనెప్పుడూ చూడలేదు. అందరిలాగా అతను కూడ నా దర్శనమును కోరాడు. అదృష్ట వశాత్తు నా పిలుపు ఆయనకు అందింది. అతని సమస్యలు చెప్పుకొనే దానికి వచ్చాడు.

**యస్.పి :-** అందరిలాగ అంటే ఎలాగ?

**బాబా :-** మేము బయటికి అందరి దర్శనార్థము వచ్చినపుడు చాలామంది వారివారి సమస్యలను పేపరు మీద వ్రాసుకొని నాకు అందిస్తుంటారు. దగ్గరున్న వారివీ, చేతికందిన వారివి మాత్రమే నేను తీసుకొని నా మందిరము లోనికి పోయిన తర్వాత వాటిని నేను మాత్రమే చదువుతాను. సమంజస మైన కోర్కెలుకల కొందరిని పిలిచి మాట్లాడి పంపుతుంటాము.

**యస్.పి :-** ఇపుడు మాయమైపోయిన వ్యక్తి వ్రాసి ఇచ్చిన సమస్య ఏమిటో ఆ కాగితమును చూపుతారా?

**బాబా :-** అలా ఏ కాగితమునూ చూపము. ఆ కాగితములు విప్పి చూచేది నేనొక్కనిని మాత్రమే. ఎన్నో వ్యక్తిగత సమస్యలూ, కుటుంబ సమస్యలూ, ఆరోగ్య సమస్యలూ, చివరకు మానావమాన సమస్యలూ ఎన్నో ఉంటాయి. నన్ను దేవునిగా భావించుకొని ఏమాత్రము దాచుకోకుండా అన్ని సమస్యలు నాకు విన్నవించుకొని ఉంటారు. అందువలన వాటిని ఎవరికీ చూపడము లేదు. నేను మాత్రము చూచి అందులో కొందరిని మాత్రము పిలిచి మాట్లాడి పంపడము జరుగును. వారు వ్రాసుకొన్న కాగితములను నేను చదివిన వెంటనే కాల్చివేయడము ఇక్కడి సాంప్రదాయము. వ్రాసుకొన్న విషయములు బయటికి ప్రాకితే ఎవరూ నాకు వారి సమస్యలు చెప్పుకోరు.

**యస్.పి :-** స్వామిగారు! దయచేసి మీరు మాకు కొద్దిగా అయినా సహకరించండి. ఇపుడు పారిపోయిన వ్యక్తి ఏమి వ్రాశాడో అదయినా చెప్పగలరా?

**బాబా :-** చెప్పగలము. అదేమీ దాచవలసిన సమస్యకాదు. తన భార్యకు జబ్బు చేసిందనీ, ఆరు నెలలనుండి ఎందరు డాక్టర్లు చూచినా నయము కాలేదనీ, దానికి మా కరుణ అవసరమనీ, మాచేతి విభూది చేత జబ్బు నయమవగలదను నమ్మకముందనీ వ్రాశాడు. అందువలన అతనికి విభూది ఇచ్చుటకే మా దర్శనము కొరకు పిలిచాము. అతను వచ్చి అదే సమస్య చెప్పుకొన్నాడు. అతనికి విభూది ఇచ్చి పంపాము. బయటికి పోయాడు. తర్వాత కాల్పుల శబ్దము వినిపించింది. బయట ఏదో గందరగోళపు సమస్య ఏర్పడినదని గాబరాగా నేను బయటికి వచ్చాను. తర్వాత విషయము తెలిసింది.

(బాబాగారు ఏమాత్రము యస్.పి గారికి అవకాశమివ్వకుండా తెలివిగా మాట్లాడాడు. బాబాగారి మాటలువిన్న యస్.పి గారికి ఏమి మాట్లాడాలో తోచలేదు. అంతలోనే బాబాగారే ఇలా అన్నారు.)

**బాబా :-** మీరు ఇలాంటి దొంగలనూ, హంతకులనూ మా మందిరము వరకు రానివ్వకూడదు. అటువంటి వారిమీద నిఘావేసి బయటనే ఎప్పుడో బంధించివేసి ఉండాలి. మా మందిరము వద్ద మీరు ఇంత గందరగోళము చేయుట వలన మాకూ మరియు మా భక్తుల మనోభావములకూ, మనశ్శాంతికీ భంగము వాటిల్లినది. దేవాలయములకు అన్ని రకముల వారు వచ్చి కోర్కెలు కోరినట్లు, మా వద్దకు కూడా అన్ని రకముల మనుషులు వారివారి కోర్కెల నిమిత్తము వస్తుంటారు. వారు వచ్చే దానికి మేము బాధ్యులము కాదు. ఇపుడు మా ఆశ్రమ ప్రాంతములో జరిగిన ఈ

గందరగోళమునకు మీరే బాధ్యులు. మా ఆశ్రమప్రాంతములో ప్రశాంతత ఉండాలి. కానీ గందరగోళ పరిస్థితి ఉండకూడదు.

**యస్.పి :-** ఆ దొంగవెధవ రాకపోతే మేము వచ్చేవారము కాదు కదండీ.

**బాబా :-** వాడు దొంగో, దొరో మీరు ఆశ్రమము బయట తేల్చుకోవాలి. మా ఆశయాలకు విరుద్ధముగా ఇక్కడ గందరగోళము ఏర్పడడమేకాక మీరు వానిని పట్టుకోలేక పోయారు. వాడు ఇక్కడే ఎక్కడైన దాగి ఉంటాడు. ఆ భయము ఇక్కడున్న వందల భక్తుల మనస్సులో నిలిచివుంటుంది.

**(**దొంగ దొరకక బాధపడుచున్న యస్.పి గారికి పట్టుకోలేక పోవడము మీ అసమర్థత అని తపస్విబాబాగారు మందలించడము మరింత బాధయినది. బాబాగారికి ఏదో ఒకటి చెప్పాలికదాయని ఇలా అన్నాడు**)**

**యస్.పి :-** స్వామీ! మీరు ఎవరూ భయపడవలసిన పనిలేదు. మా పోలీసులు బందోబస్తుగ ఇక్కడే ఉంటారు.

**బాబా :-** వద్దయ్యా! వద్దు. అలా ఉంటే ఇటు పోలీసులు కాలుస్తారేమోననీ, అటు వాడు కాలుస్తాడేమోననీ మాభక్తులు భయపడుచు వారి మనస్సు పాడు చేసుకొంటారు. మీరు ఆశ్రమము బయట కాపలా ఉండండి. లోపల మాత్రము వద్దు.

**(**అందులకు యస్.పి గారు సరేన్నట్లు తలూపి ఆశ్రమము బయట పోలీసులను కాపలావుంచి వెళ్ళిపోయాడు. తన ఆఫీస్‌కు పోయిన యస్.పి గారి బుర్రలో అనేక ఆలోచనలు తరంగాలుగా వస్తున్నాయి. మునెప్ప బాబాగారి మందిరములోనే మాయమవడము చాలా విచిత్రము. అలా మాయమవడానికి ముందే ఏదైనా ఏర్పాటు చేసివుంటారను యోచన యస్.పి గారికి వచ్చినది. వెంటనే వయర్‌లెస్ ద్వారా ఆశ్రమము వద్దనున్న ఇన్‌స్పెక్టర్లకు ఆశ్రమములోపలికి పోవువారిని, వచ్చు వారిని చెక్‌చేసి

పంపమనీ అంతేకాక మునెప్ప లోపలే దాగివున్నాడనీ, లోపలి నుండి మునెప్ప బయటికి మారువేషములో రావచ్చుననీ, జాగ్రత్తగా కాపలా కాయమనీ సమాచారమును పంపాడు. అలాగే పోలీసులు చురుకుగా కాపలా కాస్తున్నారు.

పట్టుకోబోయిన పోలీసులనుండి తప్పించుకోవడము మునెప్పకు గండము గడచినట్లయినది. తాను బావిలో దాగివున్నట్లు బాబాకు తప్ప ఎవరికీ తెలియదు. స్వామి తనను బయటికి రమ్మని సమాచారము పంప నంతవరకు బావినుండి బయటికి రాకూడదనుకొన్నాడు. బావిలో పూర్తి మునిగి నీటిలో ఉండినప్పటికి ఊపిరాడునట్లు మరియు బయటి సమాచారము తెలియునట్లు ఆక్సిజన్‌పైపు, వాటర్‌ప్రూఫ్ ఫోన్ రెండూ వుండు ఫేస్‌మాస్క్ (తలకు తగిలించుకొనునది) నీళ్ళ మోటర్ నుండి వచ్చు పైపు ద్వారా బావిలో ఏర్పాటు చేసి పెట్టినందుకు బాబాగారికి మునెప్ప మనస్సు లోనే జోహర్లు చెప్పుకొన్నాడు. రాత్రి సమయము వరకు మునెప్ప బావిలోనే ఓపికగా ఉన్నాడు. రాత్రి పదకొండుగంటల సమయములో మునెప్ప చెవులకు అమర్చుకొన్న రిసీవర్ల ద్వారా తపస్వి బాబాగారి గొంతు వినిపించిది.)

**బాబా :-** హలో! మునెప్ప

**మునెప్ప :-** హలో! స్వామీ చెప్పండి.

**బాబా :-** చెప్పేదంతా జాగ్రత్తగ విను. నీవు కరెక్టుగా పది నిమిషాలకు బయటికిరా. బయటికి వచ్చిన వెంటనే బావిప్రక్కనే పడివున్న టవలుతో తేమలేకుండా శరీరమంతా తుడుచుకో. నీ బట్టలు విడిచివేసి నీరు కారకుండా పిండుకో. అక్కడేవున్న వేరే గుడ్డలు వేసుకో. నీ బట్టలు తీసుకొని టవలు భుజము మీద వేసుకొని కుడిప్రక్క మందిరములోనికి ప్రవేశించు. మందిరమునకు కుడిప్రక్కనే గల వరండా దగ్గర బ్యానెట్

ఎత్తి నిలబడిన జీప్ ఉంటుంది. జీప్‌క్రింద డ్రైవర్ పడుకొని ఏదో రిపేర్ చేస్తున్నట్లుండును. నీవు ఆ జీపు దగ్గరకు పోయి టవలు తలకు చుట్టుకొని ఇంజన్‌కు కుడి ప్రక్కన మనిషి వంగి కాళ్ళు ముందుకు పెట్టుకొనుటకు జాగావున్నది. అక్కడ నీవు ముందు కూర్చొని కాళ్ళు ముందుకు చాపి పెట్టుకొని వంగివుండు, అంతలో నిన్నే గమనిస్తున్న డ్రైవర్ వచ్చి బ్యానెట్‌ను మూసి జీపును స్టార్ట్ చేసి బయలుదేరి పోతాడు. ఆశ్రమము వెలుపల పోలీసులు జీపును ఆపి చెక్ చేస్తారు. వారికి ఇంజన్ ముందర అనుమానము రాదు. కావున వారి చూపునుండి నీవు తప్పించుకోవచ్చును. పోలీస్‌లకు నేను వేసిన ప్లాన్ మీద అనుమానము రాదు. కావున నీవు సులభముగా బయట పడవచ్చును. అక్కడి నుండి కొంత దూరము వరకు పది నిమిషాల్లో పోయి జీపు నిలబడుతుంది. డ్రైవర్ బ్యానెట్ లాక్ క్లిప్పులు తీసి బ్యానెట్ ఎత్తుతాడు. వెంటనే నీవు బయటకు వచ్చి అక్కడే నిలబడి వున్న కారు ఎక్కు. కారు ఎక్కేముందు నీ వెంటవున్న నీ గుడ్డలు రోడ్డు ప్రక్కన పడవేసి కారు ఎక్కి కూర్చుంటూనే కారు కదలిపోతుంది. ఆ కారు నీ స్థావరమునకు ఐదు కిలోమీటర్ల దూరములోనే ఆగిపోతుంది. అక్కడ దిగుతూనే ఒక సైకిల్ మోటర్ వచ్చి ఆగి లిఫ్ట కావాలా అంటారు. అవును అను, అపుడు ఆ సైకిల్ మోటరుతో వచ్చిన వ్యక్తి దానిని నీకే ఇచ్చి కారులో పోతాడు. అప్పుడు దగ్గరలోనున్న నీ స్థావరమునకు సులభముగా చేరిపోగలవు. నీవు పోయిన తర్వాత నీకిచ్చిన సెన్సార్ సహాయముతో పాము అన్వేషణ సాగించండి. ఇప్పుడు నిన్ను పోలీసులు పసికట్టారు. కనుక ఇక మీదట నీవు ఇక్కడికి రావద్దు. అవసరమొస్తే నీ అనుచరులను పంపించు. చెప్పిందంతా అర్థమైందా.

**మునెప్ప :-** అర్థమైంది స్వామీ! మీరు చెప్పినట్లే అన్నీ జరుగుతాయి.

(తపస్వి బాబాగారు చెప్పినట్లు మునెప్ప బావినుండి బయటికి వచ్చి బాబాగారు చెప్పినట్లే తేమ తుడుచుకొని, తన గుడ్డలు విప్పి పిండి పెట్టుకొని అక్కడేనున్న గుడ్డలు ధరించి కుడి ప్రక్క మందిరము గుండా, కుడిప్రక్క వరండావద్ద గల జీపులో ఇంజన్ ప్రక్కన అణిగి పోయాడు. ఆ జీపు కదలి పోయింది. బయట పోలీసులు ఆపి తనిఖీ చేయను మొదలు పెట్టి డ్రైవర్‌ను ఇలా ప్రశ్నించారు.)

**పోలీస్ :-** ఎక్కడికి పోతుంది?

**డ్రైవర్ :-** అర్ధగంట క్రితమే కదాసార్ లోపలికి వెళ్ళాము. అప్పుడు మీరు చూచారు కదా! నా జీప్‌లో వచ్చిన వారిని దింపి తిరిగి ఖాళీగా వెళ్ళు చున్నాను.

**పోలీస్ :-** ఇది అర్ధగంట క్రిందట వచ్చిన బండి కదా! గుంటూరు నుండి వచ్చామని చెప్పావు కదా!

**డ్రైవర్ :-** అవున్ సార్! వచ్చిన వారు నెలవరకు ఇక్కడే ఉంటారు. నెల తర్వాత నేనే వచ్చి వారిని తీసుకపోతాను. ఇది కిరాయి (బాడుగ) బండి కావున తిరిగి వెళ్ళుచున్నాను.

**పోలీస్ :-** సరె వెళ్ళు.

**డ్రైవర్ :-** నమస్తే! వస్తాను సార్.

(జీపు కదిలి పోయింది. పోలీస్‌ల బారినుండి తప్పించుకొన్నందుకు మునెప్ప సంతోషించాడు. అక్కడినుండి పది నిమిషములు పోతూనే జీపు ఆగింది. డ్రైవర్ బ్యానెట్ ఎత్తాడు. అప్పుడు మునెప్ప తన గుడ్డలను రోడ్డు ప్రక్కవేసి ప్రక్కనే నిలబడివున్న కారులో ఎక్కాడు. మునెప్ప ఎక్కగానే కారు బయలుదేరింది. తెల్లవారక మునుపే ఒకచోట ఆగింది. మునెప్ప

దిగి మూత్రవిసర్జన చేసేలోపే అక్కడికి ఒక సైకిల్‌మోటరు వచ్చి ఆగి లిఫ్ట్ కావాలా అన్నాడు. అపుడు అవును అన్నాడు మునెప్ప. వెంటనే మునెప్పకు బండి ఇచ్చి వచ్చిన వ్యక్తి కారులో పోయాడు. మునెప్ప మోటరుసైకిల్లో తెల్లవారకనే తన స్థావరమును చేరుకొన్నాడు.

ఆ రాత్రే తెల్లవారు జామున నాలుగుగంటలకు యస్.పి గారి ఆదేశము మేరకు మద్రాస్ (చెన్నై) నుండి పోలీస్ కుక్కలు వచ్చాయి. తెల్లవారిన తర్వాత ఆరుగంటలకే యస్.పి గారు కుక్కలతో సహా బాబాగారి ఆశ్రమమునకు వచ్చాడు. బాబాగారి అనుమతి తీసుకొని మునెప్ప పరుగిడిన అడుగుల వాసనను కుక్కలకు చూపించారు. ఆ కుక్కలు వాసన చూస్తూ మందిరమునకు తర్వాత లోపలి వనములోనికి పోయాయి. కానీ బావివద్దకు పోకుండా తిరిగి బయటికి వచ్చాయి. కుడిప్రక్క వరండా వద్దకు వచ్చి ఆగిపోయాయి. ఏమి అర్థముకాని పోలీస్‌లు కుక్కలను తిరిగి వ్యాన్‌లో తీసుకపోతుండగ మునెప్ప గుడ్డలు పడిన స్థలమువద్దకు వ్యాన్ చేరుకోగానే కుక్కలు మొరిగి క్రిందికి దిగాలని చూచాయి. అది గ్రహించిన పోలీస్‌లు వెంటనే వ్యాన్‌ను ఆపి కుక్కలను క్రిందికి దించగా, అవి నేరుగా పోయి రోడ్డు ప్రక్కనే మునెప్ప గుడ్డలను పట్టుకొన్నాయి. పోలీసులు ఆ గుడ్డలను స్వాధీనము చేసుకొని, అవి తాము వెంబండించినపుడు మునెప్ప ధరించిన గుడ్డలని నిర్ధారించుకొన్నారు. ఇన్‌స్పెక్టర్ ఆ సమాచారమును యస్.పి గారికి తెలిపాడు. అయితే యస్.పి గారు మునెప్ప పారిపోయినట్లు నమ్మలేదు. అప్పుడు ఇన్‌స్పెక్టర్‌తో ఇలా అన్నాడు.

**యస్.పి :-** మునెప్ప మందిరములోనికి పారిపోయింది కళ్ళారా చూచాము. అతను బయటపడే అవకాశములేనట్లు చుట్టూ కాపలా ఉన్నాము. వచ్చి పోయేవారిని తనిఖీ చేస్తున్నాము. కానీ బట్టలు మాత్రము బయట కనిపించడము మునెప్ప పారిపోయినట్లు మనలను నమ్మించడానికి వేసిన ప్లాన్ తప్ప వేరుకాదు.

**ఇన్స్పెక్టర్ :-** అలాగంటారా సార్!

**యస్.పి :-** అవును. బట్టలు కూడా మీ అజాగ్రత్త వలననే బయటికి వచ్చాయి. రాత్రి అనుమానాస్పద వెహికల్ ఏదైనా బయటికి పోయిందా?

**ఇన్స్పెక్టర్ :-** రాత్రి పదకొండు గంటల సమయములో ఒక జీప్ పోయింది. దానిని బాగా చెక్చేసి పంపాము. అది అంతకు ముందే గుంటూరు నుండి కిరాయికి మనుషులను తీసుకవచ్చి వదలి వెళ్ళిపోయింది. అది వచ్చినపుడు పదిమంది భక్తులతో వచ్చింది. పోయేటప్పుడు ఖాళీగా పోయింది. అది పదిన్నర సమయములో లోపలికి పోయింది. లోపలే భోజనము చేసిన తర్వాత అది ఖాళీగా వెళ్ళి పోయింది. వచ్చిన అర్ధగంట లోపలే తిరిగి వెళ్ళి పోయింది. అందులో డ్రైవర్ తప్ప లగేజి కూడా ఏమీలేదు. జీపు ఖాళీగా వెళ్ళింది. అంతతప్ప రాత్రంతా ఏదీ లోపలికి రాలేదు. బయటికి కూడా పోలేదు.

**యస్.పి :-** అలాగా! అయితే ఆ జీప్లోనే మునెప్ప గుడ్డలు రహస్యముగా వెళ్ళివుంటాయి. ఇది మనలను తప్పుదారి పట్టించడానికి వేసిన ప్లాన్. మునెప్ప గుడ్డలు బయటికి పోయినంతమాత్రమున మునెప్ప బయటికి పోయాడని మనము నమ్మకూడదు.

**ఇన్స్పెక్టర్ :-** ఇపుడేమి చేయాలి సార్!

**యస్.పి :-** మీరు తపస్విబాబాగారి దగ్గరకు పోయి మునెప్ప పారిపోయినట్లు చెప్పండి. దానితో మనము పూర్తి నమ్మినట్లు వారికి తెలుస్తుంది. కాపలా కూడా ఎత్తివేసి రహస్యముగా నిఘా వేసివుంచండి. కాపలా లేదని మునెప్ప సులభముగా బయటికి రాగలడు. మనము నిఘా వేసివుంచినట్లు అతనికి తెలియదు. కావున సులభముగా దొరుకుతాడు.

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(రాఘవ, యోగ, మేఘ, చక్రి మొదలగు ఆటవికులు అడవి మార్గమున ప్రయాణించి చివరకు తమ గూడెమును చేరుకొనిరి. రాఘవను పిలుచుకొని వచ్చినందుకు గూడెము నాయకుడు మల్లుదొర సంతోష పడినాడు. ఆ దినము రాఘవ విశ్రాంతి తీసుకొన్న తర్వాత మరుసటి దినము మల్లుదొర రాఘవను పిలిచి ఇలా అన్నాడు.)

**మల్లుదొర :-** రాఘవా! నిన్ను చూచినప్పటినుండి నీలో ఏదో గొప్పతనము ఉన్నదని నాకు తోచుచున్నది. నిన్ను చూచింది ఒక దినమే అయినా, ఆ దినమునుండి నా మనసంతా నీ మీదనే ఉన్నది. అందువలననే మా మనుషులను నీ కొరకు పంపాను. ముఖ్యముగ నేను నీకు ఒక విషయమును చెప్పాలి. నాకు ఒకే ఒక కూతురున్నది. మేము అడవిలో ఉన్నా ఆమెను పట్టణములో పెద్ద చదువులే చదివించాను. ఆమెకు యుక్తవయస్సు వచ్చినది. ఆమె కూడా తెలివైనది. ఆమె చదువుకొన్నది మా గూడెములోనున్న వారంతా చదువులేని వారే. చిన్నప్పటినుండి మా గూడెము వారందరు ఆమెను ప్రత్యేకముగా గౌరవముగా చూచుచున్నారు. వాస్తవానికి మా గూడెములో ఆమెను పెళ్ళాడువారు ఎవరూ లేరు. ఆమె పెళ్ళి విషయము నాకు సమస్యగానే ఉన్నది. నిన్ను చూచిన తర్వాత నా మనస్సులో ఒక యోచన వచ్చింది. ఆమెకు తగిన వరుడుగా నీకు అన్ని అర్హతలున్నాయి. ఇది నా ఉద్దేశ్యము మాత్రమే. నా ఉద్దేశ్యము మంచిదో కాదో నాకు తెలియదు. నీవు అన్ని విధముల యోచించి నీ ఉద్దేశ్యము నాకు తెలుపు. ఇందులో ఏ బలవంతమూ లేదు.

(మల్లుదొర చెప్పిన మాటలను విని రెండు నిమిషములు రాఘవ యోచించాడు. తనకు పిల్లనిచ్చుటకు కూడా నిరాకరించి అవమానముపాలు చేసిన సమాజమునకు దూరముగా వచ్చాను. ఇక్కడివారు కల్లా కపటము లేని ప్రజలు. వారు గౌరవించి పిల్లనిస్తానంటే వారు చూపు ఆప్యాయతకు

నేను తప్పనిసరిగ ఒప్పుకోవలసిందే అనుకున్నాడు. తర్వాత రాఘవ మల్లు దొరతో ఇట్లన్నాడు.)

**రాఘవ :-** మీరు పెద్దవయస్సున్నవారు. మీరు అన్ని విధముల మంచినే యోచించివుంటారు. మీరు అంతగా అడిగితే నేను కాదనలేను. మీ మాటను గౌరవించడము నాకర్తవ్యము. అయితే నాది చిన్న మనవి. అదేమనగా నాకు ఒక గొప్ప గురువు లభించాడు. అతనే రాజయోగానంద స్వామి. నేనిప్పుడు ఆయన దగ్గర నుండే వచ్చాను. ఈ విషయము ఆయనకు తెలిపి, ఆయన ఆశీర్వాదముతోనే మీరు చెప్పినట్లు చేసుకొంటాను. ముందు మనమందరము పోయి స్వామిగారికి ఈ విషయమును తెలియ జేయాలి. ఈ విషయమును స్వామిగారికి నేను చెప్పే దానికంటే పెద్దలు మీరు చెప్పేదే మంచిది.

(రాఘవ మల్లుదొర మాటను గౌరవించి ఒప్పుకోవడముతో గూడెములోని అందరూ సంతోషించారు. తర్వాత అందరూ కలిసి రాజ యోగానంద స్వామి వారికి విషయమును తెలుపుటకు బయలుదేరారు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(రాజయోగానంద స్వామి ఆశ్రమములో రాధేశ్వరి నిత్యము జ్ఞానమును తెలుసుకొనుచూ కాలము గడుపుచుండెను. రాజయోగానంద స్వామి దృష్టిలో రాధేశ్వరికి మంచి స్థానము ఏర్పడినది. ఆమె కొద్ది కాలమునకే గొప్ప జ్ఞాన సంపన్నురాలు కాగలదని అనుకొన్నాడు. కొద్ది రోజులకు రాధేశ్వరి మేనమామకు, రాధేశ్వరి రాజయోగానంద స్వామివద్ద ఉన్నట్లు తెలిసింది. స్వాములు అంటే తక్కువ భావముగలవాడు ఆమె మేనమామ. అతని పేరు జగన్నాథ్. రాధేశ్వరి పినతల్లి పేరు కుల్లాయమ్మ.

ఒక దినము జగన్నాథ్, కుల్లాయమ్మ ఇద్దరు రాజయోగానంద స్వామి ఆశ్రమానికి వచ్చి స్వామిని బెదిరించి రాధేశ్వరిని తీసుకపోవాలని అనుకొన్నారు. ఒకరోజు వారు ఇద్దరూ వారితో పాటు నలుగురు రౌడీలను వెంటబెట్టుకొని రాజయోగానందస్వామి వద్దకు బయలుదేరి వచ్చారు. స్వాములు అంటే బిక్షగాళ్ళ కిందికి జమకట్టుకొన్న వారు స్వామిని బెదిరించి గానీ, కొట్టిగానీ రాధేశ్వరిని తీసుకపోవాలనుకొన్నారు. ఒక దినము ఉదయము తొమ్మిది గంటలకే నలుగురు రౌడీలతో వచ్చిన జగన్నాథ్, కుల్లాయమ్మ ఇద్దరూ స్వామి విషయము తెలియనివారై అక్కడ స్వామిని గురించి దురుసుగా మాట్లాడినారు. స్వామివారు రాధేశ్వరి లోపల ఉండుట వలన వారికి ఈ విషయము తెలియదు. వారు దురుసుగా మాట్లాడినందుకు ఆశ్రమములోనున్న భక్తులకు వారి మీద కోపము వచ్చింది. జగన్నాథ్‌నూ, కుల్లాయమ్మానూ, వారితో పాటు వచ్చిన రౌడీలనూ, ఆరు మందినీ అక్కడున్న అరవైమంది భక్తులు తలా ఒక దెబ్బ కొట్టారు. వారిని చితకబాదడమేకాక తాళ్ళతో వారి చేతులు కాళ్ళు కట్టిపడవేసినారు. అంతవరకు స్వామిని, స్వామి భక్తులను తక్కువగా తలచిన వారికి స్వామి భక్తులు యమకింకరులవలె కనిపించారు. అంతవరకు ఎక్కడా వారు తన్నులు తినలేదు. ఇక్కడికి వచ్చి బాగా తన్నులు తిన్నారు. విడిచిపెట్టితే చాలు, ఎప్పటికీ ఈ ప్రాంతమునకు కూడా రాకూడదనుకొన్నారు. స్వామి లోపలనుండి బయటికి రాకనే స్వామికి ఈ విషయము తెలియకనే, ఆ సంఘటన జరిగిన పది నిమిషాలకే రాఘవా, రాఘవతోపాటు మల్లుదొర, యోగ, మేఘ, చక్రి మొదలగు ముఖ్యమైన ఆటవికులందరు అక్కడికి వచ్చారు. అక్కడ అప్పుడే జరిగిన విషయము తెలుసుకొన్నారు. అంతలో స్వామికూడా బయటికి వచ్చాడు. అందరిని చూచాడు. అక్కడ కట్టివేయబడివున్న

వారిని కూడా చూచాడు. విషయమంతా అర్థమైనది. జగన్నాథ్, కుల్లాయమ్మ ఇద్దరూ అప్పుడు స్వామిని చూచారు. స్వామి అంటే అడుక్కొని బ్రతికేవాడు అని తక్కువ అంచనా అంతవరకు వారికి ఉండేది. స్వామి చెప్పకనే తన్ని కట్టివేశారు. స్వామి చెప్పితే చంపివేసేదానికైనా అక్కడున్నవారు వెనుకాడరను కొన్నారు. అంతలో స్వామి, వారి కట్లు విప్పమని చెప్పారు. అప్పుడు వారితో ఇలా అన్నాడు.)

**రాజయోగ :-** మీరు ఇక్కడికి ఎందుకు వచ్చారు? వచ్చినవారు స్వామిని ఎందుకు దూషించారు?

**జగన్నాథ్ :-** మా అమ్మాయి ఉన్నదని తెలిసి వచ్చాము. మాకు తెలియకుండా ఇక్కడ పెట్టుకుంటారా, అని కొద్దిగా తప్పుగానే మాట్లాడినాను.

**రాజయోగ :-** మీకు తెలియకుండా మేము దాచిపెట్టవలసిన అవసరము మాకు లేదు. మాకు రాధేశ్వరి మీ విషయమంతా చెప్పింది. ఇంతకు ముందు మీ ఆటలుసాగేవి. అప్పుడు రాధేశ్వరి ఒంటరిది. ఇప్పుడు ఆ అమ్మాయి ఒంటరిది కాదు. ఆమెకు తండ్రిగా నేనున్నాను. ఇప్పటినుండి రాధేశ్వరి విషయములో ఎక్కడ చెడుగా ప్రవర్తించినా నేను మీ విషయములో ఊరక ఉండనని అర్థము చేసుకోండి. (అంతలో రాధేశ్వరి కూడా అక్కడికి వచ్చినది. అక్కడ పరిస్థితిని అంతా అర్థము చేసుకొని మౌనముగా ఉండి పోయినది. అక్కడున్న ఆటవికులు వారి కట్లను విప్పారు.)

**జగన్నాథ్ :-** మేము అన్యాయముగా ఇక్కడికి రాలేదు. మమ్ములను అనవసర ముగా కొట్టారు.

**కుల్లాయమ్మ :-** మా అమ్మాయిని పంపండి. మేము పోతాము.

(స్వామి వారు ఏమి మాట్లాడలేదు. మీరే మాట్లాడండి అన్నట్లు రాఘవవైపు చూచి అక్కడినుండి పోయాడు. అప్పుడు రాఘవ వారితో ఇలా అన్నాడు.)

**రాఘవ :-** ఇప్పుడు మీ ఉద్దేశ్యము ఏమి?

**జగన్నాథ్ :-** మా అమ్మాయిని మావెంట పంపండి.

(అప్పుడు ఆటవికులు రాఘవను మాట్లాడవద్దని చెప్పి వారితో మేము మాట్లాడుతామని ఇలా అన్నారు.)

**యోగ :-** రాధేశ్వరిని ఇక్కడికి తెచ్చి స్వామివద్ద ఉంచినది మేమే. రాధేశ్వరికి మేమంతా అన్నగార్లుగా ఉన్నాము. ఆమె మీ విషయమంతా చెప్పినది. మీరు ఆమె ఆస్తికొరకు అఘాయిత్యాలు చేస్తునట్లు మాకు తెలిసినది. మీ నుండి రాధేశ్వరికి ఎటువంటి కష్టమొచ్చినా దానికి మొదటవుండి ఆ కష్టమును లేకుండా చేస్తాము. అంతేకాదు తర్వాత మిమ్ములను బ్రతుకనివ్వము.

**మేఘ :-** రాధేశ్వరి ఇంట్లో మీరున్నట్లు, ఆ ఇల్లును మీరు ఆక్రమించు కొన్నట్లు మాకు తెలిసింది. ఇప్పటినుండి మూడు రోజులలోపల ఆ ఇల్లును మీరు వదలిపోవాలి. లేకపోతే నీవు ఎంతమంది రౌడీలను పెట్టుకొన్నా నిన్ను మాత్రము వదలము. రౌడీలు నిన్ను కాపాడలేరు, జాగ్రత్త.

**యోగ :-** ఇది మొదటిమారు నీవు మమ్ములను చూచావు, మేము మిమ్ములను చూచాము. అందువలన ఇప్పుడు మాటలతోనే చెప్పి పంపుచున్నాము. రెండవమారు మేము మీకు కనిపిస్తే మాట్లాడే ప్రసక్తే ఉండదు. ఏకంగా యమపురికే పంపుతాము.

(అంతవరకు అక్కడ యోగా, మేఘా మాట్లాడిన మాటలను విన్న తర్వాత రాధేశ్వరికి క్రొత్త ధైర్యము వచ్చింది. అంతవరకు జగన్నాథ్‌ను చూస్తే భయపడు రాధేశ్వరి అప్పుడు ఇలా అన్నది.)

**రాధేశ్వరి :-** ఇంతవరకు మీరు ఎన్నో ఆగడాలు చేశారు. చివరకు నన్ను చంపాలని చూచారు. ఇప్పుడు ఆ ప్రయత్నాలు ఏమీ సాగవు. ఇప్పుడు నాకు దేవుడిచ్చిన తండ్రి, సోదరులు దొరికారు. ఇప్పటికైనా మంచి బుద్ధి తెచ్చుకొని బ్రతకండి. నా అన్నగారు చెప్పినట్లు ఇల్లునూ, ఇంటిలో సామానులను వదిలిపోండి. ఇప్పటినుండి నా ఆస్తికి మీకు ఎటువంటి సంబంధమూ ఉండదు.

**మేఘ :-** మీతో మేము ఎక్కువగా మాట్లాడము. మూడు రోజులలో అన్ని వదిలిపోవాలి. లేకపోతే మీ మెడకు మీరే ఉరి వేసుకొన్నట్లే. మూడు రోజుల తర్వాత మీకు చావో బ్రతుకో మీ చేతులలోనే ఉంది. ముందు ఇక్కడినుండి వెళ్ళిపొండి.

(అలా యోగా, మేఘ గట్టిగా హెచ్చరిక చేసి పంపారు. వారు వదలితే చాలు అనుకొన్న కుల్లాయమ్మ, జగన్నాథ్ ఇద్దరూ భయపడి పోయారు. వారు పొమ్మంటేనే ఏమాత్రము ఆలస్యము చేయకుండా అక్కడి నుండి వెళ్ళిపోయారు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(తాటిమాను మునెప్ప పోలీసుల ఉచ్చునుండి తప్పించుకొని సులభముగా తన స్థావరమును చేరుకొన్న తర్వాత తన ముఠాలోని మనుషులకు విషయమంతా చెప్పి, వజ్రాలను కనుగొను సెన్సార్ మిషన్ ఇచ్చి, వజ్రాలున్న పామును వెతకడానికి పొమ్మన్నాడు. ఇది సులభమైన పద్ధతి అనుకొన్న వెంకు, సెన్సార్ తీసుకొని మొదట పాము పారిపోయిన స్థలము నుండి వెతకాలనుకొని అక్కడికి పోయారు. ఆ విధముగా పోయిన మునెప్ప మనుషులకు ఒక దినము పాములు పట్టువాడు కనిపించాడు. వానివద్ద అనేక పాములున్నాయి. వాడు పాములు పట్టేవాడేకాక పెద్ద

మాంత్రికుడు. వాని పేరు నాగోతుల నాగభూషణమ్. మునెప్ప మనుషులు నాగభూషణముతో మాట్లాడుచూ వారివద్దనున్న పాముల సమీపమునకు పోయారు. అతని వద్దనున్న పాముల సమీపమునకు పోయిన వెంటనే వెంకు దగ్గరున్న సెన్సార్ కొద్దిగ శబ్దము చేయను మొదలుపెట్టింది. అలా సెన్సార్ శబ్దము చేయడము వలన తమకు కావలసిన వజ్రాలపాము అక్కడున్నదని వెంకు గ్రహించాడు. మునెప్ప మనుషులు ఆ పామును ఎలాగైనా నాగభూషణ్ దగ్గరనుండి దొంగిలించాలనుకొన్నారు. అలా చేయడము ఒకేమారుగా సాధ్యముకాదు. అందువలన మొదట నాగోతుల నాగభూషణ్‌తో చిన్నగా స్నేహము చేశారు. తమకు కావలసిన పాము విషయమును తెలుసుకొనుటకు నాగభూషణముతో మాట్లాడను మొదలు పెట్టారు.)

**వెంకు :-** నీవద్ద ఒకటి రెండు పాములు కాకుండ వందపాముల వరకు ఉన్నాయి కదా! ఇవన్నీ ఎలా దొరికాయి. ఎలా పట్టగలిగావు. కొద్దిగ చెప్పు వింటాము.

**నాగభూషణ్ :-** ఇవన్నిటిని నా పెద్దకొడుకు సరదాగా పట్టుకొన్నాడు. నేను వీటిలో కొన్నిటిని మాత్రమే పట్టాను.

**నూక :-** అయితే నీ కొడుకుకు కూడా పాములను పట్టే విద్యను నేర్పినావన్న మాట. అతను నీవద్ద ఎంతకాలము తర్ఫీదు అయినాడు.

**నాగభూషణ్ :-** నేను ఏమీ నేర్పలేదయ్యా! అది నేర్పితే వచ్చే విద్యకాదు. దానికి ధైర్యముండాలి, వానికి ధైర్యముంది. పాములను పట్టుకోగలుగు చున్నాడు. ఈ పనే వద్దని చెప్పినా ఆయన నా మాట వినలేదు.

**వెంకు :-** ఇవి విష సర్పాలు కదా! పాములు పట్టడములో ఏమీ ప్రమాదము లేదా? పాము కరిస్తే ఏమి చేస్తారు?

**నాగభూషణ్ :-** లేకేమి, పాములే ప్రమాదకరమైనవి. ఒకవేళ ఏదైనా ప్రమాదవశాత్తు పాముకాటువేస్తే, తెల్లఈశ్వరి చెట్టు పుల్లను నూరి మింగు తాము. దానితో విషము పనిచేయకుండా పోతుంది.

**నూకా :-** మీవద్దనున్న పాములకు కోరలు పెరికివేయరా?

**నాగభూషణ్ :-** తప్పనిసరిగా పెరికి వేస్తాము. ఇక్కడున్న పాములన్నిటికీ కోరలు పెరికేసినాము. నిన్న పట్టిన పాముకు ఒక్కదానికే ఇంకా కోరలు తీయలేదు. అది ఒకటే విషమున్న పాము.

(మునెప్ప మనుషులు పాములన్నిటిని చూచి తమకు కావలసిన పాము ఏదో గుర్తించుకోవాలనుకొన్నారు. అందుకొరకు నాగభూషణముతో మంచిగ మాట్లాడుచూ ఇలా అడిగాడు.)

**వెంకు :-** నీవద్దనున్న పాములన్నిటిని ఒకమారు చూచి ఆనందించాలను కొన్నాము. చూపిస్తారా?

(అందులకు నాగభూషణ్ సరే చూపిస్తానని చెప్పి అతని వద్దగల పాములనన్నిటిని ఒక్కొక్క దానిని చూపిస్తూ, వాటి పేరును కూడా చెప్పుచూ, వాటి విష ప్రభావమునూ, ఆ జాతి పేరునూ చెప్పుచుండెను. మునెప్ప మనుషులు నాగభూషణము ఇతర జాతుల పాములను గురించి చెప్పునపుడు విన్నట్లు నటిస్తుండిరి. కేవలము నాగుపాములను గురించి చూపి చెప్పునపుడు శ్రద్ధగా వినుచుండిరి. నాగభూషణము చివరిగా చూపిన నాగుపామును వారు గుర్తించారు. అది వారి చేతినుండి తప్పించుకొని పారిపోయిన పాముగా తెలుసుకొన్నారు.)

**వెంకు :-** ఈ పామును మేము పట్టుకొని చూడవచ్చునా.

**నాగభూషణ్ :-** నిన్ననే పట్టిన పామన్నానే అదే ఇది. దీనికి ఇంకా విషకోరలు పెరకలేదు. ఇప్పుడు దీనిని మీరు పట్టుకోవడము ప్రమాదము.

(విషకోరలు పెరకలేదంటూనే మునెప్ప మనుషులకు కొద్దిగ భయమైనది. ఇంతకుముందు పాముకాటుకు గురైనారు. కావున నాగ భూషణము దానికోరలు పెరికేంతవరకు ఆ పామును దొంగలించ కూడదను కొన్నారు.)

**నూకా :-** పాముకు కోరలు పెరికేది మేము ఎప్పుడూ చూడలేదు. ఎలా పెరుకుతారో మేము చూడవచ్చునా?

**నాగభూషణ్ :-** ఓ! చూడవచ్చును. సమయము చూచుకొని ఈ దినముగానీ, రేపుగానీ పెరికేస్తాను. అప్పుడు చూడవచ్చు.

(వెదక పోయిన తీగ కాలికి తగిలినట్లు, తాము వెదకుచున్న వజ్రాల పాము కనిపించడము మునెప్ప మనుషులకు సంతోషమైనది. దానికి ఎప్పుడు కోరలు పెరికితే అప్పుడు దానిని దొంగలించుకొని పోవాలనుకొన్నారు. ఆ దినము నాగభూషణమునకు తీరికలేక ఆ పాముకు కోరలు పెరకలేదు. రెండవరోజు పెరుకుతానని నాగభూషణము చెప్పగా, రేపు ఉదయమే వస్తామని మునెప్ప మనుషులు నాగభూషణమునకు చెప్పి ప్రక్క ఊరికి పోయి హెూటల్‌లో భోజనము చేసి లాడ్జిలో పడుకొన్నారు.

నాగోతుల నాగభూషణము అన్నము తిన్న తర్వాత పడుకోవాలని మంచమును వేసుకొను ప్రయత్నములో ఉండెను. అది ఒక చిన్నపల్లెటూరు. ఆ ఊరు ప్రక్కనే అడవి కూడా కలదు. ప్రక్కనేవున్న అడవిలోని పులి ఆకలిగొని ఆ పల్లెలోనికి ప్రవేశించి, ఒక ఇంటిలో దూరి ఆవును పట్టుకో బోయింది. ఆ ఆవు తప్పించుకొని పారిపోతూ రక్షణ కొరకు నాగభూషణము ఇంటిలోనికి దూరినది. ఆవును వెంబడించిన పులికూడా ఆ ఇంటిలోనికి వచ్చింది. ఆవు, పులినుండి తప్పించుకోవాలని అటు ఇటు ఇంటిలో

పరుగిడడము వలన పాములున్న బుట్టలన్నీ క్రిందపడి పాములన్నీ చెల్లా చెదురైనాయి. అపుడు నాగభూషణము ఇంటిలోని 20 అడుగుల పొడవున్న కొండశిలువ పులినిపట్టి చుట్టివేసింది. ఆవు మాత్రము బయటికి పారిపోయింది.

హఠాత్తుగా జరిగిన ఈ సంఘటనకు ఆ ఊరిలోని ప్రజలందరూ నాగభూషణము ఇంటివద్దకు వచ్చారు. పులి బయటకు రాకుండ పోవడము పాములన్ని ఇష్టమొచ్చినట్లు పారిపోవడము అందరూ చూచారు. ఇంటిలోని పులి కొండశిలువ చేతికి దొరికినట్లు తెలిసి అందరూ ఊపిరి పీల్చుకొన్నారు. కొండ శిలువ తన పట్టును విడవకుండా పట్టుకొని పులికి శ్వాస ఆడకుండా చేసి దానిని చంపివేసి చిన్నగా మింగను మొదలుపెట్టింది. ఆ గందర గోళములో వజ్రములున్న పాము తప్పించుకొన్నదని నాగభూషణమునకు తెలియదు. ఆ పాములో వజ్రములున్న విషయము కూడా అతనికి తెలియదు. ప్రక్క ఊరిలో పడుకొన్న మునెప్ప మనుషులు ఉదయమే లేచి కాలకృత్యములు తీర్చుకొని నాగభూషణము వద్దకు వచ్చారు. రాత్రి అక్కడ జరిగిన విషయ మంతయూ తెలుసుకొన్నారు. విషపు కోరలు తీయాలనుకొన్న పాముకూడా పారిపోయిందని అప్పుడే నాగభూషణము తెలుసుకొని ఆ విషయమును మునెప్ప మనుషులకు చెప్పాడు. ఆ పాము పోయిన సంగతి తెలిసి మునెప్ప మనుషులు తెల్లముఖము వేశారు. చివరకు నాగభూషణము నకు తమ విషయము చెప్పారు. తాము విషపుకోరలు తీయని పాము కొరకే వచ్చామనీ, దానిని పట్టిఇస్తే పదివేల రూపాయలిస్తామన్నారు. ఆ పాముకు ఎందుకు అంత ప్రాధాన్యత ఇస్తున్నారని నాగభూషణము అడుగగా! అది ముందు మా సర్కస్‌లో పని చేసిన పామనీ, దానికి ఎన్నో వినోదములు చేయుట

తెలియుననీ, అందువలన ఆ పాము కావాలనీ చెప్పారు. అందులకు నాగభూషణము ఇలా అన్నాడు.)

**నాగభూషణ్ :-** ఒకవేళ అదే పాము కనిపించినా దానిని మనమెలా గుర్తు పట్టగలము.

**వెంకు :-** ఆ చింత నీకువద్దు. నీ వెంట మేముంటాము. దానిని మేము గుర్తించగలము. అది దొరికేంత వరకూ నీ ఖర్చు కూడా మేమే భరిస్తాము. అది దొరికిన వెంటనే పదివేల రూపాయలు ఇస్తాము.

(అది సర్కస్ పామేనని నమ్మిన నాగభూషణము వారు డబ్బు ఇస్తామన్నారు కావున దానిని ఎలాగైనా పట్టివ్వాలనుకొన్నాడు. అప్పుడు మునెప్ప మనుషులతో ఇలా అన్నాడు.)

**నాగభూషణ్ :-** నావద్ద గజజ్జాలాంజనము ఉన్నది. ఆ అంజనములో చూస్తే ఆ పాము ఎక్కడున్నదో తెలియగలదు. ఆ అంజనమును చూడాలంటే ముందు దానికి పూజ చేయాలి. ఆ పూజకు ఐదువందల (500) రూపాయలు ఖర్చు అగును. (ఆ మాటనువిన్న మునెప్ప మనుషులకు సంతోషమైనది. పోయిన పామును తొందరగా పట్టుకోగలమను ధైర్యము వచ్చినది. వెంటనే 500 డబ్బును మునెప్పకు ఇచ్చి పూజను మొదలు పెట్టమన్నారు. నాగ భూషణము అంజనమును చూచుటకు కావలిసిన సన్నాహములన్నీ చేసుకొని, పూజ ముగించుకొని మునెప్ప మనుషులలో వెంకు చేతనే అంజనమును చూపించాలనుకొన్నాడు. వెంకూను పూజముందర కూర్చోబెట్టి అంజనము యొక్క డబ్బీ మూత తీసి కనురెప్పకొట్టకుండా అంజనమును చూడమన్నాడు. వెంకు అంజనము చూస్తున్నాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × ×

(రాజయోగానంద స్వామి ఆశ్రమము వద్దకు వచ్చి బాగా తన్నులు తిని పోయిన జగన్నాథ్ కుల్లాయమ్మలు స్వామివారు ఉన్నంతవరకు రాధేశ్వరిని ఏమీ చేయలేమని అనుకొన్నారు. ఒకవైపు తమచేత ఏమీకాదని తెలిసినా తమకు జరిగిన అవమానమునకు ఏదో ఒకటి చేయాలని, ఆలోచించి చివరికి ఒక నిర్ణయానికి వచ్చారు. ప్రత్యక్షముగా ఏమీ చేయలేమని పరోక్షముగా ఏమైనా చేయవచ్చునని, గొప్ప మాంత్రికుని చేత చేతబడి చేయించాలను కొన్నాడు. చేతబడులను చేయు సామర్థ్యమున్న మంత్రశక్తి గలవాడు నాగోతుల నాగభూషణము ఒక్కడేనని ఎవరో చెప్పగా నాగభూషణము వద్దకు పోయి ఎలాగైనా అతనిని ఒప్పించి రాజయోగానందస్వామికి మంత్రశక్తి చేత చేతబడి చేయించాలనుకొన్నాడు. అలా యోచించిన జగన్నాథ్, నాగభూషణము కొరకు బయలుదేరి పోయాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(తాను గ్రంథరూపములో ప్రచారము చేసిన ఆత్మజ్ఞానమును గురించి ప్రజలు ఏమనుకొనుచున్నారో స్వయముగా తెలుసుకోవాలనుకొన్న రాజయోగనంద స్వామి కొన్ని రోజులు, కొన్ని ఊర్లు తిరిగి రావాలను కొన్నాడు. తర్వాత బయలుదేరి మొదట మద్రాస్‌నగరమును చేరాడు. అక్కడ తన గ్రంథములు చదివినవారు ఎందరో కలరని స్వామికి తెలుసు. వారి అడ్రసులు స్వామివద్ద ఉన్నాయి. మొదట రాయపేటలోనున్న రవి కుమార్ ఇంటికి పోయాడు. నేను ఫలానా ఊరినుండి వచ్చాను. నేను రాజయోగానంద స్వామి శిష్యుడను. ఈ ఊరిలో కొన్ని సామాన్లు కావలెను. ఆశ్రమములో స్వామివద్ద మీ అడ్రస్ చూచి వచ్చాను. నాకు కావలసిన సామాను ఏ బజారులో దొరుకుతుందో నాకు తెలియదు. ఇక్కడ బజారు విషయము మీకు తెలిసివుంటుంది కదా! అందువలన ఏ బజారులో ఏ

సామాను దొరుకుతుందో మిమ్ములను అడిగి తెలుసుకోనే దానికి వచ్చానని స్వామి పూర్తి అబద్ధమాడేశాడు.)

స్వామివారి బోధలకు పూర్తి ఆకర్షితుడైన రవికుమార్, వచ్చినవాడు రాజయోగానందస్వామి అని గుర్తించలేక పోయాడు. రాజయోగా నందస్వామి శిష్యుడనని చెప్పగానే రవికుమార్ ఎంతో ఆప్యాయతగా పలుకరించాడు. మీకు కావలసిన సామాను ఫలానా బజారులో దొరుకుతా యని, ఆ బజారు అడ్రసు చెప్పాడు. తర్వాత స్వామి రవికుమార్‌ను ఇలా అడిగాడు.

**స్వామి :-** మొదట మీరెలా రాజయోగానంద స్వామి వారి జ్ఞానమును తెలుసుకొన్నారు.

**రవికుమార్ :-** మొదట నేను చాలా పురాణములు చదివాను. తర్వాత ఎందరో స్వాములు వ్రాసిన రచనలను కూడా చదివాను. అవన్నిటినీ చెప్పడము వారివంతు, వినడము మనవంతు అని అనుకుంటే సరిపోతుంది. కానీ వాటిని గురించి ఆలోచిస్తే అన్నీ ప్రశ్నలే మిగులుతాయి. వాటిలో అనుమానము లేని జ్ఞానము నాకు కనిపించలేదు. రామాయణములో రామున్ని ఆదర్శముగా తీసుకొమ్మంటారు. బహుభార్యత్వము పాప మంటారు. రాముడు ఏకపత్నీ వ్రతుడు. అతనిలాగ ఉండాలంటారు. భారతము లోనికి వచ్చేటప్పటికి బహుభార్యలు గల కృష్ణున్ని భగవంతునిగ చెప్పుతారు. అక్కడ బహు భార్యలుండడము పాపమైనపుడు, ఇక్కడ బహు భార్యలున్న కృష్ణున్ని భగవంతుడని దేనికంటున్నారని ప్రశ్నిస్తే పెద్దలు చెప్పిన దానిని విమర్శించకూడదంటారు.

పూజల విషయానికివస్తే భక్తి పారవశ్యముతో చేసే పూజలే లేవు. అన్నీ అర్థములేని పూజలే, ఈ పూజ ఎందుకు? ఈ పూజలో ఈ విధాన

మెందుకు? అంటే ఎవరు చెప్పేవారేలేరు. ఎట్లు చెప్పి ఉంటే అట్లు చేయి అనేవారే ఉన్నారు. ఇక పురాణ విషయాలలోనికి వస్తే అన్నీ కల్పిత మాటలే ఉంటాయి. మొత్తము మీద ఏ జ్ఞానమును చూచినా, ఏ పుస్తకమును చదివినా అన్నీ సంశయములతో కూడుకొని ఉండేవి. ఇపుడు రాజయోగ నంద స్వామివారు వ్రాసిన గ్రంథముల వలన అన్ని అనుమానములు పటా పంచలైపోతున్నవి. స్వామివారి రచనలలో అన్ని ప్రశ్నలకూ జవాబు లుంటాయి. మిగత పుస్తకములు చదివి అందులోని అనుమానములు పెరిగిపోయి, వాటికి జవాబులేక ఇక దేవుడేలేడను నాస్తికవాదము నాలో పుట్టినపుడు స్వామివారి రచనలు నాకు దొరికనవి. వాటితో నేను సంపూర్ణ జ్ఞానిగా మారిపోయాను. ఎవరు ఏ ప్రశ్న అడిగినా జవాబు చెప్పు స్థోమత లోనికి వచ్చాను. స్వామివారి జ్ఞానము వలననే నాలో అంత మార్పు వచ్చినది. ఇంత జ్ఞానమును తెల్పిన స్వామివారిని చూడాలని ఉంది, కొద్ది రోజులలో తప్పకవస్తాను. మీరు గురువుగారి దగ్గరకు పోయినపుడు నా నమస్కారములు తెలియజేయండి.

(అలాగేనని చెప్పిన స్వామి తాను స్వామి శిష్యునిగానే నటిస్తూ అక్కడి నుండి వచ్చేశాడు)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(తాటిమాను మునెప్ప మనుషులలో గజజ్ఞాలాంజనమును చూస్తున్న వెంకూకు వజ్రములున్న నాగుపాము కనిపించింది. దానిని వెంకు గుర్తుపట్ట గలిగాడు. కానీ దానిప్రక్కన మరియొక నాగుపాము కూడా కనిపించింది. వెంకు అదే విషయమును ప్రక్కనేవున్న నాగభూషణముకు తెలిపాడు. అందులకు నాగభూషణము "అది ఎక్కడున్నదో గుర్తుపట్టగలవా" అని అడిగాడు. "గుర్తు పట్టలేను" అన్నాడు వెంకు "అలాగైతే ఈ పామున్న

స్థలమూ, ఊరు ఏదో తెలుపమని గజజ్జాల దేవిని మనస్సులోనే అడుగు" అన్నాడు నాగ భూషణము. అప్పుడు వెంకు తన మనస్సులోనే పాము ఏ ఊరిలో ఉన్నదో, ఏ ప్రాంతములో ఉన్నదో తెలుపమని కోరాడు. అట్లు అడిగిన తర్వాత నిమిషమునకు అంజనములో కొన్ని అక్షరములు కనిపించను మొదలు పెట్టాయి. వాటిని వెంకు నిదానముగా చదవగలిగాడు. "ఇక్కడికి 425 కిలోమీటర్ల దూరములో, తోటమర్రి అను ఊరి బయట, ఉత్తరాన ఒక పర్లాంగు దూరములో ఈ పాము ఉన్నది." అను విషయమును వెంకు చదివాడు.

తప్పించుకొని 24 గంటలు కూడా పూర్తికాకముందే ఆ పాము 425 కిలోమీటర్ల దూరము ఎలా చేరిందో ఎవరికీ అర్థము కాలేదు. నాగభూషణము ఆ విషయమును కూడా అంజనములోనే తెలుసుకోవాలను కొన్నాడు. పాము అంత దూరము ఎలా చేరిందో మనస్సులోనే వెంకూను అడగమన్నాడు. వెంకు అలాగే అంజనమును అడిగాడు. ఒక అర నిమిషము తర్వాత ఇలా కనిపించను మొదలుపెట్టింది. పాము నాగభూషణము ఇంటినుండి పారిపోతూ, ఆ ఊరికి అర్థకిలో మీటరు దూరములోనున్న నేషనల్ హైవే రోడ్డు దగ్గరకు చేరింది. ఆ రోడ్డుమీద ఒక ప్రక్కన నిలబడి వున్న లారీక్రింద దూరిపోతూ లారీకి వెనుకవైపు క్రింద భాగమునగల స్టెప్నీ క్యారియర్‌లో టైరుమీద చిన్నకప్పను చూచింది. పాము ఆకలితో ఉన్నందున ఆ టైరు మీదికి మెల్లగ ఎక్కి, కప్పను నోటితో పట్టకొని మ్రింగను మొదలు పెట్టింది. అంతలోనే డబ్బాతీసుకొని దొడ్డికి పోయిన క్లీనర్ వచ్చి రైట్ చెప్పాడు. లారీ స్టార్టయింది. ఆ శబ్దమునకు పాముకు కళ్ళు కనిపించలేదు. అక్కడే టైరుమీదనే ఉండిపోయింది. లారీ రాత్రంతయూ ప్రయాణించింది. చివరకు తోటమర్రి గ్రామము దగ్గర

లారీ ఇంజను చెడిపోయి లారీ ఆగి పోయింది. వెంటనే పాము టైరు మీది నుండి దిగిపోయినట్లు వెంకూకు తెలిసింది. ఆ విషయమునే నాగభూషణమునకు తెలిపాడు.)

వజ్రములున్న పాము ప్రక్కనే ఉన్న మరో నాగుపాము సామాన్యమైన పాముకాదని వారికి తెలియదు. ఆ పాముకు గుహలోని మహాత్ముడు శక్తి నిచ్చి పంపాడు. మహాత్ముని ఆదేశానుసారము గుహనుండి బయటికి వచ్చిన పాము తమను అంజనములో చూస్తున్నట్లు గ్రహించింది. వెంటనే తోకతో కొట్టింది. ఆ వేటు ఇక్కడ అంజనము చూస్తున్న వెంకుకు తగిలింది. వెంకు అబ్బా అని ముఖము విదిలించుకొన్నాడు. పాము కొట్టినదని తెలుసు కొన్న నాగభూషణమునకు ఆశ్చర్యమైనది. అంజనమును మూసివేశాడు. పిశాచములైన పాములే అంజనములో అలా కొట్టగలవు. కానీ ఈ పామెలా కొట్టిందని నాగభూషణము యోచించసాగాడు. మునెప్ప ముఠావాళ్ళు రెండవ పాముమీద ధ్యాస వుంచక, వజ్రములున్న పామును ఎలాగైనా పట్టుకోవాలను పట్టుదలతో వెంటనే తోటమర్రి ఊరుకు బయలుదేరాలను కొన్నారు. కానీ నాగభూషణము మాంత్రికుడు కావున రెండవ పామును గురించి ఆలోచించ సాగాడు. పాముకు గొప్పశక్తి ఉంటే తప్ప అలా కొట్టలేదని తెలిసిన నాగ భూషణమునకు లోపల కొద్దిగ భయము ఉండినా, మునెప్ప మనుషుల వత్తిడికి సరే పోదాము అన్నాడు. మునెప్ప మనుషులు కిరాయికి కారును తెచ్చేదానికి పోయారు. అంతలో జగన్నాథము అక్కడికి వచ్చాడు. జగన్నాథము వెంటవచ్చిన మనిషి నాగభూషణమును పరిచయము చేశాడు. అప్పుడు జగన్నాథము నాగభూషణముతో ఇలా అన్నాడు.

**జగన్నాథము :-** నీతో ముఖ్యమైన పనివుంది. విషయమంతా ఊరికి పోయిన తర్వాత చెప్తుతాను. ఇప్పుడు వెంటనే నావెంట రావాలి.

**నాగభూషణ్ :-** లేదు. నాకు ఇప్పుడు వేరే పనివుంది రాలేను.

**జగన్నాథమ్ :-** నీవు ఇపుడే రావాలి. ముఖ్యమైన పని, లక్షరూపాయలు ఇస్తాను.

**నాగభూషణ్ :-** ఏమాత్రము వీలుకాదు. నేను ఇప్పుడు ముఖ్యమైన పనిమీద పోవుచున్నాను. ఇప్పుడు పోకపోతే మాకు దొరికేది జాగామారిపోతుంది. అది జాగా మారిపోకనే అక్కడకు పోవాలి.

(అంతలో మునెప్ప మనుషులు కిరాయి జీపు తీసుకొని వచ్చారు. జగన్నాథము మాటలు విని "నీవెవడవయ్యా పానకములో పుల్లలాగ? నాగ భూషణము నీవెంటరాడు మావెంట వస్తాడు. నీవు వచ్చిన దారినే పో" అన్నాడు. వారి మాటలువిని జగన్నాథమునకు కోపము వచ్చి ఇలా అన్నాడు.)

**జగన్నాథము :-** ఏమిరా, వచ్చిన దారినే పో! అని మర్యాదలేకుండా మాట్లాడు తావా! మీరు ఎవరో క్రొత్తవారుగా ఉన్నారు. నాకథ మీకు తెలియదను కుంటా, జాగ్రత్త! మర్యాదగా మాట్లాడండి.

**వెంకు :-** ఒరేయ్ మేము నీ అబ్బలాంటివాళ్ళకు అరచేతిలో నీళ్ళు తాపిన వాళ్ళము. మా పనికి అడ్డము వచ్చింది కాకుండా, మమ్ములనే జాగ్రత్త అంటావా. నీ దగ్గర డబ్బుందని పెద్ద షావుకారిననుకున్నావేమో, నిన్ను కూడా కొనే స్థోమత మాకుంది నీవే మాకు మర్యాద ఇచ్చి మాట్లాడు.

(అంతలో నాగభూషణము కలుగజేసుకొని జగన్నాథమునకు నచ్చ జెప్పాడు. "వీళ్ళు సర్కస్ మనుషులు, వీరిని మంచి చేసుకోవాలి. చెడ్డ చేసుకోకూడదు. వీరిలో పెద్ద బరువులు ఎత్తే పహిల్వాన్లు కూడా ఉన్నారు. వీరితో ఎక్కువ మాట్లాడకూడదు" అని చిన్నగ చెప్పాడు. చాటుగా నాగభూషణము చెప్పిన మాటలు విని జగన్నాథము తగ్గిపోయాడు. మునెప్ప మనుషులకు క్షమాపణ చెప్పి సర్దుకపోయాడు. తర్వాత పది రోజులకు

తనతో కలువమని నాగభూషణము జగన్నాథముకు చెప్పి మునెప్ప మనుష లతో సహా బయలుదేరి పోయాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(రాజయోగానంద స్వామి తన జ్ఞానము ప్రజలలో ఏమి మార్పు తెచ్చిందో చూడాలని ఆశ్రమము వదలి పోవునపుడు, తిరిగి తాను వచ్చేంత వరకు రాఘవను, ఆటవికులను ఆశ్రమములోనే ఉండునట్లు నియమించి పోయాడు. అందువలన రాఘవ మరియు ఆటవికులు ఆశ్రమములోనే ఉన్నారు. రాఘవ తన విషయమును కూడా స్వామికి ఇంకా చెప్పలేదు. అందువలన స్వామి వచ్చిన తర్వాతనే ఆయనకు విషయమును చెప్పవలె ననుకొన్నారు. స్వామి రాకకొరకు ఎదురు చూస్తు కాలము గడుపుచుండిరి. ఒక దినము దారిన పోయే ప్రయాణికులు, వారు వెంట తెచ్చుకొన్న అన్నమును తినేందుకు, త్రాగునీరు కోసము ఆశ్రమానికి వచ్చారు. ఆశ్రమము, దారికి కొద్ది దూరములో ఉండుట వలన అప్పుడప్పుడు మంచి నీటికొరకు ఎవరైనా వస్తుంటారు. ఆరుమంది వచ్చారు. అందరూ అన్నము తినేదానికి కూర్చున్నారు. కానీ ఒక్కడు మాత్రము అన్నము ముందర కూర్చొని అన్నమును ఏమాత్రము తినకుండా తిరిగి లేచి ప్రక్కన కూర్చొన్నాడు. మిగత ఐదుమంది భోజనము చేశారు. ప్రక్కన కూర్చున్న వాడు కడుపునొప్పితో బాధపడుచుంటే మిగతవారు వానిని ఓదారుస్తున్నారు. వారిని చూచిన రాఘవ ఏదో కడుపునొప్పిలే అనుకున్నాడు. కొద్దిసేపటికి వాని కడుపు ఎక్కువ లావుగా తయారైనది. ముందు సాధారణముగా ఉన్న కడుపు కొద్దిసేపటికే అలా లావుకావడము రాఘవకు విచిత్రముగా కనిపించింది. అప్పుడు రాఘవ వారిలో ఒకరిని ఇలా అడిగాడు.)

**రాఘవ :-** ఆయన అన్నము కూడా తినలేదు. ఆకలి కడుపుతోయున్న

వానికి కడుపునొప్పి ఏమిటి? మరియు విచిత్రముగా కడుపు ఉబ్బిపోవడ మేమిటి? ఇది ఏమి రోగము.

**ప్రయాణికుడు :-** ఇది రోగము కాదయ్య బాబూ! ఇది దయ్యము, మా కర్మకొద్దీ దాపురించింది. మూడు సంవత్సరముల నుండి బాధపెట్టుచున్నది. ఎవరూ నయము చేయలేక పోయారు. ఇపుడు ఈ ప్రక్క ఊరికి మళయాల మాంత్రికుడు వచ్చాడట, ఆయన ఎటువంటి దయ్యమునైనా వదలగొట్టి కాపాడగలడట, అందువలన ఆయనవద్దకు పోవుచున్నాము. అయితే బయలుదేరినప్పటినుండి ఈ బాధ మాటిమాటికి వస్తున్నది. ఇప్పుడు చూచారుగా అన్నమును కూడా తిననియ్యలేదు.

**రాఘవ :-** ఇది దయ్యము వలన వచ్చే బాధయని మీకెలా తెలుసు. కడుపులో ఏదైన రోగముండి ఇలా కావచ్చును కదా!

**ప్రయాణికులు :-** లేదయ్యా బాబూ, ఇది నిజముగా దయ్యమే. మేము కూడా మొదట మీలాగే అనుకొనివుంటిమి. కానీ ఇతనిలోని దయ్యమే అతని మీదికి వచ్చి మాట్లాడింది. అప్పటినుండి ఇది రోగము కాదు దయ్యమని తెలిసింది.

(దయ్యముల విషయములు తెలియని రాఘవకు వారి మాటలు విచిత్రముగా తోచాయి. క్రొత్త విషయములలో సత్యమెంత, అసత్యమెంత అని తెలుసుకొను రాఘవ దాని విషయము పూర్తిగా తెలుసుకోవాలను కొన్నాడు.)

**రాఘవ :-** ఇలా దయ్యము బాధ మీకొకరికేనా లేక మీలా బాధపడువారు ఇంకా ఉన్నారా?

**ప్రయాణికుడు :-** ఎందుకు లేరు, చాలామంది ఉన్నారు. ఎన్నో రకముల

బాధపడుచున్నాము. ఇటువంటి బాధలు డాక్టర్లకు, మందులకు అంతు బట్టవు. వీటిని భూతవైద్యులు మాత్రమే నయము చేయాలి. ఆ భూత వైద్యులు ఎక్కడో ఒకచోట ఉంటారు. అయినా వారు దానికని, దీనికని డబ్బులు లాగుతారు. కానీ దయ్యము మాత్రము పోదు. ఒక భూతవైద్యుని చేతిలో ఒక దయ్యము పోతే, పది దయ్యములు పోకుండా మొండికి వేయుచున్నవి. ఇప్పటికి మేము చాలామంది భూతవైద్యుల వద్దకు పోయాము. డబ్బులు పోయాయి కానీ మా బాధ తీరలేదు. ఏమయ్యా పోలేదే అంటే మేము చేసేది చేశాము అంటారు. ఏ దేవునికి మ్రొక్కినా, ఎన్ని ముడుపులు కట్టినా మా బాధ తీరలేదు. ఎక్కడ వైద్యుడున్నాడంటే అక్కడికి పోవుచున్నాము. మా కర్మను ఏ మహానుభావుడు తీర్చగలడో. ఉన్నది ఒకే కొడుకు పెళ్ళైయి నెలకూడా కాకుండానే ఈ బాధ తగులుకొన్నది. వాడు భార్యతో కాపురము కూడా చేయలేకున్నాడు. ఇక్కడున్న వైద్యులందరూ అయిపోయారు. కేరళనుండి ఎవరో వైద్యుడు వచ్చాడని విని పోవుచున్నాము. బయలుదేరినప్పటినుండి అన్నము కూడా తినలేదు. వానిని చూస్తే ఏడుపు మాకు వస్తావుంది.

(వారిని చూచి వారి బాధను అర్థము చేసుకొన్నాడు. కానీ అది దయ్యము వలన కలిగే బాధయని రాఘవకు నమ్మకము లేదు. అందువలన అది రోగమే అయివుంటుందని అనుకొన్నాడు. తనకు తెలిసిన మూలికలతో కడుపునొప్పిని పోగొట్టవచ్చును అనుకున్నాడు. అయితే ఆ మూలికలు ఇక్కడ దొరకవు. వాటికోసము తనవెంట వచ్చిన వారిని అడవికి పంపి వాటిని తెప్పించుకోవాలనుకొన్నాడు. అయితే అంతవ్యవధి లేదు. అప్పుడు ఏదో ఒకటి చేసి వానికి కడుపునొప్పిని తగ్గించాలనుకొన్నాడు. చేతితో పొట్టను అదుముట వలన కొంత నొప్పిని తగ్గించవచ్చునని అనుకొని,

కడుపు నొప్పి ఉన్నవానివద్దకు పోయి నీ కడుపునొప్పి ఎక్కడున్నది, ఇక్కడనా అని అతని కడుపుమీద తన చేతిప్రేలిని పెట్టి అడిగాడు. రాఘవ చేయి పెట్టినచోటే అతనికి కడుపునొప్పి ఉండేది. అయితే రాఘవ తన చేతి ప్రేలును కడుపు మీద పెట్టిన వెంటనే అతనికి నొప్పి ఏమాత్రము లేకుండా పోయినది. వెంటనే ఆ వ్యక్తిలో మార్పువచ్చింది. అతను నాకు కడుపునొప్పి పోయిందని సంతోషముగా చెప్పాడు. అతను అలా చెప్పడములో అతని వెంట వచ్చిన వారు సంతోషించారు. అతని మాట విన్న రాఘవకు ఆశ్చర్యమైనది. అతను నిజము చెప్పుచున్నాడా, అబద్ధము చెప్పుచున్నాడా అని అనుమానము వచ్చినది. తాను ఏమీ చేయకనే అతని కడుపునొప్పి ఎలా పోతుంది అని అనుమానము ఏర్పడినది. అంతవరకు కడుపునొప్పితో బాధపడుచున్న వారి మనిషి ఒక్కమారుగా రాఘవ వలన నొప్పినుండి బయటపడడము వారికి ఆశ్చర్యమైనది.

రాఘవకు మాత్రము అతని మాటమీద నమ్మకము కలుగలేదు. నేను ఏమీ చేయలేదు కదా! నొప్పి ఎక్కడుందియని చేయిపెట్టాను. అంత మాత్రముననే మొత్తము నొప్పి పోయిందంటాడేమిటి, వీడు ఏదో నటన చేయుచున్నాడనుకొన్నాడు. అయినా వీరితో నాకెందుకు చర్చ అనుకొని "బాగైనది కదా! ఇకపోయిరాండి" అన్నాడు. రాఘవ మాటవిన్నవారు ఇలా అన్నారు. "ఇంత సులభముగా ఇంతవరకు ఎవరూ ఈ నొప్పిని లేకుండా చేయలేదు. ఈ నొప్పి ప్రతి దినము వస్తుంది. రెండు రోజులు ఇక్కడేవుండి ఇక ఆ నొప్పిని రాకుండ వైద్యము చేయించుకొని పోతాము. మీరు ఎంత అడిగితే అంతడబ్బు ఇస్తాము. మాకు పూర్తి నయము చేసి పంపండి" వారి మాట విన్న రాఘవ వీరిని బాగా కరిపించుకొంటినే అనుకొన్నాడు. వీడేమో నొప్పి అని నటన చేస్తున్నాడు. వారేమో దయ్యము బాధ అనుకొంటున్నారు. నన్నేమో పెద్ద వైద్యుడని అనుకొన్నారు. వీడు

రేపు మళ్ళీ నొప్పి వచ్చిందంటే నేనేమి చేయాలి. ఉన్న మర్యాద కాస్త పోతుంది. అందువలన వీరిని ఇక్కడినుండి పంపివేయడము మంచిదనుకొని ఇలా అన్నాడు.)

**రాఘవ :-** నేను చెయ్యిపెట్టిన తర్వాత ఆ నొప్పి ఎలా వస్తుంది. రేపురాదు, మర్నాడు రాదు. ఊరక ఇక్కడెందుకుండాలి. మీరు పోవచ్చు.

**ప్రయాణికుడు :-** లేదయ్యా బాబూ, ఒక దినమైన నీవద్ద ఉంటే బాగుంటుందనుకొన్నాము.

**రాఘవ :-** ఇక్కడ నిష్టతో పూజలు జరుగుచున్నవి. పూజ చేసే సమయములో ఇక్కడ క్రొత్తవారు ఎవరూ ఉండకూడదు. అందువలన పొమ్మంటున్నాను. నెలరోజుల వరకు క్రొత్తవారు ఎవరూ ఉండకూడదు.

**ప్రయాణికుడు :-** వీనికి నొప్పివస్తే మేము ఎక్కడికి పోవాలి? నెలరోజులు రాకూడదంటే ఎలాగ?

**రాఘవ :-** నేను ఇక రాదని చెప్పానుగా, అది వస్తుందని మీరెందుకు అనుకోవాలి? నా మాట మీద నమ్మకము పెట్టుకొని పోండి. అది ఇకరాదు. (రాఘవ మాటవిన్నవారు అది రాకపోతే అంతకంటే సంతోషమేముంది అనుకొని అక్కడినుండి పోయారు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(రాజయోగానంద స్వామి ప్రజల మధ్యలో తిరుగుచూ తన జ్ఞానము మీద ప్రజలకు అవగాహన ఎలా ఉందో తెలుసుకోవడానికి మరియొక భక్తుని ఇంటికి పోయాడు. తాను రాజయోగానంద స్వామి శిష్యుడనని తెలిపి, స్వామివారు “ఈ గ్రంథమును మీకిమ్మన్నాడు. ఈ దారిన పోతున్నాను కావున ఇస్తానని తెచ్చాను”. అని తాను రచించిన ఒక గ్రంథమును ఆ భక్తునికి ఇచ్చాడు. ఆ భక్తుడు కూడా గ్రంథముల ద్వారా పరిచయమే.

కావున వచ్చిన వ్యక్తి రాజయోగానంద స్వామియేనని తెలుసుకోలేక పోయాడు. గ్రంథమును తీసుకొన్న ఆ భక్తుడు స్వామితో ఇలా అన్నాడు.)

**భక్తుడు :-** స్వామివారు ఎంతో ఆప్యాయతతో ఈ గ్రంథమును పంపాడు. చాలా సంతోషము స్వామివారికి నా నమస్కారములు తెలుపండి. మీరు ఆశ్రమానికి గురువుగారి దగ్గరకు అప్పుడప్పుడు పోతుంటారా?

**స్వామి :-** అవును వారానికి రెండుమార్లు వెళ్ళుచుంటాము. అక్కడ గురువు గారు చెప్పే జ్ఞానమును శ్రద్ధగా వింటుంటాము.

**భక్తుడు :-** అలాగా మీరెంతో అదృష్టవంతులు. దగ్గరవుండి గురువుగారి ముఖత జ్ఞానమును వింటున్నారు. మేము చాలా దూరములో ఉన్నాము. ఇంతవరకు గురువుగారిని చూడడానికి మేము నోచుకోలేదు. ఆయన గ్రంథముల ద్వారా తెలిపిన సమాచారమును చదివి ఎంతో జ్ఞానాన్ని తెలుసు కోగలిగాము. మొదట మాలో ఎంతో అజ్ఞానముండేది. మేము ఇతరులు వ్రాసిన కొన్ని ఆధ్యాత్మిక పుస్తకములను చదివి మేము ఎంతో గొప్ప జ్ఞానులము అనుకొనెడివారము. తర్వాత అదృష్టవశాత్తు స్వామిగారు వ్రాసిన గ్రంథ మొకటి చదివాను. ఆ గ్రంథములో ఎన్నో నాకు తెలియని జ్ఞాన విషయములను తెలుసుకొన్న తర్వాత అంతవరకు నాలో ఎంత అజ్ఞానముండేదో అప్పుడు అర్థమైనది. అంతవరకు నేను గొప్ప జ్ఞానిని అనుకొనే వానిని. స్వామివారి గ్రంథముతోనే నాకు ఎన్నో విషయములు తెలియవనీ, నేను తెలుసుకోవలసింది చాలావున్నదనీ అప్పుడర్థమైనది. అప్పటినుండి స్వామి వ్రాసిన గ్రంథములను చదువుచున్నాను. ఈనాడు స్వామి రచనలు వలన నేను కొంత జ్ఞానిగా మారానని తృప్తిగా ఉన్నది.

**స్వామి :-** అలాగా! మీరు స్వామి వారి రచనలనుండి మీకు తెలియని విషయములు ఏవి గ్రహించారు?

**భక్తుడు :–** ఒక్క విషయమేమిటి, ఎన్నో లెక్కలేనన్ని విషయములను తెలుసు కొన్నాను. మొదట నేనొక భక్తునిగా దైవరాధన చేసెడివాడిని. విభూది ధరించేవాడిని, కొబ్బరికాయలు కొట్టేవాడిని, గోవిందా అని గొంతెత్తి అరిచే వాడిని. ఆనాడు నేను చేసేదే నిజమైన భక్తి అనుకొనెడివాడిని. కానీ స్వామివారు తన గ్రంథములో నీవు ఏ అర్థముతో గోవిందా అంటున్నావు? ఏ అర్థముతో విభూది ధరిస్తున్నావు, అని అన్నిటినీ నిలదీసి ప్రశ్నించినపుడు నేను చేసే ప్రతి పని అర్థములేనిదని అప్పుడు తెలిసింది. ప్రక్కవారిని చూచి చేస్తున్నాను తప్ప, ఇది ఫలానా అర్థముతో కూడుకొని ఉన్నదని తెలిసి చేయడములేదు. ఇటువంటి పరిస్థితిలో అంతో ఇంతో భక్తిగలవారము అనుకొన్న వారంతా గొర్రెల దాటి అన్నట్లు ఒకరును చూచి ఒకరు చేయడము తప్ప ఇతరత్రా అర్థము తెలియదనుకొన్నాను. ఇటువంటి సమయములో అన్నిటికీ ప్రశ్న జవాబులు రెండూ ఆయనే చెప్పుచూ, ఎవరికీ తెలియని విషయములన్నీ గ్రంథరూపములో వివరించాడు. ఇప్పుడు పూజ అంటే ఏమిటో వాటి ఆచరణాల అర్థమేమిటో పూర్తి తెలిసింది. ఒకనాడు తెలియక ఎంత అజ్ఞానములో ఉంటినో, ఈనాడు తెలిసి ఎంత జ్ఞానములో ఉన్నానో నాకే అర్థమైనది. ఈనాడు చాలామంది చేసే పూజల వెనుక కోర్కెయే ముఖ్యమైన విషయముగా ఉన్నది. ఒకప్పుడు నేను కూడా ఏ పూజ చేసినా ఏదో ఒక కోర్కెతోనే చేసేవాడిని. చేతులెత్తి నమస్కరిస్తున్నా మంటే ఆ నమస్కారము దేవున్ని ఏదో ఒక కోర్కె కోరే నిమిత్తమే ఉంటుంది. కానీ మనము చేసే పూజల వెనుక దైవసాన్నిధ్యమును చేరే అర్థమెంతో ఉందనీ, ప్రతిపూజ ఎంతో అర్థముతో కూడుకొనివున్నదనీ నేడు స్వామి వారి రచనల వలన తెలిసినది. స్వామివారు పూజా విధానముల నుండి గొప్ప యోగ విధానముల వరకు అర్థము చెప్పారు. ఏది ఏమైనా స్వామి వారి కృషి మాలాంటి వారిని ఎందరినో మార్చి సఫలీకృతమైనది.

(తన రచనలు కొందరి మీద ఎంతటి ప్రభావాన్ని చూపాయో, ఎంతటి మార్పు తెచ్చాయో రాజయోగానంద స్వామి స్వయముగా గమనించాడు. అతని నుండి ఇంకా కొంత సమాచారమును తెలుసుకొను నిమిత్తము ఇలా అన్నాడు.)

**రాజయోగా :-** దేశములో ఎందరో భక్తి కల్గినవారున్నారు. వారందరు బహుశ నీవన్నట్లు ఏదో ఒక పద్ధతిగా చేయువారే, కానీ నిజముగా వారికి అర్థము తెలిసివుండదు. అలాంటివారు స్వామి గ్రంథములను చదవడము వలన వారిలో కూడా మార్పువచ్చి సంపూర్ణ జ్ఞానులుగా మారివుంటారా?

**భక్తుడు :-** సత్యము తెలుసుకోవాలను దృష్టితో ఎవరు చదివినా తప్పకుండా మారుతారు. మూర్ఖముగా మొండివాదన చేయువారు ఎప్పటికీ మారరు. వారికి తెలుసుకోవాలని ఉండదు. తమకు అన్నీ తెలుసు అను ఉద్దేశములో ఉంటారు. ముఖ్యముగా స్వామివారి రచనలు దాదాపు 40 సంవత్సరముల వయస్సులోపలనున్న వారందరిని మార్చగలిగాయి. అంతకంటే ఎక్కువ వయస్సున్నవారు తక్కువగా మార్పు చెందారు.

**రాజయోగా :-** అదేమిటి, వయస్సు గడచిన వృద్ధులకే జ్ఞానము బాగా అర్థమైవుంటుందనుకొంటాను. మరి నీవేమో చిన్న వయస్సువారికే ఎక్కువ వంటబట్టిందంటున్నావు. అందులోని విశేషమేమిటి?

**భక్తుడు :-** చిన్న వయస్సులో ఉండువారు తమకు అన్ని విషయాలు తెలియవు. తెలియని విషయాలను తెలుసుకోవాలని ఉంటారు. మరి పెద్దవయసు వారేమో మాకు అన్నీ తెలుసు, మేము తెలుసుకోవలసినది ఏమీలేదు అనే ఉద్దేశ్యములో ఉంటారు. చిన్న వయస్సువారు కల్పిత కథలనూ, పురాణ గాథలను చదివివుండరు. అందువలన వారి మనస్సులో ఏమీ ఉండవు. కావున స్వామివారి జ్ఞానము స్వచ్ఛముగా వారి మనస్సుకు

అంటుకోగలదు. మరి వృద్ధులైతే వారు పురాణగాథలు చదివివుంటారు. ఎన్నో కల్పిత కథలను కాలక్షేపము కొరకు వినివుంటారు. అవి వారి మనస్సులో అంటుకొని వుంటాయి. అటువంటి వారికి సత్యమైన విషయములు తెలిసినప్పటికీ ముందుగానే వారి మదిలోనున్న విషయముల కంటే ఇవి రుచింపవు. అలాంటపుడు సత్యమైన విషయములనే హేళన చేసి మాట్లాడుదురు. కానీ మనకు ముందు తెలిసిన వాటికీ వీటికీ ఏమి తేడా అని యోచించరు. వారికి ముందు తెలిసిన అసత్యములను వదలలేరు, సత్యమును గ్రహించ లేరు. కొంత జ్ఞానము తెలుసుననీ, కొంతమందిలో పేరున్న మేమా ఇతరులు చెప్పిన దానిని తెలుసుకోవలసింది అను గర్వము కూడా ఉండును. అందువలన వృద్ధులకంటే యువకులకే ఎక్కువగా స్వామివారి జ్ఞానము అంటుకొన్నదని అనుకొంటున్నాను.

**స్వామి :-** మీరు ఊహించి చెప్పుచున్నారా, లేక ఏదైనా అనుభవము వలన అంటున్నారా?

**భక్తుడు :-** కొన్ని అనుభవముల వలననే అంటున్నాను. స్వామివారి గ్రంథములను నేను చదివిన తర్వాత కొంతమంది వృద్ధులకు మీరు చదవండి అని ఇచ్చాను. కానీ వారు వాటినుండి గ్రహించినది ఏమీలేదు. వారు విమర్శలు చేయడము తప్ప వారికి లాభించినది ఏమీ లేదు.

**రాజయోగా :-** పొగడ్తలకంటే విమర్శలనే ఎక్కువ స్వీకరించాలి. ఎదుటి వారి విమర్శల ద్వారా మనలోని తప్పులను సరి చేసుకోవచ్చని స్వామి వారు చాలామార్లు చెప్పారు. అలాంటపుడు విమర్శలను సేకరించి స్వామి వారికి తెలియజేయవచ్చును కదా!

**భక్తుడు :-** స్వామివారి ఉద్దేశ్యము మంచిదే. వీరు చేయు విమర్శలు ఏవైతే ఉన్నాయో అవి విమర్శల పద్ధతిలో లేవు. అసూయతో మాట్లాడు

మాటలు తప్ప అవి విమర్శలు కావు. తలతోక లేని ఆ మాటలను స్వామిగారికి చెప్పేదానికంటే ఊరకుండడము మంచిది.

**రాజయోగా :-** స్వామిగారిని విమర్శించిన అటువంటి విమర్శలు ఏవైనా మీ అనుభవములో ఉన్నాయా?

**భక్తుడు :-** ఉన్నాయి. అందులో ముఖ్యమైన దానిని గురించి చెప్పుతాను విను. గుంతకల్లులో హిందూపరిషత్ ఆఫీసులో జరిగిన విషయమిది. అక్కడ నేను, స్వామివారు వ్రాసిన జ్ఞానము చాలాగొప్పగా ఉన్నదనీ, ఆయన మన మతములో పుట్టినందుకు మనమందరము గర్వించ తగ్గ విషయమని చెప్పాను. అప్పుడు అక్కడున్న హిందూపరిషత్ సభ్యుడు మరియు కమ్మ కులమునకు చెందిన రమేష్‌చౌదరికి నాకు సంభాషణ జరిగింది.

**రమేష్ :-** రాజయోగానంద స్వామి హిందువు కాదు క్రైస్తవుడు. ఆయన హిందువుల ముసుగులో క్రైస్తవ మతమును గురించి బోధిస్తున్నాడు.

**నేను :-** అంత మూర్ఖముగా మాట్లాడిన ఆ వ్యక్తిని చూచి, ఇంతకూ ఇతను మనిషేనా అని అనుమానము వచ్చినది. మనిషే అయితే అంత మూర్ఖముగా ఎలా మాట్లాడుచున్నాడని ఎందుకు అలా చెప్పుచున్నావని అడిగాను.

**రమేష్ :-** ఆయన సృష్ఠికర్త కోడ్ 963 అని ఒక పుస్తకము వ్రాశాడు. అది క్రైస్తవ సంబంధమైనది.

**నేను :-** ఆ పుస్తకమును నేను చదివాను. నీవు చదివావా? చదవకనే మాట్లాడుచున్నావా?

**రమేష్ :-** అటువంటి పుస్తకములను నేను చదవను. అది మా మతమునకు వ్యతిరేఖమైనది.

**నేను :-** నీవు చదవకుండా హిందూమతమునకు వ్యతిరేఖమైనదని ఎలా చెప్పగలుగుచున్నావు?

**రమేష్ :-** సృష్ఠికర్త అను పదమును క్రైస్తవులే వాడుతారు.

**నేను :-** సృష్ఠికర్త అను పదము ప్రపంచము పుట్టినప్పటినుండి ఉన్నది. సృష్ఠికర్త అను పదమును పూర్వము ఎందరో ఎన్నో సందర్భములలో చెప్పారు. అటువంటి పదమును చరిత్ర తెలియని నీవు మనది కాదు క్రైస్తవులది అంటావా? అనాదిగానున్న సృష్ఠికర్త అను పదమును నిన్న మొన్న వచ్చిన క్రైస్తవ మతమునకు నీవేమైనా లీజుకు ఇచ్చావా? ఈ మాటను నీవు హిందువుగా ఉండి మాట్లాడడమే విచిత్రము.

**రమేష్ :-** నీకు ఆయన విషయము అర్థము కాలేదు. భగవద్గీతను అడ్డము పెట్టుకొని హిందువులను క్రైస్తవులుగా మారుస్తున్నాడు.

**నేను :-** నా అనుభవముతో చెప్పుచున్నాను. హిందువులు బైబిలు చదువు వారున్నారు. కానీ క్రైస్తవులు ఎప్పటికీ వారి బైబిలును వదలి వేరే పుస్తకమును ముట్టుకోరు. క్రైస్తవుడు వారి బైబిలులోని విషయములు చెప్పి క్రైస్తవ మతములోనికి మార్చుచున్నారంటే అర్థముంది. కానీ భగవద్గీతను అడ్డము పెట్టుకొని క్రైస్తవులుగా మార్చడము ఇంతవరకు ఎక్కడా జరుగలేదు. ఏ క్రైస్తవుడూ ఇంతవరకు భగవద్గీతను ముట్టుకోవడము నేను చూడలేదు. భగవద్గీతను అడ్డము పెట్టుకొని క్రైస్తవమును చెప్పుచున్నాడనుటకు నీ దగ్గర ఏమైనా ఆధారము కలదా?

**రమేష్ :-** నీకు అర్థము కాలేదు అంకుల్, ఆయన మన భగవద్గీతలో లేని దానిని సృష్ఠికర్తకోడ్ 963 అని పురుషోత్తమ ప్రాప్తియోగము 16,17 శ్లోకములు అని వ్రాశాడు. అలాంటి నంబర్ మన గీతలో లేదు. దీనికి ఏమంటావు?

**నేను :-** నీది తెలివి తక్కువ అంటాను. ఇంకా అంటే నీవు హిందువే కాదు అంటాను. నాకు 70 సంవత్సరముల వయస్సు. నేను ఇంతవరకు

ఎన్నో భగవద్గీతలు చదివాను. స్వామివారు వ్రాసిన భగవద్గీతను కూడా చదివాను. మనదేశములో వ్రాయబడిన మూడువందల ఇరవై (320) భగవద్గీతలను మించిన జ్ఞానమును స్వామి వ్రాసిన గీత అందించింది. ఈ మాటను నేను ఒక్కడినే కాదు. ఆయన వ్రాసిన గీతను చదివిన ప్రతివాడు చెప్పే మాట ఇది. నీకు జ్ఞానము అంటే ఏమిటో తెలియదు. అంతపెద్ద స్వామినే నీవు అజ్ఞానముగా మాట్లాడితే ఎలా? నీవు, నేను హిందువును అని చెప్పుకొంటూ ఈనాడు ఎవరికీ తెలియని హిందూధర్మములను తెలుపు స్వామిని విమర్శించి మాట్లాడడము ఒక హిందువుగా నీకు తగిన పనేనా? ఆయన సృష్టికర్త కోడ్ 963 అని వ్రాసి దానికి మూలమును భగవద్గీతలో వివరముగా చూపాడు. నీవు ఆ పుస్తకమును చదివింటే నీకు అర్థమయ్యేది. ఒక క్రైస్తవ గురువు సృష్టికర్త కోడ్ 666 అని పుస్తకము వ్రాస్తే హిందువులము అని పేరు పెట్టుకొన్న ఎవరుగానీ దానిని ఖండించలేదు. స్వామి వారు స్పందించి సృష్టికర్త మీకొక్కరికే కాదు. మీ మతము పుట్టకముందు నుండి ఉన్నవాడు సృష్టికర్తయని చెప్పి వారు వ్రాసిన దానికి వ్యతిరేఖముగా సృష్టికర్త కోడ్ 963 అని వ్రాశాడు. మీరు చేయలేని పనిని ఆయన చేశాడు. అంతేకాక బైబిలులో ఆదికాండము అబద్ధాల పుట్ట అని అదే పుస్తకములో వ్రాశాడు. ఇంతవరకు మేము హిందువులము అని పేరు పెట్టుకొన్న వ్యక్తులుగానీ, సంస్థలుగానీ ఆదికాండము అబద్ధాలపుట్ట అని ఎవరైనా అన్నారా? అలా అనుటకు మీకు ధైర్యము లేకున్నా, ధైర్యముగా చెప్పిన స్వామీజీని క్రైస్తవుడని ఎలా అంటున్నారు. నేను ఎన్ని రోజులు బ్రతికినా ఫరవాలేదు నా జ్ఞానము చిరస్థాయిగా ఉండాలని ఇతర మతములను కూడ లెక్కచేయకుండా ఉన్నది ఉన్నట్లు చెప్పుచున్నాడు. మీరు హిందూ సంస్థలని పేరు పెట్టుకొని రాజకీయలబ్ధి పొందాలని చూస్తున్నారు. నేను చెప్పునది నిజమో కాదో నీవే చెప్పు.

**రమేష్ :-** నీవు ఎన్నైనా చెప్పు అంకుల్. ఆయన మన మతము యొక్క పేరే మార్చేశాడు. మనది హిందూమతమని ముందునుండి చెప్పుకొంటు న్నాము కదా! అటువంటి దానిని ఆయన ఇందూమతమని అంటున్నాడు. అంతేకాక మనది మతము కాదు పథము అంటున్నాడు.

**నేను :-** మనది మతము కాదు పథము అని జవహార్‌లాల్ నెహ్రూ కూడా అన్నాడు. వివేకానందుడు కూడా అన్నాడు. వివేకానందుడు, నెహ్రూ అనగా తప్పుకానిది ఈయన అంటే తప్పు అయిందా! హిందూ అను పదమును ఇందూ అని చెప్పాడు అంటున్నావు. అలా ఎందుకనాలో **"ఇందూ సాంప్రదాయము"** లను గ్రంథములో వివరముగా చెప్పాడు కదా! దానిని నీవు చూచావా చూడకనే మాట్లాడితే మంచిదా? ఇందూ అను శబ్దము మొదట ఉండేదని కాలక్రమేపి హిందూగా మారినదని కూడా చెప్పారు కదా! ముందు నీవు ఆయన వ్రాసిన గ్రంథములు చదువు. నీ తెలివి ఎంతదో ఆయన జ్ఞానము ఎంతదో తెలుస్తుంది. నేను రెడ్డిని, స్వామి చౌదరి, నేను ఆయన గొప్పతనమును గురించి చెప్పుచున్నాను. నీవు చౌదరివై కొంతైనా అభిమానము కూడా లేకుండా ఆయనను గురించి ఏమీ తెలియకుండా మాట్లాడమే ఎట్లుందో చూచుకో. నేను చివరిగా ఒకమాటను చెప్పుచున్నాను. మీ చౌదరి కులములో ఇంతవరకులేని వజ్రము పుట్టిందనుకో. ఆయన మన దేశములో పుట్టిన సాటిలేని జ్ఞాని, తిరుగులేని యోగి అనుకో.

**రమేష్ :-** ఆయనను అలా పోల్చుకోవడానికి ఆయనేమైనా, వివేకానందుడా లేక వీరబ్రహ్మముగారా?

**నేను :-** సరే ఇప్పుడు నీవన్నమాట దగ్గరకే వస్తాను. రాజయోగానంద వివేకానందాకాదు, వీరబ్రహ్మమూగాదు. స్వయాన వీరబ్రహ్మముగారే

నాలుగువందల సంవత్సరములనాడు వ్రాసిన కాలజ్ఞానములో **"ప్రబోధా శ్రమము ఉన్నతమైన జ్ఞానముకలది"** అని వ్రాయడమేకాక, **"ప్రబోధా శ్రమము వారు శయనాధిపతి గుణము కల్గియున్నారు"** అని వ్రాశాడు. **"శయనాధిపతి యైన ఆనందగురువే, నాకు మీకు గురువు"** అని కూడా వ్రాశాడు. స్వయాన బ్రహ్మముగారే రాజయోగానందను తన గురువుగా చెప్పుకొన్నపుడు, ఈయన బ్రహ్మముగారని నేనెలా చెప్పగలను. ఇకపోతే హిందూమతములో వివేకానందుని నీవు గొప్పగా చెప్పుకొనినా రాజయోగానందస్వామి వివేకానందునికి సమానుడుకాదని నేను కూడా చెప్పుచున్నాను. ఎందుకనగా వివేకానందునివలె ఏసుప్రభువును నమస్కరిస్తానని రాజయోగానంద ఎప్పుడూ చెప్పలేదు. రాజయోగానంద ఇందూధర్మములను బోధించు చుండగా ఈయనను మీరు క్రైస్తవమత ప్రచారకులనినపుడు 1896 డిశంబర్ 25 తేదీన క్రిస్మస్ రోజు వాటికన్ సిటిలోని పీటర్స్ చర్చిలో ప్రభువు ప్రార్థనలో పాల్గొనిన వివేకానందున్ని క్రైస్తవుడు అనాలా? అసూయతో మాట్లాడక ఒక్క విషయమును యోచిస్తాము. స్వామి వివేకానంద సమగ్ర, సప్రమాణిక జీవితగాథ 2వ భాగములో 17వ పేజీయందు రెండవ పేరాలో స్వయాన వివేకానందుడు అన్న మాటలు ఇలా ఉన్నవి. "నేను కూడా పాలస్తీనాలో క్రీస్తుతో కలిసి జీవించి ఉంటే ఆయన పాదాలను కన్నీటితోకాదు, నా హృదయ రుధిరముతో కడిగి ఉండేవాన్ని" ప్రభువు పాదాలను తన రక్తముతో కడిగి ఉండేవాడినని వివేకానందుడు అన్నాడు కదా! అయితే ఆయన క్రైస్తవ మతమును ప్రచారము చేసినట్లేనా? రాజయోగానంద ఒక్క దేవునికి తప్ప ఎవరికి మొక్కుతాననలేదే!, ఎవరిని ప్రార్థన చేయలేదే! అలాంటపుడు వివేకానందున్ని గొప్ప హిందువని చెప్పుకోవడమూ, రాజయోగనందను క్రైస్తవ ప్రచారకుడనడములో అర్థము ఏమైనా ఉన్నదా? చెప్పు రమేష్ నా

మాటకు జవాబు చెప్పు. ఊరకనే నోరు ఉందని మాట్లాడితే దానివెనుక ఎంత పాపము వస్తుందో మీకు అర్థము కాలేదు. నీవు ఇప్పుడు రాజయోగానందను వివేకానందుడా, వీర బ్రహ్మముగారా అన్నావు కదా! అంతటి వాడు కాదు అని నేను చెప్పాను నా జవాబు అర్థమైయిందా.

(ఈ విధముగా ఆ భక్తుడు స్వామిని గురించి తనలో దాగివున్న అభిమానమునంతయూ ప్రస్తావించినట్లయినది. అప్పుడు స్వామి ఇట్లన్నాడు.)

**స్వామి :-** మీరు స్వామి కులమును గురించి చెప్పారు. స్వామి కులమునకు విలువివ్వడు. అన్ని కులములను సమానముగా చూస్తాడు. ఆయన మాటలతో చెప్పునదే కాకుండా ఆయన ఇతర కులములో పెళ్ళి చేసు కొన్నాడు. తాను ఎవరికి పెళ్ళి చేసినా కులాంతర వివాహములే చేయు చున్నాడు. మీరు కులము అనుకొనినా ఆయనలో కులముల అభిమానము లేదు.

**భక్తుడు :-** వాడు అన్నీ అజ్ఞానముగానే మాట్లాడుచున్నాడు. అందువలన అజ్ఞానికి అజ్ఞానముతోనే చెప్పాలని అలా చెప్పాను.

(తర్వాత స్వామి తన పర్యటనలో మరొక చోటికి పోవాలనుకొని బయలుదేరి పోయాడు)

× × × × × × × × × × × × × × × × × × × × × × ×

(గజజ్ఞాలాంజనమును చూచిన తర్వాత మునెప్ప ముఠాతో సహా నాగభూషణము కూడా బయలుదేరి తోటమర్రి అను గ్రామ ప్రాంతమునకు చేరుకొన్నారు. అక్కడ పామును అన్వేషించసాగారు. చివరికి ఆ గ్రామము నకు ఒక మైలు దూరములోనున్న పెద్దమర్రిచెట్టు దగ్గర ఆ పాము ఉన్నట్లు గ్రహించారు. అందరూ అక్కడికి బయలుదేరి పోయారు. అక్కడికి పోయి

చూడగా అక్కడొక విశాలమైన మఱ్ఱిచెట్టు ఉన్నది. మఱ్ఱిచెట్టు కొమ్మలకు ఊడలు దిగి భయంకరముగా ఉన్నదా వృక్షము. ఆ వృక్షము యొక్క మొదలును చూస్తే పెద్దతొఱ్ఱ కలిగి రాక్షసగుహలాగ కనిపిస్తున్నది. విశాలమైన మొదలుకు ఐదు అడుగుల ఎత్తు, మూడు అడుగుల వెడల్పుగా కనిపిస్తున్న ఆ తొఱ్ఱమధ్యలో భూమిలోనికి కూడా కొంతలోతుగా వుండి చీకటిగా కనిపిస్తున్నది. ఆ చెట్టు చాలా పురాతనమైనది. ఈ చెట్టును బట్టియే ఆ ఊరికి తొఱ్ఱమఱ్ఱి అని పేరు పెట్టారు. ఆ పేరు కాలక్రమమున తోటమఱ్ఱిగా మారినది. ఆ మహావృక్షము కొమ్మల ఊడలు భూమిలో దిగి కొన్ని ఎకరముల విస్తీర్ణములో వ్యాపించి ఉన్నది. బయలుదేరి పోయిన వారంతా ఆ చెట్టు క్రిందికి పోయారు. సూర్యరశ్మి క్రిందపడని ఆ చెట్టు నీడలో నిలుచున్న మునెప్ప ముఠా మనుషులకు మాంత్రికుని మాయా స్థలములోనికి పోయినట్లయినది. అక్కడ కొంత భయము కల్గినా ధైర్యము తెచ్చుకొని చెట్టుకొమ్మలవైపు పైకి చూచారు. ఆ చెట్టు కొమ్మలలో ఎన్నో వేల పక్షులు, అనేక జాతి పక్షులు నివాసము ఏర్పచుకొని ఉన్నాయి. ఆ చెట్టు క్రింద ఇది పగలా లేక సంధ్యవేళా అన్నట్లు వెలుతురు తగ్గిన నీడ ఆక్రమించి భయానకముగా కనిపిస్తున్నది.

చెట్టుక్రింద అక్కడక్కడ ఎత్తుగా పెరిగిన పుట్టలు కొన్ని ఉన్నాయి. అక్కడికి స్మశానము దగ్గరగా ఉన్నందున నక్కలు, హైనాలు తెచ్చుకొన్న శవాల పుఱ్ఱెలు, చేతి ఎముకలు అక్కడక్కడ కనిపిస్తున్నవి. ఎప్పుడూ ఎవరూ ఆ చెట్టు సమీపమునకు గానీ, చెట్టుక్రిందికిగానీ వచ్చిన సూచనలు లేవు. ప్రజలు ఎవరూ ఆ చెట్టు దరిదాపునకు రాకుండా పోవడానికి ఒక బలమైన కారణము గలదు. అది ఏమనగా! ఆ చెట్టు దగ్గరకు పోయి దాని కొమ్మలు విరిచిన వానికి శరీరములోని అవయవములు నిర్భలమై చచ్చు పడిపోవును. కనీసము ఆ చెట్టు క్రిందికి పోయివచ్చినంత మాత్రమున అతనికి ఏదో

ఒక విచిత్ర జబ్బువచ్చి, ఏ మందులకు నయము కాకుండా పోవడము జరుగుచున్నది. ఇటువంటి విచిత్ర సంఘటనలకు భయపడిన ప్రజలు, ఆ వృక్షము యొక్క దరిదాపుకు పోయెడివారు కాదు. మనుషులు ఎవరూ అక్కడికి రానందున ఆ స్థలము పక్షులకు, పాములకు, చిన్న చిన్న మృగము లకు నివాసమై పోయింది. అక్కడికి పోయిన మునెప్ప మనుషులకు, నాగభూషణమునకు పుట్టల ప్రక్కన నక్కలు త్రవ్వుకున్న రంధ్రములు కనిపించాయి. చెట్టు మొదలు దగ్గరకు పోయి చీకటిగానున్న చెట్టు తొర్ర లోనికి టార్చిలైట్ వెలిగించి చూచారు. భూమికి నాలుగు అడుగుల లోతుగానున్న ఆ తొర్రలో ఒక హైనా (కొరనాసి) నిదురిస్తూ కనిపించింది. మునెప్ప ముఠా మనుషులు ఒకరి ముఖము ఒకరు చూచుకొన్నారు. వారివద్ద రివాల్వర్‌లు మొదలగు ఆయుధములున్నాయి. కావున వారు ధైర్యముగా ఉన్నారు. ఎటువంటి పరిస్థితినైనా ఎదుర్కొనగలమను ధీమా వారికున్నది. వారి మనస్సులో వారికి కావలసిన పాము యోచనతప్ప ఏమీలేదు. ఆ విషయమును గురించి నాగభూషణమును ఇలా అడిగారు.)

**వెంకు :-** మనకు కావలసిన పాము ఎక్కడుంది? దానిని ఎలా మనము కనుక్కోగలము.

**నాగభూషణము :-** మనము అంజనము ద్వారానే ఆ పామును కనుక్కోవాలి. కానీ ఇక్కడ అంజనమును చూడడము అంత సులభముగా నాకు తోచడము లేదు. ఇక్కడికి మనుషులు ఎవరూ వచ్చినట్లు కనిపించడము లేదు. ముందు ఈ చెట్టును గురించి, ఈ ప్రాంతమును గురించి తెలుసుకోవడము మంచిది. అందువలన దగ్గరగానున్న తోటమర్రి గ్రామములోనికి పోయి నేను ఈ చెట్టు విషయము తెలుసుకొని వస్తాను. మీరు అంతవరకు ఇక్కడకానీ, లేక ప్రక్కన గానీ ఉండండి.

**వెంకు :-** మేము ఇక్కడే ఉంటాము. నీవు పోయి తొందరగా తెలుసుకొనిరా.

(అలాగేనని నాగభూషణము అక్కడినుండి పోయాడు. నాగభూషణము పోయి కొంతసేపైనది. మునెప్ప మనుషులు జీపులో కొందరు కూర్చున్నారు. జీపు ప్రక్కన రగ్గులు పరుచుకొని కొందరు కూర్చొని బిస్కెట్లు తింటున్నారు. అంతలో ఎవరో తరిమినట్లు పక్షులన్నీ ఒక్కమారుగా బెదిరి పోయి కొమ్మల మీదనుండి లేచాయి. అవి లేచిన వైనమును చూచి మునెప్ప మనుషులకు భయము ఆశ్చర్యము రెండూ కల్గినవి. ఎందుకు లేచాయో అని అనుకొని తిరిగి వారి పనిలో లగ్నమైనారు. అంతలో గుడ్లగూబ బెదిరిస్తూ మూల్గింది. గుడ్లగూబ మూల్గుడు ఎన్నో మార్లు, ఎన్నోచోట్ల వారు విన్నారు. కావున దానిని గురించి వారు పట్టించుకోలేదు. వారు ఒకరి ముఖము ఒకరు చూచుకొని ఇక్కడ అన్నీ భయములాగే ఉన్నాయి. అందుకే ఇక్కడికి ఎవరూ రావడములేదనుకుంటాను, అని అనుకుంటూ మాట్లాడుకొనుచున్నారు. అంతలో సంధ్యవేళ కాజొచ్చినది. చెట్టు క్రింద ముందుగానే వెలుతురు తగ్గిపోను మొదలు పెట్టింది. నాగభూషణము ఇంకా రాలేదే అని వారు ఊరి ప్రక్క చూస్తున్నారు.

అంతలో చెట్టు పైనుండి ఏదో దభీమని పడిన శబ్దమైనది. అందరూ అటు తిరిగి చూచారు. ఒక్కమారు అందరూ భయపడిపోయారు. చిరు చెమటలు పోశాయి. వారికి ఐదు లేక ఆరు గజముల దూరములో పై నుండి ఒక అస్థిపంజరము పడినది. అది మనిషి అస్థిపంజరము. అది పూర్తి ఎముకల రూపములో లేకుండా, దాని ఎముకలకు అక్కడక్కడ ఇంకా కొన్ని మాంసపుకండలు కరుచుకొని పచ్చిగా ఉన్నది. భయమును పుట్టించు ఆ అస్థిపంజరమును చూస్తూనే మునెప్ప మనుషులు భయపడి పోయారు. వారు ఆ భయమునుండి తేరుకోకముందే ఆ అస్థిపంజరము కదలి లేచి

కూర్చుంది. ఆ దృశ్యమును చూచినవారు అందరు కొన్ని అడుగులు వెనక్కి వేసి అటువైపే చూస్తున్నారు. కూర్చున్న అస్థిపంజరము చిన్నగ కదలి లేచి నిలబడింది. అది నిలబడగానే మునెప్ప మనుషలలో భయము మరీ ఎక్కువైనది. అంతలో చిన్నగ రెండు కాళ్ళను నేల మీద ఈడ్చుకొంటూ ఆ అస్థిపంజరము కొద్దికొద్దిగా ముందుకు రాజొచ్చింది. వెంటనే వారు కాలికి బుద్ధి చెప్పారు. వారి పరుగు నేను ముందో నీవు ముందో అన్నట్లున్నది. రెండు ఫర్లాంగుల దూరము పోవువరకు వారు వెను తిరిగి చూడలేదు. వారికి ఎప్పుడూ ఇటువంటి అనుభవము ఎదురుకాలేదు. అందువలన పూర్తి భయపడి పోయారు. రెండు ఫర్లాంగులు అలా పరుగిడిన తర్వాత వెంకు ధైర్యము చేసి వెనుతిరిగి చూచి నిలబడ్డాడు. తర్వాత అందరూ నిలబడినారు. వారికి అక్కడినుండి ఏమీ కనిపించలేదు. రెండు నిమిషములు నిలబడిన తర్వాత వారిలో వారు ఇలా అనుకొన్నారు.)

**ఒకడు :-** మనము పరుగెత్తకుండా అందరము అక్కడే ఉండివుంటే బాగుండేది. ఏమి జరుగునో చూస్తావుంటిమి.

**రెండవవాడు :-** అక్కడే ఉంటే బాగుండేదని ఇప్పుడు అంటున్నావు. అక్కడ ఉంటే బాగుండదనేగా నీవు పరిగెత్తినది. ఏమి జరుగుతుందో చూస్తా వుంటిమి అంటున్నావు. ఏమి జరిగేది అక్కడే తెలిసింది కదా! అది నేరుగా మనమీదికి రావడము జరిగింది కదా!

**మూడవవాడు :-** బ్రతికిన మనుషులకే భయపడని వాళ్ళము చచ్చిన మనిషిని చూచి భయపడడము దేనికి?

**నాల్గవవాడు :-** అయితే నీవు అక్కడే ఉండకుండా ఎందుకు పరుగెత్తావు?

**మూడవవాడు :-** మీరు అందరూ పరుగెత్తుచుంటే నేనూ పరిగెత్తాను. అంతేకానీ దానికి నేను భయపడలేదు.

**నాల్గవవాడు :-** అయితే మేమేనా భయపడేది. అందరము కలిసి పోదాము పదండి దాని కథ తేలుద్దాము.

**వెంకు :-** వద్దు. మూర్ఖముగా ప్రవర్తించకూడదు. అందరము ఇక్కడే ఉందాము. అదేదో పిశాచముల నిలయమైనట్లున్నది. నాగభూషణము వచ్చేంత వరకు ఇక్కడే ఉందాము. ఎందుకు తొందరపడాలి.

(అలా వెంకు మాటలు విని అందరూ అక్కడే ఉన్నారు. పది నిమిషముల తర్వాత నాగభూషణము వచ్చాడు. వెంకు మిగతావారు అక్కడుండడమును చూచి ఇదేమి ఇక్కడున్నారని అడిగాడు. వాళ్ళు జరిగిన విషయమంతా చెప్పారు. ఆ విషయమును విన్న నాగభూషణముకు ఏమీ అర్థము కాలేదు. నీవేమి తెలుసుకొని వచ్చావని వెంకు నాగభూషణమును అడిగాడు. అప్పుడు నాగభూషణము వెంకు వైపు చూచి "ఈ చెట్టువద్దకు ఎవరూ రారంట, ఒకవేళ వస్తే వచ్చినవానికి ఏదో ఒక వ్యాధివచ్చి బాధింప బడుతారని మనలను కూడా అక్కడికి పోవద్దని గ్రామస్థులు చెప్పుచున్నారు. అంతేకాక ఆ చెట్టు కొమ్మలను విరచిన వారికి శరీరములో అవయవములు పని చేయకుండ చచ్చుపడి పోతాయట" అని అన్నాడు.

గ్రామస్థులు చెప్పిన విషయములనూ, ఇప్పుడు మునెప్ప మనుషుల ముందర జరిగిన సంఘటనలనూ చూస్తే ఇక్కడేదో తెలియని రహస్యమున్నట్లు నాగభూషణమునకు అర్థమైనది. ఆ రహస్యమును తెలుసుకొని, ఆ వృక్షము దగ్గరకు పోయి, ఆ పామును పట్టుకోవాలంటే తనకు తెలిసిన ఉపాయము ఒక్కటే గలదు. అది ఏమంటే "పొట్టిసైతాన్" అను ఒక శక్తిని ఒక మనిషిలోనికి ఆవహింపజేసి దానిద్వారా ఆ చెట్టు రహస్యమును తెలుసు కోవాలనుకొన్నాడు. ఆ విషయమునే మునెప్ప మనుషులకు చెప్పాడు. చెట్టు యొక్క రహస్యమును తెలుసుకొని పామును పట్టాలంటే, పొట్టిసైతాన్

తప్ప మరియొకటి దిక్కులేదని మాంత్రికుడైన నాగభూషణము తెలిపాడు. "ఎంత ఖర్చయినా ఫరవాలేదు ముందు పొట్టి సైతాన్‌ను పిలిచి ఆ విషయమేమిటో తెలుసుకో" మళ్ళీ చెప్పారు మునెప్ప మనుషులు.

నాగభూషణము స్మశానములో పూజ చేయాలంటే దానికి కావలసిన సామాగ్రి మొదలగు ఏర్పాట్లు చేశారు. మరుసటి రోజు రాత్రి పొట్టి సైతాన్ పూజ మొదలు పెట్టాలనుకొన్నాడు. నాగభూషణము మునెప్ప మనుషులను తనకు రక్షణగా పెట్టుకొని పూజ సాగించాలనుకొన్నాడు. పొట్టిసైతాన్ వచ్చేముందు చాలా భయంకరమైన మొదలగు శబ్దములు ఏర్పడుతాయి. కానీ వాటికి భయపడకూడదని మునెప్ప మనుషులకు నాగభూషణము ముందే చెప్పాడు. కొన్ని భయంకర శబ్దముల తర్వాత పొట్టి సైతాన్ ఛాయగా ప్రత్యక్షమౌతుంది. అపుడు ఒక మనిషిలోనికి దానిని ఆవహింపజేస్తాను. అపుడు ఆ మనిషికి వేడిరక్తముతో కలిపిన అన్నము పెట్టాలి. అలా పెట్టిన తర్వాత అది శాంతించి మనము అడిగిన విషయములన్నీ చెప్పగలదని నాగభూషణము తెలిపి ఆవాహనకు తగిన మనిషిని మునెప్ప మనుషులలోనే ఒకరిని ఏర్పాటు చేసి పెట్టుకొన్నాడు.

మరుసటి దినము మధ్యరాత్రినుండి ప్రారంభమైన పూజ గంటసేపు సాగింది. అంతవరకు భయానక వాతావరణము మధ్య స్మశానములో లేని ధైర్యమును తెచ్చుకొని మునెప్ప మనుషులు జాగ్రత్తగా ఉన్నారు. కొద్ది సేపటికి వారికి కొద్ది దూరములో భయంకరమైన చిత్రవిచిత్ర శబ్దాలు వినిపించను మొదలు పెట్టాయి. ముందే ఈ విషయమును నాగభూషణము చెప్పివుండుట వలన ఆ శబ్దములకు ఎవరూ భయపడలేదు. జంతువుల అరుపులు, పులుల గాండ్రింపులు కూడా వినిపించాయి. అలా జరిగిన కొద్దిసేపటికి "ఢాం" అను శబ్దము కనులు మిరుమిట్లుగొల్పు వెలుగు వెలిగి

వినిపించింది. అందరూ అటువైపు చూచారు. వారి ముందర మండుచున్న అగ్ని వెలుతురులో ఛాయగా మూరెడు పొడవున్న మరుగుజ్జు ఆకారము కనిపించింది. ఆ ఆకారమును గమనించిన మాంత్రికుడైన నాగభూషణము పూజముందర కూర్చున్న మనిషిలోనికి చేరమని దానిని ఆజ్ఞాపించాడు. వెంటనే ఆ ఆకారము కనిపించకుండ పోయి ఎదురుగా కూర్చున్న మనిషి లోనికి చేరిపోయింది. అప్పుడు ఆ మనిషి ఊగేదానికి మొదలు పెట్టాడు. వెంటనే వేడి రక్తమును కలిపిన అన్నమును అతని ముందర పెట్టమని నాగభూషణము చెప్పాడు. వేడిరక్తము కొరకు సిద్ధముగా ఉంచుకొనిన కోడిపుంజును వారు గొంతుకోయుటకు ప్రయత్నించారు. అప్పుడు ఆ కోడిపుంజు రెక్కలు గట్టిగా అల్లాడించి వారి చేతినుండి తప్పించుకొన్నది. దానిని పట్టుకొనుటకు కొందరు ప్రయత్నించగా అది వారికి దొరకకుండా చీకటిలోనికి పారిపోయింది.

అంతలో మనిషిలోనికి ఆవహించిన పొట్టిసైతాన్ కళ్ళు తెరిచింది. కళ్ళు తెరిచిన వెంటనే తనకు ఆహారము లేనిదానివలన అక్కడున్న మనుషుల వేడిరక్తమును త్రాగాలని పైకి లేచింది. ఇదంతా గమనించిన నాగభూషణము కూడా భయపడ్డాడు. ఆ సమయములో దానిని ఎవరుగానీ, ఏ మంత్రము గానీ ఆపలేదని నాగభూషణమునకు బాగా తెలుసు. పొట్టి సైతాన్ ఆవహించిన మనిషిని గట్టిగ పట్టుకొమ్మని మునెప్ప మనుషులకు చెప్పాడు. అపుడు పొట్టిసైతాన్ ఆవహించిన మనిషిని పట్టుకొనేదానికి మునెప్ప మనుషులు ప్రయత్నించారు. అయినా ఫలితము లేకపోయింది. వారు ప్రమాదమును కొని తెచ్చుకొన్నట్లయినది. ఎంతమంది అదిమిపట్టుకొనినా అందరిని విదిలించివేయుచున్నది. పొట్టిసైతాన్ ఆవహించిన మనిషి పట్టుకొన్న వారిని విదిలిస్తే వారు గాలిలో తేలియాడి క్రిందపడుచున్నారు.

బలమైన మనుషులను కూడా విసిరి వేయడమును చూచి వారంతా భయపడి పోయారు. పొట్టిసైతాన్ ఆవహించిన మనిషి ముఖము భయంకరముగా మారిపోయింది. కాళికాదేవిలాగ నాలుకను బయట పెట్టివున్నాడు. ఆ మనిషి శరీరములో ఎన్నో రెట్లు ఎక్కువ బలము వచ్చి చేరింది. మునెప్ప మనుషులకు ఎటూ దిక్కుతోచని స్థితిలో అందరూ వచ్చి నాగభూషణము వెనుక చేరారు. ఆ సైతాన్ చేతిలో తమచావు తప్పదనుకొన్నారు. ఒక చిన్న తప్పుకు ఎంత పని జరిగిందను చింత నాగభూషణములో కూడా చోటు చేసుకొన్నది. వారందరిలో బలము లేనట్లయింది, వారు కదలకుండ అలాగే నిలిచిపోయారు. పొట్టిసైతాన్ ఒక్కొక్క అడుగు వారివైపు వేయసాగింది.

అప్పుడు నాగభూషణమునకు ఒక యోచన వచ్చింది. వెంటనే ప్రక్కనేవున్న కత్తి తీసుకొని, తన చేతిని గాయపరుచుకొని, రక్తముకారునట్లు చేసి, ఆ రక్తమును ప్రక్కనున్న నైవేద్యపు అన్నములోనికి కలిపి పొట్టి సైతాన్ ముందరకు త్రోసాడు. వెంటనే పొట్టిసైతాన్ ఆ నైవేద్యమును తిని కొద్ది సేపటికి శాంతపడినది. తర్వాత ఏమి చేయాలో తెలిసిన నాగభూషణము మంత్రించిన కొబ్బరికాయను దానిముందర పగులకొట్టాడు. అపుడది భయపడుచు "ఎవరు నా అధికారి, నన్నెందుకు పిలిచారు?" అన్నది. ఆ మాటకు జవాబుగా నాగభూషణము "నేనే నీ అధికారిని, నేనే పిలిచాను" అన్నాడు. "నన్ను ఎందుకు పిలిచారు, నా వలన మీకు ఏ పనికావాలి?" అని పొట్టి సైతాన్ అడిగింది. ఆ మాట విన్న నాగభూషణము పొట్టి సైతాన్ పూర్తి తన ఆధీనములోనికి వచ్చిందని తెలుసుకొని, నిర్భయముగా దానితో ఇలా అన్నాడు. "నాకు ఇక్కడున్న మర్రిచెట్టు విషయము తెలియాలి, తర్వాత మేము వెదుకుచూ వచ్చిన సర్కస్ పాముకావాలి, దానికి తోడుగానున్న

పాము విషయము కూడా మాకు తెలియాలి. అందుకే నిన్ను పిలిచాము. ఆ మాటవిన్న పొట్టిసైతాన్ కొద్దిసేపు కళ్ళుమూసుకొని తర్వాత కళ్ళు తెరిచి ఇలా చెప్పను మొదలుపెట్టింది.

ఆ మఱ్ఱి చెట్టులో కాటేరి అను పిశాచి నివాసమున్నది. ఆ చెట్టు యొద్దకు ఎవరు పోయినా, వారి శరీరములో చేరి నరములలో వత్తిడి కల్పించి వారికి తీరని రోగము వచ్చునట్లు చేయుచున్నది. ఒకవేళ ఆ చెట్టు కొమ్మలను ఎవరైనా త్రుంచితే, వానికి శరీరములో బలము లేకుండ చేసి, అవయవములను కృశించిపోవునట్లు చేయుచున్నది. నిన్న మీవారు అక్కడున్నపుడు జంతువులు తెచ్చుకొని తిని వదలి వేసిన పచ్చికళేబరము పైనుండి క్రిందపడినది. ఆ కళేబరమును చెట్టుపైకి చేర్చినదీ, చెట్టు మీదనుండి క్రిందికి వేసినదీ ఆ కాటేరి పిశాచియే. క్రిందపడిన అస్థి పంజరమును కూర్చోబెట్టినదీ, తర్వాత నిలబడునట్లు చేసినదీ, ఆ తర్వాత ముందుకు వచ్చునట్లు ఆ కాటేరియే చేసినది. ఆ చెట్టుదగ్గరకు ఎవరూ రాకుండునట్లు కాటేరియే అలా చేయుచున్నది. అంతకుమించి ఆ చెట్టులో ఏ రహస్యమూ లేదు. తర్వాత మీరు సర్కస్ పామును కావాలన్నారు. మీకు కావలసిన సర్కస్‌పాము ఏదీ అక్కడలేదు.

ఆ మాటలు విన్న నాగభూషణము "ఆ పాము అక్కడే ఉన్నట్లు మేము అంజనములో చూచాము. దానికోసమే మేము ముఖ్యముగా ఇక్కడికి వచ్చాము. దాని విషయము నీవు తప్పక చెప్పాలి" అన్నాడు. "తప్పక చెప్పుతా మరి నాకు ఆహారము" అని పొట్టిసైతాన్ అడిగింది. కొద్దిసేపుకు ఒకమారు కోడిగ్రుడ్లు ఆహారముగా పెట్టాలని తెలిసిన నాగభూషణము వెంటనే ఐదు కోడిగ్రుడ్లను దానిముందర ఉంచాడు. వెంటనే అది వాటిని తిని ఇలా చెప్పను మొదలు పెట్టింది. " మీరు వచ్చినది సర్కస్ పాము

కొరకు కాదు. మీరు ఏ పాము కొరకు వచ్చారో ఆ పాము సర్కస్ పాముకాదు. దానికి ఏ సర్కస్ విద్యలూరావు. ఆ పాము కడుపులో వజ్రములున్నాయి. ఆ వజ్రాల కొరకు పామును పట్టుకోవాలని వచ్చారు." ఆ మాట విన్న నాగభూషణముకు ఏమీ అర్థముకాక మునెప్ప మనుషులవైపు చూచాడు. "అవును నిజమే నీకు అబద్దము చెప్పాము. దానిలో వజ్రాలే ఉన్నాయి. ఆ విషయము ఎవరికీ తెలియకూడదు. అందువలన సర్కస్ పామని నీకు చెప్పాము. నీవు అడిగిన డబ్బుకంటే రెండింతలు ఇస్తాము. మాకు ఆ పాము కావాలి. అది మా చేతులనుండి తప్పించుకొని పారిపోయి వచ్చింది." అన్నాడు వెంకు.

అప్పుడు నాగభూషణమునకు వారితో మాట్లాడేదానికి వ్యవధి లేదు. అందువలన వెంటనే పొట్టిసైతాన్ వైపు తిరిగి "ఆ పామే మాకు కావాలి. అది ఎక్కడున్నది." అన్నాడు. దానికి జవాబుగా అది ఇలా చెప్పింది. "ఆ పాము మర్రిచెట్టు క్రింద పెద్ద ఊడ ప్రక్కన గల పుట్టలో ఉంది. అది ఒక్కటేకాక దానికి తోడుగా మరియొక పాముకూడా ఉన్నది. తోడున్న పాము సామాన్యమైనదికాదు. ఏదో దైవశక్తి దానియందు ఇమిడి ఉన్నది. ఆ పాము దాని ప్రక్కనున్నంత వరకు ఆ వజ్రాలపాము మీకు దొరకదు. ఆ పామే మీరు అంజనము చూస్తున్నపుడు తోకతో కొట్టింది." ఆ మాటలు విన్న నాగభూషణముకు ఏమీ అర్థముకాలేదు. పాములో వజ్రాలున్నా యంటున్నారు. ప్రక్కనున్న పామేమో శక్తిగల పాము. ఇదేమి గొడవ, చిన్నగ ఆ పనిని వదలి ఇంటికి పోవడము మంచిదని తలచిన నాగ భూషణము నేను పిలిచినపుడు రమ్మని పొట్టిసైతాన్‌కు చెప్పి దానిమీద నీటిని మంత్రించి చల్లినాడు. అట్లేనని చెప్పి అది మనిషిలో అణిగిపోయింది. కొద్దిసేపటికి మనిషి తేరుకొన్నాడు. అప్పుడు నాగభూషణము మునెప్ప మనుషులతో ఈ విధముగా చెప్పాడు.)

**నాగభూషణము :-** చూడండి! ఇదేదో నాకు అర్థముకాని విషయముగ ఉన్నది. చెట్టుక్రిందికి కాటేరు పిశాచి రానివ్వదు. అయినప్పటికీ మనము అక్కడికి పోయామనుకో, అక్కడ దానికి మరియొక పాము తోడున్నది. ఆ తోడున్న పాము గొప్పశక్తి గలదట. అందువలన ఇది నా చేతకాని పని. ఈ పనికి మీరు ఎవ్వరినైనా పెట్టుకోండి.

**వెంకు :-** ఇప్పుడు నీకు పాము రహస్యమంతా తెలిసిపోయింది. మా విషయము తెలిసిన తర్వాత నిన్ను వదలితే మాకే ముప్పు. అందువలన నిన్ను మేము వదలము. నీవు ఏ విధముగనైనా ఆ పామును పట్టి ఇవ్వాలి. అందుకు నీకు కావలసినంత డబ్బు తీసుకో. నీకు సహాయముగా మేమంతా ఉన్నాము. నీవు అలా ఒప్పుకోకపోతే, నిన్ను ఇంటికి పోనివ్వము. పాము రహస్యము తెలిసిన తర్వాత ఎవరైనా మాతోనే ఉండాలి. నీవు ఒప్పుకోక పోతే నిన్ను చంపడము తప్ప మాకు వేరే దారిలేదు.

**నూకా :-** మేము ఎవరైనది నీకు పూర్తిగా తెలియదు. మేము ఆరితేరిన దొంగలము. మేము అనుకొనిన పనిని ఎలాగైనా సాధించగలము. నీవు ఈ పనిని చేసి పెట్టితే నీవు మాకు మిత్రుడవు అవుతావు. నీకు ఏ సహాయము నైనా చేస్తాము. లేకపోతే నీవు మాకు శత్రువు అవుతావు. అప్పుడు నీ పట్ల మేము కఠినముగా ప్రవర్తించవలసి ఉంటుంది. బాగా ఆలోచించుకో.

(వారి మాటలు విన్న నాగభూషణమునకు ముందు నుయ్యి వెనుక గొయ్యి అన్నట్లయింది. వారి మాటలు వినకపోతే ఎలాగైనా నన్ను వదలరని గ్రహించిన నాగభూషణము విధిలేని పరిస్థితిలో సరేనని పామును పట్టి ఇచ్చుటకు ఒప్పుకొన్నాడు. అలా ఒప్పుకొన్నందుకు సంతోషించిన వెంకు నాగభూషణముతో ఇట్లన్నాడు.)

**వెంకు :-** మేము ఎవరైనది, మాకు కావలసిన పాములో వజ్రములున్నది ఎవరికీ తెలియకూడదు. ఆ రహస్యమును కాపాడవలసిన బాధ్యత నీదే. నీకు తెలిసిన ఈ రహస్యము బయటికి తెలిస్తే మాకు ప్రమాదము వస్తుంది. అప్పుడు నిన్ను బ్రతుకనివ్వము. అందువలన నేటినుండి నీవు జాగ్రత్తగా మసలుకో.

(వెంకు మాటలు విన్న నాగభూషణము తన మనస్సులో ఇలా యోచించసాగాడు. వీరితో స్నేహము చేసి కొరివితో తలగోక్కున్నట్లున్నది. పామును పట్టివ్వకపోతే చంపుతాము అంటారు. పామును పట్టించి వీరి పీడ వదలించుకుందామనుకుంటే, అదేదో కాటేరి పిశాచి చెట్టు దగ్గరకు రానివ్వదంట. పెద్ద చిక్కులో ఇరుక్కొన్నాను. ఎలాగైనా నా మంత్ర బలమంతా ఉపయోగించి వీరికి ఆ పామును పట్టి ఇచ్చి వీరినుండి దూరము కావలెను. లేకపోతే వీరు నన్ను మట్టుపెట్టేలాగున్నారు, అని అనుకొని వెంకుతో ఇలాగ అన్నాడు.)

**నాగభూషణము :-** మీ పనిని నేను కష్టపడి చేసి పెట్టుతాను. నాకు కావలసిన సహాయమును మీరు అప్పుడప్పుడు చేస్తూవుండాలి.

**వెంకు :-** నీకు ఏ సహాయమునైనా చేస్తాము. నీకు ఎప్పుడైనా డబ్బు కావలసినా ఇస్తాము. నిన్ను మా నాయకునికి కూడా పరిచయము చేస్తాము.

(తప్పని పని అనుకొన్న నాగభూషణము కాటేరి పిశాచిని ఎలా స్వాధీనము చేసుకోవాలి? వజ్రాల పాము ప్రక్కనేవున్న పామును ఎలా తొలగించాలి? వజ్రాలున్న పామును ఎలా పట్టాలి? అను యోచనలను చేయుటకు మొదలు పెట్టాడు. అప్పటికి రాత్రి రెండు గంటలు కావస్తున్నది. నాగభూషణము మరియు మునెప్ప మనుషులు అందరూ స్మశానమునుండి బయటికి వచ్చారు. స్మశానమునకు కొంత దూరములో మర్రిచెట్టు వైపువున్న

బయలు ప్రాంతములో మునెప్ప మనుషులు పడుకొన్నారు. ఒకడు మాత్రము నాగభూషణము మీద నిఘావేసి మేల్కొని ఉన్నాడు. నాగ భూషణముకు నిద్రరాలేదు. ముందు ఏమి చేయాలి? ఎట్లు చేయాలి? అను యోచనలలో పడినాడు. ఆ సమయములో తోటమర్రి నుండి వచ్చు దారిలో ఒక ఆకారము వచ్చుట కనిపించినది. ఆ రోజు అమావ్యాస కావున సరిగా కనిపించడము లేదు. మొదట ఆ ఆకారమును గమనించిన నాగభూషణము తనతోపాటు మేల్కొన్న మనిషికి కూడా చూపించాడు. వారిద్దరూ చూస్తున్నట్లే ఆ ఆకారము మర్రిచెట్టు వైపు పోసాగింది. నాగభూషణము మరియొక ఇద్దరిని నిద్రలేపి నలుగురు కలిసి ఆ ఆకారము వెనుక పోయారు. ఆ ఆకారము సరాసరి మర్రిచెట్టు క్రిందికి పోయింది. ఆ వేళలో అంత భయంకరమైన చెట్టుకిందికి ఎవరు పోతారు అని యోచిస్తున్నట్లే చెట్టుక్రిందికి పోయిన ఆకారము అగ్గిపుల్లను గీచి బీడిని వెలిగించింది. అప్పుడు అగ్గిపుల్ల వెలుగులో అంతవరకు చూచిన ఆకారము యొక్క ముఖము కనిపించింది. అప్పుడు అక్కడికి వచ్చినది ఒక ముసలివాడని వారికి తెలిసింది.

ఆ ముసలివాడు నెలకొకమారు అమావాస్య రోజున, రాత్రి రెండు గంటల సమయములో ఆ చెట్టు క్రిందికి వచ్చి పోయేవాడు. ఆ చెట్టు దగ్గరున్న కాటేరి పిశాచికి ఇష్టమైన పాయసమును, బొరుగులను తనవెంట తెచ్చి కాటేరికి సమర్పించి పోయేవాడు. ఆ ముసలి వానికి కాటేరి వశమై వుండేది. అది ముసలివాని ఆదేశానుసారము పనిచేసేది. దానికి కావలసిన ఆహారమును నెలకొకమారు అమావాస్య రోజున అతను తెచ్చిపెట్టి పోయేవాడు. ఆ విధముగా పాయసము, బొరుగులు తెచ్చిన ముసలివాడు చెట్టుక్రిందికి పోయిన తర్వాత ఏమి జరుగుతుందోనని నాగభూషణము మునెప్ప మనుషులు చూస్తూవుండిరి. మొదట దీపమును వెలిగించి పెట్టిన ముసలివాడు తన సంచిలోనుండి బొరుగులు, పాయసమును బయటికి

తీసిపెట్టి ఆ పాత్రలచుట్టు గీత గీచి నల్లటి బొగ్గుపొడిని ఆ గీతచుట్టు వేశాడు. తన శరీరము మీద నూలుపోగుకూడా లేకుండా తన గుడ్డలన్నీ తీసి నగ్నముగా కూర్చున్నాడు. ఏవో మంత్రములు చదవను మొదలు పెట్టాడు. పది నిమిషముల తర్వాత సుడిగాలి చెట్టుక్రింద తిరగను మొదలు పెట్టింది. దానిని చూచిన నాగభూషణమూ మిగతావారూ ఆశ్చర్యపడి పోయారు. సుడిగాలి సాధారణముగా పగటి పూట వస్తుంది, కానీ రాత్రిపూట రావడము ఎక్కడా జరుగదు. కానీ అక్కడ సుడిగాలి రావడము ఏదో మంత్రప్రభావమే అనుకొన్నారు. వారు చూస్తున్నట్లే ఆ సుడిగాలి ముసలి వాడు ఉంచిన పాత్రల వరకు వచ్చింది. పాత్రలమీద గాలి తిరుగుచున్నది. పాత్రలు గాలికి వణికినట్లు కదలుచున్నవి. కానీ కొద్దిగ ప్రక్కనున్న దీపము మీదికి గాలిపోలేదు. ప్రక్కనే సుడిగాలి ఉన్నప్పటికీ దీపము ఆరిపోలేదు. కొద్దిసేపటికి గాలిలేకుండా పోయింది. ఆ ముసలివాడు తనముందరవున్న ఖాళీ గిన్నెలను తీసుకొన్నాడు. సుడిగాలి గిన్నెల మీద తిరగడమూ, ఆ గిన్నెలు ఖాళీ కావడము నాగభూషణముకు ఆశ్చర్యమైనది. దానినంతటిని చూచిన తర్వాత ఆ ముసలివాడు సామాన్యుడుకాడని వారనుకొన్నారు. ముసలివాడు తిరిగి పోతున్నాడు. అప్పుడు ఆ విశాలమైన చెట్టుక్రింద ఒక ప్రక్కన చీకటిలో జీప్ నిలబడి ఉండడము చూచాడు. ఇది ఎవరిది? ఇక్కడెందుకున్నదనుకొనుచూ జీపు సమీపమునకు పోయి చూడసాగాడు. అంతలో నాగభూషణము అతని వెంటవున్న మనుషులు చిన్నగ ఆ ముసలి వాని దగ్గరకు పోయారు. అలా వచ్చిన వారిని చూచి అతను ఇలా అన్నాడు.)

**ముసలివాడు :-** మీరు ఎవరు? ఇక్కడెందుకున్నారు (ముసలివాడు అడిగిన ప్రశ్నకు ఏమి జవాబు చెప్పాలో తెలియక తడబడుచూ ఇలా అన్నారు.)

**నాగభూషణము :-** మేము యాత్రికులము. మా ఊరు చాలా దూరములో ఉన్నది.

**ముసలివాడు :-** మీ ఊరు దూరముంటే ఏమి, దగ్గరుంటే ఏమి. మీరు ఇక్కడెందుకున్నారు? ఏమి చేయుచున్నారు?

**నాగభూషణము :-** ఏమీలేదు. మాకు వైద్యమునకు కావలసిన తీగ ఈ ప్రాంతములో ఉన్నదని విని ఇక్కడికి వచ్చి దిగినాము.

(ఉపాయముగ సమాధానము చెప్పాడు నాగభూషణము. ఆ మాటవిన్న ముసలివాడు అనుమానముతో వారివైపు చూచి ఇలా అన్నాడు.)

**ముసలివాడు :-** ఏమిటి ఒకమారు యాత్రికులమన్నారు. రెండవమారు వైద్యము కొరకు తీగకావాలంటున్నారు. అసలుకు మీరు ఎవరు? ఉన్నదున్నట్లు చెప్పండి.

**నాగభూషణము :-** వీరు యాత్రికులే, నేను మాంత్రికుడను. తీగ నాకు కావాలి.

**ముసలివాడు :-** నీవు ఏమి చెప్పుచున్నావో నీకే అర్థముకాలేదు. ఒకమారు యాత్రికులము అని, మరొకమారు మాంత్రికులమని అంటున్నావు. నీవు మాంత్రికునివైతే నీవెంటవున్న వీరు యాత్రికులెలా అయినారు. నీవు ఏదో దాచి చెప్పుచున్నావు. మీరు యాత్రికులైనా, మాంత్రికులైనా ఎవరైనా ఫరవాలేదు. ఆ విషయము నాకు అవసరములేదు. కానీ ఈ రాత్రివేళ ఈ ప్రదేశములో ఉండకూడదు. ఇది అతి ప్రమాదకరమైన స్థలము. ముందు ఇక్కడినుండి వెళ్ళిపోండి.

(అని హెచ్చరించి చెప్పాడు. ఆ ముసలివానితో స్నేహము చేయుట మంచిదని తలచిన నాగభూషణము అతనితో ఇలా అన్నాడు.)

**నాగభూషణము :-** అయ్యా! మీతో నేను కొంత మాట్లాడాలి. దయచేసి మీరు మాకు కొంత సహాయము చేయాలి.

**ముసలివాడు :-** ఇంత రాత్రివేళ కనిపించి ఏవేవో మాట్లాడుచున్నావు. నిజము చెప్పు మీరెవరో తెలిస్తే సహాయపడతాను.

(అప్పుడు మునెప్ప మనుషులు చెప్పినట్లే నాగభూషణము కూడా మేము సర్కస్ కంపెనీ మనుషులమనీ, తాను సర్కస్‌లో మ్యాజిక్ చేయు వాడనని మిగతవారు కూడా సర్కస్‌లో పనిచేయువారేనని, తమవద్ద సర్కస్‌లో పనిచేయు పాము తప్పించుకొనివచ్చినదనీ, అది ఈ చెట్టు దగ్గర చేరిందనీ, దానికొరకే మేము వచ్చామని చెప్పాడు.)

**ముసలివాడు :-** దానికి నా సహాయమెందుకు?

**నాగభూషణము :-** నీవు అన్ని విద్యలు తెలిసినవానివిగా ఉన్నావు. నీవు దయచేసి ఆ పామును మాకు పట్టి ఇవ్వాలి. అందుకు నీకు అంతో ఇంతో డబ్బు ఇవ్వగలము.

**ముసలివాడు :-** సరే అట్లే చేస్తాను. కానీ పాములు పట్టేది మాత్రము నాకు తెలియదు. ఆ పామును మీరే పట్టుకోవాలి. నేను చేయగల సహాయము ఒకటే ఉన్నది. అది ఏమంటే ఈ చెట్టు క్రిందికి ఎవరూ రాలేరు. వస్తే వారికి జబ్బులు వస్తాయి. అలా కాకుండా మీరు అక్కడికి వచ్చినా జబ్బులు రాకుండ చేయగలను. ఇక్కడ ఎన్నో దయ్యాలు, పిశాచాలు నివసిస్తున్నాయి. మీరు ఇక్కడికి వచ్చినపుడు వాటి బాధను లేకుండా చేయగలను. దానికి అంతో ఇంతో నాకు ఇచ్చుకోవలసి ఉంటుంది.

**నాగభూషణము :-** సరే అలాగే ఇస్తాము.

**ముసలివాడు :-** అయితే మీరు ఇక్కడినుండి కొంత దూరము పోయి ఉండండి. నేను ఇంటికిపోయి ఉదయము ఎనిమిది గంటలకు వస్తాను. అప్పుడు నా సహాయముతో మీరు పామును పట్టుకోవచ్చును.

(అలాగేనని అందరూ అక్కడినుండి పోయారు.)

(ఎనిమిది గంటలకు వస్తానన్న మాంత్రిక ముసలివాని కోసము మునెప్ప మనుషులు, నాగోతుల నాగభూషణము వేచి చూస్తున్నారు. తొమ్మిది గంటలకు ముసలివాడు వచ్చాడు. కొంత ఆలస్యముగా వచ్చిన ముసలివాడు వస్తూనే నాగభూషణము నుదిటి మీద పెట్టుకొన్న చంద్రవంక ఆకారముగల బొట్టును చూచాడు. అది నల్లని కాటుకతో పెట్టిన దానివలన దానిమీద ముసలివానికి అనుమానము వచ్చినది. ఎదుటివానిని వశపరుచుకొనే దానికి మరియు ఎదుటివానిలోని శక్తిని లాగుకొనేదానికి ఇటువంటి కాటుక బొట్టును మాంత్రికులు పెట్టుకుంటారని తెలిసిన ముసలివాడు ఇలా అన్నాడు.)

**ముసలివాడు :-** ఏమిరా! నాముందరే నీవు కాటుక బొట్టు పెట్టుకుంటావా, ముందు ఆ బొట్టును తుడచివేయి (అని కోపముతో అన్నాడు.)

(ఆ మాట విన్న నాగభూషణము ముసలివాడు తన కాటుకను పసికట్టాడని తెలిసి ఏదో నచ్చచెప్పవలెనని ఇలా అన్నాడు.)

**నాగభూషణము :-** ఈ బొట్టు నీకేమి ఆటంకముకాదు. నా పద్ధతి ప్రకారమే నేను పెట్టుకొన్నాను.

(కానీ ముసలివాడు ఆ బొట్టును తుడచివేయాలని పట్టుబట్టాడు. తుడచివేయుట తన మంత్రశక్తికే అవమానమని తలచిన నాగభూషణము నేను తుడచివేయనని, ఆ వృద్ధుని మాటను నిరాకరించాడు. అలా నిరాకరించడము వలన నాగభూషణము మంత్రశక్తిని తన మంత్రశక్తికంటే పెద్దదిగా వృద్ధుడు ఒప్పుకున్నట్లగును. ఆ విషయము తెలిసిన వృద్ధుడు వీనికంటే మంత్రశక్తిలో నేనే పెద్ద, నాకంటే వీడు పెద్దవాడు కాదు. నేనూరక వుంటే వానినే నేను పెద్దగా ఒప్పుకోవలసివచ్చును. ఎలాగైనా అతని బొట్టును తుడిపించాలని ఆ వృద్ధుడు ఇలా అన్నాడు.)

**ముసలివాడు :-** నాగభూషణము! నీవు అలా బొట్టు పెట్టుకొనుట వలన

మంత్రవిద్యలో మంత్రయోగములందున్న అర్థము నాకు తెలియదనుకొన్నావా? నీవు పెట్టుకొన్న బొట్టు ఎదుటివానిని వశము చేసుకొనే దానికి, ఎదుటి వాని మంత్రములు తనమీద పని చేయకుండావుండే దానికీ మరియు ఎదుటివానిశక్తిని తనలోనికి లాగుకొని ఎదుటివానిని తనకంటే తక్కువ శక్తిగలవానిగా చేయడానికని నాకు తెలియదనుకొన్నావా! నేను ఒక మాంత్రికుడనై, అందులోనూ కాటేరి ఉపాసకుడనై నిన్ను నా ముందర బొట్టు పెట్టుకోనిస్తే, నాకు నా మంత్రశక్తికి చిన్నతనము. కావున నీవు వెంటనే తుడిచివేసి నాకు దాసోహమంటావా లేక నాతో పోటీకి వచ్చి నీ శక్తి ఎంతటిదో నిరూపించుకుంటావా.

(వారి మాటలు వింటున్న మునెప్ప మనుషులకు మన పని కాకుండా మధ్యలో ఈ బొట్టు తతంగము ఏమిరా దేవుడా, అనుకొని నాగభూషణముకు నచ్చచెప్పాలని ఇలా అన్నారు.)

**వెంకు :–** అయ్యా! నాగభూషణముగారూ, ఆ బొట్టును గురించి ఎందుకంత రాద్ధాంతము? దానిని తుడిచివేసి ఆయనచేత మన పనిని చేయించుకోవడము మంచిది కదా!

**నాగభూషణము :–** నేనలా తుడిచివేయను. ఇది మా గురువు ఆజ్ఞ. మా గురువు నేర్పిన విద్య అన్నిటికంటే గొప్పది. నేను దీనిని తుడచివేస్తే నాకూ, నా గురువుకూ అవమానమగును. మీరు ఎందరు చెప్పినా, ఏమి చెప్పినా మీ మాటవినను, నేను నా బొట్టును తుడిచివేయను. నేను బొట్టును తుడచివేస్తే నా తలను నేనే నరుక్కున్నట్లగును.

(నాగభూషణము అన్న మాటలకూ, మొండి పట్టుదలకూ మునెప్ప మనుషులకు కోపము వచ్చింది. అప్పుడు ఇలా అన్నారు.)

**నూకా :–** నీ పంతాలకు, పరువులకు ఇది సమయముకాదు. నీ మొండి

పట్టుదల వదలి ఈ పెద్దాయన మాటను విను. లేకపోతే మన పని చెడి పోతుంది. నీవు మొండిగ ఉంటే బాగుండదు.

**నాగభూషణము :-** మీరు ఇంతవరకు బెదిరించిన బెదిరింపులకు భయ పడినాను. కానీ ఇప్పుడు భయపడను. అసలుకు మీకు నాకు ఏమి సంబంధము. మీ కొరకు ఇంతవరకు అబద్దమాడి నేను కూడా సర్కస్ వాడినన్నాను. నిజానికి మీరు సర్కస్‌వారా? ఆ పాము సర్కస్ పామా? మీ స్వార్థము కొరకు నన్ను కూడా ఆడించాలనుకోవడము మీ పొరపాటు. ఏదో పోనీలే అని ఇంతవరకు మీ మాట విన్నాను. ఇకమీదట వినను. ఇప్పటినుండి మీదారి మీది, నాదారి నాది.

(నాగభూషణము అనిన మాటలను విన్న మునెప్ప మనుషులకు అతనిమీద పూర్తి కోపము వచ్చింది. ఆ మాటలు విన్న ముసలివానికి ఇదేమి క్రొత్తనాటకము? ఇంతవరకు అందరము సర్కస్‌వారమే అన్నారు. ఇప్పుడేమో సర్కస్‌వారు మీరు కాదు, నేను కాదు అంటున్నారు. ఈ సర్కస్‌ను వీరెందుకు వాడుకొన్నారు. నిజానికి ఈ ఆరుమంది ఎవరు? ఈ మాంత్రికుడు ఎవడు? ఇట్లు ముసలివానికి అనేక ప్రశ్నలు వచ్చినవి. తర్వాత వీరు ఈ మాంత్రికుని చేత పని చేయించుకొనేదానికి మాంత్రికుని పిలుచు కొని వచ్చారని అర్థమైనది. అపుడు వృద్ధుడు మునెప్ప మనుషులతో ఇలా అన్నాడు.)

**ముసలివాడు :-** మీకు నేను సహాయము చేస్తాను. వీనితో మీకు పనిలేదు.

**వెంకు :-** ఒరే నాగభూషణము, నీవు మా రహస్యములను తెలుసుకొని బయటపడి బ్రతుకుతాననుకొన్నావా. నీ చావు మా చేతిలోవుంది.

**ముసలివాడు :-** అది మీకువద్దు, వానిని నాకు వదలివేయండి. వాడు బొట్టు తుడిచి నాకు లొంగిపోతాడో లేక నా చేతిలో చస్తాడో చూస్తాను.

**నాగభూషణము :-** మీరెంతో మీ స్థోమత ఎంతో తెలియక నాతో వాదనకు దిగినారు. నన్ను మీరేమీ చేయలేరు. నాతో పోటీపడి మీ చావును మీరే తెచ్చుకొన్నారు. నాతో మోడి (మంత్రముల పోటి) పెట్టుకొనేదానికి నీకు ధైర్యముందా ముసలివాడా? ఓహో మీరు మునెప్ప మనుషులు కదా! నా మంత్ర ప్రయోగములకు (చేతబడులకు) తట్టుకొని ప్రపంచములో బ్రతికే స్థోమత మీకుందా! ఏమోలే అని మీ మాటలు వింటే, నన్ను మరీ తక్కువ వానిగా చూస్తారా.

(మునెప్ప మనుషులకు కథ అడ్డము తిరిగినందుకు ఏమీ తోచలేదు. అంతలో ముసలివాడు ఇట్లన్నాడు.)

**ముసలివాడు :-** నీకు గర్వము ఎక్కువగా ఉన్నది. నీతో మోడికి నేను సిద్ధము. ఇపుడే పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి మా మోడిలో ఎవరు చనిపోయినా, అది హత్యకాదని మోడీ పత్రము వ్రాయించుకొందాము. పోదాము రా.

(సరేనన్నాడు నాగభూషణము. మునెప్ప మనుషులవైపు చూచిన ముసలివాడు మీరు నిదానపడండి. వీని అంతు తేల్చి మీకు పామును నేను పట్టిస్తానని చెప్పగా, దానికి మునెప్ప మనుషులు సరేనని ఒప్పుకొన్నారు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(రాజయోగానందస్వామి తన పర్యటనలో భాగముగా తనవద్ద యున్న అడ్రస్ ప్రకారము ముక్తేశ్వరము అనే ఊరికి పోయాడు. అక్కడ తన పుస్తకములను తెప్పించుకొని చదివిన రామ్‌దేవ్ అను భక్తుని ఇంటికి పోయి, అక్కడ కూడా స్వామి వారు ఇమ్మన్నారని ఒక గ్రంథమును ఇచ్చి, ఇంతకు ముందు చదివిన స్వామి రచనలను గురించి అడిగాడు. దానికి రామ్‌దేవ్, స్వామి రచనలను గురించి చాలా అమోఘమైన జ్ఞానమని చెప్పాడు. మేము 30 సంవత్సరములనుండి తెలుసుకొన్న జ్ఞానముకంటే

మించిన దానిని, స్వామి గ్రంథముల ద్వారా మూడునెలల్లో తెలుసుకొన్నాము. ఈ జ్ఞానము ముందర, మేము ఇంతవరకు ఇన్ని సంవత్సరములనుండి తెలుసుకొన్న జ్ఞానము, ప్రయోజనము లేనిదని తెలిసింది. స్వామివారి జ్ఞానముతో ఎవరు ఏ ప్రశ్న అడిగినా దానికి జవాబును చెప్పవచ్చును. అంతేకాక స్వామివారి జ్ఞానము ఏ మతమువారికైన సరియైన జవాబును చెప్పగలదు. ఇలా చెప్పుకొంటూ పోతే చెప్పే దానికి మాటలు చాలవు అందువలన ఒకే మాటలో చెప్పాలి అంటే, ఆయన జ్ఞానము భూమండలము లోనే గొప్పజ్ఞానమనవచ్చును.

ఈ దినము హిందూ సంఘమువారు హిందూమతము క్షీణించి ఇతర మతములు అభివృద్ధయితున్నాయను దానిమీద పెద్ద బహిరంగ సభ చేయుచున్నారు. దానిలో పాల్గొనుటకు ఉపన్యసించుటకు నాకు ఆహ్వానము వచ్చినది. మనము అక్కడికిపోయి వస్తాము అని స్వామివారిని కూడ ఆ సభకు తీసుకపోవడము జరిగినది. అక్కడ సభలో రామ్‌దేవ్‌ను మాట్లాడ మన్నారు. రామ్‌దేవ్ స్టేజిమీదకు పోయి నేను మాట్లాడేది మీకు తెలుసు అందువలన నా మాటలకంటే గొప్పగా రాజయోగానంద స్వామి దగ్గర నుండి వచ్చిన వ్యక్తి చెప్పగలడు. ఆయన మాటలను విందాము అని అక్కడ మాట్లాడు అవకాశమును రాజయోగానంద స్వామికి ఇచ్చారు. కానీ అక్కడికి వచ్చినది స్వామి అని ఎవరికీ తెలియదు. వచ్చిన అవకాశము స్వామి తీసుకొని స్టేజి మీదకు పోయి చెప్పను మొదలు పెట్టాడు.)

"ఇక్కడ సమావేశమైన అందరికీ వందనము. ఇప్పుడు ఇక్కడ జరుగుచున్న సమావేశములో కొందరు ముఖ్యులు మాట్లాడినారు. మొత్తము మీద అందరూ క్రైస్తవులు తమ మతమును అభివృద్ధి చేసుకొనుటకు హిందువులను క్రైస్తవులుగా మారుస్తున్నారని చెప్పారు. అలా హిందువులు క్రైస్తవులుగా మారకుండావుండాలంటే, క్రైస్తవులను మత ప్రచారము

చేయకుండా చూడాలన్నారు. వారు హిందువులను ప్రలోభపెట్టకుండా చూడాలన్నారు. అలా చూచుటకు క్రైస్తవుల మీద అనేక చోట్ల హిందూ పరిరక్షణ సంఘము వారు దాడులు చేసి, వారి ప్రచారమును ఆపివేసిన సంఘటనలు కలవు. క్రైస్తవులు వారి మతమును అభివృద్ధి చేసుకొనుటకు అనేకపాట్లు పడుచున్నమాట వాస్తవమే. గత యాభై సంవత్సరములలో నూటికి ముప్పైమంది హిందువులు క్రైస్తవులుగా మారిపోయారు. అదే కొలతతోనే ఇప్పటికీ మారుచూనే ఉన్నారు. ఇలాగే మరోయాభై సంవత్స రములు గడచిపోతే భారతదేశములో నూటికి అరవైమంది క్రైస్తవులే ఉంటారు. హిందూమతమును కాపాడవలెనను హిందూసంఘములు అనేకములు గతములో కూడా పని చేశాయి. ఇప్పుడు కూడా పని చేస్తున్నాయి. క్రైస్తవుల ప్రచారములను అడ్డుకుంటూనే ఉన్నారు. అయినా హిందువులు క్రైస్తవులుగా మారిపోవుచూనే ఉన్నారు.

"కొన్ని హిందూ సంఘములు, క్రైస్తవులు హిందువులను ప్రలోభ పెట్టుచున్నారని అంటున్నవి. ప్రలోభములకు ఆశపడి మతము మార్చు కొన్నవారు నూటికి ఐదుమంది కూడాలేరు. కూటికి గుడ్డకు లేని హిందువులు ఎవరైనా వారి ప్రలోభములకు మతము మారివుండవచ్చుననుకుంటాము. నూటికి 25 మంది బ్రతికే స్థోమతవున్న కుటుంబాలు ఆ మతములోనికి ఎందుకు పోయాయి? అని ప్రశ్నించుకోవలసిన అవసరమున్నది. ఒక ఊరిలో వంద దేవాలయములుంటే పది చర్చిలు ఉంటాయి. మన హిందూ మతములో ఆధ్యాత్మిక విద్యకు సంబంధించినవి వంద గ్రంథములుంటే వారిది ఒకేఒక గ్రంథమున్నది. హిందూమతములో కోట్లాది దేవతలు ఉంటే వారి మతములో కేవలము ఒకే దేవుడున్నాడు. గుడులలోనూ, గ్రంథాలలోనూ, దేవుళ్ళలోనూ అన్నిటియందు సంఖ్యాబలము ఎక్కువ

ఉన్న ఈ మతమును వదలి సంఖ్యాబలములేని, ఆ మతములోనికి దేనికి పోయారు? అని ప్రశ్నించుకోవలసిన అవసరమున్నది. ఇంతవరకు చెప్పిన వారంతా హిందువులు క్రైస్తవులుగా మారుచున్నారు. అలా మత మార్పిడులు జరుగకుండా చూడాలని చెప్పారు. కానీ మారిన వారు ఏ కారణముచేత మారారు. అలాగే మారబోయేవారు కూడా ఉన్నారు. వారు ఏ కారణము వలన మారుతారు అని ఆ కారణములను వెతికి చూపలేదు. ఒక హిందూ కుటుంబము క్రైస్తవమతమును తీసుకొన్నదని, ఆ ఏరియాలోవుండే ఫాదర్‌నో, పాస్టర్‌నో కొట్టినా బెదిరించినా ఏమి ప్రయోజనము లేదు. అటువంటి దాడుల వలన, బెదిరింపుల వలన మత మార్పిడిలు ఆగిపోలేదు. ఇంకా రెట్టింపుగానే జరుగుచున్నాయి. హిందూ సంఘములు ఎన్ని రకముల నివారించాలనుకొనినా, ఎందుకు నివారించలేకపోతున్నాము అంటే, దానికి ఒకేఒక కారణము కలదు. హిందూమతములోని హిందువులకు దైవజ్ఞాన మేదో తెలియదు. ఇప్పటికీ హిందువుల పవిత్ర గ్రంథమేదో యాభైశాతము మందికి తెలియదు. ఇప్పటికీ భగవద్గీత ఫోటోను ఇంటిలో పెట్టుకోకూడదు, అది ఉంటే అన్నీ కొట్లాటలే వస్తాయి. దానిని తీసుకొని పోయి దేవాలయములో పెట్టు. లేకపోతే నదిలో వేయమని చెప్పేవారున్నారు. ఇప్పటికీ భగవద్గీత పుస్తకమును చదవకూడదు, చదివితే అన్నీ కష్టాలే వస్తాయని చెప్పువారున్నారు. ఈ విధముగా ఆధ్యాత్మిక విద్యకు దైవజ్ఞానమునకు హిందువులు పూర్తి దూరమై, జ్ఞానము ఏమిటో తెలియని స్థితిలో ఉన్నపుడు “మా గ్రంథములో జ్ఞానమున్నది. మా దేవుడు మిమ్ములను పిలుస్తున్నాడు” అని చెప్పేమాటలనే హిందువు వినవలసి వచ్చింది. అలా విన్న తర్వాత ఆ మతములోనికి పోవడము జరిగినది. దైవజ్ఞానములేని హిందువులు ఒక్కొక్కరు క్రైస్తవులుగా మారిపోవుటకు మొదలుపెట్టారు. హిందూమతములో దేవాలయములున్నాయి, అయితే అందులోని దైవత్వము తెలియదు.

హిందూమతములో దైవ గ్రంథాలున్నాయి అయితే అందులోని జ్ఞానము తెలియదు. హిందూమతములో దేవుళ్ళున్నారు అయితే ఎవరు పెద్ద దేవుడో తెలియదు. ఇట్లు ఏమీ తెలియనిస్థితిలోనే హిందువు తన ఇష్టముతోనే క్రైస్తవునిగా మారుచున్నాడు. కానీ ఎవరి బలవంతముతోను క్రైస్తవునిగా మారలేదని తెలియుచున్నది. క్రైస్తవుల బోధల వలన, వారి ప్రచారమువలన హిందువులు క్రైస్తవులుగా మారారు అనే దానికంటే, హిందువులలోని కొందరు, హిందువులను జ్ఞానమార్గమువైపు పోకుండా చేయుట వలన, హిందుత్వములో లేని జ్ఞానము క్రైస్తవములో దొరుకుతుందని హిందువులు క్రైస్తవులుగా మారుచున్నారని చెప్పవచ్చును. నేను చెప్పిన దానిని విజ్ఞులైనవారు అర్థము చేసుకోగలరని ఆశిస్తూ ముగిస్తున్నాను" అన్నాడు.

ఆ సభలోని వారందరు స్వామివారు చెప్పిన మాటలను సమర్థించారు. రామ్‌దేవ్ స్వామిని బాగా చెప్పారని పొగడాడు. తర్వాత స్వామి ఆశ్రమానికి రావలెనని బయలుదేరాడు. ఈ విధముగా రాజయోగా నంద స్వామి తన పర్యటనను ముగించుకొని తిరిగి ఆశ్రమమునకు వచ్చాడు. ఆశ్రమములోనున్న రాఘవ, ఆటవికులు, మల్లుదొర, రాధేశ్వరి అందరు స్వామి రాకతో సంతోషించారు. స్వామివారు మరుసటి దినమున తన పర్యటనలోని ముఖ్యవిషయములన్నిటిని అక్కడున్నవారికి బోధించాడు. రాఘవ తన మనస్సులోని విషయాన్ని చెప్పాలని సమయము కోసము చూచి స్వామి విశ్రాంతిగనున్నపుడు గూడెము వారినందరిని పరిచయము చేసి మల్లుదొర వచ్చిన విషయమును కూడా చెప్పెను. దానికి స్వామి ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** జీవితములో జరుగు ప్రతి సంఘటన, ముందే కర్మ పట్టీలో వ్రాసిపెట్టబడివుండును. ఆ కర్మప్రకారమే అన్నీ జరగును. అలాగే

నీ జీవితములో పెళ్ళి జరుగు సమయము కర్మప్రకారము వచ్చివుంటుంది. అయితే ఒక్క విషయము నీ జాతకము నీకు తెలియదు కదా! నీకు తెలియకున్నా, నీ జాతకము కొంత ప్రత్యేకత కల్గియున్నది. నీ జన్మ లగ్నమునకు ఏడవస్థానములో రాహువు ఉండుట వలన నీ జీవితములో రెండు వివాహములు జరుగునని తెలియుచున్నది. నీకు రెండవ వివాహము కూడా భవిష్యత్తు కాలములో జరుగవచ్చును. ఈ విషయము నీకుగానీ, నీకు బిడ్డనిచ్చు మల్లుదొరకుగానీ తెలియదు. మీరు ఇరువురూ ఈ రాత్రికి ఆ విషయమును చర్చించుకొని, రేపు ఉదయము నాకు మల్లుదొర ఉద్దేశ్యమును తెలుపుము. అతనికేకాదు నీ జాతకములో ఉండే విషయము నీకే తెలియుట మంచిది.

(రాజయోగానందస్వామి చెప్పినది నూటికి నూరుపాళ్ళు సత్యమై ఉంటుందని విశ్వసించిన రాఘవ మల్లుదొరతో ఆ రాత్రికి చర్చించాడు. రాఘవ ఆ విషయమును గురించి కొంత ఆందోళనగా యోచించినా మల్లుదొర ఏమాత్రము దానిని గురించి ఆలోచించలేదు. ఉదయము తొమ్మిది గంటలకు రాజయోగానందస్వామి సమావేశములోనికి వచ్చినపుడు రాఘవను ఇలా అడిగాడు.)

**రాజయోగానంద :-** రాఘవా నీకు రెండు పెళ్ళిళ్ళు జరిగి తీరునని నీ జాతకము చెప్పుచున్నది కదా! ఈ దినము మల్లుదొర బిడ్డను ఇవ్వడానికి గానీ, నీవు చేసుకోవడానికిగానీ అభ్యంతరములు ఏమీ లేవుకదా!

**రాఘవ :-** కర్మలో జరుగవలసినది ఉన్నపుడు మనము తప్పించుకొనుటకు వీలులేదు కదా! ఇప్పుడు మల్లుదొర బిడ్డను చేసుకోక పోయినా, తర్వాత ఎవరిని చేసుకొనినా, రెండు పెళ్ళిళ్ళు తప్పవు కదా స్వామీ!

**రాజయోగానంద :-** రెండు పెళ్ళిళ్ళు అంటే భార్య చనిపోయిన తర్వాత

రెండవ పెళ్ళి చేసుకొనువారు కూడా కలరు. వారికి కూడ రెండు పెళ్ళిళ్ళు అయినట్లే. నీకు అలాకాదు, నీ జాతకములో ఇద్దరి భార్యలతో కాపురము చేయవలసివున్నది. ఒక భార్య ఉన్నట్లే, రెండవ భార్యను కూడా చేసుకోవాలి. ఇది నీకు చెప్పేదానికంటే మల్లుదొరకు చెప్పేది మంచిది.

**మల్లుదొర :-** అన్నీ తెలిసినవారు మీరు చెప్పిన తర్వాత జరగనిది ఏదీ ఉండదు. నా విషయానికివస్తే ఇద్దరు భార్యలతో రాఘవ కాపురము చేయడము సంతోషమే. ఇప్పుడు నాబిడ్డనిచ్చుటకు నాకు ఏ అనుమానము లేదు. మా గూడెములో ఇద్దరు భార్యలతో కాపురము చేయడము శుభ సూచకముగా భావిస్తాము. అందువలన రాఘవ రెండవ పెళ్ళి చేసుకుంటే నేను దగ్గరుండి చేస్తాను.

(అప్పుడు రాజయోగానంద స్వామి రాఘవను పెళ్ళి చేసుకొమ్మని చెప్పగా! రాఘవ ఆశ్రమములోనే స్వామి సమక్షములోనే తన పెళ్ళి జరుగులాగున చేయమన్నాడు. ఆ విషయమును స్వామి మల్లుదొరను అడుగగా మల్లుదొర ఒప్పుకొనెను. మల్లుదొర ఆటవికులు సంతోషముగా తమ గూడెముకు పోయిరి. రాఘవ పెళ్ళికి ఒక నెల వ్యవధి ఉండుట వలన ఎవరి ఏర్పాట్లు వారు చేసుకొనుచుండిరి. ఒక దినము రాజయోగా నందస్వామి తీరికగా ఉన్నపుడు రాఘవ ఒక విషయమును స్వామితో అడిగెను.)

**రాఘవ :-** మీరు ఆశ్రమములో లేకుండా పర్యటనలో ఉన్నపుడు దారిన పోయే ప్రయాణికులు మంచినీళ్ళకోసము వచ్చారు. ఇక్కడే అన్నము తిన్నారు. వారిలో ఒక యువకుడు అన్నము కూడా తినకుండా కడుపునొప్పితో బాధ పడుచుండెను. అతనిని గమనించిన నేను ఈ యువకుడు ఎందుకు బాధ పడుచున్నాడని అడిగాను. అపుడు మిగతావారు

అతనిని దయ్యము బాధించు చున్నదని చెప్పారు. కానీ ఆ విషయమును నేను నమ్మలేదు. అతనికి ఏదో రోగముందని, నాకు తెలిసిన వైద్యమును చేయతలచి, కడుపు మీద చేయిపెట్టాను. అప్పటికి నేను ఏ వైద్యము మొదలు పెట్టలేదు. కానీ ఏ వైద్యమును చేయకనే చేయి తగిలిన వెంటనే అతని నొప్పి వెంటనే పోయింది. అది ఎలా పోయిందో నాకు తెలియదు. నేను చేయివుంచుట వలననే పోయింది అని వారు అన్నారు. కానీ నాకు ఆ విషయము ఏమాత్రము అర్థము కాలేదు. అప్పుడు అక్కడ నాకు తెలియని విషయమేదో ఉన్నదనీ, దానిని మీరే చెప్పగలరనీ అనుకొన్నాను.

**రాజయోగానంద :-** అది నమ్మలేనిది ఏమీకాదు. దయ్యాలూ ఉన్నాయి, మనుషులకు వాటి బాధలూ ఉన్నాయి. ఆ బాధ ఎలా పోయింది అను విషయము నీకు తెలియాలి కదా! నీకు తెలియకున్నా, నీవు ఏ వైద్యము చేయకున్నా, ఆ బాధ నీ చేతి స్పర్శతోనే పోయిందనుట వాస్తవము. ఆ వాస్తవములోని వివరము నీకు కావాలి అంటే దానిని నేను చెప్పవచ్చును. కానీ నేను చెప్పుటకంటే ఆ రోజు యువకుని శరీరమును బాధించుచున్న దయ్యము చెప్పితే మరీ బాగుంటుంది. వారి అడ్రస్ నీకు తెలిసివుంటే వారికి కబురు చేసి రమ్మని చెప్పు. వారు వచ్చిన తర్వాత అప్పుడు ఆ బాధ ఆ వ్యక్తికి ఎందుకు వచ్చినదీ, ఎలా పోయినదీ అన్నీ వివరముగా తెలియగలవు.

(రాజయోగానంద స్వామి చెప్పినట్లు ఆ దినము వచ్చిన వారిని రాఘవ పిలువనంపాడు. వారు రెండవరోజు అక్కడికి వచ్చారు. మొదట వచ్చిన వారందరూ ఆ యువకునితో సహా వచ్చారు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(నాగోతుల నాగభూషణము, ముసలివాడు (మంత్రాల మల్లయ్య తాత) పోలీస్ అధికారులవద్దకు పోయి తాము మోడీప్రదర్శన చేయుచున్నామని, తమ ప్రదర్శనకు అనుమతిని తీసుకొన్నారు. అంతేకాక ఆ మోడీ ప్రదర్శన ప్రజల వినోద నిమిత్తము చేయుదుమనీ, ఒకవేళ ఆ ప్రదర్శనలో ఎవరికైనా గాయములైనా లేక చనిపోయినా దానికి తాము బాధ్యులము కాము అనీ ముందే వ్రాయించి వచ్చారు. మల్లయ్య తాత పెట్టిన మోడీని నాగభూషణము ఎత్తివేస్తానని దండోరా వేయించాడు. ఆ మోడీని చూడడానికి చుట్టుప్రక్కల గ్రామముల ప్రజలందరూ వచ్చారు. మోడీ అంటే ఎట్లుంటుదో చాలామందికి తెలియదు. అందువలన కొన్ని వేలమంది తోటమర్రి గ్రామానికి చేరుకొన్నారు. ఆదివార దినమున మోడీ పెట్టుటకు కావలసిన సదుపాయములన్నిటిని ముసలివాడు ముగించుకొన్నాడు. శనివారము రాత్రియే తయారు చేసిపెట్టిన మోడీస్థలము చూపరులకు విచిత్రముగా కనిపించింది. ఊరి మధ్యలో గల బయలులో పది అడుగుల చతురస్రాకార స్థలములో చుట్టూ ముగ్గు వేయబడి, మధ్య స్థలము పేడతో అలుకబడి వున్నది. పది అడుగుల పొడవు, వెడల్పుగల చతురస్రాకారము చుట్టు అర్థ అడుగు వెడల్పుతో నలుపు, ఎరుపు, తెలుపు రంగుల ముగ్గులు వేయబడి ఉన్నాయి. మధ్య స్థలము శుభ్రముగా అలుకబడి ఉన్నది. ఈ విధముగా తయారు చేయబడిన చతురస్ర స్థలములు ఐదు కనిపించాయి. ప్రతి చతురస్ర ఆవరణములోను నాలుగు మూలల నాలుగుపచ్చి కొబ్బరికాయ లను పసుపు, కుంకుమ పూసి అలంకారము చేసి పెట్టారు. ఆ విధముగా అలంకరించిన మొదటి ఆవరణము మధ్యలో ఒక చీపురుకట్టను పెట్టారు. అట్లే రెండవ ఆవరణము మధ్యలో పొడవైన కత్తిని పెట్టారు. మూడవ చతురస్రపు ఆవరణ మధ్యలో మట్టిమూకుడు (మట్టితో చేయబడిన ప్లేటు) లో నిమ్మకాయను పెట్టారు. నాల్గవ ఆవరణము మధ్యలో గుడ్డలతో

తయారు చేసిన మూడు అడుగుల ఎత్తున్న బొమ్మను నిలబెట్టారు. ఐదవ చదరపు ఆవరణము మధ్యలో పదిశేర్లు బియ్యమును కుప్పపోసి, ఆ కుప్పమీద రూపాయి నాణెమును ఉంచారు.

మొదటి ముగ్గుకు, రెండవ ముగ్గుకు మధ్యలో సందు నాలుగు (4) అడుగులున్నది. రెండవ ముగ్గుకు, మూడవ ముగ్గుకు మధ్య సందు ఎనిమిది (8) అడుగులున్నది. మూడవదానికి నాల్గవదానికి మధ్య సందు పన్నెండు (12) అడుగులు గలదు. అట్లే నాల్గవ ముగ్గుకు, ఐదవ ముగ్గుకు మధ్య సందు పదహారు (16) అడుగులు కలదు. మొదటి ముగ్గుకు ముప్పయి (30) అడుగుల ముందర పది అడుగుల ఎత్తు, ఆరు అడుగుల వెడల్పు గల ముఖ ద్వారము కొయ్యలతో చేయబడినది. ఆ ద్వారమునకు ఇరువైపులా కొబ్బరి పట్టలతో అలంకారము చేయబడివున్నది. ఆ ద్వారముపైన ఆకాశమోడి అని పెద్ద అక్షరములతో వ్రాయబడివున్న బోర్డు కలదు. ఆ బోర్డు క్రింది భాగమున మామిడి ఆకులతో అలంకరించిన తోరణములు గలవు. మామిడి ఆకు తోరణము క్రింద ఒక మట్టి కడవ తల్లక్రిందులుగా వ్రేలాడదీయబడి ఉన్నది. అగరుబత్తుల వాసన ఆ ప్రాంతమంతా నిండివున్నది.

కొన్ని వేలమంది కలసిన చోట ఏ అవాంఛనీయ సంఘటనలు జరుగకుండా పోలీస్ బందోబస్తు కూడా చేయబడినది. మాంత్రికవృద్ధుడు మంత్రాలమల్లయ్య తాత క్రొత్త గుడ్డలు ధరించి, చేతికి ఇత్తడి వెండి కడెములు ధరించి చేతిలో కొరడా పట్టుకొని, నొదుట విశాలమైన బొట్టు పెట్టుకొని అక్కడికి వచ్చాడు. అక్కడికి వచ్చిన మల్లయ్య తాతను చూచి అతని అనుచరులు చప్పట్లుకొట్టారు. తర్వాత నిముషమునకు నాగోతుల నాగ భూషణము కూడ అక్కడికి వచ్చాడు. నాగభూషణము పంచకట్టు కట్టి

<u>పటము-3, పటము-4</u> = <u>మధ్య దూరము 8 అడుగులు</u>

**<u>పటము-4</u>**



**మధ్యదూరం 12 అడుగులు**

**<u>పటము-5</u>**



**మధ్యదూరం 16 అడుగులు**

**<u>పటము-6</u>**



పైన అంగీ ధరించకుండా వచ్చాడు. అంగీలేని దానివలన అతని నడుము కున్న మొలత్రాడు కనిపిస్తున్నది. ఆ మొలత్రాడుకు కట్టిన వివిధ తావెత్తులు కనిపిస్తున్నవి. నాగభూషణము వచ్చిన తర్వాత మల్లయ్య తాత అక్కడగల చిన్న వేదికను ఎక్కి బిగ్గరగా ఇట్లన్నాడు.)

**మల్లయ్య :-** ఇక్కడికి వచ్చిన జనమందరికి నా నమస్కారములు. ఇప్పుడు ఇక్కడ నాకూ, నాగభూషణమునకూ మోడీ జరుగబోతుంది. మోడీ అంటే ఏమిటో చాలామందికి తెలియదనుకొంటాను. ఇది ఒక విధముగా మాలో నున్న మంత్రశక్తుల పోటీ అని తెల్పుచున్నాను. ఈ మోడీ వలన ఎవరు గొప్ప మాంత్రికులో తెలిసిపోతుంది. నాకు, నాగభూషణమునకు మధ్య నేను పెద్ద అంటే, కాదు నేను పెద్ద అని తగాదా వచ్చినది. అందువలన ఎవరు పెద్ద అయినదీ తెలిసిపోవాలని ఈ మోడీని పెట్టుకొన్నాము. నేను పెట్టిన ఈ మోడీని నాగభూషణము ఎత్తివేస్తానని సవాలు చేశాడు. అలా అతను ఎత్తి వేయగలిగితే, మీ అందరి సమక్షములోను అతనికంటే మంత్ర విద్యలో నేను చిన్నవాడినని ఒప్పుకొని, ఇప్పటినుండి అతను చెప్పిన పనులు చేయుటకు సిద్ధముగా ఉంటాను. నాగభూషణము ఈ మోడీని తీయలేకపోతే అతను నాకంటే తక్కువ వాడని ఒప్పుకొని, అతను నేను కోరినపుడు నా పనులు చేయవలెనని ఒప్పందము చేసుకొన్నాము.

ఇపుడు ఇక్కడ మీకు కనిపించునట్లు మోడీకి ముఖ ద్వారమున్నది. ఆ ముఖ ద్వారము మీద ఒక మట్టికడువ తల్లక్రిందులుగా వేలాడదీయబడి ఉన్నది. పోటీ దారుడైన నాగభూషణము మొదట ఆ కడవను పగులగొట్టి ముఖద్వారము ద్వారా మోడీలోపలికి రావలసివుండును. తర్వాత చుట్టూ ముగ్గు వేయబడి, మధ్యలో పేడతో అలికి పూజచేసి పెట్టిన ఐదు స్థలములు ఉన్నవి. అందులో మొదటి చదరములో చీపురుకట్ట కనిపిస్తున్నది. ఆ

చీపురు కట్టను నాగభూషణము తీసి బయటికి పారవేయవలెను. దాని తర్వాత గల రెండవ చదరములో మధ్యన నిలబెట్టిన కత్తి కలదు. దానిని కూడా నాగభూషణము తీసి బయట వేయవలెను. అట్లే మూడవ చదరపు స్థలములో ఒక నిమ్మకాయ కలదు. దానిని తీసి బయటికి వేయవలెను. దాని తర్వాత నాల్గవ ముగ్గులో మూడు అడుగుల ఎత్తున్న గుడ్డబొమ్మను తీసి, ఆ ముగ్గు బయటికి వేయవలెను. చివరిలోనున్న ఐదవ చదరములో బియ్యము కుప్పమీద రూపాయి నాణెమున్నది. దానిని తీసుకవచ్చి ఈ వేదిక మీద అందరికీ చూపాలి. అట్లు అన్ని పనులు చేయగలిగితే, అప్పుడు అతను ఈ మోడీని ఎత్తివేసి గెలిచినవాడగును. ఇదేమి పెద్దపని అని అందరూ అనుకోవచ్చును. కానీ ఇది అంత సులభమైన పనికాదు. ఇంతవరకు నేను చెప్పిన వస్తువులను తీసివేయాలని నాగభూషణము ప్రయత్నించితే, నేను నా విద్యతో అతను వాటిని తీయకుండా చేయుచుందును. ఈ మోడీని తీయుటలో అతనికిగానీ, తీయకుండా చేయుటలో నాకుగానీ ఏ ప్రమాదమైనా సంభవించవచ్చును. అందుకు మేము సమ్మతించే ఈ మోడీ ప్రదర్శన పెట్టామని తెల్పుచున్నాను.

(అని చెప్పి నమస్కారము చేసి మంత్రాలమల్లయ్య తాత వేదిక దిగివచ్చాడు. వెంటనే నాగభూషణము వేదికను ఎక్కి ఇలా అన్నాడు.)

**నాగభూషణము :-** మోడీని ఎత్తి వేయడము చాలా కష్టమైనపని మరియు ప్రమాదకరమైన పని అని కూడా చెప్పవచ్చును. అయినప్పటికీ మీరు చూస్తున్నట్లే ఈ మోడీని ఎత్తివేయగలనను నమ్మకము నాకున్నది. అందుకు మీ అందరి ఆశీర్వాదము కావలెనని కోరుచున్నాను.

(అని అందరికీ నమస్కరించాడు. అప్పుడు అందరూ చప్పట్లు కొట్టారు. చప్పట్లు విన్న నాగభూషణము రెట్టింపు ఉత్సాహముతో మోడి

ముఖ ద్వారము ముందుకు వచ్చాడు. ముఖ ద్వారమునకు పది అడుగుల దూరములో ఒక కర్రను చేతిలో పట్టుకొని నిలబడి, ఏదో మంత్రమును జపించుచూ, ఒక నిమిషము తర్వాత ఉన్నట్లుండి ఒక్క పరుగున వచ్చి కడవను పగులగొట్టి ముఖ ద్వారమును దాటవలెనని ప్రయత్నించాడు. పరుగు మొదలు పెట్టిన వెంటనే ముసలివాడు పసుపు కలిపిన బియ్యమును కడవమీద చల్లాడు. అలా చల్లిన వెంటనే పైన తలక్రిందులుగా వేలాడదీసిన కడవనుండి తేనెటీగలు ఏకదాటిగా బయటికి రాను మొదలుపెట్టాయి. వందలు వేలుగా వచ్చి తేనెటీగలు నాగభూషణమును చుట్టుముట్టి గందర గోళము చేశాయి. కడవ ఎక్కుడున్నది కూడా కనిపించకుండా ముఖము మీద కుట్టను మొదలు పెట్టాయి. దట్టమైన పొగమేఘములాగ కమ్ముకొన్న ఈగల గుంపులో అక్కడ చూచువారికి కూడా ద్వారమూ కనిపించలేదు, కడవా కనిపించలేదు. తేనెటీగల ధాటికి నాగభూషణము తట్టుకోలేక వెనక్కి పరుగెత్తాడు. ఇదంతా చూస్తున్న వారికి ఆ దృశ్యము మహా అద్భుతముగా కనిపించింది. నాగభూషణము 40 అడుగుల దూరములోనికి పోయి నిలబడ్డాడు. అప్పుడు తేనెటీగలన్ని కడవలోనికి పోయాయి. బయట ఒక్కటి కూడ కనిపించలేదు. కొన్ని వేలు లక్షలుగా కనిపించిన తేనెటీగలు అన్ని ఆ కడవలో ఎలా పట్టాయో అర్థముకాలేదు. వాస్తవముగా యోచిస్తే ఆ ఈగలకు ఆ కడవలోని జాగా ఏమాత్రము సరిపోదు. అయినా ఆ కడవలోనికి అన్నీ దూరిపోవడము చూస్తున్న అందరికీ ఆశ్చర్యమును కలిగించినది. మొదట ద్వారము వద్దనే నాగభూషణమునకు మల్లయ్య తాత మంత్రబలమేమిటో అర్థమైనది. రెండవమారు నాగభూషణము ద్వారము వద్దకు వచ్చాడు. ద్వారమునకు ఆరు అడుగుల దూరములో వస్తూనే రెండవమారు కూడా తేనెటీగలు దాడిచేయడమూ అతను వెనక్కి పోవడమూ జరిగినది. ఇలా ముఖ ద్వారము వద్దనే నాగభూషణముకు

చేదు అనుభవము ఎదురైనది. రెండవమారు వెనక్కిపోయిన నాగభూషణము కొంత యోచించి తన నడుముకున్న తావెత్తులలో ఒకదానిని తీసుకొని ఒక ప్లేట్ పెట్టి దానిమీద ఇసుకను పోశాడు. అలా తావెత్తును కనిపించ కుండా ఆ ప్లేట్‌లో ఇసుకను పోసి, ఆ ప్లేట్ ఎడమచేతిలో పెట్టుకొని కర్రను నడుములో పెట్టుకొని, కుడిచేతితో కడవమీద ఇసుకను చల్లుచూ వచ్చాడు. అతను ఇసుకను కడవమీద చల్లుచూ ద్వారము మధ్యలోనికి వచ్చి నిలబడ్డాడు. అప్పుడు కడవలోనుండి ఒక ఈగకూడ బయటికి రాలేదు. నాగభూషణము వెంటనే తన నడుములో పెట్టుకొన్న కర్రతో కడవను పగులగొట్టాడు. అలా కడవను పగులగొట్టి ద్వారము దాటి మొదటి ముగ్గువద్దకు పోయాడు. ద్వారము వద్దనున్న కడవను పగులగొట్టినపుడు కడవ ముక్కలై పగిలిపోయింది. అయినా ఒక్క తేనెటీగ కూడ కడవలో కనిపించలేదు. కడవనుండి తేనెటీగలు రావడము, తిరిగి కడవలోనికి పోవడము చూచిన ప్రజలు పగిలిపోయిన కడవలో ఒక్క ఈగ కూడ కనిపించకుండా పోవడము పెద్దవింతగా తోచింది. అదేపనిగా చూడాలని వచ్చిన కొందరు హేతువాదులకు, నాస్తికవాదులకు అదెలా జరిగిందో అర్థము కాలేదు. ఆ పనితో మంత్రాల మీద నమ్మకము లేనివారు కూడా దానిని చూచి విస్తుపోయారు. ఆ మోడీని చూచుటకు కలెక్టరు, యస్.పి గారు కూడా వచ్చారు. తేనెటీగల ప్రయోగమును చూచిన వారు ఒకరి ముఖము ఒకరు చూచుకొన్నారు. మోడీ అంటే ఏమిటో తెలియనివారు మోడి ఇంత అద్భుతముగా ఉంటుందా అనుకొన్నారు.

బహుకష్టము మీద ముఖ ద్వారమును దాటిన నాగభూషణము మొదటి ముగ్గువద్దకు వచ్చాడు. మొదటి చదరపు స్థలములో మధ్యన ఒక చీపురుకట్టవుంది. ఆ చీపురుకట్టకు మల్లయ్య తాత తనవద్దనున్న కాటుకను

కొద్దిగ పూసి బయటికిపోయి ఇక రమ్మని నాగభూషణమునకు సైగ చేశాడు. అప్పుడు నాగభూషణము మంత్రోచ్చాటన చేయుచు ముగ్గులోనికి ప్రవేశించి చీపురును తీయబోయాడు. వెంటనే ఆ చీపురు గాలిలోనికి పైకి లేచింది. నాగభూషణము చేతికి దొరకుండా వెనుకవీపు మీద కొట్టను మొదలు పెట్టింది. ఆ చీపురుకట్ట తన్నులు తినలేక నాగభూషణము ముగ్గు బయటికి పరిగెత్తాడు. అతను బయటికి పోతూనే ఆ చీపురు తిరిగి తన మొదటి స్థానములో పోయి నిలచింది. తన నడుముకున్న తావెత్తును ఒకదానిని చేతితో పట్టుకొని రెండమారు లోపలికి పోయాడు. అప్పుడు కూడా ఆ చీపురు పైకి లేచి అతనిని మోదను మొదలుపెట్టింది. అది కొట్టే దానివలన నాగభూషణము చేయి అడ్డము పెట్టాడు. అప్పుడు చీపురు చేతిమీద కొట్టింది. ఆ దెబ్బకు చేతిలోని తావెత్తు క్రింద పడిపోయింది. రెండవమారు కూడా నాగభూషణము వెనుతిరిగి బయటికి వచ్చాడు. ప్రాణములేని సాధారణ చీపురు అలా కొట్టడమును చూచి అక్కడ ఉన్నవారందరూ ఆశ్చర్యచకితులైనారు. మంత్రాలకు చింతకాయలు రాలవను మాట అక్కడక్కడ విన్నవారు కూడా ఈ దృశ్యమును చూచి మంత్రాలకు చింతకాయలేమిటి తుమ్మకాయలు కూడా రాలేటట్లున్నాయని అనుకొన్నారు. ఇంకా అక్కడ ఏమి వింతలు జరుగునోయని శ్రద్ధగా చూస్తున్నారు.

రెండవమారు కూడా వెనక్కు వచ్చిన నాగభూషణము దానికి విరుగుడు యోచిస్తూ నిలుచున్నాడు. తాను నేర్చిన విద్యలన్నిటిని జ్ఞప్తికి తెచ్చుకొని కోడిని తెప్పించి, దానితోక ఈకలను పెరికి ఆ ఈకలను చేత పట్టుకొని ముందుకు పోయాడు. మొదటి మాదిరే ఆ చీపురు పైకి లేచి కొట్టను మొదలుపెట్టింది. మూడవమారు కూడా తన ఎత్తు ఫలించక తన్నులు తిని వెనక్కు వచ్చాడు. అపుడు ముసలివాడు నవ్వను మొదలు

పెట్టాడు. అలా ఐదుమార్లు మాత్రమే ప్రయత్నము చేయాలి. ఐదుమార్లు కాకపోతే ఆరవమారు చేయకూడదు. ఐదుమార్లు చేతకాని వారు ఓడిపోయినట్లు ఒప్పుకోవాలి. మూడుమార్లు విఫలమైన నాగభూషణము నకు ఇక రెండుమార్లు కూడ చేతకాదని ముసలివాడు నవ్వాడు. అక్కడ చూచేవారు కూడా ఆ చీపురును తీయలేడేమోనని అనుకొన్నారు. అప్పుడు నాగభూషణము మెదడులో ఒక ఆలోచన తోచింది. వెంటనే అతను వేప కొమ్మలను తెప్పించుకొని నడుము చుట్టు కట్టుకొని, కొన్ని కొమ్మలను చేతితో పట్టుకొని నాల్గవమారు లోపలికి పోయి చీపురును తీయబోయాడు. నాల్గవ మారు కూడా చీపురు పైకి లేచివచ్చింది. అది కొట్టను వచ్చినపుడు వేప మండలతో నాగభూషణము కూడా దానిని కొట్టాడు. వేపాకు వేటు చీపురుకు తగిలిన వెంటనే చీపురు క్రింద పడిపోయింది. వెంటనే దానిని తీసుకొని బయటికి విసిరి గట్టిగ కేక వేశాడు. చూస్తున్నవారు చప్పట్లు కొట్టారు.

ఇక రెండవ ముగ్గులోనికి పోవలసిన నాగోతుల నాగభూషణము ముసలివాడైన మంత్రాల మల్లయ్య తాతతో నేను తయారుగా ఉన్నాను అన్నాడు. ముసలివాడు తన చేతిలోని అక్షింతలను రెండవ చదరములోని కత్తిమీద చల్లి ఇక రమ్మని సైగ చేశాడు. నాగభూషణము తన నడుముకున్న తావెత్తులను అన్నిటిని తాకి మంత్రములు చదువుచూ ముందున్న ముగ్గులోనికి వచ్చాడు. అప్పుడు ఆ ముగ్గులోనున్న కత్తి గుండ్రముగా చక్రమువలె వేగముగా తిరుగను మొదలు పెట్టింది. దానికోసము చేయి ముందుకు పెట్టితే చేయి తెగిపోతుందను భయము అతనికి ఏర్పడినది. చూచువారు ఏమి జరుగునోయని చూస్తున్నారు. నాగభూషణము ఒక కట్టెను తీసుకొని వచ్చి కత్తికి అడ్డము పెట్టగా ఆ కట్టెను రెండు ముక్కలుగా కత్తి నరికివేసింది. మల్లయ్యతాత ఆ చదరము ముగ్గు బయట మంత్రిస్తూ

నిలుచున్నాడు. నాగభూషణము ముందుకు పోతే కత్తి తెగుతుందని తెలిసి ముందుకు పోకుండా, తాను కూడా భేతాళ మంత్రమును మంత్రించి ముసలివానివైపు చూచాడు. అపుడు కంటికి కనిపించని భేతాళుడు ముసలివానిని త్రోయను మొదలుపెట్టాడు. మంత్రములు చదువుచున్న మల్లయ్యతాత క్రిందపడి పోయాడు. క్రిందపడిన వాడు ఎవరో దొర్లించునట్లు నూరు అడుగుల దూరము పొర్లుచూ పోయాడు. అంతలో నాగభూషణము ఒక కోడిని తెచ్చి కత్తికి అడ్డము పెట్టాడు. కోడి తెగిపోయి దానిరక్తము కత్తికైనది. అప్పుడు కత్తి వేగము తగ్గిపోయి నిదానముగా తిరుగుచున్నది. నిదానముగా తిరుగుకత్తిని సులభముగా పట్టుకోవచ్చునని నాగభూషణము అనుకొన్నాడు. అలా వేగము తగ్గిన కత్తిని సులభముగా పట్టుకోగలడని తలచిన మల్లయ్య తాత వెంటనే లేచి వచ్చి, తనవద్దగల సంచిలోనుండి ఏదో ఆకును తీసి మంత్రించి ముగ్గులోనికి చల్లాడు. అలా చల్లబడిన ఆకులన్నియు తేళ్ళుగా మారిపోయి ముగ్గంతయు నిలుచున్నాయి. నాగభూషణము తేళ్ళను లెక్కచేయక ముగ్గులోనికి అడుగుపెట్టగానే అతనికి దగ్గరగానున్న ఒక తేలు పరుగున వచ్చి నాగభూషణము కాలికి కుట్టింది. తేలు కుట్టగానే అగ్గినిప్పు కాలినట్లయినది. వెంటనే అతను ముగ్గు బయటికి పోయి తేలు విషమునకు బాధపడుచు క్రింద కూర్చున్నాడు. అది విపరీతమైన బాధగా ఉన్నది. ఆ బాధను నివారించుకొనుటకు విషనివారణ మంత్రము మంత్రించుకొని బాధను నివారింపచేసుకొని లేచి ముందుకు పోయాడు. అక్కడున్న తేళ్ళు చూపాకారానికి తయారైనవి కావు. అన్నీ విషము నిండుకొని ఉన్న తేళ్ళని తెలిసిపోయింది. కావున దానికి పై ఎత్తుగా నాగభూషణము భూమిమీద ఒక ముక్కోణ ఆకారమును గీచి దానియందు బీజాక్షరములు వ్రాసి మంత్రించగా, వెంటనే ఆకాశమునుండి పక్షుల గుంపువచ్చి తేళ్ళనన్నిటిని ఎత్తుకొని పోయినవి. అది ప్రేక్షకులకు వింతగా కనిపించింది.

అపుడు నిదానముగా తిరుగుచున్న కత్తిని నాగభూషణము సులభముగా పట్టుకోగలిగి బయటికి పారవేశాడు.

రెండు ముగ్గులను జయించిన నాగభూషణము మూడవ ముగ్గులోని నిమ్మకాయను తీయుటకు నేను సిద్ధమేనన్నాడు. అపుడు మంత్రాల మల్లయ్య తాత మూడవ ముగ్గుచుట్టు తిరిగివచ్చి, ఒక కొరడా చేతిలో పట్టుకొని దూరముగా నిలబడి ఇక ప్రారంభించమని చెప్పాడు. అప్పుడు నాగ భూషణము నిమ్మకాయవున్న ముగ్గులోనికి వచ్చాడు. ప్రక్కన నిలబడిన ముసలివాడు తన కొరడాను గాలిలోనికి కొట్టినట్లు విసిరాడు. దూరముగా గాలిలో కొట్టిన కొరడా వేటు నాగభూషణముకు తగిలి శరీరము వాత పడింది. అలా ముసలివాడు గాలిలో కొట్టుచుండగా ముగ్గులోని నాగ భూషణమునకు ఆ దెబ్బలు తగులుచునే ఉన్నవి. వాటిని లెక్కచేయని అతను నిమ్మకాయను తీసుకోబోయాడు. కానీ ఆ నిమ్మకాయ ఆకాశము లోనికి ఎగిరిపోయింది. అది పైకి పోగా క్రింద కొరడా వేట్లకు తట్టుకోలేక నాగభూషణము ముగ్గు బయటికి వచ్చాడు. బయటికి వచ్చిన నాగభూషణము తాను కూడా ఏదో మంత్రోచ్చాటన చేయగా ముసలివాని కొరడా ముక్కలు ముక్కలుగా చీలిపోయింది. ఆకాశములోనికి ఎగిరిపోయిన నిమ్మకాయ తిరిగి క్రిందికి వచ్చి మూకటిలో నిలచిపోయింది. అపుడు తిరిగి నాగభూషణము ముగ్గులోనికి పోయాడు. అప్పుడు మల్లయ్యతాత నా ఆకాశమోడీ ఫలించునుగాక అనగానే నిమ్మకాయ పైకి ఎగిరి పోయింది. కనిపించకుండా ఆకాశములోనికి ఎగిరిపోయిన నిమ్మకాయను ఎలా రప్పించాలో నాగభూషణమునకు తెలియక పైకి చూస్తూవుండిపోయాడు. భూమిమీద అన్ని మోడీలను చూచిన నాగభూషణమునకు అకాశమోడీ విధానము ఏమీ అర్థము కాలేదు. కావున ముగ్గులోనుండి బయటికి వచ్చాడు.

అతను బయటికి వచ్చిన వెంటనే నిమ్మకాయ తిరిగి వచ్చి మూకటిలో నిలిచినది. మూడవ మారు ప్రయత్నించవలెనని అనుకొన్న నాగభూషణము నకు ఒక ఆలోచన వచ్చింది. ఈ మారు నిమ్మకాయ ఆకాశములోనికి ఎగిరిన వెంటనే క్రింద మూకటిని తీసివేయాలనుకొన్నాడు. అతను మూడవ మారు ముగ్గులోనికి పోయాడు. అప్పుడు కూడా ముందువలె నిమ్మకాయ పైకి ఎగిరిపోయింది. అలా అది పైకి పోయిన వెంటనే అక్కడున్న మూకటిని తీసుకొని బయటికి వచ్చాడు. నాగభూషణము బయటికి వస్తూనే నిమ్మకాయ క్రిందికి వచ్చి నేలమీద నిలచింది. నాల్గవమారు అతను ముగ్గులోనికి పోయిన నిమ్మకాయ పైకి ఎగిరిపోలేదు. దాని కిటుకంత మూకటిలోనే ఉన్నదనుకొన్న నాగభూషణము నిమ్మకాయను బయటికి వేశాడు. అప్పుడు అక్కడున్నవారంతా చప్పట్లు కొట్టారు. నాగభూషణము తెలివిగా పని చేశాడని అందరూ అనుకొన్నారు.

నాల్గవ ముగ్గులోనికి పోవడానికి నేను సిద్ధమేనని నాగభూషణము చెప్పాడు. మల్లయ్య తాత ప్రయత్నించమని చెప్పి ముగ్గు ప్రక్కన కూర్చొని కాటేరి, మంత్రమును చదవను మొదలుపెట్టెను. ఆ వృద్ధునికి వశములోనున్న కాటేరి మల్లయ్య తన మంత్రమును చదివిన వెంటనే మర్రివృక్షము దగ్గర నుండి ఒక్క క్షణములో అక్కడికి వచ్చి, నాల్గవ ముగ్గులోనున్న గుడ్డబొమ్మ లోనికి ఆవహించింది. ఇక ప్రారంభించమని మల్లయ్య తాత చెప్పగ నాగభూషణము ముగ్గులోనికి వచ్చి బొమ్మను పట్టుకోపోయాడు. ఆ బొమ్మ చేయిచాచి ఒక్కవేటు కొట్టింది. ఆ దెబ్బకు నాగభూషణము కళ్ళు తిరిగి ముగ్గు బయట పడినాడు. క్రిందపడిన నాగభూషణము స్మృహ తప్పి పోయాడు. అది గమనించిన వారు నీళ్ళు తెచ్చి ముఖము మీద చల్లగ అతనికి స్మృహ వచ్చినది. స్మృహ వచ్చిన తరువాత ఏవో మంత్రములు

చదువుచూ ముగ్గులోనికి రాగానే బొమ్మలో చేరుకొన్న కాటేరి తిరిగి ఒక వేటుకొట్టింది. ఆ వేటుకు నాగభూషణముకు ఎముకలు విరిగినట్లయినవి. నోటినుండి రక్తము బయటికి వచ్చినది. కాళ్ళ క్రింద భూమి కదలినట్లయి నది. రెండవమారు కూడా క్రిందపడిపోయాడు. లేచేదానికి తన శరీరములో శక్తిలేదు. ఇక నా చేతకాదనుకొనిన అతను చాలా కష్టము మీద పైకి లేచి భైరవమంత్రమును ఉపయోగించాడు. భైరవమంత్ర ప్రయోగము చేత బొమ్మ కదలక ఒకచోట నిలిచిపోయింది. అదే అదను అనుకొన్న నాగభూషణము ముగ్గులోనికి పోయి బొమ్మను పట్టుకోగలిగాడు. అప్పుడది అతనిని ఏమీ చేయలేదు. అప్పుడు నాగభూషణముకు కొంత ధైర్యము వచ్చింది. బొమ్మను ఎత్తి బయటికి వేయాలనుకొన్నాడు. కానీ బొమ్మ ఏమాత్రము కదలలేదు.

అంతలో బయటనున్న మల్లయ్య తాత "కాటేరీ నీ బలము ఏమిటో ఇపుడే చూపించు, నా మంత్రబలము ఎంతటిదో నిరూపించు" అన్నాడు. ఆ మాటను విన్న బొమ్మ నాగభూషణమును విదిలించింది. ఆ విదిలింపుకు తాను విసరివేసినట్లు దూరముగాపడ్డాడు. దూరముగా పడిన అతను నీరసముగా పైకిలేచి ఈ మారు భైరవమంత్రమును మరియు భేతాళ మంత్రమును జపిస్తూ బొమ్మమీదికి ఇసుకను చల్లి, ముగ్గులోనికి వచ్చి బొమ్మను పట్టుకోవాలనుకొన్నాడు. అతని మంత్రబలము చేత భైరవుడు, భేతాళుడు ఇద్దరూ వచ్చినాగానీ కాటేరిని ఏమీ చేయలేకపోయారు. ముసలివాడు మంత్రించిన మంత్రమునకు వారు కట్టుబడి పోయారు. నాల్గవమారు ముగ్గులోనికి వచ్చి తనను పట్టబోయిన నాగభూషణమును కాటేరిశక్తి మరియొక తన్ను తన్నింది. ఆ దెబ్బకు అతను అరుస్తూ బయటపడి రెట్టింపు కోపముతో లేచి నిలబడి తన నడుముకు వున్న మొలత్రాడును

త్రెంచి, చేతిలో పట్టుకొని, ఆ త్రాడుకు గల తావెత్తులన్నిటిని విదిలించి చూపుచూ నాగభైరవ మంత్రమును చదివి ముసలివానిమీద ప్రయోగించాడు. అప్పుడు మల్లయ్య తాత శరీరమంతా మంటలు వచ్చాయి. పాముచుట్టు కొన్నట్లు శరీరమంతా మెలికలు తిరిగి పోసాగాడు. పాము కరిచిన వానికి నోటిలో నురుగు వచ్చినట్లు నురుగువచ్చి స్పృహకోల్పోయాడు. ఇదే అదను అనుకొన్న నాగభూషణము ఏవేవో మంత్రములు చదువుచూ ముగ్గులోనికి పోయి బొమ్మను పట్టుకోపోయాడు. ఆ బొమ్మ ఈ మారు గట్టిగ తన్నింది. ఆ దెబ్బలకు మూల్గి బయటపడి స్పృహకోల్పోయాడు. ఇటు ముసలివాడు, అటు నాగ భూషణము ఇద్దరూ స్పృహలో లేరని తెలిసిన ప్రజలు వైద్యులను తెచ్చి వైద్యము చేయించారు. ఇద్దరూ అరగంట తర్వాత స్పృహలోనికి వచ్చారు. అప్పుడు ఎవరు గెలిచినదీ అర్థముకాక మీలో ఎవరు గెలిచారు అని ప్రజలు అడిగారు. అప్పుడు మల్లయ్య తాత వేదికనెక్కి "ఐదుమార్లు ప్రయత్నించి చివరకు బొమ్మను తీయలేక నిర్బలముగా బయటపడిపోయిన నాగభూషణము ఓడిపోయాడు. నాల్గవమారు బొమ్మను బయటకు తీసి చివరనున్న ఐదవ ముగ్గులో కూడా రూపాయని బయటికి తెచ్చినపుడే గెలిచినట్లగును. నాగభూషణము నాల్గవముగ్గులోనే చేతకానివాడై నీరసించి పోయాడు. బొమ్మను బయటికి తీయలేక పోయాడు. అందువలన అతను ఓడిపోయినట్లే" నని చెప్పగా, నాగభూషణము కూడ వేదికను ఎక్కి "నేనొక గొప్ప మాంత్రికుడననీ, నాకంటే మించినవాడులేడని అనుకొను నా గర్వమంతయూ నేడు పటాపంచలై పోయింది. మంత్రవిద్యయందు ఈ వృద్ధుని చేతిలో నేను పూర్తిగా ఓడిపోయానని ఒప్పుకొంటున్నాను. ఇటువంటి మోడీని నేనెప్పుడూ చూడలేదు. కదలని వస్తువులకు కదలికలను చేకూర్చి,

వాటిచేత తంతు నడిపించిన ఈ మల్లయ్య తాతను పొగడకుండా వుండలేను.” అన్నాడు. అప్పుడు జనమంతా చప్పట్లు కొట్టారు.

అంతలో మల్లయ్య తాత మాట్లాడుచూ “మీ అందరి మధ్య నాగభూషణము నన్ను గొప్పగా చెప్పడము నాకు ఎంతో సంతోషముగా ఉన్నది. ప్రాణముల మీదికొచ్చినా చివరి ప్రయత్నము వరకు సాగునది మోడీ. ఇందులో ఒక్కొక్కపుడు మరణమైన సంభవించవచ్చును. అలాంటి స్థితి మాకు ఏర్పడినపుడు మీరు వైద్యము చేసి కాపాడినందుకు మీకు ఎంతో రుణపడి ఉన్నాము. ఇది ఆకాశమోడీ, ఈ మోడీలో మొదటి నాలుగు ముగ్గులు దాటి వచ్చినప్పటికీ, ఐదవ ముగ్గులో నెగ్గి రూపాయిని బయటికి తేలేరు. ఐదవముగ్గులో ప్రవేశించిన ఎంతటి మాంత్రికునకైనా కళ్ళు కనిపించవు. తల పగిలిపోవునంత శబ్దము వానికి వినిపించుచుండును. ఆ శబ్దమునకు ఎవరు లోపల ఉండలేరు. క్రింద కాళ్ళు మంచుగడ్డ మీద మోపినట్లుండును. శరీరములో శూలములు పొడిచినట్లగును. రూపాయి నాణెము ఆకాశములోనికి పోవును. అప్పుడు బియ్యము వందమైళ్ళ వేగముతో వచ్చి ముఖమునకు కొట్టుకొనుచుండును. చెప్పాలంటే మొత్తము మీద ఈ ఆకాశమోడీ చాలా కష్టమైనది. అయినప్పటికి ఒక ద్వారము మూడు ముగ్గులు దాటి వచ్చిన నాగభూషణము ఓడిపోయినా అతను గొప్పవాడేనని చెప్పగలను” అన్నాడు. అందరి సమక్షములో ఇద్దరూ కౌగిలించుకొన్నారు. ప్రజలందరు మాంత్రికులను ఇద్దరినీ పొగడుచుండగా, మునెప్ప మనుషులు చిన్నగ వారి ప్రక్కన చేరి “ మీ పని అయిపోయింది కదా! ఇక మా పని చూడండి.” అని జ్ఞప్తి చేశారు. ఇద్దరు మాంత్రికులు తోడైన దానివలన తమపని సులభముగా అయిపోతుందనుకొన్నారు.

× × × × × × × × × × × × × × × × × × × × ×

(కడుపు నొప్పితో ఆ దినము వచ్చిన యువకున్ని రాజయోగానంద స్వామికి రాఘవ చూపాడు. రాజయోగానంద స్వామి ఆ యువకున్ని పిలిచి తన ముందర కూర్చోమన్నాడు. స్వామి చెప్పినట్లు ఆ యువకుడు స్వామి ముందర స్వామికి ఎదురుగా కూర్చున్నాడు. అప్పుడు రాజయోగా నందస్వామి అతని వైపు చూస్తూ అతని లోపలవున్న గ్రహ ఎవరో బయటికి రమ్మని చెప్పాడు. స్వామి ఆ మాట చెప్పిన వెంటనే ఆ యువకునికి శ్వాస ఎక్కువ కాజొచ్చినది. తర్వాత అతనికి జ్ఞప్తి లేకుండా పోయింది. లోపలనున్న గ్రహ బయటికి వచ్చి మాట్లాడను మొదలు పెట్టింది.)

**దయ్యము :-** నన్ను ఎందుకు పిలిచారు?

**స్వామి :-** నీతో మాట్లేడే అవసరముండి పిలిచాము. నీవు ఎవరో చెప్పు. ఈ మనిషిలో ఎందుకున్నావో చెప్పు.

**దయ్యము :-** మీరు అడిగితే నేను చెప్పాలా! నేను చెప్పను. నీ ఇష్టమొచ్చిన పని చేసుకో.

**స్వామి :-** నేనెవరో నీకు తెలియక అలా మాట్లాడుచున్నావు. ఒకమారు నావైపు చూడు నేనెవరో తెలుస్తుంది.

(అప్పుడా గ్రహ తల ఎత్తి స్వామి ముఖమువైపు చూచింది. వెంటనే తల దించుకొని చూడలేనని చెప్పింది.)

**స్వామి :-** ఇప్పుడు చెప్పు. నీవు ఎంతకాలము నుండి ఇతని శరీరములో ఉన్నావు? ఎందుకొచ్చావు.

**దయ్యము :-** నేనొక స్త్రీని, నాపేరు సత్యవతి. నేను బ్రతికివున్నపుడు ఒక వ్యక్తి చేతిలో మోసపోయి, వివాహముకాకనే గర్భవతినై సమాజములో బ్రతకలేక, ఆత్మహత్య చేసుకొని చనిపోయిన దానిని. చనిపోక ముందు జీవితమును గూర్చి ఎన్నో కలలు కనిన నేను ఈ విధముగా సూక్ష్మరూపములో

దయ్యముగా బ్రతుకవలసి వచ్చినది. నాలాగ ఎవరూ కాకూడదని నా ఉద్దేశము. ఇపుడు మీ ముందున్న యువకుడు కూడా ఒక యువతిని మోసము చేసి, ఎన్నో తియ్యని మాటలు చెప్పి, ఆమెను తన వెంట దూర ప్రాంతమునకు తీసుకవెళ్ళి, ఆమెను ఒంటరిగా వదలిపెట్టి వచ్చాడు. ఆ నిర్భాగ్యురాలు క్రొత్తప్రాంతములో దిక్కుతెలియని స్థితిలో బాధపడుచుండగ, నేను గ్రహించి ఆమె శరీరమందు చేరి, ఇలాంటి ఒక ఆశ్రమమునకు తీసుకువెళ్ళి, అక్కడున్న స్వామిని అయిన మాతాజీవద్ద వదలి వచ్చాను. ఆమె మాతాజీ దగ్గర శిష్యురాలిగా ఉండిపోయింది. ఆమెను మోసము చేసిన వ్యక్తిని ఆమె ద్వారా తెలుసుకొని, అక్కడనుండి ఇతనివద్దకు వచ్చాను. ఇతను డబ్బుగల కుటుంబములోని అమ్మాయిని ఎక్కువ కట్నము తీసుకొని వివాహము చేసుకొన్నాడు. కానీ అతని భార్యతో ఒక్కరోజు కూడా గడపలేదు. ఆమె ఇప్పటికీ కన్యగానే ఉన్నది.

ఒకప్పుడు నేను చెడిపోయినదానినై బ్రతికే ధైర్యములేక చని పోయాను. చనిపోతే ఇక నేను ఈ లోకములో లేకుండా పోతానను ఉద్దేశ్యముతో చనిపోయాను. కానీ చనిపోయినది బాహ్య శరీరమొకటేనని చనిపోయాక తెలిసింది. నేను, నేనుగానే మిగిలి ఉన్నాను. కనిపించని రూపములో తిరుగుచున్న నేను, నన్ను మోసము చేసిన వ్యక్తి మీద కక్ష తీర్చుకోవాలనుకొన్నాను. కానీ అతను అప్పటికే నా గురించి మనస్సులో బాధపడినవాడై జీవితము మీద విరక్తి కల్గి మారిపోయి ఉన్నాడు. చివరకు అతను దైవజ్ఞానమును తెలుసుకొనుచు జీవితమును గడుపుచున్నాడు. కావున అతని మీద నాకు కోపము తగ్గిపోయినది. అతనిని ఏమీ చేయలేక నాలాగా ఎవరూ బాధపడకూడదను ఉద్దేశములోనున్న నాకు ఈ ద్రోహి కనిపించాడు. ఇతను చేసిన తప్పుకు శిక్షగా వీనికి పెళ్ళైనా వీని భార్యకు

దూరముగా ఉండునట్లు చేశాను. ఎప్పటికైనా వీడు తన మొదటి యువతిని కలుసుకోవాలని నా ఉద్దేశము.

ఇంతవరకు ఇతనికున్న రోగమునుబట్టి ఎంతో మంది భూతవైద్యులు కూడా వైద్యము చేశారు. కానీ ప్రయోజనములేదు. కొందరు మాంత్రికులు నన్ను వదిలించాలని చూచారు. వారిచేత కాలేదు. నా ఉద్దేశ బలము ముందు వారి మంత్ర బలము ఏమీ చేయలేకపోయంది. నా భావము అర్థము చేసుకొనే విశాల హృదయము వారికుండదు. కావున వారికి ఎవరికీ ఈ విషయము ఇంతవరకు చెప్పలేదు. ఇతను మోసము చేసిన యువతిని ఇతనితో కలుపునట్లు బాహ్యముగా మీలాంటి వారి సహాయము తోనే జరగాలి. ఇపుడు ఆ యువతిని కలుసుకొనునట్లు మీరు ఇతనితో ఒప్పించుకుంటే, నేను ఇతని శరీరమునుండి బయటికి పోగలను. ఇక మీ ఉద్దేశమేమిటో మీరే చెప్పండి.

(ఆ గ్రహ చెప్పిన మాటలు విన్న అక్కడున్న వారంతా ఆశ్చర్య పోయారు. ముఖ్యముగా అతని వెంట వచ్చిన వారికి ఈ విషయము తెలియదు. రాఘవ ఎంతో ఆసక్తిగా ఈ విషయమును విన్నాడు. రాజయోగా నందస్వామి ఆ గ్రహ చెప్పిన మాటలలో నిజమున్నదని గ్రహించి ఆ యువకునిలోని ఆమెతో ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** సరే నీవు చెప్పినదంతా విన్నాను. అతనేమి చెప్తుతాడో అతనినే అడుగుతాను. అతనితో నేను మాట్లాడాలంటే నీవు లోపలికి పోవాలి కదా! అందువలన నీవు అణిగిపో. తర్వాత నేను పిలిచినపుడు బయటికి రా. అప్పుడు ఇతని విషయము నీకు తెలుపుతాను.

(స్వామి మాటవిన్న ఆ గ్రహ సరేనని లోపలికి అణిగి పోయింది. ఆ యువకునికి మెలుకువ వచ్చినది. అప్పుడు అతనిని స్వామి అడిగాడు.)

**రాజయోగానంద :-** ఏమయ్యా! నీవు నీ పెళ్ళికాకముందే ఒక అమ్మాయితో సంబంధము పెట్టుకొని, ఆమెను మోసము చేసినదే కాక దూరముగా విడిచి వచ్చిన మాట నిజమే కదా!

(ఆ మాట విన్న అతడు ఒక్కమారు అదిరిపడినట్లయ్యాడు. మీకెట్లు ఈ విషయము తెలిసిందని అనుమానముగా స్వామి వైపు చూచాడు.)

**రాజయోగానంద :-** అన్ని విషయములూ మాకు తెలుసు. నీవు చేసిన మోసము నీవే చెప్పితే, నీకు రోగము పోవు ఉపాయము మేము చెప్పుతాము.

(దాచిన గుట్టంతయు వీరికి తెలిసిపోయినదని ఆ యువకునికి అర్థమైనది. తమ బంధువులవైపు చూచి తల దించుకొన్నాడు. ఇక దాచితే లాభములేదని మీరు చెప్పినది నిజమేనని తన తప్పును ఒప్పుకొన్నాడు.)

**రాజయోగానంద :-** నీవు వదలివచ్చిన అమ్మాయిని తిరిగి తెచ్చుకొని ఆమెను గౌరవముగా వివాహమాడి, ఆమెతో నీవు కాపురము చేయగల్గితే, నీకున్న రోగము పోతుంది లేకపోతే నీకు ఈ రోగము పోదు.

**యువకుడు :-** నాకిప్పుడు పెళ్ళైయినది కదా!

**రాజయోగానంద :-** అందువలన నీవు, నీ భార్యతో ఈ విషయమంతా చెప్పి ఆమెను ఒప్పించుకొని, నీవు మోసము చేసిన యువతిని తిరిగి తెచ్చు కోవాలి. అలాకాకపోతే ఇపుడు నీకు పట్టిన దయ్యము నీ భార్యతో కాపురము చేయనివ్వదు తెలుసా?

(స్వామి మాటలు విన్న అతను చేయునది లేక తన రహస్యమంతా అందరికి తెలిసిపోయిందనీ, తన భార్యకు కూడా తెలిసిపోతుందనీ, దానికంటే ముందు తానే ఆమెకు విషయమంతా చెప్పుట మంచిదనుకొన్నాడు. అందువలన మీరు చెప్పినట్లే నా భార్యకు చెప్పి ఎలాగైనా నచ్చజెప్పుతానని ఒప్పుకొన్నాడు. అప్పుడు స్వామి లోపలనున్న గ్రహను పిలిచి ఇలా చెప్పాడు.)

**రాజయోగానంద :-** అతని చేత నీవు చెప్పిన విషయమును ఒప్పించాను. నీవు దయ్యముగా మారికూడా మంచిపని చేయుచున్నందుకు మాకు సంతోషముగా ఉన్నది. ఇతను ఆ యువతిని తిరిగి తెచ్చుకొనేంత వరకు ఇతనియందేవుండి, నీ ఆశయము నెరవేరిన తర్వాత నీవు కాలమును వృథాగా గడుపక ఆత్మజ్ఞానమును తెలుసుకో. జ్ఞానము తెలియని జీవితము వ్యర్థము.

(స్వామి మాటలు విన్న ఆమె కళ్ళనీళ్ళు కారుస్తూ ఇలా అన్నది.)

**దయ్యము :-** నేను శరీరముతో బ్రతికివుంటే ఇపుడు మీరు చెప్పిన మాటలను పెడచెవిన పెట్టివుండేదానినేమో. చచ్చి దయ్యమయ్యాను. కావున మీరు చెప్పుమాటల యొక్క విలువను గ్రహించగలుగుచున్నాను. తెరమీద బొమ్మలను చూచినట్లు ప్రక్కనుండి బ్రతికివున్న మనుషులను చూచి వారి యందు ఏమి లోపమున్నదో గ్రహించగల్గుచున్నాను. జ్ఞానమంటే ఏమిటో, దాని విలువ ఏమిటో ఈ బ్రతికిన మనుషులకంటే దయ్యముగానున్న నాకే బాగా తెలియును. కావున మీరు చెప్పిన మాటలను తప్పక విని జ్ఞానమును తెలుసుకొంటాను. అంతేకాదు నన్ను దయ్యమని ఎందరో అసహ్యించు కొన్నారు, కొట్టారు, తిట్టారు, హింసలు పెట్టారు, హీనముగా మాట్లాడారు. చనిపోయినప్పటికీ నేనూ మనిషినేనని వారు గుర్తించక ఏదో పీడగ తలచారు. మనుషులతో సంబంధము లేని ఏదో పిశాచముగా భావించి మాట్లాడారు. ఇపుడు మీరు మాట్లాడినట్లు, నన్ను ఒక మనిషిగా భావించి ఎవరూ మాట్లాడ లేదు. మీరు నన్ను గౌరవముగా మాట్లాడించి, నా కార్యమును మెచ్చుకొని, తర్వాత నా కర్తవ్యమును గుర్తుచేశారు. నా జన్మకు సార్థకత చేకూర్చు మార్గములో నడువమన్నారు. అందుకు నేను ధన్యురాలిని, కానీ జ్ఞానమంటే ఏమిటో తెలియకుండా చిన్నతమునుండి అజ్ఞాన వాతావరణములో పెరిగాను. తల్లి తండ్రులైన పెద్దలు కూడా ఏనాడూ దైవజ్ఞానమును గురించి

చెప్పడము కానీ లేక వారు మాట్లాడుకోవడముగానీ జరుగలేదు. అందువలన జ్ఞానమను విషయము ఏమాత్రము తెలియని నేను, ఎలా జ్ఞానమును తెలుసుకోవాలో నాకు తెలియదు. దానికి మార్గము మీరే చెప్పాలని కోరుచున్నాను.

**రాజయోగా :-** అలాగే! నీకు జ్ఞానమును తెలియుటకు మేము మార్గ దర్శకులుగా ఉందుము. ఇప్పటికైనా నీవు సంతోషించి నీ కార్యము నెరవేరిన తర్వాత తిరిగి ఇక్కడికి వచ్చి ఇక్కడేవుండి, జ్ఞానమును సంపూర్ణముగా తెలుసుకొని పవిత్రురాలిగా మారిపో.

**దయ్యము :-** స్వామి నాకు చిన్న అనుమానము నాకు శరీరము లేదు కదా! నా సంశయములను గురించి మిమ్ములను ఎలా అడుగగలను?

**రాజయోగా :-** ఈ విషయములో నీవు చింతచేయవలసిన అవసరములేదు. నీవు ఇప్పుడున్నట్లే ఉంటూ జ్ఞానమును వినవచ్చును. ఏదైనా అర్థముకాని విషయమును అడగవలసి వచ్చినపుడు, నేను చెప్పిన శరీరములో దూరి ఆ శరీరమునుండి నీవు నీ ప్రశ్నను అడిగి తెలుసుకోవచ్చును.

**దయ్యము :-** ధన్యురాలిని స్వామీ! ఈనాడు నాకు ఎంతో సంతోషముగా ఉన్నది.

**రాజయోగా :-** ఇప్పుడొక విషయమును అడుగుతాను, దానికినీవు జవాబు చెప్పవలెను. గతములో ఇతనికి కడుపునొప్పి ఉన్నపుడు దారిలో పోతూ ఇక్కడకి వచ్చారట. అప్పుడు మా రాఘవ ఇతని కడుపు మీద చేయి పెట్టి నపుడు, నొప్పి ఏమాత్రము లేకుండ పోయిందట. నేను ఏమీ చేయలేదు నొప్పి ఎలా పోయిందని అనుమానము రాఘవకు ఉన్నది. ఆ దినము ఏమి జరిగిందో నీవే చెప్పితే రాఘవకు అర్థమవుతుంది.

**దయ్యము :-** ఆ దినము వీరు అందరూ మాంత్రికుని వద్దకు పోవాలని నిర్ణయించుకొన్నారు. ఆ మాంత్రికుడు కేరళనుండి వచ్చాడనీ, అతను చాలా పెద్ద మళయాల మాంత్రికుడనీ వీరు చెప్పుచుండడము వలన నాకు కోపము వచ్చి, ఈ యువకుడిని మరీ బాధించను మొదలుపెట్టాను. వీరందరూ అన్నము తినేదానికి మంచినీరు కోసము ఇక్కడ ఆశ్రమములోనికి వచ్చారు. అప్పుడు ఇతనిని నేను అన్నము కూడా తిననియ్యలేదు. ఇతని బాధను చూచిన మీ ఆశ్రమవాసి రాఘవ ఇతనికి ఉండేది రోగమనుకొన్నాడు. ఇతనికి ఏదో ఒక విధముగ కడుపు నొప్పిని తగ్గించాలనుకొన్నాడు. కడుపును వత్తడము వలన కొంత నొప్పి కనిపించకుండ పోతుందని అతను కడుపును వత్తడము కొరకు చేయిని కడుపు మీద పెట్టాడు. అప్పుడు అతను సాధారణ మనిషికాదనీ, అతనిలో కొంత జ్ఞానశక్తి ఉందనీ, అతని స్పర్శ ద్వారా నాకు తెలిసి వెంటనే నొప్పి లేకుండా చేశాను. అలా నొప్పి కనిపించక పోవడము రాఘవకు అర్థము కాకపోయినా, వీరు మాత్రము ఈ పీడ ఇంతటితో పోయిందనుకొన్నారు. అప్పటి నుండి నేను కడుపును నొప్పించక ఇతని శరీరములోనే ఉన్నాను. ఇప్పుడు మీరు పిలిస్తే వచ్చాను. అది ఆ దినము జరిగినది.

**రాజయోగా :-** సరే నీవు ఇపుడు పోయి, తర్వాత కొంత కాలమునకు వచ్చి నాకు తెలియజేయి.

(అప్పుడు సత్యవతి అను దయ్యము ఆ యువకుని శరీరములోనికి అణిగిపోయింది. యువకుడు స్పృహలోనికి వచ్చాడు. స్వామి, వారినందరినీ పోయిరమ్మనాడు. స్వామికి నమస్కారములు తెలిపి అందరూ బయలు దేరారు. అంతవరకు రాఘవ అక్కడ జరిగిన విషయమునంతటిని శ్రద్ధగా విన్నాడు. వారు పోయిన తర్వాత స్వామితో ఇలా అన్నాడు.)

**రాఘవ :-** ఆ దినము సత్యవతి చెప్పినట్లే జరిగినది. కానీ నాలో ఉన్న శక్తి ఏమిటో నాకు తెలియదు. అది ఆమెకు ఎలా తెలిసిందో కూడా తెలియదు. నా జాతకచక్రమును తెలిసిన వారు నాలోవున్న శక్తి ఏమిటో మీకు తెలిసి వుంటుందనుకుంటాను.

**రాజయోగా :-** సత్యవతికి తెలిసినప్పుడు నాకెందుకు తెలియదు? నీకే కాదు ఇప్పుడు నీవు పెళ్ళాడపోయే దుందుభికి కూడా కొంతశక్తి ఉన్నది. ఇదంతా తర్వాత సమయమొచ్చినపుడు తెలియజేస్తాను. ఇపుడు నీ వివాహము దగ్గరకు వచ్చినది ఆ పనులు చూచుకోండి.

(రాజయోగానంద ఆశ్రమములో గూడెమునుండి ఆటవికులందరూ రాగా స్వామి సమక్షములో రాఘవ పెళ్ళి జరిగింది. రాఘవతో తన కూతురు పెళ్ళిని స్వామి దగ్గరుండి జరిపించడము మల్లుదొరకు సంతోషమైనది. మిగత గూడెము మనుషులందరు పెళ్ళి అయిపోయిన తర్వాత తమ గూడెము కు పోయారు. మల్లుదొర, యోగ, మేఘు, చక్రి మరికొందరు ముఖ్యమైన ఆడ మగవారు ఒక నెలరోజులు దుందుభికి తోడుగా ఉండాలనుకొన్నారు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(నాగోతుల నాగభూషణము, మాంత్రిక మల్లయ్య తాత, తాటి మానుమునెప్ప మనుషులు అందరు కలిసి మర్రిమాను వద్దకు పోయారు. అక్కడ పాములు ఎక్కడున్నాయోనని తెలుసుకొనుటకు వారివద్దనున్న అంజనములో చూచారు. అంజనములో వారికి పాములు కనిపించలేదు. మర్రిచెట్టు క్రిందినుండి ఎక్కడికైనా పోయినా అవి ఎక్కడున్నది, ఎంత దూరములో ఉన్నది అంజనములో తెలియును. కానీ పాముల జాడే అంజనములో కనిపించక పోవడమేమిటని నాగభూషణమునకు అర్థము కాక వృద్ధుడైన మల్లయ్యను ఇలా అడిగాడు.)

**నాగభూషణము :-** మల్లయ్య తాతా! అంజనములో పాములు ఎక్కడున్నా కనిపించాలి కదా! ఎందుకు కనిపించలేదు?

**మల్లయ్య :-** అంజనములో ఎక్కడున్నా కనిపించాలి. అలా కనిపించలేదు అంటే దానికి ఒక కారణము ఉంటుంది. మంత్రశక్తి, అంజనశక్తికంటే మించిన శక్తి సమీపములో పాములు ఉంటే అక్కడికి అంజనము పారదు. అక్కడున్న దానినిగానీ, ఆ ప్రాంతమునుగానీ చూపలేదు. మంత్రశక్తులు కూడా అక్కడ పని చేయవు. అటువంటి చోట పాములుంటే అవి కనిపించవు.

(మల్లయ్య తాత మాటలు విన్న మునెప్ప మనుషులకు నెత్తిన గుండు పడినట్లయినది. ఎటులనైన పామును పట్టివ్వవలెనని నాగభూషణమును, మల్లయ్యను వారు ప్రాధేయపడి అడిగారు. "అది ఎక్కడున్నదో తెలిస్తే కదా మేము పట్టిచ్చేది." అని మల్లయ్య అన్నాడు. మునెప్ప మనుషులకు ఏమీ అర్థముకాక తమ నాయకునికి ఆ విషయము ఎలా చెప్పాలో తెలియక మీరే ఈ విషయమును మా నాయకునికి చెప్పండి అని అడిగారు. సరేనని ఒప్పుకొన్న నాగభూషణము, మల్లయ్య అందరూ మునెప్ప దగ్గరికి పోయారు. మునెప్ప అడవిలో నివాసమేర్పరుచుకొన్న దానివలన అందరూ సులభమూ గనే అక్కడికి చేరారు. బాబా మందిరమువద్ద పోలీస్‌లు వెంబడించినప్పటి నుండి మునెప్ప పోలీస్‌లకు దొరకకుండా అడవిలో నివాసము చేసుకొన్నాడు. జనం మధ్యలో అయితే మునెప్ప దగ్గరికి పోవాలంటే చాలాకష్టము. అడవిలో ఉండుట వలన మునెప్పను సులభముగా కలుసుకోగలిగారు. మునెప్పకు నాగభూషణము, మల్లయ్య తాతను పరిచయము చేశారు. తర్వాత వెంకు, నూకా ఆ ఇద్దరి మాంత్రికులతోనే పాములు అంజనము యొక్క కన్నుకు కూడా

కనిపించడము లేదని చెప్పించారు. అంజనమునకు కూడా ఎందుకు కనిపించవో, దానికి గల కారణమును కూడా చెప్పారు. దానిని విన్న మునెప్పకు ఏమీ తోచక ఆ విషయమును వెంటనే తపస్విబాబాకు తెలియ జేయాలనుకొన్నాడు. అపుడు ఆ విషయమును తపస్వి బాబాగారికి తెలియ జేయడానికి ప్రత్యేకముగా ఏర్పరుచుకొన్న గుడిసెలోనికి పోయాడు. పోలీసుల చూపు తపస్విబాబా ఆశ్రమము వద్ద మునెప్ప మీద పడినప్పటినుండి మునెప్ప బాబాగారితో వయర్‌లెస్ ద్వారా సంబంధము పెట్టుకొన్నాడు.

ముందుగా నిర్ణయించుకొన్న ప్రకారము ప్రతి వారము వయర్‌లెస్ ఫ్రీక్వెన్సీ మార్చి వారి మాటలు ఏ పోలీస్ వయర్‌లెస్ సెట్స్‌లో తగులు కొననట్లు జాగ్రత్తగ మాట్లాడేవారు. మునెప్ప తన గుడిసెలో అమర్చుకొన్న వయర్‌లెస్ సెట్ ఆన్‌చేసి, ఫ్రీక్వెన్సీ సవరించి సిగ్నల్ పంపాడు. తపస్వి బాబాగారి ప్రత్యేక గదిలో ఒక టేబుల్‌కు అడుగు భాగమున అమర్చిన స్పీకర్ నుండి వస్తున్న సిగ్నల్స్‌ను బాబాగారు విన్నారు. ఆ సిగ్నల్స్ కూడా బాబాగారి గదిలో ఫ్యాన్ తిరుగుచున్నపుడు మాత్రమే శబ్దమవుతాయి. ఫ్యాన్ ఆఫ్‌చేస్తే స్పీకర్‌నుండి శబ్దమురాదు, అట్లే వయర్‌లెస్ సెట్ పనిచేయదు. ఆ గదిని పోలీస్ ఆఫీసర్లు చెక్ చేసినపుడు ఫ్యాన్ ఆఫ్‌లో ఉంది కావున ఎవరూ ఆ సెట్‌ను గుర్తించలేకపోయారు. అలా రహస్యముగ ఉన్న సెట్ నుండి వచ్చిన సిగ్నల్స్ విన్న బాబా వెంటనే పెన్‌లాంటి మైకును అందుకొని "హలో త్రీవన్! టువన్ హియర్ సమాచారము ఏమిటి ఓవర్" అన్నాడు. అప్పుడు మునెప్ప "హలో టువన్! మనవాళ్ళు తిరిగి వచ్చారు. వారికి ఇద్దరు మాంత్రికులు సహాయపడినప్పటికీ పని జరుగలేదు. ఆ పాముతో పాటు మరియొక పాముకూడా ఉన్నదట. ఆ రెండు పాములు జాడ

తెలియకుండా పోయాయి. మాంత్రికులు అంజనము కూడ వేసి చూచారట. అయినా అంజనమునకు కూడా కనిపించలేదట. మనవారికి ఏమీ తోచక మాంత్రికులను కూడా తీసుకొని వచ్చారు. నాకు ఏమీ అర్థము కాలేదు ఓవర్" అన్నాడు. అప్పుడు బాబాగారు " హలో త్రీవన్! అవి ఎక్కడున్నది చెప్పగలను. అంతవరకు ఆ మాంత్రికులను తలా పదివేలు ఇచ్చి నీదగ్గరే పెట్టుకో. రేపు నేను మెసేజ్ పంపగలను. సెట్ ఆఫ్ ఓవర్" అని తపస్వి బాబాగారు సెట్ ఆఫ్ చేశారు. ఈ విషయము ఎవరు మాట్లాడుచున్నదీ తెలియునట్లు మునెప్ప పేరు '3,1' అని, బాబాగారి పేరు '2,1' అని గుర్తుతో మాట్లాడారు. మునెప్ప నాగభూషణమునకు మల్లయ్యకు తలా పదివేలు డబ్బు ఇచ్చి పది రోజులు తనవద్దే ఉండమన్నారు. మాంత్రికులిద్దరు ఎప్పుడూ అంతడబ్బును చూడలేదు కావున వారికి సంతోషమైనది. మునెప్ప చెప్పినట్లు ఉంటామని ఒప్పుకొని అక్కడే ఉన్నారు.

వయర్‌లెస్ సెట్ ఆఫ్ చేసిన తపస్వి బాబాగారు కొద్దిసేపు యోచించి తన ఆధీనమందుగల సూక్ష్మరూపములను పిలిచి పాముల వివరము కావాలనీ, అవి ఎక్కడున్నది తెలుపాలనీ, అందుకొరకు ఇంతకాలము తనను వీడకుండ ఉండిన వారికి, ఈ ప్రాంతమును వదలి వెళ్ళుటకు అనుమతి ఇస్తున్నానని, 24 గంటలలోపల పాములను అన్వేషించి తిరిగి వచ్చి వాటి విషయము తెలుపాలని ఆదేశించాడు.

ఆ సూక్ష్మరూపములు తనవద్దలేకపోతే తాను మామూలు మనిషేనని, అవి ఉన్నంతవరకే తనకు ప్రత్యేకత కలదని తెలిసివున్న బాబా వాటిని ఎప్పుడూ బయటికి పంపలేదు. చివరకు ఆ దినము ఏ దారీలేదనీ, వాటిని బయటికి పంపకపోతే వజ్రాల విషయము తెలియకుండా పోవుననీ, గత్యంతరము లేక తనకు ఇష్టము లేకున్ననూ ఆ విధముగా ఆదేశించి

పంపవలసి వచ్చినది. బాబాగారివద్ద సూక్ష్మరూపములోనున్న శక్తులకు కన్నులేదు. కానీ చూపువున్నది. అందువలన కంటి పరిమితిని మించి సూక్ష్మములు ఎక్కువ దూరము చూడగలవు. బాబాగారి ఆదేశము తీసుకొన్న సూక్ష్మశరీరములు ఆశ్రమమును వదలి బయటికి వచ్చి ఒక్కొక్కమారు పది మైళ్ళ దూరము వరకు చూస్తూ పోతున్నవి. అట్లు చూస్తూపోతున్న సూక్ష్మములకు రాజయోగానంద స్వామి ఆశ్రమ ఆవరణములో ఆ రెండు పాములు కనిపించాయి. వజ్రాలున్న పామును రెండవ పాము తన వెంట తీసుకొని అక్కడ చేరినట్లు తెలుసుకొన్న ఆ సూక్ష్మములు వెంటనే వెను తిరిగి తపస్విబాబాగారి ఆశ్రమము చేరి, ఉన్న విషయము బాబాగారికి తెలియ జేశాయి. అంతేకాక ఆ ఆశ్రమము గొప్ప జ్ఞానశక్తితో కూడుకొన్నదని కూడా తెలిపాయి.

ఆ విషయమును తెలుసుకొన్న తపస్విబాబాగారు వెంటనే వయర్ లెస్ సెట్ ద్వారా తాటిమాను మునెప్పకు సమాచారమును పంపాడు. పాములు రాజయోగానంద ఆశ్రమ ఆవరణములో ఉన్నాయనీ, అది దివ్యమైన జ్ఞానశక్తికి నిలయమైనప్రాంతమనీ, అందువలననే మాంత్రికుల అంజనములు అక్కడి దృశ్యమును చూపలేకపోయాయనీ, మీరు అక్కడికి తెలివిగ పోయి పాములను తేవాలని మునెప్పకు చెప్పాడు. మునెప్ప అలాగేనని చెప్పి ఆ విషయమును తన మనుషులకు తెలిపి, రాజయోగానంద స్వామి ఆశ్రమము ప్రత్యేకతను కూడా తెలిపి జాగ్రత్తగా పోయిరమ్మన్నాడు. రాజయోగానంద స్వామి ఆశ్రమము ఐదు ఎకరముల ఆవరణములోనున్నది. కావున పగలు పోవుటకు వీలుపడదని గ్రహించిన మునెప్ప మనుషులు, రాత్రి సమయమున ఎవరూ చూడకుండా ఆ ఆవరణములో ప్రవేశించి పామును వెదకసాగారు. మునెప్ప మనుషులు ఆ రాత్రి వచ్చారని గ్రహించిన

రెండవ పాము, ఆరుబయట పడుకొన్న ఆటవికులను నిద్రలేపాలని తలచి వారివద్దకు చేరి యోగను తోకతో కొట్టింది. ఆ వేటుకు నిద్రనుండి లేచిన యోగ తమ ఆవరణములో ఎవరో ఉన్నట్లు గమనించి, మిగతావారిని కూడా లేపాడు. ఎనిమిది మంది ఆటవికులు లేచిన తర్వాత తమ ఆవరణములోనున్న వారిని జగన్నాథము మనుషులనుకొన్నారు. ఒకమారు తమచేతిలో దెబ్బలు తిని పోయిన జగన్నాథము రాత్రిపూట తమ మీదికి దాడిచేయడానికి మనుషులను పంపాడని అనుకొన్నారు. ఈ మారు వారికి బాగా బుద్ధి చెప్పాలనుకొన్నారు. అందువలన వారిని బంధించుటకు వారికి తెలియకుండా వారి సమీపమునకు చేరారు.

తమకు తెలియకుండా చాటుగా తమ సమీపమునకు వచ్చిన ఆటవికులను చూచిన మునెప్ప మనుషులు అచటనుండి ముందు తప్పించు కొని పోవాలనుకొని పారిపోవుటకు ప్రయత్నించారు. కానీ వారు పారి పోకుండ అడ్డగించి వారిని ఆటవికులు పట్టుకోగలిగారు. అలా చీకటిలో పట్టుకొన్న తర్వాత వారిని ఆశ్రమము వద్ద వెలుతురులోనికి లాక్కొని వచ్చారు. వెలుతురులో వారి ముఖములు కనిపించాయి. ఒకనాడు రైల్వేకట్టవద్ద నిమ్మతోటలో సూట్‌కేస్ కొరకు తమతో పోట్లాడి తర్వాత పాముకాటుకు గురియైనవారని ఆటవికులు గుర్తించారు. మునెప్ప మనుషులు కూడా ఆటవికులను గుర్తించారు. ఆటవికులు తమ మనస్సులో మునెప్ప మనుషులు ఇక్కడెందుకు వచ్చారని అనుకోగా, మునెప్ప మనుషులు ఆటవికులు ఇక్కడెందుకు ఉన్నారని అనుకొన్నారు. అంతలో రాఘవ అక్కడికి వచ్చాడు. పట్టుబడినది ఎవరైనదీ తెలుసుకోవాలని ఎవరు మీరని మునెప్ప మనుషులను అడిగాడు. మునెప్ప మనుషులకు ఏమి చెప్పాలో తెలియలేదు. వారు మౌనముగా ఉండి పోయారు. అప్పుడు యోగ, మేఘ కలుగజేసుకొని ఇంతకుముందు మేము నీ కోసము వెదుకుచు వచ్చినపుడే వీరిని చూచామని

చెప్పుచూ, అప్పుడు వారితో ఘర్షణ జరిగిన విషయమూ, పాము విషయుమూ, అది కరచిన విషయుమూ, రావిచెట్టు ఆకులతో విషప్రమాదమునుండి వారిని తప్పించిన విషయమూ అన్నీ చెప్పారు.

అంతా విన్న రాఘవకు వారి విషయము విచిత్రముగా తోచినది. అంతలో అక్కడికి రాజయోగానందస్వామి కూడా వచ్చాడు. స్వామికి రాఘవ తనకు ఆటవికులు చెప్పిన విషయమంతా చెప్పాడు. రాజయోగానంద స్వామి అంతావిన్న తర్వాత మునెప్ప మనుషులను ఇక్కడికి ఎందుకు వచ్చారని అడిగాడు. అపుడు వెంకు మాట్లాడుచు మేము కుందేలు వేటకు వచ్చాము. ఒక కుందేలు కనిపించింది. అది దొరకకుండా పరుగిడుచూ మీ ఆవరణములోనికి వచ్చింది. దానివెంట పరిగెత్తి వచ్చిన మేము కుందేలుకై వెదకుచుండగా మీవారు వచ్చి మమ్ములను దొంగలనుకొని పట్టుకొన్నారు అని అన్నాడు. వారి మాటలు విన్న రాఘవ ఇలా అన్నాడు.)

**రాఘవ :-** "ఒకప్పుడు సూట్‌కేస్‌లో పామును పెట్టి పోట్లాడిన మీరు, కుందేలు వేటకొచ్చామంటే మేము ఎలా నమ్మాలి? ఆ రోజు మావారి ద్వారా మీ పాము పోయిందని మీరు కక్షతో ఇపుడు మావారి మీద దెబ్బ తీయటానికి వచ్చి ఉంటారు. ఆ రోజు ప్రాణానికి తెగించి పామును పట్టుకోవాలని ప్రయత్నించిన మీరు మావారున్న చోటికే వచ్చారంటే ఇందులో ఏదో ఆంతర్యముంటుంది. అసలైన విషయమును దాచి మాకు సాకులు చెప్పుచున్నారు. నిజము చెప్పకపోతే మిమ్ములను వదలము."

**వెంకు :-** చెప్పుటకు మావద్ద ఏమీలేదు. మేము పాములు, కుందేళ్ళు పట్టుకుంటూ ఉంటాము. చర్మాల కొరకు పాములనూ, మాంసము కొరకు కుందేళ్ళనూ పట్టుకుంటాము. ఇప్పుడు కుందేలు వెంబడిపడి మీ ఆవరణ ములోనికి వచ్చాము. అంతేతప్ప వేరే ఉద్దేశము మాకు లేదు. మేము ఏమీ దొంగతనము చేయలేదు కదా!

**రాజయోగానంద :-** మా ఆశ్రమము బయలుప్రాంతములో ఉన్నది. ఇక్కడ చెట్ల పొదలులేవూ, రాళ్ళ కుప్పలూ లేవు. అలాంటపుడు ఈ ప్రాంతములో కుందేళ్ళను వేటాడడమేమిటి? కుందేళ్ళుగానీ, పాములుగానీ చెట్లపొదలూ, రాళ్ళ గుట్టలున్న చోట ఉండవచ్చును. వాటికి నివాస యోగ్యముకాని ఈ ప్రాంతములో ఎందుకుంటాయి?

**వెంకు :-** మీ ఆశ్రమము బయలుప్రాంతములో ఉండుమాట నిజమే. అయితే ఇక్కడ పచ్చగడ్డి ఎక్కువగా ఉన్నది. కావున కుందేళ్ళు గడ్డికొరకు దూరము నుండి రావచ్చును. పాములు కూడా ఉండవచ్చును. మేము ఇక్కడ పాములను చూచాము. మీరు అనుమతి ఇస్తే పాములను కూడా పట్టి చూపగలము. అపుడైనా నమ్మగలరు కదా!

**రాజయోగా :-** మా ఆశ్రమ ప్రాంతములో పాములున్నా మాకు భయము లేదు. కానీ మేము లేవు అంటే మీరు ఉన్నాయి పట్టిచూపగలము అంటున్నారు. ఉంటే పట్టిచూపండి.

(వెంకు తెలివినుపయోగించి సులభముగా పామును పట్టుకోవచ్చని వేసిన పాచికను స్వామి ఒప్పుకోవడము వలన సరిపోయింది. ఇక అందరి ఎదుట పామును పట్టుకొని చూపి దానిని తీసుకొని సులభముగా తీసుకు పోవచ్చునని అనుకొన్నాడు. వెంటనే పామును వెదకను ఆరంభించారు. ఆటవికులు కూడా వారిని అనుసరిస్తున్నారు. అక్కడ పరిస్థితిని గ్రహించిన రెండవపాము యోచించి సమయానుకూలముగా తన నోరును పెద్దగా తెరిచింది. అప్పుడు నోటిలోపల పై పెదవికి అతికియున్న మాణిక్యము యొక్క కాంతి తెల్లని ట్యూబ్‌లైట్ కాంతివలె ఎక్కువగా ప్రకాశముగా కనిపించింది. ఆ కాంతిని దూరమునుండి అందరూ చూచారు. ఆ పాము నోరు తెరిచి తిరిగి మూసుకోవడము వలన చీకటి

ఏర్పడింది. ఉన్నట్లుండి అలా కాంతి కనిపించి తిరిగి మాయమై పోవడము మునెప్ప మనుషులకు ఏమీ అర్థముకాలేదు. వారిలోనున్న నాగభూషణము నకు పాముల విషయము తెలిసినప్పటికీ మణి పాముల విషయము తెలియదు. ఆటవికులు మాత్రము అది పాముయొక్క మణి వెలుగై ఉంటుందనుకొన్నారు. కానీ అదేనని దృఢపరుచుకోలేక పోయారు. రాఘవకు తాను గుహలో చూచిన జ్ఞాపకము వచ్చినది. ఇక రాజయోగానంద స్వామి తాను కూడా దూరమునుండి వెలుగును చూచినవాడై అది పాము యొక్క మాణిక్య కాంతియేననీ, ఆ పామును పట్టుకొనుటకే వీరు దొంగలుగా వచ్చారనీ అనుకొన్నాడు.

తలలో మాణిక్యమున్న పాము, కడుపులో వజ్రములున్న పామును పిలుచుకొని పాము కొరకు వెదకుచున్న మునెప్ప మనుషలవైపే వచ్చినది. వజ్రాల పాము పది అడుగుల దూరమున్నట్లే మునెప్ప మనుషుల వద్ద సెన్సార్ మ్రోగను మొదలు పెట్టింది. ఆ శబ్దమును విన్న వెంకూకు సంతోష మైనది వారివద్దనున్న టార్చిలైట్లు వెలిగించి చూచారు. వారికి దగ్గరగా వచ్చిన మాణిక్య పాము వజ్రాల పామును వదలి లైట్లు వెలగకనే ప్రక్కకు తప్పుకుంది. వజ్రాల పాము దొరకాలనే అదలా చేసింది. అంతవరకు వారికి దొరకకుండా తప్పించిన మాణిక్యపాము ఇక్కడ అదేపనిగా దొరికే టట్లు చేసి అది కనిపించకుండా పోయింది. టార్చిలైట్ల వెలుగులో వజ్రాలున్న పాము కనిపించింది. అప్పుడు నాగభూషణము ఆ పామును సులభముగా పట్టుకోగలిగాడు. దానికోసము అనేక కష్టాలుపడిన తర్వాత ఆ పాము దొరకడము మునెప్ప మనుషులకు సంతోషమైనది. పాములోపల వజ్రాలున్న విషయము రాఘవకు గానీ, స్వామికిగానీ ఎవరికీ తెలియదు. కావున దానిని వారికి చూపి సులభముగా తీసుకపోవచ్చుననుకొన్న వెంకు ఆ పామును రాజయోగానంద స్వామికి చూపి ఇలా అన్నాడు.)

**వెంకు :-** చూడండి! ఇక్కడ పాములు కూడా ఉండవన్నారు. పామును పట్టుకొన్నాము. ఇప్పటికైనా మేము దొంగలు కాదని తెలిసింది కదా!

(అంతకు ముందే మాణిక్యము యొక్క వెలుగును చూచిన స్వామి వారు పట్టినది మాణిక్యమున్న పామేనని అనుకొన్నాడు. వారు దాని వేటకే వచ్చారని తలచిన స్వామి ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** మీరు పట్టినది సామాన్యమైన పాముకాదు. దాని యందు ఖరీదైన వస్తువున్నది. కావున దానికోసమే మీరు పొంచివచ్చారు. మావద్ద ఏదో సాకులు చెప్పి చివరకు ఆ పామును పట్టుకున్నారు. అంతేకదా!

(ఆ మాటలు విన్న మునెప్ప మనుషులు అదిరిపడ్డారు. కథ అడ్డము తిరిగిందనుకొన్నారు. మా విషయము ఈయనకెలా తెలిసిందని అనుకొన్నారు. వీరికి అంతా తెలిసిపోయిందనుకొని, ఇక ఏమి చెప్పినా ప్రయోజనములేదని, అక్కడినుండి తప్పించుకొని పోవాలని తలచి ఇలా అన్నాడు.)

**వెంకు :-** అవును మీరన్నట్లు ఈ పాముకడుపులో ఖరీదైన వజ్రములున్నవి. దీనికోసమే మేము వచ్చాము. మా పని నెరవేరింది. ఈ విషయమును ఎక్కడైనా చెప్పారంటే మీ ప్రాణాలు దక్కవు జాగ్రత్త.

(అని బయలుదేరపోయారు. స్వామి మాటలు, వారి మాటలు విన్న రాఘవకు ఏమీ అర్థము కాలేదు. పాములో వజ్రాలేమిటి? స్వామి వాటిని ఎలా పసికట్టాడు? అని రాఘవ ఆలోచనలోపడ్డాడు. వెంకు మాటలువిన్న స్వామి, నేను పాము తలలో మాణిక్యముందనుకొంటే, వీడు పాముకడుపులో వజ్రాలంటున్నాడు. అంతేకాక మమ్ములనే బెదిరించి మీ ప్రాణాలు దక్కవని అంటున్నాడు. వీరిని వదలకూడదనుకొని వీరినందరిని వదలకుండ కట్టివేయండని తనవారికి చెప్పాడు. ఆ మాటలు వింటూనే ఆటవికులూ, రాఘవా, ఆశ్రమవాసులు అందరూ కలిసి కొద్దిసేపు వారితో

పోరాడి చివరకు బంధించగలిగారు. వారివద్ద బుట్టలోనున్న పామును కూడా బుట్టతో సహా లాగుకొన్నారు. తాము ఊహించని విధముగా జరుగడము వలన చింతించిన మునెప్ప మనుషులు తమ నాయకునికి ఈ విషయము ఎలా తెలుస్తుందని అనుకోసాగారు.

ఆ వింత సంఘటనకు ఆశ్రమములోనున్న దుందుభి, రాధేశ్వరి మొదలగువారంతా ఆశ్చర్యపోయారు. రాఘవ భార్య అయిన దుందుభి ఏ పామునైనా తన చేతిలోనికి తీసుకోగలదు. పాములు ఆమెను కాటువేయవు. ఏ పామైనా సంతోషముగా ఆమె చేతిలో ఆడుకోగలదు. పాములతో ఆమె చిన్నప్పటినుండి స్నేహము చేసెడిది. అందువలన ఆమె బుట్టలోని పామును బయటికి తీసింది. రాజయోగానంద స్వామివద్దకు తెచ్చి, స్వామికి దానిని చూపింది. మునెప్ప మనుషులను ఒక గదిలో బంధించివుండడము వలన తర్వాత ఏమి జరుగుచున్నది వారికి తెలియదు. దుందుభి తన దగ్గరకు తెచ్చిన పామును చూచిన స్వామి ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** ఇది తలలో మాణిక్యముగల పాము. ఈ పాము రాత్రి నోరు తెరువడము వలన దాని కాంతిని గ్రహించాను. వీరు ఈ పాము కొరకే వచ్చివుంటారని అప్పుడే అనుకొన్నాను. కానీ వారు మనలను మోసము చేయుటకు వజ్రాలని అబద్దము చెప్పి బెదిరించి తప్పించుకొని పోవాలనుకొన్నారు.

(ఆ మాటలు విన్న రాఘవ కొద్దిగ జ్ఞాపకము తెచ్చుకొని ఇలా అన్నాడు.)

**రాఘవ :-** మాణిక్య వెలుగును నేను కూడా ఒకమారు భూగర్భ గుహలో చూచాను. రాత్రిచూచిన వెలుగు కూడా అదేలాగున్నది. ఆ కాంతి మాణిక్యముదే అయివుండవచ్చును.

**దుందుభి :-** ఇది మీరనుకొన్నట్లు మాణిక్యము గల పాముకాదు. దీని నోటిలో మాణిక్యములేదు.

(అని దుందుభి పాము నోరును తెరిచి చూపించింది. పాము నోటిలో మాణిక్యములేదు. అపుడు మునెప్ప మనుషులు చెప్పిన విషయమును దుందుభికి చెప్పాడు. అప్పుడు ఆమె పామునంతటిని పరీక్షించి దాని కడుపు భాగములో చర్మము క్రింద వజ్రాలున్నాయని గ్రహించి, ఆ విషయమును స్వామి వారికి తెలిపింది. దానిని రాఘవ, స్వామి ఇద్దరూ పరిశీలించి నిజమేనని తెలుసుకొన్నారు. తర్వాత పామును పట్టుటకు వచ్చినవారెవరో తెలుసుకోవాలనుకొన్నారు. దుందుభి, స్వామి సలహా మేరకు పాముచర్మము క్రిందినుండి పది వజ్రములను బయటికి తీసి భద్రపరిచింది. పామును తనవద్దనే ఉంచుకొన్నది. ఇదంతయూ చాటునుండి గ్రహిస్తున్న మాణిక్యపాము తన ధ్యేయము నెరవేరినట్లు తలచి, అక్కడి నుండి బయలు దేరి భూగర్భగుహలోనికి చేరింది. మాణిక్య పాము ఇంతపాత్ర నిర్వహించినదని రాఘవకుగానీ, స్వామికిగానీ తెలియదు. అవసరమొచ్చినపుడు ఈ పాము బయటికి వస్తుంది అని గుహలో మహాత్ముడు రాఘవకు చెప్పిన మాట నెరవేరింది.)

× × × × × × × × × × × × × × × × × × × × × × ×

(తమ మనుషుల నుండి సమాచారమూలేదు, వారు రానూ లేదు అని యోచిస్తున్న మునెప్ప తన మనుషులలో ఒకనిని వెంకు గుంపు ఎందుకు రాలేదో సమాచారమును సేకరించి తెలుపమని పంపాడు. అట్లు బయలు దేరినవాడు వైద్యునివలె వేషము వేసి కొన్ని ఆకులనూ, మూలికలనూ తన భుజమునకు తగిలించుకొన్న సంచిలో వేసుకొని, మునెప్ప చెప్పిన ప్రాంతము నకు చేరుకొని, కాళ్ళనొప్పులకూ, కడుపునొప్పులకూ, వాయినొప్పులకూ, మూర్ఛలకూ పత్యములేకుండా మందుఇస్తామని చెప్పుచూ ఆ ప్రాంతములో తిరుగుచూ రాజయోగానంద ఆశ్రమములోనికి ప్రవేశించాడు. అక్కడున్న

ఆటవికులకు తాను వైద్యుడనని చెప్పి, వనమూలికలతో వైద్యము పత్యము లేకుండా చేయుదునని చెప్పెను. తనతో మాట్లాడినది అడవిలో నివసించు వారని, వారికి వనమూలికలను గురించి బాగా తెలుసునని వీనికి తెలియదు. అప్పుడు వారు నీవద్ద ఏమి మూలికలున్నాయని అడిగారు. దానికి వాడు “నావద్ద గ్రంథి, అశ్వగ్రంథి, రసగ్రంథి, బ్రహ్మదండి, యమదండి, తెల్ల ఈశ్వరి, నల్ల ఈశ్వరి, స్త్రీరత్న, పురుషరత్న, జాజి, జాపత్రి, మధురము, అతిమధురము, పునుగుకొవ్వు, కణితి మూలము ఎన్నో ఉన్నాయి”. అని ఏకధాటిగ చెప్పాడు. వాడు చెప్పిన మాటతీరు చూస్తే ఎవరైన వానిని నిజమైన వైద్యునిగా ఒప్పుకోక తప్పదు. వాని మాటలు విన్న ఆటవికులు ఒకరి ముఖము ఒకరు చూచుకొని బ్రహ్మదండి ఉన్నది, కానీ యమదండి ఎక్కడా లేదే! అనుకొని ఇలా అన్నారు.)

**యోగ :-** మేము కూడా ఎన్నో మూలికలను చూచాము, కానీ బ్రహ్మదండి ఉన్నది కానీ యమదండిని ఎక్కడా చూడలేదు. నిజముగా ఆ మూలిక ఉన్నదా? అది దేనికి పనికివస్తుంది?

**వైద్యుడు :-** ఆ! ఉంది, ఎందుకులేదు? అది హిమాలయాల్లో దొరుకుతుంది. కష్టపడి తెచ్చాను. ఆ మూలికను ఉపయోగించి మనిషిలోని నిజాన్ని చెప్పించవచ్చును. రహస్యముగా దాచుకొన్న విషయములన్నీ బయట పడగలవు. దానిని ఉపయోగిస్తే ఎవరూ అసత్యమును చెప్పలేరు.

**యోగ :-** మావద్ద నిజము చెప్పని వారున్నారు. వారితో నిజము చెప్పిస్తావా?

**వైద్యుడు :-** ఓ! చెప్పిస్తాను. ముందు వారిని చూపండి. వారిని పడుకోబెట్టి, వారి ఎదమీద యమదండి మూలికను పెట్టితే వారికి తెలియకుండానే తప్పక ఉన్నదున్నట్లు చెప్పుదురు.

(అయితే వారిని నీకు చూపుతాము రా, అని ఆటవికులు వానిని పిలుచుకొని పోయి తాము బంధించియుంచిన వారిని చూపారు. వారిని చూచినవెంటనే వైద్యుడు తమ మనుషులు బంధించబడివున్నారని అర్థము చేసుకొన్నాడు. ఆ వైద్యున్ని చూచిన మునెప్ప మనుషులు తమ మనిషి మారువేషములో వచ్చాడని గ్రహించారు. ఆటవికులకు తెలియకుండా మీరు భయపడవద్దన్నట్లు సైగ చేశాడు. "వీరేనా నిజము చెప్పనివారు, నా మూలికను ఉపయోగించి వీరితో నిజము చెప్పిస్తా" అని బయటికి వచ్చి "మూలికకు కొద్దిగ పంది రక్తమును పూసి ఉపయోగించాలి. నేను పోయి పంది రక్తమును తెచ్చుకుంటాను." అని చెప్పి చిన్నగ అక్కడినుండి వెళ్ళిపోయాడు. ఆ దినము సాయంకాలము వరకు కాచుకొన్న ఆ వైద్యుడు తిరిగి రాలేదు. ఇక వాడు రాడని నిశ్చయించుకొని, వైద్యుడు వచ్చినదీ, వాడు చెప్పినదీ, వాడు పోయినదీ వాడు తిరిగిరానిదీ, అన్ని విషయములు రాఘవకు యోగ చెప్పాడు. యోగ మాటలను విన్న రాఘవకు వైద్యుడుగా వచ్చినది కూడా వీరి మనిషే అయివుంటాడు, వీరి ఆచూకీ తెలుసుకొనే దానికి వచ్చివుంటాడని అనుకొన్నాడు. ఆ విషయమునే రాఘవ ఆటవికులకు తెలుపగా వారు ఆశ్చర్యపోయారు.

వైద్యుని వేషములో పోయి వచ్చిన వాని ద్వారా తమ మనుషుల విషయమును తెలుసుకొన్న మునెప్ప, ఆ సమాచారమును తపస్విబాబాగారికి వయర్‌లెస్‌లో తెలియజేశాడు. తర్వాత బాబాగారు చెప్పిన ప్రకారము తనకు పరిచయమున్న గిరిజనుల చేత, కుందేలు వేటకు పోయిన తమ గిరిజనులను రాజయోగానంద స్వామి బంధించాడని పోలీస్ స్టేషన్‌లో కేసు వ్రాయించునట్లు చేశాడు. కేస్ వ్రాసుకొన్న సర్కిల్ ఇన్‌స్పెక్టర్ బాలప్ప పోలీసులను వెంటపెట్టుకొని రాజయోగానంద స్వామి ఆశ్రమానికి వచ్చాడు.

ఆశ్రమములో రాజయోగానంద స్వామి కుర్చీలో కూర్చొని ఉన్నాడు. రాఘవ చాపమీద క్రింద కూర్చొని ఉన్నాడు. ఆటవికులు కూడా రాఘవ ప్రక్కనే ఉన్నారు. ఆశ్రమ ఆవరణములోనికి వచ్చిన ఇన్‌స్పెక్టర్ బాలప్పకు రాఘవ లేచి ఎదురు పోయాడు. అతనిని సమీపించిన రాఘవ ఇలా అడిగాడు.)

**రాఘవ :-** ఎవరు కావాలండి?

**ఇన్‌స్పెక్టర్ :-** (రాఘవను బిర్రుగా చూస్తూ) ఎవడురా ఇక్కడ స్వామి?

(ఆ మాటకు రాఘవ ఉలిక్కిపడ్డాడు. రాజయోగానంద స్వామి ఆ మాట విని కనబొమ్మలు పైకెత్తి వచ్చిన ఆ వ్యక్తివైపు చూచాడు. రాఘవ ఏమి మాట్లాడకుండా, రాజయోగానంద స్వామివైపు చేయి చూపాడు. ఇన్‌స్పెక్టర్ స్వామివైపు వచ్చి స్వామి కూర్చొని ఉండడము చూచి "ఏయ్! ముందు లేచినిలబడు" అన్నాడు. స్వామి మౌనముగా అతని వైపు చూచాడు. కానీ లేవలేదు. అది చూచి రెచ్చిపోయిన ఇన్‌స్పెక్టర్ రెట్టింపు స్వరముతో "ఏమి వినిపించలేదా?" అన్నాడు. ఆ మాటకు వెంటనే రాఘవ ఇలా మాట్లాడాడు.)

**రాఘవ :-** ఆగవయ్యా ఆగు, ఎందుకు రెచ్చిపోయి అలా మాట్లాడుచున్నావు. కొద్దిగా తగ్గి మాట్లాడు.

**ఇన్‌స్పెక్టర్ :-** ఏమిటిరా మీతో తగ్గి మాట్లాడేది? మీలాంటి దొంగస్వాములను చాలామందిని చూచానురా, స్వాములని పేరు పెట్టుకొని మత్తు పదార్థములు అమ్ముతారా? దానిని చూచిన వారిని మీ గుట్టు బయటపడకుండునట్లు దాచి ఉంచుతారా, పైగా నన్నే తగ్గి మాట్లాడమంటారా?

(అని రాఘవ షర్టు పట్టుకొని లాగి కొట్టేదానికి చేయి పైకెత్తాడు. అదంతా చూస్తున్న దుందుభి, రాధేశ్వరి పరుగిడుచు అక్కడికి వచ్చారు.

ఆ సంఘటన చూచిన ఆటవికులు ఒక్కమారు రాఘవ దగ్గరకు వచ్చి నిలబడ్డారు. అదంతా చూచిన స్వామి ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** పోలీస్ ఉద్యోగము మనుషులను కొట్టే లైసెన్సు అనుకోవద్దు. ముందు అతని షర్టు వదిలి నాతో మాట్లాడు.

(స్వామివైపు చూచిన ఇన్‌స్పెక్టర్ బాలప్ప వెంటనే రాఘవ షర్టు వదిలి స్వామి వైపు తిరిగాడు. అప్పుడు స్వామి ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** చూడుబాబు! పుట్టుకతో అందరము మనుషులమే అయినప్పటికీ, నీ వంటిమీద ఖాకీడ్రస్సు, తలమీద టోపీ పెట్టుకొన్నంత మాత్రమున నీవు ఒక మనిషివను సత్యమును మరువవద్దు. తల్లిపాలు త్రాగకుండా, మనుషుల మమతలు పంచుకోకుండా ఏ వ్యక్తి భూమిమీద ఉండడు. పుట్టినపుడు లేని ఈ డ్రస్సు, టోపీ ఇప్పుడు వచ్చినంతమాత్రమున నేను ఒక మనిషినని మరిచిపోయి అమానుషముగా ప్రవర్తించడము మంచిది కాదు. నీవు వచ్చిన పనేమిటో చెప్పు.

**ఇన్‌స్పెక్టర్ :-** ఏమిటి నీతులు చెప్పుచున్నావు? నీహెూదా ఏమిటో, నా హెూదా ఏమిటో తెలుసా?

**రాజయోగానంద :-** నేను చెప్పునది నీతులు కాదు, జ్ఞానము, నా హెూదా తెలుసునా అంటున్నావు. నీకు ఎదురుగా ఒక బోర్డు వ్రాసి పెట్టాము. అందులో **"నీ హోదా, నీ పలుకుబడి, నీ బలము, నీ ధనము, నీ పదవి, నీ ఉద్యోగము మధ్యలో వచ్చి మధ్యలో పోవునవే. చివరకు నీ శరీరము కూడ నీ మాటవినని రోజుంది జాగ్రత్త!"** అని వ్రాసి పెట్టాము. నీవు ఒక ఉద్యోగివి. నేను ఒక యోగిని. వివరముగా చెప్పితే నీవు ఉత్తయోగివి, నేను నిండు యోగిని. అన్ని విధాల నీకంటే నేనే గొప్ప. నా హోదా

ఏమిటో చెప్పితే నీకు కొత్త భాష వినినట్లుంటుంది. నీ హోదా విషయానికి వస్తే నీవు ఒక చిన్న ఉద్యోగివి. నీకంటే ఎంతో పెద్ద హోదాలు కల్గినవారున్నారు. వారికి నీవు సెల్యూట్ చేయవలసిందే. నాది అలాంటి ఉద్యోగము కాదు. నా హోదాకు నీకంటే పెద్దవారు కూడా నన్ను గౌరవిస్తారు. నీవు కొంతవరకు చదువుకొని, ఎంతగానో ప్రాకులాడి వాని కాలు, వీని కాలు పట్టుకొని ప్రయత్నము చేసివుంటే నీకు ఉద్యోగము వచ్చినది. నేను ఒక యోగిని, మానవతా మార్గమునుండి ప్రక్క అడుగులు వేసిన వారిని, నీవు వేయుచున్నది తప్పటడుగని తెలిపి మంచిగ నడిపించునది నా బాధ్యత. నీవు తప్పు చేసినవారెవరో తెలుసుకొని ఆధారములతో సహా వారిని చట్టమునకు అప్పచెప్పడము నీ బాధ్యత. అలా కాకుండా, తప్పు చేసిన వారెవరో తెలుసుకోకుండా, తప్పుచేసినట్లు ఆధారములు లేకుండా, నేరస్థునిగా లెక్కించి మాట్లాడడము చట్టవిరుద్దము. నీవు సభ్యతగా మాట్లాడకుండ నీవెవడురా అనీ, స్వామి ఎవడురా అని పలుకుచు వచ్చావు. నీ చదువు ఏ బడిలో నేర్చావు? పైగా మత్తు పదార్థములమ్ము దొంగ స్వాములని దూషిస్తూ, అధికార మదమెక్కి రాఘవ మీదికి చేయి ఎత్తుతావా?

**ఇన్‌స్పెక్టర్ :-** ఏయ్ మర్యాదగా మాట్లాడు. నీవెవరు నన్ను దండించే దానికి, నా పై అధికారివా?

**రాఘవ :-** ఇన్‌స్పెక్టర్..... ఇప్పటికైనా నీ తప్పును నీవు తెలుసుకో? హితము బోధించు స్వామిని ఇంకొక్కమారు ఏయ్ అని అన్నావో, నీ శరీరములో రక్తము నీ నాడులలో ప్రవహించదు. నీ అధికారాలు ఊడిపోతాయి. నేనొక అధికారిననీ, నీ వెనుక డిపార్టుమెంటు బలమెంతో ఉందనీ, మీ బలము ముందర మేమెంత అనుకున్నావేమో! పోయే ప్రాణమును డిపార్టుమెంటు గానీ, ప్రభుత్వముగానీ నిలుపలేదు. నీవు ఛస్తే నీ

డిపార్టుమెంటు నీ భార్యకు పింఛను ఇవ్వగలదేమోగానీ మొగున్నివ్వలేదు. నీవు ఇక్కడికొచ్చినది ఎవరు నేరస్థులని తెలుసుకొని, వారు లొంగకపోతే నీవు దండించియైనా చట్టమునకు అప్ప చెప్పవచ్చును. ఎవరు నేరస్థులని తెలియకనే నీ ఇష్టమొచ్చినట్లు మాట్లాడితే, ఊరకవుండేదానికి ఇక్కడ జంతువులులేవు. మానావమానములు తెలిసిన మనుషులమున్నాము. మా మానమునకు, అభిమానమునకు లోపము ఏర్పడినపుడు, స్వామి గౌరవమును భంగ పరిచినపుడు మేము బ్రతికి ప్రయోజనము లేదు. నిన్ను చంపి ఆ నేరమును మేము ధైర్యముగా ఒప్పుకొంటాము.

(అని అక్కడున్న వారందరూ ఆవేశమును పొంది ఆయుధాలు తీసుకోగా, ఆ ఇన్‌స్పెక్టర్‌ను ఏమి చేస్తారో అను సమయములో అక్కడేవున్న పోలీసులు కలుగచేసుకొని, స్వామిని అలా మాట్లాడడము ఇన్‌స్పెక్టర్‌ది తప్పే. మీరు శాంతించండని నచ్చచెప్పుటకు ప్రయత్నించారు. అప్పుడు స్వామి తమవారిని ఊరక ఉండమన్నాడు. అపుడు అందరూ ఊరక ఉండిపోయారు. ఇతనితో నేను మాట్లాడుతాను మీరు ఆవేశపడవద్దండని నచ్చ చెప్పి స్వామి మాట్లాడడము మొదలు పెట్టాడు.)

**రాజయోగానంద :-** నేను మంచి చెప్పితే వినిపించుకోకుండా నీవెవరు నాపై అధికారివా? అన్నావు. నేనెవరైనది ముందే చెప్పాను. అది విని కూడా నీవు ఎవరు అన్నందుకు నేనెవరైనది నీకు బాగా అర్థమయ్యేటట్లు చెప్పెద విను. నేను నీ ప్రతి విషయమును తెలిసినవాడిని. నీ పెళ్ళి సమయములో పదిలక్షల కట్నములో పదివేలు తక్కువ ఉంటే పదివేలు ఇచ్చేంతవరకు తాళికట్టనని బెదిరించి, పదివేలను కూడా పెళ్ళిలో వసూలు చేసినవాడివి. నీవు ఒక రైతు కుటుంబము నుండి వచ్చి కూడా ఒక పేద రైతు తన బక్కచిక్కిన ఎద్దులతో ధాన్యపు బస్తాలను అమ్ముకొనుటకు టౌనుకు

వచ్చినపుడు, రోడ్డుకు అడ్డము లేకుండా అంగడి ముందర బండిని ఉంచుకొని బస్తాలను దించుకొనునపుడు, నీవు మోటర్ సైకిల్ మీదవచ్చి నీ అధికార బలమును చూపి ఆ రైతును అనవసరముగా కొట్టగా అతను కాలు విరిగి ఆస్పత్రిలో చేరాడు. కుక్కల సహాయముతో పులిని పట్టవచ్చును. దానిని అందరూ ప్రశంసిస్తారు. కానీ పులి సహాయముతో కుక్కను పట్టకూడదు. దానిని ఎవరూ ఒప్పుకోరు. స్మగ్లర్లనూ, అక్రమ రవాణా దారులనూ, దొంగలనూ, రౌడీలను అరికట్టి ప్రజలకు మేలు చేయి. అప్పుడు అందరూ నిన్ను పొగుడుతారు. అలాకాకుండ డబ్బుకొరకు మంచివారిని చెడ్డవారిగా ఆరోపించి, దొంగలు కాని వారిని దొంగలుగా, సాత్త్వికులను రౌడీలుగా వర్ణించి దుర్మార్గులను కాపాడాలనుకుంటే ఎవరూ నిన్ను పొగడరు. అందరు నిన్ను చెడ్డవాడు అంటారు.

నీవు నీ ఉద్యోగమునకు తగినట్లు ఒక్కటి కూడా మంచిపని చేయలేదు. నీవు చేసిన నీతిమాలిన పనులు ఎన్నో ఉన్నాయి. నీవు ఎవరు నాకు నీతులు చెప్పేదానికి, నాపై ఆఫీసర్‌వా? అని అడిగావు కదా! ఇప్పుడు నీవు ఇక్కడికి వచ్చి ప్రవర్తించిన విషయమును మీ డి.ఐ.జి కీ, డి.జీ.పి కీ, హోమ్‌మంత్రికీ తెలియపరచి, నీ ఇష్టమొచ్చినట్లు కొట్టుటకు, దురుసుగా ప్రవర్తించుటకు స్వేచ్ఛను ఏ రాజ్యాంగము ఇచ్చిందో అడుగు తాము. ఒక ఆశ్రమములోనికి వచ్చి, గురువు ఎదుట దురుసుగా మాట్లాడడము, నచ్చచెప్పెడి వారిమీదికి రెచ్చిపోయి చేయి చేసుకోవడము చట్టబద్ధమా? అని కోర్టులో కేసు పెట్టగలము.

మేము ఎంతో ఓర్పుతో ఇంతవరకు మాట్లాడినాము. నీవు ఒక ఉద్యోగివి. నీ క్రిందవుండువాడు నీకు సెల్యూట్ కొట్టినా, నీవు నీ పై ఉద్యోగికి సెల్యూట్ కొట్టవలసిందే. ఇక మేము ఎవరికీ నమస్కరించము. మమ్ములనే అందరూ నమస్కరిస్తారు. మా జ్ఞానమును తెలుసుకొని

మానవత్వములో మార్పుచెంది, రెండవ జన్మవలె మార్పు చెందిన మా మానసపుత్రులు ఎందరో గలరు. వారు మా విలువ తెలిసినవారై మా కోసము ప్రాణము ఇచ్చేదానికైనా సంసిద్ధమే. నన్ను నీవు అసభ్యముగ మాట్లాడిన మాటలకు నీవెనకున్న వారికి ఎవరికీ భయపడక నిన్ను ఏమైనా చేయగలరు. కానీ నీకు ఉద్యోగమున్నంత వరకే నీ వెనుక నీ డిపార్టుమెంటు ఉంటుంది. అవతల నీ గోడు వినేవారుండరు. నీ ఉద్యోగము పోయిన తర్వాత రోడ్డులో కసువూడ్చుకొను వాడు కూడా నీకు నమస్కరించడు. కానీ మాకు ఈనాడు ఉన్న మర్యాదే ఎప్పటికీ ఉండగలదు.

అంతేకాక ప్రతి పని వెనుక కనపడకవున్న పాపము, పుణ్యము అనునవి నీకు తెలియవు. ఇప్పటికే నీ పాపము నీ కర్మచక్రములో నిండి పోయినది. ఈ పోలీస్ ఉద్యోగము నీకు పది జన్మలకు సరిపడు పాపమును తెచ్చిపెట్టింది. ఇప్పటికైనా కళ్ళు తెరిచి జ్ఞానమంటే ఏమిటో తెలుసుకో. నీ పుట్టుక మరియు చావు రహస్యము తెలుసుకో. అట్లుకాక పుట్టినాను, డ్యూటీ చేసినాను అంటే ఆ పనులు పుట్టలోని చీమలు కూడా చేయుచున్నవి. ఇప్పుడు నీవు గిరిజనులవద్ద పదివేలు డబ్బు తీసుకొని వారిచ్చిన రిపోర్టుతో నన్ను అవమానించాలని వచ్చావు. నీ వెనుక ఎవరి ప్రోద్భలమున్నది నాకు తెలుసు. మావద్దగల వజ్రాల దొంగల గురించి వచ్చావు. వాస్తవముగా వజ్రాల విషయము నీకు కూడా తెలియదు. వారిని మా నిర్బంధము నుండి విడిపించి మమ్ములను అవమానించాలని వచ్చావు. కానీ వారు మావద్ద ఎందుకు చిక్కుకొన్నారో నీకు తెలియదు. నిన్నటి దినమున వైద్యునివలె వచ్చిపోయిన వ్యక్తి కూడా ఎవరో మాకు తెలుసు.

**ఇన్స్పెక్టర్ :-** మీరు అన్నీ తెలిసినవారు, అలా వారిని బంధించడము నేరము అవుతుంది.

**రాజయోగానంద :-** ఒక దేశ పౌరునిగా నేరస్థులను చట్టమునకు అప్ప చెప్పడము నా బాధ్యత. వారివెనుక గల అసలు నేరస్థులు బయటపడుటకే మేము వారిని బంధించాము. ఒక విధముగా మీరు చేయలేని పనిని మేము చేశాము.

**ఇన్‌స్పెక్టర్ :-** మీరు అన్ని విషయములు చెప్పగలుగుచున్నారు. అలాంటపుడు అసలు నేరస్థులు ఎవరో కూడా మీకు తెలిసివుంటుందనుకొంటాను.

**రాజయోగానంద :-** నాకు తెలుసు అయితే నీవు నా మాటను నమ్ముతావా? ఆధారము కావాలంటావు. ఆధారమును చట్టానికి చూపుటకు వారిని మా వద్ద బంధించాము.

**ఇన్‌స్పెక్టర్ :-** మీరు ఇంతకుముందు మాట్లాడుచూ మీవద్ద బంధింపబడిన వారు వజ్రాల దొంగలని అన్నారు. అవి ఏ వజ్రాలు?

**రాజయోగానంద :-** మన దేశములో పేరుగాంచిన దేవాలయములో పూర్వపు రాజులు దాచివుంచిన వజ్రాలను దొంగిలించి వాటిని పోలీస్‌వారు పసి కట్టకుండా తెలివిగా పాము కడుపులో పెట్టి, వేరొక స్థలమునకు చేర్చు ప్రయత్నములో ఆ పాము మావద్దకు వచ్చి చేరింది. ఆ పాము కొరకు వచ్చి దొరికిన వారే మా ఆధీనములో ఉన్నది. ఇప్పటికైనా అర్థమైందా ఎవరు దొంగలో! నీవేమో మమ్ములను దొంగలకంటే హీనముగా మాట్లాడు చూవచ్చావు.

**ఇన్‌స్పెక్టర్ :-** అలా దొరికిన వజ్రాలను మీరు ప్రభుత్వానికి అప్ప చెప్పక పోవడము నేరము అవుతుంది.

**రాజయోగానంద :-** ఆ వజ్రాలు ఫలానా దేవాలయములోనివని తెలిసినపుడే కదా మాది నేరమవుతుంది. పైగా అవి భూమిలో దొరికిన వజ్రాలు కాదు. అందువలన మాది నేరమని మీరు నిరూపించలేరు.

**ఇన్‌స్పెక్టర్ :–** మీరే చెప్పారు కదా! పేరుగాంచిన దేవాలయములోనివని.

**రాజయోగానంద :–** ఆ దేవాలయమేదని మీరు తెలుసుకోవాలి. అప్పుడు మేము మీకు అప్పజెప్పుతాము. అది ఏ దేవాలయమో గుర్తించనంత వరకు అవి మావద్దే ఉంటాయి. అవి దేవాలయములోని దేవుని ఆస్తి.

**ఇన్‌స్పెక్టర్ :–** దేవాలయము వజ్రాల కథ అటుంచి మీవద్దనున్న మనుషులను గురించి రిపోర్టు వచ్చింది కదా! దానిని గురించి ఏమంటారు?

**రాజయోగానంద :–** మీ రిపోర్టులో మేము గిరిజనులను బంధించామని వ్రాసుకొన్నారు కదా! మావద్దవున్న వారు గిరిజనులైతే కదా! వారు గిరిజనులే కాదు. నీవు విడిపించుకొని పోవాలంటే వారి పేర్లతో సహా వారిది ఫలానా ఊరు స్వంత ఊరని నేటీవ్యాసర్టిఫికేట్ తీసుకొనిరా అప్పుడు వదులుతాము.

**ఇన్‌స్పెక్టర్ :–** అది కాదు స్వామిగారూ! అంతవరకైనా వారు మా ఆధీనములో ఉండాలి. మీ ఆధీనములో ఉండకూడదు.

**రాజయోగానంద :–** మీరు పట్టుకొనివుంటే మీ ఆధీనములో ఉండాల్సిందే. మేము పట్టుకొన్నాము కదా! వారు మా ఆధీనములో ఉంటారు. మీరు తీసుకొని పోయి వారిని వదలివేయవచ్చు కదా!

**ఇన్‌స్పెక్టర్ :–** మీ దగ్గర ఉండుట చట్టము ఒప్పుకోదు స్వామీ.

**రాజయోగానంద :–** (యోగావైపు చూచి) నీవు చెప్పువారు మావద్ద వుంటే చట్టము ఒప్పుకోదు. నీవు చెప్పేవారే మావద్ద లేనప్పుడు మేము చట్టానికి విరుద్ధముగా నడిచినవారము కాదు కదా! ఒకవేళ మావద్ద గిరిజనులే వుంటే అందుకు వారు గిరిజనులను ఆధారము చూపి తీసుకపొమ్మని చెప్పుచున్నాము కదా! అలా ధృవపత్రములను నీవు తీసుకరాలేకపోతే

నేను పోకముందే గంట క్రితమే వారిని వదలి పెట్టారని వ్రాసుకో. వాస్తవానికి వారు ఎవరూ మావద్ద లేరు.

**ఇన్‌స్పెక్టర్ :-** నేను ఒకమారు చూడవచ్చా.

**రాజయోగానంద :-** నీవు వచ్చి మాట్లాడిన తీరును బట్టి ఇంతవరకు నీకు తగినట్లు మాట్లాడాము. ఇప్పుడు మాట్లాడేదేమి అంటే నీవు ఇక్కడ ఆశ్రమము అంతా చూచుకొనినా వారు ఎవరూ ఇక్కడ లేరని నీకే అర్థమవుతుంది. నీవు గిరిజనులు అంటే వారిని మేము బంధించినా సరియైన ధృవపత్రాలతో రమ్మన్నాము. మేము ఏ గిరిజనులనూ బంధించలేదు. అందువలన మేము భయపడవలసిన పనిలేదు.

**ఇన్‌స్పెక్టర్ :-** మీరు ఇంతవరకు వజ్రాల దొంగలను బంధించాము అన్నారు కదా!

**రాజయోగానంద :-** అవును, అన్నాను. మేము బంధించినది వజ్రాల దొంగలనే, ఇప్పుడు కూడా అదే చెప్పుచున్నాను కదా! నీవు అడిగేది గిరిజనులను. అదియూ మా ఆశ్రమములో బంధించామని అడుగుచున్నావు. మా ఆశ్రమములో నీవు చెప్పుచున్న వారిని బంధించలేదు అని చెప్పు చున్నాము. మేము బంధించినది వజ్రాల దొంగలను వారిని కూడా ఆశ్రమములో బంధించామని చెప్పలేదే! ఇప్పుడు కూడా ఆశ్రమములో బందీలు ఎవరూ లేరని చెప్పుచున్నాను. నా మాట మీద నమ్మకము లేకపోతే నీవు ఆశ్రమమంతా ఒకమారు చూచి ఎవరైనా మావద్ద బందీలుగా ఉన్నదీ లేనిదీ నిర్ధారించుకొని పో.

(అప్పుడు ఇన్‌స్పెక్టర్ మరియు అతనితో పాటు వచ్చిన పోలీస్‌లు స్వామియే స్వయముగా చెప్పుట వలన ఆశ్రమములో అన్ని గదులు జల్లెడ పట్టినట్లు వెతికారు. ఫలానా గదిలోనే బంధించారని రిపోర్టులో వ్రాసిన

గదిలో కూడా చూచాడు, అక్కడ ఎవరూ లేరు. వారు అంతగా చెప్పి పంపినారు. ఇక్కడ చూస్తే ఎవరూలేరని అనుకొన్న ఇన్‌స్పెక్టర్ ఏమీ తోచక స్వామికి నమస్కారము చెప్పి అక్కడనుండి పోయాడు. స్టేషన్‌కు పోయిన తర్వాత రిపోర్టు ఇచ్చిన గిరిజనులు వచ్చారు. వారిని చూచిన ఇన్‌స్పెక్టర్ ఇలా అన్నాడు.)

**ఇన్‌స్పెక్టర్ :-** ఏమిటయ్యా ఇది? నన్ను ఇరుకున పెట్టే కేసుగా ఉన్నది. అక్కడికి పోతే వారు బెదిరిస్తే భయపడే మనుషులు కారు. మీరేమో మా గిరిజనులు బందీ అయ్యారని అంటారు. వారేమో వజ్రాలు, దొంగలు అంటారు. అక్కడ చూస్తే ఎవరూ లేరు. నా తల చెడిపోయింది. నిజానికి ఏమి జరిగింది ఉన్నది ఉన్నట్లు చెప్పండి.

**గిరిజనులు :-** నిజము చెప్పేటట్లయితే నీకెందుకు పదివేలిస్తాము? మా వారిని ఎలాగైనా విడిపించు.

**ఇన్‌స్పెక్టర్ :-** నావల్ల కాదు. మీది అంతుచిక్కని వ్యవహారములాగ ఉన్నది. అక్కడికి పోయి అంతా వెదికినా మీరు చెప్పిన ఒక మనిషి కూడా లేడు. వారేమో ఏదీ అంతుచిక్కకుండా మాట్లాడి నన్నే బెదిరించి పంపారు. మీరేమో అసలు విషయము చెప్పకున్నారు. ఈ కేసులో నేనేమీ చేయలేను.

**గిరిజనులు :-** అక్కడ ఎవరూ లేకపోవడమేమిటి? ఈ ఉదయమే మా మనిషి పోయి చూచివచ్చిన తర్వాతనే నీకు చెప్పాము. మా వారు అక్కడే ఉన్నారు. ఇంకొక ఇరవై (20) వేలు డబ్బు ఇస్తాము మా వారిని అక్కడ నుండి బయటికి తీసుకరా.

(ఇన్‌స్పెక్టర్ బాలప్పకు ఏమీ అర్థము కాలేదు. వీరేమో రెట్టింపు డబ్బు ఇస్తామంటున్నారు. అక్కడేమో ఎవరూ లేరు. వీరు నిజము చెప్పరు. వారు ఎటు కాకుండా ఏమీ అర్థము కాకుండా, మేము మనుషులను

పట్టుకున్నామంటారు. అయితే వారు గిరిజనులు కాదు అంటారు. మా ఆధీనములో ఉన్నారు అంటారు. ఇక్కడ కాదు అంటారు. అని తికమక పడిపోయాడు. అక్కడికి పోయి దురుసుగా మాట్లాడిన తనది చాలా తప్పని తన మనస్సులో అనుకొన్నాడు. రాజయోగానంద ఆశ్రమములో స్వామి ఇన్‌స్పెక్టర్‌తో మాట్లాడుచూ యోగవైపు చూచినపుడు యోగ స్వామి ఉద్దేశమును గ్రహించినవాడై అక్కడినుండి మునెప్ప మనుషులున్న గదిలోనికి పోయి కట్టివేయబడివున్న వారి తలల మీద మోదుగ బదనికను తాకించాడు. అప్పుడు వారు కనిపించకుండా అక్కడే వున్నారు. తాము ఎవరికీ కనిపించ డము లేదనీ అదృశ్యముగా ఉన్నామనీ వారికి తెలియదు. ఇన్‌స్పెక్టర్ తమ గది వాకిలి తీసి చూచినపుడు వారు పిలిచినా ఇన్‌స్పెక్టరుకు తెలియలేదు. అలా అక్కడ ఇన్‌స్పెక్టరు తమను చూచి కూడా ఊరకే పోవడము వారికి ఏమీ అర్థము కాలేదు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(గిరిజనులు తమ మాటను ఇన్‌స్పెక్టర్ విని సరిగా పనిచేయలేదని ఆశ్రమానికి పోయివచ్చి అక్కడ ఎవరూ లేరంటున్నాడని, డబ్బు ఎంత ఇచ్చినా మీ పని చేస్తాడని నమ్మకములేదని మునెప్పకు గిరిజనులు విషయమంతా చెప్పారు. ఇన్‌స్పెక్టరు విషయమును విన్న మునెప్ప కథ అంతా అడ్డము తిరిగిందని, తర్వాత వివరము కొరకు మునెప్ప తపస్విబాబాను వయర్‌లెస్ ద్వారా సంప్రదించాడు. విషయమును తెలుసుకొన్న బాబాగారు స్పందించి వజ్రాల విషయము బయటపడి రట్టయి పోగలదనీ, తీగలాగితే డొంక అంతా కదిలేలావుందనీ యోచించి వజ్రాలు పోయిన ఫరవాలేదు. ఈ విషయము పోలీస్‌వారికి తెలియకూడదనీ, మీ వారిని గురించి ఏమీ పట్టించుకోవద్దు. రాజయోగానంద స్వామి తర్వాత ఏమి చేయుటకు పూనుకొంటారో చూచి తర్వాత ఆలోచిద్దాము అని చెప్పగా, మునెప్ప

అలాగేనని చెప్పాడు. మునెప్ప ఆ విషయమును అంతటితో అణచివేయుటకు యోచించి తమవద్దయున్న గిరిజనులను తిరిగి ఇన్‌స్పెక్టర్ దగ్గరికి పోయి మాట్లాడమని అక్కడ మాట్లాడ వలసిన విషయమంతా చెప్పి పంపాడు.

గిరిజనులు ఇన్‌స్పెక్టర్ దగ్గరికిపోయి స్వామి ఆశ్రమములో బందీలైనారనుకొన్న మావారు వచ్చారు. మావారు వేట పనిమీద దూర ప్రాంతమునకు పోయి వచ్చారట. మావారు రాలేదని మేము అనుకొంటూ వుంటే ఎవరో గిట్టని వారు మీవారిని ఆశ్రమములో బంధించారని చెప్పారు. ఆ విషయమును మేము మీతో చెప్పడము, మీరు అక్కడికి పోయి రావడము మొత్తానికి మాదే తప్పు అని చెప్పారు. ఆశ్రమములో ఎవరూ కనిపించ లేదు కాబట్టి గిరిజనులు చెప్పునది నిజమేనని, వారు పొరపాటుగా చెప్పారని ఇన్‌స్పెక్టర్ కూడా అనుకున్నాడు. ఆ విషయము పోలీస్‌స్టేషన్‌లో అంతటితో అణిగి పోయింది. ఇన్‌స్పెక్టర్ రెండవరోజు రాజయోగానంద స్వామి వద్దకు పోయి తనను క్షమించమని ఎవరో ఇచ్చిన తప్పుడు సమాచారము వలన మేము ఇక్కడికి రావడము జరిగిందని తన తప్పుకు క్షమాపణ కోరి వచ్చాడు.

రాజయోగానంద స్వామి మల్లుదొరకు సమాచారమును పంపించి తనవద్దకు వచ్చునట్లు చేసుకొని జరిగిన విషయమంతా మల్లుదొరకు చెప్పి వజ్రములను జాగ్రత్తగా తన సంరక్షణలో పెట్టుకొమ్మని చెప్పి ఒక మంచి రోజు చూచి తీసుకపొమ్మన్నాడు. తర్వాత మునెప్ప మనుషులవద్దకు పోయి వారితో స్నేహపూర్వకముగా మాట్లాడుచూ "మిమ్ములను దోషులుగా మేము లెక్కించడము లేదు. మీరు బ్రతుకుతెరువు కొరకు ఏదో ఒక పనిని చేయాలని చేయుచున్నారు తప్ప ఇందులో మీ తప్పు ఏమీ లేదు. ఎవరో ఎక్కడో కూర్చొని వారి లాభము కొరకు మిమ్ములను ఆడిస్తూవుంటారు. నిజమైన

దోషులు మీ వెనుక ఉన్నవారు తప్ప మీరు కాదు. ఇప్పటికీ మీరు ఈ విషయములో చాలా కష్టపడివున్నట్లున్నారు. ఇప్పుడు మిమ్ములను విడిపించుటకు ఎవరూ రారు. ఈ విషయము బయటికి పొక్కుతుందని కొన్ని రోజులు ఊరక వుండడము మంచిదని అనుకొన్నారు. మీది ఇందులో ఏ తప్పులేని దానివలన మేము మిమ్ములను వదలి పెట్టాలనుకొన్నాము. ఇప్పటికైనా స్వామి ఎలాంటివాడో మీరు అర్థము చేసుకోగలరనుకుంటాను." అని స్వామి చెప్పగా అందరూ స్వామికి నమస్కరించి "స్వామి మేము కడుపుకొరకు తప్పుడు పనులు చేయుచుండుట వాస్తవమే, మీరు ఎంతో ఉదార స్వభావులు మేము తప్పుచేసినా, మాది తప్పుకాదు మిమ్ములను నడిపించువారిది తప్పన్నారు. ఆ మాట మమ్ములను ఎంతో సంతోష పరిచినది. మిమ్ములను ఎప్పుడూ మరిచిపోము" అని అక్కడి నుండి పోయారు.

ఆ ముఠాలో డబ్బు ఆశకు వచ్చిన మాంత్రిక వృద్ధుడు, నాగ భూషణము వారినుండి బయటపడి పోవాలనుకొన్నారు. అందరూ కలిసి అడవిలో రహస్యముగనున్న మునెప్పవద్దకు వచ్చారు. మునెప్ప దగ్గరకు పోయిన తర్వాత ఇద్దరు మాంత్రికులు తమ ఉద్దేశమును తెల్పగ మునెప్ప సమ్మతించి ఒక కండీషన్ మీద వదలుతామని చెప్పాడు. ఆ నిబంధనలో ఇంతవరకు ఇక్కడ చూచిన విషయములుగానీ, విన్న విషయములనుగానీ బయట ఎక్కడా చెప్పకూడదు. ఎప్పుడైనా పని పడినపుడు పిలచిన వెంటనే రావలయును అని చెప్పారు. దానికి నాగభూషణము, మల్లయ్య తాత ఇద్దరూ ఒప్పుకొన్నారు. ఆ నిబంధనకు ఒప్పుకొన్నందుకు వారికి మరి కొంత డబ్బు ఇచ్చి పంపాడు)

× × × × × × × × × × × × × × × × × × × × × × ×

(తాటిమాను మునెప్ప మనుషులు విడుదలై వచ్చారని తెలుసుకొన్న తపస్విబాబా సంతోషించి, తెలివితక్కువగా ప్రవర్తించి ఎక్కడా ఇరుక్కోకుండా మునెప్పను మందలించి మరొక పనిని అప్పగించుటకు వయర్‌లెస్‌లో ఇలా అన్నాడు.)

**తపస్విబాబా :-** హలో 31 (మునెప్పా) ఇంతవరకు నీవు తెలివితక్కువగా ప్రవర్తించి ఏ పనిని సరిగా చేయలేకపోయావు. నీవలన అపారమైన నష్టము ఏర్పడినది. కోట్లు విలువచేసే వజ్రాలను చేజారవిడుచుకొన్నాము. అవి ఎవరికి దొరకకూడదో వారికే దొరికాయి. వారు తిరిగి ఆ వజ్రాలను దేవాలయానికే చేరుస్తారు. అవి ఎప్పటిలాగే దేవాలయములో భద్రపరుచ బడును. అలా కథ తిరిగి మొదటికి రావడమేకాక, వాటికి భద్రత కూడా ఎక్కువగును. మొదటి మాదిరి వాటిని మనము కబళించలేము. అంతేకాక ఆ వజ్రాలమీద ఆశకల్గి వాటిని ఎలాగైనా తన హస్తగతము చేసుకోవాలను కొన్న వ్యక్తి మరొకడున్నాడు. అతడే జఠాజూటస్వామి. ఈ మారు వాడు మనకంటే తీక్షణముగా ఉండి, మన చేతబడకుండ వాటిని ఎగరేసుక పోయే ప్రమాదమున్నది. ఇపుడు గడచినది చిన్న గండమే. జఠాజూటస్వామి అను పేరుతో చలామణి అగుచూ, విశేష ప్రజల భక్తి విశ్వాసాల పాత్రుడై, ఆలయములోనే నివాసమేర్పరుచుకొని వజ్రాలను కొట్టివేయాలనుకొన్న వాని నుండి మనము కొట్టివేయడము చాలాకష్టము. అయినా మనము వానికంటే చురుకుగా వుండి, ఆ వజ్రాలను ఎలాగైనా దక్కించుకోవాలి. ఏమంటావు చెప్పు? ఓవర్!

**మునెప్ప :-** హలో 21 (తపస్విబాబా) మీమాటే మామాట. మీ నిర్ణయమే

మా నిర్ణయము, మీరు ఎలా చెప్పితే అలా చేస్తాము. మీరు అంతగా చెప్పుచున్న ఆ జఠాజూటస్వామి ఎవరో, ఏమి చేస్తుంటాడో అతని వివరమంతా తెలుపవలసిందిగా కోరుచున్నాను, ఓవర్!

**తపస్విబాబా :–** హలో 31, జఠాజూటస్వామి వేషములోనున్న వాడు పెద్ద మాంత్రికుడు. వాడు సంపాదించిన మంత్రశక్తి వలన జరిగెడు పనులన్నీ గొప్ప మహత్యములని తలచిన ప్రజలు, అతని మీద విశేషమైన భక్తి శ్రద్ధలు చూపుచున్నారు. అతని మహత్యముల మీద ఎవరికీ అనుమానము రానట్లు అతనివి అన్నీ దైవికములే అన్నట్లు అతని ప్రవర్తనా, మహత్యములు ఉన్నవి. అతను మళయాల దేశమునకు సంబంధించినవాడు. మాంత్రిక విద్యలకు మళయాల దేశము పుట్టినిల్లు. కావున వాటి వివరము తెలిసిన వాడై చిల్లర మంత్రముల జోలికి పోకుండా, గొప్ప మంత్రమును ఎన్నుకొని దాని ప్రకారము సాధన చేశాడు. ఆ సాధన 12 సంవత్సరములు స్మశానములో చేశాడు. 12 సంవత్సరములు ఒక పూట భోజనముతో తీవ్రమైన జపము చేయుట వలన స్మశాన వాటికలలోని రుద్రగణములైన భూత, ప్రేత, పిశాచములు అన్నీ అతని వశమైపోయాయి. అలా వశమై వుండుట వలన అతని పేరు మీద గానీ, అతని ఫోటో పెట్టుకొనిగానీ భజనను చేస్తే, భజన జరిగేటప్పుడు, ఆ ప్రాంత భూత, ప్రేత, పిశాచ గణములు అక్కడ భజనలోనున్న కొందరి శరీరములలో చేరి ఆనందముతో గంతులు వేయడమూ, నాట్యము చేయడమూ, దొర్లడమూ మొదలగునవి చేయును. ఆ విధముగ ఎవరి భజనలోనూ జరుగక, ఒక జఠాజూట స్వామివారి భజనలోనే జరుగడము వలన ఆ స్వామిని నిజముగా గొప్ప దైవశక్తి కలవాడనీ, కైలాసమునుండి దిగివచ్చిన శివునిగా భావించి శివుడే ఇలా పుట్టాడని అనుకొనుచుందురు. అతని తలమీద వెంట్రుకలన్ని కలిసి

ఒకే జడగా ఏర్పడిన దానివలన అతనికి జఠాజూట స్వామి అను పేరు వచ్చినది. అంతేకాక ఆయన కౌపీనము (గోచిగుడ్డ) ధరించి, జింక చర్మము నడుముకు కట్టి, త్రిశూలము చేతపట్టివుండును. ఆ వేషముతో ఆయన గొప్పవాడన్నట్లు కనిపించుచుండును. ఆయన ఎదుటగానీ, ఆయన చిత్రపటము ఎదుటగానీ భజన చేయువారు కొందరు తమకు తెలియకనే ఆడుచుందురు. అప్పుడు వారికి ఏమాత్రము జ్ఞప్తివుండదు. వారిలో చేరి ఆడినవి భూత, ప్రేత, పిశాచములని ఎవరికీ తెలియదు.

అందువలన జఠాజూటస్వామి పేరుగాంచినవాడై అప్పుడప్పుడు పర్యటన చేస్తూ, దేవాలయములలో మకాము వేస్తూ ఉండును. ఇప్పుడు భువనేశ్వరి ఆలయములోనే ఉన్నాడు. వజ్రాలను కాజేయాలని ఆ ఆలయానికి పోయాడు. అతనికంటే ముందు అక్కడినుండి ఆ వజ్రాలను మనము దొంగిలించినట్లు ఆయనకు తెలియదు. అందువలన అతను అక్కడే ఉండి వజ్రాల కొరకు పథకము వేయుచున్నాడు. ఇప్పుడు రాజయోగానంద తిరిగి భువనేశ్వరి దేవాలయములో ఆ వజ్రాలనుంచితే వాటిని మనకంటే ముందు ఆ జఠాజూట స్వామియే కొట్టివేయవచ్చును. అందువలన మనము, మన మనుషులను ఆయన భక్తులుగా ఉండునట్లు నటిస్తూ అతని ప్రతీ చర్యను గమనించి ఎప్పటికప్పుడు మనకు తెలియ జేయునట్లు చేయవలెను. ధనమంటే ఆశలేని మనిషి రాజయోగానంద. అతను వజ్రాలను తనవద్ద ఉంచుకోక తిరిగి భువనేశ్వరి ఆలయమునకే చేర్చగలడు. అందువలన దేవాలయము మీద, జఠాజూటస్వామి మీద నిఘా ఉంచండి. ఈ మారు జాగ్రత్తగా ప్రవర్తించండి. ఇంతవరకు మనకు సహకరించిన మాంత్రికుల మీద కూడా నిఘావుంచండి. వారు ఎక్కడైనా మన విషయము బయటపెట్టితే వారిని చంపివేయండి. ముఖ్యముగా మన విషయము బయటపడకూడదు, ఓవర్!

**మునెప్ప :-** అలాగే 21 అవసరమైనపుడు కబురు చేయగలను, ఓవర్!

(అప్పుడు మునెప్ప తన వారినందరినీ పిలిచి, జఠాజూట స్వామి వారి విషయమంతా తెలిపి, ఇక మీదట తెలివిగా ప్రవర్తించాలని చెప్పి, నిఘా కొరకు భువనేశ్వరి దేవాలయమునకు ఇద్దరు మనుషులను పొమ్మని చెప్పి భవిష్యత్తు కార్యాచరణను గురించి యోచిస్తూ, చిన్నగా నిద్రలోనికి పోయాడు. ఉదయము లేచి దినపత్రికను చూచాడు. అందులో మొదటి పేజీలోనే పెద్ద అక్షరములతో "భువనేశ్వరి దేవాలయములోని వజ్రాలు మాయం" అను హెడ్డింగ్‌ను చూచాడు. దానిలో ఇలా ఉన్నది. "రాజుల కాలము నాటి సంపదైన పది వజ్రములు భువనేశ్వరి కోశాగారములోనున్న విషయము చాలామందికి తెలియక పోయినప్పటికీ, ఆలయ కమిటీకి పూర్తి వివరములు తెలుసు. కోశాగారము యొక్క తాళములు ఆలయధర్మకర్త దగ్గర మరియు కమిటీ ప్రెసిడెంట్ దగ్గర ఉన్నాయి. వారిద్దరు కలిసి తీస్తేగాని తాళము రాదు. వేసిన తాళము వేసినట్లేవుండి లోపలి వజ్రములు మాయమైనట్లు రిపోర్టు ఇవ్వబడినది. ఉత్సవములో భువనేశ్వరి మాత అలంకారమునకు కావలసిన ఆభరణముల కొరకు తలుపులు తీసినపుడు కోశాగారములో వజ్రములు కనిపించనట్లు కమిటీ తెలిపినది. దీనివెనుక తాటిమాను మునెప్ప దోపిడీ ముఠా హస్తమున్నట్లు పోలీసు వర్గాలు అభిప్రాయపడుచున్నాయి. కొద్ది రోజులలో విశేషమైన దర్యాప్తు జరుపు తామని పోలీసులు తెలిపారు." అను వార్తను చదివి మునెప్ప నివ్వెర పోయాడు. ఈ వార్తను పేపరులో చదివిన మునెప్ప స్నేహితుడు మరియొక పెద్దదోపిడీ ముఠా నాయకుడైన "హీరో" అనునతడు మునెప్పవద్దకు వచ్చి ఇలా అన్నాడు.)

**హీరో :-** ఏమిరా మునెప్ప, నీవు చాలా పెద్దపని చేసినట్లు పేపరులో చూచాను. నిజమేనా?

**మునెప్ప :-** ఇప్పుడు నాకంటే నీవే మేలురా, నేను ఏమి ప్రయోజనము లేనివాడనైనాను.

**హీరో :-** అదేమిటిరా. ఈ దోపిడీ నీకు తెలియదా!

**మునెప్ప :-** ఎందుకు తెలియదు. చేసింది నేనే కదా! కానీ వజ్రాలు నాకు దక్కలేదు. అవి మధ్యలోనే నా చేయి జారిపోయాయి. మావారి అశ్రద్ధ వలన నేను వేసిన ప్లానంతా వృథా అయింది.

**హీరో :-** ఏమిరా, ఎలా చేశావు. ఎలా విఫలమైంది, నాకు చెప్పరా!

**మునెప్ప :-** నేను శిక్షణ ఇచ్చిన రాజా అను చిన్న కోతిని ఆలయప్రాంతము లోని కోతులలో కలిసిపోవునట్లు అలవాటు చేశాను. అది పగటిపూట వాటితో కలిసివుండి రాత్రిపూట నావద్దకు వచ్చేది. బిక్షగాని వేషములో నేను రెండు నెలలు ఆలయ మెట్లమీద ఉంటూ చివరకు ఒకరోజు నా సూచన ప్రకారము ఆ కోతి గాలికొరకు ఉంచిన చిన్న కిటికీ ద్వారా కోశాగారములోనికి ప్రవేశించి, నేను సూచించిన బీరువాను గుర్తించింది. నేను ఇచ్చిన రబ్బరు క్యాప్సిల్‌ను బీరువారంధ్రములోనికి దూర్చింది. అప్పుడు ఆ క్యాప్సిల్‌లోని కెమికల్ బీరువా తాళలమును కరిగించివేసింది. బీరువా సులభముగా తెరుచుకొంది. నావద్ద తర్ఫీదు పొందిన తెలివైన కోతి బీరువా యందు వెదురుబొంగులో దాచబడిన వజ్రములను తీసుకొని నోటి దవడలలో పెట్టుకొని వచ్చి, చీకటి పడిన తర్వాత నాకందించింది. నాతోపాటు పామును ఆడించు వాని వేషములోనున్న నా తమ్ముడు వెంకూకు నేను ఆ వజ్రములను అందించాను. ఆ రాత్రి తనవద్ద కొత్తగా పట్టితెచ్చిన విషపు

కోరలు తీయని నాగుపాము చర్మము క్రింద వజ్రములను దాచి, ప్రయాణికుని వేషములో వచ్చిన నూకాకు సూట్‌కేస్‌లో పామును పెట్టి ఇచ్చాడు. సి.ఐ.డీల నిఘా ఆ సూట్‌కేస్ మీద పడిందని అనుమానించిన వెంకు, నూకా ఇద్దరూ దానిని రైలునుండి క్రిందికి వేసి ప్రక్కస్టేషన్‌లో దిగి వెంటనే పోయారు. ఎవరూ మనుషులు లేనిచోట చెట్ల పొదలలోనికి వేసిన సూట్‌కేస్ కనిపించ కుండా పోయింది. అది ఇతరుల చేతిలో ఉందని, ఎంత ప్రయత్నించినా మా ప్రయత్నము విఫలమైనది. పోలీసులేమో మమ్ములను అనుమాని స్తున్నారు. వజ్రాలేమో మాకు దొరకలేదు. వాటికొరకు తిరిగి ప్రయత్నించా లనుకొన్నాను. ఒరే హీరో! ఈ విషయములో నీవు కూడా మాకు సహాయపడాలి.

(సరేనన్నాడు హీరో. ఇద్దరూ కలిసి ఆ పనిని ఎలాగైనా నెరవేర్చాలనుకొన్నారు.)

× × × × × × × × × × ×× ×× × × × × × × × × × ×

(ఇన్‌స్పెక్టర్ బాలప్పకు న్యూస్‌పేపరు చదివాక అందులో భువనేశ్వరి దేవాలయ దొంగతనమునకు, రాజయోగానంద చెప్పిన వజ్రాలకు ఏమైనా సంబంధముందేమోనని అనుమానము వచ్చినది. ఈ న్యూస్ రాకనే రాజయోగానంద ప్రముఖ దేవాలయములో దొంగతనము జరిగిందని ఆ దొంగలను మేము పట్టుకొన్నామని చెప్పడము చూస్తే, ఈ దొంగతనము ఆయన చెప్పినట్లే ముందే జరిగివుంటుంది. రాజయోగానంద చెప్పిన విషయము తనకు తప్ప ఎవరికీ తెలియదని, ఈ సాకుతో కొంత డబ్బునైనా సంపాదించవచ్చు లేకపోతే ప్రమోషనైనా పొందవచ్చుననుకొన్నాడు. వెంటనే రాజయోగానంద ఆశ్రమమునకు బయలుదేరి పోయాడు. ఇన్‌స్పెక్టర్ బాలప్ప రాకను చూచి ఆశ్రమములోని వారందరూ అతనివైపు వచ్చారు. బాలప్ప స్వామితో ఇలా అన్నాడు.)

**ఇన్స్పెక్టర్ :–** మీరు వజ్రాలు దొరికాయన్నారు కదా! అవి భువనేశ్వరి దేవాలయములోవని ఈ రోజు న్యూస్వచ్చినది. అవి దొంగిలించబడ్డాయి. దొంగలు ఎవరో ఇంతవరకు తెలియదు. ఆ వజ్రాలే మీవద్ద ఉన్నాయని మాకు అనుమానముగా ఉన్నది. మీవద్ద వజ్రాలున్న విషయము నాకొక్కనికే తెలుసు. మా డిపార్టుమెంటుకు తెలిస్తే మిమ్ములను ఇంటరాగేషన్కు లాగుతారు. అప్పుడు మీరే దొంగలని అనుమానించవచ్చును. ఆ గొడవంతా లేకుండా నాకు 50వేల రూపాయలిస్తే దానిని కొందరికి ఖర్చుపెట్టి, మీ మీదకు కేస్ రాకుండా చూచుకొంటాను. మీవద్దవుండే వజ్రాలు కోట్ల విలువ చేస్తాయి. అవి మీవద్ద ఉంటేనే మంచిది. మీరు మంచి పనికి ఉపయోగిస్తారు. అందువలన వాటిని గురించి నేను పట్టించుకోను. అవి మీవద్ద ఉన్నట్లు కూడా తెలుపను. ఈ కేస్ను అణచివేసేదానికి కొంత ఖర్చవుతుంది. ఆ ఖర్చు నాకిస్తే మీకు కేస్ లేకుండా చేయగలను.

**రాజయోగానంద :–** ఏమయ్యా ఇన్స్పెక్టర్, మాకు మేలు చేసినట్లు మీకు కేస్ లేకుండా చేస్తాను యాభైవేలు ఇమ్మంటావా! అట్లయిన జాగ్రత్తగా విను. అసలు దొంగలు మావద్ద దొరికారనీ, వారివద్దనున్న వజ్రాలను మేము స్వాధీనము చేసుకొన్నామనీ, ఆ దొంగలతో లాలూచిపడి ఆ దొంగలను నీవే విడిపించుక పోయావని స్టేట్మెంట్ ఇచ్చి అసలు దొంగలను విడిపించి నందుకు నీవే బాధ్యుడవని నీ మీద కేస్ పెట్టగలము. అప్పుడు ఇరుక్కొనేది నీవే! మేముకాదు. ఒకవేళ నీ మంచికోరి నీ మీద మేము కేసు పెట్టకుండా ఉండాలంటే, నీవు మాకు యాభైవేలు డబ్బు ఇచ్చి నోరు మూసుకొని ఉండవలయును. ఇపుడు చెప్పు నీవు యాభైవేలు డబ్బు ఇస్తావా లేక దొంగలకు సహాయపడినందుకు ఇరుక్కొని శిక్షను అనుభవిస్తావా?

(రాజయోగానంద చెప్పిన మాటలు విన్న ఇన్‌స్పెక్టర్ బాలప్పకు గోడకు విసిరిన బంతి తిరిగి వచ్చి తన ముఖానికే తగిలినట్లయినది. కొద్దిసేపు అయోమయ స్థితిలో పడిపోయి తిరిగి కోలుకొని ఇట్లన్నాడు.)

**ఇన్‌స్పెక్టర్ :-** నేను దొంగలను విడిపించానని మీ దగ్గర సాక్ష్యమేమున్నది?

**రాఘవ :-** మావద్ద వజ్రాలున్నాయనుటకు నీ దగ్గర సాక్ష్యమేమి ఉన్నది?

(ఆ మాటకు బాలప్ప తల గిర్రున తిరిగింది. ఇదేమిటి నేను డబ్బు అడిగితే, వారు నన్నే డబ్బు అడుగుతారు. నేను వజ్రాలని అంటే వారు దొంగలని అంటారు. వీరివద్ద వజ్రాలున్నాయని డిపార్టుమెంటుకు తెలిపితే, ఆ వజ్రాల వివరమంతా తెలిపి నన్ను ఇరికించగలరు. అని తనలో తాను అనుకొని ఏదో ఒక రకముగా వారిని బెదిరించే ఉద్దేశముతో ఇలా అన్నాడు.)

**ఇన్‌స్పెక్టర్ :-** నన్ను మీరు ఇరికించితే మీవద్దనున్న వజ్రాలు వెంటనే ఎందుకు ప్రభుత్వానికి స్వాధీనము చేయలేదని మిమ్ములను దండించగలము.

**రాఘవ :-** తెలివి నీ ఒక్కని సొమ్ము అనుకోకు మిష్టర్ ఇన్‌స్పెక్టర్. మేము వెంటనే స్వాధీనము చేయుటకు అవి దొంగలనుండి దొరకలేదు. పాము నుండి లభించాయి. అది భూమినుండి దొరికిన నిధి కూడా కాదు వెంటనే తెలుపుటకు.

**రాజయోగానంద :-** ఆ వజ్రాలు భువనేశ్వరి దేవాలయములోనివని మాకు తెలుసు. వాటి రక్షణ బాధ్యత ఒక గురువుగా మీకంటే మాకే ఎక్కువ ఉన్నది. మీరు తోడు దొంగలుగా మారి, లంచాలు తీసుకొని కేసులు మాఫీ చేయగలరు, సొమ్మును మ్రింగగలరు. ఈ వజ్రాలను కూడా మాయము చేయగలరు. మీ మీద నమ్మకము మాకు పూర్తిగా పోయింది. అందువలన మీ డిపార్టుమెంటు ఈ దొంగతనమును ఎలా బయటికి

లాగగలదో, ఎవరిని దోషులుగా గుర్తించగలదో, తెలుసుకొనేంతవరకు ఆ వజ్రాలు మావద్దనే ఉంటాయి. నీ చేతనైతే అసలు దొంగలను పట్టుకొని అటు చట్టానికి ఇటు దేవాలయానికి మేలు చేయి. లేకపోతే చేతులు ముడుచుకొని కూర్చో, అట్లు కాకుండా మమ్ములనే బెదిరించుటకు మొదలు పెట్టితే అన్ని విధములా నీకే ప్రమాదము.

**ఇన్‌స్పెక్టర్ :-** మీ మేలు కోరి చెప్పాను. అంతేకానీ మీ మీద నాకు ఎటువంటి చెడు ఉద్దేశము లేదు.

(అని అక్కడినుండి బాలప్ప వెళ్ళిపోయాడు. బాలప్ప జ్ఞానమనినా, స్వాములనినా చాలా హేళనగా మాట్లాడే స్వభావముగలవాడు. గురువులను చాలా తక్కువ వారిగా మాట్లాడు బాలప్ప రాజయోగానంద స్వామిని చూచి ఈయన అందరి గురువులవలె లేడే అనుకొని కొద్దిగ జంకినప్పటికీ తర్వాత ఆయనను కూడా తక్కువ అంచనా వేసుకొన్నాడు. మొదటిమారు ఆశ్రమానికి వచ్చి స్వామిని తక్కువగా మాట్లాడినపుడు, స్వామి బాలప్ప విషయములన్నీ చెప్పి ఎక్కడ ఏ తప్పుచేసినది గుర్తు చేసి చెప్పినపుడు, స్వామిని గొప్పవాడనుకొన్న బాలప్ప, తిరిగి కొన్ని గంటలకే జ్ఞానము చెప్పేవారంతా మోసగాళ్ళేనని అనుకొన్నాడు.

నేటి ప్రపంచములో జ్ఞానమంటే ఏమిటి? అజ్ఞానమంటే ఏమిటని తెలియని మనుషులు చాలామంది బాలప్పవలె ఉన్నారు. అటువంటి వారికి జ్ఞానముగానీ, జ్ఞానమును తెలుపు గురువులుగానీ సరిపడరు. వారికి సరిపోవు వారెవరనగా! పరస్త్రీలను గురించి మాట్లాడువారు, నాకు బలమున్నది కదాయని ఇతరుల మీద దౌర్జన్యము చేయువారు, సమాజములో పేరుండి ఎన్ని చెడుపనులు చేయుచున్న వాడైననూ వీరికి మహా ఇష్టులుగా ఉందురు. పోలీస్ ఇన్‌స్పెక్టరుగా పనిచేయు బాలప్ప మనస్థత్వము నీచమైనది

కాగా, అతని భార్య మధుమతి ఉత్తమురాలు. భర్త చేయు పనులు ఆమెకు ఇష్టముండెడివి కావు. ఆమె చాలా దైవభక్తికలది. ఐదు సంవత్సరముల క్రితము ఆమె రాజయోగానంద స్వామిని చూచింది. అప్పుడు తన కుమారునికి జబ్బు చేసి ఉండెడిది. ఆ జబ్బు నివారణకు ఎన్ని ఆసుపత్రులు తిరిగినా, ఎందరి డాక్టర్లను కలిసినా, చివరకు ఫలితము లేకుండాపోయింది. వైద్యము మీద ఆశ వదలిన మధుమతి తన కుమారున్ని రక్షించుకొనుటకు తనకున్న సహజ భక్తి ప్రకారము కనిపించిన దేవునికంతా పూజలు చేసింది, ముడుపులు కట్టింది. అయినా ఫలితము లేకుండా పోయినది. తన కుమారుడు మృత్యువును సమీపించాడని తెలిసిన ఆ తల్లి తల్లడిల్లి పోయింది. తనకున్న భక్తి అంతయూ విరక్తిగా మారగా కనికరించని ఈ దేవతలనెందుకు మ్రొక్కాలి? ఇంతగా తల్లడిల్లి పోవుచున్ననూ ఒకమాటయినా పలుకని ఈ దేవతలు బొమ్మలేనని తలచి, ఆవేశము పెల్లుభికి రాగా, తాను ప్రతి దినము మ్రొక్కి వస్తున్న ఊరిబయట పాండురంగని దేవాలయమునకు పోయి, గర్భగుడి తలుపులు తెరచి, తనలోని కోపము చల్లారేటట్లు ప్రతిమనే పగులగొట్టాలని పూనుకొంది. ఆ సమయములో అచటనేవున్న రాజయోగా నందస్వామి అడ్డుకొని ఆమెను ఆ పని నుండి విరమింప చేశాడు. ఆమె చేయుచున్న పని విచక్షణారహితమైనదని స్వామి చెప్పగా ఆమె భోరున ఏడ్చి తన ఆవేశమునకు కారణమును చెప్పింది. ఆమె బాధను అర్థము చేసుకొన్న స్వామి ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** చావు పుట్టుకలు కర్మను అనుసరించి ఉంటాయి. మనము చేయు పూజలనుబట్టి ఉండవు. గత జన్మలో చేసుకొన్న కర్మ ప్రకారము మన చేత ప్రతి అడుగు వేయించబడుతుంది. అలాగే రోగములు కూడా కర్మచేతనే పీడించబడుతాయి. ఏ సమయములో ఏ కర్మ

అనుభవించాలో, ఆ సమయమునకు ఆ కర్మను అనుభవించి తీరాలి. కర్మ అనునది ఏ దేవతల ఆధీనములోనూ లేదు. కావున ఏ దేవతలూ కర్మనుండి కాపాడలేరు. ప్రారబ్ధకర్మ ప్రకారము మరణము ఆసన్నమైనపుడు సహస్రదేవతలూ గుంపుగా వచ్చిననూ రక్షించలేరు. కర్మ వివరము తెలియకపోతే ఎవరైనా నమ్మిన దేవుళ్ళను నిందించగలరు. కానీ దానివలన ఇంకా కొంత పాపమును అంటగట్టుకోవడము తప్ప ఫలితము ఏమీ ఉండదు. ఈ పాండురంగడు ఎప్పుడైనా, ఎవరినైనా పిలిచాడా? వచ్చి పూజలు చేయమని, గుడి కట్టమని అడిగాడా? తనకు నామము పెట్టమని చెప్పాడా? అంతెందుకు నీవు పూజ చేస్తే నీ కుమారున్ని రక్షిస్తానని చెప్పాడా?

**(**ఆ మాటలు విన్న ఆమె స్వామివైపు ఆశ్చర్యముగా చూచింది. చూచుటకు సామాన్య మనిషివలెనున్న ఆయనెవరో సామాన్యుడు కాదని ఊహించిన మధుమతి "మీరెవరు?" అని సూటిగా స్వామిని ప్రశ్నించింది. అపుడు స్వామి ఇలా అన్నాడు.**)**

**రాజయోగానంద :-** నేను ఎవరైనా నీకేమీ లాభములేదు. కానీ నీవు ఎవరు అని నిన్ను నీవు తెలుసుకో. ఇపుడు నీవు చేయుచున్న పని ఏమిటో ఆలోచించు.

**(**స్వామి మాటలలో ఏదో గొప్పతనము ఉన్నట్లు అనిపించిందామెకు. అపుడు తనలోని బాధనంతా అణుచుకొని స్వామితో వినయముగా మాట్లాడను ప్రారంభించినది.**)**

**మధుమతి :-** మీరు ఎవరో గొప్ప వ్యక్తులుగా నాకు తోస్తున్నారు. మీకు నా నమస్కారములు, పుత్రశోకముతో మునిగివున్నాను. ఉన్న ఒక్క కుమారునికి దూరమగుదునేమోనన్న బాధతో అలా ఉద్రేకపడినాను.

నిజానికి మీరన్నట్లు ఏ దేవతలూ ఏమీ చేయలేరు. అలాంటి వారిని ఎందుకు పూజించాలి?

**రాజయోగానంద :–** ఆ మాటను నేను నిన్ను అడగాలి. నీవు జవాబు చెప్పాలి. ఎందుకనగా పూజ చేయుచున్నది నీవే కనుక.

**మధుమతి :–** అందరూ చేయుచున్నారు కదా! అని అలా చేస్తే ఆ దేవతలు కష్టాలు కలగకుండా చేస్తారని నమ్మకముతో చేశాను. కానీ పూర్తిగా తెలిసి చేయలేదు.

**రాజయోగానంద :–** నీలా ఎందరో ఎన్నో దేవతలకు ఆశలతోటే మ్రొక్కు చున్నారు. అసలు దేవుడంటే ఏమిటని వివరము తెలియకున్ననూ అందరూ ఎలా చేస్తే అలా చేయుచూ లాభము కల్గితే పొగడడము, కల్గకపోతే దూషించ డము సహజమైపోయింది. అందువలన జ్ఞానమంటే ఏమిటో తెలియక, దానితో అవసరమే లేదనుకొని అజ్ఞానిగా మానవుడు దిగజారి పోయాడు.

**మధుమతి :–** జ్ఞానమంటే ఏమిటి?

**రాజయోగానంద :–** దేవుని యొక్క వివరమును తెలుసుకొనుటే జ్ఞానము.

**మధుమతి :–** అది ఎక్కడ తెలుస్తుంది?

**రాజయోగానంద :–** దేవుని వివరము తెలిసిన వారివద్దే తెలుస్తుంది.

**మధుమతి :–** దేవుని వివరము తెలిసిన వారెవరు? వారిని ఎలా గుర్తించ గలము?

**రాజయోగానంద :–** దైవత్వ వివరము తెలిసినవారు ఫలానావారని చెప్పుటకు నాకు తెలియదు. కానీ వారు తెలియజేయు జ్ఞాన విషయములను బట్టి వారిని గుర్తించవచ్చును.

**మధుమతి :–** అసలు జ్ఞానమంటే ఏమిటో తెలియని మాబోటివారు దొంగ స్వాములు చెప్పు దానిని కూడా జ్ఞానమనే నమ్మగలము. వారినే జ్ఞానులను

కోగలము. అలా జ్ఞానులు కానివారిని జ్ఞానులు అనుకోవడము వలన, అసలైన జ్ఞానము తెలియకుండా పోవును కదా! ఈ కాలములో జ్ఞానులు కానివారెందరో జ్ఞానుల వేషము వేసి బాగా తెలిసిన జ్ఞానులవలె చలామణి అగుచున్నారు. ఆ విధముగానున్నపుడు వీరు జ్ఞానులని, వీరు అజ్ఞానులని మాబోటివారు గుర్తించడము కష్టము కదా! మాబోటివారు జ్ఞానులను గుర్తించుటకు ఏదైనా సూత్రబద్ధమైన మార్గమున్నదా?

(ఆమె మాట విన్న స్వామి ఆమె యోచనాశైలికి సంతోషిస్తూ ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** నీవన్న మాట నిజమే. దొంగలూ, హంతకులూ కాషాయవస్త్రములు ధరిస్తే చాలు. వారిని స్వాములని గ్రుడ్డిగ నమ్మే సమాజము మనది. నీవలె సూత్రబద్ధముగా స్వాములంటే ఎవరని యోచించరు. నీవు అడిగావు కావున నేను చెప్పుచున్నాను. నేను నిజముగా స్వామినే అయినప్పటికీ నీవు ఊహించని రీతిలో కాళ్ళకు బూట్లు, శరీరము నకు మంచి దుస్తులు ధరించి ఉండడము వలన ఎవరూ నన్ను స్వామి అని గుర్తించలేరు. నావద్ద ఎంతో ఉన్నతమైన జ్ఞానమున్నప్పటికీ పై వేషములో అది కనిపించదు. తెల్లనివన్నీ పాలని నమ్మే ఈ మనుషులు సాధారణ దుస్తులు ధరించిన నన్ను సాధారణ వ్యక్తిగానే తలచి, ఈయనెలా స్వామియగు నని హేళనగా మాట్లాడుచుందురు. జ్ఞానము లేకున్ననూ కాషాయవస్త్రములు ధరించడము వలనా, రుద్రాక్షలు ధరించుట వలన వారిని స్వాములని పడిపడి మ్రొక్కుచుందురు.

ఈ విధముగా చూచువారికి జ్ఞానము పైకి కనిపించదు. వినువారికి అది జ్ఞానమో కాదో తెలియదు. అలాంటపుడు నిజ జ్ఞానమునెలా గుర్తించ గలరను ప్రశ్న ఎవరికైనా రాగలదు. దీనికి దేవుడే జవాబు చెప్పవలసి

వున్నది. కావున జ్ఞానులను గుర్తించునట్లు రెండు సూత్రములను భగవంతుడే చెప్పాడు. ఆ రెండు సూత్రములు భగవద్గీతలో ఆత్మసంయమ యోగమను అధ్యాయమున మొట్టమొదటి శ్లోకములోనే చెప్పాడు. ఒకటి పనులు మానుకొనువాడు యోగికాడు. రెండవమాటలో అగ్ని లేనివాడు యోగికాడు అన్నాడు. నిజమైన జ్ఞానమును తెలిసి సాధించిన యోగి అన్ని పనులు సర్వ సాధారణముగా చేయుచుండునన్నాడు. అందువలన నేను పెళ్ళి చేసుకోకూడదు, నేను ఫలానా పనులు చేయకూడదని పనులకు దూరముగా ఉండువాడు యోగికాడు. అట్లని ఇతరులను చూచి అన్ని పనులు అజ్ఞానులు కూడా చేయుచుందురు. కావున వారిలో జ్ఞానులను గుర్తించలేము. ఇక రెండవ సూత్రములో అగ్ని లేనటువంటివాడు యోగికాడు అన్నపుడు, అగ్ని అంటే కర్మనుకాల్చు శక్తియని అర్థమగుచున్నది. ఆ అగ్ని అంటే ఏమిటో జనులకు తెలియదు. ఆ అగ్ని కనిపించునది కాదు. అటువంటపుడు అగ్నివున్న వారినెలా గుర్తించగలమను ప్రశ్న ఉద్భవించగలదు. దానికి జవాబుగా ఎదుటివారు గుర్తించునట్లు ఆ అగ్ని ఏమిటో తెలియునట్లు దైవమే యోగులనుండి ఆ అగ్నిని బహిర్గతము చేసి ఇతరుల కర్మలు కాలిపోవునుట్లు చేయుచున్నాడు. ఏ వైద్యము లేకుండా ఎవని స్పర్శచేత మనిషికున్న భయంకర రోగములు సహితము పోవుచున్నవో, అతని వద్దనే అగ్ని ఉందనీ, అతనే నిజయోగి, నిజ సన్యాసి అని మానవులు గ్రహించాలి. యోగి అంటే ఏమిటో అక్కడక్కడ కొందరి నుండి వచ్చిన అగ్ని ఎదుటివాని కర్మలను కాల్చిన సంఘటనలు చరిత్రలో ఉన్నాయి. ఈ విధముగ యోగులను గుర్తించవచ్చును. అటువంటి యోగులను గుర్తించి వారివలన జ్ఞానమును తెలుసుకోవడము వలన దైవమంటే ఏమిటో తెలియును. అప్పుడు ప్రపంచ సంబంధ కోర్కెలను మనము కోరము. అవి నెరవేరక పోయినా దేవున్ని నిందించము. అదియే అసలైన జ్ఞానము యొక్క పని.

**మధుమతి :-** కోర్కెలే దేవున్ని కోరనపుడు మనకు దేవునితో పని ఏమి?

**రాజయోగానంద :-** ఇంతకుముందు కూడా చెప్పాను. దేవుడు కోర్కెలు నెరవేర్చుటకు లేడని, ఆయన ఎవరి కోర్కెలను నెరవేర్చుతానని చెప్పలేదని. **దేవుడు ఏ పని చేయనివాడనీ, దేవునికీ, కోర్కెలకూ సంబంధములేదని తెలియుటకే మనకు జ్ఞానము అవసరము.** జ్ఞానము తెలిస్తే, కర్మప్రకారము అన్నీ జరుగుననీ, మనము కోరుట వలనగానీ, కోరక పోవుట వలనగానీ ఒరిగేది ఏమీలేదనీ, పుట్టినపుడే ప్రతిదీ నిర్ణయించబడివుండి జీవితములో దాని ప్రకారమే జరుగునని తెలియును.

(ఆ మాటలు విన్న మధుమతి స్వామి చెప్పిన జ్ఞాన సంబంధమైన విషయములకు ఎంతో ఆశ్చర్యపోయింది. పైకి చూస్తే సాధారణ దుస్తులు ధరించి, అందరిలాగా సాధారణ వ్యక్తివలె కనిపించు స్వామిని చూచి, నివురు గప్పిన నిప్పులాగ ఎవరికీ తెలియకుండా స్వామి ఉన్నాడని గ్రహించింది. తమవద్ద జ్ఞానము లేకున్ననూ, ఉన్నవారివలె వేషము వేసి నటించువారున్న ఈ కాలములో, ఎంతో జ్ఞానమున్ననూ లేనివానివలె కనిపించు స్వామిని చూచి ఈయన సాధారణ వ్యక్తికాదని తెలుసుకొన్న ఆమె వెంటనే స్వామి పాదాల మీద పడి నమస్కరించి ఇలా అన్నది.)

**మధుమతి :-** స్వామీ! మీరు నిజమైన జ్ఞానులనీ, నిజమైన యోగులనీ మీ మాటలనుబట్టియే తెలిసింది. దైవమంటే ఏమిటో తెలుపు స్థోమత మీకే ఉన్నది. ఇప్పటి నా మనోక్షోభ తీర్చి, నాకు జ్ఞానమును కల్గించమని వేడుకొను చున్నాను. నా మనవిని ఆలకించి నాకు దైవసన్నిధిని చేరు జ్ఞానమును తెలుసుకొనునట్లు చేయండి.

(ఆమె మనోవ్యథను అర్థము చేసుకొన్న స్వామి, వెంటనే తన కుమారున్ని తీసుకురమ్మని ఆమెకు చెప్పగ, ఆమె పరుగున పోయి మంచము

మీదనున్న తన కుమారున్ని స్వామివద్దకు తెచ్చింది. ఆమె ముఖములో విషాధ ఛాయలు పోయి సంతోష ఛాయలు మెరియసాగాయి. తన కుమారున్ని తీసుక రమ్మని స్వామి చెప్పగానే ఆమెలో క్రొత్త సంతోషము పొంగివచ్చింది. తన కుమారునికి హర్టుఎన్‌లార్జ్ (గుండెలావు) అయిందనీ, ఇక బ్రతకడని డాక్టర్లు చెప్పగా నిరుత్సాహపడిన మధుమతికి, స్వామి నీ కుమారున్ని తీసుక రమ్మని చెప్పగానే క్రొత్త ధైర్యము వచ్చింది. 20 సంవత్సరముల తన కుమారున్ని స్వామి ముందర కూర్చోబెట్టింది. అప్పుడు స్వామి తన ముందర కూర్చున్న మధుమతి కుమారున్ని రెప్పవాల్చకుండా ఒక నిమిషము చూచాడు. ఇక అతనిని ఇంటికి తీసుక పొమ్మన్నాడు. స్వామి అతనివైపు చూచి ఇక ఇంటికి తీసుకపొమ్మని చెప్పడము అర్థముకాక ఆమె స్వామితో ఇలా అన్నది.)

**మధుమతి :-** స్వామీ నా కుమారున్ని రక్షించండి.

**రాజయోగానంద :-** ఏమమ్మా ఇంకా నామీద నీకు నమ్మకము కలుగలేదా! నీ కుమారుడు రక్షింపబడినాడు. అతని వ్యాధికి కారణమైన కర్మ కాలి పోయింది. లోపలనున్న గుండెవాపు ఇపుడు సగము తగ్గిపోయినది. మీరు ఇంటికి పోవు లోపల మిగతా సగము కూడా తగ్గిపోయి సంపూర్ణ ఆరోగ్య వంతుడై పోగలడు. ఇతని దిగులు వదలి జ్ఞానమును తెలుసుకొని దైవత్వమును పొందుటకు ప్రయత్నించు. ఇది మహత్యముకాదు. జ్ఞానము నకు ఇంత శక్తి ఉందని నిరూపించుటకు చూపిన నిదర్శనము.

(స్వామి మాటవిన్న ఆమె ఆశ్చర్యపోయింది. డాక్టర్లు బ్రతకడని చెప్పిన వ్యాధిని ఒక నిమిషములో నయమైపోయిందని వినడము ఆశ్చర్యమే కదా! అయినప్పటికీ స్వామి మాట నిజమో కాదో, ఆ వ్యాధి పోయిందో లేదోనని అనుమానము కూడా ఒకవైపు మెదలసాగింది. అనుమానము

ఒకవైపు ఉన్ననూ, స్వామిమాట మీద నమ్మకము పెట్టుకొని బాగైనట్లు తలచిన ఆమె ఇలా అన్నది.)

**మధుమతి :–** స్వామీ తమ పేరు ఏమిటో, తమరు ఎచటివారో నాకు తెలియదు. నేను తెలుసుకోవచ్చునా?

**రాజయోగానంద :–** అడిగావు కాబట్టి చెబుతాను నా పేరు రాజయోగానంద అంటారు. కానీ నేను ఎచటివాడనో ఇప్పుడు చెప్పను. సమయము వచ్చినపుడు నీకే తెలుస్తుంది.

**మధుమతి :–** మీరు ఎక్కడివారో తెలియకపోతే నేను ఎలా జ్ఞానమును తెలుసుకోగలను. జ్ఞానము కొరకు ఎచటికి రాగలను?

**రాజయోగానంద :–** ఆ సందేహము నీకు అవసరములేదు. నేను తెలియజేయు జ్ఞానమేదో గ్రంథరూపము చేసి ఉంచాను. ఆ గ్రంథములు చదివితే జ్ఞానము నీకు తెలియగలదు.

**మధుమతి :–** మీరన్నట్లు మీ గ్రంథముల ద్వారా జ్ఞానమును తెలుసుకో గలను. కానీ మీ దర్శనము మాకు కావాలంటే ఎలాగ స్వామి!

**రాజయోగానంద :–** తర్వాత నేనెచటవున్నది నేను చెప్పకున్ననూ నీకే తెలుస్తుందని చెప్పాను కదా!

(స్వామిని తన ఇంటికి ఆహ్వానించదలచి ఆయన పాదము తన ఇంటిలో మోపితే మంచిదని తలచి ఇలా అన్నది.)

**మధుమతి :–** స్వామీ! మా మీద దయవుంచి మీరు మా ఇంటికి ఒకమారు రండి, మా ఆతిథ్యము స్వీకరించండి.

**రాజయోగానంద :–** నీవు పిలిచావు. నేను రాగలను. అయితే స్వాములంటే నీ భర్తకు పూర్తి చులకన భావమున్నది. సాధారణ మనిషివలెనున్న నన్ను

చూచి వీడెవడని నీ భర్త నిన్నే దండించగలడు. ప్రాణము లేని పటములకు మ్రొక్కు నీ భర్త ప్రాణములున్న నన్ను చూచి నమస్కారమని కూడా చెప్పడు. నన్ను గురించి నీవు గొప్పగా చెప్పినా, అతను నమ్మకపోగా నిన్ను కూడా దూషించును. నీ కుమారున్ని ఈయనే రక్షించాడని నీవు నన్ను గురించి పెద్దగా చెప్పినా, ఆయనేమో నన్ను చిన్నగనే లెక్కించి ఆపద మ్రొక్కులవాడైన వెంకటేశ్వరుడే తన కుమారున్ని కాపాడాడు అని అంటాడు. జ్ఞానము విలువ తెలియని నీ భర్తకు జ్ఞానమంటే ఏమిటో తెలిసిననాడు నేను మీ ఇంటికి రాగలను.

**(**స్వామి మాటలు విన్న ఆమె విస్తుపోయింది. తన భర్తను చూడకనే తన భర్తలోని మూర్ఖత్వమును గురించి చెప్పిన స్వామి సామాన్యుడుకాడని తలచి ఇలా అన్నది.**)**

**మధుమతి :-** స్వామీ, నా భర్త మీకు తెలుసా?

**రాజయోగానంద :-** తెలుసు. పోలీస్ డిపార్టుమెంటులో ఉండి అవినీతికి పాల్పడు ఒక ఉద్యోగి.

**మధుమతి :-** ఆయన మీకెలా తెలుసు స్వామీ.

**రాజయోగానంద :-** ఎలా అన్న ప్రశ్నకు నావద్ద సమాధానము లేదు. ఉన్నా చెప్పను. నీవు గత జన్మలో చేసుకొన్న పాపఫలితముగా నీకు ఆ భర్త దొరికాడు. నీవు అనుభవింపక తప్పదు. అటువంటి చోటికి నేను రావడము సరికాదు.

**(**స్వామి చెప్పినది సత్యమని తలచి తనలో దుఃఖము వస్తున్ననూ ఆపుకొనుచూ ఇలా అన్నది.**)**

**మధుమతి :-** స్వామీ తమ దర్శనము తిరిగి ఎప్పుడు లభించునో.

**రాజయోగానంద :-** ఎప్పుడో ఒకప్పుడు తప్పక లభిస్తుంది.

(మధుమతి కుమారునికి ఆ కొద్దిసేపటికే తన ఆరోగ్యము ఎంతో మేలనిపించిది. అందువలన అతను స్వామి పాదాలకు మ్రొక్కుకొన్నాడు. మధుమతి కూడా నమస్కారము చేసుకొని, స్వామివద్ద సెలవు తీసుకొని ఇద్దరూ ఇంటికి బయలుదేరి పోయారు. ఇంటికి వచ్చిన కుమారుడు అన్ని విధములా ఆరోగ్యముగా కనిపించాడు. అతనిలో రోగమున్న ఛాయలే కనిపించలేదు. మధుమతి తన కుమారున్ని డాక్టర్లవద్దకు తీసుకపోయి చూపించింది. డాక్టర్లు అతని గుండెను పరీక్షించి చూచారు. అతనిలోని వ్యాధి నయమైపోయి గుండె మంచి కండీషన్‌లో ఉండడమును చూచి ఆశ్చర్యపోయి ఆ విషయమును మధుమతికి తెలిపారు. ఆమె పట్టలేనంత సంతోషపడినది. కుమారునికి వ్యాధి నయమైపోయినట్లు తన భర్త ఇన్‌స్పెక్టర్ బాలప్పకు తెలిపింది. కానీ స్వామి బాగు చేశాడని చెప్పలేదు. చెప్పినా అతడు నమ్మడని చెప్పలేదు. అప్పటినుండి రాజయోగానంద స్వామి ఇచ్చిన గ్రంథమును చదువుచూ అందులోని జ్ఞానమును బాగా తెలుసుకోగల్గింది. ఆమె కుమారుడు కూడా స్వామి జ్ఞానము ఎడల విధేయత కల్గివున్నాడు.

దాదాపు రెండు సంవత్సరములు గడిచింది. స్వామి ఎక్కడున్నాడను విషయము ఏమాత్రము మధుమతికి తెలియలేదు. స్వామి ఇచ్చిన గ్రంథము మీద ఆయన అడ్రసు కూడా లేదు. ముందర నాలుగు కాగితములు లేని గ్రంథమును ఇచ్చాడు కనుక దానిమీద అడ్రసులేదు. గ్రంథము చదవక ముందుకంటే చదివిన తర్వాత ఆమెలో స్వామి దర్శనము కావాలను కాంక్ష ఎక్కువైనది. తన మనస్సులో స్వామిని ఎన్నోమార్లు తలచుకొని దర్శనము కొరకు వేడుకొన్నది. ఒక దినము రాత్రి ఆమెకు నిద్రపట్టలేదు. ఎలాగైనా స్వామి దర్శనము చేసుకోవాలని ఆలోచిస్తున్నది. స్వామి అడ్రస్

ఎలా సంపాదించాలి. నీకే నా అడ్రస్ తెలుస్తుందని స్వామి అన్నాడు. అది ఎట్లు తెలుస్తుంది. ఎప్పుడు తెలుస్తుంది అని యోచిస్తూ నిద్రరాక లేచి కూర్చున్నది. రాత్రి 12 గంటలైనది. ఇంకా భర్త పడుకోలేదెందుకని చూడగా ముందర హాల్‌లో ఎవరితోనో మాట్లాడడము ఆమెకు వినిపించింది. అంతలో వారి మాటలలో "రాజయోగానంద స్వామి" అను మాట వినిపించింది. వెంటనే! ఏమిటా అని జాగ్రత్తగా వినసాగింది.)

**జగన్నాథము :-** మీకే కాదు బాలప్పా, ఆ రాజయోగానంద స్వామి నాకు కూడా పెద్ద మోసము చేశాడు. వాడసలుకు స్వామివలె ఉన్నాడా? స్వామి అయితే మిగతా విషయాలలోనికి తలదూర్చక ముక్కుమూసుకొని కూర్చుంటారు. వీడు అలాకాదు. నేను రాధేశ్వరి అను కన్యపిల్లమీద ఆశపడితే, ఆ పిల్లను కాపాడి నా చేతికి దొరకకుండా చేశాడు. ఆ పిల్ల ఇప్పుడు ఆశ్రమములోనే ఉన్నది. వాన్ని నేను అంత సులభముగా వదలి పెట్టుతానా?

(రాజయోగానంద స్వామిని గురించి అతను అనిన ఆ మాటలు వినుచుండగానే ఆమెలో విపరీతమైన కోపము వచ్చింది. తోక తొక్కిన పాము బుసకొట్టి పడగవిప్పి లేచినట్లు పైకిలేచి విసురుగా పోయి తన భర్తతో మాట్లాడుతున్న ఆ వ్యక్తి షర్టును పట్టిలాగి క్రిందికి త్రోసి కాలితో తన్నింది.)

**మధుమతి :-** ఏమి కూసావురా గాడిదా! నిర్భలులైన అమాయక ఆడపిల్ల మీద అత్యాచారము చేయాలనుకొన్న నీవు నీతిమంతుడవా? ఆ పిల్లను కాపాడి నీకు దొరకకుండా ఆశ్రయమిచ్చి ఆశ్రమములో పెట్టుకొన్న స్వామి మోసగాడా?

(ఊహించని ఆ పరిణామమునకు బాలప్ప తేరుకోకముందే వరుసగా కాలితో తన్నిన ఆమెను బాలప్ప లేచి పట్టుకొన్నాడు. ఆడవారిని ఆట బొమ్మలుగా చూచు జగన్నాథమునకు ఆమె ఎందుకు తన మీదికి వచ్చిందో అర్థముకాక బాలప్ప వైపు చూచాడు. బాలప్ప తన భార్యవైపు కోపముగా చూచి ఇలా అన్నాడు.)

**బాలప్ప :-** నీకు పిచ్చి ఏమైనా పట్టిందా, ఆయనెవరనుకున్నావు. అతనొక పెద్దమనిషి.

**మధుమతి :-** వీడు ఎవడో నాకు బాగా తెలుసు. ఒకమారు తన ఊరిలోని ఆడవారి మీద అఘాయిత్యాలు చేయబోయి, అదే ఊరిలోని హరిజనుల చేత తన్నులు తిన్నవాడు కాదావీడు? వీడు నీకు పెద్ద మనిషా? స్వామిని అనవసరముగా నీచముగా మాట్లాడుతాడా? స్వామిని అలా మాట్లాడినందుకే కాలితో తన్నింది. ఇకముందు ఎప్పుడైనా స్వామి పేరు ఎత్తితే చెప్పు తెగిపోయేంతవరకు కొట్టుతా!

(ఆమె మాటలకు జగన్నాథము భయపడి, తర్వాత కలుస్తానని బాలప్పతో చెప్పి అక్కడినుండి పోయాడు. తన భార్య ప్రవర్తన అర్థముకాక ఈమె ఏమిటీ, రాజయోగానంద స్వామి పేరు వింటూనే రెచ్చిపోవడమేమిటి? అని ఆశ్చర్యపడిన బాలప్ప తన భార్యను లాక్కొని పోయి బెడ్‌రూములోనికి త్రోసి బయట తలుపులు వేసివచ్చాడు. తన భార్యను కోపముగా చూస్తూ "ఆ మోసగాడు రాజయోగానంద స్వామి నీకు తెలుసా" అనేంతలోపల బాలప్ప చెంప ఛెల్లుమన్నది. మధుమతి కొట్టిన వేటుకు అతని బుర్ర గిర్రున తిరిగింది.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(న్యూస్‌పేపరులో వచ్చిన వార్తను చూచిన తర్వాత భువనేశ్వరి దేవాలయములో వజ్రములు దొంగలించబడినట్లు ప్రజలందరికీ తెలిసి

పోయింది. వాటి మీద ఆశతోనే దేవాలయములో పాగావేసిన జటాజూట స్వామికి నిరాశైనది. తపస్విబాబాగారికి ఆ వజ్రాలను ఎలాగైనా సాధించాలను తపన ఎక్కువైనది. మునెప్ప అతని స్నేహితుడు హీరో కలిసి రాజయోగానంద స్వామివద్దగల వజ్రాలు ఎపుడు బయటికి వస్తాయా? అని వేచియున్నారు. పోలీస్ యస్.పి గారు ఈ విషయములో శ్రద్ధ తీసుకొని మునెప్ప ముఠామీద అన్ని చోట్ల నిఘావేసి ఉంచారు. రాజయోగానందస్వామి అందరినుండి వజ్రాలను కాపాడి వాటిని యథాప్రకారము భువనేశ్వరి దేవాలయములో భద్రపరుచుటకు తీవ్ర యోచన చేస్తున్నాడు. ఇక నాగభూషణము, మల్లయ్య తాత ఇద్దరు మాంత్రికులూ కలిసి మంత్రముల చేత మునెప్ప మనుషులకు కూడా తెలియకుండా, వజ్రాలు దొరికితే కొట్టేయాలనుకొన్నారు. ఇంతమంది వజ్రములను గూర్చి రకరకముల ప్రయత్నములు చేయుచుండగా, రాజ యోగానందస్వామి పిలుపుమేరకు ఆశ్రమానికి వచ్చిన గూడెము నాయకుడైన మల్లుదొర ద్వారా, గూడెములో వజ్రములను కొన్ని రోజుల వరకు భద్ర పరచుటకు రాజయోగానంద స్వామి పంపాలనుకొన్నాడు. ఒక దినము పది వజ్రములను చిన్న పెట్టెలో పెట్టి నాయకుని చేతికిచ్చి పంపెను. ఆయనతో పాటు మరికొందరు ఆశ్రమమునుండి బయలుదేరి పోయారు.

వజ్రాలు దొంగలించబడినవని తెలిసిన తర్వాత పది దినముల వరకు వాటిని గురించిన ఎటువంటి ఆచూకి పోలీసులకు తెలియక పోవడముతో వారు వాటి సమాచారము కొరకు ప్రయత్నము తీవ్రతను చేశారు. రాజయోగానందస్వామి మీద కక్షగనున్న ఇన్‌స్పెక్టర్ బాలప్ప యస్.పి.గారికి ఫోన్ చేసి తనెవరైనది చెప్పకుండా వజ్రాల సమాచారము అందిస్తున్నామనీ, వజ్రాలు రాజయోగానందస్వామి ఆశ్రమములో ఉన్నాయని, వాటిని రాజయోగానంద స్వామియే అపహరించాడని చెప్పాడు.

రాజయోగానంద స్వామి మంచివ్యక్తి అని యస్.పి.గారికి కూడా తెలిసిన దానివలన ఆ ఫోన్ మాటలు దురుద్దేశమైనవనీ, తమను తప్పుదారి పట్టించుటకు అసలైన దొంగలే అలా చెప్పివుంటారనుకొన్నాడు. ఆ ఫోన్ ఎవరు చేసివుంటారని యోచించాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(మాంత్రికులు ఇద్దరూ అంజనము ఉపయోగించి వజ్రములను గూడెము నాయకుడు అడవిలోని తన గూడెమునకు తీసుకొని పోవుచున్నా డని తెలుసుకొన్నారు. ఆ వజ్రాలను తమ స్వంతము చేసుకొనుటకు అదే అదనుగా భావించిన ఆ ఇద్దరు బయలుదేరి అడవివైపు పోయారు. గూడెము నాయకుడు మరియు అతనితో పాటు మరికొందరు మార్గమున కాలి నడకన పోవుచు మధ్యాహ్న సమయములో ఒకచోట ఆగి ఒక చెట్టు క్రింద కూర్చొని వెంటతెచ్చుకొన్న ఆహారమును తిని విశ్రాంతి తీసుకొంటున్న సమయములో మాంత్రికులిద్దరు వారి ఉనికిని తెలుసుకొన్నారు. ప్రక్కన కొంత దూరములో పొదలమాటున నక్కివుండి, ఆ నాయకుడు ఒక్కడు పెట్టెతో సహా ప్రక్కకు వస్తే బాగుండునని తలచి తమ ఆధీనములోనున్న ఒక విగ్రహను ఆ నాయకునియందు చేరి కడుపునొప్పి వచ్చి మలవిసర్జనకు పోవునట్లు చేయమని చెప్పిపంపారు. వారి ఆజ్ఞమేరకు ఆ విగ్రహ మల్లుదొర శరీరములో దూరి అలానే చేసింది. కానీ మల్లుదొర వజ్రాల పెట్టెను తమ మనుషులకు అప్పచెప్పి బహిర్భూమికి పోయాడు. దానివలన మాంత్రికుల యోచన ఫలించలేదు.

తర్వాత మల్లుదొర మిగతావారు అందరూ కలిసి అక్కడినుండి బయలుదేరి పోయారు. వారిని మాంత్రికులు ఇద్దరూ వెంబడిస్తూ పోయారు.

ఆ రాత్రికి మల్లుదొర మార్గమధ్యలో విడిది చేయాల్సి వచ్చింది. సరియైన ప్రాంతము చూచుకొని ఆ రాత్రికి గడిపి తిరిగి ఉదయమే బయలుదేరి పోవాలను కొన్నారు. వన్యమృగముల దాడిలేని స్థలములో కొన్ని కట్టెలు కుప్పవేసి నిప్పుపెట్టి, ఆ నిప్పుచుట్టు అందరూ పడుకొనునట్లు ఏర్పాటు చేసుకొన్నారు. చాటుగా మల్లుదొరను, అతని మనుషులను వెంబడిస్తున్న మాంత్రికులు ఇద్దరూ ఆ రాత్రికి ఎటులైనా వారినుండి వజ్రాలను కాజేయాలనుకొన్నారు. అదును కొరకు వేచి చూస్తున్న మాంత్రికులు వారు నిద్రించారని తెలుసుకొన్న తర్వాత తమ వశములోనున్న కాటేరి అను శక్తిని పిలచి మల్లుదొర దగ్గరయున్న వజ్రాల పెట్టెను తమవద్దకు చేర్చమని చెప్పి పంపారు. వారి ఆదేశానుసారము కాటేరి, పడుకొన్న మల్లుదొర వైపు పోయింది. అడవిలో పడుకొన్నదానివలన మరియు వారివద్ద విలువైన వజ్రములుండుట వలన అందరూ పడుకొని నిద్రపోకుండా కాపలాగా ఇద్దరు మేల్కొనివుండిరి. అదృశ్యరూపమునున్న కాటేరిని, మేల్కొనివున్న ఇద్దరూ గమనించ లేకపోయారు. కాటేరి కూడా ముసుగులు వేసుకొని మౌనముగా కూర్చున్న ఇద్దరూ మేల్కొనివున్నారని గమనించలేదు. కాటేరి నేరుగా మల్లుదొర దగ్గరికి పోయి అతని ప్రక్కనవున్న వజ్రాలపెట్టెను తీసుకొని మాంత్రికులవద్దకు వస్తున్న సమయములో అక్కడే మేల్కొనివున్న ఇద్దరు వ్యక్తులకు పెట్టె గాలిలో తేలిపోవుచున్నట్లు కనిపించింది. రాత్రిపూట మండుచున్న మంట వెలుగులో వారు పెట్టె పోవడమును చూచి మల్లుదొరను మిగతావారిని లేపారు. అంతలో అది చీకటిలో కనిపించకుండా పోయినది.

ఈ తతంగమును ప్రక్కన చాటుగా ఉండి గమనిస్తున్న ఇద్దరు మాంత్రికులు కాటేరి తమవద్దకు పెట్టెను తెస్తూనే దానిని తీసుకొని అక్కడ నుండి వెంటనే పారిపోయారు. తమ పెట్టె గాలిలో తేలిపోయినట్లు కనిపించడము, చివరకు అది ఏమైనది తెలియకపోవడము విచిత్రముగా

తోచినది. ఉదయము తెల్లవారిన తర్వాత ఆ చుట్టుప్రక్కలంతా పెట్టె కొరకు వెతికి చూచారు. పెట్టె కనిపించలేదు, కానీ మాంత్రికులు నక్కియున్న ప్రాంతము మాత్రము కనిపించింది. అక్కడ ఎవరో ఉండినట్లు పాదముల గుర్తులు, వారు కాల్చివదలివేసిన చుట్టముక్కలు కనిపించాయి. ఆ చుట్ట ముక్కలను తీసుకొని వారందరు బయలుదేరి వెనక్కు పోయి రాజయోగా నంద స్వామికి విషయమంతా తెలిపారు. ఆ విధముగా జరిగినందుకు స్వామి నివ్వెరపోయాడు. పెట్టె గాలిలో తేలిపోవడమేమిటని యోచించ సాగారు. వజ్రములు పోయిన తీరునుబట్టి ఆ వజ్రాల విషయము తెలిసిన మనుషులే దుష్టశక్తులచేత ఈ పనిని చేయించి, వజ్రములను అపహరించి వుంటారని రాఘవ రాజయోగానంద స్వామికి చెప్పాడు. వజ్రములను గురించి అందరూ ఆలోచించసాగారు.)

× × × × × × × × × × × × × × × × × × × × ×

(వజ్రాలను కాటేరి ద్వారా దొంగలించిన మాంత్రికులు మరుసటి దినము వజ్రాలను పెట్టెనుండి తీసి చిన్న గుడ్డలో మూటకట్టుకొని, ఆ పెట్టెను మార్గమధ్యలో ఒక బావిలోనికి వేసి తమ నివాసమునకు పోవుచుండిరి. అంతలో సాయంకాలమైనది. దారిలో ఒక మామిడితోట ఉండెను. ఆ తోటలోనికి పోయి, ఆ తోట వారిని పరిచయము ఏర్పరుచుకొని దారిన పోయేవారమని, ఈ రాత్రికి ఇక్కడుండి పోతామని చెప్పగా వారు సరేనని ఒప్పుకొన్నారు. ఇద్దరు మాంత్రికులు ఆ రాత్రికి తోటలో పడు కొన్నారు. వారు నిదురించినా తమవద్దనున్న వజ్రాలను ఎవరూ తీయకుండా కాటేరిని కాపలాపెట్టి నిద్రించారు. తెల్లవారిన తర్వాత వారు లేచి నడుముకున్న తమ వజ్రముల మూటను ఒకమారు చేతితో తడిమి చూచుకొన్నారు. వారికి వారి మూట నడుముకు లేనట్లు తెలిసిపోయింది.

తమవద్దనున్న మూటను ఎవరూ తీయలేరు. ఎందుకనగా కాటేరి కాపలాగా ఉన్నది. వారు నిద్రించునపుడు ఎవరైనా తీసుకొను ప్రయత్నము చేస్తే కాటేరి వారిని భయపెట్టి పంపేది. అందువలన ఎవరూ తీసుకొనుటకు వీలులేదు. కాటేరికి తెలియకుండా ఏమి జరిగివుండదని తెలిసిన మాంత్రికులు కాటేరిని అడిగారు. అప్పుడు కాటేరి ఎవరూ ఇక్కడికి రాలేదు, ఎవరూ వజ్రములను తీసుకపోలేదని తెలిపింది. ఎవరూ తమవద్దనున్న వజ్రాలను తీయనిది, అవి ఎలా పోయాయి? అని కాటేరిని అడిగారు. ఏ విధముగా చూచినప్పటికి వజ్రాల విషయము నాకు ఏమీ అర్థముకాలేదని కాటేరి కూడా చెప్పింది.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(రాజయోగానంద స్వామివద్దకు యస్.పి గారు పోలేదనీ, ఎలాంటి విచారణ జరుపలేదని, అదే డిపార్టుమెంటులో వుండి గమనిస్తున్న ఇన్‌స్పెక్టర్ బాలప్ప వజ్రాల విషయమై రెండవమారు యస్.పి గారికి ఫోన్ చేసి రాజయోగానంద స్వామియే దొంగయని చెప్పాడు. రెండవమారు కూడా ఫోన్ రావడముతో ఆ విషయమును ఒకమారు స్వామితో కలిసి మాట్లాడేది మంచిదనుకొని యస్.పి గారు వెంటనే బయలుదేరి రాజయోగానంద స్వామి వద్దకు పోయాడు. స్వామివద్దకు పోయిన యస్.పి ఇలా అన్నాడు.)

**యస్.పి :-** భువనేశ్వరి దేవాలయములో పోయిన వజ్రముల గురించి మీ పేరును చెప్పుచూ రెండు ఫోన్‌కాల్స్ వచ్చాయి. ఫోన్ చేసినవారు మీరే దొంగ అని చెప్పారు. అయినా మేము ఆ విషయమును నమ్మలేదు. అయినా ఒకమారు మీతో కలిసిపోతే బాగుంటుందని వచ్చాను. దాని విషయము మీకేదైనా తెలిసివుంటే చెప్పండి.

**రాజయోగానంద :-** ఆ ఫోన్ చేసినది ఎవరో కాదు. మీ డిపార్టుమెంట్ లోనే పని చేయుచున్న ఇన్‌స్పెక్టర్ బాలప్ప.

**యస్.పి :-** అతనెందుకు ఫోన్‌లో చెప్పుతాడు? తనవద్ద ఏదైనా ఇన్ఫర్‌మేషన్ వుంటే నేరుగా వచ్చి నాతోనే చెప్పుతాడు.

**రాజయోగానంద :-** వజ్రాలు మావద్ద ఉన్నట్లు బాలప్పకు ముందునుండి తెలుసు. ఆ విషయము మీకు తెలియునట్లు తెలివిగా మీకు ఫోన్‌లో చెప్పాడు.

**యస్.పి :-** ఏమిటి మీ దగ్గర వజ్రాలున్నాయా? మీరు తెలిసే మాట్లాడు చున్నారా?

**రాజయోగానంద :-** అవును తెలిసే చెప్పుచున్నాను. ఆ వజ్రములు భువనేశ్వరి దేవాలయములో దొంగలించబడినవని మీకు తెలియకముందే ఆ వజ్రములు మా చేతికి వచ్చాయి. విషయమంతా తెలిసిన మేము వాటిని కొంతకాలము మా రక్షణములోనే పెట్టుకొని అసలు దొంగలను బయటికి లాగాలనుకొన్నాను. వాటి విషయము బాలప్పకు కొంత తెలుసు. ఆ వజ్రముల కొరకు ఇక్కడికి వచ్చిన దొంగలను కూడ మేము పట్టి బంధించాము. అప్పుడు ఆ దొంగలను మా నుండి విడిపించే దానికి వచ్చాడు. అయినా మేము వదలలేదు. డబ్బు తీసుకొని దొంగల పక్షమున వచ్చినదికాక, మమ్ములను దురుసుగా మాట్లాడినందుకు ఇక్కడి మావారు ఎదురు తిరిగారు. అప్పుడు ఇక్కడినుండి పోయాడు. న్యూస్‌పేపర్‌లో సమాచారము వచ్చిన తర్వాత మా దగ్గరకు వచ్చి 50 వేలు డబ్బులు ఇస్తే మీపేరు బయటికి రాకుండా చూస్తాను అన్నాడు. దానికి మేము ఒప్పు కోలేదు. అందువలన అతని పేరు తెలియకుండా ఫోన్ చేసివుంటాడు.

**యస్.పి :-** వజ్రాలు మీవద్ద ఉంచుకోవడము నేరమవుతుంది. వెంటనే మాకు ఎందుకు అప్పగించలేదు. వాటిని మీవద్ద ఉంచుకోవడము చట్టము ఒప్పుకోదు.

**రాజయోగానంద :-** చట్టము ఒప్పుకొనినా ఒప్పుకోకపోయినా వజ్రాలు ఇప్పుడు మాదగ్గర కూడా లేవు. అవి ఈ రోజు రాత్రే మానుంచి కూడా దొంగిలించబడ్డాయి. వాటిమీద చూపున్న వారెందరో ఉన్నారు. అందువలన వాటిని మా రక్షణలోనే ఉంచుకొని అసలైన దొంగలను పట్టించిన తర్వాత వాటిని అప్పగించాలనుకొన్నాము. అయినా మానుండి వాటిని సునాయాసముగా దొంగిలించారు.

**యస్.పి :-** మీ మాట మాకు కట్టుకథగా తోచుచున్నది. మీవద్దనుండి ఎవరో దొంగిలించారని అంటే చట్టము ఒప్పుకోదు. మేము మిమ్ములను అరెస్టు చేయవలసి వస్తుంది.

(అరెస్టా! అని స్వామి నవ్వి చట్టము ఒప్పుకోదు అంటున్నావు. చట్టము ఒప్పుకొంటే అరెస్టు అవసరములేదు కదా! అవసరము వచ్చింది కాబట్టి నీ చట్టముతోనే మాట్లాడు అని స్వామి ఫోన్ చేసి రిసీవర్ యస్.పి గారికి ఇచ్చాడు. ఫోన్‌లో వినిపించిన దానినిబట్టి యస్.పి గారు నేను అలా మాట్లాడినందుకు క్షమించండి స్వామి అని క్షమాపణ చెప్పాడు. తర్వాత నేను ఇక్కడికి రావలసిన పని లేదు. వెళ్లొస్తానని చెప్పి పోయాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(కాటేరి శక్తిని కాపలా పెట్టినప్పటికీ అర్థము కాకుండా వజ్రాలు పోవడము మాంత్రికులకిద్దరికీ అంతుబట్టలేదు. చివరికి ఇద్దరూ కలిసి వారి వద్దనున్న అంజనములో చూడాలనుకొన్నారు. అంజన పూజచేసి అంజనము డబ్బీ మూతతీసి దానిలో నాగభూషణము చూడను మొదలు పెట్టాడు. కొద్దిసేపు తర్వాత అంజనములో దృశ్యములు కనిపించను మొదలు పెట్టాయి. మొదటి దృశ్యములో వజ్రాలు కనిపించలేదు. పొడవాటి పాము కనిపించింది. ఆ పాము అంజనములోనుండి నాగభూషణము వైపు సూటిగా

చూచి తన తోకతో కొట్టింది. అంజనములో తోకను జాడిస్తే ఇక్కడ చూచే నాగభూషణ మునకు దెబ్బతగిలింది. ఆ దెబ్బకు నాగభూషణము ఎగిరి ప్రక్కన పడిపోయాడు. వెంటనే ప్రక్కన వున్న మాంత్రిక వృద్ధుడు మల్లయ్య అంజనములో ఏదో ప్రమాదము జరిగినదని తలచి అంజనమును మూసివేశాడు. ప్రక్కన పడిపోయిన నాగభూషణమునకు మల్లయ్య ఏదో మంత్రము ద్వారా ఉపశమనమును చేశాడు. మూర్ఛనుండి తేరుకొన్న నాగభూషణము జరిగిన విషయమును చెప్పాడు. మల్లయ్య అంజనము నుండి పాము కొట్టడమేమిటి? అని యోచించాడు. చివరకు వారికి ఏమీ అర్థముకాలేదు. అందువలన వారు వజ్రముల కొరకు ప్రాకులాడక కొంతకాలము మౌనముగా ఉండడము మంచిదనుకొన్నారు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(జఠాజూట స్వామి తన ఆధీనమందున్న భూత, ప్రేత, పిశాచముల నన్నిటినీ ఉపయోగించి వజ్రముల ఆచూకీ తెలుసుకోవాలనుకొన్నాడు. గొప్ప యోగియైన రాజయోగానంద స్వామిగారి మనోదృష్టికే గోచరము కాని వజ్రములు తాంత్రికులకు తెలియునా? జఠాజూట స్వామి ఒక దినము వేకువ జామునే లేచి స్నానపానాదులు చేసి తన ఆసనమున ఆసీనుడై తన శిష్యులలో ఒకనిని తన ఎదుట కూర్చోమని చెప్పి తన ఆధీనములోని ఒక పిశాచమును పిలిచి ఎదురుగానున్న తన శిష్యునిలో చేరి మాట్లాడమని చెప్పగా అది అట్లే చేసెను. ఎదురుగానున్న తన శిష్యుని శరీరము నుండి పిశాచి మాట్లాడేదానికి మొదలు పెట్టింది. అప్పుడు వజ్రాల విషయమును జఠాజూట స్వామి అడిగాడు. అప్పుడు ఆ పిశాచి కొద్దిగా ఊగుచు, తనకేమి గోచరము కాలేదని, గొప్ప వెలుగుమాత్రమే కనిపిస్తున్నదని, ఆ వెలుగును దాటి తన దృష్టి ముందుకు పోలేదని, ఆ వెలుగును చూడలేకున్నానని

చెప్పి వెంటనే తేలిపోయింది. జఠాజూట స్వామికి ఏమీ అర్థము కాలేదు. దానివలన కొంత కాలము మౌనముగా ఉండడము మంచిదనుకొన్నాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(రాజయోగానంద స్వామి వద్దనుండి కూడా వజ్రములు చేజారి పోయాయని తెలిసిన తపస్విబాబాగారికి రాజయోగానంద స్వామి దగ్గరనుండి పోయినందుకు కొంత సంతోషమైనా, అవి పూర్తి అంతుచిక్కకుండా పోయినందుకు కొంత బాధ కలిగినది. వయర్‌లెస్ ద్వారా ఆ విషయమును మునెప్పకు తెలియజేసి, కొంతకాలము వజ్రాలకోసము ఏ ప్రయత్నము చేయకుండ ఊరకుండమని చెప్పెను. ఇలా వజ్రాల కోసము ప్రయత్నించు వారందరు ఎవరికి వారు కొంతకాలము ఊరకుండుట మంచిదని ఊరక వుండగా, రాజయోగానంద స్వామి ఆశ్రమములోని రాఘవకు అలా ఊరకుండుట ఏమాత్రము ఇష్టములేదు. ఎందుకనగా! తమవద్దనుండే వజ్రాలు మాయమైపోయాయి. కావున వాటి ఆచూకీని ఎలాగైనా తెలియాలి అను పట్టుదలతో ఉండెను. రాఘవ రాజయోగానంద స్వామివద్దకు పోయి ఇలా అన్నాడు.)

**రాఘవ :-** స్వామీ! మీరు ఎన్నో విషయములను మనోనేత్రముతో చెప్పినారు, ఒక్క వజ్రాల విషయములో మాత్రము తెలియక పోవడానికి కారణము ఏముంటుంది?

**రాజయోగానంద :-** కర్మకు అందరమూ ఆధీనులమే. కావున కర్మ ప్రకారము మనమందరము ఆడించబడుచున్నాము. ఈ ఆటలో పవిత్రమైన దేవాలయము యొక్క వజ్రాల ఆచూకీ తెలియకుండా పోవడము కొంత బాధాకరమైన విషయమైనప్పటికీ, దైవశక్తి ముందర దుష్టశక్తి ఆటలు సాగవు. అందువలన మనము మౌనముగా ఉండడము మంచిదన్నాను.

**రాఘవ :–** స్వామీ మీరు మౌనముగా ఉండడములో ఎంతో అర్థముంటుంది. కానీ మేము మీ సేవకులుగా మీ ధ్యేయమును నెరవేర్చాలను పట్టుదలతో ఉన్నాము. కావున నేను వాటి ఆచూకీ కొరకు ప్రయత్నించవలయునని అనుకొన్నాను. దానికి మీ ఆజ్ఞకొరకు వేచి ఉన్నాను. మీరు మంచిదని సెలవిస్తే ఈ దినమే నా ప్రయత్నము నేను చేయగలను.

(రాఘవ పట్టుదలకు సంతోషించిన స్వామి, కొంత యోచించి సరే నీ ప్రయత్నము నీవు చేయి అన్నాడు. ఆ మాటకు సంతసించిన రాఘవ తనకు తోడుగా కొందరిని పిలుచుకొని, తాను ఎక్కడికి పోవుచున్నది భార్య దుందుభికి కూడా చెప్పకుండా ఆశ్రమమునుండి బయలుదేరి పోయాడు. కొంతమందితో బయలుదేరిన రాఘవ అడవి మార్గము ద్వారా ఒక దినమంతా ప్రయాణించి ఒక ప్రాంతమును చేరిన తర్వాత అక్కడే తన అనుచరులను ఉండమని చెప్పి తాను ఒక్కడే అడవిలో ముందుకు పోయెను. తన వెంటవచ్చిన వారిని వదలిన చోటునుండి పది నిమిషములు పోయిన తర్వాత మహత్యములుగల మర్రిచెట్టు వద్దకు చేరాడు. ఆ మర్రి చెట్టువద్ద గల త్రిశూలమును, పాదుకలను తాకి మ్రొక్కుకున్నాడు. ఆ త్రిశూలమునకు ముందు కూర్చొని ధ్యానమందు లగ్నమైనాడు. కొద్దిసేపటికి ఆకాశములో మేఘములు వచ్చి ఉరుములు మెరుపులు రాజొచ్చాయి. రాఘవ కళ్ళు తెరిచి చూచాడు వర్షము ప్రారంభమైనది. కొద్దిసేపటికి వర్షము నిలిచి పోయినది. తర్వాత నిశ్శబ్దము ఏర్పడినది. అప్పుడు మొదట పిలిచినట్లే “నీవు నావద్దకురా!” అను శబ్దము వినిపించినది. ఇది రెండవ అనుభవము కనుక రాఘవ భయపడక మొదటివలె భూమిని త్రవ్వి, ఇటుకలు తీసి సొరంగమార్గము ద్వారా లోపలికి పోయెను. చీకటి నుండి పోయిన రాఘవకు లోపల గొప్ప వెలుగు కనిపించింది. రాఘవ ఇదివరకే ఒకమారు

పోయి వచ్చిన దానివలన భయపడక ముందుకు పోయి ఆసీనుడైయున్న మునికి నమస్కరించాడు. అప్పుడా మునీశ్వరుడు చిరునవ్వు నవ్వి ఇట్లన్నాడు.)

**ముని :-** నీరాక ఆంతర్యము తెలిసినది, నీవు భువనేశ్వరి దేవాలయమునుండి పోయిన వజ్రాల విషయమై వచ్చావు.

**రాఘవ :-** మహాత్మా మీరు సర్వజ్ఞులు. వజ్రాల విషయమై స్వయాన రాజయోగానంద స్వామియే తనకర్థము కాలేదన్నాడు. బయట ప్రపంచములో గొప్పవారిగా మీరు సూచించిన రాజయోగానంద స్వామికే తెలియనపుడు ఆ విషయము మీకు తప్ప ఎవరికీ తెలియదనుకొన్నాను. అందువలననే మీవద్దకు ఒంటరిగా వచ్చాను. ఇక ఆ విషయము మీరే తెల్పవలసియున్నది.

**ముని :- (**అప్పుడా ముని తన ప్రక్కనేవున్న వజ్రాల మూటను చూపుచూ**)** ఇవిగో ఆ వజ్రాలు. దుష్టుల చేతినుండి ఈ పామే నావద్దకు తెచ్చినది. ఇవి నా వద్ద ఉండుట వలన గొప్పవాడైన రాజయోగానంద ఊహకు కూడా అందకుండాపోయాయి. ఎవరికీ తెలియనట్లు నేనే సంకల్పించాను. కనుక వీటిని గురించి ఎవరి యోచనా పారలేదు. ఈ వజ్రాలున్న పామును మొదట మీ ఆశ్రమము వరకు చేర్చినది ఈ పామే! అది మీనుండి చేజారి పోయిన తర్వాత సాహసించి ఇక్కడికి తెచ్చినది కూడా ఈ పామే. ప్రస్తుతము వాటి కోసము ఎందరో ప్రయత్నించుచున్నారు. వారి ముందర మీ సదుద్దేశము ఎంతమాత్రము పనిచేయదు. వీటిని దేవాలయమునకు చేర్చ వలయునను మీ యోచన మంచిదే, అయినప్పటికీ ప్రస్తుతము మీరు కూడా ఊరకవుండడము మంచిదను తలంపు నాకు కల్గినది. అందువలన మీ చేతినుండి పోయిన వజ్రాలను మీవద్దకు రాకుండా, నావద్దకు వచ్చునట్లు చేసుకొన్నాను. వీటికోసమై నాతో సంప్రదించవలెనను యోచన నీకు వచ్చి, నీవు ఇక్కడికి రావడము ఒక విధముగా మంచిదే. నీవు వచ్చావు కనుక నీకు కొంత క్రొత్త విషయమును చెప్పెదను శ్రద్ధగా విను.

రాబోవు నెలలో అష్టగ్రహకూటమి జరుగును. అష్టగ్రహకూటమి దాదాపు అరగంటకాలముండును. అప్పుడు ఆకాశమంతా మేఘావృత మౌతుంది, పెనుగాలులు వీస్తాయి. కొన్నిచోట్ల భూమి కంపిస్తుంది. కుండ పోతగా వర్షము కురుస్తుంది. సునామీలు రావచ్చును. సూర్యుడు మేఘాల చాటున ఉండుట వలనే ప్రొద్దు గ్రుంకినదా! అని అనుకొందురు. ఈ విధముగా భూమి మీదగానీ, సముద్రము మీదగానీ వాతావరణములో ఎంతో మార్పు చోటు చేసుకుంటుంది. ఆ అష్టగ్రహకూటమి సమయములో మొట్టమొదట పుట్టిన మగశిశువు చాలా ప్రత్యేక జాతకబలము కల్గివుంటాడు. ఎందుకనగా! అష్టగ్రహ కూటమి కన్యాలగ్నములో జరుగుచున్నది. ఆ లగ్నములో మొట్టమొదట పుట్టిన శిశువుకు బుధగ్రహము, ఆ రాశిలోని మొదటి నక్షత్రములో, మొదటి పాదములో మొదటనే ఉన్నది. కావున బుధ గ్రహము ఆధీనములోనివన్నియూ ఆ బాలునికి సులభముగా లభ్యము కాగలవు. అదియూ అష్టగ్రహ కూటమి సమయము అయినందున కొన్ని అసాధారణ శక్తులు ఆ బాలునికి ఉంటాయి. మొత్తము మీద ఆ బాలుడు సాధారణ వ్యక్తికాదు అని చెప్పవచ్చును. ఆ సమయములో మొదట పుట్టిన వానికి ఎలాంటి ప్రత్యేకత ఉన్నదీ భూమిమీద కొందరికి తెలుసు. అలా తెలిసిన వారు ఆ బాలున్ని ఉపయోగించుకొని లోకములో అసాధారణ పనులు చేయబూనుతారు. వారు చేయు దుష్టకార్యములను నీవు రాజయోగానంద సలహాతో ధైర్యముగా ఎదుర్కొని విఫలము చేయాలి. అలా చేయకపోతే భూమిమీద క్షుద్రశక్తుల ప్రాబల్యము ఎక్కువై పోయి, అనేక రోగాలు బయలు దేరి ప్రజలను గుంపులు గుంపులుగా చనిపోవునట్లు చేయును. అంతేకాక ఆ బాలునియందుండు శక్తిని గ్రహించినవారు ఆ బాలున్ని ఉపయోగించి ఏమైనా చేయగలరు. వారు చేయలేని పనిగానీ, వారికి చేతకాని పనిగానీ ఏదీ ఉండదు. ప్రజలనందరిని భయోత్పాతులుగా

చేయగలరు. అందువలన నీవు మరియు రాజయోగానంద స్వామి ఇద్దరూ కలిసి వారికి అట్టిశక్తి చేకూరకుండా చేయాలి. ఈ కార్యములో మీకు ఎన్నో ప్రాణాపాయ స్థితులు కలుగవచ్చును. మీకు అలాంటి స్థితి ఏర్పడినపుడు నేనే స్వయముగా రక్షించగలను. మిగతా పనులను మీరు స్వయముగా చూడవలసివుంటుంది.

వజ్రములు బయట ఉండడము మంచిదికాదని ఇక్కడికి చేరునట్లు చేశాను. అన్ని సుఖములుండీ, ప్రపంచములో గొప్పవారు అనిపించుకొన్న కొందరు ఈ వజ్రములను కాజేయాలని చూస్తున్నారు. అంతేకాక ప్రపంచాధిపత్యమును సంపాదించాలనుకొని అష్టగ్రహకూటమి కోసము వేచి యున్నారు. నేను చెప్పిన ఈ విషయములన్నిటినీ రాజయోగానంద స్వామికి తెలియజేయి.

**రాఘవ :-** మహాత్మా! ఆ వజ్రాలు మావద్ద ఉండేవని తర్వాత అవి మా చేతినుండి అపహరింపబడినాయని మేము చెప్పినా పోలీసు వారు కొంత మమ్ము అనుమానించి మేము అబద్ధము చెప్పుచున్నామని భావించారు. వజ్రములను భువనేశ్వరి దేవాలయమునకు అప్పచెబుతామని రాజయోగానందస్వామి చెప్పారు. తర్వాత అవి మానుండి దొంగలించబడినాయని చెప్పగా వారు మమ్ములను అనుమానిస్తున్నారు. ఈ ఇబ్బంది నుండి బయటపడుటకు దారిని మీరే చూపాలి.

**ముని :-** వజ్రాలను కాపాడి దేవాలయమునకు చేర్చాలనుకొన్న మిమ్ములను వారు ఏమీ చేయలేరు. రాజయోగానంద స్వామి మొదటనే డి.జి.పి గారికి వజ్రాల విషయము తెలియజేశాడు. ఇది డిపార్టుమెంటుకు పెద్దయిన డి.జి.పి మరియు రాజయోగానంద ఇద్దరూ కలిసి అసలైన దోషులను బయటికి లాగానుకొన్నారు. ఇద్దరూ కలిసి చేస్తున్న పని మిగతా ఆఫీసర్లకు కూడా తెలియదు. అందువలన ఒక దినము యస్.పి. వచ్చి స్వామిని

అరెస్టు చేస్తానన్నాడు. తర్వాత ఫోన్‌లో మాట్లాడి తోకముడుచుకొని పోయాడు. ఆ దినము యస్.పి తో డి.జి.పి ఫోన్‌లో మాట్లాడాడని మీకు కూడా తెలియదు. డి.జి.పి సలహాతోనే వజ్రాలు మావద్ద ఉన్నాయని రాజ యోగానందస్వామి చెప్పాడు. అందువలన ఏ అధికారి మిమ్ములను అనుమానించినా వారు ఏమీ చేయలేరు. ఇక నీవు ఇక్కడినుండి వెళ్ళిపో. తర్వాత నే చెప్పిన విషయమంతా రాజయోగానందకు చెప్పు.

ఆ మహాత్ముడు చెప్పిన మాటలు విని రాఘవ గుహనుండి బయటికి వచ్చాడు. తర్వాత యథాతముగా ఆ ద్వారమును కప్పిపెట్టి, అక్కడినుండి కొంత దూరములోనున్న తన వారితో కలిసి తిరుగు ప్రయాణము సాగించాడు. ఆశ్రమానికి వచ్చిన వెంటనే భూగర్భములోని మునీశ్వరుడు చెప్పిన సమాచారమును రాజయోగానంద స్వామికి తెలియజేశాడు. విషయము తెలుసుకొన్న స్వామి విస్తుపోయాడు. తను డి.జి.పి కలిసి అసలైన దొంగలను బయటికి లాగాలనుకొన్న విషయము ఎక్కడో భూగర్భము లోనున్న వ్యక్తి చెప్పడము ఆశ్చర్యమైనది. తర్వాత అష్టగ్రహకూటమిని గురించి ఆలోచిస్తూ అప్పటి నవగ్రహముల స్థితి ఎట్లుంటుందోనని యోచించాడు. అష్టగ్రహ కూటమిని అనుకూలముగా మార్చుకోవాలను కొన్నవారు ఎవరైవుంటారని కూడా స్వామి యోచించసాగాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(తపస్వి బాబా అష్టగ్రహ కూటమి వచ్చుచున్నదని తెలిసినవాడై మరియు ఆ సమయములో మొదట జన్మించు వానికి విశేషశక్తి ఉండునని తెలిసినవాడై, ఆ బాలుడు ఎక్కడ జన్మిస్తాడనీ, ఆ బాలున్ని ఎలా అపహరించాలనీ, ఆ బాలున్ని ఎక్కడ ఉంచాలనీ, ఎవరివద్ద పెంచాలనీ

యోచించసాగాడు. తర్వాత ఒక నిర్ణయానికి వచ్చాడు. ఇంతకుముందు తమ పనికి ఉపయోగపడినారని చెప్పిన ఇద్దరి మాంత్రికులకు పెద్ద మొత్తములో డబ్బు ఇచ్చి, తర్వాత వారికి కొంత శిక్షణ నేర్పించి వారి ద్వారా తమ పనిని సాధించవచ్చునని తపస్వి బాబా అనుకొన్నాడు. వెంటనే మునెప్పతో వయర్‌లెస్‌లో మాట్లాడి, ముందు తమకు ఉపయోగపడిన మాంత్రికులను ఇద్దరినీ పిలిచి తలా ఒక లక్ష రూపాయలు ఇచ్చి తాను చెప్పినట్లు నడుచుకొనుటకు ఒప్పించుకోమన్నాడు. తపస్వీబాబా ద్వారా విషయమును తెలుసుకొన్న మునెప్ప మాంత్రికులకొరకు తన మనుషులను పంపి వారిని రప్పించుకొన్నాడు. ఒక్కొక్కరికి లక్షరూపాయలు డబ్బులు ఇస్తామని, వారికి ఏ కష్టము లేకుండా చూస్తామని, తాము చెప్పినట్లు చేయాలని చెప్పగా, లక్షరూపాయలన్న మాటవినగానే మాంత్రికులు ఇద్దరూ ముందూ వెనుక ఆలోచించకుండా అలాగేనని ఒప్పుకొన్నారు. పెద్ద మొత్తములో డబ్బు చూడని మాంత్రికులిద్దరూ లక్షరూపాయలను మాటకు పూర్తి వశులై పోయారు. అప్పుడే ఇచ్చిన 50 వేలను చూచి సంబరపడి పోయి, ఆ దినము నుండే మునెప్ప చెప్పినట్లు నడుచుకొనుటకు పూను కొన్నారు. ఈ విధముగా తపస్వీబాబా ముందుగానే తన వ్యూహమును సిద్ధము చేసి పెట్టుకొని ఆ సమయము కొరకు వేచి చూస్తున్నాడు. ఆ సమయములో మొదట పుట్టువాడెవడో తెలుసుకొనుటకు తమ ఆధీన మందున్న మనుషులను వినియోగించడమే కాకుండా, అదృశ్యరూపమున తనవద్ద ఉన్న సూక్ష్మశరీరముగల వారిని కాపలాకు సిద్ధముగా ఉంచాడు. అష్టగ్రహకూటమి నాడు పుట్టు శిశువును మాంత్రికులు వారి మాయ జాలముతో అపహరించవలయునని ఆదేశమిచ్చారు.)

× × × × × × × × × × × × × × × × × × × × × × ×

(రాబోవు అష్టగ్రహకూటమి గురించి జఠాజూట స్వామి తెలిసినవాడై, ఆ దినమంతయూ ప్రజలు యోగనిష్టలో ఉన్నాడనుకొనునట్లు, తాను మంత్ర జపములో ఉండవలెనని అనుకొన్నాడు. ఆ దినము తాను మంత్ర ధ్యానమందుండుటకు కావలసిన ఏర్పాట్లు తన శిష్యుల చేత చేయించుకొని ఆ దినము కొరకు వేచియున్నాడు. అష్టగ్రహ కూటమి రోజున పుట్టువాని ప్రత్యేకత ఏమిటో జఠాజూట స్వామికి తెలియదు. తపస్విబాబాగారు ఆ దినము పుట్టు బాలుని కోసము వేసిన పథకము తెలియదు. తపస్విబాబాగారి పథకము తెలియకున్నా, తన పద్ధతి ప్రకారము తాను విశేషమంత్ర శక్తిని ఆ దినము సాధించవలెననుకొన్నాడు. ప్రస్తుతము తన ఆధీనమందుండు భూత ప్రేత పిశాచములకంటే గొప్ప శక్తిని సాధించి దాని ద్వారానైనా వజ్రముల కొరకు ప్రయత్నించవలయుననుకొన్నాడు. అందువలన రాబోవు అష్టగ్రహకూటమి కొరకు వేచియున్నాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(భార్యచేత చెంపదెబ్బతిన్న సి.ఐ.బాలప్ప రెచ్చిపోయిన తన భార్యను ఏమీ అనలేక అప్పటికి ఊరకుండినప్పటికీ, తాను తన భార్యచేత చెంప దెబ్బ తినటానికి కారణము రాజయోగానంద స్వామియేనని తలచి, ఆయన మీద ఎలాగైనా కక్ష సాధించాలనుకొని సమయము కోసము వేచివుండెను. కొన్ని దినములు గడచిన తర్వాత ఒక ఇంటిలో దొంగతనము జరిగింది. అందులో పదితులముల బంగారు దొంగలించబడినదని ఆ ఇంటి యజమాని పోలీసులకు ఫిర్యాదు చేశాడు. అప్పుడు బాలప్ప ఆ అవకాశమును రాజయోగానంద స్వామి మీద కక్షసాధింపుకు వినియోగించుకోవాలను కొన్నాడు. దానిలో భాగముగా ఒక పాత నేరస్థుడను అరెస్టు చేసి విచారణ జరిపాడు. ఆ పాతనేరస్థుడు వాస్తవముగ ఆ

దొంగతనము చేయకున్ననూ, బలవంతముగా ఆ నేరమును ఒప్పుకొనునట్లు చేశాడు. ఆ బంగారమును రాజయోగానంద స్వామికి అమ్మినట్లు చెప్పమని ఆ నేరస్థున్ని ఒప్పించాడు. చేయునది లేక ఆ నేరస్థుడు అలాగేనని ఒప్పుకొన్నాడు.)

అలా ఒప్పించిన సి.ఐ. బాలప్ప మరుసటి దినము పాతనేరస్థున్ని పిలుచుకొని రాజయోగానంద స్వామివద్దకు పోయి, నేరస్థుని దగ్గర కొనిన బంగారమును ఇమ్మని స్వామిని అడిగాడు. అలా అడగడములో బాలప్ప ఉద్దేశము స్వామికి అర్థమైనది. బాలప్ప ఉద్దేశపూర్వకముగా తనను నేరస్థునిగా చేయాలనుకొన్నాడనీ, తన అధికార బలముచేత తనను కోర్టుకు పోవునట్లు చేయడమే అతని పథకమనీ, తనమీద ద్వేషముతో అలా చేయుచున్నాడనీ స్వామి అనుకొన్నాడు. అప్పుడు అక్కడేవున్న రాఘువవైపు స్వామి చూచాడు. స్వామి చూపులోని ఆంతర్యమును గ్రహించిన రాఘువ తన అనుచరులైన ఆటవికులకు చెవిలో ఏదో చెప్పాడు. అందరూ అలాగేనన్నట్లు తలవూపారు. అప్పుడు స్వామి రాఘువతో “మీవద్ద ఉన్న బంగారును సి.ఐ బాలప్పకు ఇవ్వండి” అన్నాడు. ఆ మాటవిన్న రాఘువ బాలప్ప వైపు తిరిగి “రండి” అని ప్రక్క గదిలోనికి పిలుచుకొనిపోయారు. బాలప్ప వెంట వచ్చిన పాత దొంగ బయటే ఉండిపోయాడు. గదిలోనికి పోయిన బాలప్ప అరవనూ మూల్గనూ మొదలుపెట్టాడు. గదిలోపల గొడ్డును బాదినట్లు శబ్దము వినిపిస్తున్నది. బయటవున్న దొంగ “లోపల ఏమి జరుగుచున్నది” అని అడిగాడు. అప్పుడు స్వామి నవ్వి “ మేము నీ దగ్గర కొనిన బంగారును ఇమ్మన్నాడు కదా! కావున అతనికి మావారు వేడివేడి తన్నులు వడ్డిస్తున్నారు. అతను మూల్గి, మూల్గి తింటున్నాడు. లోపల జాగాలేదు, అందువలన అతనికి ఒక్కనికే వడ్డిస్తున్నారు. అతడు కడుపునిండా

తిని వచ్చిన తర్వాత, మాకు బంగారమును అమ్మానని చెప్పిన నిన్ను పిలుచుకొని పోయి వడ్డిస్తారు" అన్నాడు. ఆ మాటవిన్న పాతనేరస్థుడు స్వామి కాళ్ళమీద పడి సి.ఐ గారే అలా చెప్పమన్నారనీ, తనకు ఏ కర్మ తెలియదనీ, తాను ఈ దొంగతనమే చేయలేదని చెప్పాడు. అప్పుడే బాలప్పను గదినుండి బయటికి తెచ్చారు. బాలప్ప గతి చూచిన దొంగ భయపడి పోయాడు. అపుడు స్వామి ఆ దొంగతో ఇలా అన్నాడు.

**రాజయోగానంద :-** నీవు ఏమీ భయపడవద్దు, ఇపుడు బాలప్ప నీవు దొంగ తనము చేశావని అనడు. (బాలప్ప వైపు చూచి) ఏమి బాలప్పా! ఇతను దొంగతనము చేశాడా? బంగారు మాకు అమ్మాడా?

**బాలప్ప :-** లేదు, ఇతను దొంగతనము చేయలేదు. ఈ బంగారు విషయము మీకు తెలియదు.

**రాఘవ :-** ఇక ఎప్పుడైన తప్పుడు కేసులు బనాయించాలని చూచావో, నిన్ను చంపి మేము జైలుకు పోతాము. జాగ్రత్త!

**బాలప్ప :-** వద్దు, మీరు ఏమైనా చేయగలరు. నేను ఎప్పటికీ మీ జోలికి రాను. నన్ను వదలండి పోతాను.

**రాజయోగానంద :-** నీవు మీ యస్.పి.గారు వచ్చేంతవరకు మావద్ద ఉండాలి.

(యస్.పి గారికి కబురు చేయగా అతను వెంటనే బయలుదేరి వచ్చాడు. యస్.పి.గారు రాజయోగానంద స్వామి వద్దకు వస్తానే తన్నులు తిన్న బాలప్ప కనిపించాడు. స్వామి జరిగిన విషయమంతా కూలంకశముగా చెప్పాడు. బాలప్పకు, స్వామికి ముందే తగాదా ఉన్నదని తెలిసిన యస్.పి గారు పాతనేరస్థుని కూడా విచారించి, అన్ని విధముల బాలప్పది తప్పని

గ్రహించి యస్.పిగారు బాలప్పను మందలించి సస్పెండ్ చేస్తున్నానని చెప్పాడు. బాలప్ప తలవంచుకొని అక్కడినుండి పోయాడు.)

**యస్.పి :-** స్వామీ వజ్రాల విషయము ఏమైనా తెలిసిందా?

**రాజయోగానంద :-** నిన్ననే కొంత విషయము రాఘవ ద్వారా తెలిసింది. దానిని ఇప్పుడు మీకు చెప్పలేము. ఎందుకనగా చెప్పినా మీరు ఆ విషయమును నమ్మలేరు. పైగా ఆ విషయము ఎవరికీ తెలియకూడదను నిబంధన కూడా మా మీద ఉన్నది. మొత్తము మీద వజ్రాలు మావద్ద ఉన్నట్లే పూర్తి రక్షణలోనే ఉన్నవి. అవి ఏ దుర్మార్గుని చేతిలో పడలేదు. విషయమంతా సమయమొచ్చినపుడు చెప్పగలము.

(స్వామి మాటవిన్న యస్.పి.గారు స్వామి మాటమీద నమ్మకము కలవాడై అలాగేనని చెప్పి బయలుదేరిపోయాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × ×

(అష్టగ్రహ కూటమి జరుగునని తెలిసినవారందరూ వారి దృష్టిని దానిమీదికి మళ్ళించుకొన్నారు. అప్పుడు వజ్రాల విషయమునకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వకుండా, అష్టగ్రహ కూటమిమీదనే ఎక్కువ శ్రద్ధ కల్గి యున్నారు. మంత్రశక్తికి పదును పెట్టి రెట్టింపు చేసుకొనుటకు జఠాజూట స్వామి చూచుచుండగా, ఆ సమయములో మొదట పుట్టిన బాలున్ని స్వాధీన పరుచుకొని ప్రపంచమునే తన చేతులలోనికి తీసుకోవాలని తపస్విబాబా తలచుచున్నాడు. ఇపుడు వారి యోచనలలో వజ్రాలకు ప్రాధాన్యత లేదు.)

రాఘవ రాజయోగానంద స్వామి సలహాలను తీసుకొంటూ తపస్వి బాబాగారి ప్రయత్నమును వ్యర్థము చేసి దుష్టశక్తుల బారినుండి ప్రజలను కాపాడవలెనను పట్టుదలతో ఉన్నాడు. అంతలో గ్రహకూటమి దగ్గర

పడింది. రేపటి దినము కూటమి జరుగునని అన్ని రేడియో కేంద్రాలు, మిగత టీవీ వార్తాప్రచార ఛానళ్ళు ప్రజలకు తెలిపాయి. వాతావరణములో మార్పు ఉంటుందని, సముద్రము మీదికి చేపలు పట్టేవారు పోవద్దని కూడా తెలిపాయి. పాఠశాలలలో ఉపాధ్యాయులు విద్యార్థులకు గ్రహకూటమిని గురించి తెలుపుచూ, ఇది మూడు వేల ఐదువందల సంవత్సరముల క్రితము జరిగిందని, దేశములో ఇప్పుడున్న నాగరికత అప్పుడు లేక కాగితము లేక పోవుట వలన అప్పటి విషయములు గ్రంథరూపముగా మన పెద్దలు వ్రాయలేకపోయారని, అప్పుడు కొందరు మునులు తాటి ఆకుల మీద వ్రాసిన కొన్ని విషయములు మాత్రము దొరికాయని, అవియూ కొన్ని చెదలు పట్టిన ఆకులు కనుక అందులోని పూర్తి విషయములు గ్రహించలేక పోయామని, కొంతవరకు తెలిసిన విషయమునుబట్టి చూస్తే అష్టగ్రహ కూటమి అంటే సామాన్యమైనది కాదనీ, అప్పుడదివున్న అరగడియ (12 నిమిషములు) కాలములో భూమిమీద ఎన్నో సంఘటనలు జరిగినట్లు వ్రాశారనీ తెలిపి, రేపటి దినము అన్ని విద్యాకేంద్రములకు సెలవు ప్రకటించినట్లు చెప్పారు. అత్యవసర ఉద్యోగాలకు తప్ప మిగత ఉద్యోగస్తులందరికీ ఆ దినము ప్రభుత్వము సెలవు దినముగా ప్రకటించింది.

రేపు అష్టగ్రహ కూటమి జరుగునని తెలిసిన బ్రాహ్మణులు ఆ సమయము చెడు కాలమని, ఆ సమయములో వేదమంత్రములు చదువుట వలన ఆ చెడును కొంత హరించవచ్చుననీ, వేదపఠనమునకు కావలసిన పూజా సామాగ్రిని సమకూర్చుకోవడములో లగ్నమై ఉన్నారు. మంత్ర గాళ్ళు తమ ఆచారానుసారము కంఠము వరకు భూమిలో పూడ్చుపడి జపము చేయుటకు గొంతు లోతువరకు గుంతలు త్రవ్వించుకొనుచుండగా, కొందరు గొంతు లోతువరకు నీటిలో దిగి జపించుకోవాలను ఉద్దేశముతో దానికి

అనుకూలమైన బావులను, చెరువులను వెతుకుచుండగా, సాధారణ జపము చేసుకొనుటకు జమ్మిచెట్టు నీడ, మర్రిచెట్టు నీడను కొందరు వెతుకుచున్నారు. ఇట్లు ఎందరో ఎన్నో విధములుగా గ్రహకూటమిని ఉపయోగించుకోవాలని ప్రయత్నిస్తుండగా రాజయోగానంద ఆశ్రమములో రాఘవ స్వామివద్ద చేరి ఇలా అన్నాడు.)

**రాఘవ :-** స్వామీ పంచాంగము ప్రకారము రేపటి దినమున మధ్యాహ్నము మూడు గంటలకు అష్టగ్రహ కూటమి జరుగుచున్నది. ఎందరో ఎన్నో విధముల వారివారి సాధనకు కావలసిన ఏర్పాట్లు చేసుకొనుచున్నారు. రేపు మన పనేమిటో తెలియజేస్తే దానికి కావలసిన ఏర్పాట్లు చేస్తాము.

**రాజయోగానంద :-** మనము అందరివలె జపతపములు చేయము. కానీ రేపు పుట్టబోవువాడు ఎక్కడ పుట్టునన్న విషయము తెలియకున్నది. ఈ విషయములో లాభము పొందవలెననుకొన్నది ముఖ్యముగా తపస్విబాబాగారే. కనుక వారు ఈ విషయమును మనకంటే ముందుగ తెలుసుకొనుటకు చురుకుగా ప్రయత్నించుచుందురు. మనము రేపు తపస్విబాబాగారి మీద నిఘా వేసివుంచడమే ముఖ్యమైన పనిగా పెట్టుకోవాలి. ఇంత భూమిమీద ఎవడు ఎక్కడ పుట్టునో మనకు తెలియకున్నది. కనుక వారి వలననే మనము సులభముగా గ్రహించవచ్చును.

**రాఘవ :-** స్వామీ! తపస్విబాబాగారు ఒక్కరే ఈ విషయము కొరకు ప్రయత్నించడు కదా! అతని మనుషులు ఎవరైనా ప్రయత్నించవచ్చును. అపుడు ఆయన మీద నిఘా వేయుట వలన మనకు ఏమీ తెలియకుండా పోవునేమో. బహుశా ఆయన ఈ కార్యములో ఎటూ కదలకవుండి తనవారి చేత పనిని చేయించుకుంటాడు.

**రాజయోగానంద :-** చూడు రాఘవ! నీవు ఇప్పుడే తెలివిగా యోచించాలి.

నీవను కొన్నట్లు నేను కూడా ఊహించాను. అలా ఆ కార్యము చేయువారు తపస్వి బాబాకు వేయిమంది ఉండవచ్చును. అపుడు మనము వేయిమందిని కాపు కాచి చూడగలమా? అది సాధ్యముకాని పనియగును. ఎందరు ఆయన కార్యములో లగ్నమైవున్నా, చివరకు వారికి తెలిసిన విషయమేమిటో, వారు చేస్తున్నదేమిటో బాబాగారికి చెప్పకమానరు. కేంద్రము తపస్విబాబా అయినపుడు అచటనే అన్ని విషయములూ తెలియును. కావున ముఖ్యమైన తపస్విబాబాగారి దగ్గరే ఉండినట్లయితే, వారికి కావలసినది ఎచటగలదో, ఏ విధముగ తెలుసుకొనుచున్నారో, ఏ విధముగ చేయుటకు పథకము వేయుచున్నారో, మనకు సులభముగా తెలియగలదు. అప్పుడు వారి కార్యములను విఘ్నపరుచుటకు మనము తయారు కాగలము.

**రాఘవ :-** తపస్విబాబాగారి దగ్గర నిఘావేసి సమాచారమును సేకరించ వలయునంటే చాలాకష్టమైన పని అనుకుంటాను. క్రొత్తవారిని వారు నమ్మరు, దగ్గరికి కూడా రానివ్వరు. అటువంటపుడు తపస్విబాబాగారి దగ్గర ఆంతరంగి కముగా జరుగు విషయములను మనము తెలుసుకోవాలంటే వీలుపడదేమో నని అనుమానము వస్తున్నది.

**రాజయోగానంద :-** ఆ అనుమానమును నీవు పెట్టుకోవద్దు. దానికి కావలసిన ఏర్పాట్లు ఆరునెలలు ముందే చేసివుంచాను. మన మనిషి నా ఆదేశానుసారము బాబాగారి భక్తులలో ఒక ముఖ్యమైన భక్తుడై పోయాడు. అతడు రేపటి దినము బాబాగారిని వేయికళ్ళతో కాచుకొనివుంటాడు. బాబాగారికి అందు ఏ సమాచారమైనా మన మనిషికి తెలియగలదు. అక్కడ తెలిసిన వెంటనే ఆ విషయమును ఒక కాగితములో వ్రాసి మన ఆశ్రమము నుండి తీసుకపోయిన పావురమునకు కట్టి పంపుతాడు. భూమిమీద పోవు అన్ని వాహనములకంటే మన పావురము వేగముగా ప్రయాణించి మన

ఆశ్రమము చేరగలదు. అపుడు వారి విషయము ఆ పావురము తెచ్చిన కాగితములో ఉంటుంది.

(ఆ మాటవిన్న రాఘువ ఆశ్చర్యచకితుడై తనలో తాను ఇలా అనుకొనెను. నేను నెలక్రిందటే కదా గ్రహకూటమిని గురించి గుహలోని మునీశ్వరుడు చెప్పాడని చెప్పాను. ఈ విషయము ఈయనకు ముందే తెలుసా? వజ్రాల విషయము అర్థముకాలేదన్న తర్వాత గుహలోని మహాత్ముని వద్దకు నేను పోయాను. ఈయనకు అర్థముకాని విషయము ఆయన చెప్పాడు. తర్వాత గ్రహకూటమిని గురించి రాజయోగానందస్వామికి చెప్పమన్నాడు. ఫలానా తపస్విబాబాగారు ఈ విషయమునకే వేచివున్నాడని అప్పుడు ఆయన చెప్పలేదు. ఎవరో గ్రహకూటమి కొరకు కాచుకొని ఉన్నాడని మాత్రమే చెప్పాడు. అప్పుడు ఆయన చెప్పలేని విషయమును ఈ స్వామి ముందే తెలుసుకొన్నాడు. గుహలోని స్వామికి తెలియని విషయములు బయటి స్వామికి తెలుసు. బయటి స్వామికి తెలియని వజ్రాల విషయము గుహలోని స్వామికి తెలుసు. దీనినిబట్టి చూస్తే ఆయనకంటే ఈయన గొప్పవాడా! ఈయనకంటే ఆయన గొప్పవాడా! అని ప్రశ్నరాక తప్పదు అని యోచిస్తున్న రాఘువను చూచి స్వామి ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** ఏమి రాఘువ! ఏమీ మాట్లాడక యోచిస్తున్నావు. నీ సంశయమేమిటో నాకు చెప్పు.

**రాఘువ :-** ఏమీ లేదు స్వామీ, గుహలోని స్వామి జ్ఞప్తికి వచ్చాడు.

**రాజయోగానంద :-** ఇప్పుడాయనెందుకు జ్ఞాపకానికి వచ్చాడు. నేను చెప్పు విషయము వేరుకదా!

**రాఘవ :–** తపస్విబాబాగారు అష్టగ్రహకూటమి కొరకు ప్రయత్నిస్తున్నాడని ఆయన చెప్పక ఎవరో ప్రయత్నిస్తున్నారని చెప్పాడు. ఆయన ఫలానా బాబా అని చెప్పలేదు. ఆయనకు తెలియని బాబాగారి విషయము మీకు ముందే తెలిసి ఆరునెలలు ముందే ఏర్పాటు చేశారు. దానినిబట్టి గుహలోని స్వామికి తెలియని విషయము మీకు ముందే తెలుసుననీ ఆయనకంటే మీరు గొప్పవారని అర్థమగుచున్నది. అట్లే వజ్రాల విషయానికి వస్తే మీకు తెలియని విషయము ఆయనకు తెలిసి వాటిని తనవద్దకు తెచ్చుకున్నాడు. ఇక్కడ మీకు తెలియనిది ఆయనకు తెలిసినది. దీనినిబట్టి మీకంటే ఆయనే గొప్పను యోచన వస్తున్నది. ఒక విషయములో మీరు, మరొక విషయములో వారు, గొప్పగా ఉండుట వలన ఎవరు గొప్ప అను ప్రశ్నకు సమాధానము లేకుండా పోవుచున్నది. దానిని గురించే యోచిస్తున్నాను.

**రాజయోగానంద :–** ఎవరు గొప్ప అనునది తర్వాత తెలుస్తుంది. ఇపుడది అవసరములేదు. ఇపుడు మనకు కావలసినది విషయసేకరణ.

**రాఘవ :–** స్వామీ! మీరు గ్రహకూటమికి ఆరునెలలు ముందే విషయ సేకరణకు చేసిన ఏర్పాటు చాలాగొప్పది. తపస్విబాబాగారిని కేంద్రముగా చేసుకొని వారి విషయమును సేకరించడము గొప్ప పథకము. రేపటి దినమున మనకు వచ్చు సమాచారమునకై వేచి చూద్దాము. తదుపరి యోచన మీరే చెప్పితే నేను చేయువాడను.

(ముందుగానే రాఘవ తన అనుచరులను సమయము వచ్చినపుడు ఎట్టి పని చేయుటకునైన సర్వ సన్నద్ధము చేసివుంచాడు. అతనివద్దయున్న ఆటవికులు అతనేది చెప్పితే అది చేయుటకు వెనుకాడకున్నారు. మరుసటి దినము తెల్లవారింది. ఆ దినము బుధవారము కావడము మరీ విశేషము. ఉదయమంతా బాగున్నప్పటికీ మధ్యాహ్నము రెండు గంటల నుండి

ఆకాశములో మేఘములు కమ్ముకొనుటకు మొదలుపెట్టాయి. సముద్రములో అలలు ఎత్తుగా లేవను మొదలుపెట్టాయి. మూడు గంటల సమయమునందు వాతావరణము పూర్తి చల్లబడినది. ఆకాశములో అష్ట గ్రహకూటమి మూడు గంటల మూడు నిమిషములకు జరిగినది. మూడు గంటల సమయములో పెనుగాలులు వీచసాగాయి. మూడు గంటల మూడు నిమిషములకు వర్షము కూడా ప్రారంభమైనది. గాలివానకు ప్రజలు ఎవరూ బయటికి రాలేక ఇళ్ళలో ఉండిపోవసివచ్చినది. ఆకాశములో పిడుగు తీగలు పైనుండి భూమివరకు మెరువసాగాయి. రోడ్లమీద ప్రయాణించు వాహనములు అనేకముగా ప్రమాదానికి గురియైనాయి. సూర్యుడు మొదలు కొని మిగత ఏడు గ్రహములు రాహువుతో కలియుట వలన అక్కడక్కడ పుట్టరంధ్రముల నుండి ఊహించని రీతిలో విషవాయువులు బయటికి రాసాగాయి. ఆ వాయువు ప్రభావమున పుట్టలకు దగ్గరున్న వారందరికి కొద్దిగ మైకమేర్పడి నది. చర్మమునందు మంటలు కలుగజొచ్చాయి. కొందరికి ఆ వాయువు వలన చర్మముమీద బొబ్బలు వచ్చాయి. విష సర్పాలు తమ నివాసముల నుండి బయటికి వచ్చి విచ్చల విడిగా సంచరించను మొదలు పెట్టాయి.

ఇట్లు ఎన్నో విధముల భూమిమీద వింతలు జరుగుచున్నప్పటికీ, తపస్విబాబా యోచన మొట్టమొదట పుట్టు శిశువును గురించే మెదలు చున్నది. అంతలో ఆయన ఆధీనమువుండి ఆదేశింపబడిన సూక్ష్మరూప మొకటి వచ్చి ఇలా తెలియపరచినది. ఆ విషయము కాగితము మీద వ్రాతగా ఉన్నది. “బాబాగారికి వందనము తమ ఆదేశానుసారము బయలు దేరిపోయి, అన్ని ప్రాంతములలో గర్భిణీ స్త్రీలు ఉన్న చోటంతా చూడగల్గు చున్నాము. గ్రహకూటమి సమయములో ఇక్కడికి 60 మైళ్ళ దూరానవున్న మాలసముద్రము అను ఊరిలో, ఒక అనాథస్త్రీ ఆ ఊరి చివరన ఉన్న

ముత్యాలమ్మ అను డాక్టరువద్ద ప్రసవించినదని, ఆ మగ శిశువే మొదట పుట్టిన బిడ్డ అని తమకు తెలుపుచున్నాము.” అని వ్రాయబడివుంది. గాలికి తనముందుకు వచ్చిపడిన కాగితము మీద వ్రాతను చూచిన బాబాగారు వెంటనే తన భక్తులను పిలచి “మాలసముద్రమను ఊరికిపోయి, ఆ ఊరి చివరిలో ముత్యాలమ్మ అను డాక్టరువద్ద ప్రసవింపబడిన మగ శిశువును ఎలాగైనా తీసుకురండి” అని చెప్పెను.

ఆ విషయమును విన్న రాజయోగానంద స్వామికి సంబంధించిన మనిషి వెంటనే తన గదిలోనికి వచ్చి తెలిసిన విషయమును కాగితము మీద వ్రాసి ఒక తావెత్తులో ఆ కాగితమును మడిచిపెట్టి, బుట్టలోని పావురమును బయటికి తీసి, దాని కాలికి తావెత్తును కట్టి వదలాడు. ఆ పావురము పైకి లేచి రాజయోగానంద స్వామి ఆశ్రమమువైపు రాసాగింది. అప్పటికి అష్టగ్రహ కూటమి అయిపోయి వర్షము నిలిచిపోయింది. కావున పావురము సులభముగా ప్రయాణించసాగింది. తపస్విబాబాగారి ఆదేశానుసారము ఆయన మనుషులు మాలసముద్రమునకు బయలుదేరి పోయారు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(మాల సముద్రములో ముత్యాలమ్మ డాక్డరువద్ద ప్రసవించిన స్త్రీ అనాథ కావడమువలన, ఆ శిశువును ప్రసవించిన వెంటనే ఆమె చని పోవడము వలన, ఆ మగ శిశువు ఒంటరిగా డాక్టరువద్ద నిలిచిపోయాడు. అక్కడికి సమీపములోనున్న ఒక పెద్ద జమీందారుకి సంతతి లేని కారణమున, ఆ జమీందారు ముత్యాలమ్మ డాక్టరుతో మేము పెంచుకొనే దానికి మాకు ఒక మగశిశువు కావాలని అనేకమార్లు చెప్పేవాడు. ఈ విషయము డాక్టరమ్మకు వెంటనే జ్ఞాపకము వచ్చి, ఆ జమీందారుకు ఫోన్ చేసి

తనవద్దనున్న శిశువు విషయము చెప్పింది. ఎవరో అనాధకు మగ శిశువు పుట్టాడు ఆమె చనిపోయింది. ఆమె తాలూకు వారు ఎవరూ లేరని డాక్టరమ్మ చెప్పిన వెంటనే జమీందారు మిక్కిలి సంతోషించి, అతనూ, అతని భార్యా ఇద్దరు కారులో బయలుదేరి మాలసముద్రము చేరుకొని, ఆ శిశువును డాక్టరునుండి తీసుకొని వారి ఊరికి బయలుదేరి పోయారు.

అలా వారు పోయిన ఐదు నిమిషములకు తపస్విబాబాగారి మనుషులు వచ్చి, ముత్యాలమ్మ డాక్టరును కలిసి అనాధగ ప్రసవించిన స్త్రీ తమ బంధువని చెప్పి ఆమెనూ, ఆమె ప్రసవించిన శిశువునూ గురించి అడుగుతారు. అప్పుడు ఆమె జరిగిన విషయమంతా తెలిపి, ఆ శిశువు సమీప పట్టణమైన చెన్నపట్టణము అను ఊరిలో ఉన్నాడని చెప్పుతుంది. ఆ మాట విన్న తపస్విబాబాగారి మనుషులు నిరుత్సాహపడి వెంటనే చెన్నపట్నమునకు బయలుదేరి పోతారు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(పావురము వేగముగా సాగిపోయి తొందరగా రాజయోగానంద స్వామి ఆశ్రమములో వాలుతుంది. ఆ పావురము కొరకు వేచి చూస్తున్న రాఘవ మరియు మిగతావారు, పావురము కాలికి కట్టిన గుండ్రని గొట్టముగా నున్న తావెత్తును తీసి అందులో గుండ్రముగా చుట్టిపెట్టిన కాగితమును బయటికి తీసి చదివారు. అందులోని విషయమును రాజయోగానందస్వామి గారికి తెలిపారు. స్వామి ఆదేశానుసారము రాఘవ మరియు ఆటవికులు అందరు కలిసి మాలసముద్రమువైపు బయలుదేరి పోయారు. తపస్వి బాబాగారి మనుషులు ముత్యాలమ్మ డాక్టరు దగ్గరి నుండి పోతున్న సమయములో రాఘవ వారికి ఎదురౌతాడు. బాబాగారి మనుషులు, స్వామి మనుషులు ఒకరికొకరు ఎదురై చూచుకొన్ననూ, వీరు ఎవరైనది వారికి,

వారు ఎవరైనది వీరికి తెలియదు. కావున వారు బయటికి, స్వామి మనుషులు లోపలికి పోతారు. ముత్యాలమ్మ డాక్టరు వారు పోవుచున్నదీ, వీరు వస్తున్నది చూచినది. వచ్చిన స్వామి మనుషులు ప్రసవించిన అనాధకు తాము బంధువులమని ఆమెనూ, ఆమె ప్రసవించిన శిశువునూ గురించి అడుగుతారు.

ఆ మాట విన్న డాక్టరమ్మకు అనుమానము వచ్చినది. ముందు వచ్చినవారు బంధువులమన్నారు. తర్వాత వచ్చినవారు బంధువులమన్నారు. ఒకరికొకరు ఎదురైనప్పటికీ వారిని వీరుగానీ, వీరిని వారుగానీ పలుకరించు కోలేదు. నిజముగా బంధువులైతే ఎందుకు పలకరించుకోరు? అంతేకాక మొదట వచ్చినవారు అనాధస్త్రీకి బంధువులమన్నారు. కానీ శవముగా ఇంకనూ అచటనేనున్న ఆనాధ స్త్రీని చూడకుండ శిశువుకోసము ఆతృతగా ఎందుకు వెళ్ళారు? ఇట్లు ఆలోచించిన ముత్యాలమ్మ డాక్టరుగారికి, వచ్చిన వారు ఎవరూ అనాధకు బంధువులుకారని అర్థమైనది. అయినప్పటికీ తన అనుమానము బయటపడకుండా స్వామి మనుషులకు కూడా చెన్నపట్నము అడ్రస్ చెప్పి పంపుతుంది. రాఘవ కూడా హుటాహుటిన చెన్న పట్టణమునకు బయలుదేరి పోయాడు. ఇద్దరికి అడ్రస్ చెప్పి పంపిన డాక్టరమ్మ, వారు బయటికి పోతూనే జమీందారుకు ఫోన్ చేసి, బంధువులు కాని వారు బంధువులమని అబద్దము చెప్పి ఆ శిశువు కోసము వస్తున్నారు. వారికి ఆ శిశువును ఇవ్వవద్దని చెప్పింది. ఆ మాట విన్న జమీందారు కోపముతో నిండివున్న వాడై అక్కడికి ఎవరు వస్తారోనని చూస్తూవుండెను. చీకటి పడేలోపల బాబాగారి మనుషులు అక్కడికి చేరి శిశువును గురించి అడుగుతారు. అప్పుడు జమీందారు శిశువు దారిలోనే చనిపోయాడనీ, చనిపోయిన శిశువును దారి ప్రక్కనేవున్న నది ఒడ్డున పూడ్చి పెట్టామని

చెప్పాడు. ఆ మాట విన్న బాబా మనుషులు చేయునది లేక వెనుతిరిగి వచ్చిన దారినే పోయారు. కొంతసేపుకు రాఘవ తన మనుషులతో చెన్నపట్నముకు చేరి, జమీందారు ఇంటికిపోయి శిశువును గురించి అడిగాడు. అప్పుడు ఆ జమీందారు మొదటివారికి చెప్పినట్లే శిశువు చనిపోయాడని చెప్పాడు. ఆ శిశువు చనిపోవువాడు కాదనీ, గొప్ప శక్తివంతుడని రాఘవకు తెలుసు. అందువలన అతని మాటలను రాఘవ నమ్మలేదు.

శిశువు చనిపోయాడన్న మాట అసత్యమని, ఆ బాలున్ని ఎక్కడో దాచి తమకు అబద్ధము చెప్పుచున్నారని, తెలిసిన రాఘవ చేయునది లేక వెనుతిరిగి పోయాడు. విషయమును తెలుసుకొన్న రాజయోగానంద స్వామి సంతానము లేనివారి చేతిలోనున్న బిడ్డ క్షేమముగా ఉంటాడనీ, ప్రస్తుతము ఆ శిశువు జమీందారు రక్షణలో ఉండడమే మంచిదనీ, అట్లుండుట వలన తపస్విబాబాగారికి కూడా దొరకక క్షేమముగా పెరుగగలడనీ రాఘవకు చెప్పాడు. అంతేకాక ఈ దినము తెలియకపోయినా, ఇంకా కొద్ది రోజులకైనా ఒకవేళ తపస్విబాబాగారు తెలుసుకోగల్గితే, ఆ బాలుని కొరకు ప్రయత్నిస్తాడు. అపుడు అతని కార్యములను కనిపెట్టి విఘ్నము చేయుచుండవలెను. తపస్వి బాబా దగ్గర భక్తునిగావున్న మన మనిషి, బాలుని విషయములు బాబాగారికి తెలిస్తే, ఆ విషయమును మనకు చేరవేస్తూవుండును. అలా ఏదైనా తెలిస్తే అప్పుడు ఆలోచిస్తాము. ప్రస్తుతానికి ఆ బాలుడు బాబాగారి దగ్గరకు చేరకుండా పోవడము మనకు సంతోషకరమైన విషయమేనని స్వామి చెప్పగా, రాఘవ కూడా ప్రయత్నము చేయుచున్న బాబాగారికి దొరకకుండా దైవము

ఆ బాలున్ని జమీందారు దగ్గరకు చేర్చడము చాలా విచిత్రమైనదనీ, ఇంకా ఏమి జరుగుతుందో చూడాలనుకొన్నాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × × ×

(తపస్విబాబాగారి మనుషులు జమీందారు చెప్పిన మాటలు నమ్మిన వారై, అదే విషయమును మునెప్పకు చెప్పగా, మునెప్ప బాబాగారికి తెలియ చేస్తాడు. ఆ విషయము తెలిసిన బాబాగారు తన మనుషులు తెలివి తక్కువ తనానికి కోప్పడి మునెప్పతో "ఆ శిశువు అంత సులభముగా చనిపోవు వాడు కాదు. వారు మనవారిని మోసగించుటకు అలా చెప్పారు. ఆ శిశు వు క్షేమముగా వారిదగ్గరే ఉంటాడు. ఆ శిశువు కొరకు చేసిన మొదటి ప్రయత్నమే నెరవేరకుండా పోయినది. ఇక రెండవ ప్రయత్నమునైనా తెలివిగా చేయాలి" అని చెప్పాడు. బాబాగారి మాటలు విని మునెప్ప తన మనుషులను మందలించాడు. వారు అబద్దము చెప్పితే నమ్మి వచ్చేయడమేనా! అని కోపముగా చెప్పి, ఈ మారు మరియొక పద్ధతిని అనుసరించి ప్రయత్నిస్తాము, అపుడైనా జాగ్రత్తగా చేయాలి! అని చెప్పాడు. రెండు రోజుల తర్వాత మునెప్పకు తపస్వి బాబాగారి దగ్గరినుండి సమాచారము వయర్‌లెస్ ద్వారా తెలిసింది. అందులో మునెప్పకు బాబాగారు చెప్పిన విషయమును మునెప్ప తన మనుషులతో ఇలా చెప్పాడు.)

**మునెప్ప :-** ఈసారి మనము చేయవలసిన పద్ధతి చాలా సులభమైనది. మీలో ఒకరు బొమ్మలను అమ్మువారివలె నెలరోజుల తర్వాత చెన్నపట్నముకు పోయి నేనిచ్చిన బొమ్మలను ఆ జమీందారు ఇంటిలో అమ్మిరావలెను. అమ్మే అవకాశము లేకపోతే, వారు కొనకపోతే దానిని వారికి ఉచితముగానైనా ఇచ్చిరావలెను. చివరకు ఎటులనైనా ఆ బొమ్మను ఆ ఇంటిలోనికి చేర్చి రావలయును. పిల్లవాడు మనవద్దకు రాకుండినా, మన బొమ్మ అక్కడికి చేరవలెను. మన బొమ్మ అక్కడికి చేరుట వలన మన కార్యము సులభముగా నెరవేరును.

**నూకా :-** మన బొమ్మలు అక్కడికి చేరినంతమాత్రమున మన కార్యము సరిపోవునంటారా?

**మునెప్ప :-** అవి సాధారణ బొమ్మలు కాదు. మనము చెప్పిన పనిని చేసి పెట్టు కంప్యూటర్లలాంటి మన ఏజంట్లనుకో. అవి అక్కడవుంటే ఇక్కడినుండి మన పనులను వాటి ద్వారా చేయించవచ్చును. మనుషులు చేయలేని పనులను బొమ్మలు చేయుననుటలో ఆశ్చర్యము తప్పకకల్గును. వాటిమీద ఎవరికీ అనుమానము కూడా రాదు. ఎందుకనగా అవి మామూలు పిల్లలు ఆడుకొను బొమ్మలవలెనే ఉండును. ఆ బొమ్మలను తెలివిగా అక్కడకు చేర్చడమే మీ పని. తర్వాత మనిషికంటే తెలివైన పనిని అవి చేయగలవు.

(ఆ మాటలువిన్న అందరూ ఆశ్చర్య పోయి అవి ఎలాంటి బొమ్మలో చూడాలనుకొన్నారు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(ఒక అనాథ బాలున్ని తెచ్చుకొన్న తర్వాత ఆ బాలునికోసము రెండు గుంపుల మనుషులు వచ్చి పోవడము, రావుబహుదూర్ అను ఆ జమీందారునికి అర్థము కాలేదు. బంధువులమని చెప్పి తల్లి శవమును కూడా చూడకుండా, బిడ్డకోసము వచ్చి పోవడములో మర్మమేమిటో తెలియలేదు. అటువంటి పరిస్థితిలో ఆ జమీందారు యోచించి బాలున్ని కంటికి రెప్పలాగ పెంచుకోవాలని, ఆ బాలున్ని ఎవరూ అపహరించకుండా, తగిన బందోబస్తు కొరకు నలుగురు వస్తాదులను జీతమిచ్చి రావుబహుదూర్ జమీందారు నియమించాడు. భారీ శరీరముగల ఆ నల్గురు వస్తాదుల రక్షణలో ఎటువంటి భయములేకుండా ఆ బాలుడు పెరుగుచున్నాడు. రావుబహుదూర్ గారు తమ వంశ ఆచారము ప్రకారము ఆ బాలునికి

నామకరణము చేయాలనుకొన్నాడు. జ్యోతిష్యశాస్త్రము ప్రకారము ఆ శిశువుకు పేరును నిర్ణయించుటకూ, అట్లే ఆ శిశువు జాతకము వ్రాయించుటకు సుప్రసిద్ధ జ్యోతిష్యున్ని పిలువవలెననుకొన్నాడు. నామకరణము చేయుటకు, జాతకము వ్రాయటకు తనకు సమీపబంధువూ వరుసకు చిన్నాన్నా, జ్యోతిష్యములో గొప్ప పండితుడూ అయిన శివబహుదూర్ అను ముసలివానిని రప్పించి బాలుని నామకరణమునకు ముహూర్తము పెట్టించాడు. నామకరణ ముహూర్తము దాదాపు నెలన్నర దినములకు కుదిరినది. అంతలో తపస్వీబాబా చెప్పినట్లు మునెప్ప చెన్నపట్నములోనికి తన మనుషులను బొమ్మలను అమ్ముటకు పంపెను.

బొమ్మలు అమ్మువారు ఆ ఊరిలోనికి వచ్చి జమీందారు ఇంటిలో బొమ్మలు అమ్ముటకు తగిన సమయమునకై వేచివుండి బొమ్మలు అమ్ముచూ తిరుగుచుండెను. జమీందారు ఇంటిలో అమ్మవలసిన బొమ్మలను ప్రక్కన పెట్టుకొని దిన దినమూ ప్రయత్నము చేయుచుండగా, ఒక దినము రావు బహుదూర్ పిల్లవానిని తీసుకొని డాక్టరువద్దకు కారులో బయలుదేరి వచ్చాడు. అదే అదననుకొన్న బొమ్మలవాడు జమీందారును అనుసరించి వెళ్ళాడు. డాక్టరువద్ద పిల్లవాడు ఏడ్వడము మొదలుపెట్టాడు. ఏడుస్తున్న బాలున్ని డాక్టరు దగ్గరనుండి బయటికి తెస్తూనే కాచుకొనివున్న బొమ్మలవాడు బొమ్మలను చూపిస్తూ బొమ్మలను కొనమని రావుబహుదూర్‌ను అడిగెను. పిల్లవాడు ఏడ్చుచుండుట వలన బొమ్మలను చూపించి ఏడ్పు మాన్పించాలని జమీందారు బొమ్మలను పిల్లవానికి చూపగా వాటిని చూచి పిల్లవాడు ఏడ్పు మానివేశాడు. అప్పుడు జమీందారు, బొమ్మలవాడు ఇచ్చిన బొమ్మలను తీసుకొని వాటికి డబ్బు ఇచ్చి పంపాడు. జమీందారుకు బొమ్మలు అమ్మడమే

ఉద్దేశముగా వచ్చిన మునెప్ప మనిషి, తన పని సులభముగా నెరవేరినందుకు సంతోషించి ఆ విషయమును మునెప్పకు తెల్పుటకు బయలుదేరి పోయెను.

కొనిన బొమ్మలు సాధాణముగా పిల్లలు ఆడుకొను బొమ్మలులాగే ఉన్నాయి. అందులో చిన్న పిల్లలాడుకొను హెలీక్యాప్టర్ ఒకటి, కాళ్ళకు కీళ్ళు అమర్చిన కుక్క బొమ్మ, కోతి బొమ్మ. అట్లే కాళ్ళు చేతులు అల్లాడు నట్లుండు అడుగు పొడవున్న ప్లాస్టిక్ మనిషి బొమ్మ. ఆ బొమ్మ చేతిలో కత్తి లాంటిది కలదు, మరియు రబ్బరుతో చేసిన అడుగు పొడవున్న మొసలిబొమ్మ బాలుని కొరకు కొన్న వాటిలో ఉన్నవి. మొత్తము అన్నీ కలిపి ఐదు బొమ్మలే. అవి చూచుటకు సాధారణ బొమ్మలే అయినప్పటికీ, వాటియందు ప్రత్యేకత వున్నదని చూస్తూనే అర్థమగునట్లున్నవి. కానీ ఏమి ప్రత్యేకత ఉన్నది ఎవరికీ తెలియదు. అంతలోనే నామకరణ దినము వచ్చినది. ఆ రోజు పెద్ద పండుగను చేయదలచిన జమీందారు గొప్పగా ఏర్పాట్లన్నీ చేశాడు. అనేక మంది బంధుమిత్రులు బాలుని చూచిపోవాలని వచ్చారు. జ్యోతిష్యము తెలిసిన తన బంధువు కూడావచ్చి, ఆ దినము జాతకరీత్యా ఆ బాలునికి ఈశ్వర్ అను పేరును పెట్టాడు. ఆ దినము రాత్రికి జ్యోతిష్యము తెలిసిన రావుబహుదూర్ చిన్నాన్న తన గదిలో కూర్చొని, జమీందారు తెచ్చుకొన్న పిల్లవాని జాతకమును వ్రాయుటకు తెల్లని కాగితములో మొదట గ్రహ కుండలిని గీశాడు. తర్వాత పంచాంగములో బాలుడు పుట్టిన సమయమును చూడగా, ఆ సమయములో అష్టగ్రహ కూటమి జరిగినట్లు తెలిసింది. అటువంటి సమయములో పుట్టినవానికి ఏదో ఒక ప్రత్యేకత ఉండునని తలచిన ఆ జ్యోతిష్యుడు, ఆ సమయములోని ఒక్కొక్క గ్రహమును కుండలిలో వ్రాస్తు జాతకము వ్రాయను మొదలు పెట్టాడు. జాతకమును పూర్తిగా వ్రాస్తే ఆ బాలుని ప్రత్యేకత ఏమిటో తెలియునని అనుకొన్నాడు. అయితే

ఆ జ్యోతిష్యుని పెన్ను వ్రాయకుండా ఆగిపోయింది. కాగితము మీద వ్రాత పడలేదు. అదే పెన్నుతో ప్రక్కనున్న కాగితము మీద వ్రాస్తే అది సులభముగా వ్రాస్తున్నది. జ్యోతిష్యుడు జాతకము యొక్క పేపరు మీద తిరిగి వ్రాయుటకు చూస్తే అప్పుడు కూడా అది వ్రాయలేదు. ప్రక్కన వ్రాసే పెన్ను, జాతకమును వ్రాసే కాగితము మీద వ్రాయకపోవడము ఆ ముసలివానికి ఆశ్చర్యమైనది. ఇక్కడేదో కనిపించని శక్తి పని చేయుచున్నదని అనుకొని, తాను అక్కడ ఒంటరిగా ఉండడము మంచిది కాదనుకొని, వెంటనే అక్కడనుండి ప్రక్క గదిలోనికి పోవాలని లేచి పోబోయాడు. అంతలో పిల్లవాని కొరకు కొనిన బొమ్మలలోనున్న హెలీక్యాప్టర్ రుయ్‌మని లేచివచ్చింది. దాని రెక్కలు మూడు అంగుళాల పొడవుగా ఉన్నప్పటికీ, ఆ సమయములో దాని రెక్కలు మూడు మీటర్ల పొడవుగా కనిపిస్తున్నాయి. ఆ విచిత్రమును చూచి ఆ ముసలివాని నోటివెంట మాటరాలేదు. కాళ్ళు చేతులు ఆడక నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. అతివేగముగా రెక్కలు తిరుగుచుండగా హెలీక్యాప్టర్ తనవైపే వచ్చింది. చూస్తున్నట్లే దాని రెక్కలు ముసలి వాని మెడ భాగములో తగిలి తల ఎగిరిపడింది.

నమ్మశక్యముకాని, ఎవరూ ఊహించని పని అక్కడ జరిగిపోయింది. ముసలివాని తల, మొండెము వేరువేరుగా పడివున్నాయి. ఇదెట్లా జరిగిందని చెప్పువారు కూడా లేరు. అందువలన ముసలివాడు చనిపోయిన విషయము తెల్లవారేవరకు ఎవరికీ తెలియదు. ముసలివాని చావుకు కారణమైన బొమ్మ మునుపటివలె బొమ్మగా ఎక్కడున్నది తిరిగి అక్కడేవుంది. తెల్లవారిన తర్వాత ముసలివాడు చనిపోయివుండడము చూచి జమీందారు ఆశ్చర్యపడి పోయాడు. పిల్లవాని నామకరణము రోజే అలా జరుగడము ఆయనకు చాలా బాధ అయినది. తలవేరై ఉండడము వలన దానిని పోలీసులు

హత్యగా లెక్కించారు. ఆ హత్యను ఎవరు చేశారన్నది, అటువంటి అవసరము ఎవరికున్నది జమీందారు చెప్పలేక పోయాడు. చనిపోయిన వ్యక్తికి ఎవరి తోనూ శత్రుత్వములేదు. ఎవరైనా దొంగలు చేశారా అనుటకు ఆ ఇంటిలోనికి దొంగలు వచ్చిన ఆనవాళ్ళు ఏమీ లేవు. పైగా ఆ ఇంటిలో ఏ వస్తువూ దొంగలించబడలేదు. అన్ని రకముల యోచించిన పోలీసులకు అదియొక మిస్టరీలాగా నిలిచిపోయింది. వారి దర్యాప్తు ముందుకు సాగే దానికి అవకాశమే లేకుండా పోయింది.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(తమ మనిషి సులభముగా బొమ్మలను జమీందారు ఇంటిలో చేర్చి రావడము తపస్విబాబాకు సంతోషమైనది. ఆ బొమ్మల ద్వారా ఆ బాలుని రహస్యము ఎవరికీ తెలియనట్లు చేయవచ్చును. ఒకవేళ ఎవరైనా ఆ బాలుని రహస్యమును తెలియాలని ప్రయత్నిస్తే, వారిని హతమార్చుటకు కూడ ఆ బొమ్మలలో ఏర్పాట్లు అమర్చబడివున్నాయి. మంత్రశక్తిచే నిర్మిత మైన ఆ బొమ్మల ద్వారా ఆ రోజు రాత్రి జాతకము వ్రాయాలని చూచిన ముసలివాని విషయము తెలుసుకొన్న బాబాగారు, తాను తన మందిరము నుండియే మంత్రప్రయోగము చేసి హెలీక్యాప్టర్ బొమ్మతో ముసలివానిని చంపించాడు. ముసలివాడు చనిపోయాడను వార్తను విన్న బాబా సంతోషిస్తూ ఈ పద్ధతి ద్వారా ఏమైనా చేయగలను అనుకొన్నాడు. అడ్డు వచ్చిన వారిని ఎవరినైనా హతమార్చి ఆ బాలుని రహస్యము ఎవరికీ తెలియకుండా చేసి, ఆ బాలునికి యుక్తవయస్సు వచ్చిన తర్వాత తన కార్యమును నెరవేర్చుకోవాలనుకొన్నాడు. భువనేశ్వరి దేవాలయములోని వజ్రాల విషయములో అడ్డుకొని వాటిని దక్కకుండా చేసిన రాజయోగానంద స్వామి, ఈ విషయములో కూడా ఆటంకమై తన కార్యములను విఘ్నము చేయుటకు

సిద్ధముగా ఉన్నాడని తపస్విబాబాకు తెలియదు. ఒకే ఒక హత్యతో సర్వము సాధించినంత ఉప్పొంగి పోయాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(విచిత్రముగా చంపబడిన రావుబహుదూర్ గారి బంధువు మరణము రాఘవకు, రాజయోగానంద స్వామికి తెలిసినది. ఇది బాలుని విషయములో బాబాగారి పనియే అయివుంటుందని స్వామి అనుకున్నాడు. బాలుని కోసము ప్రయత్నించినపుడు, ఆ ప్రయత్నములో ఆ ముసలివాడు ఆటంకపడివుండివుంటే, తమ ఆచూకీ బయటపటకుండా ఉండుటకు చేసిన హత్యయే అది అయివుంటుదనుకొన్నాడు. వాస్తవముగా ఎట్లు చనిపోయి నదీ, అతని చావుకు ఒక బొమ్మ కారణమైనదీ రాజయోగానంద స్వామికి కూడా తెలియదు. అయితే ఏదో ఒక విధముగా తపస్విబాబా మీదనే రాజయోగానంద స్వామికి అనుమానము వచ్చినది. స్వామికి తప్ప ఎవరికీ బాబాగారి మీద అనుమానమే రాలేదు. వచ్చుటకు కూడా వీలులేదు. పోలీసు వారికి కూడా ఏ ఆధారము దొరకక, ఎవరినీ అనుమానించలేక పోతున్నారు. బాలుని విషయములో తాము కొంత కాలము వేచివుండ వలయునని అనుకోవడము పొరపాటైనదని రాజయోగానందస్వామి రాఘవతో అన్నాడు. అంతేకాక తమ అశ్రద్ధవలననే ఒక ప్రాణమును బాబాగారు బలితీసుకొన్నారనీ, ఇక మీదట అటువంటిది జరుగకుండా చూడవలెననీ, రాజయోగానంద స్వామి నిర్ణయించుకొని రాఘవతో ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** రాఘవా! ఇప్పటినుండి మనము బాబాగారి దురాగతమును అడ్డుకోవడానికి పూర్తి సమర్థత కల్గివుండాలి.

**రాఘవ :-** స్వామీ! మేము ఈ విషయములో మా ప్రాణము నిచ్చుటకైనా

సంసిద్ధముగా ఉన్నాము. ఇందులో ఏ అనుమానమూ వలదని మనవి చేసుకొంటున్నాను. మీరు ఏమి చెప్పినా అది చేయుటకు వెనుకాడము.

**రాజయోగానంద :-** నీవు సంసిద్ధముగా ఉన్నావని చెప్పినప్పటికీ, నేనే నీవు ఇలా చేయమని చెప్పలేకపోవుచున్నాను. కానీ అటువైపు జరిగే అన్యాయమును చూచి చెప్పకుండా ఉండలేక పోవుచున్నాను.

**రాఘవ :-** స్వామీ! మీ ఆజ్ఞయే మాకు శిరోధార్యమైనపుడు, మీ సేవయే నాకు భాగ్యమైనపుడు, మీ కార్యసాధనకై నా ప్రాణమునైనా ఇచ్చుటకు నేను సిద్ధముగా ఉన్నపుడు, మీరు నాతో చెప్పుటకు ఎందుకు సంశయపడు చున్నారు. నామీద ప్రేమతో నాకు మీరనుకొన్న బాధ్యతను అప్ప చెప్పలేక పోవుచున్నారు. ఏ కష్టమైనా ఎదుర్కొను శక్తి తమ వలననే నాకు లభించినది. కావున మీరు సంశయపడక నేను చేయవలసిన ఆ పని ఏమిటో చెప్పండి.

**రాజయోగానంద :-** నీ మీద నాకు ఆ నమ్మకమున్నది. నీవు చేయవలసిన పనికంటే ముందు నీవు తెలుసుకోవలసిన విషయము కొంత ఉన్నది. తపస్వి బాబాగారు ఒక పెద్ద స్వామీజీగా చలామణి అగుచూ, ఎందరి చేతనో ప్రశంసింపబడుచున్నప్పటికీ, ఆయనవద్ద అనేక ధనరాశులున్నప్పటికీ, బయటి ప్రపంచములో తనమాట వేదవాక్కుగా చలామణి అగుచున్నప్పటికీ, మాయకు వశుడై అది ప్రేరేపించిన ఆశ అను గుణములో పూర్తి మునిగినవాడై, వజ్రాలను అపహరించాలని ఇంతవరకు ప్రయత్నించడమూ, అది భంగమై పోవడము జరిగినది. ఆ ప్రయత్నము భంగమైనప్పటికీ కొంతైనా యోచించక, భూమండలమునకే అధిపతి కావాలన్న ఆశతో ఎన్నో అరాచక కార్యములను చేయుచూ, హింసామార్గమును అవలంభించి తన

అనుచరుల తోనూ మరియు తన ఆధీనమందున్న దుష్టశక్తులతోనూ ఇటువంటి నీచమైన పనులు చేయిస్తూ, తనకేమీ తెలియనట్లు ప్రపంచమునకు కనిపిస్తున్నాడు. తాను, తన అనుచరులతో చేయుపనులను బాహ్యముగా మనము ఎదుర్కొని భంగము చేయవచ్చును. కానీ అతని మంత్రశక్తులతో పనిచేయు క్షుద్రశక్తుల ఆగడాలను అహర్నిశలు మనము భంగము చేయలేము.

అతను ఏ బాలుని కోసము ప్రయత్నము చేయుచున్నాడో, ఆ బాలుడు కన్యారాశిలో బుధగ్రహము మొదటిపాదములో ఉండగా అష్టగ్రహ కూటమి రోజున పుట్టాడు. కావున క్షుద్రశక్తులు ఆ బాలున్ని సులభముగా ఆకర్షించగలవు. ఆ బాలునికున్న ప్రత్యేకతల వలన తపస్విబాబాగారు తన ఆధీనమందున్న సూక్ష్మరూప శక్తులతో ఆ బాలున్ని సులభముగా తన ఆధీనములోనికి తెచ్చుకోగలడు. ఆ బాలుడు బాబాగారి ఆధీనములోనికి పోయిన తర్వాత మనము బాబాగారిని ఎదుర్కోవడము చాలా కష్టమవుతుంది. ఎందరి ప్రాణములతోనైయినా ఆయన చెలగాటమాడగలడు. ప్రపంచము నంతటికీ తానే అధిపతిననిపించుకోవడానికి ఎన్ని ప్రాణములైనా అతనికి లెక్కలేదు. మనము అప్పుడు అతనిని నిర్బలున్ని చేయాలంటే కుదరక పోవచ్చును. కనుక అతను అంతదూరము పోకముందే అతనిని మనము అడ్డుకోవాలి. అందుకు నేనొక ఆలోచన చేసిపెట్టాను. ఆ యోచన ఒక్కటే మనకిపుడు మార్గము.

అది ఏమనగా! బాబాగారి ఆశకు ముఖ్యసూత్రమైన బాలుడు అష్టగ్రహ కూటమి రోజున పుట్టాడు కదా! ఆ దినము రాహువుతో మిగతా ఏడు గ్రహములు చేరిన దానివలన ఎనిమిది గ్రహముల కూటమి ఏర్పడినది. ఆ గ్రహముల కూటమికి ముఖ్యకారకుడు రాహువు. ఆ గ్రహకూటమి

గల శక్తి ఆ బాలునియందు నిక్షిప్తమై ఉన్నది. ఆ బాలునియందు నిక్షిప్తమైయున్న శక్తికి ముఖ్యకారకుడు రాహువు. ఇదంతయూ ఎందుకు చెప్పుచున్నాననగా! ముల్లును ముల్లుతోనే తీయాలన్నది సూత్రము. కావున వారు చేయుచున్న కార్యమును మనము భంగము చేయాలంటే, దానికి తగిన ఉపాయము అవసరము. అందువలన ముందు నవగ్రహములలోని రాహువు యొక్క కిరణములను మనమీద ఎక్కువగా పడునట్లు చేసుకోవాలి. అపుడు మనము చేయుపనులు మనకు సులభమగును. తపస్విబాబాగారు చేయుపనులు ఆయనకు కష్టమగును. ఖగోళములోని రాహుగ్రహము యొక్క కిరణము లను ఎక్కువగ మనమీద పడునట్లు చేసుకొనుటకు తగిన వ్యక్తి అవసరము. అందుకు సరిపోవు వ్యక్తివి నీవు ఒక్కనివే ఇక్కడున్నావు.

(స్వామి మాటలువిన్న రాఘవకు, తాను ఒక్కడినే ఆ పనికి అర్హుడ నను మాట సంతోషము కల్గించినది. వెంటనే ఇలా అన్నాడు.)

**రాఘవ :-** చెప్పండి స్వామి నేనేమి చేయాలి, రాహుగ్రహము యొక్క కిరణములను ఎలా ఆకర్షించుకోవాలి?

**రాజయోగానంద :-** నీవు రెండవ పెళ్ళి చేసుకోవాలి.

(స్వామిగారు అనిన మాట వింటూనే రాఘవకు కొంత ఆశ్చర్య మైనది. తన రెండవ పెళ్ళికి ఈ కార్యమునకు సంబంధమేమిటో అర్థము కాలేదు. స్వామివారు నిర్ణయించి చెప్పినమాటను ఏమాత్రము తీసివేయని తాను రెండవ పెళ్ళిలోని రహస్యమేమిటో తెలుసుకోవాలనుకొని స్వామితో ఇలా అన్నాడు.)

**రాఘవ :-** స్వామీ! తమమాటకు నా ప్రాణమైన ఇచ్చుటకు సంసిద్ధపడిన నేను, మీ ఆజ్ఞప్రకారము రెండవ పెళ్ళిని చేసుకోవడములో నాకు ఏమీ

ఇబ్బంది లేదు. కానీ నా రెండవపెళ్ళికి, మన కార్యమునకు సంబంధమేమిటి అను సంశయము ఏర్పడినది. కావున ఆ సంశయమును తీర్చవలెనని ప్రార్థిస్తున్నాను.

**రాజయోగానంద :-** తపస్విబాబాగారి దుష్టకార్యములను ఎదుర్కోవడానికి నీ మీద రాహుగ్రహ యొక్క కిరణములను ఎక్కువపడునట్లు చేసుకోవాలని అందుకు నీవు ఒక్కడివే అర్హుడవని తెల్పాను కదా! అందువలన నీవు పెళ్ళి చేసుకోవలసిన ఆవశ్యకత ఏర్పడినది. భూతద్దమును సూర్యకాంతిలో పెట్టినపుడు దాని క్రింద ఒక కేంద్రములో సూర్యకిరణములన్నీ ఒక్కచోట చేరును. అలా చేరుటవలన అక్కడ వేడి ఏర్పడి అగ్గిపుట్టి అక్కడున్న వస్తువు కాలిపోవుటకు అవకాశము గలదు. భూతద్దము యొక్క కారణమున సూర్య కిరణములన్నీ ఒకచోట చేరుటకు అవకాశము ఏర్పడినట్లు, నీ రెండవ పెళ్ళి వలన రాహు గ్రహముయొక్క కిరణములు నీమీద ఎక్కువ ప్రసరించ గలవు. ఇంకొక ఉదహరణను కూడా తెలిపెదను వినుము. మత్తు పానీయమునకు శుక్రగ్రహము అధిపతి. శుక్రగ్రహము శత్రువుగానున్నవారు మత్తు పానీయము త్రాగితే అది శరీరములో ఉన్నంతవరకు శుక్రగ్రహ కిరణములు వారిమీద ఎక్కువగా ప్రసరించి వారికి కీడుచేయును. అటువంటి వారికి త్రాగుడు వలననే ఎక్కువ ధననష్టము ఏర్పడును. అదే శుక్రుడు మిత్ర గ్రహమైతే త్రాగనివానికంటే త్రాగినవానిమీదనే ఎక్కువ శుక్రగ్రహ కిరణములు పడి వానికి ధనము చేకూరును. అందువలన త్రాగి చెడిపోయిన వారిని, బీదవారైన వారిని చూస్తున్నాము. అలాగే త్రాగినా ధనికులైనవారిని ప్రత్యక్షముగా చూస్తున్నాము.

ముఖ్యముగా చెప్పునదేమనగా! రెండవపెళ్ళికి రాహువు అధిపతి. దుందుభిని నీవు పెళ్ళి చేసుకొను సమయములో నేను నీకు రెండవ పెళ్ళి

యోగమున్నదని ముందే చెప్పాను. నీవు తులా లగ్నములో పుట్టిన వానివి. నీ జాతకములో ఏడవస్థానమున రాహుగ్రహము ఉన్నందువలన ప్రత్యేకత గల భార్యయే నీకు లభించినది. ఆమెతో విషసర్పములు స్నేహముగా ఉండుట నీకు తెలిసిన విషయమే. రాహువు విషమునకు, విషసర్పములకు అధిపతి అయిన దానివలన నీ భార్యకు కూడా విషసర్పములు స్నేహముగా ఉంటున్నాయి. రాహుగ్రహము ఏడవస్థానములో ఉండుట వలన నీ జీవితములో రెండవపెళ్ళి తప్పక జరుగవలసి ఉన్నది. నీవు రెండవ పెళ్ళి చేసుకోవడము ద్వారా నీకు రాహుగ్రహకిరణములు ఎక్కువకాగలవు. అష్టగ్రహ కూటమి రోజున కేతువు తప్ప రాహువుతో మిగత గ్రహములన్నీ కలిసి ఉండుట వలన, ఆ దినము ఏర్పడిన శక్తి అంతటికీ రాహువుయే అధిపతి. ఆ దినమున పుట్టిన బాలునికి కలిగెడు మహత్తర శక్తులన్నియూ రాహుగ్రహము యొక్క ఎరుకలేనిదే కలుగవు. అందువలన ఆ శక్తులను నిరోధించు కార్యమును చేపట్టిన మనము రాహువు యొక్క కిరణములను ఆకర్షించవలసి ఉన్నది. ఇంత బలవత్తర కారణముండుటవలన నిన్ను రెండవ పెళ్ళి చేసుకోమన్నాను.

**(**సావధానముగా విన్న రాఘవకు విషయమంతా అర్థమైనది. జ్యోతిష్య శాస్త్రవేత్తలు కూడా చెప్పలేని గ్రహముల విషయములను సులభముగా అర్థమగునట్లు చెప్పిన స్వామివైపు చూచి రాఘవ ఇలా అన్నాడు.**)**

**రాఘవ :-** స్వామీ. నా రెండవపెళ్ళికి వధువు ఎవరో మీరే నిశ్చయించి, మీ ఇష్టప్రకారమే చేయవలెనని కోరుచున్నాను.

**(**రాఘవ తన రెండవ పెళ్ళి విషయము స్వామిగారికే అప్పచెప్పి

తనభక్తిని మరొకమారు నిరూపించుకొన్నాడు. రాఘవ, స్వామి చెప్పినట్లు నడుచుకొందునని చెప్పినందుకు రాజయోగానంద స్వామి సంతోషించి మరొక విషయము తెల్పుచూ ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** నీవు రెండవ పెళ్ళి చేసుకోవలసిన వధువు జాతకము కూడా కొంత ప్రత్యేకత కల్గివుండాలి. ఆమె జాతకములో ఐదవస్థానము శుభస్థానమై, ఆ స్థానము శని పక్షముదై ఉండాలి. ఆ ఐదవస్థానము బుధగ్రహముయొక్క స్వస్థానములైన మిథున, కన్యలగ్నములై ఉండాలి. అలా ఉండుట వలన మంచి సంతానవతియైవుండి, ఆ సంతానము మంత్ర తంత్ర శక్తులకు అతీతమైన వ్యక్తిచే కల్గునను జ్యోతిష్య సూత్రము కలదు. నీ ఆయుస్సుకు ఎటువంటి ముప్పు రాకూడదంటే సౌభాగ్యము, సంతాన భాగ్యము ఉన్న స్త్రీ భార్యయగుట ముఖ్యము. ఆమె సంతానమునకు భర్త కారకుడగుట చేత భర్త ఆయుస్సుకు ఢోకా ఉండదు. భార్య ఐదవ స్థానము బుధస్థానమగుటవలన, ఆమెకు కల్గు సంతానమునకు కారకుడైన భర్త మంత్రతంత్ర శక్తులను సులభముగా జయించువాడగును.

అందువలన ఆ జాతకముగల అమ్మాయి మనకవసరము. ఆ జాతకముగల అమ్మాయిని మనము వెతకవలసివుండగా, మనకు అటువంటి పనిలేకుండా, ఆమె ఇచ్చటనే ఉండుట మన అదృష్టము. జాతకరీత్యా అన్ని విధముల మనకు అనుకూలమైన అమ్మాయి మనవద్దనున్న రాధేశ్వరియే. కనుక నీవు ఆమెనే చేసుకోవలసి ఉంటుందని తెలుపుచున్నాను.

**రాఘవ :-** ఈ విషయము నేను చెప్పుటకంటే మీరే దుందుభితో చెప్పడము మంచిదనుకుంటాను. సహజముగా స్త్రీలకు ఈ విషయములో అసూయ

భావముంటుంది. కానీ దుందుభి అలాకాదనుకుంటాను. అయినప్పటికీ మీరే చెప్పడము మంచిది.

**రాజయోగానంద :-** అలాగే రాఘవ, ఈ విషయమును నేనే దుందుభితో చెప్పుదును. దుందుభి అందరిలాంటి మనిషికాదు. జరుగబోవు కాలములో ఆమె పాత్ర చాలా ఉన్నది. ఆమె నీతో సమానముగా జ్ఞానమును తెలుసు కొన్నది. ఆమెకు ఈ విషయమును చెప్పడములో కష్టములేదు. ఆమె ఈ విషయములో పూర్తి సహకరించగలదు. కానీ రాధేశ్వరికి నచ్చ చెప్పడములో మనకు కొంత కష్టముండును. ఎందుకనగా! ఆమె తన జీవితములో పెళ్ళియే చేసుకోకూడదని నిశ్చయించుకొన్నది. కావున ఈ విషయము సమూలాగ్రముగా అంతయూ వివరించి చెప్పవలసి ఉంటుంది. ఈ విషయము పూర్తి తెలిస్తే ఆమె మనకు సహకరించగలదు. ఈ విషయమును రేపు ఆమెకు వివరించి చెప్పుదును. అంతేకాక ఈ విషయములో దుందుభి అభిప్రాయమును కూడా తెలుసుకొంటాను.

× × × × × × × × × × × × × × × × × × × × × × ×

(రావుబహుదూర్ తన చిన్నాన్న గారు చనిపోవడము ఏదో అశుభముగా తలచాడు. పైగా ఆయన మరణము ఎలా జరిగిందో ఎవరికీ అర్థము కాలేదు. ఈ విషయమును తెలుసుకొనుటకు తనకు తెలిసిన జ్యోతిష్యునివద్దకు రావుబహుదూర్ పోవాలనుకొన్నాడు. అక్కడికి వంద కిలోమీటర్ల దూరములోనున్న జ్యోతిష్యునివద్దకు పోవాలనుకొన్న జమీందారు తన స్నేహితునితో సహా కలిసి బయలుదేరి పోయాడు. వారు దారిలో దాదాపు 80 కిలోమీటర్ల దూరము ప్రయాణించిన తర్వాత వారు ప్రయాణించు కారు యొక్క ముందర టైరు పగిలిపోయి, కారు ప్రక్కకు పోయి చెట్టుకు గ్రుద్దుకుంది. అలా కారు ప్రమాదమునకు గురియగుట

వలన కారులోనున్న జమీందారు స్నేహితుడు పూర్తి గాయాలపాలై చనిపోవడము జరిగింది. తన చిన్నాన్న చావును గురించి తెలుసుకోవడానికి ప్రయత్నించిన జమీందారుకు, తన స్నేహితుని మరణముతో ఏమీ అర్థము కాకుండా పోయినది. ఆ బాలున్ని ఇంటికి తెచ్చుకొన్న తర్వాత తనకు అన్నీ అశుభములే జరుగుచున్నవని మనస్సులో అనుకొన్నాడు. ప్రస్తుతము అప్పటికి వెనక్కి పోయి, జ్యోతిష్యుడైన తన పినతండ్రి చనిపోవడానికి, ఇప్పుడు తన స్నేహితుడు చనిపోయినదానికి ఏదైనా తనకు తెలియని కారణమున్న దేమోనని యోచించి, దాని విషయమును తెలుసుకొనుటకు ఒక దినము జ్యోతిష్యున్ని తనవద్దకే పిలుచుకొని ఎవరులేని సమయములో తన మనస్సులోని విషయమును జ్యోతిష్యునికి తెలియజేసెను. అప్పుడు ఆ జ్యోతిష్యుడు తనకు తెలిసిన గణితమును చూచుకొని, తన గణితము ప్రకారము చనిపోయిన ఇద్దరి మరణములు అసాధారణముగ జరిగినవేననీ, వారి మరణము వెనుక ఎవరికీ తెలియని రహస్యమున్నదనీ, ఆ రహస్యమును తాను కూడా చెప్పలేననెను. ఆ మాటలు విన్న జమీందారు "అసలైన కారణమును తెలుసుకొనుటకు వేరే దారేలేదా" అని అడుగగా ఆ జ్యోతిష్యుడు బాగా యోచించి ఇలా అన్నాడు.)

**జ్యోతిష్యుడు :-** మా గణితముకు కూడా తెలియని రహస్యమును తెలుసుకొను ఏకైక వ్యక్తి ఒకరున్నారు. ఆయనయే రాజయోగానంద స్వామి; కానీ ఆయన ఎవరికీ భవిష్యత్తును గురించి చెప్పడు.

**జమీందారు :-** నాకు కావలసింది భవిష్యత్తు కాదు. ప్రస్తుతమున్న ఆపద ఏమిటో తెలుసుకొని, దానినుండి బయటపడు ఉపాయము.

**జ్యోతిష్యుడు :-** అలాగైతే నేనే ఆయనవద్దకు పోయి అడిగి తెలుసుకొంటాను. నీవు పోతే ఆయన ఏమీ చెప్పడు.

**జమీందారు :-** ఎలాగైతేనేమి. నాకు కావలసింది విషయమును తెలుసు కోవడమే. అదేదో మీరేపోయి అడిగిరాండి. దానికి కావలసిన ఖర్చును నేను మీకు ఇచ్చుకొంటాను.

**జ్యోతిష్యుడు :-** ఆ స్వామివారు ప్రపంచ విషయములను తనవద్దకు రానివ్వడు. అందువలన నేను రెండు రోజుల తర్వాత పోయి తీరికగా అక్కడేవుండి, సమయము, సందర్భము వచ్చినపుడు అడిగి తెలుసుకొంటాను.

(అని చెప్పి జమీందారుని సమాధానపరచి అక్కడినుండి వెళ్ళి పోయాడు. ఆ జ్యోతిష్యుని మాటలు విన్న తర్వాత రావుబహుదూర్ తనకు తెలియనిదేదో ఉన్నదనుకొని, చివరకు రాజయోగానంద స్వామి ఏమి చెప్పునో చూడాలనుకొన్నాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(మునెప్పవద్దకు తనను తీసుకపొమ్మని నాగోతుల నాగభూషణము, మంత్రాల మల్లయ్య తాత వెంకూను అడిగారు. వెంకు వారి మాటలను ఒప్పుకోలేదు. ఏమైనావుంటే తనతోనే చెప్పమనగా, ఇద్దరు మాంత్రికులు మునెప్పతోనే చెప్పుతామని చెప్పారు. అపుడు చేయునది లేక వెంకూ ఇద్దరి మాంత్రికులను అడవిలోనున్న మునెప్ప దగ్గరికి తీసుకపోగా మొదట నాగభూషణము మునెప్పతో ఇట్లన్నాడు.)

**నాగభూషణము :-** అయ్యా! మాకు మా దేవత కలలోనికి వచ్చి మీరు వెంటనే వారివద్దనుండి బయటపడి మీ ఇంటికి పొమ్మని చెప్పింది.

**మునెప్ప :-** అలా ఎందుకు చెప్పింది. మీకు మేము ఏమి తక్కువ చేశాము. మీరు అడగకున్నా ఎక్కువ డబ్బు ఇచ్చాము కదా!

**నాగభూషణము :-** డబ్బు విషయములో మాకు ఎలాంటి ఇబ్బందిలేదు.

ఈ పనిని మీరు చేయలేరని మా ఇష్టదేవత చెప్పింది. వజ్రాల విషయములో అపాయములేదు. కానీ అబ్బాయి విషయములో పెద్ద అపాయమున్నదనీ, ఆ అపాయమును జయించుకోవాలంటే ఇప్పుడు మాకున్న శక్తి చాలదనీ చెప్పింది.

**మునెప్ప :-** మీరు ఇంకా ఏమైనా చేసి ఇంకా కొంత శక్తిని సంపాదించు కోవచ్చును కదా!

**నాగభూషణము :-** అలా శక్తిని పొందుటకు దాదాపు ఒక సంవత్సరము మేము మంత్రసాధనలు చేయవలసి వస్తుంది. ఆ మంత్ర సాధన చేయుటకు కొన్ని లక్షల డబ్బు ఖర్చవుతుంది. ఎక్కువగా ప్రతి దినమూ జంతుబలులూ, పక్షిబలులూ ఇవ్వవలసివుంటుంది.

**మునెప్ప :-** మీకు ఎంత డబ్బయినా ఖర్చు పెడతాము. మీరు ఆ మంత్ర సాధన చేయుటకు పూనుకోండి.

**మల్లయ్యతాత :-** మేము కూడా మీరు చెప్పినట్లే చేయాలని నిర్ణయించు కొన్నాము. కానీ మేము సంపాదించుకొను శక్తి ఒక్క జ్ఞానశక్తిని తప్ప దేనినైనా ఎదుర్కొంటుంది. ఒకే ఒక దైవశక్తి (జ్ఞానశక్తి) వద్ద మా శక్తి పని చేయదు. అందువలన మేము దైవశక్తివున్న వారిని ఎప్పుడూ ఎదిరించలేము. ఒకవేళ అలా మేము జ్ఞానశక్తికి పోటిపడితే మాలోని శక్తి అంతయూ లేకుండా పోవును. మేము ఎటువంటి మంత్రశక్తినైనా ఎదురించగలము. జ్ఞానశక్తి వద్ద మా శక్తి పని చేయక పోవడమేకాక ఉన్నది కూడా పోవును. అందువలన ఆ విషయమును ముందే మీకు చెప్పుచున్నాము.

**మునెప్ప :–** సరే మీరు కొంత డబ్బును తీసుకొని పోయి, మీ సాధన మీరు చేయండి.

(రెండు లక్షల రుపాయలను ఆ ఇద్దరి మాంత్రికులకు ఇచ్చి పంపిన తర్వాత తపస్వీబాబాగారితో మునెప్ప రహస్యముగా మాట్లాడెను. మాంత్రికులు చెప్పిన విషయమునంతటిని బాబాగారికి చెప్పెను. దానికి బాబాగారు మాంత్రికులను ఇద్దరిని తమ వద్దనే పెట్టుకొమ్మని వారితో కొన్ని పనులు చేయించుకోవలసి వస్తుందని చెప్పాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × ×

(రెండవ రోజు రాజయోగానంద స్వామి రాధేశ్వరిని, దుందుభిని పిలిచి తనగదిలో ప్రత్యేకముగా వారితో మాట్లాడజొచ్చెను.)

**రాజయోగానంద :–** రాధేశ్వరీ! నీతో ముఖ్యమైన విషయమును మాట్లాడవలసి ఉన్నది. ఇది నీ జీవితానికి సంబంధించిన సమస్య, అందువలన నీతో తప్పక చెప్పవలసివచ్చినది. దానికంటే ముందు మీరు ఇద్దరూ కలిసి తెలుసుకోవలసిన సమాచారము కొంతవుంది అది ఏమనగా! మనము మన స్వార్థముకొరకు బ్రతకడములేదు. బయటి సమాజ శ్రేయస్సు కొరకు బ్రతుకుచున్నాము. అందులో కొందరు దుర్మార్గులను అణచివేచి, సన్మార్గమైన దైవజ్ఞానమును తెలపడము మన పనిగా ఎంచుకొన్నాము. జరుగబోవు కాలములో కొంతమంది దుర్మార్గులను లేకుండా చేయుటకు, ఇప్పటినుండే జాగ్రత్త పడవలసివస్తున్నది. రాబోవు కాలములో కొన్ని దుష్టశక్తులను వశ పరుచుకొని, వాటి ద్వారా ప్రపంచమును అల్లకల్లోలము చేసి, తమకంటే మించినవారు లేరనుకొని, దేవుడెవరు? అని ప్రశ్నించు పరిస్థితి వస్తున్నది. అటువంటి పరిస్థితి రాకూడదనీ, మనిషి అన్ని బలములను పుంజుకొని దేవున్ని ప్రశార్థకము చేయకూడదనీ మనము అనుకొంటున్నాము.

ముఖ్యముగా చెప్పునదేమంటే, రాబోయే విపత్తు కాలములో రాఘవతో కొన్ని పనులు చేయించి, ఆ దుర్మార్గమైన విపత్తునుండి ప్రజలను కాపాడవలెనని అనుకొన్నాను. దానికి రాఘవ బలము తక్కువ వస్తుంది. రాఘవతో పాటు మరికొందరు కూడా ఆ సమయానికి అసవరము. అటువంటి వారు ఇప్పుడు ఎవరూలేరు. జాతక చక్రములో ఐదో స్థానమైన సంతాన స్థానము బలముగానున్న స్త్రీ గర్భమునుండి జన్మించువారు కొంత శక్తివంతులుగావుండి, రాఘవకు తోడుగా ఉండగలరు. మొదట రాఘవ పెళ్ళి సమయములో కూడా రాఘవకు రెండవ పెళ్ళి యోగమున్నదని చెప్పాను. ఆ విషయమును తెలిసి దుందుభి కూడా రాఘవను పెళ్ళి చేసుకొన్నది. ఇపుడు రాఘవకు రెండవ పెళ్ళి జరుగు కాలము దగ్గరవు చున్నది. రెండవ పెళ్ళిని, సంతానస్థానమైన ఐదవస్థానము అనుకూలమైవున్న కన్యతో చేయాలనుకొంటున్నాను. ఇప్పుడు అందరము ఆ కన్య కొరకు వెదకవలసివున్నది.

**దుందుభి :-** మీరు సర్వము తెలిసినవారు, మీరు ఏమి చేయాలనుకొంటే అదే చేయవచ్చును. ప్రపంచ మేలునుకోరి చేయు మీ పనికి ఎవరూ ఆటంకము చెప్పరు. మీరు మాతో చెప్పి చేయించుకోవలెనని, మా సలహా ఏమి అవసరములేదని తెల్పుచున్నాను.

**రాధేశ్వరి :-** దుందుభి చెప్పినది వాస్తవము. మీరు మాకు ఏది చెప్పవలసి నది లేకుండా, మీ పనిలో భాగముగా మమ్ములను వినియోగించుకోండి. మేము చేయవలసిన కార్యమేదో చెప్పండి. మేము ఆ పనిలో నిమగ్నమై చేస్తాము.

**రాజయోగానంద :-** మీరు ఆ మాట చెప్పినందుకు మాకు సంతోషము. నేను చెప్పబోయేపని మీతోనే ముడిపడివున్నది. రాఘవకు మంచి సంతానమునిచ్చు భార్యను చేయడము వలన రాఘవకు మంచి సంతానము

లభించును. కానీ రాఘవకు మొదటి భార్యగానున్న దుందుభికి సంతాన యోగములేనిదానివలన ఆమెకు సంతానము కలుగదు. రెండవ భార్యకు పుట్టిన సంతానమును తన సంతానముగానే పెంచవలెను.

**దుందుభి :-** ఇందులో బాధపడవలసినది ఏమీలేదు. నాకు సంతానము కలుగదని ముందే తెలుసు, అంతేకాక ఆయనకు రెండవ వివాహమున్నదని కూడా మీరే చెప్పారు. ఇదేమి క్రొత్త విషయము కాదు. నాకు కొంత దైవజ్ఞానము మీ ద్వారా తెలిసింది. కావున ఈ విషయము ద్వారా నాకు ఎటువంటి బాధాలేదు.

**రాధేశ్వరి :-** మీరు చెప్పిన జాతకముగల అమ్మాయి ఎక్కడుందో చెప్పండి. అది మా ముఖ్యమైన పనిగా తలచి పోయి వారితో మాట్లాడివస్తాము.

**రాజయోగానంద :-** మీరు ఎక్కడికి పోయి మాట్లాడవలసిన పని లేదు. అన్ని విధముల జాతకము సరిపోయిన అమ్మాయి ఇక్కడే ఉందని మీతో చెప్పుచున్నాను. ఆ అమ్మాయి ఎవరో కాదు. మన రాధేశ్వరియే. కానీ ఆమె వివాహము చేసుకోనని చెప్పడము వలన ఈ విషయమును చెప్పుటకు కొంత ముందు, వెనుక చెప్పవలసివచ్చినది.

**రాధేశ్వరి :-** స్వామీ! నా విషయములో మీరు ముందువెనుక చూడవలసిన పనిలేదు. నేను వివాహము చేసుకోనని నా ఉద్దేశ్యమును చెప్పిన మాట నిజమే. మీరు సమాజ శ్రేయస్సుకొరకు మా జీవితాన్ని అర్పించమనినా దానికి మేము సిద్ధముగా ఉన్నాము. మీ మాట ముందర మా ఉద్దేశము విలువైనది కాదు. అందువలన మీరు చెప్పినట్లు చేయుటకు నాకు ఏ అభ్యంతరమూలేదు. నేను ఇక్కడికి రావడముతోనే నా జీవితమునకు మంచి దశ వచ్చిందనుకొన్నాను. మీవద్ద జ్ఞానము తెలుసుకొన్న తర్వాత నా జీవితమును దైవసేవకే వినియోగించాలనీ, అదీ మీరు ఎట్లు చెప్పితే అట్లు చేయాలని అనుకున్నాను.

**రాజయోగానంద :-** నీవు నామీద విశ్వాసముతో ఆ విధముగా నిర్ణయము తీసుకోవడము మంచిదే. మేము అన్ని విషయములను కూలంకషముగా ఆలోచించి ఈ నిర్ణయానికి వచ్చాను. పైగా అన్ని విధముల నీ జాతకము సరిపోయింది. రాఘవ కూడా మీరు చెప్పినట్లే మీ నిర్ణయము ఎట్లుంటే అట్లు చేయమని చెప్పాడు. దుందుభి కూడా దీనికి సహకరించేందుకు ఒప్పుకోవడము సంతోషము. ఇక ఈ విషయమును ఆలస్యము లేకుండా మల్లుదొరకు తెలియజేస్తాను.

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(జమీందారు రావుబహుదూర్ గారితో మాట్లాడిన జ్యోతిష్యుడు రెండు రోజుల తర్వాత రాజయోగానంద స్వామి ప్రబోధాశ్రమానికి వచ్చాడు. జమీందారు తనవద్దకు వచ్చిన విషయమూ, జమీందారులోని అనుమానమూ, తాను చెప్పిన విషయము అన్నీ చెప్పాడు. చివరకు ఆ బాలునిలోని విశేషమేముందో, ఆ చావులకు కారణమేముందో తమరే చెప్పాలని అడిగాడు. అప్పుడు రాజయోగానంద స్వామి అన్నీ విన్న తరువాత ఆ జ్యోతిష్యునితో ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** జమీందారు రావుబహదూర్ వద్దనున్న అబ్బాయి ప్రత్యేకమైన జాతకము కలవాడు. అతడు అష్టగ్రహ కూటమి రోజున పుట్టిన మొదటి బిడ్డ. ఆ బిడ్డ చిన్న వయస్సులో సర్వసాధారణముగా ఉండినప్పటికీ వయస్సు పెరుగుకొలది అతనిలో ఎన్నో మార్పులు వస్తాయి. ఆ బాలుడు పెరిగి 16 సంవత్సరముల వయస్సు వచ్చిన తర్వాత రాబోవు ఆరు అమావాస్యలు చాలా ముఖ్యమైనవి. ఎందుకనగా! ప్రతి అమావాస్య దినము ఒక ప్రత్యేకమైన శక్తి అతనిలో చేరిపోవును. ఆ విధముగా ఆరు అమావాస్యల దినములలో ఆరు శక్తులు చేరిపోవడము జరుగును. మొదటి మూడు అమావాస్యలలో మొదటి అమావాస్య దినమున ఈశ్వర్ శరీరము

లోనికి చేరు శక్తి మాత్రము లోక వినాశనమునకు కాకుండా లోకోద్ధరణ కొరకు పనికి వచ్చును. మిగతా రెండు అమావాస్య దినములలో వచ్చు రెండు శక్తులూ లోక వినాశనము కొరకు పనిచేయును. మొదటి అమావాస్య రోజున వచ్చు శక్తి లోకోద్ధరణకు ఉపయోగపడునది కాగా, తర్వాత వచ్చు రెండవ మరియు మూడవ అమావాస్యలలో వచ్చు శక్తులు మాత్రము భూమిమీద వినాశనము చేయునవై ఉన్నవి. రెండు, మూడు అమావాస్యలలో వచ్చు శక్తికంటే తర్వాత వచ్చు నాలుగు, ఐదు, ఆరు అమావాస్యల దినములలో ఈశ్వర్‌లోనికి వచ్చు శక్తులు ఇంకా భయంకరమైనవి. చివరి మూడు అమావాస్యల శక్తులు భూమిమీద ప్రళయమునే సృష్ఠించి సర్వమును నాశనము చేయగలవు. ఈ విధముగా మొదటి అమావాస్య తర్వాత వచ్చు ఐదు అమావాస్యలు వినాశనము చేయునవి కాగా, వాటిలో చివరి మూడు అతి భయంకరమైనవని చెప్పవచ్చును.

ఈ విధముగా రావుబహదూర్ కుమారుడైన ఈశ్వర్ జాతకము ప్రకారము జరుగవలసివున్నది. అట్లు జరగకుండా ఎవరూ ఆపలేరు. ఆరు అమావాస్యలలో ప్రమాదభరితమైన ఐదు అమావాస్యల శక్తులను ఈశ్వర్ తన జీవితములో ఎప్పటికీ బయటికి ఉపయోగించడు. అయితే ఇతరులు ఆ శక్తులను తమ వశము చేసుకొను అవకాశముకలదు. ఎవరైతే ఆ శక్తులను వశము చేసుకొందరో, వారు ఆ శక్తులను ఉపయోగించి భూమిమీద ప్రళయమునే సృష్ఠించగలరు. ఆ శక్తులు ఇతరుల వశమైతే 16వ సంవత్సరము వచ్చు మిగతా ఆరు నెలలు మాత్రము ఈశ్వర్ ఉండగలడు. తర్వాత అతనికి ప్రాణహాని ఉన్నట్లు తెలియుచున్నది. దీనినిబట్టి ఈశ్వర్ తన 16వ సంవత్సరము చివరిలో గానీ లేక ఏడవ నెలనుండి చివరి పన్నెండు నెలల లోపల ఎప్పుడైనా చనిపోగలడని చెప్పవచ్చును. ఒకవేళ అతనిలో చేరు ఆరు అమావాస్యల శక్తులను ఎవరూ

వశపరుచుకోకపోతే ఈశ్వర్ సంపూర్ణ ఆయుస్సుతో బ్రతకగలడని కూడా చెప్పవచ్చును. కానీ ఆ శక్తులను తన వశము చేసుకొనుటకు ఒక వ్యక్తి కాచుకొని ఉండుటవలన, అతను ఆ శక్తులను వశము చేసుకొనుటకే ప్రయత్నించును. ఆరు నెలల శక్తులను వశపరుచుకోకపోయినా, కేవలము ఒక నెల శక్తిని వశపరుచుకొనినా ఈశ్వర్‌కు మాత్రము మరణము తప్పదు.

ఈశ్వర్‌లో చేరు శక్తిని వశపరుచుకోవాలని కాచుకొనివున్నవారు వాటిని ఎలా అయినా వశపరుచుకోగలిగితే అప్పుడు అతను ఏ దేశమునైనా పూర్తిగా నాశనము చేయగలడు. అతను చాలా దేశములను నాశనముచేసి, మిగిలిన దేశములన్నిటికీ అధిపతి కాగలడు. దుష్టబుద్ధితో ఆధిపత్యమును చెలాయించువాడు చివరకు నేనే దేవున్నని ప్రకటించుకొని అసలైన సృష్ఠికర్తకే ప్రశ్నార్థకమగును. ఈ విషయములు తెలిసినవారు ఆ బాలుని విషయము ఎవరికీ తెలియకుండునట్లు జాగ్రత్తపడుచుందురు. మొదట ఆ బాలుని జాతకమును వ్రాయాలనుకొన్న వృద్ధున్ని ఆ బాలుని విషయము తెలియ కూడదనుకొన్నవారే చనిపోవునట్లు చేశారు. అది ఎవరికీ అర్థముకాలేదు. ఎవరికీ తెలియకుండా ఆ బాలున్ని కాచుకొని కొన్ని శక్తులున్నవి. ఆ శక్తులు ఆ బాలుని మీద ఎప్పటికీ నిఘా ఉండుట వలన ఆ బాలుని గురించి ఎవరైనా తెలుసుకోవాలంటే వారిని ఆ పని నుండి విరమించు కొనునట్లు ఆటంకములు కలుగజేయును. అప్పటికీ మొండిగా ప్రవర్తిస్తే చివరకు వారిని ఆ శక్తులు చంపివేయును. ఇప్పటికి ఆ బాలుని విషయము తెలుసుకోవాలనుకొన్న వారిలో ఇద్దరిని ఆ శక్తులు చంపివేశాయి. తర్వాత కూడా ఎవరు ప్రయత్నము చేసినా వారిని కూడా వదలవు. ఇపుడు ఈ విషయము నావలన నీకు తెలిసింది. నీకు తెలిసిన ఈ విషయమును

నీవు జమీందారుకు తెలుపాలనుకొంటే అతనికి తెలుపకముందే ఆ శక్తులు నిన్ను కూడా చంపగలవు. నా వలన నీకు తెలిసింది కావున ఇంతటితో నీకు ఏ ముప్పు ఉండదు. ఒకవేళ ఈ రహస్యమును బయటికి చెప్పాలను కొంటే మాత్రము నీకు ప్రమాదము తప్పదు. అందువలన నీవు జమీందారు వద్దకు పోకుండా నేరుగా ఇంటికి పోయి, ఏమీ తెలియనట్లు ఉండిపో.

**జ్యోతిష్యుడు :-** ఈ విషయమును బయటికి చెప్పితే నా ప్రాణాలకే ముప్పు ఉన్నప్పుడు, నేనెందుకు చెప్పాలి. నాకేమీ తెలియనట్లు ఉండిపోతాను.

(రాజయోగానందస్వామి చెప్పిన మాటలు విని ఆ జ్యోతిష్యుడు భయపడి ఇంటికి పోయాడు. స్వామి చెప్పుచున్నపుడు ఆ సమాచారమును అంతావిన్న రాఘవ, దుందుభి, రాధేశ్వరి ముగ్గురూ ఆశ్చర్యపోయారు. అప్పుడు రాఘవ ఈ విధముగా అడిగాడు.)

**రాఘవ :-** ఇంతపెద్ద రహస్యమును తెలుసుకోవడమేకాక, ఆ బాలునికి కొన్ని శక్తులను కాపలాగా పెట్టిన వ్యక్తి సామాన్యుడై ఉండడు. ఎవరో గొప్ప శక్తిగల వ్యక్తే అయివుంటాడు.

**దుందుభి :-** బాలుని విషయము తెలుసుకోవాలని ప్రయత్నిస్తేనే చంపివేయు అతను ఎవరో ప్రమాదభరితమైన వ్యక్తి అయివుంటాడు.

**రాధేశ్వరి :-** బాలుని మీద ఆశపెట్టుకొన్న అతని శక్తిని అణచివేసేందుకు చేసే ప్రయత్నములోని భాగమే నాపెళ్ళి అని తెలియుచున్నది. లోకములను హింసించు వారిని అణచివేయుటకు మీరు చేయు ప్రయత్నములో మేము భాగస్తులమై ఉపయోగపడుచున్నందుకు మేము అదృష్టవంతులమని అను కొంటున్నాను.

**రాజయోగానంద :-** మనవద్ద కొంత జ్ఞానశక్తి ఉన్నది, కాబట్టి అతని

మంత్ర శక్తులు మనమీద పని చేయలేవు. ఇంకొక విషయమేమంటే ఆ బాలుని విషయము మనకు తెలుసునని అతనికి తెలియదు. అతడు ఇంకా కొంత శక్తిసంపన్నుడు కాబోతున్నాడు. చివరి సమయములో అతనిని ఎదుర్కోవ డము మనకు కూడా కష్టముగా ఉంటుందేమో చెప్పలేను. అతను ఇప్పటికే కొంత శక్తికల్గిన వ్యక్తిగా ఎన్నో కార్యములను సాధించాడు. అయినా అతని ఆశకు పరిమితిలేదు. ఎన్నో దుష్టకార్యములను చేయుటలోనూ ఆరి తేరినవాడు. ఇంతవరకు ఆయన అందరకీ మంచివానిగానే కనిపిస్తున్నాడు. ఆయన చేసే మంచిపనులు పది (10) ఉండగా, తొంభై (90) చెడు పనులే ఉన్నాయి. ఆయన పెద్ద స్వామిగా పేరుగాంచిన తపస్విబాబాగారు. ఇది వరకే ఆయన భువనేశ్వరి దేవాలయములో కాజేయాలనుకొన్న వజ్రముల విషయములో మనము అడ్డు తగిలాము. ఆ విషయములో ఆయనకు మనము పూర్తి శత్రువులుగా కనిపించాము. కానీ ఈ బాలుని విషయములో మాత్రము ఇంతవరకు మన ఉద్దేశము ఆయనకు తెలియదు. ఆ బాలుని విషయము మనకు తెలిసినట్లు కూడా ఆయనకు తెలియదు. పదహారు (16) సంవత్సరములకు ఆ బాలునికి యుక్తవయస్సు వచ్చునప్పటికి మనము బహిరంగముగా ఆ బాలుని విషయములో అడ్డుపడవలసి వస్తుంది. అప్పుడు బాబాకు మనము ముఖ్యమైన శత్రువులుగా మిగిలిపోతాము. అప్పుడు ఆయన మనలను అంతము చేయాలని చూస్తాడు. అందువలన అలా జరుగుటకు వీలులేకుండా ముందే జాగ్రత్తపడుచున్నాము.

(రాజయోగానంద స్వామి ముందు జాగ్రత్తగా రాఘవ, రాధేశ్వరి వివాహమును జరిపించాడు. మల్లుదొర, దుందుభి దగ్గరుండి రాఘవకు పెళ్ళి చేయడము జరిగినది.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(తపస్విబాబాగారు అష్టగ్రహ కూటమి రోజున పుట్టిన బాలుని ద్వారా శక్తిని పొందుటకు ఆ బాలునికి యుక్తవయస్సు 16 సంవత్సరములు వచ్చు వరకు వేచి ఉండవలసిందే. అన్ని సంవత్సరములు ఆ బాలున్ని కాచుకొని ఉండునట్లు తన శక్తులను నియమించి, ఇక వజ్రాల విషయమును చూడాలనుకొన్నాడు. అప్పుడు మునెప్పతో ఇలా మాట్లాడాడు.)

**తపస్విబాబా :-** మునెప్పా, నీవు మాంత్రికులను ఉత్సాహపరిచి వారిద్వారా వజ్రముల ఆచూకీ తెలుసుకో, నేను నా శక్తుల ద్వారా ప్రయత్నిస్తే ఏమాత్రము తెలియడములేదు.

**మునెప్ప :-** బాబాగారూ, ఈ మాంత్రికులు వజ్రాలకొరకు అంజనములో చూచి పాముకొట్టిందని భయపడిపోయారు. అంజనము కూడా పోలేని జాగాలో ఆ వజ్రాలున్నాయి. అందువలన అవి కనిపించడములేదు అంటున్నారు. పైగా పాము భయముతోవారు వజ్రాల విషయమంటేనే వణికి పోవుచున్నారు.

**తపస్విబాబా :-** అలాగైతే ఒకపనిని ఉపాయముగా ఎవరికీ తెలియకుండా చేయాలి. అదేమనగా నకిలీ వజ్రములను తీసుకొనివచ్చి భువనేశ్వరి దేవాలయములో భువనేశ్వరి దేవి ప్రతిమ ముందర పెట్టండి. నకిలీ వజ్రములను కవరులో పెట్టి, అదే కవరులోనే ఒక ఉత్తరము కూడా పెట్టండి. ఆ ఉత్తరములో "మేము ఈ వజ్రములను దొంగిలించినది తప్పు. మేము వీటిని తీసుకపోయినప్పటి నుండి మాకు అనారోగ్యమైనది. అందువలన వీటిని నీ ముందరే పెట్టుచున్నాము. మమ్ములను క్షమించి మా ఆరోగ్యము బాగుపడునట్లు చేయి తల్లీ" అని వ్రాసివుంచండి. అలా ఉంచడమువలన తిరిగి వజ్రముల విషయము బయటికి తెలుస్తుంది. అలా తెలియడము వలన అసలైన వజ్రములు ఎక్కడున్నదీ వాటి వివరమును తెలిసినవారు

మాట్లాడుకొందురు. అప్పుడు గోకర్ణ విద్యలోని కర్ణపిశాచిని ఆదేశించి వజ్రముల సమాచారమును తెలుసుకోవచ్చును. అందువలన నీవు వెంటనే నకిలీ వజ్రములను తయారు చేయించి భువనేశ్వరి దేవాలయములో పెట్టే ఏర్పాటు చేసిపెట్టు.

**మునెప్ప :-** మనవారు వజ్రాల విషయమంటేనే విసిగిపోయారు. ఇంతేకాక ముందు పోయినవారు ఆ గుడిదగ్గరకు పోవడము మంచిది కాదు. అందువలన ఈ పనికి ఎవరిని వినియోగించాలో మీరే చెప్పండి.

**తపస్విబాబా :-** ఈ పనిని తెలివితక్కువ వారు చేయకూడదు. మారు వేషములో పోతారు కావున ముందు పోయినవారు పోయినా ఫరవాలేదు. ఒకరిని పని కొరకు, ఒకరిని సమాచారమును సేకరించుటకు, ఒకరిని పై నిఘా కొరకు పంపవలెను.

(బాబాగారు చెప్పినట్లే మునెప్ప తన మనుషులను మారువేషములో భువనేశ్వరి దేవాలయమునకు పంపాడు. భువనేశ్వరి ఆలయమునకు పోయిన మునెప్ప మనుషులు, మునెప్ప చెప్పినట్లే చేశారు. ఆ రోజు రాత్రి అక్కడి పూజారులు కవరునూ, అందులోని వజ్రములనూ, దొంగలు వ్రాసిన జాబునూ చూచి వెంటనే పోలీస్‌వారికి తెలిపారు. ఆ విషయము తెలుసుకొన్న పోలీస్‌లు గుడికి వచ్చి విషయమును తెలుసుకొని, ఆ విషయమును మీడియాకు చెప్పారు. వెంటనే భువనేశ్వరి దేవాలయములో దొంగిలించ బడిన వజ్రములు తిరిగి ఆలయము చేరాయని అన్ని పత్రికలలో వార్తలు వచ్చాయి. ఆ వార్తలను చూచిన బాలప్ప ఇదెలాసాధ్యము? ఇదేదో మోసమను కొన్నాడు. కానీ తాను చెప్పినా డిపార్టుమెంటులో ఎవరు తన మాటను నమ్మరని తెలుసు. అందువలన ఊరక ఉండిపోయాడు. వార్తా విషయమును చూచిన రాజయోగానంద స్వామి తపస్విబాబాగారి

కుతంత్రమును గ్రహించి వజ్రముల విషయమును మాట్లాడకూడదను కొన్నారు. వజ్రాల వార్త చివరికి డి.జి.పి గారి దగ్గరకు కూడా పోయింది. డి.జి.పి గారు ఇదెలా సాధ్యమగు నని, వజ్రాలు దొంగల చేతులలో లేనిది, దొంగలు ఎలా తెచ్చి గుడిలో ఉంచుతారని అనుకొన్నాడు. ఇది దొంగలు పన్నిన పన్నాగమని డి.జి.పి గారు ఆలోచించలేకపోయాడు. మొదటినుండి వజ్రములు ఎక్కడున్నది తనకు తెలుసు. వజ్రములు మాయము కావడములో ఎవరి పాత్రవున్నది కూడా తెలుసు. చివరికవి రాజయోగానంద స్వామివద్ద వున్న విషయము కూడా తెలుసు. అయినా ఈ వార్త ఏమిటి? అను సందిగ్ధములో పడి ఒకమారు రాజయోగానంద స్వామితో మాట్లాడితే విషయమంతా తెలుస్తుంది కదా అనుకొన్నాడు. అప్పుడు డి.జి.పి ఫోన్ దగ్గరకు పోయి రింగ్ చేయాలనుకొన్నాడు. అలా ఆయన ఫోన్ తీయకనే రింగ్ మ్రోగింది. వెంటనే డి.జి.పి రిసీవర్ తీసుకొని హలో డి.జి.పి హియర్ అన్నాడు. "నేను రాజయోగానందను మీరు నన్ను ఏ విషయము అడగవద్దండి. మీరు విన్నది కుట్రలోని భాగము" అని ఫోన్ పెట్టేశాడు. డి.జి.పి.కి అప్పటికి కొంత అర్థమై నాదే పొరపాటని అనుకున్నాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(జమీందారు రావుబహదూర్ జ్యోతిష్యుని కోసము కాచుకొని నెల రోజులు చూచాడు. చివరకు ఆ జ్యోతిష్యుడు కూడా భయపడి పోయాడని అనుకొన్న జమీందారు చివరకు అతని కొరకు ఎదురు చూడడము మానివేసి వేరే ప్రయత్నము చేయాలనుకొన్నాడు. అంతలో ఆ బాలునికి ఒక సంవత్సరము వయస్సు వచ్చింది. బాలుడు ఈశ్వర్ చిన్నగా నడుస్తూ ఇంటి బయటికి పోయాడు. ఆ రోజు అమావాస్య అయినా ఎవరికి దానిమీద ధ్యాసలేదు. ఈశ్వర్‌ను ఎత్తుకొని లోపలికి తీసుకురావాలని పని మనిషి బయటికి వచ్చింది. అంతలో ఒక తిక్కపట్టిన గుర్రము పరుగిడుచూ

వచ్చింది. అది ఊరంతా, బజార్లవెంట పరుగెత్తుచూ అడ్డువచ్చిన వారిని కరవడము, కాళ్ళతో తన్నడము చేస్తూవుంది. అటువంటి పిచ్చి గుర్రమును ఊరునుండి తరిమి వేయాలని చాలామంది దానిని తరమగా, అది ఎవరికి దొరకకుండా ఈశ్వర్ ఉన్న దారిలో వేగముగా పరుగెత్తుతూ వచ్చింది. అదివచ్చే వేగమునకు అందరూ భయపడి ప్రక్కకు పారిపోయారు. ఈశ్వర్‌ను తీసుకపోవాలని బయటికి వచ్చిన పని మనిషి గుర్రమును చూచి ముందుకు పోలేక వెనక్కు అడుగువేసింది. ఆ గుర్రము వేగముగా ఈశ్వర్‌వైపు వచ్చింది. దానిని చూచిన అందరూ ఈశ్వర్ గుర్రము కాళ్ళక్రింద పడిపోతాడని అనుకున్నారు. వేగముగా వచ్చిన గుర్రము ఈశ్వర్‌కు ఆరు అడుగుల దూరములో కుప్పకూలి క్రిందపడిపోయింది. గుర్రము ఈశ్వర్ దగ్గరికి రాకనే క్రింద పడిపోవడము జరిగిన వెంటనే అక్కడున్న వారు ఈశ్వర్‌ను ఇంటిలోపలికి తెచ్చారు. క్రింద పడిన గుర్రము కాళ్ళు విదిలిస్తూ లేవలేక క్రిందనే పడివుంది. కొద్దిసేపటికి అది చనిపోయింది. ఈశ్వర్‌వైపు వచ్చిన గుర్రము అలా చనిపోవడము అందరికీ విచిత్రముగా తోచింది. ఈ విషయమును రావుబహదూర్ విని అప్పటినుండి ఆ బాలున్ని గొప్పగానే చూచుకొనేవాడు. బాలున్ని జాగ్రత్తగా చూచుకొమ్మని ఒంటరిగా వదలవద్దని అతని పని మనుషులకు చెప్పాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(రాఘవ పెళ్ళైన తర్వాత సంవత్సరమునకు కొడుకు పుట్టాడు. రాఘవ కొడుకుకు రాజయోగానంద స్వామి అక్షయ్ అని పేరు పెట్టాడు. తర్వాత రెండు సంవత్సరములకు ఒకరు చొప్పున అమర్, అక్షిత్ అను ఇద్దరు కొడుకులు పుట్టారు. రాఘవకు ముగ్గురు కొడుకులు పుట్టడము అక్కడి వారందరికి సంతోషమైనది. దుందుభికి సంతానములేదు, కనుక

రాధేశ్వరి కొడుకులను తన స్వంత కొడుకులుగా భావించి పెంచసాగింది. ఈ విధముగా సంతోషముగా కాలము గడచి పోవుచున్నది.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(తపస్వి బాబాగారు తన ఆశ్రమములో వజ్రాల విషయమును గురించి చింతిస్తూ, నకిలీ వజ్రములను దేవాలయములో ఉంచితే అంతటితో ఆ విషయము ఆగిపోయింది. కానీ అసలైన వజ్రాల విషయము తెలియ కుండా పోయినది. దాదాపు ఏడు సంవత్సరముల కాలమైనా వాటి ఆచూకీ తెలియకుండా పోయినది. ఎప్పుడు ఎన్ని ప్రయత్నములు చేసినా అవి ఎక్కడున్నది కూడా తెలియకుండా పోయింది. ఇంత ధనబలము, మంత్ర బలము ఉండికూడా ఏమీ ప్రయోజనము లేకుండా పోయినది అనుకొన్నాడు. అలా అనుకొంటూనే తర్వాత ఒక సంవత్సరము గడిచి పోయింది. అప్పటికి ఎనిమిది సంవత్సరములు గడిచిపోయింది. ఉన్నట్టుండి ఒకరోజు భువనేశ్వరి దేవాలయములో ఆభరణములు వజ్రములు దొంగలు ఎత్తుకు పోయినట్లు వార్తలు వచ్చాయి. రాజయోగానంద స్వామి ఆ వార్తలకు స్పందించలేదు. తపస్విబాబాకు, మునెప్పకు ఆ వార్త తెలిసి మాకంటే మించిన దొంగలు ఎవరున్నారని ఆలోచించసాగారు. ఈ మారు గుడిలోనికి పోయి చూచిన పోలీసులకు కొన్ని ఆధారములు దొరికాయి. దొరికిన ఆధారముల ద్వారా దొంగలను పట్టుకోవచ్చని పోలీసులు తలచారు.

భువనేశ్వరి దేవాలయములో దొంగతనము జరిగిన రోజు రాత్రి పదకొండు గంటల వరకు భజన కార్యక్రమము ఉండెను. ఆ రోజు గుడిలో జఠాజూట స్వామి కూర్చొని ఉండగా, ఆ స్వామి భక్తులు వందలాది మంది వచ్చి భజన చేశారు. ఆదివారము రోజున భజన కార్యక్రమము సాయం కాలము ఐదు గంటలనుండి రాత్రి పదకొండుగంటల వరకు, ఉదయము

ఐదు గంటలనుండి పగలు పదకొండుగంటల వరకు జఠాజూట స్వామి ఆధ్వర్యములో జరుగును. జఠాజూటస్వామి భజనలో చాలామంది భక్తులలో పూనకాలు వస్తాయని ముందే చెప్పుకొన్నాము కదా! స్వామి ఆధీనములో నున్న భూత, ప్రేత, పిశాచములు కొందరి భక్తులలోనికి వచ్చి ఇష్టము వచ్చినట్లు ఎగిరి, నాట్యమాడునని తెలుసు. ఆ రాత్రి భజన సమయములో చాలామందికి పూనకాలు వచ్చాయి. కొందరు ఎగురుచుంటే, కొందరు పరుగిడుచుంటే, కొందరు వివిధ రకముల నాట్యములు చేయుచు వుంటే, కొందరు తూగుతూ, కొందరు ఊగుతూ ఉన్నారు. అలాంటి గందరగోళ సమయములో భజన అయిపోతుంది. అదే సమయములో పూజారి తీర్థము కొరకు చాలామంది ప్రాకులాడుచున్నపుడు, పూజారి గమనించకుండా ఒకరు పూనకము వచ్చినట్లు నటిస్తూ గర్భగుడిలోనికి పోయాడు. అందరి కన్నుగప్పి పోయిన వ్యక్తి లోపలనున్న వాకిలి పరదాగుడ్డలను తనమీద వేసుకొని ఒకమూల కూర్చున్నాడు. అంతలో భజన అయిపోవడము గుడి తలుపులు వేయడము జరిగింది. గర్భగుడిలోనికి పోయినది జఠాజూట స్వామి యొక్క మనిషే! అతనికి అలా పొమ్మని జఠాజూట స్వామియే చెప్పాడు.

అలా తన మనిషిని గర్భగుడిలోనికి ఆ రాత్రి జఠాజూటస్వామి ఎందుకు పొమ్మని చెప్పాడనగా! భువనేశ్వరిదేవి యొక్క వజ్రములు గతములో ఎనిమిది సంవత్సరముల క్రితము దొంగతనమునకు గురి అయిన విషయము అందరికీ తెలుసు. తర్వాత వజ్రములను చీటీ వ్రాసి కవరులో పెట్టి పోవడము కూడా అందరికి తెలుసు. అలా పెట్టి పోయిన వజ్రములు నకిలీవని దేవాలయము వారుగానీ, పోలీసులుగానీ గుర్తించలేక పోయారు. ఆ విషయము జఠాజూట స్వామికి కూడా తెలియదు. తిరిగి వచ్చిన

వజ్రములను ముందు దాచినచోట దాచకుండా, ఈమారు గర్భగుడిలో పైన ఉంచిన పెట్టెలో దాచడం జరిగినది. గర్భగుడిలోనికి పోయినా ఎవరూ పైకి చూడరను ఉద్దేశముతో ఆలోచించి కొన్ని ఆభరణములను వజ్రములను దాచడము జరిగింది. అలా దాచిన విషయము కొన్ని సంవత్సరములకు జఠాజూట స్వామికి తెలిసింది. మొదటినుండి వజ్రాలను కాజేయాలను ఉద్దేశముతో నున్న జఠాజూట స్వామికి ముందు జరిగిన దొంగతనముతో కొంత నిరుత్సాహము ఏర్పడినా, తిరిగి వజ్రములు ఆలయములోనికి చేరినప్పటినుండి వాటిని తస్కరించవలెనను చింతలోనే ఉండెను. అయినా అవి ఎక్కడున్నదీ తెలియక ఇంతకాలము ఆగివున్న జఠాజూట స్వామికి వజ్రములు గర్భగుడి లోనే ఉన్నవను విషయము చివరకు తెలిసిపోయింది. అప్పుడు తెలివిగా వాటిని దొంగలించాలను ఉద్దేశ్యముతో భజన కార్యమును పెట్టి, పథకము ప్రకారము ఆ రోజు రాత్రి తన మనిషిని గర్భగుడిలోనికి పంపాడు. రాత్రి పదకొండు నుండి తెల్లవారు జామున ఐదుగంటల వరకు వ్యవధి ఉండుట వలన లోపలికి పోయిన మనిషి వాటిని తీసుకొని ఉండడము జరిగినది. ప్రాంతఃకాలములోనే ఐదు గంటలకు గర్భగుడి తలుపులు తీసినపుడు లోపల వున్న వ్యక్తి ఎవరు గమనించకుండ బయటికి రావడానికి సరిగ్గా గర్భగుడి తలుపులు తీసినపుడు తమవద్ద దాచుకొన్న పామును గుడిలో వదలి జఠాజూట స్వామి భక్తులు గందరగోళ పరిస్థితిని సృష్టించారు. అలా జరుగుచున్న గందరగోళములో కొందరు స్వామి భక్తులు గర్భగుడిలోనికి పాము భయముతో పోవునట్లు చేసి, అలా లోపలికి పోయిన వారిలో వజ్రములను దొంగిలించిన మనిషి కలిసి వచ్చునట్లు చేశాడు. ఈ విధముగా ఆ రోజు రాత్రి జఠాజూట స్వామి తన పథకము ప్రకారము వజ్రాలను సంపాదించాడు. తర్వాత కొన్ని రోజులకు ఆ వజ్రములను

బాగా గమనించిన జతాజూట స్వామి అవి అసలైన వజ్రములు కావనీ, తాము దొంగిలించిన వజ్రములు నకిలీవని తెలుసుకోగలిగాడు. తమ దగ్గర ఉన్నవి నకిలీ వజ్రములైతే అసలైన వజ్రములెక్కడ ఉన్నాయని ఆలోచించాడు. దేవస్థానము యొక్క ధర్మకర్తయే అసలైన వజ్రములను తీసుకొని నకిలీ వజ్రములను ఆలయములో ఉంచాడని అనుకొన్నాడు.

ఆలయ ధర్మకర్తమీద జతాజూట స్వామికి అనుమానము వచ్చిన తర్వాత ధర్మకర్త మోసమును బయటపెట్టాలనుకొన్నాడు. రెండు రోజుల తర్వాత న్యూస్‌పేపర్ వాళ్ళకు ఆకాశరామన్న ఉత్తరము వ్రాసాడు. అందులో భువనేశ్వరి ఆలయములోని నగలు నకిలీవని, అసలైన వజ్రములను ధర్మకర్త నొక్కేశాడని, గుడిలోని వజ్రములను దొంగిలించిన తర్వాత అవి నకిలీవని తెలిసినదనీ, తాము కష్టపడి దొంగతనము చేసినా ప్రయోజనము లేక పోయిందని వ్రాసి, ఆ ఉత్తరమును పోలీస్ వారికి పంపాడు. ఆ ఉత్తరమును చూచిన పోలీస్‌లకు గుడిలోని వజ్రములు దొంగలించబడ్డాయని తెలిసింది. ఆలయమునకు సంబంధించిన వారు ఎవరూ తమకు దొంగతనమును గురించి చెప్పలేదే అనుకొని, ఆ విషయమును విచారించదలచి సి.ఐ భువనేశ్వరి దేవాలయమునకు పోయి వజ్రములను గురించి విచారించాడు. ఆలయము వారు అసలుకు దొంగతనమే జరుగలేదని చెప్పారు. అప్పుడు తనకు వచ్చిన ఉత్తరమును సి.ఐ దేవాలయము వారికి చూపించాడు. దానిని చూచిన ధర్మకర్త సి.ఐ తో ఇలా అన్నాడు.

**ధర్మకర్త :–** మొదట ఎనిమిది సంవత్సరముల క్రితము దొంగతనము జరిగిన తర్వాత మేము కొంతమంది ఆలోచించి అమ్మవారికి వాడే నగలను ఒకచోటా, వాడని నగలనూ వజ్రములను మరియొకచోట ఉ

ంచాలనుకొన్నాము. తర్వాత వజ్రములనూ, మరికొన్ని అలంకారమునకు పనికిరాని నగలనూ కలిపి మరియొక చోట పెట్టాము. రెండవమారు వజ్రములు ఎక్కడ పెట్టినది బయటివారికి ఎవరికీ తెలియదు. తెలిసినా వాటిని దొంగిలించుటకు వీలుకాదు. వాటిని మేము తీయాలన్నా ఒకగంట కాలము పట్టుతుంది.

**సి.ఐ :-** అయితే ఈ ఉత్తరమును దొంగలే వ్రాసినట్లు ఉందికదా!

**ధర్మకర్త :-** అలా వ్రాస్తే మీరు మేము వాటిని చూచే ప్రయత్నము చేస్తాము కదా! అప్పుడు అవి ఎక్కడున్నది తెలుసుకోవచ్చని అలా వ్రాసి ఉండవచ్చును. లేకపోతే ధర్మకర్తమీద బురద చల్లేదానికి ఆలయమునకు సంబంధించిన వారే అసూయతో అలా వ్రాసి ఉండవచ్చును.

**సి.ఐ :-** అయితే ఒక పనిని చేయండి. మేము వచ్చి విచారించినట్లు, ఆలయములో ఎటువంటి దోపిడీ జరుగలేదన్నట్లు మీరు మాకు వ్రాసి ఇవ్వండి.

**ధర్మకర్త :-** అలాగే వ్రాసి ఇస్తాము. మేము చెప్పేమాట నిజమని తెలియుటకు వజ్రములను ఎలా దాచామో కూడా మీకు చూపుతాము రండి..

**(**అని చెప్పి సి.ఐ.ని పిలుచుకొని గర్భగుడిలోనికి పోయి పైన కట్టి పెట్టిన పెట్టెను చూపాడు. సి.ఐ కూడా గర్భగుడిలో భద్రముగానున్న పెట్టెను చూచారు. వజ్రములను గురించి తప్పుడు సమాచారమును ఇచ్చారని సి.ఐ అనుకొని అక్కడినుండి బయలుదేరిపోయి, యస్.పిగారితో కలిసి విషయమంతా చెప్పాడు అప్పుడు పోస్టులో వచ్చిన ఆ లెటర్‌ను యస్.పి గారు చదివి, తర్వాత లెటర్‌వెనుక వైపువున్న పోస్టు ముద్రను చూచాడు. అలా చూడడము వలన ఆ జాబు ఎక్కడినుండి వచ్చినదో తెలుస్తుందని చూచాడు. దానిమీద రెండు ముద్రలు అదే ఊరికి సంబంధించినవిగా

ఉండడము గమనించాడు. దానినిబట్టి ఆ ఉత్తరము స్థానికులే వ్రాసినట్లు అర్థమైనది. దానిని చూచిన తర్వాత సి.ఐతో యస్.పి గారు ఇలా అన్నాడు.

**యస్.పి :-** ఈ జాబు ఇదే ఊరునుండి స్థానికులే వ్రాసారనుటకు ఆధారమున్నది. కానీ దొంగతనము జరుగలేదనుటకు ఆధారమున్నదా?

**సి.ఐ :-** నేను పోయి చూచి వచ్చాను కదా సార్.

**యస్.పి :-** నీవు చూచినది పెట్టెను మాత్రమే, ఆ పెట్టెలో వజ్రములున్నదీ లేనిదీ నీవు చూడలేదు కదా!

**సి.ఐ :-** లేదుసార్, వారు ఏమి జరగలేదని చెప్పారు.

**యస్.పి :-** వాళ్ళు కూడా నీవు చూచినట్లే పై పెట్టెను చూచి చెప్పివుంటారు. లెటర్ వచ్చిన తర్వాత కూడా నీవు పూర్తిగా చూడలేదంటే నీవు పోలీస్ డిపార్టుమెంట్‌లో పనికిరావు. మేము కష్టపడి దొంగతనము చేసినా ఫలితము లేకుండాపోయిందని వ్రాశారు. అసూయతో ధర్మకర్తను ఇబ్బంది పెట్టుటకే అయితే, వజ్రములు నకిలీవున్నాయి, ధర్మకర్త వాటిని మార్చి ఉండవచ్చును అని మాత్రమే వ్రాసి ఉండేవారు. ఇక్కడ వ్రాసిన వారు స్థానికులే, కావున వారికి అన్ని అనుకూలములు సరిపోయినపుడు దొంగతనము చేసివుండ వచ్చును. ముందు నీవు పోయి వజ్రములున్నవో లేదో చూచుకొనిరా.

(ఆ మాటతో ఖంగుతిన్న సి.ఐ అక్కడినుండి భువనేశ్వరి దేవాలయము వద్దకు పోయి, ధర్మకర్త సమక్షములో పెట్టెను దించి చూచారు. పెట్టెలోపల వజ్రములు లేకుండ పోయినది చూచిన వారంతా ఆశ్చర్య పోయారు. అంతేకాక ఆ పెట్టెలో దొంగతనము చేయబడిన దినము పేరూ, తేదీ వ్రాసిన చీటీ కూడావుంది. ఆ చీటిని సి.ఐ తీసుకొనిపోయి యస్.పి గారికి కూడా చూపించారు. కేస్ నమోదు చేసుకొని దర్యాప్తు ప్రారంభించాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(రావుబహదూర్ జమీందారు ఇంటిలో ఈశ్వర్ ఆరోగ్యముగా పెరుగుచున్నాడు. జమీందారు ఆర్థిక పరిస్థితి కూడా ఆ బాలుడు ఇంటికి వచ్చినప్పటినుండి చాలా అభివృద్ధి అయినది. రావుబహదూర్ కూడా ఈశ్వర్ వలన సంతోషముగా ఉన్నాడు. అతని మీద ఉన్న అనుమానములన్నిటిని లేకుండా చేసుకొన్నాడు. అలా జరిగిపోతున్న కాలములో ఒక దినము ఆ ఊరిలోనికి కాటికాపరి (స్మశానములో కాపలావుండి శవాలకు డబ్బు వసూలు చేయువాడు) వచ్చాడు. అతను తన మంత్రవిద్యను ప్రదర్శిస్తూ, ఊరంతా ఇంటింటికి తిరిగీ, కొందరు ఇచ్చిన డబ్బులు తీసుకొని పోయేవాడు. ఎవరైనా డబ్బులు ఇవ్వకపోతే తన మంత్రములతో తేళ్ళను, పాములను సృష్టించి భయపెట్టి డబ్బులు ఇచ్చిన తర్వాత వాటిని లేకుండా చేసిపోయెడివాడు. అలా ఇల్లిల్లూ తిరుగుతూ కాటికాపరి చివరకు జమీందారు ఇంటికి వచ్చి తనకు దక్షిణ ఇవ్వమన్నాడు. ఆ సమయానికి జమీందారు, ఆయన భార్య ఇద్దరూ ఇంటిలో లేరు. కావున తర్వాత రమ్మని ఇంటిలోని పనిమనుషులు చెప్పారు. అయినా ఆ కాటికాపరి ఇల్లు వదిలి పోలేదు. అప్పుడు ఈశ్వర్ కూడా బయటికి వచ్చి అమ్మానాన్న లేరని చెప్పినా వినకుండా మొండిగా ఉంటూ, తేళ్ళను సృష్టించి వదలితే డబ్బులు ఇచ్చి పంపుతారని, ఒక మంత్రమును చెప్పుచూ వేప ఆకును పెరికి చల్లాడు. అలా ఆకులను చల్లుట వలన ఆకులన్నీ తేళ్ళుగా కనిపించును. కానీ అక్కడ వేపాకు తేళ్ళుగా మారలేదు. ఈశ్వర్ వింతగా చూస్తూ అక్కడే నిలుచున్నాడు. కాటికాపరి రెండవ మారు పాములను కనిపించునట్లు చేయాలనుకొన్నాడు. అప్పుడు కూడా అతని మంత్రము పని చేయలేదు. అప్పుడు కాటికాపరికి ఏమీ అర్థముకాక అక్కడినుండి వెళ్ళిపోయాడు.

అదే ఊరిలోనే మరొక ఇంటిదగ్గర తన మంత్రమునకు పాములు, తేళ్ళు తయారైనవి. కానీ ఒక్క జమీందారు ఇంటివద్ద మాత్రమే పని చేయకుండా పోయినట్లు కాటికాపరి గ్రహించాడు. ఆ ఇంటిలో ఏదో పెద్దశక్తి ఉంటేనే తన మంత్రశక్తి అక్కడ పనిచేయలేదనుకొన్నాడు. ఆ ఇంటిలోని శక్తి ఏమిటో తెలుసుకొనుటకు తన గురువు పెద్ద కాటికాపరి వద్దకు పోయి ఆ విషయమును చెప్పాడు. ఆ విషయమును విన్న పెద్ద కాటికాపరి తనకున్న శక్తితో ఆ ఇంటిలోని ఈశ్వర్ ద్వారా అట్లు జరిగిందని తెలుసుకొన్నాడు. అతనికి తెలిసిన విధానము ప్రకారము ఆ బాలున్ని చనిపోవునట్లు చేసి, అతనిని స్మశానములో పూడ్చి పెట్టిన తర్వాత, ఆ బాలుని కుడి చేతి ఎముకను తీసి పెట్టుకొంటే తమకు కూడా అటువంటి శక్తులు లభించునని తెలుసుకొన్నాడు. ఆ బాలున్ని చంపుటకు తమకు తెలిసిన చేతబడిని చేసి, 40 దినములకు అతనిని చనిపోవునట్లు చేసి, తర్వాత ఆ ఇంటివారు తెచ్చి స్మశానములో పూడ్చిపెట్టిన 30 రోజులకు పూజచేసి చేతి ఎముకను తీసుకోవాలనుకొన్నాడు. వెంటనే దానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేసిపెట్టుకొని, ఒక దినము ఈశ్వర్ మీద చేతబడి ప్రయోగించి, అతను చనిపోవునని 40 రోజుల వరకు కాచుకొని ఉన్నాడు. ఈ పనిని ఇద్దరు కాటికాపర్లు చేశారు. చివరకు 40 రోజులు గడచి పోయాయి. అయినా ఈశ్వర్ చనిపోలేదు. ఈశ్వర్ చావుకొరకు అన్నీ సిద్ధము చేసుకొన్న వారికి ఏమీ అర్థముకాలేదు. అలా ఈశ్వర్ మీద చేతబడి చేసిన వెంటనే, ఈశ్వర్‌ను అనుసరించివున్న శక్తులు కాటికాపర్ల మంత్రములను లేకుండా చేశాయి. ఆ దినముతో వారు ఖాళీ మనుషులు అయిపోయారు. అలా వారి మంత్రములు ఒక్క దెబ్బతో పోయాయి.

ఈశ్వర్ తన పదవ ఏట హైస్కూల్‌కు పోయి చదువుచున్నాడు. అతనికి ప్రతి సబ్జెక్ట్‌లోను మంచి మార్కులు వచ్చేవి. స్కూల్‌లోనూ, క్లాస్

లోనూ మంచి పేరు తెచ్చుకొన్న ఈశ్వర్ మార్కులలోనూ అందరికంటే మొదటనే ఉన్నాడు. అతని ప్రవర్తన మరియు చదువును చూచిన టీచర్లందరూ ఈశ్వర్‌ను మెచ్చుకొనేవారు. ఒక దినము తన స్నేహితులతో కలిసి స్కూల్‌నుండి వస్తున్నపుడు, ఆ దారిలోనే ఒక దయ్యము ఒక ఆడ మనిషిని ఆవహించివుంది. ఆమె ముందర ఒక మాంత్రికుడు ఆ దయ్యమును వదలించు పనిలో ఉన్నాడు. తనను వదిలి పొమ్మని మాంత్రికుడు చెప్పగా, ఆ దయ్యము ఆ మాంత్రికుని మీదికి తిరగబడింది. నేను వదలిపోను అని చెప్పింది. దానికి మాంత్రికునికి కోపము వచ్చి వేపమండలతో దయ్యము పూనిన ఆడ మనిషిని కొట్టాడు. అప్పుడు ఆ దయ్యమునకు మాంత్రికుని మీద కోపము వచ్చి అతనిని తిరిగి కొట్టను మొదలుపెట్టింది. అక్కడున్న వారు అడ్డువచ్చినా ఆ దయ్యము అతనిని వదలకుండా కొట్టుచున్నది. ఇలాంటి గందరగోళము అక్కడ జరుగుచుండగా ఈశ్వర్ ఆ దారిలో పోతూ అక్కడికి వచ్చి ఏమి జరుగుచున్నదో చూడాలను కొన్నాడు. ఈశ్వర్ అక్కడికి రాగానే ఆ దయ్యము ఈశ్వర్‌ను చూచింది. అంతవరకు ఎవరు అడ్డువచ్చినా మాంత్రికుని వదలకుండా కొట్టుచున్న దయ్యము ఈశ్వర్‌ను చూస్తూనే ఒక్కమారుగా ఆగిపోయింది. భయముతో వణకుచూ నేను పోతాను అని అరుస్తూ కొంత దూరము పరిగెత్తి క్రిందపడిపోయి ఆమెనుండి బయటికి పోయింది. అంతవరకు ఎవరిమాటా వినని దయ్యము ఈశ్వర్ అక్కడికి వస్తూనే అలా పారిపోవడముతో ఈశ్వర్ గొప్పవాడని అక్కడున్న వారు అనుకొన్నారు. ఈ విధముగా చిన్నచిన్న సంఘటనలు అప్పుడప్పుడు జరుగుచుండేవి.

ఈశ్వర్‌కు చదువు చెప్పు స్కూల్ టీచరు రావుబహదూర్ గారిని లక్ష రూపాయలు అప్పు అడిగాడు. ఆ సమయానికి అంత డబ్బులేని

దానివలన మరియు ఇచ్చినా తిరిగిరాదను అనుమానముతోనూ జమీందారు డబ్బులేదని చెప్పాడు. తనకు డబ్బు ఇవ్వలేదని ఆ టీచర్ జమీందారు మీద కోపముతో ఉండెను. ఒక దినము రావుబహదూర్ మీద కోపముతో ఈశ్వర్ ఏ తప్పు చేయకున్ననూ, ఈశ్వర్‌ను చెంపమీద కొట్టాడు. ఈశ్వర్‌కు చెంపమీద దెబ్బతగిలిన వెంటనే ఆ టీచర్‌కు కుడిచేయి, కుడికాలు, నోరు స్వాధీనములో లేకుండా పోయాయి. పార్శ్వవాయువు వచ్చి క్రిందపడి పోయాడు. ఈశ్వర్‌ను కొట్టినందుకే ఆ టీచర్‌కు అలా జరిగిందని అక్కడున్న వారంతా అనుకోవడము జరిగింది. అందువలన స్కూల్‌లోకూడా తోటి పిల్లలుగానీ, టీచర్లుగానీ ఈశ్వర్‌ను గౌరవించేవారు.)

× × × × × × × × × × × × × × × × × × × × ×

(రాజయోగానంద స్వామి భువనేశ్వరి దేవాలయములోని నకిలీ వజ్రాల విషయము విని మొదట వాటిని గురించి ఏమీ స్పందించి మాట్లాడక ఊరకవుండెను. రెండవమారు వజ్రములు దొంగిలించబడ్డాయి అను వార్త స్వామికి విచిత్రముగా కనిపించింది. అసలైన వజ్రములు తమకు తెలిసిన స్థలములో క్షేమముగా ఉండగా, నకిలీ వజ్రముల విషయమేమిటి? తర్వాత అవి దొంగిలించబడడమేమిటి? అని యోచించసాగాడు. అంతలో రాఘవ అక్కడికి వచ్చాడు. అప్పుడు రాఘవతో రాజయోగానంద స్వామి ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :–** విన్నావా రాఘవా! వజ్రములు దొరికాయి అనుమాట కల్పితమనీ, అసలైన వజ్రాల విషయమును తెలుసుకొనుటకు అలా వజ్రములు దొరికాయి అంటున్నారని మనము అనుకొన్నాము కదా! ఇప్పుడేమో వజ్రాలు నకిలీవని వాటిని దొంగిలించిన దొంగలు చెప్పారనీ, దొంగలు చెప్పేంత వరకు దొంగతనము జరిగినట్లు కూడా దేవాలయము

వారికి తెలియదనీ, వార్తలు రావడము విచిత్రమనిపిస్తూవుంది. మొదట దొంగిలించిన దొంగలు అసలు వజ్రాల విషయము బయటికి రావడానికి, నకిలీ వజ్రములను సృష్ఠించి ఆలయములో పెట్టివుండవచ్చును అని అనుకొన్నాము. అయితే ఇప్పుడు ఆ నకిలీ వజ్రములు కూడా దొంగిలించ బడినాయని అంటున్నారు. మొదట దొంగిలించినవారు మునెప్ప మనుషులనీ, దానిని తపస్విబాబాయే చేయించాడని మనకు తెలుసు. రెండవమారు నకిలీ వజ్రములను దొంగిలించిన వారు ఎవరైవుంటారు? దీనినిబట్టి చూస్తే మొదటి మారు కూడా వీరు ప్రయత్నము చేసివుంటారనీ, వజ్రములు తిరిగి ఆలయమునకు వచ్చాయని తెలిసి ప్రయత్నము చేస్తూ వుండి, చివరకు దోపిడీ చేశారని అర్థమగుచున్నది. వజ్రముల మీద చూపున్న వారు తపస్వి బాబా తప్ప మన దృష్ఠిలో ఎవరూ లేరు. అయితే ఒక్కమారుగా తెరమీదికి వచ్చిన ఈ రెండవ దొంగలు ఎవరైవుంటారు?

**రాఘవ :–** మొదటి దొంగలైన తపస్విబాబాగారికి మనమూ, మనకు తపస్వి బాబాగారు తెలుసు. ఇప్పుడు ఈ రెండవ దొంగ మనకు తెలియనట్లే తపస్విబాబాగారికి కూడా తెలిసివుండడు. అట్లే ఈ రెండవ దొంగకు మన విషయముగానీ, తపస్విబాబా విషయముగానీ తెలిసి ఉ ండదనుకొంటాను.

**రాజయోగానంద :–** మనము ఈ రెండవ దొంగ ఎవరైనది తెలుసుకోవలసిన అవసరమున్నది. ఈ విషయములో పోలీస్‌వారి దర్యాప్తు ఎలా జరుగు తుందో కొద్దిరోజులు చూచిన తర్వాత, వారికి అర్థముకాని పక్షములో మనము తెలుసుకొనుటకు ప్రయత్నిద్దాము.

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(భువనేశ్వరి దేవాలయములో జరిగిన దోపిడీ విషయమును దర్యాప్తు

చేయుటకు యస్.పి గారి సలహా మేరకు సి.ఐ.గారు పూనుకొన్నారు. ఆ దర్యాప్తులో భాగముగా పూజారిని ఇలా అడిగాడు.)

**సి.ఐ :–** దేవాలయములో మీరు రాత్రిపూట ఎన్ని గంటల వరకు ఉంటారు?

**పూజారి :–** ప్రతి దినము 9 గంటల వరకు ఉంటాను. తర్వాత గర్భగుడి తలుపులు మూసి, తాళమువేసి ధర్మకర్తకు ఒక తాళము చెవి ఇచ్చి, నావద్ద ఒకటి పెట్టుకొని పోతాను.

**సి.ఐ :–** ఆలయములో దోపిడీ జరిగిందని మొదట మీకు ఎప్పుడు తెలిసింది?

**పూజారి :–** మీరు వచ్చి చెప్పినప్పుడే నాకు తెలిసింది. మొదట నేను మీ మాటను నమ్మలేదు.

**సి.ఐ :–** దొంగలు వ్రాసిన కాగితము మీద తేదీని బట్టి ఫలానా రోజు దొంగతనము జరిగిందని అనుకొంటున్నాను. ఆ దినము మీరు గుడిలో ఎన్ని గంటల వరకు ఉన్నారు?

**పూజారి :–** ఆ దినము ఇక్కడ భజన కార్యక్రమము ఉండుట వలన రాత్రి 11 గంటల వరకు ఉండవలసి వచ్చినది. 11 గంటల తర్వాత అందరికీ తీర్థమిచ్చి గర్భగుడి తలుపులువేసి పోయాను.

**సి.ఐ :–** అలా రాత్రి తలుపులు మూసిపోయిన తర్వాత తిరిగి ఇక్కడికి ఎప్పుడు వచ్చారు?

**పూజారి :–** ఉదయము ఐదు గంటలకే వచ్చి తలుపులు తెరిచాను. ఉదయము ఐదు గంటలనుండి భజన కార్యము ఉండుట వలన ఐదు (5) గంటలకే తెరిచాను. లేకపోతే ఉదయము ఆరు (6) గంటలకు తలుపులు తీసేవాడిని.

**సి.ఐ :–** ఆ దినము భజన కార్యము ఎవరు చేశారు?

**పూజారి :–** భక్తులందరూ చేశారు. అది జఠాజూట స్వామిగారి భజన కార్యము. దాదాపు వారము రోజులు జరిగి ఉంటుంది.

**సి.ఐ :-** వారము రోజులు జరుగు భజన కార్యము ఎప్పుడు మొదలైంది?

**పూజారి :-** దోపిడీ జరిగిన రోజునుంచే ప్రారంభమైనది.

**సి.ఐ :-** జఠాజూట స్వామి ఎక్కడుంటారు?

**పూజారి :-** ఇక్కడే గుడికి ఎడమ ప్రక్కనవున్న పై అంతస్థులో ఉంటాడు. దేవస్థానము ఆయనకు ఉచితముగా ఆ ఇల్లును ఇచ్చింది.

**సి.ఐ :-** ఆ రోజు ఉదయము ఐదు గంటలకు తలుపుతీసినపుడు లోపల ఏదైనా క్రొత్తగా కనిపించడముగానీ లేక దొంగతనము జరిగినట్లు ఏదైనా తేడా కనిపించిందా?

**పూజారి :-** అలా ఏమీ కనిపించలేదు. అట్లు ఏమైనా కనిపించివుంటే అప్పుడే చెప్పి ఉండేవారము కదా!

**సి.ఐ :-** గర్భగుడిలోపల ఏమీ తెలియకపోయిన బయట ఏదైనా అనుమానముగా గానీ, క్రొత్తగాగానీ కనిపించిందా?

**పూజారి :-** గర్భగుడిలోపల ఏమీ కనిపించలేదు. కానీ గర్భగుడితలుపులు తెరుస్తూనే నేను ఇంకా గర్భగుడిలోనికి అడుగుపెట్టకనే బయట అలజడి లేచింది. అప్పుడే గుడిలోపల పాము కనిపించిందని భజనకు వచ్చిన వారంతా అన్ని వైపులా పరుగుతీసారు. పది పదిహేనుమంది పాము భయమునకు నన్ను త్రోసుకుంటూ గర్భగుడిలోనికి కూడా వచ్చారు. నేను కూడా భయపడి గర్భగుడిలోనికి వచ్చాను. గుడిలోపలినుండి నేను చూస్తూండ గానే ఎవరో కట్టెను తీసుకవచ్చి పామును చంపారు. పామును చంపిన తర్వాత అందరము బయటికి వచ్చాము. భయముతో కొందరు గర్భగుడి లోనికి వచ్చిన దానివలన గుడి అంతా కడిగి శుభ్రము చేసుకోవలసి వచ్చినది. ఆ అలజడి వలన ఆ దినము భజన కార్యము కూడ అరగంట ఆలస్యముగా మొదలుపెట్టారు.

**సి.ఐ :-** రాత్రి గర్భగుడి తలుపు వేయునపుడు గర్భగుడి అంతా చూచి,

అందులో ఎవరు లేనపుడు తలుపులు వేశావా? లేక నీవు తలుపులు వేసినపుడు గర్భగుడిలో ఎవరైనా ఉన్నారా?

**పూజారి :-** లోపల ఎవరైనా ఉంటే నేను ఎందుకు తలుపులు వేస్తాను. ప్రతి రోజు వేసినట్లే వేశాను. అంతేకాని వెదికి చూడలేదు. గర్భగుడిలోనికి ఎవరూ పోరు. లోపలికి పోయేదానికి అందరూ భయపడుతారు.

**సి.ఐ :-** నీవు గర్భగుడి తలుపులు వేసినపుడు నీకు తెలియకుండా లోపల ఎవరో ఉండి ఉంటారు. నీ ధ్యాసను ప్రక్కకు మళ్ళించి నీకు తెలియకుండా ఎవరో లోపలికి పోయి, రాత్రంతా లోపలేవుండి వజ్రములను దొంగిలించి తిరిగి తలుపులు తీయునపుడు ముందుగా వేసుకొన్న పథకము ప్రకారము పామును గుడిలో వదిలి గందరగోళమును సృష్ఠించి, కొందరు నిన్ను ప్రక్కకు త్రోసి నీకంటే ముందు గర్భగుడిలోనికి పోయివుంటారు. అప్పుడు లోపలవున్న దొంగ వారితో సులభముగా కలిసిపోయివుంటాడు. తర్వాత అందరితోపాటు బయటికి వచ్చివుంటాడు.

**పూజారి :-** గర్భగుడి తాళము తీసి తలుపులు త్రోస్తున్నట్లే వారు నన్ను ప్రక్కకు నెట్టి గబగబాలోపలికి పోయారు. వారు పోయిన తర్వాతే నేను పోయాను.

**సి.ఐ :-** ఆ దినము నిన్ను త్రోసి లోపలికి పోయినవారు ఎవరో నీకు గుర్తుందా?

**పూజారి :-** అందరూ జటాజూట స్వామి భక్తులే పోయారు. వారంతా నాకు తెలిసిన వారే. స్వామికి దగ్గర ఉండువారే.

**సి.ఐ :-** వారంతా ఎటువంటి వారు?

**పూజారి :-** వారు అందరూ సాత్త్వికులు, అందరూ మంచివారే, నాకు బాగా పరిచయమున్నవారే.

(ఈ విధముగా సి.ఐ. తెలివిగా పూజారిని ఇంటరాగేషన్ చేసిన తర్వాత ఆ దొంగతనము పథకము ప్రకారము జరిగిందనే నిర్ణయానికి వచ్చి ఆ విషయమును అంతటిని యస్.పి గారికి తెలియజేశాడు. అప్పుడు యస్.పి గారికి విషయమంతా అర్థమైనది. జఠాజూట స్వామి వద్దకు పోయి అతని చేతి వ్రాతను తీసుకురమ్మని చెప్పాడు. అలాగేనని సి.ఐ అక్కడినుండి వచ్చి రెండవరోజు జఠాజూట స్వామివద్దకు పోయాడు. సి.ఐ. స్వామివద్దకు పోకనే కుడిచేతి హస్తమునకు గాయమునకు కట్టుకట్టినట్లు బ్యాండేజ్ కట్టుకొన్నాడు. తర్వాత చేయిని కొద్దిగ పైకి పట్టుకొని జఠాజూట స్వామివద్దకు పోయాడు. అక్కడకు పోయి స్వామితో ఇలా మాట్లాడినాడు.)

**సి.ఐ :-** స్వామిగారూ! ఈ మధ్యన భువనేశ్వరి దేవాలయములో దొంగ తనము జరిగినట్లు మాకు తెలిసి దానిని గురించిన దర్యాప్తు చేయుచున్నాము. వారము దినములు మీ భజన కార్యము అక్కడ జరిగిందని తెలిసింది. అందువలన ఆ దొంగతనమును గురించి నేను అడుగునది ఏమంటే, మీ భజనలో ఎవరైనా క్రొత్త వ్యక్తులుగానీ, అనుమానాస్పద వ్యక్తులుగానీ మీకు ఏమైనా కనిపించారా? అట్లు ఏమైనా మీకు తెలిసివుంటేగానీ, తెలియక పోయినగానీ వివరముగా వ్రాసి ఇవ్వండి. నేను వ్రాసుకోనే దానికి నా చేయి బాగలేదు. మీకేమైనా తెలిసివుంటే వ్రాయండి, తెలియకపోయినా ఏమి తెలియదనే వ్రాసి ఇవ్వండి.

**స్వామి :-** మా భజనకు క్రొత్తవాళ్ళు కూడా చాలామంది వచ్చారు. వారు ఎవరు, ఏ ప్రాంతమువారను విషయము మాకు తెలియదు కదా!

**సి.ఐ :-** మేము సేకరించిన సమాచారమంతయూ యస్.పి గారికి పంపు చుంటాము. అందరివద్దా విచారించినట్లు ఆయనకు తెలియాలి కదా! మీరు

వ్రాసి ఇచ్చిన సమాచారమును పై అధికారులకు అందజేస్తాము. మా దర్యాప్తుకు మీరు కూడా సహకరించాలి.

**స్వామి :-** సరే అలాగే వ్రాసి ఇస్తాను. క్రొత్తవారున్నారు కానీ వారు ఎవరో తెలియదనే వ్రాస్తాను.

(అని స్వామి తను ఏమి వ్రాయాలనుకొన్నాడో అదే వ్రాసి ఇచ్చాడు. దానిని సి.ఐ, యస్.పి గారికి తీసుకపోయి చూపించాడు. యస్.పి. గారు దేవాలయమునకు వ్రాసిన లెటర్‌ను, ఇప్పుడు వ్రాసిన పేపరును బాగా చూచి రెండిటిలోను ఉన్నది ఒకే చేతివ్రాత అని గ్రహించాడు. దీనితో ఈ దొంగతనము స్వామియే చేయించాడని యస్.పి గారికి అర్థమైంది. కానీ కొంతకాలము ఆగి కాచుకొనివుండి ఆ దొంగతనమునకు సంబంధించిన ఆధారములను సేకరించాలనుకొన్నాడు. అప్పటికీ ఆ విషయమును సి.ఐ గారికి కూడా చెప్పకుండా పంపివేశాడు. తర్వాత ఆ కేసును సి.ఐ.డి పోలీస్‌లకు అప్పచెప్పి తొందరగా సాక్ష్యాధారములు సంపాదించమని ఆదేశించాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(ఈశ్వర్ జీవితములో ఒక్కొక్క సంవత్సరము గడిచిపోతూ ఉన్నది. ఈశ్వర్ మాత్రము అందరి దృష్ఠిలో మంచివాడుగా పేరు తెచ్చుకొన్నాడు. ఒక దినము అతను స్కూల్‌కు పోవుచున్నాడు. ఆ దారిలోనేవున్న ఒక ఇల్లు అగ్ని ప్రమాదానికి గురి అయినది. అది పెద్ద ఇల్లు, ఆ ఇంటిలో దాదాపు 20 మంది ఒకే కుటుంబమువారున్నారు. ఆ ఇంటిలో నుండి అందరూ బయటపడ్డారు. కానీ చివరకు చూచుకోగా నాలుగు సంవత్సరముల అబ్బాయి ఒక రూములో నిద్రిస్తుండగా ఎవరూ చూచుకోకుండా అందరూ బయటికి వచ్చారు. ఇంటి చుట్టూ, ఇంటిలోపల కొంత భాగము మంటలు అంటుకొని భీకరముగా మండుచున్నది. లోపల

నిద్రించుచున్న బాలుడులేచి అరవను మొదలుపెట్టాడు. ఆ బాలుని తల్లి హృదయ విదారకముగా పిల్లవాని కొరకు ఏడుస్తున్నది. ఆమెను కొందరు పట్టుకొన్నారు. లోపలికి పోయి ఆ బాలున్ని రక్షించే దానికి ఎవరికీ ధైర్యము చాలడములేదు. లోపలికి పోతే తిరిగి బయటికి రాలేమని అందరూ అనుకొంటున్నారు. అలాంటి పరిస్థితిలో ఈశ్వర్ అక్కడికి పోయాడు. తల్లి బాధనూ, ఇతరుల నిస్సహాయతను చూచాడు. ఈశ్వర్ ఏమాత్రము ఆలోచించకుండా తన పుస్తకముల బ్యాగ్‌ను ప్రక్కకు విసరి ఒక్కమారుగా ఇంటిలోనికి మంటల మధ్యలో దూరి పోయాడు. అది చూచిన అందరూ భయపడిపోయారు. లోపలవుండే బాలునితో పాటు ఈశ్వర్ కూడా అగ్నికి ఆహుతి అయిపోతాడని అందరూ అనుకొన్నారు. ఈశ్వర్ లోపలికి పోయిన విషయమును జమీందారు ఇంటిలో తెలుపగా, ఆ ఇంటిలోని వారందరూ పరుగు పరుగున అక్కడికి వచ్చారు. ఈశ్వర్ లోపలికి పోయి పది నిమిషములైనా బయటికి రాలేదు. అక్కడున్న వారందరూ లోపలవున్న ఇద్దరి మీద ఆశను వదలు కొన్నారు. మంటలు భారీస్థాయికి చేరుకొన్నాయి. అప్పుడు ఆ మంటల మధ్యలోనుండి ఈశ్వర్ నాలుగు సంవత్సరముల పిల్లవాడితో సహ బయటికి వచ్చాడు. వారు అలా మంటలలోనుండి వచ్చినప్పటికీ ఈశ్వర్ శరీరము మీదగానీ, ఆ బాలుని శరీరముమీదగానీ ఒక్కచోట కూడా కాలలేదు. చిన్న బొబ్బకూడా కనిపించ లేదు. అలావారు రావడము అందరికీ ఆశ్చర్యమైనది. ఆ చిన్నపిల్లవాని తల్లి తన కొడుకును రక్షించినందుకు ఈశ్వర్ కాళ్ళమీద పడింది. ఈశ్వర్ ఇంటినుండి వచ్చినవారు ఈశ్వర్‌ను ఇంటికి తీసుకొని పోయారు. ఆ సంఘటనతో ఆ ఊరిలోగానీ, ప్రక్క ఊర్లలోగానీ ఈశ్వర్ అంటే తెలియని వారేలేరు.)

× × × × × × × × × × × × × × × × × × × × × × ×

(యస్.పి గారి ఆదేశానుసారము సి.ఐ.డి.పార్టీ పోలీసులు వజ్రాల

దొంగతనములోని ఆధారముల కొరకు శోధిస్తూవుండిరి. సి. ఐ.డి. పోలీసు ఒకడు జటాజూట స్వామి భక్తులలో కలిసిపోయాడు. ఒక సంవత్సరము రోజులుగా అదే పనిలో నిమగ్నమై స్వామి భక్తులలో ఒక భక్తునిగా తయారై పోయాడు. సంవత్సర కాలమునుండి అనేక భక్తి కార్యములలో పాల్గొనుచూ సేవచేస్తూ స్వామికి కొంత సన్నిహితముగా మారిపోయాడు. ధనుంజయ అను సి.ఐ.డి పోలీస్ పూర్తి స్వామి భక్తునిగా మారిపోయాడు. అటువంటి సమయములో స్వామితో సన్నిహితులుగానున్న వారంతా ధనుంజయతో బాగా కలిసివుండిరి. అలా ధనుంజయ తమ మనిషే అనునట్లు స్వామి దగ్గరగానీ, మిగత భక్తుల దగ్గరగానీ మెలగజొచ్చెను. అలాంటి సమయము లో ఒక దినము జటాజూట స్వామివద్దకు పోయి ఇలా అన్నాడు.)

**ధనుంజయ :-** స్వామీ! నాకు తెలిసిన వ్యక్తి ఒకడు ఒక వజ్రాలనిధిని చూపుతానన్నాడు. దానిని తీసి ఇస్తే రెండింతలు మనకు ఇచ్చి మూడింతలు అతను తీసుకొంటానన్నాడు. దానికి నేను ఇద్దరము సమానముగా పంచు కొందామని చెప్పాను. అతను చాలా రోజులనుండి నా మాటను ఒప్పుకోలేదు. తర్వాత ఒకవంతు మనకు రెండు వంతులు తనకు అని చెప్పుతూవచ్చాడు. దానికి నేను ఒప్పుకోలేదు. చాలా రోజుల తర్వాత ఇప్పుడు నేను చెప్పినట్లే సగభాగము తీసుకొనునట్లు ఒప్పుకొన్నాడు. దానిని ఎలా తీయాలో నాకు కూడా తెలియదు. మీరు దానికి ఏమైనా ఉపాయము చెప్పండి.

(ధనుంజయ చెప్పిన మాటను విన్న జటాజూట స్వామి దీర్ఘముగా యోచించి ఇలా అన్నాడు.)

**జటాజూటస్వామి :-** ముందు నిధిని చూపమను, తర్వాత రెండు రోజుల్లో తీసి ఇస్తానని చెప్పు. అతను నీకు ఒక భాగము ఇచ్చి రెండు భాగములు

అతనే తీసుకొనినా ఫరవాలేదు. నేను నీకు నిధిని సులభముగా తీయుటకు ఉపాయమును చెప్పెదను. నిధి ఉన్నచోటును ముందు చూపితే ఒక దినము ఆ స్థలములో పూజ నిర్వహించిన తర్వాత రెండవ దినము నిధి సులభముగా లభించును. నీవు ముందు నిధివున్న జాగాను తెలుసుకొనిరా, తర్వాత అక్కడ ఏమి పూజ చేయాలో నేను చెప్పుతాను. దానిప్రకారము ఆ నిధిని సులభముగా తీసి ఇవ్వవచ్చునన్నాడు.

**ధనుంజయ :-** అలాగే స్వామీ! ఈ రోజే ఆ విషయమును అతనితో మాట్లాడి వస్తాను.

(ఆ విధముగా పోయిన ధనుంజయ మరుసటి దినమే జఠాజూట స్వామి దగ్గరకు వచ్చాడు. ధనుంజయ స్వామిని చూచి నవ్వుతూ ఇలా అన్నాడు.)

**ధనుంజయ :-** అడిగివచ్చాను స్వామీ, అతను సంతోషముతో ఆ స్థలము నాకు చూపించాడు. రేపు పూజచేసి ఎల్లుండి నిధిని తీసి ఇస్తామని చెప్పాను. ఇక మీరు ఎట్లు చెప్పితే అట్లు చేస్తాను.

**జఠాజూటస్వామి :-** నేను ఆ స్థలమును చూచి ఆ స్థలమునుబట్టి ఎటువంటి పూజ చేయాలో చెప్పెదను. ముందు మనము ఆ స్థలమును చూచి రావాలి.

(స్వామి మాట ప్రకారము ధనుంజయ స్వామిని పిలుచుకొని పోయి 20 మైళ్ళదూరములో ఒక గుట్టప్రక్కన ఒక స్థలమును చూపాడు. ఆ స్థలమును చూచిన జఠాజూట స్వామి ఇలా అన్నాడు.)

**జఠాజూటస్వామి :-** ఇది రేగడి నేల కావున రేపు సాయంత్రము మూడు గంటలకు పూజచేయాలి. ఈ పూజలో రక్తము ఉండకూడదు. అనగా జంతుబలి పనికి రాదు. అందువలన ఎర్రని కుంకుమ నీళ్ళను వాడవలెను. ఈ పూజలో ఈ రెండే ముఖ్యము, మిగతావన్నీ సాధారణ పూజయే చేయవచ్చును.

(అలా స్వామి చెప్పిన ప్రకారము చేస్తానని ధనుంజయ చెప్పాడు. ఇద్దరూ కలిసి వెనక్కు వచ్చారు. అలా వచ్చిన తర్వాత ధనుంజయ రేపటి పూజకు ఏర్పాట్లు చేసుకుంటానని వెళ్ళిపోగా జటాజూట స్వామి తన మందిరమునకు వచ్చాడు.

మరుసటి దినము ధనుంజయ ఆ స్థలములో పూజచేయవలసి వున్నది. అంతలోపల ఈ రోజు రాత్రికే జటాజూటస్వామి తనవద్దనున్న నకిలీ వజ్రములను ఆ స్థలములో ఒక అడుగులోతులోనే ఉంచవలెనను కొన్నాడు. అలా ఉంచుట వలన రేపు ధనుంజయ అక్కడ పూజచేసి కొద్దిగ త్రవ్వినంతమాత్రముననే అతనికి తాను అడుగులోతులో ఉంచిన వజ్రములు కనిపించును. అపుడు అతను వజ్రములు దొరికినవను తృప్తితో అక్కడినుండి పోవును. అలా అతను తానువుంచిన నకిలీ వజ్రములను తీసుకపోయిన తర్వాత రెండవ రోజుపోయి భూమిలోపలనున్న అసలైన వజ్రముల నిధి తాను తెచ్చుకోవచ్చుననునది జటాజూట స్వామి మనసులోనున్న పథకము.

రేపు ఉదయమే నిధివున్న చోట పూజచేయాలని పోయిన ధనుంజయ, స్వామిగారికి భక్తునిగా నటిస్తున్న ఇన్వెస్టిగేషన్ చేయుచున్న పోలీసు. కావున ధనుంజయ మనసులోని పథకము ఏమనగా! నిధి ఉన్న స్థలమును చూపించిన తర్వాత జటాజూటస్వామి తన దగ్గరున్న భువనేశ్వరి ఆలయములో నుండి దొంగిలించిన నకిలీ వజ్రములను అక్కడికి తెచ్చిపెట్టి, అసలైన వజ్రాల నిధిని తాను కొట్టివేయాలని అనుకొనుననీ, ఆ పని చేయుటకు ఆ రోజు రాత్రికే నకిలీ వజ్రములను తీసుకొని నిధి ఉన్నదని తాను నమ్మించిన స్థలము వద్దకు వచ్చుననీ, అపుడు స్వామివద్ద వజ్రములున్నట్లే రెడ్‌హ్యాండెడ్‌గా జటాజూట స్వామిని పట్టుకోవచ్చునని అనుకొన్నాడు. అంతేకాక ఆ విషయమునంతటినీ యస్.పి గారికి చెప్పి స్వామిని అరెస్టు చేయుటకు కొందరు పోలీసులను గుట్టదగ్గర చెట్ల

చాటునుండి గమనించునట్లు చేసి స్వామి వచ్చిన వెంటనే అతనిని అరెస్టు చేయుటకు తగిన ఏర్పాట్లు చేసిపెట్టాడు. ఈ విధముగా భక్తునిగా మారువేషములోనున్న ధనుంజయ ప్లాన్ ఉండగా, స్వామి ఆ రాత్రికే తనవద్దనున్న వజ్రములను ఎవరికీ తెలియకుండా ధనుంజయ చూపిన స్థలములో ఉంచుటకు తన ప్లాన్ ప్రకారము తాను వచ్చాడు. చీకటిలో తన కోసమే పోలీసులు చెట్లచాటున దాగి ఉన్నారను విషయము ఏమాత్రము జటాజూటస్వామికి తెలియదు. కావున స్వామి ధైర్యముగా అక్కడికి వచ్చి అడుగులోతు త్రవ్వను మొదలు పెట్టాడు. అదే అదనుగా అక్కడే నక్కివున్న పోలీసులు వచ్చి జటాజూట స్వామిని, అతనివద్ద నున్న వజ్రములతో సహా పట్టుకొన్నారు. ఊహించని ఆ పరిణామముకు స్వామి ఖంగుతిన్నాడు. అరెస్టు చేసిన పోలీసులు స్వామిని యస్.పి ముందర హాజరు పరిచారు. అప్పుడు యస్.పి గారు స్వామిని ఇలా ఇంటరాగేషన్ చేశాడు.)

**యస్.పి :-** స్వామీ! మీవద్దనున్న వజ్రములు ఎక్కడివి?

**జటాజూట :-** అవి చాలా కాలమునుండి మాదగ్గరే ఉన్నాయి.

**యస్.పి :-** చాలా కాలమునుండి అంటే ఎంత కాలమునుండి?

**జటాజూట :-** మా పెద్దల కాలము నుండి ఉన్నాయి.

**యస్.పి :-** మీ పెద్దల కాలమునుండి ఉన్న వజ్రములను మీరు రాత్రివేళ అక్కడికి ఎందుకు తీసుకెళ్ళారు?

**జటాజూట :-** కొంత కాలము అక్కడ దాచిపెట్టాలని తీసుకెళ్ళాము.

**యస్.పి :-** మీరు వాటిని దాచవలెనని ఎందుకు అనుకొన్నారు?

**జటాజూట :-** భద్రత కోసము.

**యస్.పి :-** అక్కడే ఎందుకు దాచాలనుకొన్నారు?

**జటాజూట :-** అక్కడ గుట్ట గుర్తుగా ఉంటుందనుకొన్నాను.

**యస్.పి :-** ఇంతవరకు నీవు చెప్పినదంతా బాగానే ఉంది. ఇందులో నీ తప్పు ఏమీ లేదు. కానీ మేము నిన్నటి దినము నిన్ను అరెస్టు చేయకముందే ధనుంజయను అరెస్టు చేసి విచారించాము. మాకు అన్ని విషయములు చెప్పాడు. విచారణలో అన్ని విషయములు తెలిసిన తర్వాత కూడా మీరు చెప్పిన మాటను నమ్మమంటారా! మేము దొంగిలించినది నకిలీ వజ్రములని దేవాలయమునకు వ్రాసిన మీ హస్తములతో వ్రాసిన ఉత్తరమును చూచిన తర్వాత కూడా మీరు చెప్పిన మాటను నమ్మమంటారా? రేపు పూజ చేయమని ధనుంజయకు చెప్పి, అతనిని మోసము చేయుటకు రాత్రికి రాత్రే అక్కడికి పోయి, ప్రత్యక్షముగా దొరికిన తర్వాత కూడా మీరు చెప్పిన మాటను నమ్మమంటారా? సరే! మీరు చెప్పే ప్రతిమాటను నేను గ్రుడ్డిగా నమ్మేస్తాను. నేను నమ్మినా ధనుంజయ నిన్ను నమ్మడే! ఇపుడు అతడే నిన్ను అడుగుతాడు. అతనికి నీవు ఏమి చెప్పుతావో మేము ప్రక్కనుండి వింటాము.

(అంతలోనే ధనుంజయ చేతులకు బేడీలు తగిలించుకొని అతనిని అక్కడికి తెచ్చారు. అపుడు ధనుంజయ స్వామిని చూచి ఇలా అన్నాడు.)

**ధనుంజయ :-** స్వామీ! నేను నిధిని తీయుటకు పోవుచున్నానని పోలీసులకు చెప్పి పట్టించావు. నీకు ఇది న్యాయమేనా?

**జటాజూట :-** నేను నిన్ను గురించి ఎవరికీ ఏమీ చెప్పలేదు.

**ధనుంజయ :-** అయితే నీవు ఎందుకు అక్కడికి పోయావు? నన్ను ఇక్కడ పట్టించి అక్కడికి పోయి నీవు నిధిని కొట్టివేయాలనే కదా! నీ ఉద్దేశ్యము.

**జటాజూట :-** లేదు నిన్ను పట్టించాలని నేను ఎప్పుడూ అనుకోలేదు.

**ధనుంజయ :-** అయితే నీవు అక్కడికి ఎందుకు పోయావు? అక్కడికి పోయి

నేను చూపిన నిధిని నీవు ఎందుకు తీసుకొన్నావు? మీరు ఒక స్వామియైవుండి కూడా అబద్ధము చెప్పితే ఎలా? నీవు ఆ నిధిని తీసుకొన్నట్లు నాకు తెలిసింది. నీ దగ్గర ఆ నిధి వజ్రములు దొరికినట్లు కూడా తెలిసింది. ప్రత్యక్షముగా వజ్రములు దొరికినా అబద్ధము చెప్పడములో అర్థములేదు.

(ధనుంజయ చెప్పిన మాటలు విని స్వామి సందిగ్ధములో పడి పోయాడు. ఇపుడు రెండు వైపులా ఉచ్చు ఉన్నదని నిధి తీసుకోలేదనినా తన దగ్గర దొరికిన వజ్రములను గురించి ఉచ్చు తగులుకోక తప్పదు. ఒకవేళ తనదగ్గరున్న వజ్రములు నిధిలో దొరికినవని చెప్పినా ప్రభుత్వ అనుమతి లేకుండా నిధిని తీయడము నేరమే అవుతుంది. కావున అట్లు చెప్పినా ఉచ్చు తగులుకోగలదు. ఇన్ని చిక్కులకంటే నిజము చెప్పి శిక్షను తగ్గించుకోవడము మంచిదనుకొన్నాడు.)

**యస్.పి :-** ధనుంజయ మాటకు ఏమి సమాధానము చెప్పగలరు?

**జటాజూట :-** ఒక్క విషయము మాత్రము సత్యము. నేను ధనుంజయ చూపిన నిధిని తీయలేదు. నావద్దవున్న నకిలీ వజ్రములను అక్కడ పెట్టి రావాలనుకొన్నాను. ఆ నకిలీ వజ్రములను ధనుంజయ తీసుకొని పోయిన తర్వాత, ఆ నిధిలోనున్న వజ్రములను తీసుకోవాలనుకొన్నాను. నేను ధనుంజయను మోసము చేయాలనుకొన్నాను. కానీ మోసము జరుగకముందే నేను మీకు దొరికిపోయాను. ఇక నావద్దవున్న వజ్రములు మీరు చెప్పినట్లు భువనేశ్వరి దేవాలయములోనివే. నా మనుషులచేత నేనే వాటిని దొంగి లించాను. అవి నావద్దకు చేరిన తర్వాత మేము దొంగిలించిన వజ్రములు నకిలీవని తెలిసింది. ఇప్పుడు సమయము వచ్చింది కాబట్టి నిధివద్ద అడుగు లోపలే నావద్దగల నకిలీ వజ్రములను ఉంచిపోవాలనుకొన్నాను. అలా ఉంచిన వజ్రములను నిధిగా భావించి ధనుంజయ వాటిని తీసుకొని పోయిన

తర్వాత, ఆ నిధిలోని అసలైన వజ్రములను తీసుకోవాలనుకొన్నాను. కానీ నేను నా నకిలీ వజ్రములతో అక్కడికి పోగానే నావద్దనున్న వజ్రములతో సహా దొరికిపోయాను. జరిగిన వాస్తవ సంగతి ఇంతే. ఇంతకంటే మించి ఏమీలేదు.

**యస్.పి :-** నీవు నిజము ఒప్పుకొన్నావు. కావున నీకు శిక్ష తగ్గేలా మేము ప్రయత్నము చేస్తాము. నీవు ఇంకా కొన్ని నిజములు చెప్పవలసి వున్నది. భువనేశ్వరి దేవాలయములోని అసలైన వజ్రములు పోయి వాటి స్థానములో నకిలీ వజ్రములు చేరిపోయాయి. ఆ విషయము నీకు తెలియక అక్కడున్నది నిజమైన వజ్రములనే ఉద్దేశ్యముతోనే వాటిని దొంగిలించారు. అవి మీ చేతికి వచ్చి నకిలీ వజ్రములని తెలిసిన తర్వాత దేవాలయ కమిటీ వారికి నీవు లేఖ వ్రాశావు. ఆ లేఖలో గుడిలోనివి నిజమైన వజ్రములు కాదని పేర్కొన్నావు. అలా వ్రాయడములో నీ ఉద్దేశ్యము ఏమిటి?

**జటాజూట :-** అలా వ్రాయుట వలన అసలైన వజ్రముల ప్రస్తావన ఎక్కడో ఒకచోట తెలుస్తుందని అనుకొన్నాను. అవి నకిలీ వజ్రములని తెలుపడము వలన ఇటు పోలీసువారు అసలైన వజ్రముల కొరకు విచారిస్తారు కదా! అప్పుడు వాటి ఆచూకీ తెలుస్తుందనీ, తెలిసిన తర్వాత వాటిని ఎలా కాజేయాలో అప్పుడు ఆలోచిస్తామని అనుకొన్నాను.

(ఈ విధముగా జటాజూట స్వామి చట్టము చేతిలో తాను దోషిగా ఒప్పుకొన్నాడు. కానీ అంతవరకు ధనుంజయ ఒక పరిశోధనా విభాగపు (సి.ఐ.డి) పోలీస్ అని జటాజూటస్వామికి తెలియదు. ధనుంజయ చాలా తెలివిగా పనిచేసి, జటాజూటస్వామిని తప్పించుకొను అవకాశము లేకుండా చేసినందుకు యస్.పి. గారు ధనుంజయను అభినందించి, తాటిమాను మునెప్ప క్రైమ్ ఫైలును ధనుంజయకు ఇచ్చి, అతన్ని కూడ సాక్ష్యాధారములతో పట్టించమని చెప్పాడు. జటాజూట స్వామిని కోర్టుకు అప్పజెప్పి ఆ కేస్

తొందరగా ట్రైల్‌కు వచ్చునట్లు చేశారు. చివరకు జఠాజూట స్వామికి శిక్ష పడింది. ఆయన జైలుకెళ్ళడముతో జఠాజూటస్వామి అధ్యాయము అంతటితో ముగిసినట్లయినది.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(జఠాజూట స్వామి దొరికిపోయి జైలుకెళ్ళడమును పత్రికలు ప్రచారము చేయగా ఆ వార్త అందిరికీ తెలిసిపోయింది. అట్లే మునెప్పకూ, మునెప్ప మనుషులకూ విషయము తెలిసిపోయింది. మునెప్ప అసలైన వజ్రాల కొరకు ప్రయత్నము చేయమని తన తమ్ముడైన వెంకుకు చెప్పాడు. వెంకు తనకు కూడా స్నేహితుడైన హీరోతో కలిసి వజ్రముల ఆచూకీ కొరకు తీవ్రముగా ప్రయత్నించను మొదలు పెట్టారు. తమ చేతినుండి పాము జారిపోయి నప్పటినుండి కొన్ని సంవత్సరములు వజ్రాల ఆచూకీ తెలియక పోవడము వారు జీర్ణించుకోలేక పోవుచున్నారు. ఇక ఏదో ఒక ప్రయత్నము చేయాలనుకొన్నారు. వారు అట్లుండగా పై అధికారులనుండి ప్రశంసలు పొందిన ధనుంజయ, మునెప్ప ముఠాను ఎలాగైనా పట్టుకోవాలనుకొన్నాడు. దాని కొరకు తమ డిపార్టుమెంటులోని నలుగురు వ్యక్తులను తీసుకొని ఐదుమంది ఒక బృందముగా ఏర్పడినారు. ఆ ఐదుమంది సభ్యుల గుంపులో ధనుంజయ గుంపు నాయకుడుగా ఉండునట్లు మాట్లాడుకొన్నారు. ఈ మారు ధనుంజయ, ఆ నలుగురు సభ్యులు దొంగల ముఠా అవతారము ఎత్తారు. ఈ ఐదుగురు ముందే ఏర్పాటు చేసుకొన్నట్లు, ఒక ఘాట్‌రోడ్డులో పోలీసుల కారును ఆపి నలుగురు పోలీసులను, ఒక యస్.ఐ ని తాళ్ళతో కట్టివేసి వారు తెస్తున్న పది లక్షల ట్రెజరి డబ్బును దోచుకొని పోయారు. ఆ దోపిడీ ఎలా జరిగినదీ వివరిస్తే, ఒక ఘాట్‌రోడ్డులో ఐదుమంది దొంగలగుంపు తమకారును రోడ్డుకు అడ్డముగా ఆపి, అందులో ముగ్గురు ఇద్దరిని కొట్టుచుండిరి. అంతలోనే పోలీసు

వారు అక్కడికిపోయి రోడ్డులో కారు నిలిపివుండడమూ, ముగ్గురు మనుషులు ఇద్దరిని కొట్టుచుండడమునూ చూచి, తాగిన మత్తులో పోట్లాడుచున్నారనుకొని తమవద్దనున్న లాఠీకట్టెలను తీసుకొని కారు దిగిపోయి, ముగ్గురిని పట్టుకొని ఆపి ఎందుకు వారిని కొట్టుచున్నారని అడిగారు.

అప్పుడు అక్కడ పోట్లాడుచున్న ఐదుమంది ఒక్కమారు వారివద్ద నున్న రివాల్వార్‌లు తీసి పోలీసులకు గురిపెట్టి కదలకూడదనీ, చేతులు పైకి ఎత్తమని తాము దొంగలమని చెప్పారు. అకస్మాత్తుగా జరిగిన ఆ సంఘటనకు బిత్తర పోయిన పోలీసులు, ఏమి చేయునది లేక చేతులు ఎత్తి నిలబడ్డారు. దొంగలలో ఇద్దరు వచ్చి వారివద్దనున్న తాళ్ళతో పోలీసుల చేతులు కట్టి వేశారు. తర్వాత అందరూ కలిసి రోడ్డుకు దూరముగా ప్రక్కకు పోలీసులను తీసుకపోయి అక్కడ చెట్టుకొకరిని కట్టివేసి, రోడ్డుమీదకు వచ్చి తమ కారులో పారిపోయారు. తర్వాత పోలీస్ స్టేషన్‌కు ఫోన్‌చేసి మీ పోలీస్‌లను ఫలానాచోట కట్టి వేశామని, ట్రెజరీడబ్బును మేము దోచుకున్నా మని చెప్పారు. ఆ దోపిడీతో ప్రజలలో పోలీసులకు మర్యాద పోయినట్లయి నది. వారిని ఎలాగైనా పట్టుకొని తీరుతామని పోలీసులు ప్రకటించారు. ఈ విషయమునంతటినీ పేపర్‌లో గమనించిన మునెప్ప మరియు అతని ముఠాలోని అందరూ ఆశ్చర్య పోయారు. తమకంటే మించిన దొంగలు తయారైనారని అనుకొన్నారు. పోలీసులనే కట్టివేసి ట్రెజరీ డబ్బును దోచుకున్న వారు చాలా ధైర్యముగల దొంగలని అనుకొన్నారు. కొంత కాలానికి ఆ క్రొత్త దొంగల నాయకుడు ధనుష్ అనీ, వారు అన్ని రాష్ట్రములలో పెద్ద పెద్ద దోపిడీలు చేశారనీ, ప్రస్తుతము వారు ఆంధ్రరాష్ట్రములో ఉన్నారనీ, వారు బ్యాంకులను దోచుకోవాలను పథకముతో ఉన్నారనీ, అందువలన

బ్యాంకులన్నీ అప్రమత్తముగా ఉండవలెననీ, పోలీసులు న్యూస్‌పేపర్లలో తెలిపారు. అలా వచ్చిన వార్తను మునెప్ప మరియు అతని సభ్యులు అందరూ చూచారు. ఆ దొంగల నాయకుడైన ధనుష్‌తో ఎలాగైనా పరిచయము చేసుకోవాలనుకొన్నాడు.

మారువేషములో దొంగ ధనుష్‌వలె నటిస్తున్న ధనుంజయ కూడా మునెప్ప మనుషలను కలుసుకోవాలని ఉన్నాడు. మునెప్ప మనుషులను ముందు నుండి అనుమానిస్తున్న ఇంటలిజెన్స్ వారు ఒకనాడు మునెప్ప ముఠాలోని నూకా అనారోగ్యముతో ఒక ప్రైవేటు ఆసుపత్రిలో చేరినట్లు ధనుంజయకు తెలిపారు. అప్పుడు ధనుంజయగుంపులోని సురేష్ అనునతడు కూడా అదే ఆసుపత్రిలో చేరునట్లు ధనుంజయ చెప్పిపంపాడు. సురేష్ ధనుంజయ చెప్పినట్లు ఆస్పత్రిలో చేరాడు. మునెప్ప మనిషి ఫలానావాడని ధనుంజయ ముందే తెలిపిన దానివలన, సురేష్ అతనితో మాట్లాడుటకు అవకాశము ఏర్పరుచుకొన్నాడు. సాయంకాలము మునెప్ప మనిషితో సురేష్ ఇలా మాట్లాడినాడు.)

**సురేష్ :-** నీకు ఏమి జబ్బు బ్రదర్?

**నూకా :-** న్యూమోనియా అని డాక్టరు చెప్పాడు.

**సురేష్ :-** న్యూమోనియా అంటే ఊపిరితిత్తుల జ్వరము అంటారు కదా!

**నూకా :-** అవును అదే.

**సురేష్ :-** ఎన్ని రోజులు ఉండమన్నారు?

**నూకా :-** ఒక వారము రోజులు ఉండమన్నారు.

**సురేష్ :-** నాకు కూడా నెల క్రిందట ఇదే జ్వరము వచ్చింది. అప్పుడు మూడురోజులే ఆస్పత్రిలో ఉన్నాను.

**నూకా :-** న్యూమోనియా రాత్రిపూట చలిలో మేల్కొనివుంటే వస్తుందట. నీకు ఎందుకు వచ్చింది?

**సురేష్ :-** ఆ మాట వాస్తవమే, నేను కూడా ఆరురోజుల క్రిందట చలిలో రాత్రంతా మేల్కొన్నాను. దానికే నాకు ఇప్పుడు అదే జ్వరము వచ్చింది. ఇప్పుడు చలికాలము కదా! అందువలన చాలామందికి ఈ రోగమే వస్తుంది. అయినా ఇంటిలో చలి తగలకుండా ఉండేవారికి రాదు కదా!

**నూకా :-** ఇంట్లో ఉండే వారికి రాదేమో! కానీ నేను బయట ఉండుట వలన వచ్చింది.

**సురేష్ :-** ఏమి చేస్తాము, కొన్ని సమయాల్లో తప్పనిసరిగా బయట ఉండవలసిన పనిపడుతుంది. నాకు ఒకరోజు రాత్రిపూట డ్యూటీ చేయవలసి వచ్చింది. ఒకరోజు చలిలో ఉంటూనే ఈ జ్వరము వచ్చింది. అందువలన రాత్రిపూట ముక్కులకు గుడ్డను అడ్డముగా కట్టుకొమ్మని డాక్టరు చెప్పాడు.

**నూకా :-** నీవు ఏమి డ్యూటీ చేస్తావన్నా.

**సురేష్ :-** డ్యూటీ అంటే ప్రభుత్వ ఉద్యోగము కాదు. కానీ స్వంత డ్యూటీ అనుకో, బ్రతికేదానికి ఏదో ఒకటి చేయాలి కదా!

**నూకా :-** ఇంతగా పరిచయమేర్పడిన తర్వాత నాకు చెప్పేదానికి మొహమాటు పడుచున్నావు. బ్రతికే దానికి ఏ డ్యూటీ చేస్తే ఏమిటి? నీ డ్యూటీ నాకు చెప్పకూడదా?

**సురేష్ :-** నీకు చెప్పే దానికి ఏముందన్నా? నా డ్యూటీని చెప్పాలంటే నాకే సిగ్గయినట్లుంది. నీవు ఏమీ అనుకోనంటే చెప్పుతాను. నేను చిన్నచిన్న దొంగతనములు చేసి బ్రతుకుతుంటాను.

**నూకా :-** నీవు నాముందర సిగ్గుపడవలసిన పనిలేదు. నేనూ నీలాంటి దొంగనే, నేను ఏమి సిగ్గుపడలేదు కదా! నీవు చిన్న దొంగవే అయితే నేను

నీకంటే పెద్దదొంగను. దానికేముంది బ్రతికేదానికి ఎవరి పని వారిది.

**సురేష్ :–** అయితే నాకు ఒక సహాయము చెయ్యన్నా, బ్రతికినన్నాళ్ళు నీ పేరే చెప్పుకొంటాను.

**నూకా :–** ఏమి సహాయము చెయ్యాలి, చెప్పు.

**సురేష్ :–** నేను నాతోపాటు ఇంకా నలుగురు నాకు తెలిసిన వాళ్ళున్నారు. మేము ఈ చిన్న దొంగతనాలు ఎన్ని చేసినా బ్రతకలేకున్నాము. మాకు కూడా ఏదైనా పెద్ద దొంగతనము ఉంటే చెప్పు. అది ఎలా చేయాలో కూడా చెప్పితే ఎట్లయినా చేస్తాము. పెద్ద దొంగతనములు ఎట్లు చేయాలో మాకు తెలియదు.

**నూకా :–** తెలియనపుడు చెప్పితే చేసేది కష్టమవుతుంది. పెద్ద దొంగతనము లలో అప్పటికప్పుడు నిర్ణయాలు తీసుకోవలసి ఉంటుంది. చెప్పితే మీరు చేయలేరు, కావున మీరు మేము పోయేటప్పుడు మా వెంటరాండి, మేము చేసేటప్పుడు ఎలా చేస్తున్నామో చూచి నేర్చుకోవచ్చును.

**సురేష్ :–** ఈ రోజు నీతో కలిసి మాట్లాడినందుకు నాకు చాలా మేలైనది. బ్రతికే దానికి క్రొత్త దారి దొరికినట్లయినది. నీ వెంట మమ్ములను రమ్మని ఎప్పుడు పిలిస్తే అప్పుడు వస్తాము.

(ఈ విధముగా నూకా, సురేష్ ఇద్దరూ పరిచయమయ్యారు. సురేష్ అడ్రస్ నూకాకు ఇచ్చి పంపాడు. నూకా తన మనస్సులో ఇలాంటి చిల్లర దొంగలు తమ చేతిలో ఉండడము మంచిదనుకొన్నాడు. కొంతకాలము గడచిన తర్వాత సురేష్‌ను నూకా పిలిచాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(ప్రబోధ ఆశ్రమములో రాఘవ, రాఘవ భార్యలు దుందుభి,

రాధేశ్వరి, రాజయోగానందస్వామివద్ద దైవజ్ఞానమును సంపూర్ణముగా తెలుసుకొంటున్నారు. భూమిమీద ఎక్కడ అసలైన దైవజ్ఞానముంటుందో అక్కడికి ఖగోళములోని కొన్ని గ్రహములు వచ్చి పోవుచుండెను. దైవజ్ఞానము సంపూర్ణముగ ఉన్న మనుషుల తలలనుండి ఒక ప్రత్యేకమైన కిరణములు వెలుగురూపముతో బయటికి వచ్చుచుండును. ఆ వెలుగు బయల్పడుచోట సంపూర్ణ జ్ఞానమున్నదని గ్రహించిన గ్రహములు దైవజ్ఞానమును తాము కూడా తెలుసుకొనుటకు వచ్చి పోవుచుందురు. ఆ విధముగా రాజ యోగానందస్వామి ఆశ్రమమునకు ఎన్నో గ్రహములు వచ్చి స్వామిని దర్శించుకొని పోవుచుండును. ఒక దినము రాఘవ ఆశ్రమములో ఒక చోటవుండగా, అక్కడ ఉన్నట్లుండి మంచి సువాసన రావడం మొదలుపెట్టింది. ఆ సువాసనను రాఘవ ఎప్పుడూ చూడలేదు. దానిని పీల్చుకొనేకొద్దీ ఇంకా పీల్చుకోవాలనిపిస్తుండెను. కొద్దిసేపు తర్వాత రాఘవ బయటికి పనిమీద పోయి పది నిమిషముల తర్వాత తిరిగి మొదటవున్న జాగాలోనికే వచ్చాడు. అప్పుడు కూడా అక్కడ సువాసన వెదజల్లుచుండెను. ఆ విధముగా సువాసన రావడము రాఘవకు ఏమీ అర్థము కాలేదు. దానిని గురించి రాజయోగా నంద స్వామిని అడగవలెనని అనుకొన్నాడు.

నెల రోజుల తర్వాత ఒక దినము అమావాస్య రాత్రి దాదాపు ఒంటి గంట సమయములో రాఘవ నిద్రనుండి మేల్కొన్నాడు. కళ్ళు తెరిచి చూసాడు. నల్లని చీకటిలో తెల్లని వస్తువు కనిపించింది. అటువంటి దృశ్యమును రాఘవ ఎప్పుడూ చూడలేదు. ఇదేమిటని జాగ్రత్తగా చూచాడు భూమికి రెండు అడుగుల ఎత్తులో అదే దృశ్యము కనిపించింది. చిన్న నిమ్మపండువలె గుండ్రముగానున్న తెల్లని కాంతితో కూడుకొన్న ఆకారము రెండవమారు రాఘవ చూచిన అరనిమిషమునకే వేగముగా క్రిందికి

పడిపోయినట్లయి కనిపించకుండా పోయినది. ఒకమారు సువాసనను చూచిన రాఘవ, తర్వాత నెలరోజులకే తెల్లని వెలుగును కల్గిన ఆకారమును చూడడము జరిగింది. ముక్కుకు తెలిసిన సువాసన, కంటికి కనిపించిన ప్రకాశమును గురించి రాజయోగానంద స్వామిని ఒకరోజు రాఘవ అడిగాడు. రాఘవ చెప్పినదంతావిన్న రాజయోగానంద స్వామి రాఘవతో ఈ విధముగా అన్నాడు.)

**రాజయోగానంద :-** భూమిమీద మనిషి ఎంతో విజ్ఞానమును పొందినా, ఇంకా మనిషికి తెలియనివి చాలా ఉన్నాయి. ఇంతవరకు తెలియనిది క్రొత్తగా తెలిసినపుడు అది ఒక వింతగానే ఉంటుంది. మనిషికి ఇంతవరకు తెలియనివాటిలో నీవు చూచినవి కూడా ఉన్నవి. వాటిని గురించి మనిషి వింతగా చెప్పుకోవడము తప్ప, ఇది ఫలానిది అని చెప్పలేని స్థితిలో ఉన్నాడు. నీవు అడిగావు కావున, నీకు చెప్పవలసిన బాధ్యత నాకు ఉంది. కనుక చెప్పుచున్నాను. జాగ్రత్తగా విను. మనము నివసిస్తున్న భూమిమీదనే కాక ఖగోళములో కూడా కొన్ని కోట్ల గ్రహములున్నవి. అవి అన్నియూ జీవము కల్గివున్నవే. వాటిలో చిన్నవి, పెద్దవి, సామాన్యమైనవి, అసామాన్యమైనవి. గొప్పవి, మహా గొప్పవి ఇట్లు ఎన్నో రకములు గలవు. అందులో కొన్ని గ్రహములకు దైవజ్ఞానమంటే అమితమైన ఇష్టము. దైవ జ్ఞానము మీద ఇష్టముగల గ్రహములు భూమిమీద ఉత్తమమైన జ్ఞానము ఎక్కడున్నదో అక్కడికి వచ్చిపోవుచుందురు. అలా వచ్చుట వలన వారు కూడా గొప్ప జ్ఞానమును తెలుసుకొంటున్నారు. తెలుసుకోవడమే కాకుండా, జ్ఞానము ప్రకారము ఆచరించుచున్నారు.

ఇప్పుడు ముఖ్యముగా చెప్పునదేమనగా! ప్రస్తుత కాలములో భూమి మీద మన ఆశ్రమములో తప్ప ఎక్కడా నిజమైన దైవజ్ఞానములేదు. ఈ

విషయము తెలిసిన కొన్ని గ్రహములు ఎన్నో లెక్కలేనన్ని ఇక్కడికి వచ్చి పోవుచున్నవి. వాటిలో ఎన్నో రకములున్నవని చెప్పానుగా! ఒక ప్రత్యేకమైన లక్షణములుగల గ్రహము ఇక్కడికి వచ్చినపుడు, దానిని తాకిన గాలికి సువాసన ఏర్పడుచున్నది. ఆ గాలిని నీవు పీల్చి సువాసనను గ్రహించగలిగావు. సువాసన నీకు తెలిసినా, అక్కడేనున్న గ్రహము యొక్క ఉనికి నీకు తెలియలేదు. అలాగే నీకు కనిపించిన వెలుగు కూడా అటువంటిదే. ఆ వెలుగు బహుశా నాగమణిదై ఉంటుంది. నాగమణిగల నాగుపాము గ్రహము వచ్చినపుడు మణిని మనము చూడవచ్చును. కానీ అటువంటి గ్రహాలు భూమిమీదికి అరుదుగా వస్తాయి. మణిగల పాము గ్రహము భూమిమీద ఎవరికీ కనిపించదు. కొందరు దైవశక్తిగలవారు మాత్రమే వాటిని చూడగలరు. మణి గ్రహములు తమను ఎవరైనా చూచుచున్నారని తెలిసిన వెంటనే కనిపించకుండా పోవును. అలాంటి సంఘటనే నీకు జరిగిందని తెలియుచున్నది. దీనినిబట్టి నీలో కొంతదైవశక్తి ఇమిడి ఉన్నదని అర్థమగుచున్నది.

**రాఘువ :-** స్వామీ! మన ఆశ్రమమునకు మీరు చెప్పినట్లు గ్రహములు ఈ మధ్యనే వస్తున్నాయా? లేక ముందునుండి వస్తున్నాయా?

**రాజయోగానంద :-** నాకు తెలిసి గత ముప్పయి సంవత్సరముల నుండి వస్తున్నవి. ఖగోళములోనున్న గ్రహశక్తులేకాక, కనిపించని ఎందరో మహర్షులూ, దేవతలు కూడా వచ్చిపోవుచున్నారు. వారందరూ ఇక్కడున్న జ్ఞానము మీద ఆసక్తితోనే వచ్చారు.

**రాఘువ :-** మేము మీవద్ద చాలాకాలమునుండి ఉన్నాము కదా! మాకు ఈ విషయము ఏమాత్రము తెలియదు. ఇక్కడికి ఎందరో కనిపించనివారు

వచ్చిపోతున్నా, వారు వచ్చినట్లుగానీ, పోయినట్లు గానీ ఏమీ తెలియదు. మీరు చెప్పితే అర్థమైనది. కనిపించని వారు ఎందరో వచ్చి పోతున్న విషయము మాకెందుకు తెలియడము లేదు. మాకు తెలియుటకు మేము ఏమి చేయాలి?

**రాజయోగానంద :-** నీకే కాదు నాకు కూడా కనిపించలేదు. వారు ఎవరికీ కనిపించరు. నీకు వెలుగు కనిపించినట్లు, సువాసన వచ్చినట్లు తెలిసింది కదా! అలాగే నా శరీరమును ముట్టుకున్నట్లు నాకు అప్పుడప్పుడు స్పర్శ ద్వారా తెలియుచుండును. కానీ ఎవరు ముట్టుకొన్నదీ తెలియదు. వేరే శరీరములోనికి ప్రవేశించి గ్రహములు చెప్పినపుడు ఎవరెవరు వస్తున్నది తెలిసింది. ఇతర గ్రహములు వేరే శరీరమునుండి మాట్లాడి తెలిపినపుడు తెలిసిన విషయమునే నేను చెప్పాను. కానీ నేను చూచి చెప్పినది కాదు. నా పాదములకు, కాళ్ళకు తగిలిన స్పర్శ వలన ఎవరో నాదగ్గరికి వచ్చారని మాత్రము తెలుసు. అట్లే నేను జ్ఞానమును చెప్పునపుడు నా జ్ఞానమును వినేదానికి కనిపించని వారు కొన్ని వందలమంది వచ్చి వినిపోవునట్లు కూడా తెలుసు. ఇదంతా ఇక్కడ తెలియబడు జ్ఞానము వలన జరుగుచున్నదే గానీ వేరుకాదు. అందువలన మీరు కూడా సంపూర్ణ జ్ఞానులు కావలెనని తెలుపుచున్నాను. అట్లు సంపూర్ణ జ్ఞానము మనవద్ద ఉన్నపుడు జ్ఞానము యొక్క విలువ తెలిసినవారు ఎవరైనా మనవద్దకు తప్పకుండా రాగలరు.

(ఈ విషయమంతటిని స్వామి ద్వారా తెలుసుకొన్న రాఘవ అప్పటి నుండి జ్ఞానము మీద ఎక్కువ ఆసక్తికల్గి తెలుసుకొనుటకు ప్రయత్నించు చుండెను.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(నూకా రమ్మని చెప్పిన వెంటనే సురేష్, ధనుష్‌కు చెప్పి బయలుదేరి

వచ్చాడు. తను పిలువగానే వచ్చిన సురేష్‌ను చూచి నూకా ఇట్లనెను.)

**నూకా :-** ఏమి సురేష్ ఎలా ఉన్నావు?

**సురేష్ :-** బాగున్నానన్నా, ఏమన్నా పిలిచినావు, ఏమైనా ప్రోగ్రామ్ ఉందా?

**నూకా :-** ముందు మీవాళ్ళందరిని పిలుచుకొని వచ్చి చూపి, నాకు పరిచయము చేయి. నన్ను గురించి చెప్పావా?

**సురేష్ :-** చెప్పాను. మొదట మన పరిచయమెలా అయినది చెప్పాను. అందుకు మావాళ్ళు బాగా నవ్వారు. నేను చిన్న దొంగతనాలు చేస్తుంటానని చెప్పాను కదా! దానికి మా పెద్దన్న ధనుష్ నన్ను బాగా మెచ్చుకొన్నాడు. ధనుష్ అన్నే మాకు పెద్దగా ఉంటాడు. మనము ఎంత పెద్దవారమైనా ఎదుట వారిముందు అణిగి ఉండాలన్నది అన్న ధనుష్ నీతి.

**నూకా :-** ధనుష్ అంటే మీ అందరికీ నాయకుడా? మీ వాళ్ళందరినీ ఒకమారు పిలుచుకొనివస్తే, మా నాయకుడు మునెప్పకు పరిచయము చేస్తాను. మీ విషయము మునెప్పకు చెప్పాను. ఒకమారు వచ్చి పొమ్మన్నాడు.

**సురేష్ :-** తప్పకుండా వస్తాము. ఎప్పుడు రమ్మంటావు, ఎక్కడికి రమ్మంటావు?

**నూకా :-** వీలైతే రేపేరండి. మీరు అందరూ రేపు ఇదే టైముకు, ఇదే చోటికి వస్తే నేను మా నాయకుడైన మునెప్పవద్దకు తీసుకుపోతాను.

**సురేష్ :-** అలాగే రేపు ఈ వేళకు ఇక్కడికే వస్తాము. అయితే నేను ఇప్పుడే బయలుదేరి పోయి, అందరికీ విషయము తెల్పి పిలుచుకొనివస్తాను.

(ఆ విధముగా మాట్లాడిన సురేష్ వెంటనే అక్కడినుండి బయలు దేరి పోయాడు. ధనుష్‌కు ఈ విషయమంతా చెప్పాడు. ఆ సమయము

కొరకే వేచియున్న ధనుంజయ (ధనుష్) తన మనుషులను తీసుకొని సురేష్ వెంట రెండవ రోజు నూకా చెప్పిన చోటికి వచ్చారు. అప్పటికే నూకా అక్కడ సురేష్ కొరకు వేచియున్నాడు. సురేష్ వచ్చిన వెంటనే తన వారందరినీ నూకాకు పరిచయము చేశాడు. అందరూ కలిసి బయలుదేరి పోయారు. కొంత దూరము కిరాయి కారులో ప్రయాణము చేసిన తర్వాత ఒక ఊరిలో దిగి అక్కడినుండి చిన్న ప్యాసింజిర్ వ్యాన్‌లో ప్రయాణించారు. అది అడవిలో పోతున్నపుడు ఒక రైల్వే గేటు దగ్గర వారంతా దిగినారు. అక్కడ ఏ స్టేజీకానీ, ఏ ఊరికి పోయే దారికానీ లేదు. అడవిలోనికి వెదురుకట్టెలకు పోయేవారు అక్కడ దిగి అడవిలోనికి పోవడము అలవాటు. వీరు అక్కడ దిగడము వలన అక్కడున్న గేటుమ్యాన్ కూడా వీరంతా కట్టెలకు అడవిలోనికి పోయేవారనుకొన్నాడు. అక్కడినుండి అడవిలోనికి దూరినవారు కాలినడకన రెండు గంటలు ప్రయాణించి పూర్తి అడవిలోనికి పోయారు. అక్కడ చుట్టూ అల్లుకొనిన పొదలమధ్యలో, కొంత ఖాళీస్థలములో ఒక టెంట్ కట్టబడివున్నది. అక్కడికి పోవాలంటే ఒక చెట్టు పొదలోమాత్రము దారి కలదు. అదియూ కంపచెట్లతో మూయబడి ఉన్నది. అక్కడికి పోకముందే, అక్కడికి రెండు వందల మీటర్ల దూరములో ఉండగా, నూకా ఒక పక్షి అరుపులాగా అరువగా, అలాంటి అరుపే దూరము నుండి వినిపించింది. తర్వాత ఒక చెట్టు పొద వద్దకు వచ్చి మొదట అరిచినట్లే అరిచాడు. అప్పుడు ఆ పొదమధ్యలో నున్న కంపను పొదలోపలనుండి ఎవరో తీయగా పొదమధ్యలో ఇరుకుగా ఒక దారికనిపించింది. ఆ దారి నుండి అందరూ ఆ పొదను దాటిపోగా కొంత ఖాళీ స్థలములో గల తారపాల్‌టెంటు కనిపించింది. టెంటు వెనుకనే దాదాపు 60 అడుగుల ఎత్తున్న చెట్టున్నది. ఆ చెట్టు మీద ఎత్తులో ఎ.కె.47 రైఫిల్‌కల్గిన ఒక

మనిషి చుట్టూ చూచుటకు అనుకూలముగా కొమ్మ మీద కూర్చొని ఉన్నాడు. 20 అడుగల వెడల్పు, 40 అడుగుల పొడవుగల పెద్దటెంటు ప్రక్కన బయట నాలుగు మూలలలో నలుగురు మనుషులు ఎ.కె. 47 రైఫిల్స్ కలిగిఉన్నారు. అక్కడున్నవారంతా నూకాకు నమస్కరించారు. అందరూ బయటనే నిలబడి ఉండగా ఐదు నిమిషముల తర్వాత టెంట్‌లోపల నుండి ఒక మనిషి వచ్చి లోపలికి పొమ్మని నూకాకు సైగ చేశాడు. అప్పుడు నూకా అందరినీ పిలుచుకొని లోపలికి పోయాడు. టెంటు లోపల సకల సౌకర్యములతోనున్న మునెప్పకు అందరూ నమస్కరించారు. అక్కడ పది కుర్చీలున్నవి. అందులో కుర్చోమని నూకా చెప్పి తాను కూడా ఒక కుర్చీలో కూర్చొన్నాడు. మునెప్ప అందరివైపు చూచి నూకా వైపు చూచాడు. అప్పుడు నూకా తన కుర్చీని మునెప్ప ముందరకు దగ్గరగా లాగుకొని ఇలా చెప్పాడు.)

**నూకా :-** నేను చెప్పినది వీరిని గురించే. ఇతను సురేష్, సురేష్‌తోనే నాకు మొదట పరిచయము ఏర్పడినది. సురేష్ తర్వాత ఇతను ధనుష్ ఈయన ఈ నలుగురు సభ్యులకు లీడర్‌గా ఉన్నాడు.

**మునెప్ప :-** హలో ధనుష్! మిమ్ములను కలుసుకోవడము మాకు సంతోషము. మేము ప్రస్తుతానికి ఇలా ఉన్నాము. మా పరిస్థితి మీకు అర్థమై ఉంటుంది. మిమ్ములను గురించి మీరే చెప్పాలి. మీరు చేసిన పెద్ద దోపిడీ ఒక దానిని గురించి చెప్పండి.

**ధనుష్ :-** మేము ఎంత పెద్దది చేసినా మమ్ములను మేము చిన్నగానే చెప్పుకుంటావుంటాము. మీరు అడిగారు కాబట్టి చెప్పుచున్నాము. మేము ఈ ప్రాంతములో చేసిన వాటిలో ట్రెజరీ డబ్బును పోలీసులనుండి లాక్కొని పోవడము ఒకటే పెద్దదనుకుంటాను.

(ఆ మాట వింటూనే మునెప్ప ఆశ్చర్యముగా చూస్తూ ఇలా అన్నాడు.)

**మునెప్ప :-** మీ గ్రూపేనా ఆ పని చేసినది? అయితే మీరు చిన్నవారేమీ కాదు. మాకంటే పెద్దవారే. మరి మా నూకాతో చిన్నవారిగా చెప్పారు. నూకా చెప్పిన దానినిబట్టి మా గుంపులోనికి మిమ్ములను చేర్చుకోవాలను కొనివుంటిని. కానీ ఇప్పుడు మీ గుంపులోనికే మేము చేరాలి.

(ఆ మాటను మునెప్ప అంటూనే అందరూ ఫక్కున నవ్వుకున్నారు.)

**ధనుష్ :-** మేము ఎంతది చేసినా వాస్తవానికి మా గుంపు క్రొత్తగా తయారైనది. ఎక్కువ కాలము అనుభవములేదు. అనుభవమున్న వారివద్ద పనిచేసి ఇంకా కొంత అనుభవమును సంపాదించుకోవాలనుకొన్నాము. అదీకాక మా గుంపు ఐదుమంది సభ్యులతోనే ఉంది. కనీసము 20 మంది సభ్యులైనా ఉంటే అన్ని పనులూ జరుగుతాయి. ఐదుమంది అదీ నాతో కలిసి ఐదుమంది బయట చెప్పుకొనే దానికి కూడ వీలువుండదు కదన్నా.

**మునెప్ప :-** చాలామంది వుంటే మంచిదే, కానీ తెలివైనవారు నలుగురున్నా చాలుకదా!

**ధనుష్ :-** ఎంత తెలివి ఉన్నా ఒక్కొక్కమారు బలము కూడా అవసరమవు తుందికదా! ఆ రోజు పోలీసులు ఐదుమందే ఉన్నారు. కాబట్టి మేము బయటపడినాము. వాళ్ళు పదిమంది ఉండివుంటే మేము వారిచేత్తులో ఇరుక్కొనేవారమే కదా! అందువలన జనములేని గుంపు పనికి రాదను కొన్నాను. మేము మీలాంటి వారితో కలిసి పోయేదిమంచిది. నేను చాలా రోజులనుండి ఎవరితో కలవాలా అని ఆలోచిస్తూవుంటిని. ఇంతలో మా

సురేష్ వచ్చి మాకు మంచి జాగా చూపించాడు. ఇప్పుడు మిమ్ములను చూచిన తర్వాత మీ గుంపులో ఉంటే ఏమైనా చేయగలమను ధైర్యము వచ్చింది. పోలీసు వారిని ఆట ఆడించగలను.

**మునెప్ప :-** నీవు చెప్పేమాట మంచిదే. మేము మరొకరి ఆధీనములో పని చేస్తున్నాము. అందువలన ఆయన అనుమతి తీసుకొని మాలోనికి కలుపు కుంటాను. మీలాంటి వారు నావద్ద ఉండడము మంచిదే కదా? మీవద్ద వెపన్స్ ఏమైనా ఉన్నాయా?

**ధనుష్ :-** మా ఐదుమందికి రివాల్వర్లు కొన్నాము. అందులో ఒకటి పని చేయడములేదు. నాలుగు కండీషన్‌లో ఉన్నాయి. అంతకంటే పెద్దవిలేవు.

**మునెప్ప :-** పని చేయని రివాల్వర్‌ను మనవాళ్ళు రిపేరు చేస్తారు. మీకు మిగతా రైఫిల్స్ మీద పనిచేయడము వచ్చునా.

**ధనుష్ :-** ఇంతవరకు రివాల్వర్ తప్ప మాకు ఏదీ తెలియదు. ఒకమారు చూస్తే చాలు నేర్చుకుంటాము.

**మునెప్ప :-** మీరు అన్ని రాష్ట్రములలో దోపిడీలు చేసినట్లూ, ప్రస్తుతము బ్యాంకు దోపిడీ చేయాలని ఉన్నట్లూ ఇంటిలిజెన్స్ వర్గాలు తెలిపాయనీ, బ్యాంకువారు అప్రమత్తముగా ఉండాలని న్యూస్ చూచాను. అందులో ధనుష్ ముఠా అని కూడా వ్రాసివుంది.

**ధనుష్ :-** పోలీసువారు ఒకటివుంటే రెండు వ్రాస్తుంటారు. మొదట కర్నాటక లో చేశాము. ఆ డబ్బుతో రివాల్వర్లు కొన్నాము. మేము చేసినది మొత్తము ఐదు మాత్రమే. ఇప్పుడు బ్యాంకును దోపిడీ చేయాలనుకోలేదు. బ్యాంకులోని లాకర్‌ను మాత్రమే దోచుకోవాలనుకొన్నాము. కానీ అదికూడా

ఒక పది రోజుల తర్వాత చేయాలనుకొన్నాము. మా లెక్కలో ఇంతవరకు చేసినవి చిన్నచిన్నవే. ఏదైనా పెద్దది చేయాలనివుంది.

**మునెప్ప :–** పెద్దదంటే ఏది?

**ధనుష్ :–** ఒక బ్యాంక్ లాకర్‌లో పది వజ్రాలున్నాయట, వాటిని తీయగలిగితే పెద్దదవుతుంది.

**మునెప్ప :–** లాకర్‌లో ఉన్నట్లు ఎలా తెలిసింది? మీకు తెలిసినది వాస్తవమో కాదో!

**ధనుష్ :–** మేము ఐదుమందిమి ఉన్నాము కదా! నేను, సురేష్ తప్ప మిగత ముగ్గురూ బయట కారుడ్రైవర్ పని చేస్తున్నారు. ఇద్దరు బ్యాంకు మేనేజర్ల కారు డ్రైవర్లుగా ఉన్నారు. ఒకరు మాత్రము సుక్‌లాల్ సేట్ దగ్గర కారు డ్రైవర్‌గా ఉన్నాడు. అలా ఉంటే ఇన్‌ఫర్‌మేషన్ దొరుకుతుందని పెట్టాను. ఒక దినము బ్యాంకు మేనేజర్ కారులో పోతూ తన భార్యతో మాట్లాడు చున్నపుడు, మన మనిషి డ్రైవర్‌గా కారు నడుపుతూ వినడము జరిగింది. ఎవరో తన బ్యాంక్‌లో పది వజ్రాలను పెట్టాడట. అవి చాలా బాగున్నాయనీ ఎప్పటికైనా అటువంటి వజ్రమును ఒక దానినైనా కొనిస్తాననీ, దానిని నెక్లెస్‌లో పొదిగి వజ్రము నెక్లెస్ చేయిస్తానని చెప్పడము విన్నాడు. తన బ్యాంకులో 1,11 రెండు లాకర్లు బ్యాంకుకు బాగా అచ్చువాటైనవనీ, ఈ రెండు లాకర్లలో ఒకదానిలో వజ్రాలదండ ఉందనీ, 11వ నంబరు లాకరులో వజ్రములన్నవనీ చెప్పుతున్నపుడు మన మనిషి విన్నాడు. అందువలన మేము ఈ రెండు లాకర్లను ఎట్లయినా దోచివేయాలని అనుకొన్నాను. కానీ మనుషులు తక్కువ ఉన్నాము కదా! అందువలన ఆ పని చేయలేకపోతున్నాము.

**మునెప్ప :-** బ్యాంక్‌లాకర్లు దోపిడీ చేయడము చిన్నపనియేనా! అనుభవము లేదంటావు. ముందుచూపుగా మీవారిని ఇన్‌ఫర్‌మేషన్‌కు కారు డ్రైవర్లగా పెట్టావు. మా దగ్గర మీవద్ద ఉండే వాటికంటే పెద్ద ఆయుధములున్నాయి. కానీ పెద్ద తెలివిలేదు. మాకంటే మీ బుర్రే పెద్దది. అయితే ఒకపని చేస్తాము. లాకర్ల దోపిడీకి బయటకొందరు, లోపల కొందరూ, వెహికల్ దగ్గర ఒకరూ ఉంటే కానీ పనికాదు. మొత్తము పదిమందైనా ఉండవలెను. లేకపోతే కష్టము. రేపటి వరకు మీరు ఇక్కడే ఉండండి. అంతలోపల నేను మా బాస్‌ను కనుక్కొని మీ దోపిడీలో మా మనుషులను కలిసేటట్లు చేస్తాను.

**ధనుష్ :-** అలాగైతే రేపే అయినా చేయగలను.

(తర్వాత విషయమంతా చెప్తుతామని మునెప్ప ధనుష్ గుంపును అందరినీ బయటికి పంపాడు. తాను ఒక్కడు రేడియోసెట్ ఆన్ చేసి తపస్వి బాబాతో ధనుష్ విషయమంతా చెప్పాడు. అంత తెలివైనవారు దొరకడము మంచిదేనని చెప్పిన తపస్విబాబా ఆ పది వజ్రములు భువనేశ్వరి దేవాలయములో మనము తీసినవే. అవి అక్కడకు ఎలా చేరాయో మనకు తెలియదు. ఇప్పుడు వాటి అడ్రస్ మనకు దొరికినట్లే. ముందు ధనుష్‌తో మన మనుషులను పంపుతామని చెప్పు. అందులో ఒకటి మా బాస్‌కు ఇవ్వవలెనని మిగత తొమ్మిదింటినీవారే తీసుకొమ్మని చెప్పు. పని అంతా అయిన తర్వాత ఆ తొమ్మిదింటినీ వారినుండి తీసుకోవచ్చు. వారిని మనవద్దే పెట్టు కోవచ్చు. వీరు దొరకడము మన అదృష్టమేనని బాబా చెప్పి వయర్‌లెస్ ఆఫ్ చేశాడు. తర్వాత మునెప్ప ధనుష్‌తో మాట్లాడి తమ బాస్ చెప్పినదంతా చెప్పాడు. దానికి ధనుష్ అన్ని విధాలా ఒప్పుకొన్నాడు. ఆ రోజు ధనుష్ వాళ్ళు అడవి వాతావరణములో విశ్రాంతి తీసుకొన్నారు.

మరుసటి దినము ఉదయము ప్రక్కనేనున్న సెలయేటిలో స్నానము చేసి రెడీ అయి పోయారు. అందరూ ఉదయము ఎనిమిది గంటలకే అన్నము తిన్నారు. తర్వాత మునెప్ప ధనుష్‌తో ఇలా అన్నాడు.)

**మునెప్ప :-** నీవుకాక మీవాళ్ళు నలుగురున్నారు. వారికి తోడుగా నేను ఆరుమందిని పంపుతాను. అప్పటికి మొత్తము పదకొండుమంది అవుతారు. వారిని ఎలా ఉపయోగించుకోవాలో అలా ఉపయోగించుకో.

**ధనుష్ :-** ఈ రోజు శనివారము. రేపు ఆదివారము బ్యాంకు సెలవు. రేపు రాత్రికి మేము పని ప్రారంభిస్తాము. మీరు పంపేవారిని నాకు పరిచయము చేస్తే, వారికి ముందే కొన్ని సూచనలిచ్చి, ఈ దినమే ఇక్కడే వారికి కొంత రిహార్సల్ చేసినట్లు దోపిడీ నమూనాను చేసి చూస్తాము.

(మునెప్ప తన తమ్ముడు వెంకును మొదట ధనుష్‌కు పరిచయము చేశాడు. తర్వాత నూకా మొదలగు ఐదుమందిని పరిచయము చేశాడు. అందరితో ఒకరికొకరు పరిచయము చేసుకొన్న తర్వాత ధనుష్ తన తెలివిని ఉపయోగించి బ్యాంక్ లాకర్ల దోపిడీ ఎలా చేయాలో వివరించి చెప్పి, అదే విధముగా అందరూ ట్రయల్ చేయునట్లు చేశాడు. ఆ విధముగా బ్యాంకు లాకర్ల దోపిడీ విషయములో కొంత తర్ఫీదు పొందినట్లయినది. ఆదివారము రాత్రికి అన్ని ఏర్పాట్లు చేసుకొని, అందరూ ఒక కారులో బయలుదేరి పోయారు. ఆదివారము దోపిడీ చేయవలసిన బ్యాంకును ఒకమారు చూచుకొని, ఆ దినము అందరూ ఒక లాడ్జిలో దిగినారు. అలా లాడ్జిలో అందరినీవుంచి ధనుష్ ఒకడు బయటికివచ్చి ఫోన్‌బూత్‌నుండి యస్.పి గారికి సమాచారమును అందించాడు. తర్వాత అందరితోపాటు తన రూముకువచ్చి ఉండిపోయాడు. రాత్రి 9 గంటలకే లాడ్జి ఖాళీ చేసి ఊరి బయట హైవే మీదవున్న డాబా హొటల్‌కు పోయి, అక్కడ

రాత్రిపదకొండు గంటలవరకు తింటూ గడిపారు. తర్వాత మరియొక డాబా హొటల్‌కు వచ్చి, అక్కడ టీ త్రాగుటకు అరగంటసేపు గడిపి, రాత్రి 12.45 లకు బయలు దేరి ఒంటిగంటకు బ్యాంకు దగ్గరకు పోయారు. బ్యాంక్ దగ్గర సెక్యూరిటీ గార్డు, బ్యాంక్ ముందర కూర్చొని నిద్ర పోతున్నాడు. అదే అదునుగా కారులోనుండి ధనుష్ దిగి చేతిరుమాలులో క్లోరోఫామ్‌ను వేసుకొని నిద్రిస్తున్న గార్డు ముక్కుదగ్గర పెట్టాడు. క్లోరోఫామ్ మత్తుమందు కావున అతనిని గాఢనిద్రలోనికి పంపింది. అప్పుడు కారును బ్యాంకు ప్రక్కన కొద్దిదూరములో చీకటిగానున్న చోట పెట్టి, డ్రైవర్ సీటులో నిద్రించుచున్నట్లు నటిస్తూ ఒక మనిషి కూర్చోగా, మిగతా పదిమంది బ్యాంకు దగ్గరకు పోయారు. బ్యాంకు ముందు భాగములో కాకుండా ప్రక్కనున్న ఒక కిటికీవద్దకు చేరుకొని, దాని ఇనుప ఊచలకు వారివద్దనున్న ఐరన్‌మిల్ట్ పేస్టును చుట్టూ పూసారు. కొద్దిసేపటిలోపే ఆ ఊచలు మెత్తగా మారిపోయి కరగడము మొదలు పెట్టాయి. అప్పుడు బలముగా ఊచలను లాగి ప్రక్కన పెట్టి, లోపలనున్న అద్దములను తమవద్దనున్న మిర్రర్ కట్టర్‌తో కోసి ప్రక్కన పెట్టి, ఆ కిటికీ ద్వారా అందరూ లోపలికి సులభముగా పోయారు. అందరూ ముఖాలకు గుడ్డలు కట్టుకొని సి.సి. కెమెరాల కంటపడకుండా, అవి ఎక్కడున్నదీ గమనించి వాటిని పెరికివేశారు. తర్వాత లాకర్‌రూమ్ లాక్‌ను తీయకుండా దానికి కూడా మెటల్‌మిల్ట్ పేస్టును పూసారు. ఒక నిమషములో అది కూడా కరిగి పోయింది. ఎక్కడా వేలిముద్రలు పడకుండా ధనుష్ అందరికీ ముందే హ్యాండ్‌గ్లోవ్స్ ఇచ్చాడు. అందరూ వాటిని చేతులకు తగిలించుకొని ఉండుట వలన ఎవరి వేలి ముద్రలూ ఎక్కడా పడలేదు. సులభముగా లాకర్ రూమ్‌లోనికి ప్రవేశించిన వారు కొందరు ఒకటవ నంబరులాకరు వద్దకు వచ్చారు. కొందరు బ్యాంకు మధ్యహాలులో

ఉండగా, ఒకరు మెయిన్ రోడ్డు ఎదురుగానున్న కిటికిలోనుండి ఎవరైనా అటువైపు వస్తారేమోనని బయటికి చూస్తున్నాడు. బయట కారులో డ్రైవర్ సీటులో కూర్చున్న మనిషి ధనుష్ గుంపులోని మనిషి. అలాగే మెయిన్ రోడ్డు కిటికీ దగ్గర బయటికి చూస్తున్నది కూడా ధనుష్ మనిషే. బ్యాంక్ మొదటిహాలులో ఒకరు ధనుష్‌మనిషి, ఇద్దరు మునెప్ప మనుషులు ఉండగా, నలుగురు మునెప్ప మనుషులలో ఒకరు వెంకు ఒకరు నూకా కాగా మిగతా ఇద్దరు అట్లే ధనుష్, సురేష్ ఆరుమంది బ్యాంక్‌లాకర్ రూములో ఉన్నారు. ఐదు నిమిషములు కష్టపడి 1వ నంబర్ లాకర్ తీశారు. అందులో అన్నీ నగలే ఉన్నాయి. వాటినన్నిటినీ బ్యాగ్‌లో వేసుకొన్నారు. తర్వాత 11వ నెంబర్ లాకర్ దగ్గరకు పోయారు. అంతలో బయట కొంత అలజడి అయినది. ఏమిటా అలజడి అని లాకర్‌రూమ్‌లోనున్నవారు బయటికి వచ్చి చూడాలని బయటికి రాబోయారు. అంతలోనే సాయుధులైన పోలీస్ ఆఫీసర్లు ఆరుమంది లాకర్ రూమ్‌లోనికి వచ్చి, అక్కడున్న వారిని కదలకుండా చేతులు పైకి ఎత్తమన్నారు. పరిస్థితి చేయిదాటి పోయిందనుకొన్న వెంకు మొదలగు వారు చేతులు పైకి ఎత్తారు. వెంటనే బయటనుండి ఇంకా పదిమంది పోలీస్‌లు వచ్చి చేతులకు బేడీలు తగిలించారు. పోలీసులు ఎలా వచ్చారో వెంకూకు, నూకాకు అర్థముకాలేదు. తమవద్దనున్న బ్యాంక్‌లాకర్ సొమ్ముతో సహా రెడ్‌హ్యాండెడ్‌గా పోలీసులకు దొరికిపోయారు.

ఇదంతా ధనుష్ అను మారుపేరుతోనున్న ధనుంజయ వేసిన పథకమని మునెప్ప మనుషులకు తెలియదు. ధనుష్ గుంపుకూడా తమతో పాటు దొరికిపోయిందని మునెప్ప మనుషులు అనుకున్నారు. అయితే ధనుష్, అతని గుంపు అందరూ పోలీసులేనని వారికి తెలియదు. ధనుష్

అందరికి చేతి తొడుగులు ఇచ్చి, సి.సి. కెమెరాలను పగల గొట్టింది చూస్తే, నిజముగా దొంగలు చేసినట్లే, ఆ పని అంతా నిజమైన దొంగతనమన్నట్లే ఉంది. ధనుంజయ ధనుష్‌గా మారి, దొంగల గ్రూప్ నాయకుడుగా మారినట్లు నటిస్తూ, ఎంతో కాలమునుండి దొరకని మునెప్ప మనుషులను బ్యాంక్ దోపిడీ అను పేరుతో ఉచ్చులోనికి లాగి చిక్కుకొనునట్లు చేశాడు. మునెప్ప మనుషులందరూ పోలీసులకు దొరికిన తర్వాత కూడా ధనుష్ పోలీస్ గ్రూప్ మనిషి అని మునెప్పకుగానీ, మునెప్ప మనుషులకుగానీ తెలియదు. ఈ విధముగా రాటుతేలిన దొంగలను పట్టి ఇచ్చినందుకు ధనుంజయకు పోలీస్ శాఖనుండి మంచి బహుమతి లభించింది. అట్లే ప్రమోషన్ కూడా లభించింది. అడవిలో మునెప్ప, అతని ముఖ్య అనుచరులు ముగ్గురు మిగిలి పోయారు. తపస్వీబాబాగారికి మునెప్ప జరిగినది అంతా చెప్పగా! బాబా ఆశ్చర్యపోయాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × ×

(రావుబహదూర్ జమీందారు ఇంటిలో ఈశ్వర్ వయస్సు పది హేనవ (15) సంవత్సరము జరుగుచున్నది. ఈశ్వర్‌కు వయస్సు పెరిగే కొద్ది అందముగా, ఆకర్షణీయగా కనిపించసాగాడు. ఈశ్వర్‌ను చూస్తూనే దయ్యాలుగానీ, పిశాచాలుగానీ భయపడి పారిపోయేవి. ఒకరోజు మూడు సంవత్సరముల పిల్లవానిని పాము కరిచింది. తల్లిదండ్రులు పాము కరిచిన వెంటనే వైద్యునివద్దకు తీసుకపోయినా ఆ పిల్లవాడు బ్రతుకలేదు. దంపతులకు ఒక్కడే కొడుకు అయిన దానివలన చాలా బాధపడుచుండిరి. తల్లిబాధను చూడలేక అక్కడికి పోయిన వారు కూడా కంటతడి పెట్టుకొను చుండిరి. పిల్లవానికి పాము కరిచి చనిపోయిన వార్త ఊరంతా ప్రాకింది. ఆ విషయము ఇంటిలోని ఈశ్వర్‌కు కూడా తెలిసింది. ఈశ్వర్‌కు ఆ

విషయము తెలిసిన వెంటనే తన ఇంటిలోని పనిమనిషిని పిలిచి ఆ పిల్లవానిని తన దగ్గరకు తెమ్మని చెప్పి పంపాడు. ఆ పనిమనిషి రోదిస్తున్న ఆ బాలుని తల్లిదండ్రులకు ఆ విషయము చెప్పాడు. ఈశ్వర్ అంటే అతను గొప్పవ్యక్తి అను అభిమానము అందరిలో ఉండుట వలన, ఈశ్వర్ చెప్పి నాడంటూనే ముందూ వెనుక చూడకుండా, ఏ ఆలోచన చేయకుండా, చనిపోయిన పిల్లవానిని ఈశ్వర్ ఇంటివద్దకు తీసుకపోయారు. ఆ పిల్లవాని తల్లిదండ్రుల వెంట చాలామంది పోయారు. ఈశ్వర్ పిలిచాడు అంటే ఎందుకు పిలిచాడో అని, ఆయన మాటను గౌరవించి అక్కడికి పోవడము జరిగింది. ఈశ్వర్ ఇంటివద్దకు పోయిన జనము ఇంటిలోని ఈశ్వర్‌కు చనిపోయిన పిల్లవానిని తీసుకవచ్చినట్లు తెలిపారు. వెంటనే ఈశ్వర్ బయటికి వచ్చి అందరినీ చూచాడు. అందరూ విచారముగా కనిపిస్తూవుంటే, కొందరు ఏడుస్తూ కనిపించారు. అందరినీ చూచిన ఈశ్వర్, "మీరు బాధపడవలసిన పనిలేదు. ఈ పిల్లవాడు చనిపోలేదు, నిద్రపోతున్నాడు. నేను లేపుతాను చూడండి అని ఆ పిల్లవాని దగ్గరకు పోయి చేతితో తట్టి "మీ అమ్మానాన్న ఏడుస్తున్నారు. నీవు మేల్కొని బయటికి రా!" అన్నాడు. ఆ మాట అని చేతితో తట్టి లేపగా నిద్రనుండి మేల్కొన్నవానివలె ఆ పిల్లవాడు కళ్ళు తెరిచి చూచాడు. ఆ సంఘటనతో అక్కడున్న వారంతా ఈశ్వర్‌ను దేవునితో సమానముగా పొగడసాగారు. ఈశ్వర్ వారి అమాయకత్వానికి నవ్వుకొని ఇంటిలోపలికి పోయాడు. కొద్దిసేపటికే చనిపోయిన పిల్లవానిని ఈశ్వర్ బ్రతికించాడను విషయము ఊరంతా ప్రాకిపోయినది. ఆ పిల్లవాని తల్లిదండ్రులు ఈశ్వర్ నిజముగా దేవుడే అని అందరికి చెప్పసాగారు. జమీందారు రావుబహదూర్ కూడా ఈశ్వర్‌లో ఏదో గొప్పశక్తివుందని నమ్మి, అతను తనకు కొడుకుగా దొరకడము తమ పూర్వజన్మ అదృష్టమనుకొన్నాడు.

సాయంకాలమునకు ఈశ్వర్ చనిపోయిన పిల్లవానిని బ్రతికించాడని జిల్లా అంతా తెలిసిపోయింది. దానితో కొందరు న్యూస్ పత్రికల విలేఖరులు వచ్చి ఈశ్వర్‌ను పిల్లవానిని బ్రతికించిన విషయమును గురించి అడగను మొదలు పెట్టారు. ఎవరు అడిగినా అందరికీ " ఆ పిల్లవాడు చనిపోలేదు, నిద్రపోయేవాన్ని లేపాను, నేను చనిపోయినవాన్ని బ్రతికించలేదు." అని ఈశ్వర్ ఒకే జవాబు చెప్పుచుండెను. "పాము కరచి చనిపోయింది అందరికి తెలుసు కదా'' అని విలేఖరులు అడిగితే "చనిపోలేదు అని నేను చెప్పుచున్నానుకదా" అని జవాబు చెప్పుచుండెను. ఆయన చెప్పునది ఎవరికీ అర్థము కాలేదు. అయినా వారివారి పత్రికలలో "చనిపోయిన బాలున్ని బ్రతికించిన ఈశ్వర్" అని వ్రాస్తూ, ఈశ్వర్‌ను అడిగితే నేను చనిపోయిన వానిని బ్రతికించలేదు, అని జవాబు చెప్పినట్లు కూడా వ్రాశారు. ఈ వార్త రెండవ రోజు స్టేట్‌లో అందరికీ తెలిసిపోయింది.

× × × × × × × × × × × × × × × × × × × ×

(రాజయోగానంద స్వామికి రాఘవ ప్రతికలలో వచ్చిన వార్తను చూపించి ఇలా అడిగాడు.)

**రాఘవ :-** స్వామీ! మనము అష్టగ్రహ కూటమి దినమున పుట్టిన బాలుడని ఎవనిని అయితే అనుకొంటున్నామో అతనే ఈశ్వర్. ఈశ్వర్‌కు ఇప్పటికి పదిహేను సంవత్సరముల వయస్సే. ఆ అబ్బాయి నిన్నటి దినము పాము కరిచి చనిపోయిన మూడు సంవత్సరముల పిల్లవానిని కొన్ని గంటల తర్వాత బ్రతికించాడని వార్త వ్రాశారు. చనిపోయిన వానిని బ్రతికించడానికి సాధ్యమవుతుందా? దానిని గురించి అడిగిన విలేఖరులకు "అతను చనిపోలేదు నిద్రపోవువానిని లేపాను" అన్నాడట. ఈ మాట వాస్తవమేనా?

**రాజయోగానంద :-** శ్వాస ఆడనంతమాత్రమున చనిపోయాడు అని

అనుకోవడము పొరపాటే అగును. ఒక విధముగా "ఇతను చనిపోలేదు. నిద్రపోయినవానిని లేపాను" అని ఈశ్వర్ చెప్పినమాట వాస్తవమే. మనము చూస్తున్నట్లే ఎంతోమంది చనిపోయారు కదా! కానీ, వాస్తవముగా అంత మందిలో కొందరే చనిపోయారు. కొంతమంది చనిపోయినట్లు కనిపించినా, వారి శరీరములో కదలికలు, శ్వాస నిలచిపోయినా వారు నిజముగా చని పోలేదు. వారు చనిపోకుండా శరీరములో సజీవముగానే కొంత కాలము ఉందురు. ఆ విషయము చాలామంది జ్ఞానులకు కూడా తెలియదు. శ్వాస ఆగిపోయింది, చైతన్యము నిలిచిపోయింది, చనిపోయాడని అజ్ఞానులు అనుకొన్నట్లే ఆధ్యాత్మిక రంగములో కొంత తెలిసినవారు కూడా అనుకొనుచుందురు. ఒక ఆధ్యాత్మికవేత్త అనిపించుకొన్న వ్యక్తి కూడా తన తాతగారు నిజముగా చనిపోకున్నా, శ్వాస ఆగిపోతానే చనిపోయాడనుకొని తన పుస్తకములో ఇలా " మా తాతగారు చనిపోవటము, స్మశానానికి తీసుకొని వెళ్ళే మధ్యలో దింపినపుడు, మరల అతను శరీరములోనికి వచ్చి లేచి, ఇంటికి వచ్చిన తర్వాత కొంతకాలము బ్రతికారు" అని వ్రాశారు. అంతో, ఇంతో తెలిసిన వారు కూడా ఇలా పొరపాటుపడుచున్నారు. వాస్తవముగా ఒక్కమారు శరీరములో నుండి జీవుడు బయటికి పోయి చనిపోతే తిరిగి ఆ శరీరము లోనికి వచ్చుటకు వీలులేదు. శరీరములోనుండి జీవుడు బయటికి పోనప్పుడు శరీరము మృతి చెందినట్లు కనిపించినా, అతడు శరీరములోనే ఉన్నాడు, కనుక తిరిగి లేవగలడు. ఈ విషయమును విపులముగా "మరణ రహస్యము" అను గ్రంథములో వ్రాయబడి ఉన్నది. ఇంకొక విషయము ఏమనగా! పాము కరిచి మృతి చెందిన వారి శరీరములో జీవుడు శరీరమును వదలి బయటికి పోకుండా దాదాపు 4 గంటల నుండి 24 గంటల వరకు ఉండగలడు. అందువలన పాముకాటు వలన మరణించినట్లు కనిపిస్తున్న మూడేళ్ళ బాలున్ని ఈశ్వర్ లేపగలిగాడు.

అటువంటి మరణమును "తాత్కాలిక మరణము" అంటారని మరణ రహస్యము గ్రంథములో కూడా పేర్కొన్నాము. ఈ విషయము చాలామంది మేధావులకు కూడా తెలియదు. కావున దీనిని మరణ రహస్యము అంటున్నాము. ఈశ్వర్‌ది ప్రత్యేకమైన జాతకము. అందువలన ఎవరికీ తెలియని విషయములు అతనికి అవగాహనలో ఉన్నాయి. అట్లే ఎవరికీ లేని శక్తులు కూడా ఈశ్వర్‌కు ఉన్నాయి. ఈశ్వర్‌కు ఇప్పుడు 15 సంవత్సరములు జరుగుచున్నవి. అతనికి 15 సంవత్సరములు పూర్తిగా అయిపోయి 16లో పడినపుడు ఆరునెలలు ప్రతి అమావాస్యకు అతనిలో విశేషశక్తులు ప్రవేశించును. అతనిలో శక్తులు కొన్ని ఇప్పటికే ఉన్నాయి.

ఈశ్వర్ యొక్క ప్రతి విషయమును తపస్విబాబా గమనిస్తూ ఉండును. బాబా అనుకొన్న పనికి కొన్ని నెలలే బాకీ ఉన్నాయి. అతనికి ముఖ్యముగా పనిచేసిపెట్టు మునెప్ప మనుషులు బ్యాంక్ దోపిడీలో పోలీసులకు చిక్కారు. చివరకు మునెప్ప, అతని అనుచరులు కొందరు, ఇద్దరు మాంత్రికులు బాబా ప్రక్క మిగిలివున్నారు. మునెప్ప బయటకు రాకుండా ఎవరికీ తెలియని చోటికి చేరిపోయాడు. మొత్తానికి బాబా బలము తగ్గి పోయిందనుకోవచ్చును.

**రాఘవ :-** స్వామీ! ఈశ్వర్‌కు పదిహేనవ సంవత్సరము ముగియుటకు ఇంకా ఎంతకాలమున్నది?

**రాజయోగానంద :-** ఇంక రెండు నెలలు మాత్రమే కలదు. మూడవ నెలనుండి 16వ సంవత్సరము ప్రారంభమగును. 16వ సంవత్సరము మూడు అమావాస్యల తర్వాత నాలుగు, ఐదు, ఆరు నెలలలో వచ్చు అమావాస్యలలో వచ్చు శక్తులు చాలా గొప్పవి. అప్పటికి తగినట్లు మనము ప్రవర్తించాలి. తపస్విబాబా కూడా అప్పుడే మనలను అడ్డుతొలగించు

కోవాలని చూడగలడు. అంతవరకు మన ఉద్దేశ్యము ఆయనకు తెలియదు. మనము అతనికి వ్యతిరేఖముగా ఉన్నామని తెలిసిన వెంటనే బాబాద్వారా మనకు కొన్ని కష్టాలు రాకతప్పవు.

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(వెంకూ, నూకా మొదలైన ఆరుమంది పోలీసులకు దొరకడము మునెప్పకు కోలుకోలేని దెబ్బ తగిలింది. బ్యాంకు దోపిడీలో లాకర్‌లో దోచిన సొమ్ముతో సహా రెడ్‌హ్యాండెడ్‌గా దొరికిపోవడము ఎలా జరిగిందో మునెప్పకు అర్థముకాకుండా పోయినది. ధనుష్‌వాళ్ళు పెద్ద మొనగాళ్ళను కొని వారివెంట తనవారిని పంపడము తప్పయినదని మునెప్ప అనుకొన్నాడు. వాస్తవానికి ధనుష్ పోలీసు మనిషని మునెప్పగానీ, మునెప్ప మనుషులు గానీ గ్రహించలేక పోయారు. చేతికి గ్లోవ్స్ వేసుకోవాలని చెప్పడమూ, ఐరన్ మిల్టింగ్ యాసిడ్ పేస్టు తీసుక రావడము వలన మునెప్ప, ధనుష్‌ను పూర్తిగా నమ్మిపోయాడు. వారికి ఎక్కడా అనుమానము రాకుండా ధనుష్ ప్రవర్తించాడు. కారులో తన మనిషిని కూర్చోపెట్టడము, ఊచలు పెరికిన కిటికీ వద్ద కూడ తన మనిషినే ఉంచడము వలన బయట పోలీసులు వచ్చినా కూడ మునెప్ప మనుషులకు తెలియకుండా పోయినది. కిటికీ దగ్గరా, కారులో వున్నది పోలీసు మనుషులని మునెప్ప మనుషులకు ఎవరికీ తెలియదు. తర్వాత హాలులో కూడా ఒక మనిషి ధనుష్‌కు సంబంధించిన వాడు ఉండుట వలన అతను తనప్రక్కనవున్న మునెప్ప మనుషుల ధ్యాసను ప్రక్కకు మళ్ళించి పోలీసులు బ్యాంకులోనికి వచ్చువరకు చూచుకోకుండా చేశాడు. ధనుష్ పథకము ప్రకారము, మునెప్ప మనుషులను అక్కడ దొరుకునట్లు చేశాడు. ముందే అన్ని విషయములు యస్.పి తో సంప్రదించి కరెక్టు టైము ప్రకారము పోలీసులను రమ్మని చెప్పివుండుట వలన, బయట కాపలాకున్న వ్యక్తులు పోలీసువారే,

అయినందున మునెప్ప మనుషులు సులభముగా దొరికారు. వారితో పాటు ధనుష్‌ను, అతని మనుషులను కూడా పోలీస్ కస్టడీకి పంపిన దానివలన, అరెష్టయిన తర్వాత కూడా మునెప్ప మనుషులకు ధనుష్ మీద అనుమానము రాలేదు. మునెప్పకు కూడా ధనుష్ మీద ఏమాత్రము అనుమానము రాలేదు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(తపస్వి బాబా ఈశ్వర్‌కు పదహారవ సంవత్సరము రాబోతున్నందున తాను చేయవలసిన పనికొరకు ముందుగానే పథకములను తయారు చేసుకొన్నాడు. తాను రచించిన పథకములను నెరవేర్చుటకు ఇద్దరు మాంత్రికులను ఉపయోగించుకోవాలనుకొన్నాడు. అందువలన మాంత్రికులతో ముందే మాట్లాడి జరుగబోవు సమయములో తాము చేయబోవు కార్యములను గురించి ముందే వివరించి చెప్పాలనుకొన్నాడు. తాను బయటికి పోకుండా, ఎవరికీ ఏ అనుమానము రాకుండా, తన పనిని ఇద్దరు మాంత్రికులతోనే చేయించాలనుకొన్నాడు. తర్వాత తనవద్దనున్న కొన్ని శక్తులను కూడా వారి వశములో పెట్టి, వారిచేత అన్ని పనులు సమయానుకూలముగా చేయించుకోవడము మంచిదనుకొన్నాడు. దాని కొరకు మునెప్పతో తనవద్దకు ఇద్దరు మాంత్రికులను తన మనిషితో పంపమని చెప్పాడు. దానికి మునెప్ప తన మనిషిని పంపి ఇద్దరు మాంత్రికులను తనవద్దకు రప్పించుకొన్నాడు. మాంత్రికులు మునెప్ప వలన తమ జీవితములో ఎప్పుడూ చూడని డబ్బును చూచిన దానివలన, మునెప్ప పిలిచిన వెంటనే ఇద్దరూ సంతోషముగా వచ్చారు. మునెప్ప వరకే పరిమిత మైన మాంత్రికులు ఈ మారు తపస్విబాబావరకు పోవుటకు అవకాశము ఏర్పడినది. మునెప్ప మాంత్రికులను ఒకరోజు తనవద్దనే ఉంచుకొని తపస్వి బాబా దగ్గరకు పంపుచున్నాననీ, అక్కడికి పోయిన తర్వాత బాబాదగ్గర

చాలా భయము కల్గి, వినయముగా మాట్లాడాలనీ, ఆయన ఏమి చెప్పితే దానిని జాగ్రత్తగా విని, ఏమి చేయమంటే అలాగే దానినే చేస్తామని, తర్వాత తనవద్దకు రమ్మని చెప్పి, తన మనిషిచేత ఇద్దరినీ తపస్విబాబా వద్దకు పంపాడు. మునెప్ప తన మనిషిచేత పంపిన మాంత్రికులను బాబా తన మందిరములోనికి ఏకాంతముగానున్నపుడు రప్పించుకొన్నాడు. ఆ విధముగా ఎవరూ లేనపుడు బాబాను కలిసిన మాంత్రికులతో ఇట్లు మాట్లాడెను.)

**తపస్విబాబా :-** భవిష్యత్తులో ఎవరితోనూ మీరు నా దగ్గరికి వచ్చి మాట్లాడినట్లు చెప్పకూడదు. అంతేకాక ఇక్కడ నేను మీకు చెప్పు విషయములు చాలా రహస్యమైనవి. అందువలన వాటిని ఎక్కడా ఎవరికీ తెలియనట్లు మీ దగ్గరే ఉంచుకోవలెను. నేను మాటిమాటికీ కలిసి మాట్లాడే వీలుండదు. కావున మీకు విషయమునంతటినీ ఇప్పుడు ఒక్కమారే చెప్పగలను. అందువలన వినిన విషయమును జాగ్రత్తగా జ్ఞప్తికి ఉంచు కోవలెను. మీకు ఏమైనా అర్థముకాని విషయములుంటే ఇప్పుడే అడిగి తెలుసుకోండి. ఇప్పుడు నేను అడిగిన దానికి జవాబు చెప్పండి. మీకు దేవతలు ఎవరైనా వశములో ఉన్నారా?

**మల్లయ్యతాత :-** నాకు కాటేరి, భగళాముఖి, కర్ణపిశాచి, ముగ్గురూ నా వశములో ఉన్నారు.

**తపస్విబాబా :-** మంత్ర యోగాలుగానీ, మంత్ర ప్రయోగాలుగానీ ఎన్ని తెలుసు?

**మల్లయ్యతాత :-** నాకు రెండూ కలిపి వందవరకు తెలుసు. ప్రస్తుతము దేశములో నాకు తెలిసినన్ని తంత్రములు తెలిసినవారులేరు.

**తపస్విబాబా :-** బదనికలు ఎన్ని ఉన్నాయి?

**మల్లయ్యతాత :-** నావద్ద ముఖ్యమైనవి నాలుగు బదనికలు మాత్రమే ఉన్నాయి. మూలికలు అరవై వరకు తెలుసు.

**తపస్విబాబా :-** నాగభూషణము! నీదగ్గర వశములోనున్న వారున్నారా? నీకు ఏమి తెలుసో, ఏమేమి ఉన్నాయో చెప్పు.

**నాగభూషణము :-** నాకు ఎవరూ వశములో లేరు. మంత్రచిట్కాలంటే రెండు రకములు కలిసి నలభైవరకు ఉన్నాయి. బదనికలు ఆరున్నాయి, మూలికలు దాదాపు నలభైవరకు తెలుసు.

**తపస్విబాబా :-** మీరు చెప్పిన దానినిబట్టి మీరు ఇద్దరూ కలిసివుంటే మిమ్ములను మించినవారు ఎవరూ ఉండరు. అంతేకాక నావద్దనున్న చాలామంది క్షుద్రదేవతలను మీకు వశములో ఉండి, మీరు చెప్పినట్లు చేయమని చెప్పి పంపుతాను. అందువలన మీకు ఏ క్షుద్రదేవతల వలనగానీ ఇబ్బంది కలుగకుండ నేను మీ వెంట పంపిన శక్తులు చూచుకోగలవు.

**మల్లయ్యతాత :-** బాబాగారు! మాకు చిన్న అనుమానము, అది ఏమంటే మా వశములోనున్న శక్తులకున్న నియమముల ప్రకారము మేము నడుచు కొంటున్నాము. ఇప్పుడు మీరు మావెంట కొన్ని శక్తులను పంపితే వాటికున్న నియమము ప్రకారము నడుచుకోవలెనా, లేదా?

**తపస్విబాబా :-** నేను నా వశములోని శక్తులను మీ మాట వినునట్లు చేసి పంపుచున్నాను. అంతమాత్రమున వాటి నియమమును మీరు పాటించ వలసిన పనిలేదు. వాటి నియమములను నేను పాటిస్తాను, మీకు సంబంధములేదు. ఇప్పుడు మీకు చెప్పు విషయమును జాగ్రత్తగా వినండి. ఇప్పటికి దాదాపు 16 సంవత్సరముల క్రిందట అష్టగ్రహ కూటమి జరిగింది. మీరు మాంత్రికులు అయినందున మీకు ఆ విషయము బాగా జ్ఞాపకము ఉంటుంది. ఆ సమయములో మొదట పుట్టిన మగశిశువుకు కొన్ని ప్రత్యేక

మైన శక్తులు ఉంటాయి. మనము మంత్రసాధన చేసినా లభించని శక్తులు అతనికి ఏ సాధనా లేకుండానే ఉంటాయి. అతనికున్న శక్తులు మనకు లభించాలంటే అతనికి 16వ సంవత్సరము వచ్చేంత వరకు కాచుకొని ఉండవలసిందే. ఆ బాలుని పేరు ఈశ్వర్, ఆ బాలుడు మన జిల్లాలోనే ధనికునిగా పేరుగాంచిన రావుబహదూర్ జమీందారు ఇంట్లో దత్తపుత్రునిగా పెరిగాడు. అతనికి పదహారవ సంవత్సరము ఈ నెలతో ప్రారంభమవు చున్నది. ఈ సంవత్సరములో అతనికి ఇంతవరకు ఉన్న శక్తులే కాకుండా క్రొత్తశక్తులు చాలావస్తాయి. అతనికి వచ్చు శక్తులను మనము అతని ద్వారా సంపాదించుకోవాలంటే, అతనిని మనము వశము చేసుకోవాలి. అతనిని వశము చేసుకొను పనిని మీరు చేయవలెను. దానికొరకు మీరు ఇప్పటినుండి ఆ పనిలో నిమగ్నము కావలెను. మేము ఇంతవరకు మీరు అడుగకముందే డబ్బులు ఇచ్చాము. అవసరమొచ్చిపుడు పనిని చెప్పు తామన్నాము. ఇప్పుడు మీరు చేయవలసిన పని వచ్చినది. ఇప్పుడు కూడా మీతో ఉచితముగా పని చేయించుకోము. మేము చెప్పిన పనిని చేయుట వలన మీకు ఒక్కొక్కరికి పదిలక్షల రూపాయలను ఇస్తాము. మీరు ఇంతవరకు అంతడబ్బును చూచికూడా ఉండరు. మీరు చేసే పనికంటే మేము ఎక్కువ డబ్బు ఇస్తున్నాము. ఏమంటారు చెప్పండి.

**మాంత్రికులు :-** మీరు అంత డబ్బును మేము అడుగకున్నా ఇస్తున్నారు. మీరు చెప్పిన పనిని మేము తప్పక చేస్తాము. ఒకవేళ అది కష్టమైన పని అయినా మేము చేసి చూపిస్తాము.

**తపస్విబాబా :-** సంతోషము. మీరు ఎలాగైనా చేయగలరు. కానీ ఇందులో కష్టమేమీ ఉండదు. మీకు ప్రతి పని మునెప్ప ద్వారాగానీ, మునెప్ప మనుషుల ద్వారాకానీ ఎప్పటికప్పుడు తెలుస్తూవుంటుంది. వారు ఎట్లు చెప్పితే అట్లు

చేయండి. తర్వాత మీరు నాతో కలియుటకు వీలుండదు. అన్నీ మునెప్ప ద్వారానే తెలుస్తాయి. ఇక మీరు ఇక్కడి నుండి పోయి మునెప్పకు అందుబాటులోగానీ, మునెప్పదగ్గరకానీ ఉండండి. తర్వాత నేను తెలియజేస్తాను. పోయిరండి.

(తపస్విబాబాగారితో మాట్లాడిన మాంత్రికులిద్దరు మునెప్ప దగ్గరే ఉండుటకు నిశ్చయించుకొని బయలుదేరి మునెప్ప దగ్గరకు వచ్చారు. మునెప్ప దగ్గరకు రాగానే మునెప్ప ఒక్కొక్కరికి రెండు లక్షల రూపాయలు ఇచ్చి, ఈ డబ్బులు మీ ఇంటిదగ్గర ఇచ్చిరమ్మని చెప్పాడు. అలాగే మాంత్రికులు ఇద్దరు డబ్బులు తీసుకొని పోయి వారి ఇళ్ళదగ్గర ఇచ్చి తిరిగి మునెప్ప దగ్గరకు వచ్చియున్నారు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(ఈశ్వర్‌కు 16వ సంవత్సరము వచ్చి కొన్ని రోజులు గడిచిన తర్వాత అమావాస్య వచ్చినది. ఈశ్వర్ పదహారవ ఏట మొదటవచ్చిన అమావాస్య అది. ఆ దినము ఈశ్వర్‌కు శరీరములో చురుకుతనము లేకుండా నిద్రమత్తు ఎక్కువగా ఉన్నట్లుండేది. ఆ దినము తనకు ఆరోగ్యము బాగాలేదనిపించి కాలేజికి కూడా పోకుండా ఈశ్వర్ ఇంటివద్దనే ఉండి పోయాడు. తన గదిలో ఒంటరిగా ఉన్నాడు. ఈశ్వర్ నిద్రపోకున్నా ఒక విధమైన మత్తులాగ ఉండడము వలన కళ్ళు మూసుకొని కూర్చున్నాడు. మెలకువలో ఉండినా కళ్ళు తెరిచి చూడాలనిపించడము లేదు. కళ్ళు మూసుకుంటే హాయిగా ఉన్నట్లుంది. అందువలన కళ్ళు మూసుకొని కుర్చీలో కూర్చొని ఉన్నాడు. ఉదయము స్నానము చేసి, టిఫిన్ తిన్న తర్వాత అలా ఉండడము వలన ఈశ్వర్ బయటికిపోలేదు. ఈశ్వర్ అమ్మగారు అతనికి

వేడిపాలు ఇచ్చి రమ్మని పని మనిషిచేత పంపించింది. పాలగ్లాసును తీసుకొని పని మనిషి ఈశ్వర్‌రూములోనికి వచ్చింది. ఈశ్వర్ స్టడీ టేబుల్ ముందర కుర్చీలో కూర్చొని ఉన్నాడు. పని మనిషి పాలగ్లాసును తీసుకొని ఈశ్వర్‌కు వెనుక వైపునుండి వచ్చి, అతని ముందర టేబుల్ మీద గ్లాసును పెట్టి అమ్మగారు పాలు త్రాగమన్నారని చెప్పి, ఈశ్వర్ ముఖమువైపు చూచింది. ఈశ్వర్‌ను చూస్తూనే అదిరిపోయింది. భయముతో కెవ్వున అరిచి అక్కడినుండి పరుగెత్తి పోయింది. ఈశ్వర్ రూము నుండి గాబరాగా పరిగెత్తి వచ్చిన పనిమనిషిని జమీందారు, జమీందారు భార్యా ఇద్దరూ చూచారు. వారు "ఏమి, ఎందుకు భయపడుచున్నావు, ఏమి జరిగింది?" అని అడిగారు. పని మనిషికి నోటమాట రాలేదు. భయముతో ఈశ్వర్ గదివైపు చేయి చూపింది. అలా ఆమె భయపడి మాట్లాడలేక చేయి చూపడము వలన ఈశ్వర్‌కు ఏమైందోనని గాబరాతో జమీందారూ, అతని భార్య ఇద్దరూ ఈశ్వర్ రూము వైపు వచ్చారు. పనిమనిషి వద్దు, పోవద్దు అంటున్నా వారు వినిపించు కోకుండా, ఈశ్వర్ రూములోనికి పోయి ఈశ్వర్ అని గట్టిగా పిలిచారు. ఈశ్వర్ సాధారణముగా కుర్చీలో కూర్చొని ఉన్నాడు. రూములో ఏమిలేదు. ఈశ్వర్ కుర్చీలో టేబుల్ ముందర కూర్చొని ఉన్నాడు. అంతేతప్ప అక్కడ భయపడు పరిస్థితి వారికి ఏమీ కనిపించలేదు. తర్వాత రావుబహదూర్ ఈశ్వర్ అని అతనిని పిలిచాడు. ఈశ్వర్ తిరిగి చూడలేదు. ఇంత గందరగోళము జరిగినా, రావుబహదూర్ పిలిచినా అతను తిరిగి చూడలేదు. ఈశ్వర్ ఎందుకు పలకలేదని జమీందారు మరియు అతని భార్య ఇద్దరూ ఈశ్వర్ దగ్గరకు పోయి ఈశ్వర్‌ను చూచారు. ఒక్కమారు వెయ్యి వాట్సు కరెంటు షాక్ కొట్టినట్లయినది. ఇద్దరు తమకు తెలియకుండానే గది బయటికి పరిగెత్తివచ్చారు. మిగతా ఇంటిలోని వారు అందరూ అక్కడకు వచ్చి, ఏమి జరిగిందోనని ఆశ్చర్యముగా వారిని

అడిగారు. వారు ఏమీ చెప్పలేదు. అంతలో మిగతావారు కూడా ఈశ్వర్ గదివైపు పోవాలని ప్రయత్నించగా, రావుబహదూర్ వద్దని వారించి ఎవరినీ ఈశ్వర్ రూమువైపు పోనీయలేదు. అందరూ మౌనముగా ఉండిపోయారు. పనిమనిషి ఏమీ చెప్పలేకపోవుచున్నది. అలాగే రావుబహదూర్ కూడా ఏమి చెప్పలేదు. ఆ ఇంటిలో అంతా నిశ్శబ్దము ఆవహించింది. అలా గంటసేపు గడిచింది. ఈశ్వర్ తన రూమునుండి బయటికి వచ్చి "అమ్మా! నేను పాలు ఇమ్మన్నాను కదా! నా టేబుల్ మీద చల్లని పాలున్నాయి. పైగా గ్లాసుమీద మూతలేకుండా పెట్టివచ్చారు. అవి చల్లగైపోయాయి. నాకు పాలను వేడిచేసి ఇవ్వండి" అని సర్వసాధారణముగా ఈశ్వర్ తన అమ్మను అడిగాడు.

ఈశ్వర్ సర్వసాధారణముగా వచ్చి వేడిపాలిమ్మనినా, ఈశ్వర్ అమ్మ అతనిని చూచి భయముతో వణికి పోతూవున్నది. తొందరగా వేడిపాలు పంపమని చెప్పి ఈశ్వర్ తిరిగి తన గదిలోనికి పోయాడు. అయినా ఈశ్వర్‌కు పాలను ఎవరూ తీసుకపోలేదు. తర్వాత కొంతసేపటికి ఈశ్వర్ రెండవమారు బయటికి వచ్చి బయట హాలులోనే కూర్చున్నాడు. "నేను పాలు అడిగిపోయాను, మీరు మరిచిపోయారు. నాకు నిద్రమత్తుగా ఉంది తొందరగా కాఫీని చేసి ఇవ్వండి" అని అడిగాడు. రెండవమారు ఈశ్వర్ హాలులో కూర్చొని కాఫీని అడిగినప్పుడు అందరికీ కొంత ధైర్యము వచ్చింది. కాఫీని చేసి ఇచ్చారు. ఈశ్వర్ కాఫీత్రాగి హాలులోనే పేపర్ చదువుతూ కూర్చుండి పోయాడు. జమీందారు, అతని భార్య, పని మనిషి మాటిమాటికి ఈశ్వర్‌ను చూస్తూ కొంత ధైర్యము తెచ్చుకొన్నారు. ఇంటిలోని మిగతావారు అసలు విషయము ఏమి జరిగిందో అర్థముకాక తికమక పడిపోయారు. పనిమనిషిగానీ, జమీందారు దంపతులు గానీ ఆ దినము గదిలో ఏమి జరిగినది ఎవరికీ చెప్పలేదు. చెప్పదలచుకోలేదు.

ఈశ్వర్ విషయమును జమీందార్ ఎవరైనా గొప్పవారివద్ద అడిగి తెలుసుకోవాలనుకొన్నాడు. అటువంటి గొప్ప వ్యక్తులు ఎవరున్నారని జమీందారు రావుబహదూర్ చాలామందిని అడిగి చూచాడు. అలా అడుగగా చాలామంది రాజయోగానంద స్వామి పేరును చెప్పారు. అయితే ఆ స్వామి తన దగ్గర దైవజ్ఞానమును తెలుసుకొను వారికి మాత్రమే ఏదైనా సలహా ఇచ్చుననీ, మిగతావారికి ఏమీ చెప్పడని చెప్పారు. అయినా రావుబహదూర్, రాజయోగానందస్వామివద్దకు పోయి ప్రాధేయపడి తన సమస్యను గురించి అడగాలనుకొన్నాడు. అమావాస్య పోయిన నాలుగు రోజులకు బయలుదేరి రాజయోగానందస్వామి ఆశ్రమమునకు పోయాడు. అక్కడ స్వామిని కలిసి ఇలా మాట్లాడాడు.)

**జమీందారు :-** స్వామీ! నాకు దైవజ్ఞానము అంటే ఏమిటో తెలియదు. నాకు భక్తి మాత్రమున్నది. నేను ఇప్పటినుండి మీ ఆశ్రమానికి అప్పుడప్పుడు వచ్చి జ్ఞానమును తెలుసుకొంటాను. అలాగే జ్ఞానము అభివృద్ధి అగుటకు ఏదైనా విధానముంటే, దానికి డబ్బు ఖర్చుపెట్టి జ్ఞానము ప్రచారమగునట్లు సేవ చేస్తాను. అంతేకాక మీరు ఎట్లు చెప్పితే అట్లు నడుచుకొంటాను. ప్రస్తుతము నాకున్న సమస్యకు మీరే పరిష్కారము చెప్పాలి.

**రాజయోగానంద :-** నేను ఇక్కడ ప్రపంచ విషయములకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వను. నీవు దైవజ్ఞానమును తెలుసుకుంటానని చెప్పుచున్నావు, కాబట్టి ఈ ఒక్కమారు నీ సమస్యకు పరిష్కారమును చెప్పగలను. అసలుకు నీ సమస్య ఏమిటి?

**జమీందారు :-** నాకు సంతతి లేదు. కావున నేను చిన్నతనములోనే తల్లి చనిపోయిన అనాథ బాలున్ని తెచ్చుకొని పెంచుకొన్నాను. అతనికి ఈశ్వర్ అని పేరు పెట్టాను. ఈశ్వర్ అష్టగ్రహ కూటమి రోజున పుట్టిన బిడ్డ.

అతనిని గురించి చాలామంది చాలా రకములుగా చెప్పారు. నేను ఎవరి మాటవినలేదు. ఈశ్వర్ మీద ఎక్కువ ప్రేమను కల్గియున్నాను. ఈశ్వర్ కూడా మంచి బుద్ధిమంతుడు, చదువును బాగా చదువుచున్నాడు. అంతేకాక అతనికి పుట్టుకతోనే కల్గిన శక్తుల వలన చాలామందికి మంచిని చేశాడు. అతను చిన్న వయస్సులోనే ఇంటిలోనేకాక బయట ప్రజలందు కూడా మంచి పేరును తెచ్చుకొన్నాడు. అతనిని బయట ప్రజలందరూ అభిమానిస్తారు. ఈ మధ్యన పాము కరచి చనిపోయిన అబ్బాయిని బ్రతికించి ప్రజలలో పూజ్యభావమును కల్గినవాడైనాడు. అతన్ని గురించి చెప్పితే అంతా మంచే తప్ప చెడు ఏమాత్రము లేదు. అటువంటి వానిలో గడచిన అమావాస్య రోజున ఒకే ఒక చెడు కనిపించింది. దానిని మేము జీర్ణించుకోలేక పోవుచున్నాము. ఎందుకలా జరిగిందో మీరు తప్ప చెప్పెడివారు ఎవరూ లేరని చాలామంది మీ పేరునే చెప్పారు. అందువలన మీవద్దకు వచ్చి చెప్పుకొంటున్నాను.

**రాజయోగానంద :-** నీ బాధంతా నాకు అర్థమైనది. గడచిన అమావాస్య రోజున ఏమి జరిగిందో వివరముగా చెప్పు. అప్పుడు దానిని గురించి యోచిస్తాను.

**జమీందారు :-** అమావాస్య రోజున ఈశ్వర్ చురుకుతనముగా లేకుండా మజ్జుగా ఉన్నదనీ, నిద్రమత్తుగా ఉన్నదనీ చెప్పాడు. ఆ దినము కాలేజీకి కూడా పోలేదు. పగలు దాదాపు పది గంటలపుడు ఈశ్వర్ అమ్మ పని మనిషితో ఈశ్వర్‌కు పాలు ఇచ్చిరమ్మని చెప్పి పాలు పంపింది. అప్పుడు ఈశ్వర్ తన గదిలోనే కూర్చొని ఉన్నాడు. పాలు తీసుకొని పోయిన పని మనిషి పాలగ్లాసును బల్లమీద పెట్టి, ఈశ్వర్ ముఖమువైపు చూచిన వెంటనే ఆమె భయపడి అరుస్తూ బయటికి పరుగెత్తి వచ్చింది. తర్వాత మేము

ఏమి జరిగిందోనని లోపలికి పోయి ఈశ్వర్‌ను చూచాము. మనిషి అంతా బాగానే ఉన్నాడు. కానీ ముఖము వికృతాకారముగా మారి భయంకరముగా ఉన్నాడు. అది ఇట్లుందని చెప్పుటకు వీలులేనంత భయంకరముగా ఉంది. మేము కూడా భయపడి బయటికి వచ్చాము. తర్వాత మేము ఎవరూ లోపలికి పోలేదు. ఒకగంట తర్వాత ఈశ్వర్ సాధారణముగా బయటికి వచ్చి మాతో మాట్లాడాడు. బయటికి వచ్చినపుడు ప్రతి రోజూ ఉన్నట్లే ఉన్నాడు, ఏ మార్పులేదు. అతనిని ఆ విధముగా మేము ముగ్గురమే చూచాము. మేము చూచిన విషయము ఇంతవరకూ బయట ఎక్కడా చెప్పలేదు. అప్పుడు ఎందుకు అట్లు కనిపించాడో, ఇంతవరకు మాకు అర్థము కాలేదు. ఆ విషయమును అన్నీ తెలిసిన పెద్దలైన మీవద్ద తెలుపు కొనుటకు వచ్చాను. ఈశ్వర్ ఎందుకు అలా కనిపించాడో? తర్వాత ఏమి తెలియనట్లు మామూలుగా ఎందుకున్నాడో, మీరు చెప్పేంతవరకు మాకు అర్థముకాదనుకొన్నాము.

**రాజయోగానంద :-** మీరు పెంచుకొంటున్న ఈశ్వర్ సామాన్యుడు కాదు. అతడు ప్రత్యేకమైన జాతకములో పుట్టాడు. ఎనిమిది గ్రహబలముల శక్తి అతనిలో ఇమిడి ఉన్నది. అందువలన అతను సాధారణమైన మనిషికాడు. అతడు అసాధారణమైన మనిషి. ఇప్పుడతనికి 15 సంవత్సరములు పూర్తి అయిపోయి 16వ సంవత్సరము వచ్చింది. 16వ సంవత్సరములో నిన్న గడచినది మొదటి అమావాస్య. పోయిన అమావాస్య దినమున ప్రపంచమును వినాశనము చేయు భయంకరమైన శక్తి ఒకటి ఈశ్వర్‌లో చేరిపోయింది. అది ఈశ్వర్‌లో చేరుట వలన, అతని మెదడులో అది ప్రతిబింబించి, అది చేరినట్లు బయటికి తెలియుటకు దాదాపు ఒక గంటసేపు, అతని ముఖము వికృతాకారముగా మారిపోయివుంటుంది. ఆ సమయములో ఈశ్వర్‌కు

బయటి ధ్యాస వుండదు. అందువలన పని మనిషి ఎదురుగా చూచి అరచి నప్పుడుగానీ, రెండవమారు మీరు గాబరాగా అతని గదిలోనికి పోయి చూచినప్పుడుగానీ, ఈశ్వర్ మిమ్ములను ఏమాత్రమూ గుర్తించలేదు. మీరు అతనిని చూచి అరచినా అతని నుండి ఏ స్పందనా ఉండదు. అప్పుడు అతడు పూర్తి అపస్మారక స్థితిలో ఉన్నాడు. అందువలన ఈశ్వర్‌కు మీరు గదిలోనికి వచ్చి పోయిన విషయము ఏమాత్రము తెలియదు. మీరు తన ముఖములో వికృతాకారమును చూచిన విషయము కూడా ఆయనకు తెలియదు. తర్వాత అతనికి జ్ఞాపకము వచ్చిన తర్వాత తన రూములో చల్లని పాలున్నట్లు చూచి, అతడు స్వయముగా బయటకు వచ్చి, సర్వ సాధారణముగా వేడిపాలు ఇమ్మన్నాడు. అప్పటికే ఒక వినాశకరశక్తి ఈశ్వర్ లో ఇమిడిపోయింది. ఇదంతయూ మీకు తెలియదు. కావున మీరు భయపడి పోయారు. ఆ దినము అమావాస్య కావున ఉదయము నుండి ఈశ్వర్‌కి మగతగా ఉండడమూ, నిద్రమత్తుగా ఉండడము జరిగి ఉంటుంది. ఒక సాధారణ దయ్యము ఒక మనిషిలోనికి చేరపోయే ముందుగానీ, చేరినపుడు గానీ ఆ మనిషిలో ఆవులింపులు, త్రేనుపులు వచ్చినట్లు, ఈశ్వర్‌లో కూడా ఒక భయంకర వినాశకరశక్తి చేరబోయేముందు అతనికి మగతగా, నిద్ర మత్తుగా ఉండడము జరిగి ఉంటుంది. కావున ఆ దినము అతను కాలేజికి కూడా పోలేదు. అతను అష్టగ్రహ కూటమి రోజున పుట్టిన కారణమున అతనిలో కొన్ని శక్తులు ముందే ఇమిడి ఉన్నవి. అందువలన ఈశ్వర్‌ను చూస్తూనే దయ్యాలు భయపడి పారిపోయాయి. అందరూ చనిపోయాడను కొన్న బాలున్ని చనిపోలేదని గుర్తించగలిగాడు. అతని మీదికి వచ్చిన గుర్రము చనిపోయింది. ఇంతకాలము అతనిలో చిన్నచిన్న శక్తులు చేరి ఉండగా, 16వ సంవత్సరము అతనిలో భయంకరమైన లోక వినాశకర

శక్తులు చేరవలసివున్నది. అందువలన రేపు వచ్చు అమావాస్యకు కూడా మరొక శక్తి ఈశ్వర్‌లో చేరిపోగలదు. ఈ విధముగా ఆరు అమావాస్యలు జరిగి తీరును. అతనిలోనికి ఆ శక్తులు ఆవహించకుండా ఎవరూ అడ్డుపడ లేరు. అందువలన మీరు రాబోయే అమావాస్య దినములలో ముందే అతనిని బయటకు పోకుండా ఇంటిలోనే ఉంచుటకు తగిన ఏర్పాట్లు చేసిపెట్టండి. అమావాస్య దినములలో ఈశ్వర్ బయటికి పోకుండా ఆయనకు ముందే మత్తు ఏర్పడును. కావున ఆ దినము ఈశ్వర్ బయటికి పోకుండా ఇంటిలోనే ఉంటాడు. ఆ సమయములో అతని గదిలోనికిగానీ, అతనివద్దకు గానీ ఎవరూ పోవద్దండి. ఆ దినము అతను సర్వ సాధారణముగా తన గది నుండి బయటికి వచ్చేంతవరకు, ఎవరూ అతనిని గురించి యోచించక మీ పనులలో మీరు ఉండండి. ఆయనలో చేరవలసిన శక్తి చేరిపోయిన ఒక గంట తర్వాత అతను సాధారణ మనిషిగా మారిపోయి బయటికి వచ్చును. అప్పుడు అతనితో కలిసి మాట్లాడినా, కలిసివుండినా మీకు అతని ద్వారా ఎటువంటి హానిగానీ, ఎటువంటి భయముగానీ ఉండదు. ఇప్పుడు నా ద్వారా ప్రతి అమావాస్యకు జరుగు విషయము మీకు తెలిసి పోయింది కదా! కావున మీరు ఏమీ ఆందోళన చెందకుండా ఉండవచ్చును. నేను చెప్పిన దానికంటే ఎక్కువ ఏమీ జరగదని నేను అనుకొంటున్నాను. తర్వాత మీకు ఏదైనా అనుమానము ఉండినా, ఏదైనా అర్థము కాకపోయినా, లేక ఇంకా ఏమైనా జరిగినా నా దగ్గరకు వచ్చి తెలియజేయండి.

(రాజయోగానంద స్వామి చెప్పిన అనూహ్యమైన విషయమును విన్న తర్వాత జమీందారుకు తల తిరిగినంత పని అయింది. ఈశ్వర్‌కు గత అమావాస్య దినమున ఇట్లు జరిగినదని చెప్పినదీ, స్వామి జరుగబోవు

నని చెప్పినదీ పూర్తి అర్థమైనది. జరుగబోయే దానిని ఎవరూ ఆపలేరన్న విషయము కూడా అర్థమైనది. రాజయోగానంద స్వామి జరిగిన దానినీ, జరుగబోయే దానినీ, వివరించి చెప్పడము వలన వారు కొంత కుదుట పడినారు. ఈశ్వర్‌కు జరిగిన మరియు జరుగబోవు రహస్యములను ముందుగానే గ్రహించి చెప్పడము ఎవరితోనూ సాధ్యమయ్యే పనికాదను కొన్నారు. స్వామి చాలా గొప్పవాడని వారి మనస్సులో అర్థమైనది. తర్వాత జమీందారు రావుబహదూర్ స్వామితో ఇలా అన్నాడు.)

**జమీందారు :-** స్వామీ, ఈశ్వర్‌కు తనను గురించి తనకు తెలియదా? తనకు ఇట్లు జరిగిందని కొద్దిగైనా తెలియదా!

**రాజయోగానంద :-** ఏమాత్రము తెలియదు. తెలియుటకు అవకాశమే లేదు. మీరు కూడా ఏమీ చెప్పవద్దండి.

**జమీందారు :-** స్వామీ, ఈ విధముగా జరుగుట వలన ఈశ్వర్ ఆరోగ్యానికి ఏమీ ఇబ్బంది ఉండదా?

**రాజయోగానంద :-** ఆయన ఆరోగ్యాన్ని గురించి ఇప్పట్లో చింతించవలసిన పనిలేదు. ముఖ్యముగా నేను చెప్పునదేమనగా! మీకు తెలియనివి భవిష్యత్తులో ఎన్నో జరుగును. అందువలన వాటిని గురించి మీరు తెలుసు కొని చింతించినా ఏమీ ప్రయోజన ముండదు. జరిగేది జరుగక మానదు.

(అక్కడేనున్న రాఘవ, దుందుభి, రాధేశ్వరి ముగ్గురూ స్వామి చెప్పిన మాటలన్నీ విని ఆశ్చర్యపోయారు. జమీందారు కూడ చేయునది లేక స్వామికి నమస్కరించి స్వామి పాదాలవద్ద లక్షరూపాయలను దక్షిణముగా పెట్టి తర్వాత వస్తానని చెప్పి బయలుదేరిపోయాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(తపస్వి బాబా తన మందిరములో ఉండి ఈశ్వర్‌కు అమావాస్య రోజున ఏమి జరిగినది, తనవద్దనున్న శక్తుల ద్వారా తెలుసుకొన్నాడు. ఇక ఆలస్యము చేస్తే బాగుండదనీ, ఇప్పటికే తన కార్యము ప్రారంభించ వలెనని అనుకొన్న బాబా వెంటనే, మునెప్పను తనవద్దనున్న రేడియో ఫ్రీక్వెన్సీ ద్వారా సంప్రదించి జరిగినదంతా చెప్పి నాగోతుల నాగభూషణమునూ, మంత్రాల మల్లయ్యనూ, ఇద్దరినీ ఈశ్వర్ ఉన్న ఊరులో మకాము వేసి ఉండమన్నాడు. అలా అక్కడ ఉండడమేకాక, ఎలాగైనా ఈశ్వర్‌ను ఆకర్షించి వారితో స్నేహముగా ఉండునట్లు చేసుకోమన్నాడు. అలా స్నేహమును ఏర్పరచుకొన్న తర్వాత ఈశ్వర్ ద్వారా వారి ఇంటిలోని వారిని కూడా స్నేహము చేసుకొని, అప్పుడప్పుడు ఈశ్వర్ ఇంటికి పోయివచ్చునట్లు అనుకూలము చేసుకోమన్నాడు. ఇంటిలోని వారితో స్నేహము పెరిగిన తర్వాత వీలైతే ఈశ్వర్ ఇంటిలోనే తాము ఉండునట్లు చేసుకోమన్నాడు. అలా చేత కాకపోతే ఈశ్వర్ ఇంటికి దగ్గరగా ఉండునట్లు అయినా అనుకూలము చేసుకోమన్నాడు. తపస్విబాబా చెప్పిన మాటలన్నీ విన్న మునెప్ప అలాగే చేయిస్తానని చెప్పాడు. తర్వాత తనవద్దనున్న మాంత్రికులు ఇద్దరికీ బాబాగారు చెప్పిన మాటలన్నీ వివరించి చెప్పారు. మాంత్రికులు ఇద్దరూ సరేనని ఒప్పుకోగా మునెప్ప వారి ఖర్చులకు డబ్బులిచ్చి పంపాడు. ఈశ్వర్‌వున్న చెన్నపట్నము చాలా పెద్దది కాబట్టి మాంత్రికులు ఇద్దరూ ఒక ఇల్లు కిరాయికి తీసుకొని చెన్నపట్టణములో చేరి పోయారు. అలా చేరిన వారు మూలికావైద్యము చేస్తామని బోర్డు పెట్టుకొన్నారు. అంతేకాక చిన్న పిల్లలకు బాలగ్రహ దోష నివారణకు తావెత్తులు కట్టడమూ, దయ్యములున్న వారికి మంత్రించి నీళ్ళు ఇవ్వడము మొదలగు పనులు పెట్టుకొన్నారు. అట్లు వారు కొద్ది రోజులలోనే ఆ ఊరిలో గుర్తింపు తెచ్చుకొన్న వైద్యులుగా మారిపోయారు. కొందరికి జ్యోతిష్యము కూడా చెప్పుచూ ప్రజల దృష్టిని

ఆకర్షించుకొన్నారు. ఆ విధముగా ఆ ఊరిలో వారి పేరు ప్రాకిపోగా ఒక రోజు జమీందారు రావుబహదూర్ తన ఇంటి పరిస్థితి గురించి వారిని అడగాలనుకొని, ఆ ఇద్దరు మాంత్రికులవద్దకు వచ్చాడు. మల్లయ్య తాత అక్కడ జ్యోతిష్యునిగా ఉండుట వలన మల్లయ్య తాతతో ఇలా మాట్లాడినాడు.)

**జమీందారు :-** తాతగారూ, మా ఇంటిలో ఈ మధ్యన కొన్ని సమస్యల వలన నాకు మనశ్శాంతి లేకుండా పోయింది. మాకు వచ్చిన సమస్యలన్నీ లేకుండా పోయి నాకు మనశ్శాంతి కలుగుతుందా లేదా?

(జమీందారు చెప్పిన మాటలు వినిన మల్లయ్య తాతకు జమీందారు విషయమూ, అతని కొడుకు ఈశ్వర్ విషయమూ, గత అమావాస్య దినమున జరిగిన విషయమూ అన్నీ మునెప్ప ద్వారా తెలుసుకొని, వారి కోసమే ఆ ఊరికి వచ్చారు కనుక జమీందారు తమవద్దకు రావడముతో మల్లయ్య తాతకు మొత్తము సీన్ అంతా అర్థమైనది. అప్పుడు జమీందార్‌తో ఇలా చెప్పాడు.)

**మల్లయ్య :-** (ఒక్క నిమిషము కళ్ళు మూసుకొని తెరిచి) నీ సమస్య నాకు అర్థమైనది. ఈ దేశములోగానీ, ఈ రాష్ట్రములోగానీ, ఈ చెన్నపట్టణములో గానీ ఎవరికీ లేని సమస్య నీకు ఉంది. గడచిపోయిన అమావాస్య నీ జీవితమును పూర్తి చీకటి చేసింది. నీకే అమావాస్య పట్టినట్లయినది. అంతేనా!

**జమీందారు :-** (తన మనస్సులోని సమస్యను ఉన్నదున్నట్లు చెప్పిన తాత సామాన్యుడు కాడనుకొని) తాతగారూ! మీరు చెప్పినది నూటికి నూరుపాల్లు సత్యము. నాకు ఆ దిగులు పోయి మనశ్శాంతి కావాలంటే దానికి మీరు ఉపాయము చెప్పాలి.

**మల్లయ్య :-** నీవు ఈ విషయమునే ముందు ఒక స్వామీజీ దగ్గరకు పోయి అడిగి వచ్చావా లేదా చెప్పు.

**జమీందారు :-** (ఆశ్చర్యపోతూ) అవును తాతగారూ పోయి అడిగి వచ్చాను.

**మల్లయ్య :-** ఆయన జరిగింది చెప్పాడు, జరుగబోయేది చెప్పాడు. కానీ నీకు మనశ్శాంతి ఎట్లు కల్గుతుందో చెప్పలేదు. అవునా, కాదా!

**జమీందారు :-** అవును తాతగారూ. ఆయన నా మనశ్శాంతి గురించి చెప్పలేదు.

**మల్లయ్య :-** నీకు మీ ఈశ్వర్ గురించి చెప్పిన స్వామి చాలా గొప్పవాడు. ఆయనకు తెలియంది లేదు. నీకు మనశ్శాంతి లభించాలంటే చాలా కష్టమని ఆయనకు బాగా తెలుసు. అందువలన చెప్పలేదు. అది కష్టమే అయినా దానికి ఉపాయమును నేను చెప్పగలను. అయితే దానికి మా ఫీజు ప్రత్యేకముగా ఉంటుంది.

**జమీందారు :-** అయినా ఫరవాలేదు. మీరు అడిగినది ఇచ్చుకుంటాను. నాకు ఏదైనా పరిష్కారమును చూపండి.

**మల్లయ్య :-** అవకాశమొచ్చిందని అన్యాయముగా నేను అడిగేవాణ్ణి కాదు. ఏది చెప్పినా, ఏది చేసినా నీతిగా, నిజాయితీగా చేస్తాము. నీ సమస్య పరిష్కారము కావాలంటే మొదట ఈశ్వర్‌ను మాకు పరిచయము చెయ్యి. తర్వాత మేము ఇక్కడి నుండి నీ సమస్య పరిష్కారము చేయలేము. నీ సమస్య పెద్దది కాబట్టి మేము మీ ఇంటిలోనే ఉండి సమస్యను పరిష్కారము చేయవలసి ఉంటుంది. మీ ఇంటిలోనే మేముండుట వలన అన్నము మీ ఇంటిలోనే తినవలసి వస్తుంది. కావున చివరిలో మాకు ఒక ఆవునుగానీ, ఆవుకు అయ్యే డబ్బునుకానీ మీరు మాకు ఫీజు క్రిందికి ఇవ్వవలసి వస్తుంది. మీ సమస్య కొరకు ఇప్పటినుండి ఐదు, ఆరు నెలల కాలము మేము మీ ఇంటిలో ఉండవలసి వస్తుంది. దీనికి మీరు ఏమంటారు?

**జమీందారు :-** మీరు చెప్పిన దానికి సంతోషముగా ఒప్పుకుంటాను. మీరే మా ఇంటికివస్తే అంతకంటే భాగ్యమేముంది?

**మల్లయ్య :-** మేము మీ ఇంటికి పది రోజుల వరకు రాలేము. అంతలోపల మీ అబ్బాయి ఈశ్వర్‌ను మాకు చూపించి పరిచయము చేయి.

(అలాగేనని చెప్పిన జమీందారు రెండు రోజుల తర్వాత ఈశ్వర్‌ను తీసుకువచ్చి మాంత్రికులకు చూపించి పరిచయము చేశాడు. అప్పటి నుండి ఈశ్వర్ వారికి బాగా పరిచయమయ్యాడు. పది రోజుల తర్వాత మునెప్ప చెప్పినట్లు తమ మకామును జమీందారు ఇంటికి మార్చివేశారు. తర్వాత మునెప్పకు ఆ విషయమును తెలియజేశారు. తొందరగా తమ మనుషులు జమీందారు ఇంట్లో పాగా వేయడము మునెప్పకు సంతోషమైనది. ఆ విషయమును తపస్వి బాబాకు తెలియజేశారు. ఆ విషయమును తెలుసు కొన్న తర్వాత తపస్వి బాబా తన పథకము సులభముగా నెరవేరుతుందని సంతోషించాడు. తర్వాత మునెప్పకు చెప్పవలసినదంతా చెప్పి ఆ విషయమును మాంత్రికులకు తెలియజేయమన్నాడు. మునెప్ప, తపస్వి బాబా చెప్పిన సమాచారమును ఇద్దరి మాంత్రికులకు అందించాడు. వార్తలను తెలుపుటకు చెన్నపట్నములోనే తన మనిషిని ఉండునట్లు మునెప్ప చేశాడు.

అంతలో రెండవ అమావాస్య వచ్చినది. గడచిన అమావాస్య దినమున ఉన్నట్లే రెండవ అమావాస్య దినమున కూడా ఈశ్వర్‌కు నిద్రమత్తు ఆవహించి మగతగా ఉండెను. ఆ దినము కూడా ఈశ్వర్ కాలేజీకి పోలేదు. తన రూములోనే ఉండి పోయాడు. కళ్ళు తెరిచి చూచుటకు ఇష్టము లేని దానివలన కళ్ళు మూసుకొని కూర్చున్నాడు. ఆ దినము అమావాస్య అని మాంత్రికులకు కూడా తెలుసు. తపస్వి బాబా మునెప్ప ద్వారా తెలిపిన విషయములో ఆ దినము ఈశ్వర్ శరీరములోనికి ఒక శక్తి ప్రవేశించునని తెలుసు. అతనిలోనికి శక్తి ప్రవేశించునపుడుగానీ, ప్రవేశించుటకు ముందు గానీ, ప్రవేశించిన తర్వాత గంటలోపలగానీ ఈశ్వర్ ముఖము మీద, బాబా

ఇచ్చి పంపిన విభూదిని బొట్టు పెట్టాలి. అలా విభూదిని ఈశ్వర్‌కు పెట్టుట వలన ఆ విభూది ఎవరిదో, వారి మాట ప్రకారము ఈశ్వర్‌లోనికి ప్రవేశించిన శక్తి నడుచుకొనును. వివరముగా చెప్పితే విభూది ఎవరిదో వారికి ఈశ్వర్‌లోని శక్తి వశమగును. అందువలన ఇద్దరు మాంత్రికులు జమీందారుకు ధైర్యము చెప్పి, మేము అతనికి ఏమీ జరుగకుండా చూచుకుంటామని ఈశ్వర్ రూములోనికి వచ్చుటకు వేచి వున్నారు. నాగభూషణము కుంకుమ, పసుపు కలిపిన బియ్యమును (అక్షింతలను) చేతిలో పట్టుకొని ఉండగా మల్లయ్య విభూది పొట్లమును తీసుకొనివుండెను. వారి అంచనా ప్రకారము పగలు 10 గంటల సమయములో శక్తి అతనిలో చేరునని ముందే బాబా చెప్పిపంపివుండెను. సరిగా పదిగంటల నుండి పదిహేను నిమిషముల కాలము ఈశ్వర్ లోనికి శక్తి చేరుటకు సమయము పట్టునని వారికి ముందే తెలిసివుండుట చేత ఇద్దరు మాంత్రికులు పదిగంటల రెండు నిమిషములకు ఈశ్వర్ గదిలోనికి ప్రవేశించారు. ఈశ్వర్ మౌనముగా కుర్చీలో కూర్చోని ఉన్నాడు. అక్కడ చూచుటకు అంతా సర్వసాధారణముగా ఉన్నది. ఈశ్వర్ అటువైపు తిరిగి కూర్చున్న దానివలన అతని ముఖము కనిపించలేదు. ఆ సమయములో పదిహేను నిమిషముల కాలము అతనిలోనికి శక్తి ప్రవేశించుచుండును. ఈ సమయములోనే ఈశ్వర్‌కు విభూది బొట్టు పెట్టవలెను. గదిలోనికి పోయిన మాంత్రికులకు అక్కడ ఏ తేడా కనిపించక పోవడముతో ధైర్యముతో మల్లయ్య ముందుకు పోయాడు. ఏదైన తాము ఊహించని సంఘటన జరిగితే, మంత్రోచ్చాటన చేసిన అక్షింతలను చల్లి, ఏ ఆపద జరగకుండా చేయుటకు నాగభూషణము సిద్ధముగా నిలబడివుండగా, మల్లయ్యతాత ఈశ్వర్‌కు బొట్టు పెట్టుటకు ఈశ్వర్ ముందుకు పోయాడు. ముందుకు పోయి చూచిన మల్లయ్యకు మతిపోయినంత పని అయినది. ఒక్కమారు ఈశ్వర్ ముందు నుండి

ప్రక్కకు జరిగి నాగభూషణము వద్దకు వచ్చాడు. ఏమి అన్నట్లు నాగభూషణము మల్లయ్యవైపు చూచాడు. వెనుకనుండి ఈశ్వర్‌వైపు చూస్తూ మల్లయ్య "అతనికి అక్కడ తలే కనిపించలేదు, బొట్టు ఎక్కడ పెట్టాలి?" అన్నాడు. వెనుకవైపునుండి నాగభూషణముకు, మల్లయ్యకు ఇద్దరికి ఈశ్వర్ తల కనిపిస్తూనే ఉన్నది. నాగభూషణము ఈశ్వర్‌వైపు చూస్తూ "ఇక్కడినుండి కనిపిస్తావుంది కదా!" అన్నాడు.

రెండవమారు నాగభూషణము, మల్లయ్య ఇద్దరూ కలిసి ఈశ్వర్ ముందుకు పోయారు. అక్కడికి పోయిన ఇద్దరికీ ఈశ్వర్ తల కనిపించలేదు. ఇద్దరూ ఒకరి ముఖము ఒకరు చూచుకొని ప్రక్కకు వచ్చారు. వారు తీసుక పోయిన ఒక చిన్న చేతిసంచిని మొదట నాగభూషణము నిలబడివున్న చోట పెట్టివుండిరి. దానిలో కొన్ని వారికి అవసరమైన సామాగ్రిని తీసుకొని పోయి ఉండిరి. ఆ సంచికొరకు వెనకవైపు వచ్చి సంచిని తీసుకొని ఈశ్వర్ వైపు చూచారు. ఈ మారు ఇద్దరికీ వెనుకవైపు నుండి కూడా అతనికి తల లేనట్లే ఉన్నది. కుర్చీలో తలలేని మొండెము మాత్రము కూర్చునట్లు కనిపి స్తున్నది. వారు ఇద్దరూ మాంత్రికులే అయినా, అప్పుడు ఏ మంత్రమును ప్రయోగించాలో వారికి అర్థముకాలేదు. అటువంటి సమయములో కూడా వారు ధైర్యముగానే ఉన్నారు. సంచిలోనుంచి చిన్న కాటుక డబ్బాను బయటకు తీశారు. మర్మాంజనమును బయటికి తీసి దానిని ఇద్దరూ కళ్ళకు కాటుకగా ధరించారు. ఆ కాటుకను కనురెప్పలకు పెట్టుకుంటే అంతవరకు కనిపించక మర్మముగా ఉన్నవేవైనా కనిపించును. అందువలన ఆ కాటుకను పెట్టుకొన్నారు. అలా పెట్టుకొనినా వారికి ఈశ్వర్ తల ఏమాత్రము కనిపించ లేదు. అంతేతప్ప అక్కడ ఏమీ జరుగలేదు. అప్పుడు ఆ గదియంతా తన చేతిలోని అక్షింతలను నాగభూషణము చల్లాడు. ఈ

విధముగా లోపల జరుగుచుండగా బయట జమీందారూ, అతని భార్యా ఇద్దరూ లోపల ఏమి జరుగుచున్నదోనను ఆందోళనతో ఉన్నారు. లోపలికి వచ్చిన ఇద్దరు మాంత్రికులకు తలేలేని మనిషికి తాము బొట్టు ఎలా పెట్టాలో అర్థము కాలేదు. ఈ విధముగా లోపల పదిహేను నిమిషములు గడిచి పోయినవి. అప్పటికి అతనిలోనికి రావలసిన శక్తి పూర్తిగా వచ్చేసింది. ఇంకా గంట కాలములోపల ఆ మాంత్రికులు విభూదిని బొట్టుగా ఈశ్వర్‌కు పెట్టాలి. ఈ మారు మల్లయ్యకు ఒక ఆలోచన వచ్చినది. ప్రక్కన ఉన్న అద్దమును తీసుకొని ఈశ్వర్ ముందుర పెట్టితే దానిలో అంతవరకు కనిపించని తల అద్దములో కనిపించుననీ అప్పుడు అద్దములో చూస్తు కనిపించని ముఖమునకు బొట్టు పెట్టవచ్చుననుకొన్నారు. మల్లయ్య అప్పుడు ఆ విషయమును నాగభూషణమునకు చెప్పి నాగభూషణము అద్దమును పట్టుకొనునట్లు చేశాడు. అప్పుడు అద్దములో చూడగా దానిలో పూర్తి మనిషే కనిపించలేదు. అద్దములో కనిపించని మొండెము బయట కనిపిస్తావున్నది. అది ఒక విధముగా మాంత్రికులకైనా భయానక పరిస్థితే అయినా వారు ధైర్యము గానే ఆ గదిలో అంతవరకు ఉన్నారు. ఒక ప్రక్క మర్మాంజనమూ పని చేయలేదు. రెండవ ప్రక్క అద్దమూ పని చేయలేదు. మూడవ విధముగా వారు వేసిన అక్షింతల ప్రభావమూ లేకుండా పోయినది. ఇక వారు ఏమి చేయాలో ఆలోచించసాగారు. అప్పటికి మిగిలిన గంటలో ఇరవై (20) నిమిషములు గడచిపోయినవి. ఇకవారు ఏమి చేసినా నలభై (40) నిమిషములలోనే చేయాలి. అప్పుడు వారికి ఒక ఆలోచన వచ్చింది. భూజరీ మంత్రమును పది నిమిషములు పఠించి, ఆ మంత్రమును జాగృతీచేసి చూడాలనుకొన్నారు. అప్పుడు మల్లయ్య తాత భూజరీ మంత్రమును జపించను మొదలు పెట్టాడు. పది నిమిషములలో 108 మార్లు ఆ మంత్రమును జపించి, ఆ మంత్రమును జాగృతీ చేసి, ఆ

మంత్రముతో నీటిని మంత్రించి ఆ గది నాలుగు మూలల్లో చల్లారు. అలా చేయుట వలన ఆ గదిలో తమకు తెలియకుండా ఉండి, ఈశ్వర్ తలను కనిపించకుండా చేయుశక్తి ఏదైనా ఉంటే ఆ గదినుంచి బయటికి పోతుందని అప్పుడు ఈశ్వర్ తల తమకు కనిపిస్తుందని వారి ఉద్దేశము. ఆ విధముగా నీటిని చల్లినా ఏ ప్రయోజనము లేకుండా పోయినది. ఇదంతా జరుగు లోపల (20) నిమిషములు గడచిపోయింది. ఇక మిగిలినది కేవలము ఇరవై నిమిషములు మాత్రమే. అప్పుడు వారు తమవద్దనున్న విభూదిని ఇల్లంతా చల్లి చూడాలనుకొన్నారు. అలాగే విభూదిని ఆ గది అంతా చల్లి చూచారు. అప్పటికి కూడా ఈశ్వర్ తల వారికి కనిపించలేదు. అలా కనిపించకపోగా వారికి చర్మమంతా నవ్వలు (దురదలు) కొద్దికొద్దిగా మొదలు పెట్టాయి. అప్పుడు వారు చర్మమును గోక్కుంటూ ఇక ఏమి చేయాలని ఆలోచిస్తుండగానే వారికి ఒళ్ళంతా విపరీతమైన నవ్వలు వచ్చాయి. అంతలో సమయము కూడా అయిపోయినది. ఇక అక్కడుండకూడదని ఇద్దరు మాంత్రికులు గది బయటకు వచ్చారు. అలా బయటికి వచ్చిన వారిని జమీందారు ఏమైంది అని ప్రశ్నించాడు. దానికి వారు "మేము ఏమి చేయాలో అది చేశాము. మీరు ధైర్యముగా ఉండండి అని వారి గదిలిలోనికి పోయి గుడ్డలు విప్పి శరీరమంతా గోక్కున్నారు. బయట జమీందారు ఆ మాంత్రికులు ఇంతసేపు లోపల ఉన్నారు కాబట్టి ఈశ్వర్‌కు గత నెల జరిగినట్లు జరుగకుండా చేశారని అనుకొన్నారు.

రెండు గంటల తర్వాత స్నానము చేసి వారిగది నుండి ఇద్దరు మాంత్రికులు బయటకు వచ్చి జమీందారుకు చెప్పి బజారుకు పోయారు. బజారులో మునెప్ప ముందే సమాచార సేకరణకు ఏర్పాటు చేసిన మనిషితో

జరిగిన విషయమంతా చెప్పి పంపారు. జరిగిన విషయమును తమ వార్తాహరుని ద్వారా తెలుసుకొన్న మునెప్ప ఆ సమాచారమును తపస్విబాబాకు చేరవేశాడు. తాను అనుకొన్న కార్యము జరుగక పోవడానికి కారణము ఏముంటుందని బాబా యోచించను మొదలు పెట్టాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × ×

(రాజయోగానంద స్వామికి జమీందారు ఇంటిలో మునెప్ప మనుషులైన ఇద్దరు మాంత్రికులు చేరియున్నారని గానీ, వారు రెండవ అమావాస్య దినమున ఈశ్వర్‌కు విభూదిబొట్టు పెట్టాలని విశ్వప్రయత్నము చేసి విఫలమైనారనిగానీ తెలియదు. తపస్విబాబా ముందుగానే తన పథకమును నెరవేర్చుటకు మాంత్రికులను జమీందారు ఇంటిలోనే చేర్పించాడనీ, అలా చేయగల్గుతాడనీ రాజయోగానందస్వామి ఏమాత్రము ఊహించలేదు. రాబోయే మూడవ అమావాస్య ఆదివారము రాబోతున్నది. కావున ఆ దినము కంటికి కనిపించని సూక్ష్మములకు ఎక్కువశక్తి ఉండును. అందువలన ఆ దినము జమీందారు ఇంటిలో ఈశ్వర్‌లోనికి ఒక ప్రత్యేకమైన శక్తి ప్రవేశించునని స్వామి అనుకొన్నాడు. ఈశ్వర్‌కు జరిగేది జరుగక మానదనీ, దానిని గురించి ఏమీ పట్టించుకోకుండా ఉండమని ముందే జమీందారుకు చెప్పియుండుట వలన, ఆ ఇంటివారికి ఏమీ జరుగదని స్వామి అనుకొన్నాడు. స్వామి చెప్పినా, స్వామి మాటలను ఖాతరు చేయకుండా, ఎవరో మాంత్రికులు చెప్పిన మాటను జమీందారు విన్నాడనీ, ఈశ్వర్‌కు ఏదో మంచి చేయాలని ఉద్దేశముతో మాంత్రికులను ఇంటిలోనే పెట్టుకొన్నాడను విషయము స్వామికి తెలియదు. అందువలన రాబోయే అమావాస్య ఆదివారము వస్తున్నా దానిని గురించి పెద్దగా చింతించవలసిన అవసరములేదనుకొన్నాడు. అంతేకాక రాబోయే నాల్గవ, ఐదవ, ఆరవ అమావాస్యలు కీలకమైన దినములు కాబట్టి అప్పుడు తాము కూడా

ఆశ్రమము వదలి చెన్నపట్నములోనే ఉండవలెనని స్వామి నిశ్చయించు కొన్నాడు. అదే విషయమునే రాఘవతో చెప్పాడు.)

**రాజయోగానంద :-** రాఘవా! ఈశ్వర్‌కు 16వ సంవత్సరము రెండు అమావాస్యలు గడచిపోయాయి. అతనిలోనికి ప్రకృతిలోని అతి పెద్దశక్తులు రెండు ప్రవేశించి ఉంటాయి. మూడవ అమావాస్య ఆదివారము రాబోవు చున్నది. ఆ దినము కొంత ప్రత్యేకత కల్గినదైనా అందులో మనము చేయునది ఏమీ లేదు. తర్వాత రాబోయే నాల్గు, ఐదు, ఆరు అమావాస్యలు చాలా కీలకమైనవి. అప్పుడు మనము కూడా ఈశ్వర్ ఉన్న చెన్నపట్నములోనే ఉండవలసిన పని వస్తుంది.

**రాఘవ :-** స్వామీ, ఈశ్వర్‌లోనికి చేరునవి అతి పెద్దశక్తులు అన్నారు కదా! అవి ఏ శక్తులు?

**రాజయోగా :-** పంచభూతములు మహాశక్తులు కదా, ఆ మహా భూతములు ప్రళయములో సృష్టిని అంతటినీ నాశనము చేయును కదా! వాటి తర్వాత ఉన్న భూతములు సృష్టిని అంతటినీ నాశనము చేయలేవు. సృష్టిలో కొంత భాగమును నాశనము చేయగల శక్తులు మహాభూతముల తర్వాత ఉన్న స్వల్ప భూతములని అర్థము చేసుకో. వీటి తర్వాత పెద్దవి మహా భూతములు ఐదు మాత్రమే గలవు. మహాభూతముల తర్వాత పది అతి పెద్ద భూతములున్నవి. వాటి తర్వాత స్థాయివి కొన్ని ఉండగా, వాటి తర్వాత కొన్ని ఉండగా, వాటి తర్వాత కొన్ని ఇట్లు అనేక స్థాయిలలో కోట్లాది భూతములున్నవి. ఐదు మహాభూతముల తర్వాత స్థాయి భూతములు పది ఉన్నాయన్నాము కదా! వాటిలో మొత్తము ఆరు ఒక్కొక్క అమావాస్య దినమున ఒక్కొక్కటి ప్రకారము ఆరు అమావాస్యలకు ఆరు ఈశ్వర్‌లో చేరును. అందువలన ప్రకృతి తర్వాత పెద్దశక్తి గల భూతములు అని అన్నాను.

**రాఘవ :-** ఆ భూతముల శక్తులు ఈశ్వర్‌లో చేరి ఏమి చేయును?

**రాజయోగానంద :-** ఏమి చేయునో ఖచ్చితముగా మనము కూడా చెప్పలేము. ఒకటి మాత్రము చెప్పగలము. ఆ శక్తులు ప్రపంచములో కొంతవరకు జీవ రాసులను నాశనము చేయునని మాత్రము చెప్పగలము. అలా జరుగకూడదనే మనము కోరుకొనుచున్నాము. ఆ శక్తులను వశము చేసుకొని వాటితో వినాశనమును సృష్ఠించాలని తపస్విబాబా అనుకొంటున్నాడని, దానిని మనము నిరోధించాలని ముందే చెప్పాను కదా!

**రాఘవ :-** ఆ శక్తులను నిరోధించుటకు మనము ఏమి చేయాలి?

**రాజయోగానంద :-** మనము శక్తులను నిరోధించలేము. వాటిని నిరోధించుటకు మనచేత కాదు. మనము చేయవలసినది వాటిని ప్రేరేపించి వాటి శక్తిని వినియోగించు దుర్మార్గులను నిరోధించాలి. ఆ శక్తులు గొప్పవే అయినా, వాటిశక్తి చాలా వినాశకరమైనదైనా, అవి ఏమీ చేయవు. వాటిని వశము చేసుకొని ప్రపంచములో ఆధిపత్యమును సంపాదించుకోవాలనుకొను వారిని మనము నిరోధించాలి. దానికొరకు మనము ఇప్పటినుండి ప్రయత్నము చేయాలి. ఆ శక్తులను దుర్మార్గులు వశము చేసుకోకుండా చూడాలి.

(ఆ విధముగా చెప్పిన రాజయోగానంద స్వామి, తపస్విబాబా ఏమి ప్రయత్నము చేస్తాడో చూచి, దానికి తగినట్లు స్పందించాలని అనుకొన్నాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(మునెప్పద్వారా చెన్నపట్నములో జమీందారు రావుబహదూర్ ఇంటిలో జరిగిన విషయమంతా తెలుసుకొన్న తపస్విబాబా, తమ మాంత్రికులు ఒక గంటసేపు ప్రయత్నము చేసి ఈశ్వర్ ముఖమున బొట్టును

పెట్టలేక పోయారనీ, ఎందుకు ఆ సమయములో ఈశ్వర్ తల కనిపించ కుండా పోయిందనీ బాబా చాలాసేపు ఆలోచించాడు. ఆ విషయము బాబాగారికి ఏమాత్రము అర్థము కాలేదు. మాంత్రికులు తమ లోపము ఏమీ లేకుండా ప్రయత్నించారనీ, ఒకగంటసేపు ధైర్యముగా ఈశ్వర్ గదిలో ఉండి, ఎన్నో విధముల ప్రయత్నించిన వారిని పొగడవలసిందే గానీ తప్పుపట్టుటకు వీలు లేదనుకొన్నాడు. రాబోయే అమావాస్య దినమున మాంత్రికులకు తమ సహాయమును అందించి ఈ మారు తప్పనిసరిగా బొట్టు పెట్టునట్లు చేయాలి. అని తపస్విబాబాగారు అనుకోవడము జరిగినది. వారికి తాము ఒక శక్తి ప్రభావముతో కూడిన కాటుకను తయారు చేసి ఇవ్వాలని అనుకొన్నాడు. అలా తాము తయారు చేసిన కాటుకను నొసలుకు నల్లని బొట్టుగా పెట్టుకొంటే ఏదైనా కనిపించకుండా పోయే ప్రసక్తే ఉండదు. అందువలన ఆ కాటుకను తయారు చేయమని తన మనుషులకు బాబా ఆదేశించాడు. బాబా ఆదేశానుసారము అడవిలో తిరుగుచున్న పదకొండు జాతుల యొక్క పక్షుల నుండి పదకొండు రంగుల ఈకలను సేకరించి, వాటిని కాల్చి మసి చేసి ఆ మసి నువ్వుల నూనెతో కలిపి కాటుకను తయారు చేశారు. అలా చేసిన కాటుక దేనికి పనికివస్తుందో మాంత్రికులకు చెప్పి ఇచ్చి రావడము జరిగింది. ఆ కాటుక అధిపతియైన దేవత యొక్క మంత్రమును చెప్పి, ఆ మంత్రమును ఎలా సిద్ధి చేసుకోవాలో కూడా చెప్పారు. దాని ప్రకారమే మాంత్రికులు కాటుక పని చేయునట్లు మంత్రసిద్ధిని కూడా చేసుకొన్నారు. ఆ కాటుక యొక్క పనితనమును పరీక్షించుటకు మాంత్రికుడు మల్లయ్య దానిని నొసలుకు బొట్టుగా పెట్టుకొని ఊరిలోనికి పోయాడు. అతనితో పాటు నాగభూషణము కూడా పోయాడు. అలా ఊరిలో పోవుచుండగా ఒక ఇంటిముందర వాకిలి ప్రక్కన ఒక వ్యక్తి చినిగిన గుడ్డలు ధరించి ఏడ్చుకొంటూ కూర్చుచున్నాడు. అతను వాకిలి

ప్రక్కనే కూర్చొని ఏడుస్తున్నా అతని ప్రక్కనే ఇంటిలోనికి పోవువారుగానీ, బయటికి వస్తున్నవారుగానీ, ఇంటిలోని వారుగానీ అతనిని చూడనట్లు ఏమీ పట్టించుకోలేదు. అప్పుడు మల్లయ్యతాత నాగభూషణమును చూచి "అతను వాకిలి ప్రక్కనే కూర్చొని ఏడుస్తున్నా అతనిని ఎవరూ పట్టించుకో లేదు" అని అనెను. ఆ మాటను విన్న నాగభూషణము "ఆ వాకిలి ప్రక్కన మనిషే లేడుకదా! లేని మనిషిని ఎవరు పట్టించుకుంటారు" అని అన్నాడు. అప్పుడు మల్లయ్యతాతకు తాను చూచినది మనిషిని కాదనీ, తాను చూచినది అక్కడ ఎవరికీ కనిపించని దయ్యముననీ, తాను కాటుక బొట్టు పెట్టుకొన్న దానివలన వారికి కనిపించని దయ్యము (సూక్ష్మశరీరము) తనకు కనిపించిందని తెలిసింది. అప్పుడు ఆ విషయమును నాగభూషణము నకు కూడా చెప్పాడు. తమవద్దనున్న కాటుక ప్రభావముతోనే ఎవరికి కనిపించనిది తనకు కనిపించింది అని అనుకొన్నారు.

ఇంకా కొంతదూరము పోయిన తర్వాత వారు పోవుచున్న దారిలో ఒక బలిసిన దున్నపోతు రోడ్డుకు ప్రక్కన నిలబడివుండెను. దానిని చూచిన మల్లయ్య దానికి దగ్గరగా పోకుండా నడిరోడ్డులోనికి పోయి దానిని దాటిన తర్వాత రోడ్డుప్రక్కకు వచ్చి నడిచెను. వెనుకవస్తున్న నాగభూషణము మల్లయ్యను చూచి "మేము పోయినట్లు రోడ్డు ప్రక్కనే పోకుండా నడి రోడ్డులోనికి పోయి తిరిగి ప్రక్కనెందుకు వచ్చావు" అని అడిగెను. అప్పుడు మల్లయ్యతాత నాగభూషణమును చూచి "అక్కడ రోడ్డు ప్రక్కన అంత పెద్ద దున్నపోతు నిలబడివుంది కదా! దానికి దగ్గరగా పోకుండా రోడ్డు మీదికి వచ్చి, దానిని దాటిన తర్వాత రోడ్డు ప్రక్కకు వచ్చాను. దానిని ఎందుకడు గుచున్నావు" అని అనెను. అప్పుడు నాగభూషణము మల్లయ్యను చూచి నవ్వి "నీకు చూపు తగ్గిపోయింది. అక్కడ దున్నపోతులేదు. లేని

దున్నపోతును ఉంది అంటున్నావు” అని అన్నాడు. ఆ మాటవినిన మల్లయ్య, నాగ భూషణమును చూచి “ఒరే తిక్కోడా! నీకు కనపడనిది నాకు కనిపించింది అంటే అది దున్నపోతు దయ్యమురా. నేను కాటుకబొట్టు పెట్టుకొన్నాను కాబట్టి అది నాకు కనిపించింది, నీకు బొట్టులేదు కాబట్టి అది కనిపించలేదు'' అని అన్నాడు. దానికి నాగభూషణము నవ్వి ''దున్నపోతు దయ్యము కూడా ఉంటుందా'' అన్నాడు. అప్పుడు మల్లయ్యతాత “పూర్తి చనిపోని ఏ జీవరాసులైనా, పూర్తి చావు వచ్చేంతవరకు దయ్యముగా ఉండవలసిందే. దాని ప్రకారము మనుషులేకాదు, కుక్కలు, నక్కలూ, గాడిదలూ, గుఱ్ఱాలూ అన్ని దయ్యాలుగా ఉన్నాయి. అట్లున్నాయి కాబట్టే ఇక్కడ బజారులో దున్నపోతు దయ్యము నాకు కనిపించింది నీకు కనిపించలేదు” అని అన్నాడు. ఆ మాట వినిన తర్వాత భూమిమీద ఏ జీవరాసులైనా దయ్యములుగా ఉండవచ్చునని నాగభూషణమునకు తెలిసింది. అంతేకాక మల్లయ్యతాతకు కూడా తాను ధరించిన కాటుక బాగా పని చేస్తున్నదని కూడా తెలిసింది. ఈ విధముగా కాటుకను పరీక్షించి చూచి ఇద్దరు మాంత్రికులూ, మునెప్పకు కాటుక బాగా పనిచేయుచున్నదని చెన్నపట్నములోనే ఉన్న మనిషి ద్వారా తెలియజేశారు.

మూడవ అమావాస్య రేపు అనగా ముందురోజే తపస్విబాబాగారు మునెప్పద్వారా తెలియజేసిన సమాచారము వారికి అందినది. ఈ అమావాస్య దినమున ఎలాగైనా అతనిలోనికి శక్తి ప్రవేశించునపుడు గానీ, ప్రవేశించిన తరువాత గంటలోపలగానీ విభూదిని ఏ విధముగానైన పెట్టి తీరవలెనని బాబాగారు పంపిన సమాచారములోని సారాంశము. మాంత్రికులు ఇద్దరూ కూడా, తాము అడగకుండినా లక్షలాది రూపాయలు తమకు ఇచ్చి ఎంతో మేలు చేసిన బాబాగారికి ఎటు తిరిగి వారు చెప్పిన

పని చేసిపెట్టాలని దృఢ నిశ్చయములో ఉన్నారు. శనివారము గడిచి పోయింది, ఆదివారము వచ్చింది. ఆ దినము ఆదివారముతో పాటు అమావాస్య కూడ వచ్చిన దానివలన జమీందారు రావుబహదూర్ తన కొడుకు విషయములో కొంత చింతించినా, తర్వాత పోయిన నెల అమావాస్య దినమున ఈశ్వర్‌కు ఏమి జరుగలేదని మాంత్రికులు తెలియజేశారు. కావున ఈ నెలకూడా వారు ఇద్దరూ ఈశ్వర్ గదిలోనే కూర్చొని ఏమీ జరుగకుండా చూస్తారను ధైర్యముతో ఉన్నాడు. ఆదివారము అమావాస్య దినమున, ముందు రెండు నెలలలో ఉన్నట్లే ఈశ్వర్‌కు ఆ దినము కూడా నిద్రమత్తుగా ఉన్నది. ఆ దినము ఈశ్వర్ బయటికి ఎక్కడికి పోకుండా ఇంటిలోనే ఉండిపోయాడు. ఆ దినము ఆ విధముగా ఉండడము గతములో కూడా చూచిన దానివలన జమీందారు రావుబహదూర్ ఈశ్వర్ ఆరోగ్యమును గురించి చింతించలేదు. మాంత్రికులు కూడా సర్వ సన్నద్ధముగా ఉన్నారు. ఉదయము పది గంటలు కాబోతున్నది. ఈశ్వర్ తనగదిలోనే ఉండిపోయాడు. సరిగా పది గంటలకు ఖగోళములోని శక్తి దిగివచ్చి ఈశ్వర్ శరీరములోనికి ప్రవేశించను మొదలు పెట్టింది. అప్పుడే ఆ గదిలోనికి మాంత్రికులు ప్రవేశించారు. మాంత్రికులు ఇద్దరూ పక్షుల ఈకల కాటుకను పెట్టుకొని దాని మంత్రమును జపించుకున్నారు. గదిలో ఈశ్వర్ దగ్గరకు పోయి అతని ముఖము మీద విభూది బొట్టును పెట్టాలను కున్నారు. ఈశ్వర్ ముందువైపుకు నాగభూషణము, మల్లయ్య ఇద్దరు పోయారు. మల్లయ్యకు ఈశ్వర్ కనిపిస్తున్నాడు. అతను కళ్ళు మూసుకొని కూర్చున్నాడు. ఆ గదియంతా నిశ్శబ్ధముగా ఉంది. మల్లయ్య తనవద్దనున్న విభూదిని తీసి ఈశ్వర్ ముఖాన పెట్టబోయాడు. అయితే మల్లయ్య ఈశ్వర్ ముఖాన బొట్టు పెట్టకనే కళ్ళు తిరిగి క్రింద పడిపోయాడు. వెంటనే నాగభూషణము అతనిని పైకి లేపి “ఏమైంది” అని అడిగాడు. అప్పుడు

మల్లయ్య బాగా నిలబడి “పైత్యము వలన కళ్ళు తిరిగాయి” అన్నాడు. “నీవు ప్రక్కకు రా! నేను పెట్టుతాను” అని నాగభూషణము మల్లయ్యను ప్రక్కకు జరిపి, మల్లయ్య చేతిలోని విభూదిని తీసుకొని ఈశ్వర్‌కు పెట్టబోయాడు. అప్పుడు అతనిని ఎవరో లాగి ప్రక్కకు త్రోసినట్లయినది. నాగభూషణము కూడా ప్రక్కకు వచ్చి క్రిందపడ్డాడు. దానిని చూచిన మల్లయ్యతాతకు తమకు తెలియకుండా ఏదో జరుగుచున్నదని అనుమానము వచ్చినది.

ఇక లాభము లేదనుకొన్న మల్లయ్య తన వశములోనున్న కాటేరిని గురించి జపించాడు. కాటేరి అక్కడికి రావాలని చూచింది. కానీ అది రాలేకపోయింది. ఆ గదిలో ఒకమూల కట్టివేయబడి నిలిచిపోయింది. మల్లయ్య కర్ణపిశాచి ద్వారా కాటేరి కట్టివేయబడిందని తెలుసుకోగలిగాడు. తర్వాత భగళాముఖి దేవతను పిలిచాడు. ఆ దేవత ఆ పరిసర ప్రాంతాలకు కూడా రాలేకపోయింది. పేరు పొందిన ఆ దేవతలే అక్కడ ఏమీ చేయలేక పోవడముతో మిగతా దేవతల చేత కూడా ఏమీ కాదనుకొన్నాడు. అంతలో పదిహేను నిమిషములు గడచిపోయింది. ఈశ్వర్‌లోనికి ప్రవేశించవలసిన శక్తి ప్రవేశించింది. తర్వాత గంటకాలములో తమ పని నెరవేరాలని తలచిన మాంత్రికులు క్రొత్త ప్రయోగము చేయాలనుకొన్నారు. మూత్రమును ఒక గిన్నెలోనికి పోసి దానిలో మంత్రించిన పసుపు, కుంకుమను కలిపి ఆ గది అంతటా చల్లారు. దానివలన తమ మీద ఏ శక్తులూ పని చేయవని వారి ఉద్దేశము. ఇక తమకు ఎవరూ అడ్డము రారనుకొని మల్లయ్య విభూదితో ముందుకు పోయాడు. నాగభూషణము మల్లయ్య ప్రక్కనే నిలబడినాడు. మల్లయ్య తన చేతితో విభూదిని తీసుకొని ఈశ్వర్ తలకు రెండించుల దూరము వరకు తన చేయిని చాచాడు. ఇక ఒక క్షణములో ఈశ్వర్ నుదిటి మీద మల్లయ్యబొట్టు పెట్టగలడు. అయితే అప్పుడు

ఒక్కమారుగా ఈశ్వర్ కళ్ళు తెరిచి చూచాడు. ఢామ్ అని పెద్దశబ్దము ఏర్పడింది. మాంత్రికులిద్దరు ఆరు అడుగుల దూరము విసిరివేయబడినారు. మల్లయ్యకు కుడిచేయి పనిచేయకుండా పోయింది. నాగభూషణముకు కుడికాలు పని చేయలేదు. వారు లేవలేని స్థితిలో నీరసముగా పడిపోయారు. గదిలో పెద్ద బాంబు పగిలినంత శబ్దము ఏర్పడినా ఈ శబ్దము బయటవున్న జమీందారుకుగానీ, ఆ ఇంటిలోనివారికిగానీ ఎవరికీ వినిపించలేదు.

తర్వాత గంటకాలము గడిచిపోయింది. ఈశ్వర్ మెలుకువలోనికి వచ్చి చూచాడు. గది అంతా రంగునీళ్ళను విదిలించినట్లు కనిపించింది. అంతేకాక తన ముందర మాంత్రికులిద్దరూ నిస్సహాయస్థితిలో లేవలేక పడి వున్నారు. ఈశ్వర్‌కు ఏమీ అర్థము కాలేదు. వెంటనే బయటకు వచ్చి తాను చూచిన దానిని జమీందారుకు తెలిపాడు. అప్పుడు జమీందారు అతని అనుచరులు లోపలికి పోయి చూచి మాంత్రికులిద్దరిని లేపి బయటకు తెచ్చారు. వారికి ఒకరికి కాలు, ఒకరికి చేయి పని చేయడములేదని జమీందారుకు కూడా అర్థమైనది. వారికొరకు తమ ఫ్యామిలీ డాక్టరును పిలిచి చూపించాడు. మల్లయ్యకు చేయి, నాగభూషణమునకు కాలు నరములు పని చేయలేదని డాక్టరు చెప్పి మందులిచ్చి మూడు రోజులు విశ్రాంతి తీసుకొమ్మని చెప్పి పోయాడు. ఇద్దరు మాంత్రికులనూ వారి గదిలోనికి చేర్చి ఎవరూ లేని సమయములో జమీందారు వారిని గదిలో ఏమి జరిగిందని అడిగాడు. దానికి వారు తమ విభూది విషయమును చెప్పకుండా మేము గదిలో ఉండగా పెద్దశబ్దము వినిపించింది వెంటనే మాకు ఇలా అయినదని కప్పి పుచ్చి చెప్పారు. వారి మాటలు నమ్మిన జమీందారుకు తమకు ఏ శబ్దము వినిపించలేదే అని అనుమానము వచ్చింది.

మాంత్రికుల సమాచారము కొరకు చెన్నపట్నములోనే కాచుకొని వున్న మనిషికి సాయంకాలము మాంత్రికులు వస్తారని బజారులో కాచుకొని చూచాడు. వారు రాత్రి ఏడు గంటల వరకు రాలేదని తానే మాంత్రికుల వద్దకు వచ్చి విభూది విషయమును తెలుసుకొని పోయి మునెప్పకు తెలుపా లనుకొన్నాడు. వార్తాహరుడే జమీందారు ఇంటికి వచ్చి నాగభూషణము వద్దకు వైద్యము కొరకు వచ్చానని, మందులు తీసుకొని పోవాలన్నాడు. ఆ మాటవిన్న జమీందారు అతనిని మాంత్రికుల రూమువద్దకు పంపాడు. అప్పుడు వార్తాహరుడు ఇద్దరి మాంత్రికుల పరిస్థితిని స్వయముగా చూచాడు. విభూదిని పెట్టలేక పోయిన విషయమును కూడ తెలుసుకొని అక్కడినుండి పోయి, రెండవ రోజు మునెప్పకు ఆ విషయమంతా తెలియజేశాడు. చివరకు ఈశ్వర్‌గదిలో జరిగిన సమాచారమంతా తపస్విబాబాకు తెలిసిపోయింది. ఇదేమి విచిత్రము అని బాబా బాగా యోచించను మొదలుపెట్టాడు. జమీందారు ఇంటిలో మాంత్రికుల ఆరోగ్యము గంటగంటకు క్షీణించుచున్నది. చివరకు చేయునది లేక మాంత్రికుల బంధువులకు సమాచారమును అందివ్వగా వారు అందరూ అక్కడికి వచ్చారు. డాక్టరు జమీందారు ఇంటిలోనే ఉండి వారికి వైద్యము చేయుచున్నాడు. అయినా వారు రెండవరోజు విచిత్రముగా ఇద్దరు ఒకే నిమిషములో చనిపోయారు. ఆ సంఘటన జమీందారుకు ఏమి అర్థము కాకుండా చేసింది. ఇంకా ఏమి జరుగుతుందోనని ఆయనలో భయము పుట్టింది. ఈశ్వర్‌కు మాత్రము ఏమీ అర్థము కాలేదు. తన గదిలోనికి మాంత్రికులు ఎందుకు వచ్చారో కూడా తెలియదు. ఎవరిని అడిగినా మాకు తెలియదని దాటవేస్తున్నారు తప్ప ఎవరూ ఏమీ చెప్పలేదు. జమీందారు రావుబాహ దూర్‌కు మాంత్రికులు ఇద్దరూ ఒకే నిమిషములో చనిపోవడమునకు ఏదో బలమైన కారణముంటుందని భయపడిపోయాడు. ఆ భయము పోవాలంటే

రాజయోగానంద స్వామి వద్దకు పోయి జరిగిన విషయమంతా చెప్పాలనుకొన్నాడు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(రాజయోగానంద ఆశ్రమములో రాఘవ, దుందుభి, రాధేశ్వరి ఇంకా కొంతమంది కూర్చొనివుండగా స్వామి జ్ఞానమును వారికి చెప్పు చుండెను. అప్పుడు రాఘవ స్వామిని ఈ విధముగా అడిగాడు.)

**రాఘవ :-** ఒక మనిషిని దైవజ్ఞానముకంటే విషయజ్ఞానమే తొందరగా మార్చగలదన్నారు. విషయజ్ఞానమునకు ఉన్నంత శక్తి దైవజ్ఞానమునకు లేదా?

**రాజయోగానంద :-** ఇక్కడ విషయ జ్ఞానము, దైవ జ్ఞానము రెండూ శక్తి కల్గినవే అయినా వాటి శక్తులు వేరువేరు కోవకు చెందినవిగా ఉన్నవి. విషయ జ్ఞానములోని శక్తి మనిషిని మాయవైపు పంపించగలదు. అలాగే దైవ జ్ఞానములోని శక్తి మనిషిని దేవునివైపు పంపగలదు. ఈ రెండూ వేరువేరు శక్తులు, వాటివలన కల్గు ఫలితములు కూడా వేరువేరుగా ఉన్నవి. ప్రపంచ విషయములలో ఆసక్తియున్నవారికి విషయ జ్ఞానము యొక్కశక్తి, దైవజ్ఞానము యొక్కశక్తికంటే పెద్దదే అని చెప్పవచ్చును. ఎందుకనగా వారికున్న ఆసక్తినిబట్టి వారిపట్ల విషయజ్ఞానము చూపినంత ప్రభావము దైవజ్ఞానము చూపలేదు. అందువలన ఆ సందర్భములో విషయ జ్ఞానముశక్తికంటే దైవజ్ఞానశక్తియే చిన్నదగును. అలాగే దైవజ్ఞానము ఆసక్తియున్న వారిమీద దైవజ్ఞానము చూపినంత ప్రభావము విషయజ్ఞానము చూపలేదు. అందువలన ఆ సందర్భములో విషయజ్ఞానశక్తికంటే దైవజ్ఞాన శక్తియే గొప్పదగును. మనుషుల ఆసక్తినిబట్టి ఒకమారు దైవశక్తి గొప్పదని, విషయ జ్ఞానము చిన్నదని చెప్పినా, అదే మనుషుల మరియొక సందర్భములో

ఆసక్తినిబట్టి దైవజ్ఞానశక్తి చిన్నది, విషయజ్ఞానశక్తి పెద్దదని చెప్పవచ్చును.

**రాఘవ :-** స్వామీ! కొందరు దైవజ్ఞానము మీద ఆసక్తితో కొంతకాలము దైవజ్ఞానమును బాగా తెలుసుకొని తర్వాత వారు ప్రపంచ విషయములకే ఎక్కువ ప్రాధాన్యతనిస్తూ వాటిలోనే మునిగి పోవుచుందురు. తర్వాత దైవ జ్ఞానమును తెలుసుకొనుటకు కూడా ఆసక్తి లేకుందురు. అటువంటి వారిలో ముందున్న దైవజ్ఞానము మీద ఆసక్తి ఎక్కడికి పోయివుంటుంది?

**రాజయోగానంద :-** అటువంటి వారిలో విషయజ్ఞానము మీద ఆసక్తి ఉండి దైవజ్ఞానము మీద ఆసక్తి తక్కువ ఉండును. అందువలన వారు కొంత కాలము దైవజ్ఞానము మీద శ్రద్ధను కనబరచినా చివరకు వారికి ఏది ఎక్కువ ఆసక్తి ఉన్నదో దానివైపు పోవుచుందురు. అటువంటి వారిని చూచి మొదట వారిని దైవజ్ఞానులుగా మనము లెక్కించినా, చివరకు వారి అసలు ఆసక్తి బయటపడి, అసలు స్వభావమునే కనబరుస్తూ, దైవవిషయము లకు ప్రాధాన్యత ఇవ్వకుండా, ప్రపంచ విషయములకే ప్రాధాన్యత నిచ్చుచుందురు. అందువలననే భగవంతుడు భగవద్గీతలో **"శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్"** అన్నాడు ఈ వ్యాకములో చివరన "జ్ఞానమ్" అన్నాడు కదా! అది ఏ జ్ఞానమునైనా కావచ్చును. శ్రద్ధ వలన ప్రపంచ జ్ఞానమూ రావచ్చునూ, అలాగే శ్రద్ధ వలన దైవజ్ఞానమూ రావచ్చును. ప్రపంచ జ్ఞానము మీద శ్రద్ధను (ఆసక్తిని) చూపు వారికి అదే గొప్పదగును, దైవజ్ఞానము చిన్నదగును. అట్లే పరమాత్మ జ్ఞానము మీద శ్రద్ధను (ఆసక్తి) చూపువారికి అదే గొప్పదగును, ప్రపంచ జ్ఞానము చిన్నదగును. వారివారి శ్రద్ధను బట్టి వారికున్నదే గొప్పదగును. అందువలన ఫలానిది గొప్పదని చెప్పలేము. ఎక్కువ 99 శాతము ప్రజలలో విషయజ్ఞానమే గొప్పదిగా ఉన్నదని చెప్పవచ్చును. 99 శాతము విషయజ్ఞానమును గొప్పగా

పెట్టుకొన్నవారి మధ్యలో ఒకడు దైవ జ్ఞానమును గొప్పగా భావించేవాడుంటే వానిని తక్కువ వానిగా, తెలివి తక్కువ వానిగా లెక్కించి, నీచంగా చూస్తారు. ఈ విషయము సహజముగా ఉండేదే. మనము ప్రపంచ విషయములలో మునిగివున్న వారిని అజ్ఞానిగా వ్యర్థజీవిగా భావిస్తాము. అలాగే ప్రపంచ విషయములలో ఉన్నవారు జ్ఞాన విలువని తెలియనివారై మనలను తెలివి తక్కువవారిగా, తిక్కవారిగా లెక్కించి చూస్తారు.

(ఈ విధముగా ప్రపంచ విషయములను, దైవజ్ఞాన విషయములను చర్చిస్తూవుండగా అక్కడికి జమీందారు దీనవదనముతో వచ్చాడు. అతని రాకతో తమ జ్ఞాన చర్చను నిలిపివేసి జమీందారు దేనికొచ్చాడోనని అతనితో మాట్లాడను మొదలు పెట్టారు.)

**రాజయోగానంద :-** రావుబహదూర్ గారూ! క్షేమమేనా? ఏదో దిగులుగా కనిపిస్తున్నారు?

**జమీందారు :-** స్వామీ. నేను ఇక్కడినుండిపోయాక మా ఊరిలో పేరు పొందిన ఇద్దరు మాంత్రికులను కలిసాను. వారు నాకంటే ముందే నా ఇంటి సమస్యను చెప్పారు. ఈశ్వర్ వలన జరిగే మీ ఇంటిలోని సమస్యను లేకుండా చేస్తామన్నారు. వారు అలాచేస్తే నాకూ మంచిదే కదా! అని అనుకొన్నాను. వారు ఈశ్వర్ ఆరోగ్యమును బాగుచేస్తామన్నారు. రెండవ అమావాస్యకే మా ఇంటికి వచ్చారు. ఆ దినము ఈశ్వర్ రూములోనే ఉండి బయటికి వచ్చారు. వారు ఆ దినము ఈశ్వర్ గదిలోనే గడుపుట వలన ఈశ్వర్‌లో చేరు శక్తి రాకుండా పోయిందట. అందువలన ఆ దినము ఏ గందరగోళమూ జరుగులేదు. వారు ఈశ్వర్‌కు ఏమీ జరుగకుండా చూడడము మాకు కూడా సంతోషమైనది. మూడవ అమావాస్య దినము కూడా వారు ఈశ్వర్ గదిలోనే గడిపారు. ఆ దినము కూడా మేము

అందరమూ గది బయటే ఉన్నాము. పదకొండున్నర గంట తర్వాత ఈశ్వర్ సాధారణముగా బయటికి వచ్చి, మాంత్రికులు తన రూములో ఎందుకు పడివున్నారని అడిగాడు. ఈశ్వర్ చెప్పిన మాటలనుబట్టి లోపల ఏమి జరిగిందోనని పోయి చూచాము. అక్కడ ఒకడికి కాలు పనిచేయలేదు, మరొకరికి చేయి పనిచేయలేదు. వారిని బయటికి తెచ్చి మా ఇంటిలోనే పెట్టుకొని చికిత్స చేయించాను. అయినా వారు బ్రతుకలేదు. రెండవ రోజు ఇద్దరూ ఒకే నిమిషములో ప్రాణమును వదిలారు. అలా ఇద్దరూ ఒకే నిమిషములో ఒకేమారు చనిపోవడము మాకు ఏమీ అర్థము కాలేదు. ఆ దినము ఆదివారము అమవాస్య కావడము వలనా, ఇద్దరు మాంత్రికులు ఆ దినము చేయిని, కాలును పొగొట్టుకొనిన దానివలనా, తర్వాత రెండవ రోజు ఒకే నిమిషములో ఇద్దరూ చనిపోవడము వలనా, మాకు కూడా ఏదైనా కీడు జరుగుతుందేమోనని భయమేస్తున్నది. దీని విషయము మీరే చెప్పాలి.

**రాజయోగానంద :-** నేను చెప్పేది ఏముందో అదంతా ముందే చెప్పాను. ఈశ్వర్ విషయములో ఏమి జరుగాలో అది జరిగితీరుతుంది. నీవు దానిని గురించి ఏమీ చేయలేవు. నీవు ఊరకనే తటస్థముగా ఉండమని ముందే చెప్పాను. నీవు ఇక్కడ సరేనని పోయావు. అక్కడికి పోయిన తర్వాత నా సలహాను తుంగలోత్రొక్కి నీ ఇష్టమొచ్చినట్లు చేశావు. ఈశ్వర్ విషయములో ఎవరూ ఏమీ చేయలేరని చెప్పాను కదా! మేము చెప్పినది కాదనీ ఎవరో ఏమో చేయగలరని మాంత్రికులను తీసుకపోయి ఇంటిలో పెట్టుకొన్నావు. నీ అజ్ఞానముతో, నీ అవిశ్వాసముతో రెండు నిండు ప్రాణాలను పోవునట్లు చేశావు.

**జమీందారు :-** (రాజయోగానంద కాళ్ళమీద పడి) నాది తప్పేస్వామీ,!

మీరు చెప్పిన మాటను వినకపోవడము నాది చాలా పెద్దతప్పు. మాంత్రికులు చెప్పిన మాటలు విని అలా చేశాను. ఇక మీదట మీరు ఎలా చెప్పితే అలా చేస్తాను. జరిగిన విషయము చెప్పాలని వచ్చాను.

**రాజయోగానంద :-** నీవు ఏదో మంచి జరుగుతుందని మాంత్రికులను నీ ఇంటికి తీసుకొనిపోయావు. ఆ విషయమును మాకు తెలిపివుంటే, అలా చేయడము మంచిదికాదని అప్పుడే చెప్పి ఉండేవారము. నా ఆలోచన ప్రకారము మీ ఇంటికి వచ్చినవారు మీకు మంచి చేయాలని కాదు, స్వార్థము కొరకు నీ ఈశ్వర్‌ను వాడుకోవాలని వచ్చినవారు. వారి వెనుక గూడుపుఠాణి ఉంది. నీవు చెప్పిన పేర్లుగల మాంత్రికులు నాకు ముందే తెలుసు. వారు తపస్విబాబా ఆధ్వర్యములో, మునెప్ప దర్శకత్వములో పని చేయువారు. బాబా తన స్వార్థము కొరకు మాంత్రికులను మీ ఇంటికి వచ్చునట్లు చేశాడు. అమావాస్య దినము కొరకు వారు కాచుకొని ఉండేవారు. అమావాస్య దినమున మీకు ఏదో సాకు చెప్పి వారు ఈశ్వర్ గదిలో పెద్దతంతు నడిపి వుంటారు. అయినా వారి ప్రయత్నము నెరవేరి ఉండదు. “మారి ముందర ముక్కెర తెగులా” అన్నట్లు (మరణము ముందర ముక్కు జలుబు పెద్దది కాదు అన్నట్లు) ఈశ్వర్‌లోనికి చేరు శక్తి ముందర మంత్రశక్తి పెద్దది కాదు. వారు చేయు ప్రయత్నములకు ఆ శక్తులు వారిని చనిపోవునట్లు చేశాయి. గదిలోపలే చనిపోకుండా అక్కడ వారిలో ప్రవేశించి రెండవ రోజు వారిని చంపివేశాయి. అమావాస్య రోజు మాంత్రికుల కాలు చేయి పని చేయకుండా పడిపోయినపుడే, ఆ విషయము మాకు తెలిపివుంటే దానికి తగిన ఉపాయము చెప్పివుండేవారము. వారిని ఈశ్వర్ గదిలోనే కొన్ని రోజులు పెట్టివుంటే వారు చనిపోయే వారు కాదు. వారిని ఆ గదినుండి బయటకు తెస్తూనే గంట, గంటకూ వారు చావువైపు పోయారు.

అందువలన రెండవ రోజే చనిపోయారు. అమావాస్య దినమున ఒక్కొక్కరిలో ఒక్కొక్క శక్తి ప్రవేశించింది. ఒకరిలో కాలు ద్వారా ప్రవేశించి దానిని పని చేయకుండా చేసింది. అలాగే రెండవశక్తి రెండవ వ్యక్తి చేయిలో ప్రవేశించి చేయిని పని చేయకుండా చేసింది. ఒక్కమారు ఇద్దరిలో ప్రవేశించిన శక్తులు ఒకమారే బయటికి పోయాయి. అవి బయటికి పోతూ ఆ శరీరములోని జీవములను కూడా తీసుకపోవడము వలన ఇద్దరూ ఒకేమారు చనిపోయారు. నీవు చేసిన అజ్ఞాన పనికి రెండు ప్రాణములు బలైపోయాయి. మేము ఏదైతే జరుగకూడదనుకొన్నామో అదే జరిగింది.

ఈశ్వర్‌లోని శక్తులను తమ వశము చేసుకోవాలని కొందరు ప్రయత్నిస్తున్నారనీ, వారి ప్రయత్నములను జరుగకుండా చేయాలనీ నేను చాలామార్లు చాలామందికి చెప్పాను. అటువంటి వారి ప్రయత్నమే ఆ మాంత్రికులు మీ ఇంటికి వచ్చి అక్కడే నిలిచిపోవడము. ఆ ప్రయత్నములో భాగముగానే అమావాస్య దినములలో ఈశ్వర్ గదిలోనికి పోయారు. చివరకు చనిపోయారు. వారిని ప్రేరేపించి పంపినవారు హాయిగా ఉన్నారు. ఈశ్వర్‌కు ఇంకా మూడు నెలలు, మూడు అమావాస్యలు గడచిపోవాలి. రాబోయే మూడు అమావాస్యలు, గడచిపోయిన అమావాస్యలకంటే చాలా ముఖ్యమైనవి. అప్పుడు మేము స్వయముగా అక్కడికి వచ్చి కొన్ని పనులు జరుగకుండా చూడాలనుకొన్నాము. ఈ మూడు అమావాస్యలు ముఖ్యమైన వని తపస్వి బాబాకు కూడా తెలుసు. అందువలన ఆయన ప్రయత్నము ఆయన చేయగలడు. లోక సంరక్షణార్థము మా పని మేము చేయగలము. ఈ మూడు నెలల కాలములో మీకుగానీ, మీ కుటుంబములోని ఎవరికిగానీ, ఏ హానీ కలుగదు. కానీ నీవు చేసిన తెలివితక్కువ పని వలన ఇప్పటికి తొమ్మిది నెలల తర్వాత మీ కుటుంబములో ఒక ఘోరము జరిగిపోతుంది.

**జమీందారు :-** ఏమి జరుగుతుంది స్వామీ, దానికి మేము తట్టుకోగలమా, ఎవరికైనా ప్రమాదము జరుగుతుందా?

**రాజయోగానంద :-** నీవు ఏమీ చలించనంటే, గుండెను రాయి చేసుకొని వింటానంటే చెప్పగలను. అయితే ఈ మాటను బయట ఎవరికీ తెలుప కూడదు.

**జమీందారు :-** అలాగే స్వామీ, మీరు చెప్పినట్లు ఎవరికీ చెప్పను. అంతేకాక అది ఎటువంటిదైనా నాలోనే దాచుకోగలను.

**రాజయోగానంద :-** జరుగబోయే మూడు నెలలు గడచిపోయిన తర్వాత ఆరు నెలలకు ఈశ్వర్‌కు ప్రాణగండము గలదు. నాకు తెలిసినంత వరకు అప్పటికి అతనికి మరణము తప్పదని అనుకుంటున్నాను.

(జమీందారుకు ఆ మాట వింటూనే, ఆకాశము కూలిపోయినట్లయి నది. దిగులుతో ఇలా అన్నాడు.)

**జమీందారు :-** ఆ గండమునుండి తప్పించుకొను ఉపాయమే లేదా?

**రాజయోగానంద :-** అది గండమే అయితే తప్పించుకొను ఉపాయమును వెతకవచ్చును. కానీ అది గండము కూడా కాదు. నీవూ, నేనూ ఏమీ చేయలేము. నీవు ఇంటికి పోయి సర్వసాధారణముగా ఏమీ తెలియనట్లు ఉండిపో. ఏమి జరగాలని నిర్ణయమై ఉందో అది జరిగి తీరుతుందను నమ్మకముతో ఉండు. నేను ఇంతకంటే ఎక్కువ చెప్పను.

(అప్పుడు జమీందారు, రాజయోగానందస్వామివద్ద సెలవు తీసుకొని నమస్కరించి అక్కడినుండి వెళ్ళిపోతాడు. ప్రక్కనవుండి స్వామివారు చెప్పిన అన్ని మాటలను గ్రహించిన రాఘవ, స్వామిని చూచి ఇలా అన్నాడు.)

**రాఘవ :-** స్వామీ! ఈశ్వర్‌కు, జరుగుచున్న తతంగము ఏమీ తెలియదన్నారు

కదా! అలాంటపుడు అతనిది ఏ తప్పు లేదు కదా! ఏ తప్పు చేయకుండానే అతనికి మరణము రావడము న్యాయము కాదుకదా!

**రాజయోగానంద స్వామి :-** న్యాయము అనునది బ్రహ్మవిద్యా శాస్త్రమునకు సంబంధించినది కాదు. నీతి, న్యాయములు లోక సంబంధము, జ్ఞానము ధర్మము దైవసంబంధమని గుర్తుంచుకొనుము. అతను ఈ జన్మలో చేసిన తప్పుకు శిక్ష అని చెప్పలేదు కదా! గతజన్మలో చేసుకొన్న దానిని బట్టి ఈ జన్మలో అనుభవములుండును. అలాగే మరణము కూడా గతజన్మ ఫలితమేనని జ్ఞప్తివుంచుకో.

(అంతటితో వారి సంభాషణ ముగిసిపోవును. జరుగబోవు కార్యముల గురించి ఆ రాత్రికి యోచించాలని అనుకుంటారు.)

× × × × × × × × × × × × × × × × × × × × × ×

(మునెప్పకు నాగభూషణము, మల్లయ్య చనిపోయిన వార్త ఆలస్యముగా కొన్ని రోజుల తర్వాత తెలిసింది. ముఖ్యమైన ఇద్దరు మాంత్రికులు చనిపోవడము మునెప్పకు చాలాబాధను కల్గించినది. ముందే తన అనుచరులు ముఖ్యమైనవారు బ్యాంకు దోపిడీలో పోలీసులకు చిక్కి పోవడముతో డీలాపడిన మునెప్పకు, మాంత్రికుల మరణవార్త గొడ్డలిపెట్టు లాగ అయినది. తనకు తెలిసిన వార్తను తపస్వి బాబాకు తెలియజేశాడు. ఆ వార్త విన్న బాబా విస్తుపోయాడు. బాబాకు ఆ వార్త మండుచున్న పుండు మీద కారమును చల్లినట్లైయినది. ముందే మునెప్ప మనుషులు కొందరు పోలీసుల చేతిలో దొరికిపోవడము వలన, ఇక మీదట బయటికి పోయి పని చేయువారు తమవద్ద లేకుండా పోయారు. ఈశ్వర్ విషయములో మిగిలినవి మూడు నెలలు మాత్రమే. ఆ మూడు నెలలలోనే తమ విభూదిని

ఈశ్వర్‌కు బొట్టుగా పెట్టాలి. అలా పెట్టగలిగినపుడే బాబా అనుకొన్న పని నెరవేరును. అలా చేయుటకు స్వయముగా మునెప్పగానీ, బాబాగారు గానీ బయటకు రావలసివుంది. మునెప్ప మీద చాలాకాలమునుండి పోలీసుల కన్నువుంది. కాబట్టి మునెప్ప మారువేషములో బయటికి పోవాలి. అట్లుకాక పోతే బాబాగారైనా బయటికి పోవాలి. నాల్గవ అమావాస్యకు ముందే ఏదో ఒకటి నిర్ణయము చేసుకొని దానికి తగిన కార్యాచరణను రూపొందించు కోవాలి. అలా రెండు రోజులు తపస్వి బాబా యోచించిన తర్వాత మునెప్పను మారువేషములో చెన్నపట్నమునకు పంపాలనుకొన్నాడు. మునెప్ప ఏ వేషములో పోవాలి, అలా పోయినవాడు ఏమి చేయాలి, ఎలా తన విభూదిని ఈశ్వర్ నొసట బొట్టుగా పెట్టాలని యోచించి, దానికి తగినట్లు పథకమును తయారు చేసుకొని, తన యోచనలన్నిటినీ మునెప్పకు తెలియజేసెను. మునెప్ప బాబాగారు చెప్పిన మాటలను జాగ్రత్తగా విని అలాగే చేస్తానని బాబాగారికి మాట ఇచ్చాడు. అంతలో చూస్తునట్లే అమావాస్య వచ్చింది. దానికంటే నాలుగు రోజుల ముందే మునెప్ప బయలుదేరి చెన్నపట్నము చేరుకొన్నాడు.

ఊరి బయట గుడిదగ్గర మునెప్ప దిగినాడు, మునెప్పతోపాటు వంట చేయుటకు ఒక ఆడమనిషిని, ఇద్దరు మగవారిని పిలుచుకొని మొత్తము నలుగురు బయలుదేరి వచ్చారు. నలుగురు పెద్దమ్మ దేవతను తలమీద ఎత్తుకొని అడుక్కొను వారి వేషములో ఉన్నారు. ఆ గ్రూపులో మునెప్ప కొరడా తీసుకొని దేవతను గురించి చెప్పుచూ అటు, ఇటు తిరిగి డబ్బులు అడుక్కొనుచుండగా, ఒక మనిషి పెద్దమ్మ గూడును తలమీద ఎత్తుకొని వుండును. మరియొక మనిషి డోలు కొట్టుచుండును. ఆడ మనిషి కూడా కొందరికి అమ్మవారి బండారును ఇస్తూ డబ్బులు అడుగుచుండును. ఈ

విధముగా అడుక్కొను గ్రూప్‌గా వారు బయలుదేరివచ్చి, ఊరి బయట గుడివద్ద బయలులో ఒక గుడారమును వేసుకొని ఉన్నారు. అలా అన్నీ ముందే ఏర్పాట్లు చేసుకొని చెన్నపట్నము వచ్చారు. మూడు రోజులు ఎవరికీ అనుమానము రాకుండా ఊరిలో అడుక్కొన్నారు. నాల్గవ రోజు అమావాస్య కావున ఉదయమే జమీందారు ఇంటివద్ద పెద్దమ్మను ఎత్తుకొని నిలబడినారు. ఒకడు డోలు కొట్టుచుండగా మునెప్ప పైన గుడ్డలేకుండా క్రిందమాత్రము గోసికట్టి కొరడా తీసుకొని నేలకు కొట్టుచూ అటూ ఇటూ తిరిగి మాట్లాడుచు ఉన్నట్లుండి. పెద్దమ్మ దేవత పూనినట్లు మాట్లాడజొచ్చెను. అప్పుడు మారువేషములోనున్న మునెప్ప ఇలా మాట్లాడాడు "ఒరే జమీందారూ! నేను నీ ఇంటిముందుకు వచ్చినా నీవు బయటికి రాలేదురా. నేను నిన్ను దయదలచి నీ ఇంటికి వచ్చానురా" అని అనుచుండగా లోపలనున్న జమీందారు తను జమీందారునని, తన మీద దయకల్గి రావడమేమిటని బయటికి వచ్చి చూచాడు. అప్పుడు పెద్దమ్మ పూనకము వచ్చిందని తెలిసింది. చేతులు ఎత్తి నమస్కరించుచూ నిలబడినాడు. అప్పుడు జమీందారు ఫలానా వాడని ఫోటో చూచిన దానివలన అతనిని సులభముగా మునెప్ప కనుగొన్నాడు. పెద్దమ్మ దేవతగా నటించు మునెప్ప జమీందారుని చూచి " ఒరే బాలా! నీవు చాలా చిక్కుల్లో ఇరుక్కున్నావురా! నీ ఇంటిలో భూతాలు చేరాయి, దయ్యాలు వచ్చి పోతున్నాయి. రెండు ప్రాణాలు పోయాయి కదురా బాలా? మీ పెద్దలు నన్ను పూజించారు. దానికే నేను వచ్చానురా, ఈ ఇంటిలో ఇంకా రెండు ప్రాణాలు పోతాయి. నాకు చిన్న పోతును బలి ఇచ్చుకో. నీ ఇంటిలో ఏమీ జరుగకుండా చేస్తాను" అన్నాడు. అప్పుడు జమీందారు ముందుకు వచ్చి "అమ్మ తల్లీ నేను నిన్నే పూజిస్తానమ్మా, నీకు చిన్నపోతును బలి ఇస్తాను. నా ఇంటిలో ఏమీ జరుగకుండా చూడు

తల్లీ" అన్నాడు. అప్పుడు మునెప్ప అటూ ఇటూ ఊగుతూ బాలా! నీ ఇంటికి నడిరాత్రిలో ఒక పిశాచి వస్తావుంది. దానిని లేకుండా చేస్తాను, నీ ఇంటిలో ప్రాణాలు పోకుండా చూస్తాను. నీవు నన్నే నమ్ముకొని నా బండారును బొట్టు పెట్టుకో, అట్లే నాబండారును నీ కొడుక్కి కూడా పెట్టు. నాబండారు పెట్టుకోకపోతే నీ ఇంటినుండి మీ రెండు ప్రాణాలు పోతాయి. నా బండారును ఉదయము, సాయంకాలము నన్ను మొక్కి నన్ను తలచుకొని పెట్టుకోండి" అని మునెప్ప, పెద్దమ్మ తేలిపోవునట్లు ఒక చోట పడుకొని నిమిషము తర్వాత లేచాడు. పెద్దమ్మను చెప్పుచున్నానని అంతకుముందు జరిగిన విషయములను చెప్పేటప్పటికి జమీందారు నిజముగా దేవతే చెప్పిందని అనుకొన్నాడు. మునెప్పకు ముందే జమీందారు ఇంటి విషయమంతా తెలుసు కాబట్టి దానిని దేవత పూని చెప్పినట్లు చెప్పి జమీందారున్ని నమ్మించాడు. తాను చెప్పకనే జరిగినవన్ని చెప్పేటప్పటికి రాజయోగానందస్వామిని జమీందారు మరిచి పోయాడు. ఒకమారు స్వామి జ్ఞప్తి వచ్చినా దేవతే చెప్పుచున్నది కదా అనుకొన్నాడు. మునెప్పతోపాటు దేవతనెత్తుకొన్న మనిషి దేవత గూడులో నుండి బండారును తీసి ఇచ్చారు. ఆ బండారును తపస్విబాబా ఇచ్చి పంపాడనిగానీ, వచ్చినవారు మారువేషములో తన కోసమే వచ్చినవారనిగానీ జమీందారుకు ఏమాత్రము తెలియదు. తన అదృష్టముకొద్దీ పెద్దమ్మ పూని తన ఇంటిలో జరుగుచున్నవి, జరిగిపోయినవి, జరుగబోవునవి చెప్పినదను కొన్నాడు. వాళ్ళు ఇచ్చిన బండారును తీసుకొన్నాడు. చిన్నపోతు అంటే ఏమిటని వారిని అడిగాడు. వారు పొట్టేలని చెప్పగా వారికి డబ్బులు ఇచ్చి పంపాడు. ఆ దినము నుండి వారు ఇచ్చిన బండారును ప్రతి దినమూ ఈశ్వర్‌కు బొట్టుపెట్టుచూ, తాను కూడా పెట్టుకొనుచుండెను.

అలా ప్రతి దినమూ పెట్టుకొనినా ఏమి ఇబ్బందిలేదు. కానీ అమావాస్య రోజున ఆ బండారును ఈశ్వర్ బొట్టు పెట్టుకోకూడదు. ఎందుకనగా! ఆ బండారును తపస్విబాబా ప్రత్యేకముగా ఈశ్వర్ కొరకే పంపాడు. దానిని సులభముగా జమీందారు ఇంటికి మునెప్ప మారు వేషములో చేర్చాడు. అమావాస్య దినమున ఈశ్వర్ ఉదయమునే స్నానము చేసి బొట్టుపెట్టుకోవడము వలన, ఆ దినము అతనిలోనికి శక్తి చేరునప్పుడు బండారు బొట్టు ఈశ్వర్ నుదిటి మీద ఉండుట వలన, అతనిలో ప్రవేశించు శక్తి బాబా వశమైపోవును. అది బాబాయొక్క అసలైన పథకము. బాబా పథకము ప్రకారము ఈశ్వర్ ప్రతి దినమూ బొట్టు పెట్టుకోవాలనుకొన్నాడు. ఆ రోజు అమావాస్య కావున ఉదయమే స్నానము చేసి పెద్దమ్మ పెట్టిన బండారును స్వయముగా జమీందారే ఈశ్వర్ నొదుటబొట్టు పెట్టాడు.

రాజయోగానంద స్వామి రాఘవతో ముందే నాల్గవ, ఐదవ అమావాస్యలకు స్వయముగా చెన్నపట్నము వచ్చి ఏమి జరుగుతుందో చూడాలనుకొన్నాడు. అమావాస్యకు మూడు రోజులు ముందే వచ్చి క్రొత్త సెంటు బాటిళ్ళను అమ్ముీవారిగా రాఘవ మారువేషములో ఇల్లిల్లు తిరిగి ఇంటిలోని వారితో కలిసి ఇవి విదేశమునుండి తెచ్చిన సెంట్లని చెప్పి, తక్కువరేటుకు ఇచ్చుచుండెను. అలా రెండు రోజులు చెన్నపట్నములో తిరుగుచూ జమీందారు ఇంటిని తెలుసుకొని అమావాస్య దినమున ఉదయము తొమ్మిది గంటలకు జమీందారు ఇంటికి రాఘవ వచ్చాడు. ఆ ఇంటిలోని వారందరికీ తన వద్దనున్న సెంటు బాటిల్స్‌ను క్రింద పెట్టి చూపుచుండెను. అంతలో ఈశ్వర్ తన గదినుండి బయటికి వచ్చి తనకొరకు ఒక సెంటు బాటిల్‌ను తీసుకొని పోయాడు. అప్పుడు రాఘవ అతని ముఖము మీద బండారు బొట్టును గ్రహించాడు. అక్కడినుండి తొందరగా

రాఘవపోయి ఆ విషయమును రాజయోగానంద స్వామికి తెలిపాడు. రాజయోగానంద స్వామి కొంతసేపు ఆలోచించి, ఉన్న కొద్దిపాటి సమయములో తాము ఏమీ చేయలేమని అనుకొన్నాడు. అప్పటికి పదిగంటలకు పది నిమిషములు మాత్రమే కొదవ ఉండెను. ఈశ్వర్‌కు కొద్దిగా తలనొప్పి కూడా ఉండుట వలన తన గదిలోనే ఉన్నాడు. ఆ దినము అమావాస్య అని తెలిసిన దానివలన జమీందారు కూడా ఇంటిలోనే ఉన్నాడు. అప్పుడు ఉన్నట్లుండి కరెంటు పోయింది. ఈశ్వర్ గదిలో ఫ్యాన్ నిలిచిపోయింది. ఫ్యాన్ నిలిచి పోవడముతో గాలి తగలకుండా పోయింది. దానితో ఈశ్వర్‌కు చెమటలు పట్టసాగాయి. ముఖము మీద చెమట పట్టడముతో ప్రక్కనే ఉన్న చేతి రూమాలును తీసుకొని ముఖమును తుడుచుకొన్నాడు. అప్పుడు ముఖానికి ఉన్న బండారు బొట్టు లేకుండా పోయింది. అప్పటికి పదిగంటలకు రెండు నిమిషములే మిగిలిఉంది. సరిగా పదిగంటలకు ఈశ్వర్‌కు ఏమీ తెలియకుండా పోయింది. అప్పుడు ఈశ్వర్ శరీరములోనికి శక్తి ప్రవేశించను మొదలు పెట్టింది. ఆ దినము తన పథకము నెరవేరి తీరుతుందనుకొన్న బాబాకు నిరాశే మిగిలింది. నాల్గవ అమావాస్య దినమున కూడా తనకు శక్తి దక్కకుండా పోయినది. ఈశ్వర్ గదిలో ఏమి జరుగుచున్నదీ తెలియునట్లు తన మందిరములో ఏర్పాటు చేసిపెట్టుకొన్నాడు. అందువలన శక్తి ప్రవేశించుటకు రెండు నిమిషముల ముందు తన ప్లాన్ వృథా అయిపోయినట్లు తెలుసుకోగలిగాడు. నిజానికి ఆ దినము జమీందారు ఇంట్లో కరెంటు పోలేదు. అయినా ఈశ్వర్ గదిలో మాత్రము పోయింది. అది ఎందుకు జరిగిందో ఎలా జరిగిందో తపస్విబాబాకు అర్థము కాలేదు.

ఈశ్వర్‌కు పదహారవ సంవత్సరము మొదలైనప్పటినుండి ఆరు అమావాస్యలలో, ఒక్కొక్క అమావాస్యకు ఒక్కొక్క శక్తి అతనిలో చేరునని

తెలుసుకొన్నాము. ఇప్పటికి నాల్గు అమావాస్యలు గడచిపోగా, మొదటి అమావాస్యను వదిలిపెట్టి రెండు, మూడు, నాల్గవ అమావాస్య దినములలో తపస్విబాబా ప్రయత్నించినా ఆ శక్తులు కూడా వశముకాలేదు. ఇక ఐదు, ఆరు నెలల శక్తులను ఏమాత్రము వదలకుండా బాబా తన వశము చేసుకోవాలను కొన్నాడు. రాజయోగానంద స్వామి నాల్గు, ఐదు, ఆరు మూడు నెలలవి కీలకమైన శక్తులని వాటిని ఎలాగైనా తపస్విబాబా వశము కాకుండా చూడాలనుకొన్నాడు. అయినా నాల్గవ అమావాస్య దినమున తొమ్మిది గంటల తర్వాత కూడా ఈశ్వర్ ముఖాన బొట్టువున్నదని రాఘవ ద్వారా తెలుసుకొన్న స్వామి అప్పుడు తాము ఏమీ చేయలేమని అనుకొన్నారు. నాల్గవ అమావాస్య దినమున ఈశ్వర్ నొదుట మీదున్నది బాబాగారి బొట్టయితే, ఆ దినము ఈశ్వర్‌లోనికి వచ్చినశక్తి బాబాగారికి వశమైపోయి వుంటుందనుకొన్నాడు. అది బాబాగారి బొట్టా కాదా అని తెలుసుకొనుటకు రెండు రోజుల తర్వాత జమీందారు రావుబాహదూర్‌ను తన ఆశ్రమానికి రమ్మని చెప్పి పంపాడు. రాజయోగానందస్వామి దగ్గరనుండి పిలుపు రావడముతో రావుబహదూర్ వెంటనే బయలుదేరి పోయాడు. ప్రబోధాశ్రమమునకు పోయిన తర్వాత స్వామివారి దర్శనమునకు కొంత సేపు కాచుకొని, స్వామి వచ్చిన వెంటనే జమీందారు రావుబాహదూర్ నమస్కరించాడు. అప్పుడు రాజయోగానంద స్వామి జమీందారుతో ఇట్లన్నాడు.)

**రాజయోగానంద :–** రావుబాహదూర్‌గారు! ఇప్పుడు నేను అడిగిన ప్రశ్నలకు సూటిగా జవాబు చెప్పాలి.

**జమీందారు :–** తప్పకుండా చెప్పగలను స్వామి.

**రాజయోగానంద :–** గడచిపోయిన అమావాస్య దినమున ఈశ్వర్ ముఖము మీద బండారు బొట్టు ఉంది. ఆ బొట్టును ఎవరు పెట్టారు?

**జమీందారు :–** ఆ బొట్టును నేనే పెట్టాను. ఆ దినమే కాదు ప్రతి దినమూ పెట్టుచున్నాను. అది పెద్దమ్మ బండారు, అందువలన ఈశ్వర్‌కు పెట్టడమే కాక, నేను కూడా పెట్టుకొనుచున్నాను.

**రాజయోగానంద :–** ఆ బండారును నీకు ఎవరు ఇచ్చారు?

**జమీందారు :–** పెద్దమ్మ గంప (బుట్టను) ఎత్తుకొని వచ్చి కొరడా పట్టుకొని అడుక్కొను పెద్దమ్మ పూజారులు ఇచ్చారు.

**రాజయోగానంద :–** వారు ఏమని చెప్పి ఇచ్చారు. ఎందుకు ఇచ్చారు? ఉన్నది ఉన్నట్లు చెప్పు.

**జమీందారు :–** అమావాస్య దినము ఉదయము ఆరు లేక ఆరున్నర గంటలకు ఇంటిముందుకు పెద్దమ్మను ఎత్తుకొని పూజార్లు వచ్చారు. మొత్తము నలుగురు వచ్చారు. ఒకరు దేవతను తలమీద ఎత్తుకొని ఉండగా, ఒకరు డోలును కొట్టుచుండగా, ఒకరు కొరడాను తీసుకొని నేలకు కొట్టుచూవుండెను. ఒక ఆడమనిషి అమ్మవారు బండారును కొందరు ఆడవారికి బొట్టు పెట్టుచుండెను. బండారును పూసుకొని, కొరడాను చేతబట్టుకొని, కాళ్ళకు గజ్జెలు కట్టుకొన్న వ్యక్తికి అమ్మవారు పూనకము వచ్చి మాట్లాడుచూ, "నేను నీ ఇంటిముందుకు వచ్చినా నీవు బయటికి రాలేదు బాలా, నీకు నేను కనిపించలేదా" అని అనడము నేను విని వెంటనే బయటకువచ్చి నిలబడ్డాను. అప్పుడు పూనకము వచ్చిన పెద్దమ్మ "నీ ఇంటిలో జరగరానిది జరుగుచున్నది బాలా, రాత్రిపూట నీ ఇంటికి భూతాలు, పిశాచాలు వచ్చి పోతున్నవి. ఈ మధ్యన రెండు ప్రాణాలు పోయాయి. నీవు నన్ను నమ్మి పూజ చేయకపోతే ఇంకా రెండు ప్రాణాలు పోతాయి" అని చెప్పగా నేను "నీపూజ ఎలా చేయాలి?" అని అడిగాను. అప్పుడు పెద్దమ్మ "మీ పెద్దలు నన్ను పూజించేవారు నీవు నా పూజ వదిలివేశావు.

అందుకే నీకు కష్టాల సుడిగుండాలు వచ్చాయి. అవి పోవాలంటే నాకు చిన్న పోతును బలి ఇచ్చి పూజచేయి. ప్రతి దినము నేను ఇచ్చు బండారును బొట్టుపెట్టుకో, ఇంటిలోని మగవారు అందరూ పెట్టుకోవలెను. నీ కొడుకుకు కూడా పెట్టు. అతనికి ఉండే గండములు పోతాయి" అని చెప్పింది. అందువలన అమ్మవారు ఇచ్చిన బండారును మేము ఇద్దరము పెట్టు కొనుచున్నాము.

**రాజయోగానంద :-** ఆ బండారును అందరికి ఇచ్చే బండారులోనించి ఇచ్చారా లేక ప్రత్యేకముగా ఇచ్చారా?

**జమీందారు :-** ప్రత్యేకముగా పెద్దమ్మ బుట్టలోనిది ఇచ్చారు.

**రాజయోగానంద :-** ఇప్పటికి నీవు రెండు మార్లు తప్పు చేశావు. ఈశ్వర్ విషయములో ఏమి చేసినా నాకు చెప్పి చేయమన్నాను. నీవు ఏమీ చేయవద్దని కూడా చెప్పాను. నేను చెప్పిన తర్వాత కూడా పెద్దమ్మ బండారును బొట్టుగా ఎందుకు పెట్టావు?

**జమీందారు :-** దేవత ఇచ్చినది కదా! అని తర్వాత ఇంటిలో రెండు ప్రాణాలు పోయాయి, ఇంకా రెండు ప్రాణాలు పోతాయి అని చెప్పుట వలన దేవత మనము చెప్పకనే ఆ విషయమును చెప్పడము వలన, ఆ దేవత చెడుగా ఏమీ చెప్పలేదు కదా! ఒకమారు పోతును బలి ఇచ్చి తన బండారును ప్రతి దినమూ పెట్టుకొమ్మన్నది కదాయని పెట్టుకొన్నాము. ఇందులో నాకు ఏమీ చెడుగా కనిపించలేదు. అందువలన అలా చేశాను.

**రాజయోగానంద :-** నీ ఇంటిలో జరుగునదేదో నాకు తెలుసు, నీకు తెలుసు, ఆ తపస్విబాబాకు తెలుసు. మన ముగ్గురుకు తప్ప మధ్యలో ఎవరికీ తెలియదు. ఇప్పుడు వచ్చి చెప్పేందుకు పెద్దమ్మకు తెలిసే సామాన్యమైన విషయముకాదది. అక్కడికి వచ్చినవారు బాబా మనుషులు కారని నీకు

తెలుసునా? తపస్వి బాబా ఎంతో తెలివైనవాడు. రెండుమార్లు మాంత్రికుల చేత అమావాస్య దినమున తన విభూదిని బొట్టుగా ఈశ్వర్‌కు పెట్టాలని చూశాడు. రెండు మార్లు విఫలమైపోయింది. ఇప్పుడు తెలివిగా బండారును పంపి నీ చేతనే అమావాస్య దినమున ఈశ్వర్‌కు పెట్టించాడు. అమావాస్య దినమున తొమ్మిది గంటల సమయములో ఈశ్వర్ నుదుట బొట్టును చూచిన వారు నాతో చెప్పగా, అది నిజమా అబద్ధమా అని తెలుసుకొనుటకు నిన్ను పిలిచి అడిగాము. ఇప్పుడు నీవు స్వయాన చేసిన తప్పు వలన ఒక భయంకరమైన శక్తి బాబావశమై పోయినది. నీవు చాలా తెలివితక్కువ పని చేశావు.

**జమీందారు :-** ఇంత పెద్ద మోసములుంటాయని నేను కలలో కూడా అనుకోలేదు. భక్తిగా దేవత ఇస్తున్నదనుకొని పొరపాటు పడినాను క్షమించండి. ఇప్పటినుండి మీరు ఎలా చెప్పితే అలా చేస్తాను.

**రాజయోగానంద :-** ఇప్పటికి రెండు మార్లు ఈ మాట చెప్పావు. చివరకు మేము చెప్పినట్లు వినకుండా నీ ఇష్టమొచ్చినట్లు చేస్తావు. ఇంకా రెండు అమావాస్యలు ఈశ్వర్ జీవితములో కీలకమైనవి. ఇప్పటికైనా మేము చెప్పినట్లు విను. ఈశ్వర్‌కు సంబంధించిన ఏ చిన్న విషయమునైనా నాతో చెప్పనిదే చేయవద్దు. అంతేకాక ఇప్పుడు నీవద్దనున్న బండారును బొట్టుగా పెట్టుచుండు. దానిని తపస్విబాబా వాళ్ళు గమనించి తాము చెప్పినట్లు చేయుచున్నావని నమ్మివుంటారు. అట్లు ప్రతిరోజు చేసినా దానివలన ఏ ఇబ్బంది ఉండదు. కానీ ఒక్క అమావాస్య రోజు మాత్రము ఈశ్వర్‌కు బొట్టు పెట్టవద్దు. ఆ దినము కూడా బొట్టు పెట్టావని బాబావారు అను కుంటారు. ఇంతకంటే నీవు చేయవలసిన పని ఏమీ లేదు. రాబోయే అమావాస్య దినమున మేము కూడా చెన్నపట్నములోనే ఉంటాము. అవసరమైతే నీకు అందుబాటులో ఉంటాము.

(రాజయోగానంద స్వామి చెప్పినదంతావిని, ఈమారు ఏమాత్రము పొరపాటు పడకుండా స్వామి చెప్పినట్లు నడుచుకోవాలనుకొని, అక్కడ నుండి జమీందారు బయలుదేరి వచ్చాడు. ఇంటికి వచ్చిన తర్వాత ప్రతిదినము స్వామి చెప్పినట్లు ఈశ్వర్‌కు బండారు బొట్టుపెట్టుచూ, తాను కూడా పెట్టుకొనుచుండెను. తర్వాత వచ్చు అమావాస్య వరకు అప్పుడప్పుడు మునెప్ప మనుషులు ఈశ్వర్ బండారు బొట్టు పెట్టుకొనుచున్నాడా లేదా అని గమనించి చూచారు. వారికి ప్రతి దినమూ ఈశ్వర్ నుదుట బండారు బొట్టు కనిపించుట వలన తపస్వి బాబా వచ్చే అమావాస్య దినము కూడా ఈశ్వర్ బొట్టు పెట్టుకుంటాడను నమ్మకముతో ఉండెను. కానీ తమ బొట్టు విషయమును రాజయోగానంద స్వామి గ్రహించాడని, తమను మోసము చేయుటకు ప్రతి దినమూ బొట్టును పెట్టుకుంటున్నారని, తమ ఎత్తుకు స్వామి పై ఎత్తు వేశాడని బాబాకు తెలియదు. అంతలోనే ఐదవ అమావాస్య వచ్చినది. ఆ దినము తమ పథకము సులభముగా నెరవేరునని బాబా అనుకొన్నాడు. అదే ఉద్దేశముతోనే మునెప్ప కూడా ఉన్నాడు. ఆ దినము అమావాస్య అయిన దానివలన రాజయోగానంద స్వామి చెప్పినట్లు జమీందారు రావుబహదూర్ తన కొడుకు ఈశ్వర్‌కు బొట్టుపెట్టలేదు. అన్ని అమావాస్య దినములలో జరిగినట్లే ఈశ్వర్‌కు మత్తుగా మగతగా (మజ్జుగా) ఉండుట వలన ఈశ్వర్ బయటికి పోకుండా తన గదిలోనే ఉండిపోయాడు. తపస్విబాబా తన మందిరము నుండే చెన్నపట్నములోని ఈశ్వర్‌ను గమనిస్తున్నాడు. ప్రతి దినము తప్పకుండా బొట్టు పెట్టుకొను ఈశ్వర్, ఆ దినము తన బండారును బొట్టుగా పెట్టుకోలేదని బాబా తన మందిరము నుండే గ్రహించాడు. అప్పటికప్పుడు ఏమి చేయుటకు అవకాశములేని దానివలన ఈ నెల కూడా తన ప్రయత్నము వృథా అయినట్లేనని అనుకొన్నాడు. ఆ దినము చూస్తున్నట్లే కాలము గడచి పోయింది.

అమావాస్య దినమున రాఘవ ఉదయము ఎనిమిది గంటలకే జమీందారు రావుబహదూర్ ఇంటికి వచ్చి రావుబహదూర్‌తో ఏదో వ్యాపార విషయము లను మాట్లాడుచూ కాలమును గడిపాడు. ఆ దినము ఈశ్వర్‌ను తపస్విబాబా ఏమీ చేయలేదని నిశ్చయించుకొని తిరిగి స్వామివద్దకు పోయి ఆ విషయమును స్వామికి తెలిపాడు. ఐదవనెలలో బాబా పథకము విఫలమైనందుకు రాజయోగానంద స్వామి సంతోషించాడు. ఇక మిగిలినది ఆరవ అమావాస్య మాత్రమే! దానిని వదలకూడదని తపస్విబాబా ప్రయత్నము చేయగలడనీ, దానిని కూడా నెరవేరకుండా చేయాలనీ, రాజయోగానంద స్వామి అనుకొన్నాడు.

రాబోయే అమావాస్య ఒక్కటే తమ పనికి చివరి ఆశగా మిగిలింది. ఎంత ప్రయత్నము చేసినా నాలుగు అమావాస్యలు విఫలమైపోయాయి. ఇక ఎట్టి పరిస్థితుల్లోను ఆరవ అమావాస్యను వదలకూడదని తపస్విబాబా అనుకొన్నాడు. ఆ దినము స్వయముగా తపస్విబాబాయే మారువేషములో చెన్నపట్నము రావాలనుకొన్నాడు. ఆ విషయమును మునెప్పకు కూడా తెలిపి, ఆ దినము తాము చేయవలసిన కార్యములను గురించి ముందే మాట్లాడుకొని, దానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేసుకొనుటకు ప్రారంభించారు. వారు ఆ విధముగా వారి కార్యాచరణలో మునిగిపోగా, రాజయోగానంద స్వామి ఆశ్రమములో రాఘవ, రాజయోగానందస్వామి ఇద్దరూ కలిసి ఆ దినము తమ కార్యముల గురించి మాట్లాడుకొన్నారు. ఈ మారు స్వయముగా రాజయోగానంద స్వామి కూడా చెన్నపట్నమునకు రావాలను కొన్నాడు. తమ పనికి రాజయోగానందస్వామి అడ్డుపడుచున్నాడని తపస్విబాబాకు తెలియదు. అట్లే ఇంతవరకు ఒక్క అమావాస్యకు కూడా బాబా పని నెరవేర లేదని స్వామికి తెలియదు. నాల్గవ అమావాస్య దినమున

ఈశ్వర్‌లో చేరిన శక్తిని బాబా తన వశము చేసుకొన్నాడని అనుకొన్నాడు. అలా జరుగలేదనీ, బాబాకు ఎటువంటి శక్తి ఈశ్వర్‌నుండి వశము కాలేదనీ రాజయోగానంద స్వామికి తెలియదు. నాల్గవ అమావాస్య దినమున ఈశ్వర్ నుదుటి బొట్టు ఉన్నదని స్వామి అనుకొన్నాడు. కానీ ఆ దినము ఈశ్వర్ గదిలో కరెంటు పోయిన విషయముగానీ, ముఖము చెమట పట్టిన దానివలన పదికి రెండు నిమిషముల ముందు ఈశ్వర్ బొట్టును గుడ్డతో, చెమటతో పాటు బొట్టును కూడా తుడచివేశాడని స్వామికి తెలియదు.

ఆరవ అమావాస్య వచ్చినది. రాజయోగానందస్వామి రాఘవ ఇద్దరూ జమీందారు రావుబహదూర్ ఇంటిలోనే ఉన్నారు. ఆ దినము కూడ ఈశ్వర్ బయటికి పోకుండా ఇంటిలో తన గదియందే ఉండిపోయాడు. ఉదయము ఎనిమిది గంటల ముప్పయి నిమిషములకు అందరూ టిఫిన్ తిని కూర్చున్నారు. ఈశ్వర్ కూడా రెండు ఇడ్లీలు తిని తన గదిలోనికి పోయాడు. ఆ రోజు శుక్రవారము. ప్రతి శుక్రవారము ఒక ముస్లీమ్ వచ్చి ఇంటిలో సాంబ్రాణి పొగవేసి, నెమలి ఈకలకట్టను తలమీద పెట్టి దీవించి పోవడము కొన్ని సంవత్సరముల నుండి జరిగెడిది. ఆ దినము కూడా కొన్ని సంవత్సరములనుండి వచ్చు ముస్లీమ్ వృద్ధుడు తొమ్మిదిగంటల నలభై నిమిషములకు ఇంటిలోనికి వచ్చి ఇల్లంతా సాంబ్రాణి పొగపెట్టి నెమలి ఈకలతో దీవించి పోయాడు. ఆ ముస్లీమ్ వృద్ధుడు ఈశ్వర్ గదిని వదలి హాలులో పొగవేసిపోగా అందరూ దానిని పీల్చి పది నిమిషముల తర్వాత అందరూ నిద్రలోనికి పోయారు. ఆ విధముగా ఇంటిలోని వారందరూ నిద్రలోనికి పోగా, అంతవరకు అదనుకొరకు కాచుకొనివున్న మునెప్ప మరియు బాబా ఇద్దరూ పెద్దమ్మ పూజారి వేషముతో జమీందారు

ఇంటిలోనికి ప్రవేశించారు. అప్పటికి తొమ్మిది గంటల యాభైఐదు నిమిషములైనది. మునెప్ప నేరుగా ఈశ్వర్ గదిలోనికి ప్రవేశించి కళ్ళుమూసుకొని కూర్చొని వున్న ఈశ్వర్‌ను గమనించాడు. కొద్దిసేపు ఈశ్వర్ రూములోనే ఉన్న తపస్విబాబా సరిగా పదిగంటల ఐదు నిమిషములకు ఈశ్వర్ నుదుట తాను తెచ్చిన విభూదిని బొట్టుగా పెట్టి వెంటనే ఇద్దరూ బయటికి వచ్చారు. పదిగంటలనుండి ఈశ్వర్‌లోనికి శక్తి వచ్చువేళ కావున పదిగంటల ఐదు నిమిషములకు తమ పనిని నెరవేర్చుకొని బాబా మరియు మునెప్ప బయటికి పోయారు. ఇంటిలోని వారందరికి దాదాపు పదకొండు గంటలప్పుడు మెలుకువ వచ్చింది. సాంబ్రాని పొగ పీల్చిన రాఘవా, రాజ యోగానందస్వామి కూడా మత్తు ప్రభావమునకు నిద్రలోనికి పోయారు. తర్వాత లేచిన రాజయోగానంద స్వామికి అనుమానము వచ్చింది. జరుగకూడనిది ఏదో జరిగిందని అనుకొన్నాడు. అంతలోనే పదకొండున్నర గంట కావడమూ, ఈశ్వర్ బయటికి రావడమూ జరిగింది. అప్పుడు ఈశ్వర్ నుదట విభూది బొట్టు ఉండుటను స్వామి చూచి జమీందారుని అడిగాడు. తనకేమి తెలియదని జమీందారు చెప్పాడు. రాఘవదృష్టి సాంబ్రాణి పొగవేసిన ముస్లీమ్ వృద్ధుని మీదకు పోయింది. వెంటనే ముస్లీమ్ వృద్ధుని గురించి అడిగాడు.)

**రాఘవ :-** ముస్లీమ్ వచ్చి పొగవేసి పోయిన తర్వాత అందరికీ మత్తు వచ్చి నిద్రలోనికి పోయాము. దీనికి కారణము ఆ ముస్లీమ్ వృద్ధుడే! అతను ఎవరు?

**జమీందారు :-** ఆ ముస్లీమ్ వృద్ధుడు నాకు పది సంవత్సరములనుండి తెలుసు. అతను చాలామంచివాడు. అతనిలో ఏ దురుద్దేశమూ ఉండదు.

అతను ఈ వీధిలోనే చివరి ఇంట్లో ఉంటాడు. కావలసివస్తే పిలిచి అడుగుతాము.

**రాజయోగానంద :-** అతను నీకు తెలిసినవాడే, వీధి చివరిలో ఉండువాడే, మంచివాడే అయివుండవచ్చును. కానీ అతను వేసిన సాంబ్రాణి వలననే అందరూ నిద్రలోనికి పోవడము జరిగింది. అతను మంచివాడే అయినా అతను వేసిన సాంబ్రాణి మంచిదికాదు. అతనికి ఆ సాంబ్రాణి ఎక్కడిదో విచారించండి.

(ఆ ముస్లీమ్ వృద్ధుని కొరకు జమీందారు తన మనుషులను ఇద్దరిని పంపి ఎక్కడ ఉండినా అతనిని పిలుచుకొని రమ్మన్నాడు. అలా పోయిన మనుషులు పదినిమిషములకే అతనిని పిలుచుకొని వచ్చారు. ఆ రోజు సాయంత్రము వరకు పొగవేసుకొంటూ తిరిగే వృద్ధుడు అంత తొందరగా ఎలా దొరికాడని జమీందారు అనుకొని ఇలా అడిగాడు.)

**జమీందారు :-** ఇతను పది నిమిషములలోనే ఎలా దొరికాడు. సాయం కాలము వరకు దొరకడని అనుకొని వుంటిని.

**పని మనిషి :-** మేము అలాగే అనుకొని ఊరంతా వెతకాలని అనుకున్నాము. కానీ ఈయన తన పనిని ఎగరగొట్టి ఈ వీధిలోనే గోడక్రింది నీడలో పడుకొని నిద్రపోతున్నాడు. లేపి పిలుచుకొని వచ్చాము.

**జమీందారు :-** వహీద్‌గారూ! మీరు మాకు పొగవేసి పోయారు. ఆ పొగ వాసన తగిలిన వారంతా మత్తులో మునిగిపోయి నిద్రపోయారు. నీవు ఎన్నో సంవత్సరములు నుండి నమ్మకముగా మా దగ్గరకు వస్తున్నావు కదా! మాకు నిద్రవచ్చే సాంబ్రాణి పొగను ఎందుకు వేశావు?

**వహీద్ :-** అల్లాసాక్షిగా నాకు ఏమీ తెలియదు. మీ ప్రక్క ఇంటిలోను,

ఇక్కడ, తర్వాత రెండు ఇళ్ళలో అల్లాదువా కోసము పొగవేశాను. నాలుగిళ్ళు తప్ప ఐదో ఇంటికి పోకనే నాకు నిద్రవచ్చి గోడ ప్రక్కలో పడుకొని నిద్ర పోయాను. వీళ్ళు వచ్చి లేపితే లేచాను.

**రాఘవ :-** నీ తప్పు ఏమీలేదు. తప్పంతా సాంబ్రాణిది. అది నీకు ఎక్కడిది?

**వహీద్ :-** మీరు చెప్పినట్లు నిజమే అయి ఉంటుంది. ఆ సాంబ్రాణి నాదికాదు. నేను ప్రక్కనే ఉన్న దర్గాకు మ్రొక్కుకొని పక్కింటినుండి మొదలుపెట్టి మొదట ఈ వీధి అయిపోయిన తర్వాత మిగతా చోటికి పోతాను కదా! ఈ రోజు నేను దర్గాదగ్గర దర్గాకు తిరిగేటప్పుడు ఒక మనిషి వచ్చి అక్కడే నిలబడినాడు. నేను దర్గాచుట్టు తిరిగేది అయిపోయిన తర్వాత అక్కడినుండి వచ్చేటప్పుడు ఆ మనిషి నన్ను పిలిచి "నేను సాంబ్రాణి ఇస్తాను తీసుకొని పో" అన్నాడు. "నాకెందుకిస్తున్నావు?" అన్నాను. దానికి అతను "ప్రతి శుక్రవారము మీలాంటి బీదవారికిగానీ, దర్గాకుగానీ వందరూపాయలు ఖర్చుపెట్టుచుంటాము. ఈ దినము వందరూపాయల సాంబ్రాని తెచ్చాను. నీవు తీసుకొనిపో!" అన్నాడు. ఇచ్చేది ఎందుకు వద్దనాలని తీసుకొన్నాను. అక్కడినుండి వచ్చి ప్రక్క ఇంటిలో వేశాను. ఆ ఇంటిలో వేసిన తర్వాత ఈ ఇంటిలో వేశాను, తర్వాత రెండిల్లలో వేశాను నాకు నిద్రవచ్చి పడుకొన్నాను.

**రాజయోగానంద :-** సరే ఇందులో నీ తప్పు ఏమీలేదు, నీవు వెళ్ళు.

(వహీద్ వెళ్ళిపోయాడు. జమీందారు ఇంటికంటే ముందు ఇంటిలోనూ, జమీందారు ఇంటి తర్వాత రెండు ఇళ్ళలోను విచారించగా వారు కూడా నిద్రపోయినట్లు తెలిసింది. దానివలన ఇదంతా తపస్విబాబా

పనియేనని అనుకొన్నారు. స్వామి ఎంత జాగ్రత్తపడినా తపస్విబాబా ఈ మారు సులభముగా తన పట్టును నెగ్గించుకొన్నాడు. కనీసము నాలుగు ఐదు అమావాస్యల రోజులలోనైనా ఈశ్వర్ నుండి శక్తులను పొంది, కొన్ని దేశములను తన చేతిలోనికి తెచ్చుకోవాలనుకొన్న తపస్విబాబాకు, చివరికి ఆరవ అమావాస్య దినమున ఒక శక్తి లభించింది. ఆ ఒక్క శక్తితో సగము భారతదేశమును నాశనము చేయగల స్థోమత బాబాకు వచ్చినది. రాజయోగానంద స్వామి చేయునది లేక తన ఆశ్రమమునకు పోయాడు. తపస్విబాబా ఈశ్వర్ ద్వారా వచ్చిన శక్తిని వినియోగించుకొనుటకు మూడు నెలలు వ్యవధి మాత్రమున్నది. మూడు నెలలలోపు ఏమి చేయాలి, ఎలా చేయాలి అను యోచనలో బాబా ఉండిపోయాడు. చివరకు సరిగా ఒకటిన్నర నెలకు పౌర్ణమి దినమున ఆ శక్తిని వినియోగించుకోవాలను కొన్నాడు. ఆ శక్తి వినియోగింబడిన ఆరు నెలలకు ఈశ్వర్ చనిపోవడము జరుగుతుంది. ఒకవేళ ఈశ్వర్‌లో చేరిన శక్తులు ఒక్కటి కూడా బయటి కార్యములకు వినియోగించబడకపోతే ఈశ్వర్‌కు చావు తప్పిపోవును. తర్వాత అతని జీవితము గొప్ప దశలతో నిండిపోవును. అతని శక్తులు ఎవరి వశము కాకూడదనీ, అవి ఎవరి వశమైనా వాటిని ప్రపంచ పనులకు వినియోగించి, వారు గొప్పవారు కాగలరనీ, దానివలన ఈశ్వర్ చనిపోవుననీ రాజయోగా నంద స్వామికి తెలుసు. అందువలన తపస్విబాబా ప్రయత్నమును అనేక మార్లు భంగము చేశాడు. చివరిలో బాబా మోసముచేసి ఈశ్వర్ శక్తిని వశము చేసుకొన్నాడు.

తపస్విబాబా వశము చేసుకొన్న ఆరవ అమావాస్యశక్తి చాలా గొప్పది. అది ఆకాశములో సుడిమేఘములలాంటి మేఘములను

సృష్ఠించగలదు. ఒకటి రెండుకాక వంద సుడిమేఘములను సృష్ఠించు స్థోమత ఆరవ అమావాస్య దినమున ఏర్పడిన శక్తికి ఉన్నది. దానివలన తపస్విబాబా రెండవ పౌర్ణమి దినమున మహారాష్ట్ర, ఒరిస్సా, కర్ణాటక, ఆంధ్ర, తమిళనాడు, కేరళ మొత్తము ఆరు రాష్ట్రాలలో సుడిమేఘములను సృష్ఠించి వాటివలన జన జీవనాన్ని నాశనముచేసి, ఏ ఒక్కరూ మిగలకుండా చేయాలన్నది తపస్విబాబా ఉద్దేశము. అలా చేయడము వలన అందరూ చనిపోగా మిగిలిన ఆస్తులన్నిటిని తనే దోచుకోవాలనుకొన్నాడు. నామ మాత్రము పన్నుకట్టి ఉన్న భూమినంతటిని తానే ఆక్రమించుకోవాలను కొన్నాడు. అందరు చనిపోగా వారి ధనమును, బంగారమునూ తానే తీసుకోవాలనుకొన్నాడు. వచ్చే రెండవ పౌర్ణమికి దక్షిణ దేశమంతటినీ నాశనము చేయుటకు దానికి సంబంధించిన కార్యములను మొదలు పెట్టాడు.

తన మందిరములోనే రాజయోగానంద స్వామి మనిషి ఉన్నాడనీ, ఇక్కడి విషయములు ఏవైనా అతని ద్వారా రాజయోగానందస్వామికి తెలియ గలవనీ తపస్విబాబాకు తెలియదు. బాబా మునెప్పను తన మందిరమునకు పిలుచుకొని సుడిమేఘములను గురించి రహస్యముగా చర్చించిన విషయ మంతయు రాజయోగానంద స్వామికి తెలిసిపోయింది. రాజయోగానంద స్వామి ఇంతవరకు తపస్విబాబాకు ఈశ్వర్ వద్దనుండి నాల్గవ అమావాస్య శక్తి, ఆరవ అమావాస్యశక్తి వశమైనాయని అనుకొనెడివాడు. కానీ తపస్వి బాబావద్దనున్న తన అనుచరుడి ద్వారా బాబాకు నాల్గవ అమావాస్యశక్తి రాలేదనీ, అతనికి లభ్యమైనది ఆరవ అమావాస్యశక్తి ఒక్కటేనని ఇప్పుడు తెలిసిపోయింది. అంతేకాక వచ్చే రెండవ పౌర్ణమి దినమున దక్షిణ దేశమంతా తనకున్న శక్తితో ఒక వంద సుడిమేఘాలను సృష్ఠించి వాటివలన

ప్రతి ఊరునూ నాశనము చేయాలనుకొన్నాడని స్వామికి తెలిసింది. ఆ విషయమును రాఘవకు స్వామి తెలపాలని ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** రాఘవా! మనమనుకొన్నట్లు తపస్విబాబాకు రెండు అమావాస్యల శక్తులు లభ్యముకాలేదు. ఆరవ అమావాస్య దినమున వచ్చిన శక్తిని మాత్రమే అతను సాధించగలిగాడు. నాల్గవ అమావాస్య దినమున విచిత్రముగా రెండు నిమిషముల ముందు ఈశ్వర్ తనబొట్టును తుడిపి వేశాడని తెలిసింది. అందువలన మనము అనుకొన్నట్లు నాల్గవ అమావాస్య దినమున అతనికి శక్తి లభించలేదని నిర్ధారణ అయిపోయినది.

**రాఘవ :-** అయితే బాబాగారికి లభించినది ఆరవ అమావాస్య దినమున వచ్చిన శక్తిమాత్రమే. ఆ ఒక్క శక్తి వలన ఆయన ఏమి చేయగలడు?

**రాజయోగానంద :-** ఒక్క శక్తి అయినా ఎంతో శక్తివంతమైనది. దానివలన ప్రళయమును సృష్టించినట్లు మారణహోమము చేయగలడు. బాబాగారు వచ్చే రెండవ పున్నమి రోజున కనీసము వంద సుడిమేఘములను సృష్టించి దక్షిణ దేశములోని జీవకోటినంతటిని నాశనము చేయాలనుకొన్నాడని తెలిసింది.

**రాఘవ :-** సుడి మేఘములంటే ఏమిటి? అవి జీవకోటిని ఎలా నాశనము చేయగలవు?

**రాజయోగానంద :-** సుడి మేఘాలను గురించి **"దయ్యాల భూతాల యదార్థ సంఘటనలు"** అను గ్రంథములో పూర్తిగా వ్రాయబడివుంది. ఆకాశము నుండి భూమివద్దకు సుడి తిరుగుచూ వచ్చే మేఘమును సుడి మేఘము అంటాము. సుడిమేఘములను **"టోర్నడోలు"** అని ఇంగ్లీషుభాషలో

అంటారు. **"టోర్నడోలు"** అను సుడిమేఘములు సహజసిద్ధముగా మేఘముల నుండి పుట్టుచుంటాయి. కానీ ఇక్కడ ఆరవ అమావాస్య రోజున ఈశ్వర్ శరీరము నుండి వచ్చినశక్తి సహజముగా ప్రకృతిలో పుట్టు సుడిమేఘము (టోర్నడోలు) కంటే వందరెట్లు పెద్దదిగా మరియు వందరెట్లు బలమైనదిగా ఉంటుంది. ఆరవ అమావాస్య దినమున పుట్టిన శక్తి సుడిమేఘముగా మాత్రము మారగలదు. ఈ సుడిమేఘము, సహజముగా పుట్టిన సుడిమేఘము పొలాలలో కూడా ప్రయాణించినట్లు ప్రయాణించక, బాబాగారి మనో సంకల్పము ప్రకారము జనావాసములైన పల్లెలమీదనూ, పట్టణముల మీదనూ ప్రయాణించును. సాధారణ సుడిమేఘముకంటే వందరెట్లు పెద్దదయిన సుడిమేఘము ప్రళయమునకు మారురూపముగా కనిపించు చుండును. అది జననివాసములైన పల్లెల మీదికి వచ్చినపుడు పల్లెను మొత్తము ఒక్కమారుగా కదిలించివేయును. సుడిమేఘము యొక్క బలమునకు మనుషులూ, జంతువులూ కార్లు బస్సులు సుడిలో చిక్కుకొని వంద నుండి రెండు వందల అడుగుల ఎత్తులో ఎగరవేయబడి వంద కిలోమీటర్ల స్పీడుతో సుడి తిరుగుచుండును. అలా తిరగడములోనే సగము జీవరాసులు తమ ప్రాణాలు కోల్పోతాయి. అలా పది నిమిషముల సేపు త్రిప్పి సుడినుండి బయటికి విసిరివేయుచుండును. అలా విసిరివేయబడిన మనుషులుగానీ, జంతువులు గానీ క్రిందపడి చనిపోవడము జరుగుతుంది. అట్లే వాహనములను కూడా త్రిప్పి విసిరివేయడము జరుగుచుండును. సుడి మేఘము ఏ ఇంటిని వదలక అన్నిటినీ నేలమట్టము చేయును. కొన్నిటి పైకప్పులను త్రిప్పి విసిరివేయును. అది ఒక ఊరిలోనికి వచ్చిపోతే ఎక్కడ ఎవరి ఇల్లు ఉండేదో దాని గుర్తులు కూడా తెలియకుండా పోవును. ఒక్క ఇంటిగోడ కూడా మిగలకుండా క్రిందపడి విడిపోయి వుండును. మొత్తము

మీద ఒక ప్రళయములాగ ఉండును. ఆరవ అమావాస్య శక్తికి అంతబలమున్నదని తెలిసిన తపస్విబాబా, ఆ శక్తితో సుడిమేఘములను సృష్ఠించి ఆరు రాష్ట్రములలో ఎవరినీ మిగలకుండా చేయాలనుకొన్నాడు. అప్పుడు మనము కూడా ఆ శక్తి ముందర ఏమీ చేయలేము. అది అష్టగ్రహ ప్రభావముల వలన ఏర్పడిన శక్తి. కావున అది మనలను కూడా లెక్కచేయక విసిరివేయగలదు. ఆ సమయమునకు ఆరు రాష్ట్రాలు దాటిపోతేనే మనము బ్రతకగలము. లేకపోతే దాని తాకిడికి మనము కూడా మరణించక తప్పదు.

**రాఘవ :-** ఆరవ అమావాస్య రోజున ఈశ్వర్‌లో ప్రవేశించు ఒక్క శక్తియే ఇంత నాశనమును సృష్ఠించునదియైతే, మిగతా ఐదు అమావాస్యల శక్తులన్నిటిని బాబా వశము చేసుకొనివుంటే ఏమయ్యేదో?

**రాజయోగానంద :-** ప్రపంచమునంతటిని మారణము చేయగల అనేక శక్తులు ఏర్పడేటివి. అందువలననే అతని ప్రయత్నమును భంగము చేయాలని మనము ఎంతగానో ప్రయత్నించాము. కానీ ఆ ప్రయత్నములో నాలుగు మార్లు బాబా ఓడిపోయినా చివరకు ఒక్కమారు గెలువగలిగాడు. ఆ ఒక్కమారు కూడ గెలువకుండా చేసివుంటే బాగుండేది. కానీ అతని ఎత్తుగడను గమనించలేక పోయాము. పొగపెట్టి నిద్రలోనికి పంపి తన పనిని నెరవేర్చుకొన్నాడు. ఇప్పుడు రెండవ పున్నమికి మనము ఏదో ఒక దారి చూచుకొని ఇక్కడనుండి పోవలసిందే.

**(**ఈ విధముగా రాజయోగానంద స్వామి చెప్పడము రాఘవకు విచిత్రముగా తోచింది. అంతలేనిది స్వామి చెప్పడని అనుకొన్నాడు. అంతలోనే మొదట పున్నమి వచ్చింది. పున్నమి గడచిపోయిన నాలుగవ

దినము రాజయోగానంద స్వామికి, తపస్వి బాబా మందిరమునుండి స్వామి అనుచరుడి ద్వారా ఒక విచిత్రమైన వార్త తెలిసింది. పున్నమి రోజు రాత్రి ఒక పెద్దపాము బాబా ఆశ్రమములో కనిపించిందట. దానిని చంపాలని ప్రయత్నించగా అది కనిపించలేదట, చంపాలని ప్రయత్నించిన పది మందికి రెండవ రోజు చూపు లేకుండా పోయిందట. మూడవ దినము రాత్రి తిరిగి కనిపించిన పాము చివరకు మునెప్పను కాటువేయగా అతను విచిత్రముగా ఒకే నిమిషములో ప్రాణము వదిలాడట. మునెప్ప చనిపోవడము వలన తపస్విబాబా చాలా బాధపడ్డాడని స్వామికి తెలిసింది. అలా జరగడము స్వామికి ఆశ్చర్యము అయినది. మునెప్ప అంత్యక్రియలు అయిపోయిన తర్వాత బాబా తన ఉద్దేశమును మార్చుకొన్నాడు. మొదట రెండవ పౌర్ణమికి వినాశనము సృష్టించాలనుకొన్న బాబాగారు అంతవరకు లేకుండా పది రోజులలో వచ్చే అమావాస్య రోజే తన పనిని చేయాలనుకొన్నాడు. అలా బాబా తన ఉద్దేశ్యమును మార్చుకొని, వచ్చే అమావాస్య దినమే వినాశనమును ప్రారంభించాలని అనుకొన్న విషయము బాబా మందిరములోనున్న స్వామి అనుచరునికి కూడా తెలియదు. అందువలన ఆ విషయము రాజయోగా నంద స్వామికి కూడా తెలియకుండా పోయింది.

ఉన్నట్లుండి ఎంతో భద్రతగల స్వామి మందిరములోనికి పాము ఎలా పోయిందని స్వామి ఆలోచించాడు. అక్కడికి చిన్న చీమ కూడా పోలేదు. ఎంతో శుభ్రముగానున్న బాబా మందిరములోనికి పాము పోవుటకు వీలులేనేలేదు. అయినా అక్కడికి పాము పోవడము ఏమిటి, దానిని చంపను పూనుకొన్న పదిమందికి కళ్ళు కనిపించకుండా పోవడమేమిటి, అది కరిచిన నిమిషమునకే మునెప్ప చనిపోవడమేమిటి, అని ఎంత ఆలోచించినా స్వామికి ఏమాత్రము అర్థముకాలేదు. చివరకు ఇది దైవ నిర్ణయము ప్రకారమే జరిగిందని అనుకొన్నాడు.

అంతలో అమావాస్య వచ్చింది. రేపే అమావాస్య అనగా అప్పుడు బాబా తన నిర్ణయము మార్చుకొన్నాడని అమావాస్య దినమున రేపే తన వినాశన కార్యమును ప్రారంభించుచున్నాడని, బాబా మందిరమునుండి స్వామికి వార్త వచ్చింది. అదియూ సాయంకాలము ఆరుగంటల సమయములో ఆ వార్త తెలియడముతో ఆ సమయములో తాము ఎక్కడికీ పోలేమని తాము కూడా సుడిమేఘము యొక్క ఉధృతిలో చిక్కుకోవలసిందేనని స్వామి అనుకొన్నాడు. అదే విషయమును రాఘవకు కూడా చెప్పి, ఇక్కడ కూడా బాబా తన ఉద్దేశమును మార్చుకొని మనలను కూడా అపాయములో ఇరికించాడని అనుకొన్నారు. తాము ఇప్పుడు ఎటూ పోలేమనీ, తమను దేవుడే కాపాడవలెననీ, దేవుని మీద భారము వేసి ఆశ్రమములో ఉండిపోయారు. తెల్లవారగానే స్వామికి మరొక వార్త అందింది. అదేమనగా! ఆ తెల్లవారు జామున బాబాలేచి కార్యక్రమములు తీర్చుకొని తన గదిలో కూర్చొని ఈశ్వర్‌నుండి వచ్చినశక్తిని బయటికి ఆహ్వానించి తన ఉద్దేశమును ఆ శక్తికి చెప్పి పంపాలనుకొన్నాడు. ఆ శక్తిని పిలువగానే ఎదురుగా ముక్కు మూతిలేని ఒక ఆకారము వచ్చి నిలబడింది. అప్పుడు ఆరు రాష్ట్రముల గురించి బాబా చెప్పి వాటినన్నిటిని ఒక గంట వ్యవధిలో నాశనము చేయమన్నాడు. సరేనని ఆ ఆకారము చెప్పింది. అంతలో ఒకనాగుపాము అక్కడ ప్రత్యక్షమైనది. దాని ప్రక్కనే ఒక పొడవుగడ్డమున్న మహర్షి ప్రత్యక్షమైనాడు. అప్పుడు రూపములేని ఆకారమువైపు ఆ మహర్షి చూచి "వీడు నిన్ను వశపరుచుకొని దక్షిణ దేశమును తల్లి పిల్ల అనకుండా అందరినీ నాశనము చేయమన్నాడు. వీడు చెప్పినట్లు నీవు వినవలసిందే. నీవు వీడు చెప్పినట్లే చేయి. కానీ నీవు నాశనము చేయవలసినది దక్షిణ దేశమును కదా! ఆ దక్షిణ దేశము నా దక్షిణ హస్తములోనే కలదు. నా

దక్షిణ హస్తములో ఏడు రాష్ట్రములు కలవు. అందులో ఆరింటిని నీవు నాశనము చేసి, ఏడవ దానిలో అణిగిపో" అని చెప్పగానే అలాగే మీ ఆజ్ఞప్రకారమే చేయగలను. అని ఆ ఆకారము బహు చిన్నదిగా ఈగ పరిమాణముగా మారి, మహర్షి హస్తము మీద మొదట బొటనవ్రేలి మొదట గెనుపుమీద వ్రాలి అక్కడినుండి రెండవ గెనుపు మీదికి వచ్చింది. అక్కడి నుండి మూడవ గెనుపు మీదికి వచ్చింది. అక్కడినుండి బొటనవ్రేలు క్రిందగల విశాల భాగములోనికి వచ్చింది. అప్పటి నాలుగు రాష్ట్రములు అయిపోయాయి అని పెద్దగా చెప్పింది. దాని తర్వాత రెండు రేఖల మధ్యనున్న ఒకటవ భాగములోనికి వచ్చింది, అప్పుడు ఐదు రాష్ట్రములు అయిపోయాయి అని గట్టిగా చెప్పింది. అక్కడినుండి దాని ప్రక్కన పైనగల రెండు రేఖల మధ్యనున్న రెండవ భాగములోనికి వచ్చింది. ఇప్పటికి ఆరురాష్ట్రములు దక్షిణదేశమంతా అయిపోయింది అని బిగ్గరగా చెప్పింది. తర్వాత ఏడవ భాగమైన ఉత్తర దేశములో అణిగిపోతున్నాను అని చెప్పి ఒక రేఖకు పైన వ్రేళ్ళకు కిందనున్న భాగములో అణిగి కనిపించకుండాపోయింది. తన ముందరే జరుగుచున్న ఆ దృశ్యమును తపస్విబాబా ఆశ్చర్యముగా చూస్తూ నిలిచిపోయాడు. అది అంతా అయిపోయిన తర్వాత అక్కడవున్నది ఎవరని అతనివైపు బాబా చూడగానే ప్రక్కనేవున్న పాము పైకిలేచి తపస్విబాబా మెడకు చుట్టుకొని తలమీద కాటువేసింది. అప్పుడు బాబాగారు ఒక్క నిమిషములోనే ప్రాణమును వదలి మరణించాడు. అప్పుడు మహర్షి అక్కడినుండి వెళ్ళిపోగా పాము కూడా పోయింది. ఇది మందిరములో జరిగిన సమాచారము. బాబామందిరములో ఈ సంఘటనను ప్రత్యక్షముగా చూచిన రాజయోగానంద స్వామి ఏర్పరచిన మనిషి చెప్పగా, రాజయోగా నందస్వామి రాఘవకు తాను బాబామందిరమునుండి తెలుసు కొన్నదంతా

తెలిపాడు. అదంతా విన్న రాఘవకు ప్రమాదము తప్పి పోయిందని నవ్వాలనిపించినా, గుహలోని మహర్షి అవసరము వచ్చినపుడు నేనే వస్తానని చెప్పిన మాట జ్ఞాపకము వచ్చి ఆయన దర్శన భాగ్యము లభించలేదని ఏడ్వాలనిపించింది. విషయమంతా స్వామి ద్వారా వినిన రాఘవ ఏమీ మాట్లాడక నిలిచిపోవడమును చూచిన రాధేశ్వరి ఇలా అన్నది.)

**రాధేశ్వరి :-** ఏమండీ! స్వామి చెప్పిన మాటకు ఏమీ మాట్లాడక నిలిచి పోయారు?

**రాఘవ :-** ఏమీ లేదు. నేను ఆలోచనలో పడిపోయాను. ఇప్పుడు జరుగబోవు ప్రమాదమునుండి మనము బయట పడినందుకు సంతోషమే. అయినా ప్రమాదమునుండి రక్షించినది గుహలోని మహర్షియని, తపస్వి బాబాను కాటువేసి నిమిషములో చంపినది గుహలోని పామేనని నాకు అర్థమైనది. తర్వాత నాకు మహర్షి "నీవు ఇక్కడికి రావద్దు సమయము వచ్చినపుడు నేనే వస్తాను" అనిన మాటలు జ్ఞాపకము వచ్చాయి. ఆ దినము ఆయన దర్శనము కొరకు తిరిగి వస్తానని నేను అడిగినపుడు ఆయన అలా చెప్పాడు. అంతేకాక ఈ పాము చేయవలసిన పాత్ర చాలా ఉన్నదని కూడా చెప్పాడు. ఆయన మాట ప్రకారము మునెప్పను కరిచి చంపిన పామూ, తపస్విబాబాను కరిచిన పామూ అదేనని, ఆ పాము కరుచుట వలనే ఒకే నిమిషమునకు ఇద్దరూ చనిపోవడమూ జరిగినదనీ అర్థమైనది. ఇవన్ని ముందే జరుగునని తెలిసిన ఆ మహాత్ముడు సమయమువచ్చినపుడు అని మాత్రము చెప్పాడు. ఆ రోజు నేను ఆ మహానుభావుని దర్శనమునకు అడుగగా, నేనే వస్తాను నీవురావద్దు అన్నాడు. కానీ ఆయన వచ్చాడు ఎంతో పెద్ద మారణశక్తిని తన చేతిలోనే అణిగిపోవునట్లు చేశాడు. ఆయన

పనిని ముగించుకొని పోయాడు. కానీ ఆయన వచ్చినా ఆయన దర్శనము దొరకలేదు కదా అని బాధగా ఉంది. అందువలన పలకలేకపోయాను.

**రాజయోగానంద :-** రాఘవా! నీవు అలా అనుకోవడము పొరపాటని నేను చెప్పగలను. ఎందుకనగా! నీవు అడిగినది ఆయన దర్శనమును కదా! అప్పుడు ఆయన చెప్పినది. నీవు నా దర్శనమునకు రావద్దు. సమయము వచ్చినపుడు నేనే వస్తానని చెప్పాడు. ఆ మాటలో నేనే వచ్చి దర్శనమిస్తానని చెప్పినట్లు అర్థమగుచున్నది. నేను వచ్చినపుడు నీవు నా దర్శనము కొరకు రమ్మని చెప్పలేదు కదా! అందువలన ఆయనే వచ్చి దర్శనమిస్తానని బాగా తెలియుచున్నది. అందువలన నీవు చింతించవలసిన పనిలేదు.

(అంతలోనే జమీందారు కారువచ్చి ఆశ్రమము ముందర ఆగింది. అందులోనుండి అపస్మారక స్థితిలోవున్న ఈశ్వర్‌ను జమీందారు రావు బహదూర్ గారు తీసుకొని వచ్చాడు. జమీందారు, జమీందారు భార్య ఇద్దరూ వచ్చి స్వామితో బాధపడుచూ ఇలా అన్నారు.)

**జమీందారు :-** స్వామీ! ఈశ్వర్ తెల్లవారుజామున నాలుగుగంటల ముప్పయి నిమిషములపుడు గట్టిగా అరిచి అపస్మారక స్థితిలోనికి పోయాడు. ఇప్పటి పరిస్థితిలో బయట ఎవరితోను (ఏ డాక్టరుతోనూ) చూపించుకోవడము మంచిదికాదని పించింది. వెంటనే మీవద్దకు తీసుకొని వచ్చాము.

**రాజయోగానంద :-** ఈశ్వర్‌ను గురించి మీరు గాబరా పడవలసిన పనిలేదు. ఆరవ అమావాస్య రోజు ఆయన శరీరములో ప్రవేశించిన శక్తి ఈ తెల్లవారు జామున నాలుగున్నర గంటలకు దేవునిలోనికి ఐక్యమైపోయినది. ఆ శక్తికి ఈశ్వర్ శరీరమునకు కొంత అనుబంధము ఉండుట వలన, అది లేకుండా పోయిన సందర్భములో ఈశ్వర్‌కు అలా జరిగి ఉండవచ్చును. అందరినీ

రక్షించుశక్తి ఒకటున్నది. ఆ శక్తివలననే ఈశ్వర్‌కు ఏమి జరిగినా జరగాలి. ఆ శక్తియే వచ్చి కాపాడుతాదను నమ్మకముతో ఉండండి.

(జమీందారు, అతని భార్య, ఈశ్వర్‌ను తీసుకవచ్చిన తర్వాత జమీందారు ఈశ్వర్‌ను గురించి చెప్పునప్పుడు అందరి దృష్టి జమీందారు చెప్పు విషయము మీదనే ఉండెను. అప్పుడు వారి ప్రక్కన మరొక మనిషి నిలబడి ఉండినా, అతను ఎవరు అని ఎవరూ అతనివైపు చూడలేదు. రాజయోగానంద స్వామి మాట్లాడునప్పుడు కూడా అందరి దృష్టి స్వామి మీదనే ఉండెను. అందరి ధ్యాస అలా ఉండుట వలన ఎవరో తమతో పాటు ఉన్నాడని అనుకున్నారు. కానీ అతను ఎవరు అని ధ్యాసగా అతని వైపు ఎవరు చూడలేదు. రాఘవ అకస్మాత్తుగా రాజయోగానందస్వామి మాటలు విన్న తర్వాత ప్రక్కనున్న మనిషిని చూచాడు. అలా చూచిన రాఘవ ఒక్కమారు ఆశ్చర్యపోయాడు. తనకళ్ళను తానే నమ్మలేకపోయాడు. అక్కడ రాఘవకు కనిపించినదీ, అంతవరకు తమతోపాటు అక్కడే నిలుచున్నదీ, సాక్షాత్తు గుహలోని మహర్షి. రాఘవ కళ్ళవెంట ఆనంద భాష్పములు రాగా, వెంటనే అక్కడున్న మహర్షి పాదాల మీద పడిపోయాడు. రాఘవ ఉన్నట్లుండి అలా కాళ్ళమీద పడినపుడు ఎవరి కాళ్ళ మీద పడినాడని అప్పుడు ఆ మహర్షిని అందరూ చూచారు. అతను అక్కడున్న వారందరికీ క్రొత్తవ్యక్తి. అందువలన ఆయన ఫలానా అని గుర్తించలేక పోయారు. మహర్షి పాదాలకు నమస్కరించి లేచి నిలుచున్న రాఘవతో మహర్షి ఇలా అన్నాడు.)

**మహర్షి :-** నీ కోరిక నెరవేరిందా?

**రాఘవ :-** నెరవేరింది. ఇంతకుముందే రాజయోగానంద స్వామి మీరే వచ్చి నాకు దర్శనమిస్తారని చెప్పాడు. కానీ మీరు వచ్చినా ఇక్కడే ఉండినా మిమ్ములను మేము చూడలేదు. ప్రక్కధ్యాసలో పడిపోయాము.

(అప్పుడు రాఘవ మాటలను బట్టి అక్కడున్న వారికి ఆయనే భూగర్భమునుండి వచ్చిన మహర్షి అని అర్థమైనది. జమీందారుకు ఏమీ అర్థముకాలేదు. అప్పుడు రాజయోగానంద స్వామి జమీందారుతో ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** రావు బహదూర్ గారూ! నేను ఒక్క నిమిషము ముందు నీతో ఏమి చెప్పానో జ్ఞాపకముందా! అందరినీ రక్షించుశక్తి ఒకటున్నదని అన్నాను కదా! ఆ శక్తియే ఈ మహర్షిరూపములో వచ్చినది. ఆయన వలననే ఈశ్వర్‌కు ఏమి జరిగినా జరుగుతుంది. ఆయనే వచ్చి కాపాడుతాడని చెప్పాను. ఈ పాటికి మనమంతా సుడిమేఘము వలన చనిపోయేవారము. మనమేకాదు దక్షిణ దేశమంతా సర్వనాశనమై పోయేది. నన్ను నిన్ను మాత్రమే కాకుండా దక్షిణ దేశ ప్రజలనందరినీ ఆపదనుండి కాపాడిన దేవుడు ఈయనే!

(అని రాజయోగానంద స్వామి అనగానే అక్కడున్న వారందరూ ఆ మహర్షి పాదాలమీద వాలిపోయారు. అందరిని లేపిన రాజయోగానంద మళ్ళీ ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** రాఘవకు ఇంతకుముందే, నీవు బాధపడవద్దు ఆయనే వచ్చి దర్శనమిస్తాడు అని చెప్పాను. అలాగే రాఘవకే కాక మనందరికీ ఆయన దర్శనము దొరికింది. నిమిషము ముందే చెప్పాను. ఆయనే వచ్చి ఈశ్వర్‌ను కాపాడుతాడని, అలాగే ఆయన వచ్చారు. ఆయన ఏమి చేయాలో అదే చేస్తాడు. కాని మనము ఆయనను కోరవలసింది ఆయన జ్ఞానమును.

(రాజయోగానంద స్వామి అలా చెప్పుచుండగా అక్కడున్న మహర్షి చిరునవ్వు నవ్వుతూ మౌనముగా చూస్తూవుండెను. అప్పుడు రాఘవకు తపస్విబాబాగారి మందిరములో సుడిమేఘమునకు మహర్షి చెప్పిన విషయము జ్ఞాపకము వచ్చి ఇలా అడిగాడు.)

**రాఘవ :-** మహాత్మా! తమరు సుడిమేఘములను సృష్ఠించు అమావాస్య శక్తిని మీ దక్షిణ హస్తము (కుడిచేతి) లో అణిగిపొమ్మన్నారు. అప్పుడు దక్షిణమునగల ఆరు రాష్ట్రములను సంచరించి అక్కడ వినాశనము చేసి చివరకు ఏడవ భాగమైన ఉత్తరదేశములో అణిగిపొమ్మని ఆ శక్తికి ఆజ్ఞ చేశారు. ఆ శక్తి మీరు చెప్పినట్లే చిన్న ఈగ పరిమాణములోనికి మారి, మీ హస్తములోని ఆరు భాగములతో తిరిగి ఏడవ భాగములో అణిగిపోయి కనిపించకుండా పోయిందని విన్నాను. హస్తములోని ఏడు భాగములు ఏమిటో, అందులో ఆరు దక్షిణదేశముకాగా, ఒక్కటి మాత్రము ఉత్తరదేశమను పోలిక ఏమిటో నాకు అర్థముకాలేదు. రాజయోగానందస్వామి మిమ్ములను ప్రపంచ కోర్కెలడుగకుండా మీ జ్ఞానమునే అడగమన్నాడు. అందువలన మీరు ఆ శక్తికి చెప్పిన భావమేమిటో, మీరు చెప్పు జ్ఞానమువలననే మేము తెలుసుకోగలము.

**మహర్షి :-** రాఘవా! అన్ని విషయములు తెలిసిన వ్యక్తి, అన్ని జ్ఞానములు తెలిసిన వ్యక్తి అయిన రాజయోగానంద స్వామి ఉండగా నన్ను అడగడము ఎందుకు? ఆయనకు తెలియని జ్ఞానము నాకు తెలుసునా? మీరు ఆయననే అడగండి.

(స్వయానా మహర్షియే ఆ మాటను రాజయోగానంద స్వామి ముందర చెప్పగా ఆశ్చర్యముగా స్వామివైపు రాఘవ చూచాడు. అప్పుడు ఇంకా ఆశ్చర్యమైన దృశ్యము రాఘవకు కనిపించింది. ఏ పామైతే మునెప్పనూ, తపస్విబాబాను ఒక్క నిమిషములో అంతము చేసిందో, ఏ పామైతే గుహలో మహాత్ముని ప్రక్కన కనిపించిందో అదే పామే రాజయోగా నంద స్వామి ప్రక్కన ఉన్నది. అంతేకాక అక్కడున్న వారందరూ అక్కడ

కనిపించిన మహర్షికి నమస్కరించి పాదాలమీద పడినా స్వామి మాత్రము కనీసము నమస్కారమని కూడా ఆయనకు చెప్పలేదు. స్వామియేమో మహర్షిని దేవునితో సమానముగా చెప్పగా, మహర్షియేమో స్వామిని ఆయనకు తెలియని జ్ఞానము నాకు తెలుసునా! అంటాడు. రాజయోగా నందయేమో రాత్రి కూడా మనకు చావు తప్పదని భయపడిపోయాడు. ఉదయము మహర్షియే మనలనందరిని కాపాడిన దేవుడన్నాడు. ఇప్పుడు మహర్షి స్వామిని గొప్పగా చెప్పడమేకాక ఎల్లప్పుడు మహర్షి దగ్గర చూచిన పాము రాజయోగానంద స్వామి దగ్గర ఉన్నది. ఇదంతా గమనిస్తే వీరి ఇరువురులో ఎవరు గొప్పో, ఎవరు తక్కువో రాఘవకు ఏమీ అర్థము కాలేదు. రాఘవ ఇలా యోచిస్తుండగానే రాజయోగానంద స్వామి హస్తమును గురించి చెప్పను మొదలుపెట్టాడు.)

**రాజయోగానంద :-** మన శరీరములో రెండు కుడి, ఎడమ భాగములున్నవి. కుడి భాగమును దక్షిణ భాగమని, ఎడమ భాగమును ఉత్తర భాగము అని అనవచ్చును. అలా ఉత్తర, దక్షిణ భాగములనుటకు కారణము కలదు. అది ఏమనగా! ఉదయము సూర్యుడు పుట్టుచున్నపుడు సూర్యునికి ఎదురుగా నిలబడితే అప్పుడు సూర్యునికి ఎదురుగావున్న ముఖమును తూర్పు భాగమని, వీపును పడమర భాగమని, దక్షిణ దిక్కుకు ఉన్న కుడి భాగమును దక్షిణ భాగమని, అలాగే ఎడమ భాగము ఉత్తర దిక్కుకు ఉండుట వలన ఎడమ భాగమును ఉత్తర భాగమని అనుచుందుము. ఇవి మన శరీర నాల్గు ప్రక్కలకు పెట్టిన పేర్లుకాగా స్థూలశరీరములో జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములని రెండు రకముల బయటి అవయవములు గలవు. వాటియందు జ్ఞానేంద్రియములలో కన్ను ప్రధానమైనది, అలాగే కర్మేంద్రియములలో చేయి ప్రధానమైనది. జ్ఞానేంద్రియమైన కన్ను సూర్యునికి

ఎదురుగా తూర్పు దిశనవున్నది. అందువలన కన్నును తూర్పు కన్ను అని అనవచ్చును. చేతులు ఉత్తరమున ఒకటి,దక్షిణమున ఒకటి కలవు. అందువలన కుడిచేయిని దక్షిణ హస్తమని, ఎడమ చేయిని ఉత్తర హస్తమని అనడము జరుగుచుచున్నది.

జ్ఞానేంద్రియమైన కన్ను, కర్మేంద్రియములైన హస్తములో ఎంతో విశేషమైన దైవజ్ఞానము ఇమిడి ఉన్నదని ముందే తెలుసుకొన్నాము. నేత్రములో త్రిఆత్మల (జీవాత్మ, ఆత్మ, పరమాత్మల) సూచన ఉన్నదని చెప్పుకొన్నాము. హస్తములో మూడు ఆత్మల గుర్తులేకాక, ప్రకృతి జనిత ములైన గుణముల గుర్తులు కూడా కలవని తెలుసుకొన్నాము. ఇప్పుడు మహర్షి సుడిమేఘమను శక్తికి, హస్తములోని దక్షిణ దేశములోని ఆరు రాష్ట్రములు (ఆరు భాగములు) దాటి ఉత్తర దేశములోని ఒక్క భాగములో అణిగిపొమ్మని చెప్పాడు. ఆయన చెప్పిన మాటలోని జ్ఞానమును వివరించి చెప్పుకుంటే **జీవుడు అజ్ఞానమునుండి జ్ఞానమువైపు పోయి, దానిని కూడా దాటి చివరకు మోక్షమును చేరమని చెప్పడము జరిగింది.** ఒక మనిషి మాయను దాటి దైవజ్ఞానమువైపు పోయి, దానిని కూడా వదలి యోగములో లేకుండా పోవలెనని అర్థము. ఒక మనిషి ఆరు భాగములను దాటినపుడు ప్రకృతి మాయనూ, దేవుని జ్ఞానమునూ దాటి యోగము అను ఏడవ భాగమును చేరి అందులోనే లేకుండా పోవడము ఎలాగో, మనిషి హస్తము లోనే చూపబడినది. అది ఎలాగో అర్థము కావాలంటే మానవుని హస్తమును ఒకమారు తర్వాత గల పేజీ చిత్రపటములో చూడండి. హస్తములో ఏడు భాగములు గుర్తించబడినవి. అందులో నాలుగు ప్రకృతి సంబంధమైనవి. మూడు పరమాత్మ సంబంధమైనవని చెప్పవచ్చును. అట్లే ఆరు ఇహ లోకములోనివని, ఏడవది పరలోక సంబంధమైనదని చెప్పవచ్చును. వాటినే




| | | |
|---|---|---|
| ప్రకృతి సంబంధ భాగములు | 1. తామస రాష్ట్రము (రాజ్యము) | దక్షిణ దేశము |
| | 2. రాజస రాష్ట్రము (రాజ్యము) | |
| | 3. సాత్త్విక రాష్ట్రము (రాజ్యము) | |
| | 4. ప్రకృతి రాష్ట్రము (రాజ్యము) | |
| ఆత్మ సంబంధ భాగములు | 5. జీవుని రాష్ట్రము (రాజ్యము) | |
| | 6. ఆత్మ రాష్ట్రము (రాజ్యము) | |
| | 7. పరమాత్మ దేశము (సామ్రాజ్యము) | ఉత్తర దేశము |

ఇహమునకు సంబంధించిన ఆరు భాగములను ఆరు రాష్ట్రములని పరమునకు సంబంధించిన ఒక్క భాగమును (ఏడవ భాగమును) ఉత్తర దేశమని చెప్పుచున్నాము. ఆరు రాష్ట్రములను జయించి లేక నాశనము చేసి ఏడవ భాగమును చేరడమునే మోక్షమును పొందడమని అర్థము చేసుకోవలెను.

హస్తమును వివరించి చెప్పుకుంటే ప్రకృతి నుండి పుట్టినది మాయ. ప్రకృతి జనితమైనది మాయ. మాయ మూడు భాగములుగా ఉన్నది. ఉదాహరణగా చెప్పుటకు ఒక కోడిపెట్టను తీసుకొని చూస్తాము. ఒక కోడికి మూడు పిల్లలున్నాయి. మూడు కోడి పిల్లలు, కోడి రెక్కల క్రింద ఉంటాయి. ఒక పిల్లల కోడిని ప్రకృతిగా లెక్కించి చూస్తే దానికి పుట్టిన పిల్లలు అను మాయ మూడు భాగములుగా ఉన్నది. ఆ మూడు భాగము లలో ఒకటి తామస గుణభాగముకాగా, రెండవది రాజస గుణభాగము, మూడవది సాత్త్వికగుణభాగము. నాల్గవది ఈ మూడు భాగములకు తల్లి అయిన ప్రకృతి. ఐదవ భాగము, ఆరవ భాగము, ఏడవ భాగము మూడు ఆత్మ సంబంధ భాగములు. అందులో జీవాత్మకు సంబంధించినది ఐదవ భాగము. ఆత్మకు గుర్తుగా చెప్పుకొనునది ఆరవ భాగము. చివరి ఏడవ భాగము పరమాత్మకు గుర్తుగా, మోక్షమునకు చిహ్నముగా చెప్పబడుచున్నది. ఇందులో ఆరు భాగములను దాటి ఏడవ భాగములో చేరిపోతే, అక్కడ చేరినవాడు తర్వాత లేకుండా దేవునిలోనికి ఐక్యమైపోవును.

ఈశ్వర్ 16వ సంవత్సరములో ఆరవ అమావాస్య రోజున పుట్టిన శక్తిని లేకుండా చేయుటకు, ఆధ్యాత్మిక అర్థముతో ఏడవ భాగమైన ఉత్తర దేశమును చేరి అణిగిపొమ్మని చెప్పడము జరిగింది. ఒక్కమారు మోక్షము

పొందినవాడు తిరిగి పుట్టడు. వాడు ఎక్కడా ఉండడు. అందువలన అమావాస్య శక్తిని ఎక్కడా లేకుండా చేయుటకు ఏడవ భాగములో అణిగి పొమ్మని చెప్పడము జరిగింది. ఈ జ్ఞానము అర్థముకావాలంటే హస్తము లోని మూడు రేఖలను గురించి, వ్రేలిలోని మూడు భాగముల గురించి తెలిసివుండవలెను. మూడు రేఖలు మూడు ఆత్మలని, వ్రేలి మూడు గెనుపులు మూడు గుణములని తెలిసివుండవలెను. అట్లు తెలిసిన వారికి ఆరు రాష్ట్రముల విషయము బాగా అర్థమగును.

(రాజయోగానంద స్వామి, మహర్షి చెప్పిన ఆరు రాష్ట్రముల విషయమును ఆధ్యాత్మికరీత్యా వివరించి చెప్పడము అక్కడున్న వారందరికీ ఆశ్చర్యము అయినది. ఇంతకుముందే హస్తములోని రహస్యమునంతటినీ చెప్పిన రాజయోగానంద స్వామి హస్తములోని ఉద్దేశ్యమును, హస్తములో ఏడు భాగములున్న విషయమును ఎప్పుడూ చెప్పలేదే అనుకొన్న రాఘవ ఈ విధముగా అడిగాడు.)

**రాఘవ :–** స్వామీ! ఇంతకు ముందు హస్తములో మూడు ఆత్మల వివరమును సంపూర్ణముగా చెప్పిన మీరు మోక్షమును చేరి తిరిగి పుట్టని విధానము హస్తములో సూచించబడి ఉన్నదనీ, అందువలననే రేఖల మధ్యన ఏడు భాగములుగా హస్తములో కనిపిస్తున్నవనీ, హస్తమును చూచుకొన్న వానికి ఈ భాగములను దాటిపో! అను సందేశము తెలుస్తున్నదనీ ఎప్పుడూ చెప్పలేదు.

**రాజయోగానంద :–** అప్పుడు ఈ విషయము నాకు తెలిసివుంటే నేనెందుకు చెప్పను? ఇప్పుడు తెలిసింది కాబట్టి ఇప్పుడే చెప్పాను. నా మాట నీకు అర్థముకాలేదు కదా! అయితే బాగా అర్థమయ్యేటట్లు వినండి. చెప్పినట్లు

కనపించేది నేను. చెప్పినట్లు ఎవరికీ తెలియకుండా ఉండువాడు మరొకడు. నాకు తెలిసింది నేను మీకు చెప్పాను, తెలియంది నాకు ఆయన చెప్పాడు. విన్నవారు మీరు, చెప్పిన వానిని నేను. నాకు చెప్పినవాడు మీకు తెలియ కుండా ఉన్నాడు. నాకు తెలిసిన తర్వాత మీకు చెప్పిన నేను గొప్పనా? తెలియకముందు నాకు చెప్పిన ఆయన గొప్పవాడా మీరే చెప్పండి. భూమి మీద ఎవరికీ తెలియకముందు చెప్పినవాడు గొప్పగానీ, తెలిసిన తర్వాత చెప్పువాడు గొప్పవాడు కాదు. ప్రపంచములో ఎవరికీ తెలియకముందు చెప్పినవాడే గురువు. తెలిసిన తర్వాత చెప్పు నాలాంటివాడు గురువు కాదు కేవలము బోధకుడు మాత్రమే అగును. అందువలననే కాలజ్ఞానమును చెప్పిన బ్రహ్మముగారు మనకు గొప్పగా కనిపించినా ఆయన మాత్రము తన కాలజ్ఞానములో నాకు మీకు గురువు ఒకడున్నాడని చెప్పాడు.

**రాఘువ :–** జగతిలో గురువు చెప్పిన జ్ఞానమునే బోధకులు చెప్పినపుడు, ఆ బోధకులు చెప్పిన జ్ఞానమును ఇంకొక బోధకులు చెప్పినపుడు, భూమిమీద బోధకుల పరంపర సాగుచున్నదని అర్థమగుచున్నది. అలాంటపుడు భూమి మీద ఉన్నది బోధకుల పరంపరేగానీ, గురుపరంపర లేనట్లే కదా!

**రాజయోగానంద :–** లేదనే కదా నేను చెప్పుచున్నది. గతములో నాకు హస్తములోని భాగముల జ్ఞానమే తెలియదు. ఇప్పుడు తెలిసింది. కాబట్టి చెప్పాను. నాకు తెలిసిన దానిని చెప్పే బోధకున్ని మాత్రమే, నేను గురువును కాను. ఎవరికీ ఇంతవరకు తెలియని జ్ఞానమును తెల్పినవాడే నిజమైన గురువు.

**రాఘువ :–** అటువంటి నిజ గురువును మేము చూడవచ్చా, చూడలేమా?

**రాజయోగానంద :–** ఆయనను చూడవచ్చును. ఆయన భూమిమీదికి

వచ్చినపుడు కనిపిస్తూనే జ్ఞానమును తెలియజేయును కదా! భూమిమీద లేనప్పుడు ఎవరూ చూడలేరు. ఆయన కనిపించి చెప్పగలడు, కనిపించకా చెప్పగలడు.

**రాఘవ :-** మీరు గురువును చూచారా?

**రాజయోగానంద :-** చూచాను. నేను చూచినట్లు చెప్పినా మీరు నమ్మరు.

**రాఘవ :-** మీరు గురువును చూచినప్పుడు ఎప్పుడైనా నమస్కరించారా?

**రాజయోగానంద :-** రాఘవా నీవు సత్యాన్వేషివి అను పేరును నిలబెట్టు కొనుటకు క్రైమ్ ప్రశ్నలు అడిగినట్లు అడుగుచున్నావు. నేను కూడా నేరస్థుడు చెప్పినట్లే చెప్పుతాను. ఈ విధముగా అడిగినందుకు నాకు సంతోషము. అయితే చెప్పెదను విను. గురువును నేను చూచినప్పుడు ఎప్పుడూ నమస్కరించలేదు.

**రాఘవ :-**గురువును చూచినప్పుడు ఎవరైనా నమస్కరిస్తారు కదా! మీరెందుకు నమస్కంచలేదు?

**రాజయోగానంద :-** నేను ఆయనకు శిష్యుడను కాదు కదా!

**రాఘవ :-** మీరు ఆయన ద్వారా జ్ఞానమును తెలుసుకొని ఆయనను గురువు అని అన్నపుడు మీరు ఆయనకు శిష్యులే కదా!

**రాజయోగానంద :-** (ఒక్క మారుగా నవ్వి) భూమిమీద మనుషులకు గురువు ఉండవచ్చును. కానీ గురువుకు శిష్యులుండరు. ఎందుకనగా ఇతను గురువు అని ఎవరూ నిరూపించలేరు.

**రాఘవ :-** నేను ఇలా అడుగుచున్నందుకు క్షమించండి స్వామీ! నేను వినయముగా అడుగు ప్రశ్న ఏమనగా! మీరు ఇంతకు ముందే ఒకమాట

చెప్పారు. నాకు ఇంతవరకు తెలియని జ్ఞానము ఇప్పుడు తెలిసింది. అందువలన మీకు చెప్పుచున్నాను అన్నారు. మీ గురువు మీకు కనిపించి చెప్పాడా? కనిపించకుండా చెప్పాడా?

**రాజయోగానంద :-** కనిపించి చెప్పివుంటే అతనిని మీకు కూడా చూపేవాడిని, కనిపించకుండా చెప్పాడు కాబట్టి మీకు ఈయనే గురువని చెప్పలేను.

**రాఘవ :-** గురువు ప్రస్తుత కాలములో భూమిమీద ఉన్నాడా? భూమి మీద లేడా?

**రాజయోగానంద :-** గురువు కొంతకాలము భూమిమీద ఉంటాడు, కొంత కాలము భూమిమీద ఉండడను మాట వాస్తవమే. అయినా ప్రస్తుతము భూమిమీదనే ఉన్నాడు.

**రాఘవ :-** మరొక్క మాట అడుగుదునా? వద్దా?

**రాజయోగానంద :-** ఒక్కమాట కాదు వేయి మాటలు అడిగినా సమాధానము చెప్పగలను. భయము లేకుండా, సంశయించక అడుగువాడే తొందరగా జ్ఞాని కాగలడు. ప్రశ్నించనివాడు జ్ఞాని అగుటకు చాలాకాలము పట్టును. అందువలన నీవు అడుగు.

**రాఘవ :-** ప్రస్తుతము భూమిమీద కనిపిస్తూ ఇక్కడేవున్న ఈ మహర్షిగారినే మీ గురువుగా మేము గుర్తించగలుగుచున్నాము. మీరు కాదనగలరా?

(అక్కడేనున్న మహర్షి ఆ మాటకు నవ్వుకొన్నాడు.)

**రాజయోగానంద :-** నేను కొద్దిసేపు ముందే చెప్పాను. నాకు ఇప్పుడే జ్ఞానము తెలిసింది అని అన్నాను. వెంటనే మీకు చెప్పుచున్నాను అని

కూడా అన్నాను. నా గురువు నా శరీరములోపల తెలియజేసిన జ్ఞానమునే చెప్పాను. బయట విని చెప్పలేదు కదా! నాకు ఇప్పుడే తెలిసిన జ్ఞానము ఇక్కడున్న ఈయన నాకు ఏమాత్రము చెప్పలేదు కదా! అలా చెప్పివుంటే వెంటనే ఈయన ఎవరికీ తెలియని విషయమును చెప్పాడు కాబట్టి ఇతనే నా గురువని మీకు అప్పుడే చెప్పేవాడిని కదా!

(రాఘవ ఎంత తెలివిగా సత్యశోధన చేయాలనుకొన్నా రాజయోగా నంద స్వామి జవాబులు సత్యశోధనకు అందకుండా సత్యము తెలియకుండా చేయుచున్నవి. చివరకు రాఘవ వద్ద ప్రశ్నలు లేకుండా పోయాయి. చివరికి ఒకే ఒక ప్రశ్న అడిగాడు.)

**రాఘవ :-** స్వామీ మేము గురువును ఎలా తెలియగలము.

**రాజయోగానంద :-** అలా అడిగావు మంచిది. సంపూర్ణ జ్ఞానము తెలిసి కర్మను లేకుండా చేసుకొన్ననాడు గురువును గుర్తించగలవు. అంతవరకు దేవుడు అంటే దేవులాడబడేవాడన్నట్లు, గురువు అంటే గుర్తింపబడనివాడని అనవచ్చును.

(అంతటితో రాఘవ తన ప్రశ్నలను ఆపివేశాడు. ప్రక్కనే ఈశ్వర్ ఆరోగ్యము బాగలేకుండడమును చూచిన రాజయోగానంద స్వామి జమీందారు వైపు చూచి మహర్షికి తమ బాధను చెప్పుకోమన్నట్లు సైగ చేశాడు. అప్పుడు జమీందారు రావుబహదూర్ అక్కడేనున్న మహర్షి పాదాల మీద పడి తన కుమారున్ని గురించి చెప్పను మొదలుపెట్టాడు.)

**జమీందారు :-** స్వామీ! ఇతను నాకు కన్న కొడుకు కాకున్నా, పెంచుకొన్న కొడుకు అయినా మేము ఇతని పరిస్థితి చూచి తట్టుకోలేక పోవుచున్నాము. ఈ తెల్లవారుజామునుండి అపస్మారక స్థితిలో ఉండిపోయాడు. ఇంతకు

ముందు మమ్ములను ఎందరో మోసపుచ్చారు. అన్ని సమయములలో రాజయోగానంద స్వామియే మమ్ములను కాపాడాడు. ఈ అబ్బాయి ఈశ్వర్ అష్టగ్రహకూటమి రోజున పుట్టుట వలన ఇతని వలన ఏదో సాధించాలని చాలామంది చాలా ప్రయత్నములు చేసినా మాకు కష్టము రాకుండా రాజయోగానందస్వామి చేశాడు. ఇంతవరకు ఇట్లు అనారోగ్యముగా ఎప్పుడూ పడిపోలేదు. ఇలా ఉండడము వలన నాకు చాలా భయముగా ఉంది. రాజయోగానంద స్వామి, ఈశ్వర్ విషయములో ఏమీ చేయలేను ఇతనికి మరణము కూడ సంభవించవచ్చును అని తెలిపాడు. ఇప్పుడు మాకు మీరే దిక్కు.

**మహర్షి :-** మీకు రాజయోగానంద స్వామి చెప్పినది వాస్తవమే. ఇతనికి పదహారవ సంవత్సరము పూర్తి జరుగులోపల మరణించు ప్రమాదము కలదు. దానిని ఎవరూ తప్పించలేరు.

**జమీందారు :-** మీరు సమస్తము తెలిసినవారు మీరు ఇతనిని కాపాడి మమ్ములను ఉద్ధరించమని కోరుచున్నాము.

**మహర్షి :-** మీ ఈశ్వర్‌ను కాపాడుటకు రాజయోగానంద స్వామియే సమర్థుడు. ఆయననే అడగండి.

**రాజయోగానంద :-** మహాత్మా నిజము చెప్పాలంటే మీ ముందర మేము సూర్యుని ప్రకాశము ముందర మిణుగురు పురుగులాంటి వారము. అతని కర్మను మార్చువారు భూమిమీద మీరు తప్ప ఎవరూ లేరు. అతని మరణము జాతకములోనే నిర్ణయింపబడి ఉన్నది. నిర్ణయింపబడిన కర్మను మార్చుటకు నాలాంటి వారు వేయిమంది గుమికూడినా కాని పనియే. ఇతని నుదుటి వ్రాతను తుడిపి తిరుగు వ్రాతను వ్రాయగల శక్తి మీకు ఒక్కరికే గలదు. ఏమి చేసినా మీరే చేయాలి.

(ఆ మాటలువిన్న రాఘవకు ఆ మహర్షియే గురువై ఉండవచ్చు నేమో అన్న అనుమానము వచ్చింది. ఎందుకనగా నుదుటి వ్రాతను తుడిచి వేసి క్రొత్త వ్రాత వ్రాయగల స్థోమత ఒక్కగురువుకే ఉండునని స్వయాన రాజయోగానంద స్వామియే ఒకప్పుడు చెప్పగా విన్నాడు. అందువలన ఆ మహర్షిని గురువు అని అనుకోవడానికి ఆధారము దొరికినట్లయినది. అప్పుడు మహర్షి ఇలా అన్నాడు.)

**మహర్షి :-** జమీందారుగారూ! రాజయోగానందస్వామి నా మీద గౌరవ భావముతో అలా అంటున్నాడు. ఆయనకంటే అన్ని రంగములలో ఎన్నో రెట్లు చిన్నవాడిని, ఆయనతో కాని పని నాచేత అవుతుందనడము హాస్యాస్పద మౌతుంది. నాకు తెలిసిన ఉపాయమును ఒక దానిని చెప్పగలను. దాని ప్రకారము ప్రయత్నము చేసి చూడండి.

**రాజయోగానంద :-** అన్ని రంగాలలో అనకూడదు కానీ కొన్ని రంగములలో ఆయనకంటే నేను గొప్పవాడినే అయితే ఏమి ప్రయోజనము? ఆయన దేనిలో గొప్పవాడో దానిలో నేను చాలాచిన్నవాడిని. అందువలన ఆయన చెప్పు ఉపాయమునే శ్రద్ధగా విని అనుసరించు.

**జమీందారు :-** మీరు ఎలా చెప్పితే అలా నేను చేయగలను. నేను ఏమి చేయాలో చెప్పండి స్వామి.

**మహర్షి :-** నీవు ఈ అబ్బాయిని ఇంటికి తీసుకొనిపో. తర్వాత ఆలోచిస్తాను.

(ఆ మాట విన్న జమీందారుకు మహర్షి మాట సందిగ్ధములో పడ వేసింది. ఈశ్వర్ చావు బ్రతుకుల మధ్య ఉన్నాడు. అటువంటి వానికి తోచిన వైద్యమును చేసి అపస్మాకర స్థితి నుండి బయటపడునట్లు చేయకుండా ఇంటికి తీసుకపొమ్మనడము రుచించలేదు. చేయునది లేక ఈశ్వర్ మీద అక్కడున్న వారు శ్రద్ధను చూపడము లేదని అనుకొన్న

జమీందారు ఈశ్వర్‌ను ఇంటికి తీసుపోయే ప్రయత్నములో ఉండెను. అంతలో దురదృష్టవశాత్తు ఈశ్వర్ శరీరములో శ్వాస నిలిచిపోయింది. అతని శరీరములో కదలిక శక్తి ఆగిపోయింది. దానిని గమనించిన జమీందారు రావుబహదూర్ భోరున విలపించాడు. ఈశ్వర్ ఇకలేడనీ, ఎవరి సహాయముతో పని లేకుండా పోయాడనీ, ఎంతగానో తాను బ్రతిమ లాడినప్పటికీ ఏమాత్రము పట్టించుకోకుండా తమ విషయములు మాట్లాడు కొనుచు కాలమును వృథా చేసి ఇంటికి తీసుకొని పో, తర్వాత ఆలోచిస్తా మనడము తనకు నచ్చలేదనీ, ఇప్పుడు చనిపోయిన తర్వాత ఏమి చేస్తారని జమీందారు నిలదీసి అడిగాడు. అప్పుడు రాజయోగానందస్వామి జమీందారుతో ఇలా అన్నాడు.)

**రాజయోగానంద :-** రావుబహదూర్ గారు. నేను కొద్ది నిమిషముల ముందరే చెప్పాను. ఇతని జాతకములో కర్మనిర్ణయము ప్రకారము మరణము తప్పదని చెప్పడము మీరు వినలేదా! ఆ కర్మను మార్చుటకు నాలాంటి వారు వేయి మంది ప్రయత్నించినా జరగని పని అనికూడా చెప్పాను. ఈ మహర్షియే ఏమి చేసినా చేయగలడనీ, ఆయన చెప్పినట్లు వినమని చెప్పాను. నీవు మీరు ఎలా చెప్పితే అలా చేస్తానని చెప్పావు. మహర్షి నీకు ఈశ్వర్‌ను ఇంటికి తీసుకొనిపో. తర్వాత ఆలోచిస్తానన్నాడు. ఆ మాట విన్న వెంటనే అంతవరకు నీకు మా మీద నీకున్న విశ్వాసము లేకుండా పోయింది. మేము నీ విషయములో శ్రద్ధ తీసుకోలేదనీ, అశ్రద్ధగా మాట్లాడుచున్నామని అనుకొన్నావు. నీవు మా మీద విశ్వాసము లేకుండా మనస్సులో అలా అనుకోవడము వలననే ఇప్పుడిలా నీ కొడుకు ఈశ్వర్ మరణించడము జరిగింది. ఇప్పటికైనా నీ తప్పును నీవు తెలుసుకోక చనిపోయిన తర్వాత ఏమి చేస్తారని గౌరవము లేకుండా ప్రశ్నించుచున్నావు. మీలాంటి

అజ్ఞానులకు మంచి చేయాలనుకోవడమే పొరపాటని మేము అనుకొనునట్లు చేశావు. నేను నిన్ను ఒక ప్రశ్నను అడుగుతాను జవాబు చెప్పగలవా? ఈశ్వర్ మీద మాకున్న శ్రద్ధ నీకు కలదా? ఈశ్వర్ విషయములో నీవు చేయలేని పనులను ఎన్నో చేశాము. మా జోక్యము లేకపోతే నీ కొడుకు ఎప్పుడో చనిపోయేవాడు. ఆ రోజు మాంత్రికులు ఈశ్వర్‌కు నీ చేతనే బొట్టును పెట్టించగా, నేను కూడా ఏమీ చేయలేని పరిస్థితిలో ఉండిపోగా ఊరంతా కరెంటు పోకున్నా, చివరకు మీ ఇంటిలో కరెంటు ఉండినా ఒక్క ఈశ్వర్ రూములోనే కరెంటు లేకుండా పోవడమునకు కారణము ఎవరో తెలుసా? ఇపుడు ఇక్కడున్న ఈ మహర్షియే కారణము. నిన్ను నీ కుటుంబమును వెంటాడుచున్న తపస్విబాబాను, మునెప్పను భూమిమీద లేకుండా చేసినది ఎవరో తెలుసా? దానికి కారణము ఈయనే. ఇలా నీకు తెలియని ఎన్నో జరుగుటకు, చివరకు ఈ దక్షిణ దేశములో ఉన్న మనుషు లందరూ ఈ రోజు జరుగు వైపరీత్యమునకు చనిపోకుండా మిగిలివుండుటకు ఈయనే కారణము. ఈ దినము మాకు కూడా చావు తప్పదని ఎంతో భయపడిపోయాము. చివరకు మమ్ములను ప్రాణాలతో నిలిపిన వ్యక్తి ఈయన. మనందరి శ్రేయస్సు కోసము భూమిమీదలేని వ్యక్తి భూమీమీదకు వచ్చాడు. భూమిమీద కనిపించనివాడు మన ఎదురుగా కనిపిస్తే, ఆయనను హేళన భావముతో మాట్లాడడము నీ తెలివి తక్కువతనము మరియు నీ అజ్ఞానము. ఇప్పటికైనా మించి పోయిందిలేదు. ఆయనకు నమస్కరించి క్షమాపణ చెప్పుకో!

**జమీందారు :-** స్వామీ నేను పూర్తి అజ్ఞానినే. తెలియని ఆవేశములో కొడుకు చనిపోయాడను బాధతో అలా మాట్లాడాను. నా పరిస్థితి అర్థము

చేసుకొని నన్ను మీరు క్షమించండి. నన్ను మీ కోపమునకు గురి కాకుండా చూడండి.

**మహర్షి :-** నీవు మాట్లాడినందుకు మాకు ఏమీ కోపములేదు. ఎందుకనగా నీ స్థానములో ఎవరున్నా అలాగే మాట్లాడగలరు. మీరు ఎట్లు చెప్పితే అట్లు చేస్తానని చెప్పిన వానివి. నేను చెప్పినట్లు చేయకుండా నీవు మాట్లాడడము నిజముగా నీ పొరపాటే కదా! అంతకూ నేను చెప్పినట్లు వింటానని ఎంతో భక్తిగా చెప్పావు కదా! తర్వాత నేను చెప్పినట్లు ఎందుకు చేయలేకపోయావు?

**జమీందారు :-** స్వామీ! మీరు ఎలా చెప్పితే అలా చేస్తాను. ఇప్పుడు నేను ఏమి చేయాలి?

**మహర్షి :-** అయితే నీవు వెంటనే ఈశ్వర్‌ను తీసుకొని పోయి, ఇతని మరణవార్తను అందరికి తెలియజేసి, తర్వాత నీవు చేయవలసిన కార్యములు చేసుకో. ఇప్పుడు దాదాపు ఎనిమిది గంటలవుచున్నది. ఇక్కడినుండి నీవు ఇంటికి పోవుటకు అర్ధగంటకంటే ఎక్కువ సమయమగును. ఎటు తిరిగి ఇంటికి తొమ్మిది గంటలకు పోగలవు. ఈ రోజు సంధ్యవేళ రాకముందే సాయంకాలము ఐదు గంటలకే ఇతనిని స్మశానానికి తీసుకొని పోండి...

(జమీందారు పైకి భక్తిగా మాట్లాడినా, లోపల మాత్రము మీరు చెప్పినా చెప్పకున్నా మేము చేసేది ఆ పనేలే అనుకొని, అక్కడినుండి ఈశ్వర్‌ను తన కారులో తీసుకొని పోయెను. ఇదంతా ప్రక్కనుండి గమనిస్తున్న రాఘవకు ఏమీ అర్థముకాలేదు. కొన్ని రంగములలో మహర్షి కంటే తానే పెద్దనని చెప్పుచున్న రాజయోగానంద స్వామి, చివరకు తమను చావకుండా రక్షించినవాడు ఈయనే అని మహర్షిని గురించి జమీందారుకు

చాలా గొప్పగా చెప్పాడు. అంతేకాక జమీందారు ఇంటిలో ఈశ్వర్ గదిలో కరెంటు పోయిన విషయమును చెప్పుచూ, దానికి కారణము మహర్షియేనని గొప్పగా చెప్పాడు. చివరకు జమీందారును ఏడిపించి, మేము చెప్పినట్లు వినక పోవడము నీదే తప్పు అని చెప్పిపంపారు. ఈశ్వర్ చనిపోయినా ఏమీ పట్టనట్లు మామాట వినడమే నీ కర్తవ్యము. సాయంకాలము ఐదు గంటల లోపే స్మశానానికి తీసుకు పొమ్మన్నాడు. ఇందులో వీరి మాట వినడమేముంది? ఆయన చేసేది అదేకదా! రాజయోగానందస్వామి జ్ఞానములో ఎంతో ఉన్నతమైనవారు, గుహలోని మహర్షి సర్వము తెలిసిన మహాత్ముడు. ఇంత గొప్పవారు జమీందారును అలా పంపడము చూచేదానికి కొంత విడ్డూరముగా కనిపించినా, ఇందులో నాకు అర్థముకాని ఏదో తతంగము ఉంటుంది. **పైకి కనిపించునది మానవున్ని వక్రమార్గము పట్టిస్తుందని రాజయోగానంద స్వామి చెప్పగా విన్నాను. కాబట్టి కనిపించు దానిని వదలి కనిపించనిది ఏమైనా ఉందేమో వేచి చూస్తామని రాఘవ అనుకొన్నాడు.**

జమీందారు రావుబహదూర్ ఈశ్వర్ శరీరమును చెన్నపట్నముకు తీసుకొని వచ్చి, ఈశ్వర్ చనిపోయిన వార్తను తన బంధువులకూ, మిత్రులకూ తెలిపాడు. ఈశ్వర్ మరణవార్త చెన్నపట్నము ప్రజలందరికి తెలిసింది. ఆ ఊరి ప్రజలలో ఉన్నతమైన గౌరవమును, అపారమైన ప్రేమను సంపాదించుకొన్న ఈశ్వర్ చనిపోయాడన్న వార్తను చెన్నపట్నము యొక్క ప్రజలు జీర్ణించుకోలేకపోయారు. రావుబహదూర్ ఇంటి దగ్గరకు వేలాది ప్రజలు వచ్చారు. ఈశ్వర్ విషయమును విన్న వెంటనే ఎవరికీ ఆకలి కూడా కాకుండా పోయింది. కొన్ని వేలమంది ప్రజలు జమీందారు ఇంటి ముందరకు రావడముతో అక్కడ తొక్కిసలాట జరుగకుండా పోలీసు బందోబస్తు కూడా

చేయబడింది. అక్కడికి వచ్చినవారు యువకుడైన ఈశ్వర్ చనిపోవడము వలన దిగులుతో వారివారి ఇంటికి పోకుండా అందరూ జమీందారు ఇంటి దగ్గరే ఉండిపోయారు. ఈశ్వర్‌ను గురించి అతని గొప్పతనము గురించి మాట్లాడని వారేలేరు. అటువంటి యువకుడైన ఈశ్వర్ చనిపోయినందుకు దేవునివద్ద న్యాయములేదనీ, మంచివారిని తొందరగా తీసుకపోతాడనీ, దేవున్ని నిందించడము మొదలు పెట్టారు. అంతలో సాయంకాలము నాలుగు గంటలైనది. ఈశ్వర్‌ను భారీ ఊరేగింపుతో స్మశానానికి తీసుకొని పోవుటకు మేళతాలాలు కూడా వచ్చాయి.

సాయంకాలము నాలుగున్నర గంటలకు రాజయోగానంద స్వామి, భూగర్భమునుండి బయటికి వచ్చిన మహర్షి, రాఘవ, రాఘవ భార్యలు మిగతా ఆశ్రమవాసులు అందరూ జమీందారు ఇంటివద్దకు వచ్చారు. స్వామి, మహర్షి తమ ఇంటివద్దకు రావడము జమీందారుకు ఊహించని విషయమైనది. అలా వారు రావడముతో అంతవరకు బాధగానున్న రావుబహదూర్‌కు తెలియని సంతోషమైనది. స్వామిని, మహర్షిని ఆహ్వానించి వారు కూర్చొనుటకు కొంత ఎత్తయిన ప్రాంతములో ఏర్పాటు చేశారు. అప్పుడు అక్కడున్న ప్రజలను చూచి రాజయోగానంద స్వామి ఏదో చెప్పుటకు ప్రయత్నించగా, వెంటనే ఆయన మాట్లాడుటకు మైకును ఏర్పాటు చేశారు. అప్పుడు మైకులో రాజయోగానంద స్వామి ఇలా చెప్పాడు. అప్పుడు అక్కడ గుమికూడిన కొన్ని వేలమంది ప్రజలు స్వామి ఏమి చెప్పునో అని శ్రద్ధగా వినవలెనని తమకు తాముగా నిశ్శబ్ధముగా ఉండిపోయారు.)

**రాజయోగానంద :-** ఈశ్వర్‌కు జరిగిన ఘటన చాలా ముఖ్యమైనది. అందువలన అతనిని గురించి చెప్పు విషయము ఇంకా ముఖ్యమైనది. కాబట్టి మీరందరూ మా మాటలను జాగ్రత్తగా వినవలెనని కోరుచున్నాను.

ఇక్కడికి ఎన్నో వేలమంది ఈశ్వర్ మరణవార్త విని వచ్చారు. ఇంతమందిని చూచిన తర్వాత ప్రజల హృదయాలలో ఈశ్వర్ ఎంతగా ఉండిపోయాడో మాకు బాగా అర్థమగుచున్నది. ఇంతగా ఈశ్వర్‌ను ప్రేమించు మీకు ఈశ్వర్ యొక్క పూర్తి చరిత్ర తెలిసివుండకపోవచ్చు. అటువంటి మీ అందరికి చెప్పునదేమనగా! ఈశ్వర్ పుట్టుక చాలా ప్రత్యేకమైనది. అతను ఇప్పటికి పదహారు సంవత్సరముల క్రితము జరిగిన అష్టగ్రహ కూటమి సమయమున పుట్టిన తొలిబిడ్డ. అలా ఆ సమయములో మొదట పుట్టడము వలన అతనిలో కొన్ని ప్రత్యేకతలు ఏర్పడినాయి. అతనికున్న ప్రత్యేకశక్తుల వలన కొందరు రోగములనుండి బయటపడినారనీ, కొందరిలో దయ్యములు పారి పోయాయనీ, కొందరికి కొన్ని విపత్తులు తొలగిపోయాయనీ విన్నాము. అన్నిటికంటే ముఖ్యము. అతని జీవితములో పదహారవ సంవత్సరము. పదహారవ సంవత్సరము మొదలైనప్పటినుండి ఈశ్వర్‌కు కొన్ని కష్టాలు ఎదురైనాయి. అతనికి పదహారవ సంవత్సరములో ప్రతి అమావాస్యకు ఒక భయంకరమైన లోక వినాశకర శక్తి అతనిలో చేరిపోవుచుండును. ఆ విధముగా ఆరు నెలలలో ఆరు అమావాస్యల దినములలో భయంకరమైన శక్తులు ఆరు చేరిపోయినవి. ఆ విధముగా అతనిలో చేరిపోవునని ఈశ్వర్ జాతకములోనే ఉన్నదనీ, అతని పుట్టుకే అటువంటిదనీ, ఈ లోకములో ముగ్గురు వ్యక్తులకే తెలుసు. ఆ ముగ్గురిలో నేను ఒక్కడిని, రెండవవారు నా ప్రక్కన ఉన్న మహర్షి, మూడవ వ్యక్తి తపస్విబాబాగారు.

తపస్విబాబాగారు ఎంతో ధనికుడు, కొన్ని వేలకోట్ల రూపాయలు అతనివద్దకలవు. అయినా అతనిలోని **ఆశ** అను గుణము వలన ఇంకా ఏదో కావాలని, దేశమునకే అధిపతిని కావాలని అనుకొన్నాడు. అలా

దేశమునకే అధిపతి అగుటకు, దేశములోని ఆస్తులు, ధనము, బంగారు అన్నీ తనకు కావాలనుకొన్నాడు. అలా అన్నీ అతనికి కావాలంటే దేశములో మనుషులందరూ లేకుండా పోవాలి. దేశములో అందరూ ఒక్కమారు చనిపోతే అందరి ఆస్తులు అతనికే వచ్చునని అతని ఊహ. అలా అందరినీ చంపుటకు ఈశ్వర్‌లోని శక్తుల చేతనవుతుందని బాబాగారికి తెలుసు. అందువలన అమవాస్య రోజులలో చేరు శక్తులను తన వశము చేసుకోవాలని అనుకొన్నాడు. దానికొరకు ప్రతి అమావాస్య రోజున ఈశ్వర్‌ను అనారోగ్యము పాలు చేసి శక్తులను తన వశము చేసుకోవాలని తీవ్రముగా ప్రయత్నము చేశాడు. నాకు ఆయన ప్రయత్నములన్నీ ఎప్పటి కప్పుడు తెలిసిపోయేవి. అందువలన అతని ప్రయత్నమును ప్రతి నెల నెరవేరకుండునట్లు చేసేడి వాడిని. అతని ప్రతి పని తెలిసి అడ్డుకుంటున్నానని అతనికి తెలియదు. చివరి ఆరవ అమావాస్య రోజున తపస్విబాబా చాలా తెలివిని ఉపయోగించి మమ్ములనూ, జమీందారు రావుబహదూర్‌నూ మభ్యపరచి, మా మీద మత్తు మందును సాంబ్రాణిపొగగా వహీద్‌తో ప్రయోగించి మమ్ములను నిద్రమత్తు లోనికి పంపి, ఆరవ అమావాస్య దినమున ఈశ్వర్ లోనికి వచ్చిన శక్తిని వశపరచుకొని పోయాడు. ఆ ఒక్క శక్తిని ఈ దినము పున్నమి రోజు ఉపయోగించి దక్షిణదేశములోని ఆరు రాష్ట్రములను అతలాకుతలము చేసి జీవరాసులనన్నిటినీ చనిపోవునట్లు చేయాలనుకొన్నాడు. వంద సుడి మేఘములను సృష్ఠించి వాటిద్వారా దక్షిణ దేశములో ప్రళయమును సృష్ఠించాలనుకొన్నాడు. అంతపెద్ద మారణహోమము జరుగుతుందని నిన్నటి రోజు సాయంత్రము వరకు మాకు కూడా తెలియదు. వచ్చే అమావాస్యకు తను వశపరుచుకొన్నశక్తిని ఉపయోగిస్తాడని అనుకున్నాము

కానీ ముందే పౌర్ణమి రోజే అలా చేస్తాడని మేము కూడా ఊహించలేదు. అమావాస్యకైతే కొంత వ్యవధి ఉండుట వలన ఆ మారణహోమమును గురించి కొందరికైనా తెలియజేసి, మేము మా ప్రాణములను రక్షించుకొనుటకు ఉత్తర దేశమునకు పోవాలని అనుకొనివుంటిమి. కానీ ఉన్నట్లుండి తెల్లవారితే పౌర్ణమి అని, పౌర్ణమికే ఆ శక్తిని ప్రయోగిస్తున్నాడని తెలిసి మేము అప్పుడు ఎక్కడకూ పోలేమని అనుకొన్నాము. వచ్చే ఆపద తెలియని మీరూ, వచ్చే ఆపద తెలిసినా ఎటూ పోలేని మేమూ, ఈ దినము తప్పక చనిపోతామని భయపడిపోయాము. మా ప్రాణములను రక్షించుకొను ఉపాయమే మాకు తెలియకుండా పోయింది. చివరకు దేవుడే దిక్కని అనుకొన్నాము. అప్పుడు మేము ఊహించని పరిణామము జరిగింది. దేవుడు మా ప్రార్థన ఆలకించాడు అన్నట్లు ఈ దినము ఉదయము ఐదు గంటలకు తపస్వీబాబా చనిపోయినట్లు వార్త తెలిసి సంతోషపడిపోయాము. బాబా ఈ దినము ఉదయమే చనిపోకపోయివుంటే, ఈ వేళకు మనమంతా చనిపోయి ఉండేవారము. ఈ పాటికి ఇల్లువాకిళ్ళు అందరివీ నేలమట్టమై ఉండేవి. ఎంతో పెద్ద ప్రళయము సంభవించేది. అదంతా జరుగకుండా పోవుటకు కారణము ఒకే ఒకవ్యక్తి కలడు. మమ్ములను, మిమ్ములను రక్షించిన ఆయనకు చేతులెత్తి నమస్కరిస్తున్నాను. తపస్వి బాబా తెల్లవారు జామున ఐదుగంటలకే పాముకాటుతో చనిపోయాడు. ఆ పాము కూడ ఇక్కడే మావద్దేవుంది. తపస్వీబాబా ప్రేరేపించిన శక్తిని సమయానికి వచ్చి ఆపి, దానిని లేకుండా చేసి బాబాను చనిపోవునట్లు చేసిన వ్యక్తి ఎవరో కాదు, ఇక్కడ మా ప్రక్కనే సర్వసాధారణముగా కనిపిస్తున్న ఈ మహర్షియే! ఈ రోజు ఈయనే మనందరికి ప్రాణదాత!

ముఖ్యమైన విషయమేమనగా! ఈశ్వర్ శరీరములో ఆరవ అమావాస్య దినమున ప్రవేశించిన శక్తిని బాబా వశము చేసుకొని పోగా, ఆ శక్తిని, తపస్విబాబాను ఒకేమారు లేకుండా చేయడము వలన దాని ప్రభావము ఈశ్వర్ మీద పడినది. తనలోని శక్తి మరియు బాబా చనిపోయిన వెంటనే ఈశ్వర్ అపస్మారక స్థితిలోనికి పోయాడు. ఈశ్వర్ పుట్టుక విషయము తెలిసిన మేము, అతని మరణ విషయమును కూడా ముందే తెలిసి ఈశ్వర్ పదహారవ సంవత్సరమే చనిపోవునని ముందే తెలిసివుంటిమి. అదే విషయమే కొన్ని నెలలముందు జమీందారు రావుబహదూర్ గారికి కూడా చెప్పడమైనది. మేము అనుకొన్నట్లే ఈ దినము ఉదయము ఈశ్వర్ చనిపోవడము జరిగినది. ఈశ్వర్ చనిపోవడము నాకు చాలా బాధను కల్గించింది. నాకే కాదు మీకు కూడా బాధకల్గినదని తెలియుచున్నది. ఒక ముఖ్యమైన విషయమేమనగా! ఈ రోజు అందరము చనిపోవలసిన వారమే. అయినా ఆ గండమును తప్పించి ఈ మహాత్ముడు మనలను కాపాడాడు. అంత గొప్ప వ్యక్తి, ఎప్పుడూ భూమి మీద కనిపించని వ్యక్తి, ఈశ్వర్ చనిపోయినప్పుడు అక్కడే ఉండగా నేనే స్వయముగా జమీందారుకు చెప్పి ఈశ్వర్‌ను కాపాడమని మహర్షిని వేడుకొమ్మన్నాను. నా మాట ప్రకారము జమీందారు ఈ మహర్షిని, ఈశ్వర్‌ను కాపాడమని ఈశ్వర్‌కు ప్రాణము పోకనే అడిగాడు. అప్పుడు మహర్షిగారు "నేను చెప్పినట్లు విను" అన్నాడు. "అలాగే వింటాను" అని జమీందారు చెప్పాడు. ఆ నిమిషమే ఈశ్వర్ ప్రాణము పోయింది. దానిని చూచిన రావుబహదూర్ చాలా బాధపడి పోయాడు. తిరిగి నేను చెప్పడముతో మహర్షిని నేనేమి చేయాలని అడిగాడు. అప్పుడు ఈ మహర్షిగారు ఈశ్వర్‌ను ఇంటికి తీసుకొనిపోయి నీ ఏర్పాట్లు నీవు చేసుకొని ఐదుగంటలకు స్మశానానికి తీసుకపొమ్మన్నాడు. ఆ మాటతో

అక్కడున్న మా అందరికి చెప్పుకోలేని బాధకల్గినది. జమీందారు ఈశ్వర్‌ను ఇక్కడికి తెచ్చాడు. ఈశ్వర్ మరణవార్త మీ అందరికి తెలిసి మీరందరూ కూడా బాధపడిపోయారు.

జమీందారు రావుబహదూర్ రోదిస్తూ ఈశ్వర్‌ను తన కారులో తెచ్చుకొన్న తర్వాత ఈ మహర్షిగారిని ఎంతగానో ప్రార్థించాను. దక్షిణ దేశమును మొత్తము ప్రాణాహాని నుండి తప్పించిన మీరు, ఈశ్వర్ బ్రతికి ఉండగా అతనిని ఎందుకు కాపాడలేకపోయారని అడిగాను. ఈశ్వర్‌కు ప్రాణమున్నపుడే జమీందారు మిమ్ములను ప్రార్థించి ఈశ్వర్‌ను కాపాడ మని అడగగా, అయితే నేను చెప్పినట్లు వినమన్నారు. అలాగే అతను వింటానన్నాడు. మీరు చెప్పినట్లు వింటానన్న తర్వాత కూడా ఈశ్వర్ ప్రాణాలు పోయాయి ఎందుకు అని అడిగాను. అప్పుడు మహర్షి నాతో ఇలా అన్నాడు. “నామాట వినమన్నాను కానీ ఈశ్వర్ ప్రాణాలను గురించి నన్ను అడగమనలేదు. ఈశ్వర్ చనిపోయాడని నామీద మీకు విశ్వాసము లేకుండా పోయింది. నా మాట మీద విశ్వాసము లేకుండా పోయిందని దానికి శిక్షగా మీరు బాధపడడమే మంచిదనుకొన్నాను. తర్వాత ఇప్పుడేమి చేయాలని చివరగా నీ ప్రోద్భలమున జమీందారు నన్ను అడిగాడు. అప్పుడు మీరు ఇంటికి తీసుకొని పోయి మీ పని మీరు చేసుకొమ్మని చెప్పాను. దానివలన సాయంకాలము ఐదు గంటల వరకు మీరు బాధపడుతారని, అలా బాధపడవలెనని, ఆ బాధ నా మాటను నమ్మని దానివలన పడిన శిక్ష అనీ, దానిని అలా అనుభవించడము వలన నా మాటను విశ్వసించని ఫలితము అంతటితో అయిపోవుననుకొన్నాను. నా మాట ఒక్కమారే వస్తుంది. వచ్చినమాట భూమి, ఆకాశము ఒక్కటైనా, సూర్యచంద్రులు తల్ల క్రిందులైనా మారదు. మీరు ఈశ్వర్ ప్రాణము పోకముందే నన్ను

ఈశ్వర్‌ను కాపాడమని అడిగారు. నేను ఏమిచేయునదీ, ఎలా చేయునదీ ఎవరికీ తెలియదు. అందువలన మీ దృష్టిలో చనిపోయిన ఈశ్వర్‌ను చూచి నన్ను శంకించారు. నా దృష్టిలో ఈశ్వర్ చనిపోలేదు. నాకు జీవాత్మ విషయము, ఆత్మ విషయము, పరమాత్మ విషయము తెలుసు. మూడు ఆత్మల విషయము మీకు తెలియదు. మీ దృష్టిలో ఈశ్వర్ చనిపోయినా అతనిని తిరిగి లేపగలను" అన్నాడు. ఆ మాటవిన్న నాకు సంతోషమైనది. అందరి ప్రాణదాత అయిన ఈ మహర్షిని నేను ఇక్కడికి తెచ్చాను. మనముందరే ఈ మహాత్ముడు ఈశ్వర్‌కు పునర్జన్మ ఇవ్వగలడని ఆశిస్తున్నాము.

(అంతలో అక్కడ అందరి ముఖములలో మార్పువచ్చింది. చనిపోయిన మనిషిని ఎలా బ్రతికించగలడు అని ఒకరి ముఖమును ఒకరు చూచుకొన్నారు. అంతలో మహర్షి అక్కడున్న ప్రజలనందరిని ఉద్దేశించి ఇలా మాట్లాడాడు.)

**మహర్షి :-** మీకు మీ శరీరములోని జ్ఞానము తెలియదు. మీకు మీ శరీరముల బయటి జ్ఞానమే తెలుసు. అందువలన శరీరము లోపల జరుగు మరణ విషయము మీకు తెలియదు. మరణములు మూడు రకములున్నవి. మూడు రకములలో ఇప్పుడు ఈశ్వర్ మరణము కూడా ఒక రకము. మనిషి శరీరములో శ్వాస లేకుండా నిలచిపోతే మీరు మనిషిని మరణించాడని అనుకుంటారు. కానీ శ్వాస లేకుండా బయటికి పోయిందా, లోపలికి పోయిందా అని ఎవరూ యోచించడములేదు. ఆ ధ్యాస ఎవరి బుద్ధికీ రాదు. దానిని గురించి వివరముగా చెప్పితే, బ్రతికిన మనిషి శరీరములో ఉన్న శ్వాసను "ప్రాణము" అంటున్నాము. శిశు శరీరరములోనికి శ్వాస వచ్చినపుడు ప్రాణము వచ్చింది అనియు, శరీరమునుండి శ్వాస పోయినపుడు

ప్రాణము పోయింది అంటాము. ప్రాణము అనగా గాలి. శరీరములో పంచ ప్రాణములు గలవు. అవియే 1) వ్యాన 2) సమాన 3) ఉదాన 4) ప్రాణ 5) అపాణ అనునవి. ఈ పంచవాయువులకు నాగ, కూర్మ, కృకుర, దేవ దత్త, ధనంజయ అను ఐదు ఉప వాయువులు గలవు. ఈ పది వాయువులు శరీరములోపల నిలిచి పోయినా, శరీరము బయటికి పోయినా బయట చూచు వారికి అది మరణమే అయినా, మా దృష్ఠిలో **వాయువులు బయటికి పోతే మరణము. లోపలవుంటే తాత్కాలిక మరణము అంటాము.** ఇప్పుడు ఈశ్వర్ తాత్కాలిక మరణమును పొందాడు. అందువలన అతని శరీరములో కీళ్ళన్నియూ సులభముగా కదులుచున్నవి. దీనివలన ఈశ్వర్ శరీరములోని దశ వాయువులను తిరిగి వాటి వాటి పని చేయుటకు ఎన్నో విధానములున్నవి. అందులో ఒక విధానమును ఉపయోగించి నేను ఈశ్వర్‌ను తిరిగి బ్రతికించగలను. ఇప్పుడు ఇది మీకు విచిత్రముగా కనిపించినా, నా లెక్కలో కేవలము వైద్యము మాత్రమే.

ఈశ్వర్ శరీరములోని పది వాయువులను తిరిగి పని చేయించుటకు పది వజ్రములు కడిగిన నీటిని అతని ముఖము మీద, తల మీద వేగముగా చల్లితే వజ్ర స్పర్శతోవున్న నీటి వలన వాయువులు తిరిగి పని చేయును. భువనేశ్వరి దేవాలయములో చాలా సంవత్సరముల క్రితము దోపిడీ చేయబడిన పది వజ్రములు నావద్ద ఉన్నవి. వాటిని దొంగల వద్దనుండి రక్షించి కొంత కాలముగా వీటిని నావద్దే ఉంచుకొన్నాను. ఈ పది వజ్రము లతో పని అయిపోయిన తర్వాత, ఈ పది వజ్రములతో ఒక జీవిని బ్రతికించిన తర్వాత వీటిని తిరిగి భువనేశ్వరి దేవాలయములో అర్పించ వలెననుకొని నావద్ద ఉంచుకోవడము జరిగినది. ఇప్పుడు ఆ పని ఈ వజ్రముల ద్వారా నెరవేరుచున్నది.

(అని మహర్షి తనవద్దనున్న పది వజ్రములను బయటికి తీసి అందరికి చూపి వాటిని ఒక చెంబులోనికి వేసి అందులో నీళ్ళు పోసి బాగా అల్లాడించి ఆ నీటిని అందరూ చూస్తుండగా చనిపోయిన ఈశ్వర్ ముఖము మీద, తలమీద చల్లి "ఈశ్వర్! ఇక నిద్రనుండి లేచి కూర్చో! నీవు పడుకొని చాలాసేపయినది" అని చేతితో తట్టి గట్టిగా పిలువగా ఈశ్వర్, నిద్రపోవు వాడు మేల్కొన్నట్లు లేచి కూర్చున్నాడు. అది చూచిన అందరూ ఆశ్చర్య పోవడమేకాక ఈశ్వర్‌వైపు చూచారు. ఈశ్వర్ అందరి వైపుచూచి జరిగిన విషయము రాఘవ ద్వారా తెలుసుకొని తనను తిరిగి బ్రతికించిన మహర్షి యొక్క పాదముల మీద పడి నమస్కరించగా, రాఘవ అందరివైపు చూచి ఈ మహర్షి అందరిలా సామాన్యమైన మనిషికాడనీ, దేవునితో సమానుడైన భగవంతుడని చెప్పి, సంతోషముతో భగవాన్ మహర్షికి జై! అన్నాడు. అక్కడున్న వారంతా భగవాన్ మహర్షికి జైజై!! అన్నారు.

## సమాప్తము

**(ఇందులోని పాత్రలూ, సంఘటనలూ కేవలము కల్పితము. ఎవరిని ఉద్దేశించి వ్రాసినవి కావు. కానీ ఇందులోని జ్ఞానమూ, వైద్యమూ, మంత్రములూ, మహత్యములూ అన్నీ వాస్తవమే.)**



**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము గాదు.**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము గాదు.**

చివరివరకు ఈ కథ ఎన్నో మలుపులు తిరుగుతూ వచ్చినది. ఇందులో ముఖ్యముగా రాజయోగానంద స్వామీ, భూగర్భములోని మహర్షీ గొప్ప వ్యక్తులుగా చిత్రీకరించబడినారు. అయితే అందులో ముఖ్యముగా గమనించవలసిన విషయమేమనగా! కొన్ని చోట్ల రాజయోగానంద స్వామి కంటే భూగర్భమునుండి బయటికి వచ్చిన మహర్షి గొప్పగా కనిపించు చున్నాడు. మరికొన్నిచోట్ల మహర్షికంటే రాజయోగానంద స్వామి గొప్పగా కనిపించుచున్నాడు. కొన్నిచోట్ల ఇద్దరూ సమానమే అన్నట్లు తెలియుచున్నది. కొన్నిచోట్ల జరిగిన సంఘటనలనుబట్టి 'ఎవరు గొప్ప?' అను ప్రశ్న వచ్చుచున్నది. అయితే గ్రంథములో ఎవరు పెద్ద, ఎవరు చిన్న అను విషయమును చివరివరకూ తేల్చి చెప్పలేదు. అలా ఎందుకు చెప్పలేదు? అని అంటే, ఈ గ్రంథములో ఎన్నో విషయములను ప్రస్తావించినా, అన్నిటి కంటే ముఖ్యముగా దైవజ్ఞానమును దృష్టిలో పెట్టుకొని, బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరించి వ్రాయడము జరిగినది. అందువలన రాజయోగా నంద స్వామినిగానీ, మహర్షినిగానీ పెద్దగా తేల్చి చెప్పలేదు. అలా చెప్పక పోవడానికి ఒక కారణము కలదు. అది ఏమనగా! మహర్షిని పెద్దగా చెప్పితే రాజయోగానందస్వామి చిన్నగా కనిపించును. అప్పుడు రాజయోగా నందస్వామిని శిష్యునిగా, మహర్షిని గురువుగా చెప్పవలసి వచ్చును. ఫలానా వాడు గురువు అనిగానీ, ఫలానావాడు శిష్యుడు అనిగానీ దైవజ్ఞానము ప్రకారము చెప్పుటకు వీలులేదు. ఒకవేళ ఇతను గురువు అనిగానీ, ఇతను శిష్యుడు అని గానీ చెప్పితే ఆ మాట దైవజ్ఞానములో ప్రశ్నార్థకమగును.

దైవజ్ఞానమంతయూ బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరించి యుండును. బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరించి గతములో మేము

**"గురువు"** అను చిన్న గ్రంథమును వ్రాయడము జరిగినది. అందులో గురువు గుర్తింపబడనివాడు అని చెప్పాము. అంతేకాక గురువుకు శిష్యులుంటారా? అని కూడా వ్రాశాము. గురువు ఎవరికీ తెలియబడ నప్పుడు ఆయనకు శిష్యులు అనేవారుండరని చెప్పాము. అక్కడ చెప్పినది శాస్త్రబద్ధమైన విషయము. అదే విధానమును అనుసరించి **"సత్యాన్వేషి కథ"** అను ఈ గ్రంథములో ఫలానావాడు గురువు అనిగానీ, ఫలానావాడు శిష్యుడు అనిగానీ తేల్చి చెప్పలేదు. ఇతను శిష్యుడు అని చెప్పితే వానికి గురువు ఇతనే అని చెప్పవలసి వచ్చును. అప్పుడు గురువును గుర్తించినట్లగును. అప్పుడది శాస్త్రవిరుద్ధమగును. బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరించి ఇతనే గురువు అని తేల్చి చెప్పుటకు వీలులేదు. అందువలన ఈ గ్రంథములో 'ఎవరు గురువు' అనునది అర్థము కాకుండా వ్రాయవలసి వచ్చినది.

భూమిమీద ఎక్కడయినా 'గురువు', 'శిష్యులు' అను పదములు వినపడుచునే ఉండును. చిన్నవయస్సులో ప్రాథమిక పాఠశాలకు పోయినప్పుడు అక్కడ అక్షరములను నేర్పు వ్యక్తిని గురువు అని చెప్పెడివారు. ఏ విద్య అయినా గురువు వలనే వస్తుందనీ, గురువు లేనిది ఏ విద్యా రాదనీ అనెడివారు. దానివలన ఒక భాషలో అక్షరములను నేర్పు టీచర్‌ను (బోధకున్ని) గురువు అని పెద్దలు చెప్పగా, బడిలోని టీచర్‌నే గురువు అని మొదట మేము నమ్మడము జరిగినది. చిన్నతనములో బడిలోని టీచర్‌నే నేను గురువుగా లెక్కించి నమస్కరించెడివాడిని. సంవత్సరమునకు ఒకమారు వచ్చు గురుపూజ దినోత్సవము రోజున ఎండు కొబ్బరి గిన్నెలు ఇచ్చి నమస్కారము చేసి వచ్చేవారము. మేము చదువుకొన్న అరవై సంవత్సరములప్పుడు ఆ విధముగా ఉండేది. ఇప్పుడు ఆ సాంప్రదాయము

బహుశా లేదనుకొంటాను. అయినా విద్య చెప్పువానిని గురువు అనడము అక్కడక్కడ ఇప్పటికీ మిగిలియున్నది. ఆ విధముగా చిన్నవయస్సులో మొదలయిన గురువు అనుమాట నాకు వయస్సు వచ్చుకొలదీ ఎన్నో ప్రశ్నలమయమయినది.

చిన్న వయస్సునుండి ప్రతి విషయమును ప్రశ్నించి తెలుసుకొను అలవాటు నాకు ఎక్కువగాయున్నది. ఒకటి ఇట్లువుంది అంటే, అది అట్లు ఎందుకువుంది? అని అడిగి దాని వివరము తెలుసుకోవాలను అభిలాష ఎక్కువగా ఉండేది. ఆ విధానమును హేతువాదము అంటారు అని నేను పెద్దవాడినయిన తర్వాత నాకు తెలిసినది. దానికి ఏ వాదమని పేరు పెట్టినా మొదటినుండీ నాలో ఉండేది అదే. చిన్నవయస్సులో గురువును పూజ్యుడుగా భావించిన నాకు కొంతయుక్త వయస్సు వచ్చుకొలది గురువు అను వ్యక్తి మీద ప్రశ్నలు రావడము మొదలుపెట్టాయి. అందులో మొదట వచ్చిన ప్రశ్న ఇలాగయున్నది. ప్రాథమిక పాఠశాలలోగానీ, ఉన్నత విద్యా పాఠశాలలోగానీ (హైస్కూల్‌లోగానీ) బోధించు టీచర్‌ను ఉపాధ్యాయుడు అనడము జరుగుచున్నది. ఉపాధ్యాయుడును విడదీసి చూస్తే ఉప+అధ్యాయుడు=ఉపాధ్యాయుడు అని కలదు. 'ఉప' అన్నప్పుడు తక్కువ వాడనేగా అర్థము. నది పెద్దదయితే దానికి గల ఉపనది చిన్నదేయగును. అలాగే అధ్యాయుడు పెద్దవాడయితే ఉపాధ్యాయుడు చిన్నవాడేయగును. అటువంటప్పుడు చిన్నవాడిని గురువు అనుటకు వీలులేదు. ఎందుకనగా గురువు అంటే అన్నిటికంటే, అందరికంటే మించినవాడనీ, అన్నీ తెలిసిన వాడనీ అర్థము. అటువంటప్పుడు చిన్నవాడు అన్నట్లు 'ఉప' అను పదమును ఎందుకు ఉపయోగించారు? అన్నదే ప్రశ్న అయినది. ముఖ్యమంత్రికంటే అధికారములో చిన్నవాడు ఉపముఖ్యమంత్రి అయినప్పుడు, రాష్ట్రపతికంటే

అధికారములో తక్కువవాడు ఉపరాష్ట్రపతి అయినప్పుడు, గురువు (అధ్యాయుడు) కంటే ఉపాధ్యాయుడు తక్కువే అని అందరికీ తెలియుట వలన ఉపాధ్యాయుడు గురువుకాదు అని స్పష్టముగా తెలియుచున్నది. దీనినిబట్టి బడిలోయున్న టీచర్లు, కాలేజీలోయున్న లెక్చరర్లు, యూనివర్సిటీలో యున్న ప్రొఫెసర్లు గురువుతో సమానము కాదని అర్థమయినది.

ఇక్కడ ఒక ప్రశ్న రాగలదు, అదేమనగా! 'విద్య నేర్పువాడు గురువు' అను నానుడి వాక్యము ప్రకారము మనకు తెలియని పాఠములు చెప్పి, తెలియని విషయములన్నీ తెలుపు టీచర్లు మొదలుకొని ప్రొఫెసర్ల వరకు, అందరూ గురువులే కదా! అను ప్రశ్న రాగలదు. ఆ ప్రశ్నకు మేము ఈ విధముగా సమాధానము చెప్పుచున్నాము. **ఒకమారు నేర్చిన విద్యను తర్వాత ఎన్నిమార్లు నేర్చినా నేర్పినవాడు గురువు కాడు. నేర్చినవాడు శిష్యుడు కాడు** అను సూత్రము ప్రకారము ఎవరూ గురువులు కాదు, ఎవరూ శిష్యులు కాదు. ఇక్కడ మరొక ప్రశ్న రాగలదు. చిన్నవయస్సులో ఏ విద్యా రాని సమయమునుండి నేర్చు విద్యలన్నీ క్రొత్త విద్యలే కదా! ఇంతకుముందు అవి తెలియని విద్యలే కదా! అటువంటప్పుడు క్రొత్తగా నేర్చుకొనువాడు శిష్యుడు, క్రొత్తగా నేర్పువాడు గురువు అగును కదాయని ఎవరయినా ప్రశ్నించవచ్చును. దానికి సమాధానము ఈ విధముగా కలదు. క్రొత్తగా నేర్చువాడు శిష్యుడు, క్రొత్తగా నేర్పువాడు గురువు అనుమాట వాస్తవమే అయినా ఏ వ్యక్తీ క్రొత్తగా ఏ విద్యనూ నేర్వలేదు. అలాగే ఏ వ్యక్తీ క్రొత్తగా ఏ విద్యనూ ఇతరులకు నేర్పలేదు. ఈ మా మాట అందరికీ క్రొత్తగా, వింతగా కనిపించినా ఇది ముమ్మటికీ సత్యము. ఈ విషయము అర్థము కావాలంటే ఉదాహరణగా ఒక సమాచారమును చూచి అందులోని సత్యా సత్యములను తెలుసుకొందాము.

మొట్టమొదటి భారతీయ అంతరిక్ష యాత్రికురాలు కల్పనాచావ్లా పేరు విననివారుండరు. భారతీయ మహిళా సాహసానికీ, మేధస్సుకూ చిహ్నముగా నిలిచిపోయిన పంజాబ్ రాష్ట్రమునకు చెందిన కల్పనాచావ్లా, అమెరికా దేశానికి చెందిన అంతరిక్ష పరిశోధనా సంస్థ NASA (నాసా) లో పని చేసేది. అంతరిక్షములోనికి ప్రయోగించిన కొలంబియా స్పేస్‌షిప్‌లో ఇతర ప్రాశ్చాత్య అంతరిక్ష యాత్రికులతోపాటు అంతరిక్ష యాత్రలో పరిశోధకురాలిగా పాల్గొని అంతరిక్షములోనికి ప్రయాణించింది. ఆకాశములోనే కొంతకాలము గడిపి పరిశోధన సాగించిన తర్వాత కొలంబియా స్పేస్‌షిప్ భూమికి తిరుగు ప్రయాణము మొదలుపెట్టింది. 2003వ సంవత్సరము ఫిబ్రవరి 1వ తేదీన ఇంకో పదహారు (16) నిమిషములలో భూమిమీద దిగబోతున్న కొలంబియా స్పేస్‌షిప్ దురదృష్ట వశాత్తూ ఊహించని పరిణామముల వలన ఆకాశములోనే భూమి వాతావరణము లోనికి ప్రవేశిస్తూనే ప్రేలిపోయింది. దానితోపాటు అందులో ప్రయాణిస్తున్న అంతరిక్ష యాత్రికులందరూ చిన్నచిన్న ముక్కలై చనిపోయారు. భారతీయ వ్యోమగామి కల్పనాచావ్లా కూడా ఆ ఘోర ప్రమాదములో ప్రాణాలు కోల్పోవడము జరిగింది. అయితే ఆమె కొద్ది రోజులకే తిరిగి భూమి మీద పుట్టడము జరిగింది.

కల్పనాచావ్లా తిరిగి పుట్టిన సమాచారమును (ఎస్.బి.యన్ 7) ఛానల్ మరియు ఇండియాటుడే పత్రిక, కల్పనాచావ్లా మళ్ళీ జన్మించిన కథనాన్ని ప్రసారము చేసి ప్రపంచానికి అందించడము జరిగింది. ఆ వివరాలను చూస్తే, ఉత్తర భారతదేశములో ఉత్తరప్రదేశ్ రాష్ట్రములోనున్న బులంద్ షహర్ అనే గ్రామములో రాజీకుమార్ అనే సాధారణ వ్యవసాయ కూలీగా పని చేయుచున్న వ్యక్తి కుటుంబములో అతనికి కల్పనా చావ్లా కుమార్తెగా

జన్మించింది. 2003వ సంవత్సరము మార్చి 23వ తేదీన ఉపాసన అను పేరుతో ఆ కుటుంబమున కల్పనాచావ్లా జన్మించడము జరిగింది. ఉపాసన (కల్పనాచావ్లా)కు నాలుగు సంవత్సరాల వయస్సులో మాటలు వచ్చాయి. మాట్లాడడమును ప్రారంభించిన ఉపాసన, తాను గతజన్మలో కల్పనాచావ్లా అను పేరుగల అంతరిక్ష పరిశోధకురాలిననీ, తన తండ్రి పేరు బనార్సీదాస్‌యనీ, నాలుగు సంవత్సరముల క్రితము తాను తోటి అంతరిక్ష పరిశోధకులతో కలిసి ఒక విమానములో ఆకాశమునుండి దిగివస్తుండగా, తమ విమానానికి ప్రమాదము జరిగి తామందరమూ చనిపోయామని చెప్పడము జరిగింది.

గత జన్మ వివరాలను పూసగ్రుచ్చినట్లు చెప్పుచున్న ఉపాసన (కల్పనా చావ్లా) యొక్క పేరు ఉత్తరప్రదేశ్ రాష్ట్రమంతా క్రమంగా తెలిసి పోయింది. ప్రస్తుతము ఉత్తరప్రదేశ్‌లోని ఎత్వా జిల్లాలోని "పఠా" అనే గ్రామములో కూలి పని చేసుకొంటున్న తండ్రి రాజ్‌కుమార్‌తో పాటు జీవిస్తున్న ఉపాసన తనను ఇంటర్వ్యూ చేయడానికి వచ్చిన ప్రపంచస్థాయి మీడియా ప్రతినిధులతో మాట్లాడుచూ మేము భూమిమీదకు తిరిగి వస్తున్న అంతరిక్షనౌకకు ఆకాశములో సంచరిస్తున్న ఒక పెద్ద మంచుగోళము గుద్దుకున్నదనీ, దానివలన తమ అంతరిక్షనౌక ప్రేలిపోయి అందులోని తామందరమూ చనిపోయామనీ చెప్పినది. 2003వ సంవత్సరము ఫిబ్రవరి 1వ తేదీన నాసాకేంద్రము వారు అంతరిక్ష నౌకకు బయటప్రక్కన చుట్టూ అమర్చిన ప్లేటు ఊడిపోయిన దానివలన ఆ నౌక భూమి వాతావరణము లోనికి వస్తూనే వాతావరణ రాపిడి వేడికి ప్రేలిపోయిందని చెప్పారు. నాసావారనుకొన్నట్లు అక్కడ జరగలేదనీ, ఆకాశములో భూమికి 70 కిలోమీటర్ల దూరములోనే మంచుగోళమునకు అంతరిక్షనౌక గుద్దుకోవడము

వలన ప్రమాదము జరిగిందని ప్రత్యక్ష సాక్షి అయిన కల్పనాచావ్లా చెప్పడము వలన తెలిసిపోయింది.

ఇక్కడ పునర్జన్మల విషయములో అంతరిక్ష పరిశోధకురాలు కల్పనా చావ్లా చనిపోయి తిరిగి పుట్టిన విషయము తెలిసినది. తెలిసిన సమాచారము ప్రకారము అమె చనిపోయినది ఫిబ్రవరి నెల ఒకటవ తేదీ 2003వ సంవత్సరము. అమె తిరిగి పుట్టినది మార్చి 23,2003. దీనిప్రకారము కల్పనాచావ్లా చనిపోయిన తర్వాత 52 రోజులకు తిరిగి పుట్టినదని తెలిసి పోయినది. అమె పుట్టిన తర్వాత చిన్న వయస్సునుండి తిరిగి చదువుకొని చదువులన్నీ, విద్యలన్నీ నేర్వవలసియున్నది. ఇప్పుడు అసలు విషయమునకు వచ్చి చూస్తే ఈ జన్మలో నేర్వవలసిన విద్యలన్నీ కల్పనాచావ్లా ముందు జన్మలోనే తెలిసియున్నది. కల్పనాచావ్లా అనబడు జీవునికి ముందు జన్మలోనే అన్ని విద్యలూ తెలిసియున్నా ఈ జన్మలో ఆ విద్యలను జ్ఞాపకము చేయు మనస్సు లేనిదానివలన తనకు తెలిసిన విషయములన్నీ తెలియవను భ్రమలో జీవుడుండి క్రొత్తగా నేర్వాలని అనుకొనుచున్నాడు. వాస్తవానికి ఇప్పుడు నేర్వవలెనని అనుకొను విద్యలన్నీ గతములోనే ప్రతి జీవుడూ నేర్చియున్నాడు. అందువలన నేర్చిన విద్యను నేర్చువాడు శిష్యుడు కాదు, నేర్పువాడు గురువు కాదని చెప్పాము. ప్రతి జీవుడు తనకు అన్ని విద్యలు తెలిసియున్నా తెలియనను భ్రమలోయున్నాడు. తాను గత జన్మలో ఫలానా పేరుతోయున్నా, ఫలానా ఊరులోయున్నా, తాను గతములో లేననీ ఇప్పుడు పుట్టినప్పటినుండే ఉన్నానని అనుకొంటున్నాడు. గతములో తాను ఇప్పుడు పుట్టిన ఊరిలోనే నివసించినా, తిరిగి అదే ఊరిలో పుట్టినప్పటికీ తాను గతములో అక్కడ లేనను భ్రమలోయున్నాడు. గడచిన గతకాలములో వంద సంవత్సరము లప్పుడు ఇదే భూమిమీద తాను నివసించినా, నేను అప్పుడు ఉంటిని అను

ధ్యాస ఎవరికీ లేదు. ప్రతి మనిషీ గతములో ద్వాపరయుగములో తాను యున్నా ఎలాగయితే నమ్మలేని స్థితిలోయున్నాడో, అలాగే గతములో తాను అన్ని విద్యలూ నేర్చియున్నా, తాను ఇప్పుడు క్రొత్తగా విద్యలు నేర్వాలను భ్రమలోయున్నాడు. గతములో నేర్చిన విద్యనే ఇప్పుడు తిరిగి నేర్చినా వాడు శిష్యుడు కాదు, నేర్పువాడు గురువు కాదు అను నానుడి వాక్యము ప్రకారము నేడు విద్యలు నేర్చు ఎవడూ శిష్యుడు కాదు, అట్లే నేర్పువాడు ఎవడూ గురువు కాదని చెప్పవచ్చును.

అయితే ఇక్కడ మరొక ప్రశ్న రాగలదు. అదేమనగా! ఈ జన్మలో నేర్వవలసిన విద్య పోయిన జన్మలోనే తెలిసియుండినట్లయితే, అది కూడా అప్పుడు నేర్చినది కాదు కదా! గడచిన జన్మలోనిది అంతకు ముందే గడచిపోయిన జన్మలో తెలిసియుండును కదా! గడచిన ఏదో ఒక జన్మలో నయినా జీవుడు విద్యను నేర్చియుండును కదా! అప్పుడయినా ఒకనికి చెప్పువాడు మరొకడు ఉండును కదా! అప్పుడు నేర్చిన వాడు శిష్యుడు, నేర్పినవాడు గురువు అగుదురు కదా! అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగా కలదు. ఇక్కడ బాగా ఆలోచించి చూస్తే మనిషి లేక జీవుడు తెలియవలసిన జ్ఞానము లేక విద్యలు రెండు విధములు గలవు. ఒకటి ప్రపంచ సంబంధమైన జ్ఞానముకాగా, రెండవది పరమాత్మ సంబంధ జ్ఞానము. మనిషికి కావలసిన ద్వివిధ జ్ఞానములను ద్వివిధ విద్యలుగా చెప్పవచ్చును. ఏ జ్ఞానమయినా నేర్వవలసి వచ్చినప్పుడు దానిని విద్య అనడము జరుగుచున్నది. **విద్య అనగా తెలియబడునదని, జ్ఞానము అనగా తెలియవలసినదని చెప్పవచ్చును.** ఎట్లు చూచినా విద్య అనునది, జ్ఞానము అనునది రెండూ ఒకే అర్థమునిచ్చుచున్నవి. ప్రపంచ విద్యలుగానీ లేక ప్రపంచ జ్ఞానముగానీ, అట్లే పరమాత్మ విద్యగానీ లేక దైవజ్ఞానముగానీ

రెండూ ఒక మనిషికి ఇతరులనుండే అందవలసియున్నది. ఇక్కడ జ్ఞానమును అందుకొనువాడు శిష్యుడు, అందించువాడు గురువు అని చెప్పినా, ఈ గురువు శిష్యుల సంబంధములో అందరికీ తెలియని రహస్యము ఒకటి గలదు. అది ఏమనగా!

ప్రపంచ విద్యలను నేర్పువాడు ఉన్నప్పటికీ అతడు ప్రత్యక్షముగా మరో వ్యక్తిగాయుండడు. ఒక మనిషికి ప్రపంచ జ్ఞానమును నేర్పువాడు ప్రత్యక్షముగా ఉండడు, కావున ప్రపంచ విద్య నేర్పినవాడు ఫలానావాడని చెప్పలేకపోవుచున్నాము. ఇతనే నాకు ప్రపంచ జ్ఞానమును నేర్పినవాడని ఎవరికీ చూపలేకపోవుచున్నాము. ఇంకొక విషయమేమంటే **పరమాత్మ జ్ఞానమును తెలుపువాడు ప్రత్యక్ష మనిషిగాయుండును.** అయితే నాకు పరమాత్మ జ్ఞానమును ఇతనే చెప్పాడని మనిషి ఒప్పుకోడు. అందువలన ఇతనే నాకు దైవజ్ఞానమును బోధించిన గురువని ఇతరులకు చూపలేడు. ప్రపంచ జ్ఞానమును బోధించినవాడు కనిపించడు, కాబట్టి ఇతరులకు చూపలేకపోవడము ఒక కారణమైతే, పరమాత్మ జ్ఞానమును బోధించిన వానిని శిష్యుడే నమ్మడు కాబట్టి ఇతరులకు చూపలేకపోవుచున్నాడు. ప్రపంచ జ్ఞానమును బోధించినవాడు గురువే అయినా అతను శిష్యునికే తెలియ బడలేదు. కాబట్టి అక్కడ ప్రపంచ విద్యను నేర్పిన గురువు లేడు, కావున ఆయనకు శిష్యుడు కూడా లేడనియే చెప్పవచ్చును. అట్లే పరమాత్మ విద్యను నేర్పినవాడు గురువే అయినప్పటికీ అక్కడ గురువు కనిపించినా శిష్యుడే గురువును ఒప్పుకోవడము లేదు. కావున ఇక్కడ కూడా ఫలానావాడు గురువు అని చెప్పలేకపోవుచున్నాడు. గురువే లేకపోయినప్పుడు శిష్యుడు కూడా లేడని చెప్పవచ్చును. ఒక విధముగా రెండు విద్యలను నేర్చిన శిష్యులు ప్రత్యక్షముగాయున్నా వారికి గురువులు ఎవరని నిర్ణయించలేక

పోవడము వలన ఫలానావాడు గురువు అనిగానీ, ఈ గురువుకు ఫలానా వాడు శిష్యుడు అనిగానీ తేల్చి చెప్పలేకపోవుచున్నాము. అందువలన **"గురువు"** అను గ్రంథములో గురువును గుర్తించలేము అని వ్రాశాము. అంతేకాక గురువుకు శిష్యులుంటారా? అని కూడా వ్రాశాము.

నేడు భూమిమీద గురు శిష్య సాంప్రదాయములున్నా, వాస్తవానికి అవి పేరుకు మాత్రమే సాంప్రదాయములుగానీ, వారిలో శిష్యుడు గురువు అని ఇద్దరు వ్యక్తులున్నా, వారు గుర్తింపుకు మాత్రము ఉందురుగానీ, వాస్తవానికి శాస్త్రబద్ధముగా గురువు లేడు, శిష్యుడూ లేడు. ఎక్కడ ఏ గురువులున్నా వారు నేర్చిన విద్యను నేర్పువారే తప్ప క్రొత్త విద్యను నేర్పు వారు కాదు. అలాగే ఎక్కడ శిష్యులున్నా వారు నేర్చిన విద్యను నేర్చువారే తప్ప క్రొత్త విద్యను నేర్చువారు కారు. అందువలన శాస్త్రబద్ధముగా అందరినీ శిష్యులని అనలేము. అట్లే అందరినీ గురువులని కూడా అనలేము. ప్రపంచ విద్యను నేర్పువాడు గురువే, అలాగే పరమాత్మ విద్యను నేర్పువాడు గురువే అయినా ఆ గురువులలో ప్రపంచ విద్యను నేర్పువాడు కనిపించని గురువని, దైవజ్ఞానమును (పరమాత్మ విద్యను) నేర్పువారు కనిపించే గురువని కూడా చెప్పాము. కనిపించని గురువును ఫలానావాడని చూపలేకపోయినా లేక చెప్పలేకపోయినా కనిపించే గురువును ఫలానావాడని చూపవచ్చును కదా! లేక చెప్పవచ్చును కదా! అయితే శిష్యుడయిన వాడు రెండు రకములా ఇద్దరు గురువులను ఎందుకు గుర్తించలేకపోవుచున్నాడని కొందరుగానీ, అందరుగానీ ప్రశ్నించ వచ్చును. ఈ ప్రశ్నకు మా జవాబు ఈ విధముగాయున్నది చూడండి. **గురువు శిష్యులు అనేది గొప్ప రహస్యమైన జ్ఞానము.** అంతపెద్ద రహస్యమును చెప్పాలంటే పెద్ద సాహసముతో కూడిన పనియగును. అందువలన నేను ముందే చెప్పునది ఏమనగా!

ఇక్కడ నాకు తెలిసింది నేను వ్రాయుచున్నాను. నేను కూడా ఇదే నిజమని తేల్చి చెప్పను. ఒకవేళ నేను చెప్పింది సత్యమని అర్థమయితే నా మాటను నమ్మండి, అర్థము కాకపోతే వదలివేయండి. అంతేగాని నేను చెప్పింది అంతా సత్యమని ఇక్కడ నేను కూడా చెప్పలేదు.

సృష్ట్యాదిలో మనిషి పుట్టిన తర్వాత ముందు పరమాత్మ జ్ఞానమే సంపూర్ణముగా చెప్పబడినది. తర్వాత ప్రపంచ జ్ఞానము అంచెలంచెలుగా చెప్పబడినది. మనిషి అవసరమునుబట్టి ఎప్పుడేది ఎంత చెప్పవలెనో అంతే ప్రపంచ జ్ఞానమును చెప్పడము జరిగినది. ఆ విధముగా ప్రపంచము పుట్టినప్పటినుండి ప్రపంచ జ్ఞానము మనుషులకు నేర్పబడుచున్నది. మనిషి ప్రపంచ జ్ఞానమును అంచెలంచెలుగా నేర్చుకుంటూ వస్తున్నాడు. ఒకమారు నేర్చిన తర్వాత తిరిగి ఒకరికొకరు చెప్పుకోవడము జరుగుచున్నది. అలా తెలుసుకొన్న ప్రపంచ జ్ఞానమునే జన్మ జన్మకు మరణములో మరచిపోతూ జీవితములో నేర్చుకోవడము జరుగుచున్నది. ప్రపంచము పుట్టినప్పటినుండి మనిషికి ప్రపంచ జ్ఞానము నేర్పబడినదని చెప్పినా, అవసరమునుబట్టి నేర్పినవాడు గురువే అయినా, నేర్చిన మనిషి ప్రత్యక్షముగా కనిపించుచున్నా నేర్పిన గురువు మాత్రము ప్రత్యక్షముగా కాకుండా పరోక్షముగావుండి చెప్పుచున్నాడు. ప్రపంచములో ఏ మనిషికి ఎంత కర్మయున్నదో ఆ కర్మనుబట్టి అతనికి ఎంత తెలియవలెనో అంతే జ్ఞానమును, వాని శరీరములో యున్న ఆత్మయే ఊహలు లేక యోచనల రూపములో వాని మెదడుకు అందించుచున్నది. ఉదాహరణకు రేడియోను మార్కోనీ అను ఇటలీ దేశస్థుని మెదడులో ఆత్మ అందించిన వివరము ఊహ రూపములో వచ్చి రేడియో వివరము తెలియబడినది. అంతవరకు ఏ మనిషికీ తెలియబడని విద్యుత్ అయస్కాంత తరంగాల ద్వారా శబ్ద తరగాంలను ఆకాశములోనికి

ప్రసారము చేయవచ్చును విషయము తెలిసింది. అప్పుడు ఆ విషయమును మొదట తెలుసుకొని తర్వాత ప్రయోగము ద్వారా నిరూపించుకొని దానిని స్వయముగా తానే కనిపెట్టానని మనిషి అనుకోవడము జరిగినది. వాస్తవానికి అంతవరకు ప్రపంచములో ఎవరికీ తెలియని విషయమును ఆత్మ మార్కోనీ అను జీవునకు తెలియజేస్తే ఆ జీవుడు ఆత్మ తెలియజేసిందనీ, ఆత్మే తనకు ఈ విషయములో గురువనీ అనుకోక తానే స్వయముగా ఆ విషయమును (రేడియోను) కనిపెట్టినట్లు ప్రకటించుకొన్నాడు. దానితో అందరూ రేడియో యొక్క విషయమును మార్కోనీయే చెప్పాడని అనుకొన్నారుగానీ, అతనిలోని ఆత్మ అతనికి గురువుగా బోధించినదని అనుకోలేదు. ఈ విధముగా సృష్ట్యాదినుండి నేటివరకు అవసరమునుబట్టి మానవుని కర్మనుబట్టి ఎప్పుడేది తెలుపవలెనో అప్పుడు దానిని గురించి ఆత్మ గురువుగాయుండి తెలియజేయుచున్నది.

మనిషి శరీరములోని ఆత్మ ప్రత్యక్షముగా కాకుండా పరోక్షముగా నేటివరకు కంప్యూటర్లు, సెల్‌ఫోన్లు తయారుచేయు విద్యలను కూడా నేర్పినది. అయినా మనిషి సెల్‌ఫోన్లను, కంప్యూటర్లను కనిపెట్టినది నేనే అని అంటున్నాడు. వాస్తవముగా అన్నిటికీ గురువు ఆత్మని ఎక్కడా చెప్పలేదు. తనకు తెలియని విషయము ఎలా తెలిసింది? అని ఏమాత్రము ఆలోచించడమూ లేదు. ప్రపంచములో గత యాభై సంవత్సరముల నుండి ఆత్మ అనేకమైన క్రొత్త విషయములను నేర్పినది. ఆత్మ నేర్పిన విషయము లను మనిషి ప్రత్యక్షముగా అనుభవించి ఆనందించుచున్నాడు. శరీరము నుండి బయటకు చూచు మనిషి తన శరీరములోయున్న ఆత్మయను గురువును చూడలేకున్నాడు. శరీరములో ఆత్మగాయున్న పరోక్ష గురువు మనిషి అడగకున్నా మనిషికి కావలసిన దూర శ్రవణమును, దూరదృష్టిని,

దూర సంభాషణను కూడా కల్పించాడు. కేవలము యాభై సంవత్సరముల నుండి మాత్రమే అందుబాటులోనికి వచ్చిన యంత్రసామాగ్రి సృష్ట్యాదినుండి కూడా లేదు. సృష్ట్యాదినుండి తెలియని ఎన్నో ప్రపంచ విద్యలు ఈ మధ్య కాలములో ఆత్మ నేర్పింది. ప్రపంచములో గణిత, ఖగోళ, రసాయన, భౌతికశాస్త్రములన్నిటినీ ఆత్మే నేర్పినది. మనిషికి ఉపయోగపడు చిన్నా పెద్దా పరిశోధనలన్నిటినీ ఆత్మే చెప్పి చేయించింది. మనిషికి తెలియని అన్ని విషయములనూ ఆత్మ నేటివరకూ నేర్పినది. భవిష్యత్తులో ఇంకా ఎన్నో నేర్వవలసిన విషయములను ఆత్మే నేర్పవలసియున్నది. మనిషికి కనిపించకుండా ఆత్మ అన్ని విషయములనూ చెప్పుచున్నా, మనిషి ఆత్మను గురువుగా గుర్తించలేక తననే గురువుగా చెప్పుకొంటున్నాడు. ఇదంతయూ ప్రపంచ జ్ఞానముపట్ల యున్న విధానముకాగా, ఇక పరమాత్మ జ్ఞాన విషయములో ఎట్లున్నదో చూస్తాము.

పరమాత్మ జ్ఞానము ప్రపంచ జ్ఞానమువలె అంచెలంచెలుగా చెప్పబడ లేదు. పరమాత్మ జ్ఞానము సృష్ట్యాదిలో ఒకేమారు చెప్పబడినది. అయితే మొదట చెప్పిన దైవజ్ఞానమును మనుషులు అర్థము చేసుకోకపోవడము వలన దేవుడు ప్రత్యక్ష గురువుగా వచ్చి తిరిగి చెప్పవలసి వచ్చినది. చెప్పిన జ్ఞానము కొంతకాలమునకు మరుగున పడిపోయి, ధర్మములు తెలియనప్పుడు, అధర్మములు చెలరేగినప్పుడు దేవుడు మనిషివలె వచ్చి, తన జ్ఞానమును మనుషులకు బోధించవలసియున్నది. అయితే ప్రత్యక్షముగా బోధించువాడు తనవలె మనిషి అయినందున, బోధించువాని బోధను చూడక కేవలము బోధించువానినే చూస్తున్నారు. అప్పుడు నాలాంటి మనిషి చెప్పు జ్ఞానము సరియైనది కాదను నిశ్చయములోనికి వచ్చుచున్నారు. అంతేకాక బోధించువాడు మనిషిరూపములోయున్న దేవుడయినా, మనిషిగాయున్న

వాని బోధలను చూడక అతనిలోని నిత్యకృత్యములను చూస్తున్నారు. అప్పుడు భావములో తక్కువ భావము ఎదుట బోధించు వానిమీద ఏర్పడుట వలన అతని బోధలను గొప్పగా తలువక, అతనిని గురువుగా భావించక, సాధారణ మనిషిగా చూడడము జరుగుచున్నది. మనిషి తాను దేవున్నని చెప్పుకొంటే మనుషులు నమ్ముచున్నారు. దేవుడు మనిషిగావచ్చి బోధిస్తే అతనిని మనిషిగా లెక్కించుచున్నారు. దేవుడు మనిషిగా రావచ్చునుగానీ, మనిషి దేవుడు కాలేడని చాలామందికి తెలియదు. అధర్మములను బోధించు మనిషిని గురువుగా నమ్ముచున్నారుగానీ, ధర్మములను బోధించు దేవున్ని గురువుగా మనుషులు గుర్తించడము లేదు. గతములో దేవుడు మనిషిగా వచ్చి తన ధర్మములను విడదీసి చెప్పినా అతనిని మనిషికంటే హీనముగా చూచారు. అందువలన ప్రపంచ జ్ఞానమును పరోక్షముగాయున్న గురువు బోధించినా ప్రజలు గుర్తించుటకు వీలులేదు. అట్లే ప్రత్యక్షముగా వచ్చి చెప్పినా గురువు ఎవరిచేతా గుర్తింపబడడు. అందువలన మేము **"సత్యాన్వేషి కథ"** లో ఎవరు గురువు, ఎవరు శిష్యుడు అని తేల్చి చెప్పలేదు. మహర్షి, రాజయోగానందస్వామి అను రెండు పాత్రలలో ఎవరు పెద్ద? అని తేల్చి చెప్పక వదలివేశాము. **గురు, శిష్యుల విషయము ఎవరికి వారు స్వయముగా తెలుసుకొను విషయము. ఒకరు చెప్పితే నమ్మే విషయముకాదు.** ప్రపంచ విషయమునకుగానీ, పరమాత్మ విషయమునకుగానీ ప్రతి విషయమునకూ గురువు ఉన్నాడు. ఆ గురువు వచ్చి "నేనే మీకు గురువును" అని చెప్పినా మనిషి వినే పరిస్థితిలో లేడు. మనిషి మతమును వీడి పథమును ఆశ్రయించినప్పుడే గురువు ఎవరో తెలియుటకు ఆస్కారము గలదు.

ఇట్లు

**ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**

# హిందూ రక్షణా! హిందూ భక్షణా!!

## భగవద్గీతయే చదవనివాడు హిందూ రక్షకుడా?

## హిందూ ధర్మమే తెలియనివారు హిందూ రక్షకులా?

హిందువులు నేడు కులాలుగా చీల్చబడి, అందులో హెచ్చుతగ్గు కులములుగా వర్ణించబడియున్నారు అనుట అందరికీ తెలిసిన సత్యమే. దేవుడు మనుషులందరినీ సమానముగా పుట్టించితే కొందరు మనుషులు తమ స్వార్థ బుద్ధితో హిందూ (ఇందూ) సమాజమును ముక్కలు ముక్కలుగా చీల్చి బలహీనపరచి హిందూసమాజమునకంతటికీ తామే గొప్పవారమనీ, తాము చెప్పినట్లే అందరూ విని అన్ని కార్యములు చేసుకోవాలనీ ప్రచారము చేసుకొన్నారు. ఎన్నో కులములుగా యున్న హిందూ సమాజములో తమ కులమే అగ్రకులమని చెప్పుకోవడమే కాకుండా, ఇతర కులముల వారందరికీ తామే మార్గదర్శకులమనీ, గురువులమనీ ప్రకటించుకొన్నారు. భవిష్యత్తులో తమకు ఎవరూ అడ్డురాకుండునట్లు, అన్ని కులములను అంటరాని కులములను చేసి, హిందూ సమాజమునకు తీరని అన్యాయము చేశారు. అంతటితో ఆగక నేటికినీ హిందూ సమాజ రక్షకులుగా చెప్పుకొనుచూ, హిందూ సమాజమును సర్వనాశనము చేయుచూ, హిందూ సమాజము ఇతర మతములుగా మారిపోవుటకు మొదటి కారకులగుచున్నారు. అటువంటివారు హిందూ సమాజమునకు చీడ పురుగులుగాయున్నా, మిగతా కులముల వారందరూ వారి నిజ స్వరూపమును తెలియక వారు చెప్పినట్లే వినుట వలన, హిందూ సమాజమును పూర్తిగా అజ్ఞాన దిశవైపుకు, అధర్మ మార్గమువైపుకు మళ్ళించి, ప్రజలకు ఏమాత్రము దైవజ్ఞానమును తెలియకుండా చేసి, తాము చెప్పునదే దైవబోధయని నమ్మించారు.

అటువంటి స్థితిలో నేడు త్రైత సిద్ధాంతకర్తగా ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారు అజ్ఞాన దిశవైపు నిలిచి పోయిన హిందూసమాజమును సరియైన దారిలో పెట్టుటకు, భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమున బోధింపబడిన క్షర, అక్షర, పురుషోత్తమ అను ముగ్గురు పురుషుల విషయమును **"త్రైతసిద్ధాంతము"** అను పేరుతో ప్రతిపాదించి దైవజ్ఞానమును అందరికీ అర్థమగులాగున గ్రంథరూపములో వ్రాయడము, బోధించడము జరుగుచున్నది. దానివలన నేడు ప్రజలు అసలైన జ్ఞానము తెలియుచున్నదని సంతోషపడుచున్నారు. అగ్రకులముగానున్న వారిలో కూడా ఎందరో తమ అజ్ఞాన చీకటులను వదలి, ఇంతవరకూ తమకు తెలియని జ్ఞానము యోగీశ్వరుల ద్వారా ఇప్పుడు తెలియుచున్నదని సంతోషపడి శిష్యులుగా చేరిపోవుచున్నారు. అయితే అగ్రకులములో కొందరు మాత్రము యోగీశ్వరులు తెలియజేయు జ్ఞాన విషయములను చూచి ఈ జ్ఞానము వలన ప్రజలు జ్ఞానములో చైతన్యులై, జ్ఞానము తెలియని తమను గౌరవించరని భావించి, దానివలన సమాజము మీద తమ ఆధిపత్యము లేకుండా పోవునని తలచి, యోగీశ్వరులు తెలుపుచున్న త్రైత సిద్ధాంతము గానీ, త్రైతసిద్ధాంత భగవద్గీతగానీ హిందువుల జ్ఞానమేకాదనీ, అది క్రైస్తవ మతమునకు సంబంధించినదనీ, దానిని ఎవరూ చదవకూడదనీ ప్రచారము చేయను మొదలుపెట్టారు. అంతేకాక తాము హిందూ ధర్మరక్షకులమని, కొంత రాజకీయరంగు పూసుకొని, మా జ్ఞాన ప్రచారము నకు అక్కడక్కడ అడ్డుపడడము జరుగుచున్నది. తమ మాట విను ఇతర కులముల వారికి కూడా ప్రబోధానందయోగీశ్వరులు చెప్పు జ్ఞానము హిందూ జ్ఞానము కాదు, క్రైస్తవుల జ్ఞానమని హిందువుల ముసుగులో క్రైస్తవ మత ప్రచారము చేయుచున్నారని చెప్పడమేకాక, అటువంటివారిని ప్రేరేపించి మా ప్రచారమునకు అడ్డు తగులునట్లు చేయుచున్నారు.

యోగీశ్వరులు నెలకొల్పిన **"హిందూ (ఇందూ) జ్ఞాన వేదిక"** ఇటువంటి ఆగడాలను కొంతకాలముగా ఓర్పుతో చూడడము జరిగినది. మాలో ఓర్పు నశించి, మమ్ములను అన్యమత ప్రచారకులుగా వర్ణించి చెప్పు అగ్రకులము వారిని, వారి అనుచరులను మేము ఎదురుతిరిగి ప్రశ్నించడము జరిగినది. మేము ప్రశ్నించిన ఒక్క ప్రశ్నకు కూడా వారు సరియైన సమాధానము ఇవ్వలేదు. ఆ జవాబులు ఎలా ఉన్నాయో పాఠకులుగా మీరు చూడండి.

**మా ప్రశ్న :-** ఇంతవరకూ ఏ హిందువూ చేయని విధముగా ఊరూరు తిరిగి, ఊరిలో ఇల్లిల్లూ తిరిగి హిందూ ధర్మములను ప్రచారము చేయుచున్నాము కదా! అటువంటి మమ్ములను మీరు అన్యమత ప్రచారకులుగా ఎందుకు చెప్పుచున్నారు?

**వారి జవాబు :-** హిందూమతములో ఎందరో స్వామీజీలు ఉన్నారు. వారు ఎవరూ ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేయలేదు. హిందువులు అట్లు ఎవరూ ప్రచారము చేయరు. క్రైస్తవులయితేనే బజారు బజారు, ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేస్తారు. మీరు హిందువుల ముసుగులో ఇల్లిల్లూ తిరిగి క్రైస్తవమును ప్రచారము చేయుచున్నారు.

**మా ప్రశ్న :-** మేము క్రైస్తవులమయితే భగవద్గీతను ఎందుకు ప్రచారము చేస్తాము?

**వారి జవాబు :-** మీరు ప్రచారము చేయునది త్రైత సిద్ధాంత భగవద్గీత. అది క్రైస్తవులది. బైబిలుకే మీరు అలా పేరు పెట్టారు.

**మా ప్రశ్న :-** క్రైస్తవులు తమను క్రైస్తవులుగానే చెప్పుకుంటారు. అలాగే బైబిలును బైబిలుగానే చెప్పుకొంటారు. వారి ప్రచారము క్రైస్తవము, బైబిలు

అయినప్పుడు అదే పేరుమీద ప్రచారము చేస్తారు తప్ప హిందువులుగా భగవద్గీత పేరుతో ఎందుకు ప్రచారము చేస్తారు? ఇంతవరకు అట్లు ఎక్కడా జరుగలేదు. ఏ మతమువారు ఆ మతము పేరు చెప్పుకొంటారు గానీ ఇతర మతముపేరు చెప్పరు. అంతెందుకు మీరు మా భగవద్గీతను తెరచి చూచారా? అందులో భగవద్గీత శ్లోకములున్నాయా? బైబిలు వాక్యము లున్నాయా?

**వారి జవాబు :-** త్రైత సిద్ధాంతమని యున్నది కదా! త్రైతము అంటే త్రిత్వము అని ట్రినిటి అని మాకు బాగా తెలుసు.

**మా ప్రశ్న :-** హిందూ ధర్మములలో అద్వైత సిద్ధాంతమును ఆదిశంకరా చార్యుడు ప్రతిపాదించాడు. విశిష్టాద్వైతమును రామానుజాచార్యులు ప్రతిపాదించాడు, ద్వైతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. ఇప్పుడు **ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించాడు.** సిద్ధాంతకర్తలు, సిద్ధాంతములు వేరయినా అందరూ హిందువులని మీరు ఎందుకు అనుకోలేదు?

**వారి జవాబు :-** మీ త్రైతసిద్ధాంత భగవద్గీతలో యజ్ఞములను చేయకూడదని వ్రాశారు కదా! నిజముగా భగవద్గీతలో అలా లేదు కదా!

**మా ప్రశ్న :-** మీరు హిందువులలో ముఖ్యులుగా వుండి అంత మూర్ఖముగా మాట్లాడితే ఎలా? ప్రపంచమునకంతటికీ ఒకే భగవద్గీతయుంటుంది గానీ, మీ భగవద్గీత, మా భగవద్గీతయని వేరుగా ఉండదు. భగవద్గీతకు వివరము ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా వారికి అర్థమయినట్లు చెప్పియుండవచ్చును గానీ, అందరికీ భగవద్గీత మూల గ్రంథమొక్కటేనని గుర్తుంచుకోండి. త్రైత సిద్ధాంత భగవద్గీత అన్నిటికంటే సరియైన భావముతో యున్నదని చదివిన

జ్ఞానులందరూ పొగడుచూయుంటే, మీ కులములో ఎందరో ప్రశంసించు చూయుంటే, మీకు కొందరికి మాత్రము వ్యతిరేఖముగా కనిపించిందనడము అసూయతోనే అని మాకు అర్థమగుచున్నది. యజ్ఞములు చేయవద్దని మేము ఎక్కడా చెప్పలేదు. యజ్ఞముల వలన పుణ్యము వస్తుంది, స్వర్గము వస్తుంది అని చెప్పాము. యజ్ఞముల వలన మోక్షము రాదు, దేవుడు తెలియడని చెప్పాము. అంతెందుకు మీరు మేము అన్ని కులములకంటే స్వచ్ఛమయిన హిందువులమని చెప్పుకొంటున్నారు కదా! భగవద్గీతలో చెప్పిన ఒక్క హిందూ ధర్మమును చెప్పండి.

**వారి జవాబు :-** అవన్నీ మాటలు వద్దు... మీరు హిందువులు కాదు.

**మా ప్రశ్న :-** మొండిగా మాట్లాడవద్దండి. మీరు అగ్రకులమువారమని ఇష్టమొచ్చినట్లు మాట్లాడకండి. మేము హిందువులము కాము అనుటకు ఆధారము ఏమైనా చూపగలరా? మా కథ అట్లుంచి మీరు సరియైన హిందువులే అయితే **భగవద్గీతలో విశ్వరూప సందర్శనయోగమను అధ్యాయములో 48వ శ్లోకములోనూ, 53వ శ్లోకములోనూ భగవంతుడు ఏమి చెప్పాడో మీరే చెప్పండి.**

**వారి జవాబు :-** మేము ఇంతవరకు భగవద్గీత చదువలేదు. మీకు కావలసి వస్తే సంపూర్ణానందస్వామితో చెప్పిస్తాము.

**మా ప్రశ్న :-** కనీసము భగవద్గీతను కూడా చదువని మీరు యోగీశ్వరులయిన ప్రబోధానందస్వామిని దూషించడము మంచిదా? ఒక్క హిందూ ధర్మమును కూడా తెలియని మీరు హిందూ ధర్మ రక్షకులమని చెప్పడము మంచిదా? యోగీశ్వరుల వారు వ్రాసిన ఒక్క గ్రంథము కూడా చదువకుండా మేము తప్ప పూజ్యులుగా, గురువులుగా ఎవరూ ఉండకూడదను అసూయతో ఇలాగ మాట్లాడితే దేవుడు ఓర్చుకోడని చెప్పుచున్నాము.

**వారి జవాబు :-** హిందూ మతములో ఎందరో దేవుళ్ళున్నారు. శివుడు దేవుడే, శివుని కొడుకు గణపతి దేవుడే, రాముడు దేవుడే, రాముని సేవకుడు ఆంజనేయుడూ దేవుడే. అలాంటి హిందూ మతములో దేవుడు ఒక్కడే అని చెప్పడము మీది తప్పు కాదా?

**మా మాట :-** మేము మతమును గురించి చెప్పలేదు. హిందూ మతములో ఎందరో దేవుళ్ళుండడము నిజమే, అయితే హిందూ జ్ఞానములో, హిందూ ధర్మము ప్రకారము విశ్వమునకంతటికీ ఒకే దేవుడని చెప్పాము. భగవద్గీతలో దేవుడు చెప్పినదే చెప్పాము తప్ప మేము దేవతలను గురించి లేరని చెప్పలేదే! దేవతలకందరికీ అధిపతియైన దేవుడు ఒక్కడున్నాడని, ఆయనే దేవదేవుడనీ, అతనిని ఆరాధించమని చెప్పాము.

**వారి జవాబు :-** మీరు రాముని పేరు చెప్పరు, శివుని పేరు చెప్పరు, వినాయకుని పేరు చెప్పరు. ఎవరి పేరూ చెప్పకుండా దేవుడు అనీ, సృష్టికర్తయనీ అనేకమార్లు పేర్కొన్నారు. దేవుడు అను పదమునుగానీ, సృష్టికర్తయను పదమునుగానీ క్రైస్తవులే వాడుతారు. హిందువులు వాడరు. అందువలన మిమ్ములను హిందువులు కాదు క్రైస్తవులు అంటున్నాము.

**మా ప్రశ్న :-** క్రైస్తవ మతము పుట్టి రెండువేల సంవత్సరములయినది. సృష్టిపుట్టి ఎన్ని కోట్ల సంవత్సరములయినదో ఎవరూ చెప్పలేరు. సృష్ట్యాది నుండి "సృష్టికర్త" అను పదమును "దేవుడు" అను పదమును హిందూ సమాజము వాడుతూనే యున్నది. మొదటినుండి హిందూసమాజములో యున్న "దేవుడు, సృష్టికర్త" అను పేర్లను హిందువులు క్రైస్తవులకేమయినా లీజుకిచ్చారా? లేక పూర్తిగా వారికే అమ్మేశారా? అని అడుగుచున్నాము. సృష్టికర్త అనిగానీ, దేవుడు అనిగానీ హిందువులయినవారు అనకూడదని ఎక్కడయినా ఉన్నదా అని అడుగుచున్నాము?

**వారి జవాబు :-** మీరు హిందూమతమును కాకుండా అన్యమతమును బోధించుచున్నారనుటకు, మిమ్ములను మీరు హిందువులుగా చెప్పుకో లేదు. హిందువులుగా కాకుండా ఇందువులుగా చెప్పుకొంటున్నారు. అటువంటప్పుడు మీరు హిందూమతమును చీల్చినట్లు కాదా! ప్రత్యేకించి ఇందూ మతము అను దానిని ప్రచారము చేసినట్లు కాదా! మీరు హిందువులే అయినప్పుడు మీ గ్రంథములలోగానీ, మీ బోధలలో గానీ ప్రత్యేకించి ఇందువులు అని ఎందుకు చెప్పుచున్నారు?

**మా మాట :-** మేము సూటిగా ఒక ప్రశ్నను అడుగుతాము జవాబు చెప్పండి. హిందువు, ఇందువు అను పదములో కొద్దిపాటి శబ్ధము తప్ప ఏమి తేడాయుందో మీరే చెప్పండి. తెలుగుభాషను వ్రాసే వారందరూ హిరణ్యకశ్యపున్ని చంపినది నరశింహస్వామి అని చెప్పుచుందురు అలాగే వ్రాయుచుందురు. ప్రస్తుతకాలములో 'నరశింహులు' అని పేరున్నవాడు కూడా వాని పేరును నరశింహులు అని వ్రాయడము అందరికీ తెలుసు. అయితే ఆ మాట తప్పు అలా వ్రాయకూడదు దానిని **నరసింహ** అని వ్రాయవలెను అని చెప్పుచున్నాము. అడవిలో మృగరాజును **సింహము** అని అంటాము తప్ప **శింహము** అని అనము అనికూడా చెప్పుచున్నాము. 'సింహము' అంటే అర్థమున్నది గానీ, 'శింహము' అంటే అర్థము లేదు అని కూడా చెప్పాము. అలా ఉన్నది ఉన్నట్లు చెప్పితే 'ఇందువు' అనే దానికి అర్థమున్నదిగానీ 'హిందువు' అనే దానికి అర్థములేదు అని చెప్పాము. సృష్ట్యాదిలో పుట్టినది ఇందూ సమాజమనీ, అది మధ్యలో పేరుమారి దృష్ఠి జిష్ఠి అయినట్లు ఇందూ అను శబ్ధము హిందూ అని పలుకబడుచున్నదని చెప్పాము. ఇందూ పదము ఎందుకు వాడాలి హిందూ పదమును ఎందుకు వాడకూడదని కూడా వివరముగా మా గ్రంథములలో గలదు. ఉన్న సత్యము

మీకు తెలిసినా మీరు మాకంటే పెద్ద ఎవరూ ఉండకూడదను అసూయతో మాట్లాడుచున్నారు.

అగ్రకులములో ఎందరో పెద్దలు మా జ్ఞానమును తెలిసి సంతోషించుచుండగా, కొందరు మాత్రము వీధి రౌడీలలాగా తంతాము, పొడుస్తాము, కాలుస్తాము మీరు ప్రచారము చేయవద్దండని చెప్పడము మంచిది కాదు. మా గ్రంథములు ఏవీ చదువకుండా మాట్లాడడమూ, మేము చెప్పిన మాటలను వినకుండా ఇవన్నీ డ్రామాలు, నాటకాలు అనడము మంచిది కాదు. మీరు ఎవరైనా మా గ్రంథములలో ఇతర మతములను ప్రచారము చేసినట్లుగానీ, ఫలానా మతములోనికి చేరమని చెప్పినట్లుగానీ ఉంటే నిరూపణ చేయండి, అలా నిరూపించినవారికి ఇందూ జ్ఞానవేదిక తరపున పది లక్షల రూపాయలను ఇవ్వగలము. నిరూపించ లేకపోతే మీరు లక్ష రూపాయలు ఏ ఊరిలో శ్రీకృష్ణుని గుడికయినా ఇవ్వవలెను. ఈ షరతుకు ఎవరైనా ముందుకు వస్తారా? అని అడుగు చున్నాము.

ఇట్లు

**ఇందూ జ్ఞానవేదిక**







# చరిత్రలో జరిగిన అన్యాయము

# హిందువులలో జరుగుచున్న యదార్థము

నాలుగువందల సంవత్సరముల క్రిందట ఆధ్యాత్మిక రంగములో మెరిసిన వజ్రము **వేమనయోగి**. ఆధ్యాత్మికమను పాలను చిలికి దైవజ్ఞానము అనే వెన్నను తీసి ఇచ్చినవాడు వేమన. వేమన తన పద్యములలో చెప్పిన ఒక్కొక్క జ్ఞాన విషయము విపులముగా వ్రాసుకొంటే ఒక్కొక్క గ్రంథము కాగలదు. వేమన స్వచ్ఛమైన తెలుగు భాషలో పద్యమును వ్రాసి చెప్పాడు. సంస్కృతము జోలికి పోలేదు. ఒక ప్రక్క పద్యములు వ్రాసి కవిగా కనిపించినా, ఒక ప్రక్క అంతు తెలియని ఆధ్యాత్మికవేత్త వేమనయోగి. అయితే ఆయన పుట్టినది రెడ్డి కులమున. చరిత్రలో మాకంటే ఎవరూ పెద్దగా ప్రశంసింపబడకూడదని గర్వములోయున్న అగ్రకులములోని కొందరు పనిగట్టుకొని వేమనయోగిని పిచ్చివానిగా జమకట్టి, అతను చెప్పింది జ్ఞానమేకాదని ప్రజలలో ప్రచారము చేశారు. పిచ్చివాని మాటలు పిచ్చివారే వింటారు అని హేళనగా మాట్లాడడము జరిగినది. అనేక కులములుగా యున్న హిందువులకు జ్ఞాన విషయములో పరిచయము లేనిదానివలన, అగ్రకులము వారు వేమన చెప్పినది జ్ఞానమే కాదనడము వలన, వేమన తన జ్ఞానమునకు తగినట్లుగా ప్రకాశింప లేకపోయాడు. తాము అగ్రకులము వారమనీ, మిగతా వారందరూ తగ్గు కులము వారనీ విభజించి, తాము చెప్పినట్లు వినవలెననీ, అట్లు వింటేనే మిగతా కులముల వారందరూ సుఖముగా బ్రతుకగలరనీ, అగ్రకులమువారు ప్రచారము చేసుకొన్నారు. అలా తమను తాము గొప్పగా ప్రకటించుకోవడమేకాక హిందువుల ఇళ్ళలో

జరుగు ప్రతి మంచి పనికీ, చెడు పనికీ, చావుకూ పుట్టుకకూ, పెళ్ళికీ పేరంటానికీ ప్రతి కార్యమునకూ తాము చెప్పునట్లు చేయాలనీ, తాము నిర్ణయించు కాలములోనే చేయాలనీ, అట్లు చేయకపోతే నష్టము, కష్టము కలుగుతుందని భయపెట్టడము వలన, భయముతో జ్ఞానము తెలియని మిగతా కులముల వారందరూ వారు చెప్పిన దానిని నమ్మడము జరిగినది. ఈ విధముగా హిందూమతములో అగ్రకులము వారు భయము అను బ్లాక్‌మెయిల్ చేసి, తగ్గు కులము వారందరినీ తమమాట వినునట్లు చేసుకొన్నారు. ఆనాటినుండి హిందూ సమాజమును మోసము చేస్తూ ఎవరికీ హిందూ జ్ఞానమును తెలియకుండా చేసి, తాము హిందూ సమాజమును అనేక పేర్లతో దోచుకొంటూ బ్రతకడమేకాక, మిగతా కులములలో ఎవరు జ్ఞానులుగా పుట్టినా, వారిని హేళన చేయడమూ, అజ్ఞానిగా వర్ణించడమూ జరిగినది.

చరిత్రలో నాలుగు వందల సంవత్సరముల క్రితము వచ్చిన వేమనను పిచ్చివానిగా వర్ణించి, శాస్త్రము తెలియనివాడని వర్ణించారు. తర్వాత మూడు వందలయాభై సంవత్సరముల క్రిందట వచ్చిన పోతులూరు వీరబ్రహ్మముగారు గొప్ప జ్ఞానిగా తయారై, భవిష్యత్తు కాలములో జరుగు సంఘటనలను ముందే తెలియజేసి గొప్ప కాలజ్ఞానమునే వ్రాశాడు. ఆయన వ్రాసిన భవిష్యత్తు కాలక్రమమున నేటికినీ జరుగుచూనేయున్నది. అంతటి గొప్ప జ్ఞాని అయిన వీరబ్రహ్మముగారు అగ్రకులమువాడు కాకపోవుట వలన, విశ్వకర్మ (ఆచారుల) కులమున పుట్టుట వలన, అగ్రకులము వారు బ్రహ్మము గారు బ్రతికియున్న కాలములోనే, తమ ఊరిలోనికి రాకుండా, ఆయన జ్ఞానమును ప్రచారము చేయకుండా అడ్డుకొన్నారు. ఆ రోజు ఇతరులు జ్ఞానులు కాకూడదను 'అసూయ' అను గుణముతోనూ, మేమే తెలిసిన

వారమను గర్వముతోనూ ఆ పని చేశారు. హిందూ సమాజములో ఇటువంటి వారుండుట వలన విసిగిపోయిన హిందువులు హిందూ మతమును వీడి ఇతర మతములోనికి పోవుచున్నారు. ఇందూమతములో దేవునికి గుడికి అంటరాని వారిగా ఉండలేని వారందరూ కొందరు జ్ఞానము కొరకు, కొందరు కులవివక్ష లేని స్వతంత్రము కొరకు మతమును మారజొచ్చారు. ఈ విధముగా హిందూమతములోనివారు ఇతర మతములోనికి పోవుటకు మొదటి కారకులు హిందూమతములోని అగ్రకులములవారేనని అనుమానము లేకుండా చెప్పవచ్చును.

తమ వలననే హిందువులు ఇతర మతములలోనికి పోవుచున్నారని అగ్రకులమువారికి కూడా తెలుసు. అయితే తమ తప్పును ఎవరూ గుర్తించనట్లు తాము హిందూమతమును ఉద్ధరించువారిగా, హిందూధర్మ రక్షకులుగా వర్ణించుకొని హిందూ ధర్మ భక్షకులుగా నేటికినీ సమాజములో కొనసాగుచున్నారు. వారిని హిందూ ధర్మ భక్షకులు, హిందూ ధర్మ నాశకులు అని చెప్పుటకు అనేక ఆధారములు గలవు. అటువంటి వాటిని పరిశీలించితే, హిందువులలోని మిగతా కులమువారివద్ద భగవద్గీతను బోధించు కృష్ణుడు అర్జునుడు యున్న చిత్రపటము (ఫోటో) యుంటే దానిని ఇంటిలో ఉంచుకోకూడదనీ, ఆ పటము ఇంటిలో ఉంటే ఇంటిలో కూడా యుద్ధాలు వస్తాయనీ, అనేక కష్టాలు వచ్చి పాండవులు అరణ్యవాసము పోయినట్లు బాధపడవలసివస్తుందనీ అగ్రకులమువారు నేటికినీ చెప్పుచునే యున్నారు. అటువంటి భగవద్గీత ఫోటోలను గుడులలో ఉంచవలెననీ లేకపోతే ఏటిలోని నదీ ప్రవాహములో పారవేయాలనీ చెప్పడము, చేయించడము కూడా జరిగినది. అంతేకాక భగవద్గీతను ఇంటిలో ఉంచు కోకూడదని భగవద్గీతను ఎవరూ చదువకూడదనీ, చదివితే కష్టాలు

వస్తాయనీ, భగవద్గీతను ఎవరి ఇంటిలోనూ లేకుండునట్లు చేయుచున్నారు. భగవద్గీత అర్జునునికి యుద్ధరంగములో యుద్ధము చేయుటకు చెప్పినది, అందువలన చదువకూడదు, చదివితే చదివినవారు కూడా అనేక తగాదాల లోనూ, కోర్టు వ్యవహారములలోనూ చిక్కుకోవలసి వస్తుందని చెప్పడము జరుగుచున్నది. ఇంకనూ హిందువులకు వేదములు ముఖ్యమైనవనీ వాటిని అన్ని కులముల వారు చదువకూడదనీ, వేదములను తామే చదువవలెననీ చెప్పడము కూడా జరుగుచున్నది. ఈ విధముగా భగవద్గీతకు వ్యతిరేఖముగా మాట్లాడువారు హిందూ సమాజమునకు చీడపురుగులుకాక ఏమవుతారో మీరే ఆలోచించండి?

ఇదంతయూ గతములో జరిగిన విషయములు, అవి చాలక ప్రస్తుత కాలములో వీరి ఓర్వలేనితనము, మేమేపెద్ద అను గర్వము ఎలాగుందో చూడండి. వేమనయోగిని, పోతులూరి వీరబ్రహ్మముగారిని అగ్రకులము వారు ఎంత హేళన చేసినా వేమనయోగిని రెడ్డి కులస్థులు వేమారెడ్లుగా గుర్రముల నెక్కి ప్రచారము చేయుట వలన, వీరబ్రహ్మముగారిని విశ్వకర్మ (ఆచారి) కులమువారు కాలజ్ఞానమును ప్రచారము చేయుట వలన, వేమన సంఘములు, విశ్వకర్మ సంఘములు తయారై వేమనను, బ్రహ్మముగారిని ప్రచారము చేయుట వలన, కొంతమంది ప్రజలకు వేమనయోగి పద్యములు, వీరబ్రహ్మము గారి కాలజ్ఞానము కొంతవరకు తెలియును. వేమనయోగి ఆ కాలములోనే తన పద్యములలో అగ్రకులమువారు చేయు తప్పులను ఎండగట్టడము జరిగినది. వీరబ్రహ్మముగారి చరిత్రలో కూడా బ్రహ్మము గారికి అగ్రకులమువారు చేసిన ఆటంకములను వ్రాయడము జరిగినది.

వీరబ్రహ్మముగారు తన కాలజ్ఞానములో **"ప్రబోధాశ్రమము ఉన్నతమైన జ్ఞానముకలది"** అని మూడువందల యాభై సంవత్సరములప్పుడే

వ్రాసియుంచాడు. కాలజ్ఞానములో ప్రబోధాశ్రమము యొక్క పేరుండడము ఈ మధ్యన ఐదు సంవత్సరముల క్రితము మాకు తెలిసినది. తర్వాత బ్రహ్మము గారు వ్రాసిన కాలజ్ఞానములో ప్రబోధాశ్రమమునకు, ప్రబోధానంద యోగీశ్వరులకు సంబంధించిన చాలా విషయములు వ్రాసినట్లు తెలిసినది. ఎంతో గొప్ప జ్ఞాని, కాలజ్ఞాని అయిన పోతులూరి వీరబ్రహ్మముగారు ప్రబోధా శ్రమాధిపతియైన ప్రబోధానందయోగీశ్వరులవారిని గొప్పగా చెప్పుచూ **"ప్రబోధాశ్రమమువారు శయనాధిపతి గుణములు కల్గియున్నారు. శయనాధిపతియే ఆనందగురువు. ఆనంద గురువే నాకు గురువు, మీకూ గురువు"** అని వ్రాయడము జరిగినది. ప్రబోధానందయోగీశ్వరుల జ్ఞానమేమిటో ఎంత శక్తివంతమైనదో జ్ఞాన జిజ్ఞాసులకు కూడా తెలియుచున్నది. ఎందరో జ్ఞానులయినవారు యోగీశ్వరులు చెప్పుచున్న జ్ఞానము ఎంతో గొప్పదని ప్రశంసించుచున్నారు. బ్రహ్మముగారే స్వయముగా తన గురువుగా చెప్పుకొన్న వ్యక్తి ఎంతటి వాడయివుంటాడో మనము కూడా ఆలోచించ వలసియున్నది. అయినా ప్రబోధానందయోగీశ్వరుల వారు ఒక్క దైవజ్ఞానములో తప్ప మిగతా అన్నిటిలో సాధారణ వ్యక్తిగానే కనిపిస్తాడు. ఎదురుగా చూస్తే ఇతనికి జ్ఞానము తెలియునా! అన్నట్లు కనిపించినా, అవును ఆయన ఎవరికీ తెలియని గొప్పవాడే అన్నట్లు ఆయన వ్రాసిన గ్రంథములే గొప్ప శక్తులుగా నిరూపించుకొన్నాయి. ఒక గ్రంథము దగ్గరకు వస్తూనే కొందరిలో మార్పు కనిపించడమూ, కొందరు గ్రంథమును చదివిన వెంటనే అంతవరకూ నయముగాని రోగములు పోవడము జరుగుచున్నది.

పైకి కనిపించని శక్తి యోగీశ్వరులలో నిక్షిప్తమైయుండుట బయటికి కనిపించకపోయినా ఆయన చెంతకు పోయినవారికి దేహములో నయము

కాని, మందులులేని ఎయిడ్స్, క్యాన్సర్, డెంగీజ్వరములు సహితము శాంతించి పోవడము జరుగుచుండుట వలన యోగీశ్వరులు ఎంతటివారో ఎవరికయినా సులభముగా అర్థమయిపోగలదు.

వీరబ్రహ్మముగారు తన కాలజ్ఞానములో ఆనంద యోగిని దూషించినవారు చాలా ఇబ్బందుల పాలవుతారని వ్రాయడము జరిగినది. అలాగే ఆయననుగానీ, ఆయన గ్రంథములనుగానీ దూషించినవారు ఇంతవరకు ఎవరూ సురక్షితముగా లేరు. తెలియని రోగములతో, అర్థముకాని బాధలతో కొందరుండగా, కొందరు చిత్రహింసలపాలై చనిపోవడము జరిగినది. అలా ఎందుకు జరుగుచున్నదో తెలియనివారు, పాపమును మూటగట్టుకొనుటకు యోగీశ్వరులవారి జ్ఞానమునకు అక్కడక్కడ ఆటంకములను కలుగజేయుచున్నారు. హిందూమతములో ఆది శంకరాచార్యులు అద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించాడు. తర్వాత కొంతకాలమునకు విశిష్టాద్వైత సిద్ధాంతమును రామానుజాచార్యులు ప్రతిపాదించాడు. మరికొంత కాలమునకు ద్వైత సిద్ధాంతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. వీరు ముగ్గురూ అగ్రకులమువారు కావడము విశేషము. గత ముప్పైఆరు సంవత్సరముల నుండి త్రైత సిద్ధాంతమును ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారు, ప్రకటించి ఆ సిద్ధాంతమునే ప్రచారము చేయుచూ, త్రైత సిద్ధాంతము ప్రకారము భగవద్గీతను వివరించి వ్రాయడము జరిగినది. హిందూమతములోని సిద్ధాంతముల వివరము తెలియని ప్రజలకు, అగ్రకులమువారు **"త్రైతము అంటే క్రైస్తవులకు సంబంధించినదనీ, త్రైత సిద్ధాంత భగవద్గీతయని పైకి చెప్పుచూ లోలోపల క్రైస్తవ మతమును బోధించుచున్నారని"** యోగీశ్వరులకు, యోగీశ్వరుల జ్ఞానమునకు వ్యతిరేఖముగా చెప్పడము జరిగినది. హిందుత్వమును ఒక

వైపు సర్వనాశనము చేయుచున్న అగ్రకులములవారు, హిందూమతమును కాపాడువారివలె నటించుచూ యోగీశ్వరుల జ్ఞానమునకు కొన్నిచోట్ల ఆటంకము కల్గించడము జరిగినది. మూడుచోట్ల అన్యమతప్రచారమని భగవద్గీతను, ప్రచారము చేయు యోగీశ్వరుల శిష్యుల మీద కేసులు పెట్టడడము కూడా జరిగినది. కొన్నిచోట్ల ప్రత్యక్ష దాడులకు దిగడము జరిగినది. అయినా ప్రబోధానంద శిష్యులు అన్నిటికీ ఓర్పు వహించి జ్ఞానప్రచారము చేయుచున్నారు. ఈ మధ్యకాలములో నల్గొండ జిల్లా భువనగిరిలో దేవేంద్ర అను మా సంఘ సభ్యునిమీద అన్యమత ప్రచారము చేయుచున్నాడని ఆరోపించి కేసు పెట్టడము జరిగినది. అంతేకాకుండా మా ప్రచార వాహనము భువనగిరిలోనికి పోయినప్పుడు మా ఊరిలో ప్రచారము చేయవద్దని అడ్డుపడి పంపించడము జరిగినది. కరీంనగర్‌లో గోడమీద "త్రైత సిద్ధాంత భగవద్గీతను చదవండి" అని వ్రాస్తే, అగ్రకులము వారువచ్చి ఇది క్రైస్తవ మతప్రచారము దానిని తుడిపివేయమని చెప్పడము జరిగినది. రెండు రోజుల క్రిందట ఆర్లగడ్డలో ప్రచార వాహనముండగా అక్కడికి ఒక అగ్రకులస్థుడు వచ్చి ఇది క్రైస్తవ ప్రచారము, ఈ ప్రచారమును నిలిపివేయండని ఘర్షణపడగా ఆ సమయానికి మా గ్రంథములు చదివిన వారు అక్కడుండుట వలన వారే అగ్రకులమువారికి బుద్ధిచెప్పి పంపడము జరిగినది. అక్కడున్న ప్రజలు అనిన మాటలు "ఇది ఎంతో గొప్ప జ్ఞానము. ఇంతకాలానికి గొప్ప జ్ఞానము దొరికిందని మేము సంతోషపడుచుంటే, సమాజాన్ని సర్వనాశనము చేసిన మీరు దీనిని జ్ఞానము కాదంటారా? ఇట్లే మాట్లాడితే ఊరిలో లేకుండా మిమ్ములను మేమే పంపుతాము" అని అనడము జరిగినది. ఈ విధముగా ప్రజలే తిరగబడి బుద్ధిచెప్పు సమయము అన్నిచోట్లా వస్తుంది.

గౌతమబుద్ధుడు జ్ఞానము చెప్పితే అతను అగ్రకులము వాడు కాదని, ఆయనది వేరు మతమని ప్రచారము చేశారు. ఆ దినము గౌతముడు హిందువే కదా! తమ ఆధిపత్యము కొరకు హిందూమతమునుండి బుద్ధున్ని చీల్చి అతనిది బౌద్ధమతమని చెప్పి హిందూమతమునుండి వేరు చేశారు. ఈ దినము బౌద్ధమతము విదేశాలలో వ్యాపించియున్నా స్వదేశములో లేకుండా చేసినది అగ్రకులము వారు కాదా! ఈ దినము బుద్ధుడు మావాడే బౌద్ధము హిందూమతమే అని చెప్పుకోలేని పరిస్థితి మనకు ఏర్పడినది. అలాగే ప్రబోధానంద యోగీశ్వరులు చెప్పు త్రైత సిద్ధాంతమును హిందూ మతములోని భాగము కాదనడమూ, త్రైత సిద్ధాంత భగవద్గీతను భగవద్గీతే కాదనడమును ఒకవైపు ప్రజలు గమనిస్తున్నారు. ప్రబోధానంద యోగీశ్వరులు గత 36 సంవత్సరములుగా బోధించుచున్న బోధ హిందుత్వములోనే ఎంతో గొప్పదని అన్ని మతములవారు ఒప్పుకొనుచుండగా, తగ్గుకులము వారని అగ్రకులముచే అనబడినవారందరూ హిందూ (ఇందూ) జ్ఞానమును తెలుసుకొని చైతన్యవంతులై అగ్రకులము వారికి తిరగబడి జ్ఞానము చెప్పు స్థితికి ఎదిగారు. తగ్గుకులము వారిమీద ఆధారపడి బ్రతుకుచున్న అగ్రకులమువారిని తగ్గుకులము వారందరూ ఒక్కమారు వెలివేస్తే, మీతో మాకు సంబంధము వద్దు అంటే ఏమవుతుందో చెప్పనవసరము లేదు. అటువంటి స్థితి రాకుండుటకు మా జ్ఞానమునకు అడ్డురావద్దని అగ్రకులము వారికి మరీమరీ చెప్పుచున్నాము.

ఇట్లు

# ప్రబోధ సేవాసమితి

**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

# జ్ఞాన పరీక్ష

**శ్రీకృష్ణమందిరము, చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా), ఎ.పి.**

తేదీ : 04-04-2015

సహజముగా ప్రతి మనిషీ తనను తాను గొప్పగా తలచుకొనుచుండును. ప్రపంచ జ్ఞాన విషయములోగానీ, పరమాత్మ జ్ఞాన విషయములో గానీ ఇతరులకంటే తాను తెలిసినవాడినని అనుకొనుచుండును. జ్ఞానము ధనములాంటిది. అందువలన పెద్దలు జ్ఞానధనము అని జ్ఞానమును ధనముతో సమానముగా పోల్చారు. ప్రపంచ ధనము ఎంతయున్నా తనవద్ద ధనమున్నదని చెప్పుకోని మనిషి, జ్ఞానధనము ఏమాత్రము లేకున్నా తనయొద్ద అందరికంటే ఎక్కువున్నదని చెప్పుకొనుచుండును. ప్రపంచ ధనమును ఉన్నా లేదని చెప్పు మనిషి, జ్ఞానధనమును లేకున్నా ఉన్నదని చెప్పుకోవడము జరుగుచున్న విషయమే. కొందరు దేవుడు చెప్పిన జ్ఞానమును మార్చివేసి, తమ సొంత భావములను దేవుని భావములుగా చెప్పుచూ, సమాజములో గొప్ప జ్ఞానులుగా చలామణి అగుచుందురు. వాస్తవానికి వారివద్ద యున్నది ఏమాత్రము జ్ఞానము కాకున్నా, తమది జ్ఞానమేయని ఇతరులను నమ్మించి మోసము చేయుచుందురు. దైవ జ్ఞానమును కబ్జా చేసినవారు భూమిమీద అన్ని సమాజములలో ఉన్నారు. జ్ఞానమును కబ్జా చేసినవారు ఎవరూ గుర్తుపట్టని పెద్ద మోసగాళ్ళుగా యున్నారు. అయితే కొందరు ఒకరివద్దయున్న జ్ఞానమును హైజాక్ చేసి, ఇతరులు చెప్పు జ్ఞానము తమ జ్ఞానమే అని ప్రచారము చేసుకొని, బయట సమాజములో పెద్ద జ్ఞానులుగా చలామణి అగుచున్నారు. వాస్తవానికి వారివద్ద జ్ఞానము లేకున్నా, తాము కూడా గురువులుగా చలామణి కావలెనను ఉద్దేశ్యముతో, గురువు జ్ఞానమునే హైజాక్ చేసి గురువుకంటే తమనే పెద్దగా ప్రచారము చేసుకొనుచుందురు.

మనుషులకొరకు దేవుడు జ్ఞానమును గ్రంథరూపములో చెప్పితే దానిని కబ్జా చేసి, దేవుని గ్రంథముకంటే తమనే గొప్పగా ప్రటించుకొన్న సమాజ పెద్దలు కొందరుండగా, కొన్నిచోట్ల జ్ఞానమును చెప్పువారివద్ద చేరిన కొందరు, గురువుగారి జ్ఞానమును హైజాక్ చేసి తమను గురువుకంటే పెద్దగా ప్రకటించుకొన్నవారు కూడా కలరు. ఈ విధముగా ఎవరికి వారు మేము పెద్ద జ్ఞానులము అను ఉద్దేశ్యములో ఉన్నారని తెలిసిన దేవుడు వారి నిజస్వరూపము వారికే అర్థమగులాగున, వారికి జ్ఞానములో ఎంత హోదావున్నదో తెలియునట్లు అక్కడక్కడ పరీక్షకు గురిచేసి ఎవనిది వానికి అర్థమగునట్లు చేయుచుండును. దేవుడు మనిషిని సమస్యల రూపములో పరీక్షించుచుండును. **దేవుని జ్ఞానమును దేవుడు సమస్యల రూపములో పరీక్షించి ఎవరి స్థోమత ఎంతయుందో వారికే అర్థమగునట్లు చేయు చుండును.** అది దేవుని పనికాగా ఒక మనిషిగా మేము ప్రశ్నల రూపములో ప్రశ్నించి అందులో మీరు వ్రాసిన జవాబులనుబట్టి మీకు జ్ఞానము ఎంత యున్నదో తెలియునట్లు చేయుచున్నాము. ఇక్కడ ప్రశ్నించువారము మేమే అగుటవలన వాటికి సరియైన జవాబును చెప్పవలసిన బాధ్యత కూడా మాకున్నది. అందువలన ఇక్కడ జ్ఞానపరీక్షలో ప్రశ్నించిన మేము ఆ ప్రశ్నలకు జవాబులను కూడా పొందుపరచి వ్రాయుచున్నాము. జవాబులు చెప్పవలసినది మేమని మా ఇష్టము వచ్చిన జవాబును మేము చెప్పలేదు. ప్రశ్నకు సరియైన జవాబుగా ఉండునట్లు, బ్రహ్మవిద్యాశాస్త్రమునకు లోబడి యుండునట్లు, దైవజ్ఞానమునకు ఎక్కడా వ్యతిరేఖము లేనట్లు జవాబులు వ్రాయడము జరిగినది. ఈ జ్ఞానపరీక్ష 04-04-2015లో జరిగినది. కావున అందరికీ వెంటనే తెలియునట్లు ఇప్పుడు రెండవ ముద్రణ జరుగుచున్న **"సత్యాన్వేషి కథ"** గ్రంథములోనికి జవాబులను చేర్చాము.

